# THE
# TELUGU ENCYCLOPÆDIA

---

## A DICTIONARY OF
*Arts, Sciences, Literature, History and General Information.*

---

EDITOR-IN-CHIEF
**K. V. LAKSHMANA RAO, M. A.**

---

## VOLUME 3.

---

**Atak—Abul**

PUBLISHED BY
THE TELUGU ENCYCLOPÆDIA OFFICE,
*No. 7, Thumbu Chetty Street, Madras.*

1925.

‘నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే’

# ఆంధ్రవిజ్ఞానసర్వస్వము

ముఖ్యసంపాదకుఁడు

**కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ.**

## సంపుటము ౩

అటక—అబుల్



ప్రకాశకులు

ఆంధ్రవిజ్ఞానసర్వస్వకార్యాలయము

7, చెంబుశెట్టి వీధి, మదరాసు

౧౯[illegible]

**అబుల్ ఫజల్ (షేక్).** అక్బరు చక్రవర్తికిఁ బ్రాణస్నేహితుఁడు, మంత్రి, చరిత్ర లేఖకుఁడు. ఇతఁడు 'షేక్ముబారిక్' అను సంఘసంస్కర్తయొక్క కుమారుఁడు. ఈతఁడు ౧౫౫౧-వ సంవత్సరము, జనవరి ౧౪-వ తారీఖున, ఆగ్రాపట్టణమందు జన్మించెను. అప్పుడు 'ఇస్లాంషా' రాజ్యము చేయుచుండెను. అబుల్ఫైజీ అనుకవి యీతని అన్న. ముబారిక్ మహమ్మదీయమతమునందుపిచ్చినమ్మకము గలవాఁడుకాఁడు. అందుచే నితర మహమ్మదీయులవలన నాతనికి అపాయము కల్గునట్లుండినందున నాతఁడు తన పుత్రులను ఆగ్రాలోనే విడిచి పాఱిపోయెను. అన్నదమ్ములయిన అబుల్ఫైజీ, ఫజల్ ఇద్దఱును తండ్రి మతానుసారముగనే పారసీక అరబ్బీభాషల నభ్యసించిరి. పదునైదు సంవత్సరములు వచ్చువఱకే యీతఁడన్నివిద్యలనోసాధించి గొప్ప పండితుఁ డనిపించుకొనెను. ఆతనిగుఱించి యాకాలమునందొక కథ కలదు. 'ఇస్ఫహాని' అనునొక పూర్వకవిచే రచింపఁబడిన గ్రంథమాతనికి దొరకెనఁట! అందలి పుటలన్నియు సగముచినిఁగియుండెను. ఆతఁడాసగభాగమును దనప్రజ్ఞచేఁ బూరించెను. తరువాత సంపూర్తిప్రతియొకటి దొరకెను. దీనికి దానికి శబ్దభేదము కొంతయున్నను మొత్తము మీఁదగ్రంథములోనిభావముపోకుండ అబుల్ ఫజల్ దానిని పూరించెనని స్పష్టపడెను!

ఈతఁడు మొదట నేకాంతవాసమునందుండి కొందఱు శిష్యులకుఁ దన విద్యనేర్పుచుండెను. కాని ౧౫౭౦ లో నీతనికి ఈతని అన్నవలన అక్బరు చక్రవర్తితో స్నేహముగలిగి దినదినాభివృద్ధి చెందెను. అప్పటివఱకే యాతఁడు మహమ్మదీయమత గ్రంథమైన 'కురాన్' మీఁద వ్యాఖ్య వ్రాసియుండెను. ఈతఁడితర మహమ్మదీయులవలెఁగాక అన్ని మతముల యందును సమభావము గలవాఁడు. అన్ని మతములందును సత్యమున్నదనియు, ఒకమతముకంటె నింకొకమత మెక్కుడని చెప్పుటకు వీలులేదనియు, నీతని యభిప్రాయము. ఆతఁడేకేశ్వరమతవాది; ఆకాలమందలి 'రామమోహన్ రాయ్' అనియే చెప్పవలెను. ఇతఁడు తన యభిప్రాయముల నన్నింటిని అక్బరునకు నేర్పి యాతనిని తన ప్రజలలో నన్ని మతముల వారిని సమత్వముగాఁ జూచునట్లు చేసెను. అక్బరు అన్ని మతముల వారిని బిలిపించి మతసభలను జరిపెనని మన మెఱుఁగుదుము. ఆసభల కీతఁడే కారకుఁడు. అందుచే నీతనిని మతావేశులగు మహమ్మదీయులు హిందువనియు నాస్తికుఁడనియు నిందించిరి. ౧౫౯౨ లో ఈతనికి రెండువేల మన్సబ్ దారీ యియ్యఁబడెను. ఈతఁడెల్లప్పుడును అక్బరుతోఁగూడఁ దిరుగుచుండెను. ఈతని తండ్రియైన షేక్ముబారిక్ ౧౫౯౩ లోను, అన్నయైన ఫైజీ ౧౫౯౫ లోను కీర్తిశేషులయిరి. ౧౫౯౯ లో నీతఁడు సైన్యాధిపతిగ దక్షిణమున కంపఁబడెను. అచ్చట రాజపుత్రుఁడైన మురాద్, సైన్యాధిపతియైన ఖాన్

ఖానాన్ ఉండిరి. వారి యజాగ్రతవలనఁ గలిగిన లోపముల నన్నింటిని సవరించి గోదావరి నది యొడ్డున శిబిరమునిలిపి నాసికతప్ప మిగిలిన పట్టణములన్నియు సాధించి తనబంధువైన ఖాన్ దేశపురాజగు బాహదూర్ ఖాన్ పంపిన లంచములను ద్రిప్పిగొట్టి చాంద్ బీబీతో ననుకూలమైన సంధిచేసికొని యగ్బరును ఖాన్ గామువద్దఁ గలసికొనెను. అంత నక్బరాతని నాలుగువేల మన్ సబ్ దారు గావించెను. అసీరుగడము యుద్ధములోను నీతఁడు తనపౌరుషముఁ జూపెను (౧౬౦౨). దక్షిణదేశము నందలి వ్యవహారములను జక్కఁబెట్టుటకై చక్రవర్తి ఫజల్ ను మరలఁబంపెను. ఆతఁడచ్చట మిక్కిలి పౌరుషముఁజూపి జాల్నాపురమును స్వాధీనపఱచుకొని 'మన్నా' యను వానిని బాఱఁదోలెను. ఆతఁడు తిరిగి ఢిల్లీకి వచ్చుచుండఁగా రాజపుత్త్రుఁడయిన సలీము (తరువాత జహాంగీరుచక్రవర్తి) ప్రేరణ వలన బుందేలు ఖండములోని 'అర్చా' రాజయిన బర్ సింగుదేవుఁడు మోసముచే నీతనిఁ ద్రోవలోఁ జంపెను (౧౨ ఆగస్టు ౧౬౦౨). ఆతనితల అలహాబాదులోనున్న రాజపుత్త్రునికిం బంపెను. ఈసమాచారము తెలిసి అక్బరు మిగులదుఃఖించి రెండుదినముల వఱకును, పిల్లవానివలె నేడ్చుచు నిద్రాహారములు లేక యుండెను.

అబుల్ ఫజల్, ఆకాలమునాటి గొప్ప సర్దారుఁడైనను, ఆతనికీర్తి హిందూదేశమునందు నాచంద్రార్కముండుట కాతని యున్న తోద్యోగము కారణముగాదు. ఆతనిచేరచియింపఁబడిన 'అక్బరునామా,' 'అయినీ అక్బరీ' అను చరిత్ర గ్రంథరాజములే యిందులకుఁ గారణములు. మొదటి దానిలో అక్బరు చక్రవర్తి యొక్క చరిత్రము సవిస్తరముగను, సుమనోహరముగను రాజ్యాభిషేకమైన తరువాత నలువది యేడుసంవత్సరముల వఱకు - అనఁగా అబుల్ ఫజల్ మరణించిన సంవత్సరము వఱకును-వ్రాయఁబడియున్నది. రెండవ దానిలో, అప్పటి రాజ్యవిధానమును, రాజ్యవిస్తార వివరమును, దేశమందలి యితరవిశేషము లన్నియును వివరముగా వర్ణింపఁబడినవి. ఆకాలమందలి దేశచరిత్రమున కితని గ్రంథములే ముఖ్యాధారములు. ఇతఁడు పంచతంత్ర గ్రంథముగూడ పారసీకములోనికి భాషాంతరీకరించెను. 'మక్తుబాతి అల్లామి' అను నొక గ్రంథము ఈతనిది గలదు. ఇందు నతనిచే గొప్ప గొప్ప వారికి వ్రాయఁబడిన ఉత్తరములు సంగ్రహింపఁబడినవి.

మొత్తముమీఁద నీతఁడొక యద్వితీయ పురుషుఁడు. సత్యసంధుఁడు, సర్వసముఁడు. అక్బరుయొక్క ఉత్తమోత్తమ పరిపాలనమునకుఁ బ్రేరకుఁడు, కారకుఁడు.

**అబుల్ ఫరాజ్** (మార్ గ్రిగరీజాన్ అబుల్ ఫరజ్; ౧౨౬-౮౬). ఈతఁడు హీబ్రూకుమారుఁడని యర్థమిచ్చు 'ఎభ్రయా' యని సిరియనువారిచేఁ బిలువంబడుచుండెను

గాని సామాన్యముగా సర్వత్రల్యాటిన్ నామమైన 'బార్ హీబ్రుయస్'అనియే వ్యవహరింపఁబడుచుండెను. ఇతఁడు ఆర్మీనియాలోని మలాటియా పట్టణమున జనించెను. గ్రీకు, అరబ్బీ, సిరియాభాషల నభ్యసించిన తరువాత దత్త్వశాస్త్రము, వైద్యశాస్త్రము, దైవవిషయకశాస్త్రము నేర్చుకొనుటయందుఁ గృషిచేసెను. ఆంటియోక్ అనుప్రదేశమున విద్యాభ్యాసమును జేయుట ముగించి అచ్చటి మఠములోనే వైరాగ్యజీవనమును బ్రారంభించెను. ఇతఁడనేక స్థలములయందు (బిషప్పు) మతగురువుగనుండెను. సిరియాదేశమునందు జనించిన పండిత ప్రముఖులలోను, కవివరులలోను నితఁడొక్కఁడు. ఇతని గ్రంథములలోఁ బ్రపంచ చరిత్రమనియెడి గ్రంథము ప్రధానమైనది.

## అబుల్ ఫేడా (౧౨౭౩ - ౧౩౩౧).

డెమాస్కస్ పట్టణమునందు జనించెను. మతమునకై దండయాత్రచేసిన క్రైస్తవ వీరులతోను, మంగోలియా వారితోను, జరిగిన యుద్ధములయందు బాహుశక్తిచూపియు, కలముశక్తిచూపియు పేరు తెచ్చుకొనియెను. ఇతఁడు హామాదేశమునకు సుల్తానుగ నుండెనుగాని యీజిప్టుమామెలూక్ సుల్తానుకు సామంతుఁడుగ నుండెను. ఇతఁడు చరిత్రమును, భూగోళమును, గూర్చి గ్రంథములను వ్రాసెను.

## అబుల్ ఫైజీ. (౧౫౪౭-౧౫౯౫)

ఈతని తండ్రిపేరు షేక్ ముబారిక్. అక్బరు చక్రవర్తియొక్క ముఖ్యమంత్రియగు అబుల్ ఫజల్ అను నతఁడు ఈఫైజీయొక్క తమ్ముఁడు. వీరిద్దఱను అక్బరు చాల గౌరవించి గొప్ప పదవుల నియమించెను. చక్రవర్తి ఆస్థానపండితుఁడగు ఘిజాలీ చనిపోయినపుడు (౧౫౭౨) ఆపదవి ఫైజీకి లభించుటయే గాక యాతనికి 'కవిచక్రవర్తి' యను బిరుదుకూడ నొసంగఁబడెను.

అబుల్ ఫైజీ అసాధారణ ప్రజ్ఞగలవాఁడు. చరిత్ర, తత్త్వశాస్త్రము, వైద్యము, వ్యాసరచన, ఉత్తరములు వ్రాయుట, ఈపనుల యందీతనికి సమానులెవ్వరును లేరు. "నిజామీ" యను గొప్పపండితుఁడు రచించిన "కంసా" అను కావ్యమువలెనుండు వానిని వ్రాయుటకై ప్రయత్నించి ఐదుగొప్ప పద్యకావ్యముల నీతఁడును రచించి ప్రసిద్ధికెక్కెను. అక్బరుకోరికపై రామాయణమును, మహాభారతములోని రెండు పర్వములను, పారసీభాషలోనికి తర్జుమాచేసెను. నలదమయంతి కథ వ్రాసి దానికి "నల్ దమన్" అను నామమిడెను. సంస్కృత వాఙ్మయమును, హిందూజ్ఞాన శాస్త్రములను బాలకృషిచేసి చదువఁ బ్రయత్నించిన మహమ్మదీయులలో మొదటియాతఁడీఫైజీయె. ఈతఁడు భాస్కరాచార్యవిరచితములగు బీజగణితమును, లీలావతీ గణితమును, పారసీకములోనికి భాషాంతరీకరించెను. ఈతఁడు పారసీక భాషలోనికి సంస్కృత కావ్యములను వేదాంతశాస్త్రములను

పరివర్తనము సేయుటయేగాక తనంతటతాను కొన్ని పుస్తకములను వ్రాసెను. అబుల్ ఫైజీ వ్రాసిన గ్రంథములలో మిగుల గొప్పది కురాను అను మహమ్మదీయ మతగ్రంథముపై వ్రాసినవ్యాఖ్యానము. దీనిని రచించుటకీతఁడు చాల శ్రమపడెను. తన భాషలో ఇరువదియెనిమిది అక్షరములుండగ చుక్కలులేని పదుమూఁడక్షరములను మాత్రమే ప్రయోగించి పుస్తకమును బూర్తిగావించెను. ఇట్టి గ్రంథమునే మరియొక దానిని రచించెను. ఈతఁడు అరబ్బీభాషలోకూడ గొప్పవిద్వాంసుఁడు. ఈతఁడు సుమారు ౧౦౧ పుస్తకముల రచించెను. కొంతకాలమీతఁడు రాజతనయుల కుపాధ్యాయుఁడుగ నుండుటయేగాక రాజకీయవిషయములలోఁ జాల జోక్యముకలిగి యున్నటులు కానవచ్చుచున్నది. ఈతఁడు కొంతకాలము రాయబారిగనుండి అక్బరు మన్ననకుఁ బాత్రుఁడయ్యెను. ఈ సంగతిని ఈతఁడు 'బదానీ' యను చరిత్రకారునికి వ్రాసిన లేఖలవలనఁ గనఁబడుచున్నది. ఈతఁడు బాల్యమునుండియు నుబ్బసమునకులోనై దాని వలననే మృతి నొందెను.

**అబుల్ మాలీషా.** ఈతఁడు అక్బరు వద్దనొకప్పుడు ఉద్యోగముచేసి, ఆతనితో గలహించి, కాబూలు దేశమునకుఁ బాఱిపోయెను. అక్కడ 'మిర్జామహమ్మదు హకీము' అను అక్బరుసోదరుఁడే ఈతని కరుణించి తనవద్ద గొప్ప ఉద్యోగమున నియమించెను. అంతియె కాక తనసోదరియగు మిహిరున్నిసా బేగమ్ అనునామె నీతనికిచ్చి పెండ్లిచేసెను. కాని ఈతఁడు అక్కడకూడ తనదుర్వృత్తి మాన లేదు. ఏలాగునైనను కాబూలు రాజ్యము తాను సంపాదించుటకై ౧౫౬౪లో హకీము తల్లియు తనఅత్తగారునునగు నామెను చంపించెను. ఆమెభర్త పేరునకుమాత్రమె రాజుగాని ఈమెయె సర్వకార్యములను జూచుచుండెడిది. అట్టి అసాధారణ ప్రజ్ఞగలిగిన యామెనుజంపి, బాలుఁడగు నామెతనయునకు తాను రక్షకుఁడనని ప్రవర్తింపఁజొచ్చెను. అప్పటికిని ఆతని యుద్దేశమా బాలునివధించివారసులు లేకుండఁ జేయుటయే. అప్పుడు తానుతప్పక రాజు కాగలననుకొనెను గాని ఈతఁడు తలచినటులు జరుగ లేదు. ౧౫౬౪లోనె బడక్షాన్ దేశమునకు యువరాజగు మిర్జాసులైమాన్ అనునతఁడు ఈతని యుద్ధమున నోడించి, వధించి, ఆరాజ్యమును తనదేశమునకుఁ జేర్చుకొనెను. కాని ఆతఁడును కాబూలు రెండు సంవత్సరములు మాత్రమే పాలించెను.

ఈతనికి షబదీయను కవిత్వసంబంధమైన బిరుదుపేరుకలదు. ఈతఁడు ప్రసిద్ధివడసిన విద్వాంసుఁడు.

**అబుల్ హాసన్.** ఈతఁడు జహంగీరు చక్రవర్తికిఁ బ్రధానమంత్రి. రాణియగు నూర్జహాను ఈతనిసోదరి. ఈతనికి ముగ్గురు కుమార్తెలును నలుగురు తనయులును కలిగిరి.

మొదటికూతురగు ముమ్‌తాజ్ మహల్ జహాంగీరు కుమారుఁడగు షాహజహానునకిచ్చి వివాహముచేయఁబడెను. ఈతని కుమారులు కడు ప్రసిద్ధిగొన్న వారలు. అలంగీరు చక్రవర్తికి ఈ హసన్ మతవిషయక గురువుగా నుండెడి వాఁడు. ఈతఁడు ౧౬౮౧-వ సంవత్సరమున లాహోరులోఁ జనిపోయెను.

## అబుల్ హసన్ కుతుబ్ షాహ

(౧౬౭౪-౧౬౮౭). ఇతఁడు గోలకొండలోఁ బ్రభుత్వముచేసిన కుతుబ్ షాహి వంశములోని చివరనవాబు. అబ్దుల్లాకుతుబ్ షా (౧౬౧౧-౧౬౮౭) అను ఆఱవ నవాబున కీతఁడు మేనల్లుఁడు. ఆతని కూతునుగూడ వివాహమాడి యాతని తరువాత గోలకొండరాజ్యమునకు నవాబయ్యెను. ఇతని కవిత్వ సంబంధమైన నామము తానాశాహ. ఇతనినే మనవారు తానీషాయందురు. ఇతనియొద్ద అక్కన్న మాదన్నలను వారలు మంత్రులుగ నుండిరి. ఔరంగజేబు గోలకొండకు ఏడునెలలు ముట్టడి వేసి ౧౬౮౭ లో ఈరాజ్యమును జయించి తానీషాను చెఱఁబట్టి (౨౨-సెప్టంబరు) దౌలతాబాదు దుర్గముమీఁద చెరసాలలో నుంచెను. ఇతఁడాదుర్గము మీఁదనే ౧౭౦౪-వ ప్రాంతమున మృతుఁడయ్యెను. ఇతఁడు దక్షిణ దేశపు హిందూస్థానీభాషలో రసవంతమైన కావ్యములను జెప్పెను.

## అబూకిర్.

ఈజిప్టు దేశముయొక్క ఉత్తరతటమున అలెగ్జాండ్రియా నగరమునకు ఈశాన్యముగ ౧౪౪ మైళ్ళమీఁదఁగల యొక రేవుపల్లె. దీని నానుకొని ఈజిప్షను రోమక గ్రీకు పురాతన శిథిలస్థానము లనేకములు గలవు. ఈపల్లియ ప్రక్కనుండు అఖాతముచే నిది సుప్రసిద్ధము. అందు ఫ్రాంసుదేశమునందలి విప్లవ విగ్రహకాలమున ఫ్రెంచివారి నావికా సైన్యములకును నాయకరత్నములలో నొక్కఁడగు నెల్సనుచే నడుపఁబడిన ఆంగ్లేయ నావికా సైన్యములకును పోరయ్యె. ఆంగ్లేయులు విజయులయిరి. ఆయుద్ధమును నైలుయుద్ధమని వ్యవహరించుట కలదు. అబూకిర్ ప్రాంతముల నాసమయమున మఱి రెండు యుద్ధములు జరిగెను.

## అబూతలిబ్ ఖాఁ (మిర్జా).

ఈతఁడు తురుకీవాఁడు. ౧౭౫౨ లో లక్నోనగరమున జన్మించెను. నవాబ్ అసఫుద్దీలాయను నతనివద్ద ౧౭౭౫ లో ఉద్యోగమునకు ప్రవేశించెను. కొంతకాలము తరువాత ఆపనిని వదలుకొని గోరఖ్‌పుర కలెక్టరువద్ద కొలువునకుఁ జేరెను. తరువాత ఈతఁడు కొంతకాలము మిడిల్‌టన్ అను లక్నోనగరమునకు రెసిడెంటుగనున్న ఆంగ్లేయునివద్ద ప్రవేశించెను. అప్పుడీతఁడు రాజాబల్బదారుసింగు అను నతని జయించుటలో, ఇంగ్లీషువారికి చాల సాయము జేసెను.

ఈతనికి కొన్ని ఇక్కట్టులు తటస్థించుటచే ౧౭౯౯లో ఇంగ్లండునకు ప్రయాణమయ్యెను. లండనునగరమున, ఈతఁడు "పారసీకయువ

రాజు"అను బిరుదముతో సంచరించి చాల గౌరవింపఁబడెను. ఆతఁడక్కడనున్న కాలములోను, ఐరోపాలో సంచారముగావించిన ఇతర ప్రదేశములలోను తానుచూచిగమనించి తెలిసికొనిన విషయములను ఒక పుస్తకమున వ్రాసియుంచుకొని, తిరిగి ఇండియాకు వచ్చిన తరువాత ౧౮౦౩ లో వానిని క్లుప్తపఱచి ప్రకటించెను. వానిని లండను నగరవాస్తవ్యుఁడగు చార్లెసు స్టీవార్టు ౧౮౧౮ లో ఇంగ్లీషు భాషలోనికి భాషాంతరీకరించెను. ఈతఁడు ౧౮౦౬ ప్రాంతమున చనిపోయెను.

**అబూపర్వతము.** రాజపుతానాయందలి సిరోహిసంస్థానమునకు దక్షిణమున నున్న యొక పర్వతము. ఇది బొంబాయికి ఉత్తరముగా ౪౪౭ మైళ్ళదూరముననున్నది. ఊ౨౪° ౩౯ కును తూ౭౨° ౪౯ కును నడుమ నున్నది. ఆరావళీపర్వతములోని యొకభాగమని పలువురు తలఁచెదరు. కాని, రెండుపర్వతములకు నడుమ ఏడుమైళ్లవెడల్పు గలసమప్రదేశముండుటచే నటులనఁజెల్లదు. పడమటి బనాస్ అను నది ఈ పల్లముగుండఁ బ్రవహించుచున్నది. ఈ ఆబూపర్వతముపొడుగై, సన్నముగనున్నది. కొండమీఁద మాత్రము పీఠభూమి వలెనుండి చూచుటకుఁ జాల అందముగ నుండును. దీనిపొడవు పంద్రెండుమైళ్లు. వెడల్పు రెండుమూఁడుమైళ్ల కెక్కువగలేదు. సముద్రమట్టమునకు ౪౦౦౦ వేల అడుగుల యెత్తుననున్నది. దీనిలోనెల్ల నెత్తగు శిఖరమునకు 'గురుశిఖర మనిపేరు. అది ౫౬౫౦ అడుగుల యెత్తుగలదు. నీలగిరికిని, హిమాలయ పర్వతములకునునడుమ నింతయెత్తుగల ప్రదేశ మింకొకటిలేదు. శీతోష్ణస్థితి మిక్కిలి చలియు వేడియుగాక సమశీతోష్ణముగనుండును. పర్వతము ఎక్కుటకుఁ జాల వీలుగలేదు. ఉత్తర పశ్చిమముల మిక్కిలి ఏటవాలుగ నున్నది. అందుచే నెక్కుట కొడుదుడుకుగ నుండును.

పంటలు:- ఈ పర్వతము, అడుగుభాగమునను, లోయలలోను సేద్యము జరుగును. చిన్నచిన్న అడవులు గలవు. వెదురుదుప్పలు విశేషించి యున్నవి. వర్షము మిక్కుటముగఁ గురియుచుండుటచే రాజపుతానాయంతటిలోను, ఆబూపర్వత ప్రదేశమే మిక్కిలి ఫలవంతమైనచోటు. ఆచుట్టు ప్రక్కల మైదానములో పండుపంటలన్నియుగాక కొన్ని క్రొత్త రకములగునవి యిచ్చట ఫలించును. ముఖ్యముగ పేర్కొనఁబడఁదగినది 'అంబారీతారీ' అను నొకతీగవలె నుండుచెట్టు. అది మామిడిచెట్లను అంటుకొని యుండును. మిక్కిలి అందమైనపువ్వులు పూయును. తెల్లగులాబి వంటి పూలచెట్లు గలవు. ఎక్కువ సువాసన కలుగచేయు పూవులు పూయుతీగలును, చెట్లు నిక్కడ మెండుగనున్నవి. ఈకెలవంటి ఆకులు గలిగి తోట్లలో వ్రేలాడఁగట్టఁబడు మొక్కలీచోటునఁజాల నున్నవి.

ఈ పర్వతముమీఁద 'నఖీటాలూ'అను సరస్సుకలదు. పూర్వము దేవతలు తమ గోరులచేఁ

ద్రవ్విరని మన హిందువులు తలఁచెదరు. ఇంత అందమైచూచుట కింపగుచోటు, ఇండియాలో మరెచ్చటనులేదని ఫెర్గూసన్‌గారి యభిప్రాయము. ఇది అరమైలుకన్న నెక్కువపొడవును, పావుమైలు వెడల్పును గలిగి యున్నది.

౧౮౨౨ మొదలు ౧౮౪౦ వఱకు ప్రతి సంవత్సరపు వేసవినందును సిరోహి సంస్థానపు పొలిటికల్ సూపరింటెండెంటువచ్చి అక్కడ కాపురముండెడివాఁడు. జోధ్పూరు ప్రాంతములోని ఉద్యోగస్థులుకూడ వచ్చెడివారు. ౧౮౪౦ లో జబ్బుగానున్న యూంగ్లేయులు కూడ వేసవిలో నక్కడకుఁ బోవుట మొదలిడిరి. ౧౮౪౫లో నా కొండమీఁది కొంత భాగమును సిరోహినాయకుఁ డింగ్లీషు వారికి నొక ఆరోగ్యస్థానమును కట్టుకొనుటకు కొంత స్థలమిచ్చెను.షరతులు ఆవులనుచంపకుండుట, మాంసమును కొండపైకిఁ దేకుండుట మొదలగునవి. ఆకాలమునందే గవర్నరుజనరలు ఆచోటును తనకు ముఖ్యస్థానముగ చేసికొనియెను.

ఈవిధముగ నీచోటు ప్రసిద్ధిగాంచినది. దానిని రెండుభాగములుగ విడదీయవచ్చును. ఒకవైపున మిలిటరీ సైనికులుండెడి వారు. వేఱొక ప్రక్కను సివిలియనులు కాపురముండిరి. నఖిసరస్సువద్ద సిపాయుల నివాసస్థలమేర్పాటు కాఁబడెనుగాని,అక్కడ జ్వరములు రానారంభించుటచేత నక్కడనుండి సివిలియనులున్న ప్రదేశమునకు జరిగి ఉత్తరమున తమగృహములనిర్మించుకొనిరి. ఇప్పుడు వారలక్కడనే యున్నారు. నూటఱువదిమంది సిపాయీలకు, ఇరువది ఎనిమిది కుటుంబములకు వసతిఏర్పడినది. సివిలియను లున్నచోట నలుబదికిపైఁగా గృహములుకలవు. గవర్నరు జనరలుగారి యేజంటుకూడ నక్కడఁగలఁడు. ఒక బజారు ఉన్నది.

అన్నికొండప్రదేశములలో వలెనే అక్కడ ఏప్రియల్ మొదలు జూను నెలాఖరువఱకు జనులెక్కువగ నుందురు. ౧౯౦౧ మార్చి ఒకటవతేదిని సంఖ్య ౩౪౮౮. అక్కడక్కడ నాపర్వతముమీఁద చిన్నగ్రామములు కలవు. అవి ౧౭. అందలి జనసంఖ్య మొత్తము ౧౭౫౨. వారిలో చాలమందిభిల్లులు,లాకులు, అనువారలు. లాకులు, రాజపుత్రులకు భిల్ల స్త్రీలయందు జన్మించినవారలని పలువురు తలంచెదరు. ఏమైనను వారు చాల నెమ్మదిగలవారు. కష్టపడి పనిచేసి జీవించెదరు. శుభ్రమగువస్త్రములు ధరింపరు. సివిలుభాగమునకు పారిశుద్ధ్య సంఘముకలదు. ఆదాయము రు ౧౧౦౦౦లు; సిరాహీమహారావు రు ౩౦౦౦లు ఇచ్చును. కుక్కలు, గుఱ్ఱములు బండ్లు మొదలగువానిపై పన్ను వసూలుచేయఁబడును. కాని ఖర్చు ఆదాయమునకన్న కొంచె మెక్కువగనే యుండును. సివిలు క్రిమినలు వ్యవహారములు, చాలభాగము, ఆంగ్లేయులు చూచెదరు. దర్బారు శాసనమటులున్నది. ౧౮౬౬ మహారావు ఖేన యనుమతి

నిచ్చుటచే గొన్ని ఇంగ్లీషుచట్టములక్కడఁ బ్రవేశపెట్టఁబడెను. ఈ కొండపై మూఁడు పాఠశాలలు గలవు. రెండు ఆసుపత్రులున్నవి.

ఈకొండపై 'డిల్‌వారా' అని పిలువఁబడుచు, ప్రసిద్ధివడసిన దేవాలయములు గలవు. అక్కడ నైదుదేవాలయములున్నవి. అన్నియు జైనమతస్థులవి. అందులోనొకటి ౧౦౩౨లోఁ గట్టఁబడినది. దాని పేరు 'విమలసాహ'. జైనుల యిరువది నలుగురు తీర్థంకరులలో మొదటివాఁడగు 'దినాథునకు' సమర్పింపఁబడినటు లాగుడిపైనున్న శిలాశాసనమువలనఁగనుఁగొన వచ్చును. రెండవదేవాలయము మొదటిదాని కెదురుగనున్నది. అందలి విగ్రహములలో నొకటి 'వస్తుపాలు'నిది. రెండవది 'జినపాలు'నిది. వారలిద్దఱు సహోదరులు. ౧౨౩౧సం॥లో ౨౩-వ తీర్థాంకుఁడగు నెమినాథుని పేరఁ గట్టఁబడినదఁట. రెండుదేవాలయములును తెల్ల పాలరాతితో నిర్మింపఁబడినవి. పైకిఁజూచుటకు గుడిఅందముగఁ గనఁబడకపోయినను లోనికి వెళ్లినతరువాతనుండు అందము వర్ణింపనలవి కాదు. లోపలనున్న విగ్రహములు ప్రతిమలు చూచి అనేకదేశస్థులు తమ యాశ్చర్యమును వెలిఁబుచ్చిరి. ఇంగ్లండు నందలి వెస్టుమినిస్టరు చాపెలులోనున్నట్టియు, ఆక్సుఫర్డులో నున్నట్టియు, విగ్రహములు వీనియందలి వానితోఁ పోల్చుటకువీలులేదని ఫర్గూసన్‌గారు సెలవిచ్చిరి.

**అబూబకర్.** (కన్నెతండ్రి; ౫౭౩-౬౩౪) మహమ్మదు పెండ్లియాడిన భార్యలలో నితనికూమార్తయైన అయేషా యొక్క తమె కన్యగావున నితనిని కన్నెతండ్రియని వ్యవహరించుచుండిరి. మక్కా నివాసియయి, కోరెయి జాతివారిలో నైశ్వర్యప్రాభవములు గలవాఁడు; మహమ్మదు మతము మొట్టమొదట నవలంబించిన వారిలో నొకఁడు. హెజీరాలో అనఁగా మహమ్మదుపాఱిపోయినప్పు డాతనితో నీతఁడొక్కఁడే యుండెను. మహమ్మదు చనిపోయిన తరువాత (౬౩౨-వ సంవత్సరము జూను ౮-న తేది) నీతఁడు ఖాలీఫా యను బిరుదనామముతో మహమ్మదీయ మతావలంబులకు ముఖ్యనాయకుఁడై రెండు సంవత్సరములు పరిపాలనముచేసెను.

**అబెలార్డు.** (పేర అబెలార్డు: ౧౦౭౯-౧౧౪౨) ఇతఁడు వేదాంతి, తత్త్వశాస్త్రజ్ఞానము గలవాఁడు. నాంటీసు నగరమునకు సమీపమునందున్న పాలేట్ గ్రామంబున జనించినందున డాక్టరుపలాటినస్ అనుబిరుదమునుగాంచెను. తత్త్వశాస్త్రీయమైన నామవాదమునకును (Nominalsm), అస్తిత్వవాదమునకును (Realism) చర్చ ముమ్మరముగా జరిగినకాలమునం దితఁడు జీవించియుండెను. ఇతఁడు రోసలిన్‌కడను అతనికి ప్రతిపక్షవాదియైన చాంపోనగర వాసియైన ఉల్లియమ్ కడను తత్త్వశాస్త్రము నభ్యసించెను. ఇతనికి

ముప్పదియేటు సంవత్సరములు వయస్సు వచ్చునప్పటికి యూరోపు ఖండమున నొక మహాబోధకుఁడనివిశేషప్రఖ్యాతి వహించెను. అందువలన "నోట్రెడేమ్" (Notre Dame) అను ప్రదేశమున నతనిచేస్థాపింపఁబడిన పాఠశాలకు నానాదేశములనుండి విద్యార్థులువచ్చి విద్యాభ్యాసము చేయుచుండిరి. ఇతఁడన్ని విధములయిన చర్చలను విడిచిపెట్టి సర్వసామాన్యముగా నంతటను వ్యాపించియున్న పిడివాద పద్ధతిని (Dogmatism) తిరస్కరించి గుణాగుణములను దెలుపునట్టివిమర్శనీయమైన పద్ధతిని (Critical) తన బోధయందు నవలంబించెను. ఇతనిగూర్చి యొకచిత్రమైన కథ లోకములో వ్యాపించి యున్నది. అయ్యది హెలాయిసియను నామె అబెలార్డును మోహించుటను గూర్చినది.

ఈమె నోట్రిడేములో మతాచార్యుఁడుగనున్న ఫుల్‌బర్టుయొక్క మేనకోడలు. ఈమతాచార్యుఁడు తన సంరక్షణలోనున్న మేనకోడలను అబెలార్డు మోసపుచ్చెననినమ్మి ఆయనమీఁద మాననష్టమును గల్పించునట్టి దోషము నారోపించెను. తరువాత అబెలార్డు సెయింట్ డెనిస్ అనుప్రదేశమున సన్న్యాసిగనుండెను. అర్గంటాయిల్ అనుప్రదేశమున హెలాయిసీ సన్న్యాసినిగనుండెను. ఇతఁడుభ్రష్టమతమును (పాషండమతమును) బోధించు చున్నాఁడను కారణముచేత సాయిసోన్సులో (Soissons) నుండు న్యాయసభవారు కారాగృహవాసశిక్షవిధించిరి. ఆశిక్ష ననుభవించిన పిమ్మట నాతఁడువిశ్రాంతిగోరి పరాక్లీటునకుఁ (ఋష్యాశ్రమము) బోయెను. అక్కడి కనేకవిద్యార్థులు పోయి వానిచుట్టును జేరియుండిరి. ఇతఁడు బ్రిటానిలో నొక మఠమునకు నధిపతి యయ్యెను. చివర కతనిఁ బాషండ మతము వాఁడని దూషించిరి. ౧౧౪౨ లో నాతఁడు మృతుఁడయ్యెను. క్రైస్తవ మతమును గుఱించి యీతఁడనేక గ్రంథములు వ్రాసెను.

**అభోరులు** (ఆరణ్యకజాతి). ఆసాము దేశమునకు నుత్తరపు సరిహద్దుమీఁద హిమాలయముయొక్క యొక భాగమునకు అభోరుగుట్టలనిపేరు. ఈగుట్టలకుఁ దూర్పున దిబాంగ్ నదియు, పశ్చిమమున సిరొయోంనదియుఁ గలవు. ఈగుట్టలమీఁద అభోరులను అడవిజాతివారు కాపురముందురు. అభోరులనఁగా 'అజితు' లనియర్థము. అనఁగా వీరుస్వతంత్రులు, ఒకరికి లోఁబడినవారుకారు. ఎటులను, ఇతరులకు నలవికాని పర్వతారణ్య ప్రదేశమునందుండుటచే నితరరాజులకెవరికిని వశులుగాక స్వతంత్రముగ నుందురు. కావున వీరికీపేరువచ్చెను. ఆసామిలచే వీరి కీ పేరు* పెట్టఁబడినది. వీరు తిబ్బెతు బర్మాదేశముల వారిలోనుండి పుట్టినట్లు తోఁచుచున్నది. వీరిలోఁ జాలవఱకు బ్రిటిషుసరిహద్దునకు వెలుపల తిబేతుసరిహద్దు

* అభోరులనఁగా తెలియనివారు. ఎవరిని గుఱించి మనకు నెక్కువగాఁ దెలియదో యట్టి వారని మఱియొక యర్థముగలదు.

లోనేయున్నారు. అబోరులలోఁగొన్ని శాఖలు గలవు. దిబంగ్ నదియొద్దున నున్న వాండ్రు తాము 'పాదము' వారమని చెప్పుకొనియెదరు. 'మెంబు'అనునది వీరిపల్లెలలోఁ బెద్దది. వీరిలో గ్రామమునకొక పెద్దనాయకుఁడున్నను, జను లందఱుఁగూడి గ్రామవ్యవహారములఁ జేసికొని యెదరు. ప్రతిగ్రామ మొకచిన్న ప్రజా ప్రభుత్వమనియె చెప్పవలెను. గ్రామములోని జను లందఱు సమానులు. చిన్న వ్యవహారముగాని పెద్దవ్యవహారముగాని అందఱునుకలిసి విచారించి చేయవలెను. ఇట్లందఱును దినము కలియుటకు నొకయిల్లు కట్టఁబడును. దీనిని మొరాంగ్ అనియెదరు. ఇది రమారమి రెండు వందల యడుగులు పొడుగుండును. తప్పు చేసినవారికి శిక్షలు వీరే విధించెదరు. గ్రామ మందలి బ్రహ్మచారులందఱును, బానిసలును రాత్రి పురమందిరమునందు బండుకొందురు. గ్రామమునకు నగ్నిభయముగాని, మఱియే భయముగాని సంభవింపఁగానే వీరు మొదటఁ బరుగెత్తి సాయముచేయుదురు. విడియిండ్లు చిన్నవిగ గుడిసెలుగ నుండును. ఒక కుటుంబ ముండుటకుఁ జాలును. బ్రహ్మచారులు, బ్రహ్మచారిణులు వివాహముకాఁగానే వేఱు ఇల్లు కట్టుకొని కాపురముచేయుదురు. ఆయిల్లుకట్టుటలో గ్రామస్థులువారికి సాయముచేయుదురు.

అబోరులు పొట్టివారుగను భీకరముగను ఉందురు. వీరు దోపిడికిఁ బ్రఖ్యాతిఁజెందిన వారగుటచే వీరి చుట్టుపట్టున మఱియేజాతివారును చేరరు. వీరు, ఇంగ్లీషు ప్రభుత్వములోని ప్రజలకు బాధకలిగించు చున్నందున నప్పుడప్పుడు ప్రభుత్వమువారు వారిమీఁదికి దండుపంప వలసి వచ్చెను. ఇట్టిదండులు ౧౮౫౮ లోను ౧౮౫౯లోనుఁబంపిరి. ౧౮౬౬లో అబోరులు బ్రిటిషు ప్రజలను జంపఁగా బ్రహ్మపుత్రానది యుత్తరపుటొడ్డున నచ్చటచ్చట ఠాణాలనేర్పఱుచుటకుఁ బ్రయత్నములు జరిగెను. అంతట వారింగ్లీషువారితో రాజీపడిరి. వారికి నింగ్లీషు ప్రభుత్వమువారు ప్రతిసంవత్సరమును కొన్ని యినపపారలు, ఉప్పు, నల్లమందు, మఱియితర వస్తువులీచ్చునట్లును, వారింగ్లీషు రాజ్యములోనివారిజోలికి రాకుండునట్లును నొడంబడికలు జరిగెను. ఈయేర్పాటు కొంతవఱకు జరిగెను. కాని ౧౮౮౯ లోను, ౧౮౯3 లో వీరు బ్రిటిషు ప్రజలను జంపినందున వారిని శిక్షించుటకు నొకసైన్యముఁబంపవలసివచ్చెను. వారిని ఈవైపునకు రానీయకుండఁ జేయుటకుఁ గొంతసైన్యము ౧౯౦౦ వఱకు నుంచఁబడెను. ఇప్పుడు వారు మనరాజ్యమునకు బాధకలిగించుట లేదు.

**అబౌట్.** (ఎడ్మండ్ ఫ్రాంకోయిస్ వలెంటిన్ అబాట్; ౧౮౨౮-౮౫). ఫ్రాన్సు దేశమునందు జనించిన యొకకవి. నాటకములను వ్రాసి ప్రసిద్ధిగాంచెను. కల్పనా కథలు వ్రాయుటయందును, పత్త్రికావిలేఖనమునందును, కాలమును వినియోగించెను. ఫ్రెంచివారికి జర్మనివారికిని యుద్ధము జరిగి

నప్పుడు మేక్మహోన్ సైన్యముతో సాహిర్ (Soir) పత్రికాప్రతినిధిగఁ బోయియుండెను. ౧౮౭౫-వ సంవత్సరమునుండి సీక్లీ (Siecle) పత్రికకు సంపాదకుఁడుగ నుండెను. అకాడెమీలో సభ్యుఁడుగా నెన్నికొనఁబడెను. కాని స్వాగతమిచ్చుటకుఁ బూర్వమె పారీసునగరమున స్వర్గస్థుఁడయ్యెను. ఇతనిచే రచింపఁబడిన నవల లనేకము లింగ్లీషునకు భాషాంతరీకరింపఁబడినవి.

అబ్దుల్ అజీజు. (౧౮౩౦-౭౬)

ఈయన ౧౮౬౧-వ సంవత్సరములో తనసోదరుఁడైన అబ్దుల్ మజీదునకు పిమ్మట తుర్కీకి సుల్తానయ్యెను. ౧౮౬౫-వ సంవత్సరములో కాన్స్టాంటినోపల్ నగరమున కలరామున్నగు వ్యాధులువ్యాపించుటచేతను, క్రీటు, హెర్జిగోవినా మొదలగు ప్రదేశములందు అల్లరులు రేగుటచేతను౧౮౭౬-వ సంవత్సరములో బల్గేరియనులు ఘోరహత్యలను గావించుటచేతను ఈయన ప్రభుత్వము శోభింపదయ్యెను. ౧౮౭౬-వ సంవత్సరము మే నెలలో సింహాసనమునుండి తొలగింపఁబడి మఱివారము దినములలో ఆత్మహత్యవలననో, ఇతరులు చంపించుటచేతనో, మరణము నొందెను.

అబ్దుల్ ఖాదర్ ౧. (అమీర్ అబ్దుల్ ఖాదర్; ౧౮౦౭-౮౩) ఆల్జీరియాదేశములోని యొక దేశభక్తుఁడు. ఇతఁడు ఫ్రెంచివారితో మతయుద్ధమును జేయుటకై తనదేశీయులను బురికొల్పుచు ౧౮౩౩-వ సంవత్సరములో ఓరాన్ వద్ద యుద్ధము మొదలుపెట్టెను. ఇతఁడు ఫ్రెంచివారితో సంధి చేసికొన్న తరువాత అమీర్‌గ నొప్పుకొనఁబడియెను (౧౮౩౪) కాని వెంటనే మరల యుద్ధము ప్రారంభము కాఁగా అబ్దుల్ ఖాదరు మొరాకో దేశమునకుఁ బాఱిపోయెను (౧౮౪౩). ఇతఁడు౧౮౪౭లో డీలామొరిసీరెయను ఫ్రెంచిసేనానాయకునకు వశుఁడై టూలోనుకుపంపఁబడియెను. ౧౮౫౨-వ సంవత్సరములో లూయీ నెపోలియన్‌చే విడిచిపెట్టఁ బడుటయెగాక ౧౮౬౨-వ సంవత్సరమున లక్షఫ్రాంకులను నుపకారవేతనముగఁ బడసి తుట్టదతుకు డెమాస్కసుపట్టణమున నివసించుచుండి తత్త్వశాస్త్రమునుగూర్చి కొన్నిగ్రంథములను విరచించెను.

౨. ఆల్‌గీలాని అబ్దుల్ కాదరని పూర్ణమైన పేరు (౧౦౭౮ - ౧౧౬౬). ఇతఁడు పారసీకదేశములో గీలాన్ పరగణాలో జనించిన యొకమహమ్మదీయ సాధువు. ఇతఁడు బగ్దాద్ పట్టణమున మరణము నొందెను. ఇతఁడు మహమ్మదీయన్యాయ శాస్త్రమునుగూర్చియు గూఢమైన భగవద్ధర్మమును గూర్చియు గ్రంథములను వ్రాసెను.

అబ్దుల్ ఖాదర్ బదౌని. (షేక్, తండ్రి ములుక్‌షా) ఇతఁడు అక్బరు కాలమునాటి అరబ్బీపారసీ పండితుఁడు. సంస్కృతమునుగూడఁజక్కఁగ నెఱిఁగియుండెను. ఇతఁడు

సంస్కృతమునుండి రామాయణమును, మహాభరతములో రెండు పర్వములను పార్సీలోనికి భాషాంతరీకరించెను. అరబ్బీభాషలోని పెక్కు గ్రంథములను పారసీలోనికి భాషాంతరీకరించెను. కాశ్మీరదేశచరిత్రమును గూడసంగ్రహముగ వ్రాసెను. ఇతఁడు 'బదా' అన్న గ్రామములో (౧౫౯౬) మృతినందెను. ఇతని కవిత్వసంబంధమైన పేరు 'కాదిరి.'

## అబ్దుల్ మజీదు (౧౮౨౩-౬౧).

ఇతఁడు తుర్కిసుల్తాను. తనతండ్రియైన రెండవ మహమ్మదునకు పిమ్మట సింహాసనమెక్కెను (౧౮౩౯). ౧౮౪౧ లో ఈజిప్టుమహమద్ అలీతోఁ సంధి చేసికొనియెను. ఇతఁడు ౧౮౩౯-వ సంవత్సరములో తనతండ్రివలెనే మతభేదములేకుండ తనప్రభుత్వములోఁ జేరిన యెల్ల ప్రజలయొక్క సొత్తును, మనుష్యునియొక్క హక్కులను, కాపాడునట్టి సంస్కరణలను గావించెను. ౧౮౫౩-వ సంవత్సరములో రుష్యావారు కోరెడు హక్కులనుల్లంఘించెను. అందువలన క్రిమియాయుద్ధము జరుగుటసంభవించెను. ఇతఁడు తనరాజ్యములోఁ బెక్కువిధములయిన సంస్కారములను జేసెను.

## అబ్దుల్ రషిద్ మిర్.

ఢిల్లీచక్రవర్తియగు షాహజహాౝ కాలమందలి పారసీక పండితుఁడు. ఇతఁడు పారసీక కోశమును, అరబ్బికోశమును వ్రాసెను. ఫర్ హంగ ఇరషీదిఅను పారసీక కోశమును బంగాళాలోని ఏసియాటిక్ సొసైటీవారచ్చొత్తించిరి.

## అబ్దుల్ రహిమాౝ ౧.

అరేబియా దేశములోని యొకసరదారు. ఇతఁడు టొలౌజు అను ప్రదేశమున యుద్ధముచేసెను (౭౨౧). ఇతఁడు ౭౩౨-వ సంవత్సరమున ఆక్వైటెయిని మీఁదికి దండయాత్ర వెడలి బోర్డో నగరమును కొల్లగొట్టి బర్గండివఱకు దేశమును ధ్వంసము చేయుచుఁ బోయెను. ౭౩౨-వ సంవత్సరమున ఫ్రాంకుల సేనాపతియైన చార్లెసుమార్టెల్ అనువానితో నేడు రోజులు యుద్ధముచేసి మరణము నొందెను.

౨. (౭౩౧-౭౮౭). కార్డోవా పరిపాలనముచేసిన ఒమ్మియెడె వంశస్థాపకుఁడైన యితఁడు డెమాస్కసు నగరమున జనించెను. ఇతఁడుటిరినీసువఱకు ఐబీరియను ద్వీపకల్పమును జయించుచు నిరంతరము యుద్ధము చేయుటయందే జీవితమును గడపెను.

3. (౭౮౮-౮౫౨). ఇతఁడు కార్డోవాపరిపాలించిన ఒమ్మియెడెవంశస్థులలో నాలుగవవాఁడు. మొదటి అల్ హకీముయొక్క కుమారుఁడును అతనికి పిమ్మట సింహాసన మెక్కినవాఁడునైయుండెను (౮౨౨). ఇతని ప్రభుత్వము, రాజ్యములో జరిగిన యల్లరులవలనను, ఫ్రెంచివారితోను, బగ్దాదునగరఖాలీఫాతోను జరిగిన యుద్ధముల వలనను, సంక్షోభమును బొందెను.

౪. (౯౧౨-౯౬౧). స్పెయినుదేశములోఁ బరిపాలించిన ఒమ్మియెడెవంశస్థులలో నితఁడు ఎనిమిదవవాఁడు. ఇతఁడు ౬౧౮-వ సంవత్సరములో క్రైస్తవరాజుకుమారులు నులిమోన్, నవారె ప్రభువులును నగు మూఁడవ ఆల్ఫాంజో సాంచోలతో యుద్ధముచేసి వారల నోడించెను. ౯౩౯-వ సంవత్సరమున లియోన్ ప్రభువైన రెండవ రామిరోతో యుద్ధముచేసి యోడిపోయెను. కాని రామిరో మరణానంతరము సింహాసన భ్రష్టుఁడైన మొదటి సాంచోప్రభువును సింహాసనమెక్కించుటకై సహాయము చేసెను. స్పెయిను దేశములో మహమ్మదీయులకు నైకమత్యమును గలిగించుటకై విశేషముగాఁ బ్రయత్నము చేసెను. ఒమ్మియడు వంశమునందు నీతఁడు మిక్కిలి గొప్పవాఁడు.

## అబ్దుల్ రహిమాన్ ఖాన్.

(౧౮౩౦ - ౧౯౦౧) ఇతఁడు అఫ్ఘనిస్థానమునకు అమీరుగనుండెను. తన ప్రభుత్వమును బలపఱచుటకును సరిహద్దులను స్థిరపఱచుటకును, జనుల సాంఘికస్థితుల నభివృద్ధిపఱచుటకును, అనల్పమైన కృషిచేస్సెను. ఇతని తరువాత ఇతని కుమారుఁడు హబీబుల్లాఖాను అమీరయ్యెను. (చూడు అఫ్ఘానిస్థానము.)

## అబ్దుల్ లతీఫ్ అల్ బగ్దాది.

(౧౧౭౨-౧౨౩౧) ఇతఁడు బగ్దాదునగరమున జనించిన యొక మహమ్మదీయ పండితుఁడు. ఇతఁడు తత్త్వశాస్త్రమును వైద్యశాస్త్రమును పఠించి కైరో, డెమాస్కసు నగరములలో బోధించెను. ఇతఁడు ఈజిప్టుదేశచరిత్రమును రచింపఁగా నయ్యది లాటిన్ ఫ్రెంచి యింగ్లీషు భాషలలోనికి భాషాంతరీకరింపఁబడియెను.

**అబ్దుల్ సమద్ ఖాన్.** ఇతని తండ్రి సమరుకందు దేశస్థుఁడు. ఇతఁడు ఆగ్రాలోఁ బుట్టెను. ఔరంగజేబుకాలమందు, ఈతనికి ౬౦౦ మన్‌సబ్‌దారీయు, తరువాత ౧౫౦౦ మన్‌సబ్‌దారీయు, ఖాన్ అను పదవియుఁ బ్రాప్తించెను. జహంగీర్‌కాలమం దితఁడు ౨౦౦౦ మన్‌సబ్‌దార్ అయ్యెను. ఆలీజంగ్ అను పదవినివడసెను. ఫరుఖ్‌సియార్‌కాలమున నీతఁడు లాహోరునకు గవర్నరయ్యెను. సిక్కులనోడించి వారిగురువైనబాందా అనువానిని చెఱబట్టెను. మహమ్మద్‌షాకాలమున నితఁడు ముల్తానుకు రాజయ్యె. "సంసాండద్దౌలా" అను బిరుదమువహించెను. ఇతఁడు ౧౭౩౯ లో నాదర్‌షాహ దాడికాలములో మృతుఁడయ్యెను. ఇతని కుమారుఁడు జరిఖేయాఖాన్ లాహోరునకు సుబేదారుఁడుగా నుండెను. ఇతని తండ్రిపేరు ఖ్వాజా అబ్దుల్ కరీమ్.

**అబ్దుల్ హక్.** (షేక్; ౧౫౫౧ - ౧౬౪౨). గొప్ప మహమ్మదీయవిద్వాంసుఁడు. చరిత్రము, మతము, సూఫీ సిద్ధాంతములు,

యాత్రలు మొదలైన విషయములపై నూఱు కంటె నెక్కుడు గ్రంథములు వ్రాసిన వాఁడు. ఇతని గోరీ ఢిల్లీపట్టణ మందుఁగలదు. ఇతనిని గొప్ప భగవద్భక్తునిగాఁ బూజించెదరు. తండ్రి పేరు సైఫీఉద్దీన్. కుమారుని పేరు షేఖ్ నూరు ఉల్లక్.

**అబ్దుల్ హమీద్.** ౧. (౧౭౨౫-౮౯) తుర్కీసుల్తాను ఈయన మూఁడవ అహమ్మదు కుమారుఁడు. నాల్గవ అహమ్మదు అను పేరుతో తనసోదరుఁడైన ముస్తఫాకు పిమ్మట తుర్కీ సింహాసనమలంకరించి సుల్తానయ్యెను. ఇతని ప్రభుత్వములో రష్యనులకును తురుష్కులకును యుద్ధములు జరిగి రష్యనులకు జయము లభించెను.

౨. (౧౮౪౨ - ౧౯౧౮). ఈయన అబ్దుల్ మజీదునకు పుత్త్రుఁడు. తన సోదరుఁడును, వెఱ్ఱివాఁడునునగు మురాదునకు పిమ్మట తుర్కీసింహాసన మధిష్ఠించి సుల్తానై ౧౯౦౯-వ సంవత్సరములో సింహాసనము నుండి తొలగింపఁబడియెను. ఈయన ప్రభుత్వ కాలములో జరిగిన ముఖ్య విషయములు. సర్వియాతో యుద్ధము (౧౮౭౬), రష్యాతో యుద్ధము (౧౮౭౭-౭౮), ఆర్మీనియాలో ఘోరకృత్యములు జరుగుట, గ్లాడ్‌స్టన్ ప్రభువుచే హంతకులని దూషింపఁబడుట, క్రీటులో అల్లరులు, గ్రీసుతో యుద్ధము (౧౮౯౭), ౧౯౦౮-వ సంవత్సరములో తురుష్కరాష్ట్రములో రాజకీయ సంస్కారములకై యౌవన తురుష్కులు ప్రభుత్వము నెదుర్కొనుట, ౧౯౦౯-వ సంవత్సరములో దేశీయ మహాజనసభ యేర్పడి సుల్తాను దుష్పరిపాలనముచేయు చున్నందున ఖలీఫాపదవిని వహించుటకుఁ దగినహక్కును గోల్పోయెనని చెప్పి సింహాసనమునుండి తొలఁగించి యీయనసోదరుని ఐదవమహమ్మదను పేరుతో సుల్తానుగా చాటుటయును సంభవించెను.

**అబ్దుల్లా.** మతప్రవర్తకుఁడైన మహమ్మద్ యొక్క తండ్రి. అబ్దుల్ ముతాలబ్ అనువాని కుమారుఁడు. ఇతఁడు మిక్కిలి చక్కని వాఁడు. ఇతఁడు ఒంటెలకాపరి. ఇతని భార్య పేరు అమినా. ఈదంపతులకు చిరకాలమునకు మహమ్మద్ కలిగెను. మహమ్మదు శిశువుగ నుండగనే ఇతఁడు మరణించెను. ఇతని మరణకాలము రమారమి క్రీ. శ. ౫౭౧.

**అబ్దుల్లాకుతుబ్ శాహ** (౧౬౨౦-౧౬౭౪). గోలుకొండలోఁ ప్రభుత్వముచేసిన కుతుబ్ శాహవంశములోని ఆఱవ నవాబు. ఇతఁడు మహమ్మద్ కుతుబ్ శాహ తరువాత రాజ్యమునకువచ్చెను. మీర్ జుమ్లాఅనువానిని గుఱించి యీతనికిని ఢిల్లీశ్వరుఁడైన షాహజహాఁనకునువైరమువచ్చెను. అంత ఢిల్లీశ్వరుని కుమారుఁడైన ఔరంగజేబు గోలకొండ మీఁదికియుద్ధమునకుఁబోయిదానినివశపఱుచుకొనెను.అపుడు కుతుబ్ శాహ కోటియాపాయ

లిచ్చి సంధిచేసికొనెను. ఈతఁడు ౧౬౭౨ నలో మృతినొందెను. ఇతని తరువాత వీని మేనల్లుండగు అబుల్‌హాసన్ (తానీష) రాజ్యమునకు వచ్చెను.

**అబ్దుల్లాఖాఁ.** ఛంగీస్‌ఖానునివంశజుఁడైన సికందర్‌ఖానుని కుమారుఁడు. ఇతఁడు 'ఉజ్‌బెక్' అనువారికి నాయకుఁడు. తండ్రితోఁబోరాడెను. తండ్రిచనిపోయిన తరువాత ౧౫౮౩లో సమర్‌కంద్, బుఖారా రాజ్యములకు నధిపతియయ్యెను. ౧౫౮౮లో ఖురాసాఁ మీఁదికి దండెత్తిపోయి హీరాత్ పట్టణమునకు తొమ్మిదినెలలు ముట్టడివేసి దానిని వశపఱుచుకొనెను. అచ్చట నధికారిగానున్న ఆలీకులీఖానుని ఇతరులతోఁగూడ నరికివేసెను. ఇతఁడు పారసీకపురాజగు శాహ అబాసుతోడను, ఢిల్లీ చక్రవర్తియయిన అక్బరుతోడను సమకాలికుఁడు. ఇతఁడు ౧౫-వ సంవత్సరములు రాజ్యము చేసి ౧౫౯౭-లో మరణము నొందెను.

**అబ్దుల్లా ఖాఁ ఉస్‌బక్.** ఈతఁడు అక్బరు కాలములో ప్రఖ్యాతిగాంచిన యొకఉద్యోగి. చక్రవర్తి ఈతని మాల్వా దేశమునకు పాలకునిగ నొనర్చెను (౧౫౬౨). ఈతఁడు అక్బరుపై తిరుగుబాటుచేయుటచేత ఓడింపఁబడిఁ దేశమునువిడచి పరారి ఆయెను.

**అబ్దుల్లా యెల్ తెయిషియెస్ సయ్యద్.** (౧౮౩౦-౯౯). ఈయనను ఖలీఫాయందురు. మహమ్మదు అహమ్మదునకు పిమ్మట మహదీపదవి వహించెను (౧౮౮౫). ఇతఁడు బగ్గరతెగలోనివాఁడు. ౧౮౮౯-వ సంవత్సరమున అబీసీనియా చక్రవర్తియగు జానునోడించెను గాని ౧౮౯౩-వ సంవత్సరమున అగరుడోట్ అను ప్రదేశమున ఇటాలియనులచే తఱుమఁబడియెను. ౧౮౯౮-వ సంవత్సరమున కిచనరు ప్రభువుచేతను తరువాత ఓమ్ డెబ్రికాట్ అను ప్రదేశమున సర్-ఆర్, విన్‌గేటుగారిచేతను నోడింపఁబడి యా యుద్ధములోనే మరణము నొందెను.

**అబ్దుల్లాఖాఁ సయ్యద్.** ఇతనికి కుత్‌బుల్ ముల్క్ అను పదవి కలదు. ఇతఁడు ఢిల్లీ చక్రవర్తి అయిన బహదుర్‌షా కాలమున(౧౭౦౭-౧౭౧౨)అలహాబాదునకు గవర్నరుగ నియమింపఁబడెను. ఇతనితమ్ముఁడైన సయ్యద్‌హుసేన్ అల్లీ ఖానుఁడు బీహారునకు గవర్నరుగనుండెను. వీరు మతకర్తయైన 'మహమ్మదు' వంశము వారట! ఫరుక్‌సియర్ (౧౭౧౩-౧౭౧౯) అను ఢిల్లీ చక్రవర్తి వీరి సాహాయ్యముననే సింహాసనాసీనుఁడయ్యెను. అబ్దుల్లాఖానుఁడాతనికి ముఖ్యమంత్రియయ్యెను. ఆతనితమ్ముఁడు 'అమీర్ ఉల్

ఉమ్రా' అనుగొప్ప పదివిని (సేనాధిపత్యము) బొందెను. "అందుచే నీ సయ్యదు సోదరులిద్దఱును సర్వాధికారము కలవారలై పాదుషానుగూడ లక్ష్యముచేయరైరి. వారిని నాశముచేయవలెనని బాదుషా యత్నించెను కాని ఆతని యుపాయములన్నియు నాతని కేచెఱుపు చేసెను......వారి బాధతప్పించు కొనుటకై వారిలో నొక్కఁడగు హుసేన్ అల్లీయను వానిని దక్షిణదేశమునకు సుబేదారుగాఁబంపెను. కాని వాఁడచ్చట మరాటావారితో స్నేహము చేసి వారిసైన్యములను, బాలాజీ విశ్వనాథ అను పేష్వాను వెంటఁదీసికొని ఢిల్లీపట్టణము మీఁదికిఁ బోయి తన యధికారమును మరల స్థాపించెను (౧౭౧౭). ఇట్లు మరలఁ బూర్ణాధికారముకలవారలై యీ యన్నదమ్ములు ౧౭౧౯లో ఫరుక్ సియరును జంపించి యాఱు నెలలలో నిద్దఱు రాజపుత్రుల సింహాసనస్థులఁ జేసిరి. కాని వారేకారణమువలననో మృతులయిరి. తుదకు వీరు 'మహమ్మద్ షా' అను వానిని బాదుషాచేసిరి. కావున నీ సయ్యదు సోదరులకు 'రాజనిర్మాతలు' (King makers) అనిపేరు వచ్చెను."*

మహమ్మదుషా రాజయినతరువాత ఆతని ప్రేరణవలన ౧౭౨౦ లో హుసేన్ అల్లీ ఖాన్ చంపఁబడెను. అబ్దుల్లాఖానుఁడు తిరుగబడఁగా నాతనినోడించి చెఱఁబెట్టిరి. ఆతఁడచ్చటనే ౧౭౨౩ లో మృతుఁడయ్యెను.

* మహమ్మదీయ మహాయుగము. రెండవ కూర్పు. ౧౪౧.

## అబ్బయామాత్యుఁడు.

ఈతఁడు తెనుఁగున అనిరుద్ధచరిత్రము, కవిరాజమనోరంజనము అను రెండుకావ్యముల రచించెను.* ఈ రెండవ కావ్యమునకుఁ బురూరవశ్చరిత్రము అనినామాంతరము కలదు. ఈ రెండుకావ్యములందును కవి తనవంశమును వర్ణించియున్నాఁడు ఈతనిది కౌండిన్యగోత్రము. ఆపస్తంబసూత్రము. వీరాత్వేలనియోగులు. కవికి నాలవతరము పూర్వుఁడు బసవనమంత్రి. ఈతఁడు కొండవీటిరాజులయొద్ద మంత్రిగ నుండెను.† ఈతని పెద్దకుమారుఁడైన ముమ్మనమంత్రి సంతతివాఁడు మనకవి. ముమ్మన కుమారుఁడు నిమ్మయ్య, మనుమఁడబ్బయ్య. ఈతఁడు కొండవీటి నాయకుల చేమన్ననవడసెను.‡ ఈతఁడు మన కవికి తాత. అబ్బయ్యకుమారుఁడు రాయన్న. ఈనిధర్మపత్ని నరసమ్మ. వీరిద్దఱకు యోగానందుఁడు మనకవియైన అబ్బయామాత్యుఁడుపుట్టిరి.

కవివంశము

ఈకవి గుంటూరుమండల నివాసిగాఁ గాన్పించుచున్నాఁడు. వీరు కనుపర్తి గ్రామ

* అనిరుద్ధచరిత్రము చెన్నపట్టణమునందు వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండుసన్సువారిచేతను (౧౯౧౧) కవిరాజమనోరంజనము రాజమహేంద్రవరమునందు శ్రీ చింతామణి ముద్రాక్షరశాలాధికారులచేతను (౧౯౧౩) ప్రకటింపఁబడినవి. ఇవి మే ముపయోగించిన ప్రతులు.

† కవిరాజమనోరంజనము ౧. ౫౪.

‡ అనిరుద్ధచరిత్రము. ౧. ౧౯.

నివాసులగుటచే వీరికిఁ గనుపర్తి వారన్న యింటిపేరువచ్చెను. కనుపర్తి, బుక్కపురి యనుగ్రామములకరిణీకము వీరిదియైనట్లు ఈ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

దేశము

క. ఆమంత్రిమణి ప్రకాశన
భూమణి కనుపర్తిబుక్కపురి ముఖ్యమహా
గ్రామస్వామ్యానుభవ
గ్రామణిబుధనుతుల సుతులఁగాంచెనలువురన్.
[కవిరాజ. ౧. ౫౯

మంగళగిరి నృసింహస్వామి కవికి నిష్టదేవత. కనుపర్తిగ్రామము ఒంగోలుతాలూకాలోను, బుక్కపురి ఆత్మకూరుతాలూకా (నెల్లూరు జిల్లా) లోను, మంగళగిరి గుంటూరుతాలూకాలోను ఉన్నవి. కావునఁ గవి పూర్వపునెల్లూరు జిల్లాలోను, ఇప్పటిగుంటూరు జిల్లాలోను నివసించి యుండెనని చెప్పవచ్చును. నర్సారావుపేట తాలూకాలో కనుపర్రుగ్రామ మున్నది. దానికిఁ గరణములు కనుపర్తివారు. వీరీ కవియొక్క వంశజులని తెలియుచున్నది.

ఈకవికాలమును గుఱించి శ్రీవీరేశలింగముగారిట్లు వ్రాసియున్నారు. "అబ్బయామాత్యుఁడు పదునెనిమిదవశతాబ్దమధ్యమున నుండినవాఁడు. ఇతఁడు ౧౭౮౦-వ సంవత్సర ప్రాంతము వఱకును జీవించియుండవచ్చును." ఇది యూహ. ఈయూహకు వారు హేతువుల నిచ్చియుండలేదు. ఈతని గ్రంథములు రెండును

కాలము

దేవునకు నంకితములు చేయఁబడినందున నీ కవికాలమును నిశ్చయించుటకు నాకావ్యములలో దృఢమైన యాధారము లేవియుఁగానరావు. అయినను ఉన్నవానినిబట్టి కొంత యత్నింతము.

ఈకవిచే వ్రాయఁబడిన కవిరాజమనోరంజనము (పురూరవశ్చరిత్రము) వసుచరిత్రము ననుసరించి వ్రాయఁబడినది. అందలి పద్యములకుఁ బ్రతిబింబములనుటకు వీలుగల పెక్కు పద్యము లిందుఁగలవు. దీనికి మనవారు పిల్ల వసుచరిత్రమని పేరుపెట్టియున్నారు. కావున అబ్బయామాత్యుఁడు వసుచరిత్రకారుని తరువాత వాఁడు. అనఁగాఁ బదునాఱవశతాబ్దమునకుఁ దరువాతివాఁడని మనము నిశ్చయింపవచ్చును.

అనిరుద్ధచరిత్రమునందు (3-౧౯) ఈక్రింది సీసపాదము కాన్పించుచున్నది:—

పెంపుమీఱువసంత పేషువాహజురున
నుండి చెలావణి పహానరుదెలుప

ఇందలి 'పేషువా' పదము కాలనిర్ణయము నకుఁగొంతసహకారి. 'పేషువా' శబ్దమునకు ప్రధానుఁడనిసామాన్యయర్థమున్నను, పూనా పేషువాలకు నది విశేషబిరుదు. మూఁడవ పేషువాయైన బాలాజీబాజీరావు కాలము వఱకు పూనాపేషువాలఖ్యాతి దక్షిణదేశము నందుఁ బ్రసరించినదని చెప్పుటకు వీలులేదు. ఈతఁడు క్రీ. శ. ౧౭౪౦ లోఁ బేషువాయై, ౧౭౬౧లో మృతుఁడయెన్యు. కావున నీకవి

పదునెనిమిదవ శతాబ్ద మధ్యమునందుండెనని వీరేశలింగముగారు చేసినయూహ సరియైన దిగాఁ గాన్పించుచున్నది.

ఈతనిచే రచింపఁబడిన గ్రంథములలో అనిరుద్ధచరిత్రము మొదట వ్రాయఁబడినది. ఇందు

అనిరుద్ధచరిత్రము

నైదాశ్వాసములు కలవు. పద్యసంఖ్య ౬౧౯. శ్రీకృష్ణుని మనుమఁడైనయనిరుద్ధునకును బాణాసురునికూఁతురైన ఉషాకన్యకును జరిగిన వివాహకథ ముఖ్యముగ నిందువర్ణింపఁబడినది. ఉషాకల్యాణముకథ సంస్కృతములో భాగవతమునందును (౧౦ - వ స్కంధము) హరివంశమునందును (అ. ౧౧౬-౧౨౮) గలదు. ఈరెండు కథలు మొత్తముమీఁద నొక్కటియైనను వీనికిఁ గొంచెము భేదమున్నది. సంస్కృత భాగవతము ననుసరించి బమ్మెరపోతరాజు ఆంధ్రభాగవతముయొక్క దశమస్కంధములో నీకథ వ్రాసెను; హరివంశము ననుసరించి ఎఱ్ఱాప్రగడ తనచే రచింపఁబడిన హరివంశమందలి యుత్తరభాగమున సప్తమాష్టమాశ్వాసములందును, నాచనసోముఁడు తన యుత్తర హరివంశమునఁ బంచమాశ్వాసమునందును వ్రాసియున్నారు. కైపమాయన యనుకవి ఉషాకల్యాణమను కావ్యమొకటి యైదాశ్వాసములు కలది రచించినాఁడు.*

అబ్బయామాత్యుఁడు శ్రీమద్భాగవతమందలి కథననుసరించి యీ యనిరుద్ధచరిత్రమును వ్రాసెను. వర్ణనములు మొదలైనవితప్ప

కథాసంగ్రహము

మూలకథలో నేమాత్రము మార్పులను ఈకవిచేసియుండలేదు. అనిరుద్ధచరిత్రమని పేరుపెట్టినందునఁ గవి మొదటి యాశ్వాసమునందు, అనిరుద్ధునకును రుక్మియొక్క పౌత్రియైన రుక్మలోచనకును జరిగిన వివాహమును వర్ణించినాఁడు. రెండవ యాశ్వాసమునందు బాణాసురుఁడు శివునివలన వరంబుఁబడయుటయు, ఉష స్వప్నముం గాంచుటయు, చిత్రరేఖ యఖిలరాజవరుల పటములవ్రాసి యుష కుఁజూపనామె అనిరుద్ధుని గుర్తించుటయు నను కథాభాగము కలదు. ఉషయొక్క విరహతాపమును, చిత్రరేఖవెళ్లి యెవరికిఁ దెలియకుండ ద్వారకనుండి యనిరుద్ధునిఁ దీసికొనివచ్చుటయు, ఉషానిరుద్ధుల సమాగమంబును, బాణుఁ డనిరుద్ధునిఁ జెఱఁబెట్టుటయు తృతీయాశ్వాసమున వర్ణితములు. చతుర్థాశ్వాసమునందు యాదవులకును బాణునకును జరిగినయుద్ధము వర్ణింపఁబడినది. అయిదవ యాశ్వాసమునందు బాణుఁడోడుటయు కృష్ణుఁడు వానిని గరుణించుటయు, ఉషానిరుద్ధుల వివాహమును, దంపతులతో యాదవులు ద్వారకకుఁబోవుటయు, అనిరుద్ధునకు వజ్రుఁడను పుత్త్రుఁడు పుట్టుటయు ఆతఁడు రాజసూయాది యజ్ఞముల జేయుటయు, ప్రజారంజకంబుగ రాజ్యంబు నేలుటయు నను కథ కలదు.

---

* ఉషాకథననుసరించి యిటీవలివారు పెక్కుమంది నాటకములను రచించియున్నారు. వారినామము లిచ్చట నుదాహరించుచున్నాము. వేదము వేంకటరాయశాస్త్రి (చెన్నపట్టణము), శా. వీరమల్లయ్య (ఏలూరు), గరిమెళ్ల వెంకటరామమూర్తి (లుక్లాము, చికాకోలు), ద్వివేదిబ్రహ్మానందశాస్త్రి, భోగరాజు నారాయణమూర్తి (బరంపురము), ఆనందకవి రాజారామ్ (చెన్నపట్టణము), నాగినేని వెంకటప్ప (అమృతనబ్రోలు), కూరపాటి కోటంరాజు (బెల్లంకొండవారి పాలెం).

ఇది అబ్బయామాత్యునిచే రచింపఁబడిన రెండవకావ్యము. ఇందు నైదాశ్వాసములును ౧౧౬౦ పద్యములునుకలవు. చంద్రుఁడు బృహస్పతి యొద్దఁ జదువుకొని తారను లేవఁ దీసినది మొదలు, పురూరవుఁడు ఊర్వశినికూడి సంతానము వడయువఱకును గలకథ యిందు వర్ణితము.

కవిరాజమనోరంజనము కావ్యమునకు నాధారము

ఈ ఊర్వశి పురూరవులకథ మొదటఋగ్వేదము నందుఁగలదు (౧౦-౯౫). బృహద్దేవత యందును (౭.౧౪౦-౧౪౭), శతపథబ్రాహ్మణమునందును (౫.౧-౨), విష్ణుపురాణము నందును (౪ - ౬), దేవీభాగవతమందును (౧-౧౩), హరివంశము నందును (౧౦.౨౬), మత్స్యపురాణము నందును(౨౪), కథాసరిత్సాగరము నందును(3.౪-3౦), ఈకథకలదు.

ఈకథయంతయు శ్రీమద్భాగవతమునందుఁ జక్కఁగవర్ణింపఁబడినది. సంస్కృతభాగవతమున నవమస్కంధమందలి ౧-వ అధ్యాయము నందు నిలాకన్య చరిత్రమును, ౧౪-న అధ్యాయమునందు చంద్రతారల చరిత్రయు,ఊర్వశి పురూరవుల చరిత్రయుఁగలవు. ఇవియుఁగాక బ్రహ్మపురాణము, పద్మపురాణము, స్కన్దపురాణము (కాశీఖండము) మొదలయిన పురాణములలోఁ జంద్రవంశ వర్ణనమువచ్చిన చోటనెల్ల సంగ్రహముగనో, విస్తరముగనో యీ కథ వర్ణింపఁబడినది. విక్రమోర్వశీయమనునాటకమునందుఁ గాళిదాసుఁ డీ కథాభాగమునే మిగుల మనోహరముగఁ జిత్రించి యున్నాఁడు. పురూరవునకే విక్రముఁడని నామాంతరము. తెనుఁగున బమ్మెరపోతరాజు భాగవతమునందు ౯-వ స్కంధమున ఈ కథాభాగమంతయుఁ జక్కఁగ భాషాంతరీకరించి యున్నాఁడు. ఈస్కంధమునందు రెండుతావులఁ గల యీకథను తీసికొని యబ్బయామాత్యుఁడు పురూరవశ్చరిత్రము రచించినట్లు కానవచ్చుచున్నది. కాళిదాసుని నాటకమును ఈకవిచూచినట్టు లేదు. భాగవతములోనికథను ఈకవి మార్చలేదు. ఊర్వశి పటమును వ్రాయించి పురూరవునియొద్దకుఁబంపుటయనునది (౫-ఆ. ౯-3౪) కవి క్రొత్తగఁ గల్పించినది. కావ్యము వర్ణనలతోఁ బెంచఁబడినది.

ప్రతిష్ఠానపురమునందుఁ బురూరవుఁడు రాజ్యము చేయుచుండఁగా నొకదినము నారదుఁడువచ్చి, రాజధర్మములును, వేదాంతమును రాజునకుబోధించి యింద్రలోకమునకుఁ బోయెను.

కథాభాగము

అచ్చట నింద్రుఁడడుగఁగాఁ బురూరవుని చరిత్ర చెప్పఁదొడఁగెను (ఆ. ౧). చంద్రుఁడు బృహస్పతియింట విద్యాభ్యాసముచేసి గురుభార్యయైన తారను లేవఁదీసి బుధుఁడను కుమారునిఁ గాంచెను.* వైవస్వతమనువు పుత్రునకై యజ్ఞముచేసెను. కాని యాతని భార్య పుత్రిక కావలయునని కోరినందున ఇలయను కన్యక పుట్టెను. తండ్రికిఁ గన్యయందు నిష్టములేనందునగురువగు

* చంద్రతారలప్రేమతో సంబంధించిన కథ శ్రీనాథుఁడు కాశీఖండము (౪-వ ఆశ్వాసము) నందును శేషము వెంకటపతిచే రచింపఁబడిన తారాశశాంకము నందును వర్ణింపఁబడినది.

వశిష్టుఁడు నారాయణుని వేడి ఇలాకన్యను సుద్యుమ్నుఁడన్న పురుషునిగ మార్పించెను. సుద్యుమ్నుఁ డొకనాఁడు వేటకుఁబోయి, కుమారవనముఁ బ్రవేశింప మరల ఇలాకన్యగమారి బుధునితోఁ బొందుచేసి పురూరవునిఁ గనియె. అంత శివుని యనుగ్రహంబున ఇల యొకనెల పురుషుఁడుగను, ఒకనెల స్త్రీగను ఉండునట్లు వరము వడసి పుత్రునితో తన రాజధానికిఁ బోయి (ఆ.౨) కొన్నాళ్లు రాజ్యము చేసి, పురూరవునకుఁబట్టము కట్టియరణ్యమునకుఁ బోయెను. పురూరవుఁడు దిగ్విజయయాత్ర వెడలి యన్ని దేశముల జయించెను. నారదుఁడిట్లు పురూరవుని వర్ణింపఁగా విని ఊర్వశియను నప్సర యాతనియందు బద్ధానురాగయయ్యెను. విరహతాప మధికమయ్యెను (ఆ.3). అప్పుడే మిత్రావరుణఋషుల ఘోరమైన తపస్సును భంగము చేయుటకై యింద్రుఁ డూర్వశిని భూలోకమునకుఁ బంపెను. ఆమె వారితపస్సునకు విఘ్నము కావింప 'నీవు భూలోకమందు నుండెదవు. స్వర్గమునకుఁ బోవని శాపమిచ్చిరి. పురూరవుండు గంగకువెళ్లి మాఘస్నానము చేసెను. విష్ణుప్రత్యక్షుమై దివ్యస్త్రీలాభము కలుగునని వరమిచ్చెను (ఆ. ౪). ఇటు వింధ్యపర్వతమునందు పురూరవసమాగమం బెట్లుగలుగునని యోచించి యూర్వశి తన పటము వ్రాయించి రాజునకు నందునట్లు చేసెను. ఆపటముఁజూచి రాజు ఊర్వశియెడల ననురాగముగలవాఁడగును. ఇంతలో చారులువచ్చి వింధ్యప్రాంతమున నెవ్వరో స్త్రీలున్నారని చెప్పుదురు. పురూరవుఁడు వారి వెంటఁబోయి యూర్వశింగలిసికొని, రాజధానికిఁ దీసికొనివచ్చును. తాను పెంచిన పొట్టేళ్లను పిల్లలవలె రక్షింపవలెననియుఁ దనకు నెన్నఁడును వివస్త్రుఁడుగఁ గాన్పింపఁగూడదనియు నూర్వశి పురూరవుని నొప్పించును. వారు పెక్కుదినంబులు కేళీవిలాసములఁ గడుపుచుండిరి. ఒక్కనాఁడింద్రుండు ఊర్వశిని నెట్లయినఁ దెమ్మని గంధర్వులఁ బంపెను. వారు వచ్చి, ఊర్వశి పురూరవులు సురతశ్రమతోఁ బరున్న సమయమున పొట్టేళ్లను బాధించిరి. అవి యఱవఁగా నూర్వశితొందరచేయ పురూరవుఁడు తొందరపాటుతో వస్త్రములేకుండగనే లేచి గంధర్వుల నిర్జించి పొట్టేళ్ల రక్షించెను. కాని నగ్నుఁడుగాఁ గాన్పించి నందునఁ బ్రతిజ్ఞాభంగమని యూర్వశి వెడలిపోయెను. అంత రాజు మిగుల శోకింప నూర్వశి మరలఁ గానుపించి గర్భవతినైయి, మరలవచ్చెదనని వెళ్లి ఆయువను కుమారుఁ గనియె. సంవత్సరమునకువచ్చి రాజునకుఁ గాన్పించి 'గంధర్వులయాజ్ఞ లేనిది నేను నీకడనుండరాదు' అని చెప్పఁగా నాతఁడు గంధర్వులవేడెను. వారు ఊర్వశింబోలియున్న యగ్నిస్థాలియను స్త్రీని నిచ్చివెళ్లిరి. ఆమెయే యూర్వశియని కొన్నినాళ్లు గడపి పిదప మోసముఁ దెలిసికొని యామెను విడిచి రాజధానికిఁబోయెను. చివరకు త్రేతాయుగమునందు నాయగ్నిస్థాలితో త్రేతాగ్నులను వ్రేల్చి, అనేక యాగములుచేసిన, నింద్రాదులతనికిఁ బ్రసన్నులై యూర్వశి నిచ్చిరి. వారు సుఖంబుననుండి పెక్కుపుత్రులఁగని చంద్రవంశాభివృద్ధింజేసిరి (ఆ-౫).

అబ్బయామాత్యుఁడు ప్రౌఢకవి. పద్యములు శబ్దార్థాలంకారభూయిష్టములుగను, సంస్కృత పద సమాస జటిలములుగను ఉండును. వసుచరిత్రకారుని ననుసరింపవలయునని పాటుపడిన వారిలో నితఁడు ప్రముఖుఁడని చెప్పవలెను. అనిరుద్ధచరిత్రమునందేమి కవిరాజమనోరంజనము నందేమి వసుచరిత్రలోని పద్యములవంటి పద్యములు పెక్కులు గుప్పించినాఁడు. మొదట వ్రాసిన యనిరుద్ధచరిత్రమునకంటెఁ దరువాత వ్రాసిన కవిరాజమనోరంజనమెక్కుడు ప్రౌఢముగనుండును. కావున దీనికి మనవారు 'పిల్ల వసుచరిత్ర'మని పేరుపెట్టిరి. ముఖ్యముగ నిందలి వర్ణనాత్మక

సాధారణముగ కావ్యముల యోగ్యత

ములైనసీసపద్యములెన్నియో శైలియందును అర్థమునందును వసుచరిత్రమునందలి సీసపద్యములను బోలియున్నవి. అనిరుద్ధచరిత్రమునందును ఇట్టి సీసములు కొన్ని కలవు. కాని వసుచరిత్రముయొక్క యోగ్యత యీ గ్రంథముల కెన్నటికిని రాఁజాలదు. మూలమందలి పద్యములకును ఇందలి యనుసృతులకును పురుషునకు నాతనిపటమునకుఁ గల భేదమున్నదని చెప్పవచ్చును. మూలము మూలమే యనుసృతి యనుసృతియే. ఉదాహరణమునకై ఒకటి అనిరుద్ధచరిత్రమునుండియు, రెండవది పురూరవశ్చరిత్రమునుండియు, నిట్లు రెండు పద్యముల నిచ్చుచున్నాము :-

సీ. కొమ్మవాతెరతో గుణమ్ముఁగైకొనవచ్చి
కఠినవిద్రుమము చే కట్లఁబడియెఁ
గోమలియధరంబుతో మొనల్పచరించి
యరుచిబింబ ఫలమ్ము లవిసిపడియె
మృగనేత్ర పెదవితో సాగఁబూనఁగ డంగి
కెంపునీరసము జెక్కించుకొనియె
సతిమోవితో రస స్థితులుచూపి సుగంధ
వికలబంధూకమూరకయె విరిసె.

తే॥ డాయుపగడంబునకుఁ బగడంబు బింబ
మునకు బింబంబు మెఱయు కెంపునకుఁ గెంపు
బంధుజీవంబునకుఁ దానబంధుజీవ
మూర! యాసుందరదన రదాంశుకంబు!

[వసు. ౨.౪౫.

సీ. కట్టెఁడివగను శేకట్లకు లోనయ్యె
విరసభావంబులై విద్రుమములు
ప్రత్యహంబును గళా భంగమయ్యెను దామ
సప్రకాశతను నక్షత్రగణము
పగలుమించుట విదేశగతంబులయ్యె రా
జావమానమున రథాంగకులము
కాకదెచ్చుకతుది లోఁకువై పలుమాఱుఁ
బ్రహరణంబులఁ జెందెఁ బసిఁడికమ్మి
రమణియధరనఖ స్తనాంగములతోడి
ప్రాతిపక్షికమున నివిభంగపడియె
వట్టియాశ్వైరమున బలవంతుతోడి
సాటికిఁ బెనంగు పెల్ల నిష్ఫలము గాదె.

[అని. ౧-౭౯.

సీ. తరుణార్క కబళనోద్ధతిఁ జూపె నెవ్వాఁడు
రుచులచే ఫలమోహరుచులచేత
సకలంకరామముద్రికఁ బూనె నెవ్వాఁడు
శయముచే హృత్కుశేశయముచేత
మున్నీరుఁ బల్వలంబుగ దాఁటె నెవ్వాఁడు
జవముచే గుణగణార్ణవముచేత
నక్షశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాఁడు
రణముచే నియమ ధారణముచేత

తే॥ ధరణి నెవ్వాఁడు దానవద్విరద దళన
విహృతిఁ దనకేసరి కిశోరవృత్తిఁ దెలిపె
నతని మత్కావ్య భవ్యవాగమృతఘటన
మంజులస్వాంతు హనుమంతు మదిఁదలంతు॥

[వసు. ౧ ౭.

సీ. వాసుదేవఖ్యాతి వర్తిల్లె నెవ్వాఁడు
భవముచే మూర్తియై భవముచేత
నఖవిఖండనలీల నమరారె నెవ్వాఁడు
శక్తిచేఁ రణాంబు శక్తిచేత
గాళిందిఁ గదిసి వేడ్కలు సల్పెనెవ్వాఁడు
రతులచే వనకేళిరతులచేత
గీతామృతవ్యాప్తిఁ గీల్కొల్పెనెవ్వాఁడు
నయముచేఁ దత్త్వనిర్ణయముచేతఁ
దెలిపెనెవ్వాఁడు కంసమాంసలమతంగ
భూహననధాటిచేఁ దనపురుషసింహ
మూర్తి విస్ఫూర్తియసమానకీర్తి యతఁడు
సంహృతార్తార్తి యాభీర చక్రవర్తి.

[కవిరా. ౧-౪౨.

మూలముతోఁ బోల్చక విడిగఁజూచినయెడల నితని రెండుకావ్యములును కొంతయోగ్యత కలవి యని చెప్పవలెను. పూర్వకవులలో లేని క్రొత్తకల్పన లేమియు లేకపోయినను వర్ణనములువచ్చినచోటఁ గవి విస్తరముగను కొంత సరసముగను వర్ణించును. అనిరుద్ధచరిత్ర యందు ద్వారకాపురమునుఇరువదిరెండు పద్యములతోను (౧ ఆ. ౫౩-౭౩), పురూరవశ్చరిత్రమునందు ప్రతిష్ఠానపురమును ముప్పది మూఁడు పద్యములతోను (౧ఆ. ౫౩-౮౫) వర్ణించియున్నాఁడు. చిత్రరేఖ యందఱ పటములువ్రాసి వానిని వర్ణించుటలోఁ గవి ముప్పదిపద్యములు వ్రాసియున్నాఁడు (అని ౨ఆ. ౧౦౦-౧౩౦). అప్సరస్త్రీల యుద్యానవిహారము వర్ణించుటకునలుబదిపద్యములు పట్టినవి (కవి ౪ఆ. ౬౬-౧౦౫). ఇట్లే వేఱువేఱు ఋతువులును, ప్రసంగములును వివరముగ వర్ణింపఁబడినవి.

ఎఱ్ఱాప్రగడచే వ్రాయఁబడిన హరివంశమందలి యుషాకథతోఁడఁగాని, నాచనసోముని ఇందుధరోపాఖ్యానముతోఁడఁగాని ఈ కవి యొక్క యనిరుద్ధచరిత్రమును పోల్చుటకు వీలులేదు. ఎఱ్ఱాప్రగడ కవిత్వము మిక్కిలి ప్రౌఢముగ లేకపోయినను సులభ శైలిచేతను సహజశబ్దప్రవాహముచేతను, స్వాభావిక వర్ణనములచేతను హృదయాహ్లాదకరముగ నుండును. నాచనసోముని ప్రౌఢరచనా చమత్కారమును, అసమానమగు నర్థగౌరవరస భావప్రదర్శనమును వేఱుగఁ జెప్పనక్కరలేదు. బమ్మెరపోతరాజు కథనే భాగవతమున సంగ్రహముగ వ్రాసినాఁడు. వ్రాసినంతవఱకుఁ గథ రసములొల్కుచున్నది. దానితోను అనిరుద్ధచరిత్రము సరిపోదు. కావున నీకథానకము మీఁదనే కవిత్వముచెప్పిన మహాకవుల కావ్యముకంటె నీతనికవిత్వము తగ్గియుండునే కాని మించియుండదు. అంతమాత్రమున నీతని కవిత్వము మిక్కిలి నీరసమని చెప్పుటకు వీలు లేదు. ముఖ్యముగ రసికజనమనోరంజనము మహాకావ్యములలోఁ జేరినదనియే చెప్పవలెను. వర్ణనములలోఁ గవి పూర్వకవుల శబ్దార్థానుకరణము చాల భాగముచేసినను తన స్వంతకల్పనలుగూడనచ్చటచ్చటఁ జేర్చినాఁడు.

సంస్కృతపాండిత్యము

ఈకవిసంస్కృతమును జక్కఁగ నభ్యసించినట్లు ఆతనికావ్యములే చెప్పుచున్నవి. ఈతఁడు నైషధాది కావ్యములను జదివినట్లు మనముకొన్ని దృష్టాంతముల వలన నూహింప వచ్చును. శ్రీహర్షకృతనైషధమునందు నీక్రింది పద్యము కలదు:—

అయం దరిద్రోభవితేతి వైధసీం
లిపింలలాటేఽర్థిజనస్య జాగ్రతీం
మృషానచక్రేఽల్పితకల్పపాదపః
విధాయ దారిద్ర్యదరిద్రతాం నళః.*

[౧-౧౫.

---

*చ. ఇతఁడు దరిద్రుఁ డౌననుచు
నేర్పడ నర్థిలలాటపట్టికన్
శతధృతి వ్రాసినట్టి లిపి
జాల మనర్థముగాని యట్లుగా

దీనింజూచి యబ్బయామాత్యుఁడు కవిరాజమనోరంజనమునందు నీ క్రిందిపద్యము వ్రాసియున్నాఁడు:—

మ. అయమర్థీజనయంచు యాచకలలా
టాంతస్థలిన్ బ్రహ్మని
ర్ణయతన్ వ్రాయవహించునట్టి లిపియ
ర్థంబుల్ విశేషాన్వయ
క్రియగానర్థ మవారిగానొసఁగి య
ర్థింజేయు వాగీశ్వరాఁ
తయునాత్మీయవితీర్ణియు న్నిజముగా
ధాత్రీశు సేర్పట్టిదో!

[శృంగారనైషధము కవి. ౧-౯౭

ఈతని కావ్యమునందు సంస్కృత పదములే యెక్కుడైనను కవి యచ్చటచ్చట శుద్ధాంధ్ర పదములతోఁ గవిత్వము చెప్పియున్నాఁడు. ఉదాహరణము:—

సీ. పంటము న్నైదువు గంటలమొలనూలు
పడమటిదొరయేలు నిడుదప్రోలు
మీనైమెలంగుసామికిఁ జుట్టుకొల్లారు
రతసంపుసరకు తోరపుబిడారు
వేల్పుపాతరకత్తె బిడ్డనిచొరుబొక్క
కుండపుట్టుగుజోగి గొన్నకుక్క
కేలునిసిరికుబ్బరించు మోతలప్రోవు
తపసిరోసపుమంట దాఁచుతావు
బల్లిదపుపేటియిల్లాంద్రయల్లిబెల్లి
మేరదప్పక నిలిచిననీరువెల్లి
నిట్టనేకెడుదిబ్బరఁ జుట్టువారు
తీరుచెన్నారమున్నీరు తెలియఁగాంచి.

[కవిరా, ౪, ౬౩,

ఈకవి ప్రసంగానుసారము హిందుస్థానీ పదముల జమత్కారముగ నుపయోగించియున్నాఁడు.

సీ. జతనంబుతోఁదేటి న్నంచిచినీపాసముఖి
న్నీదుము దారుగా నిగుడినదువఁ
గలువలదొరచల్లగాలి వజీరులు
పూనిరాస్తాను చపానుగొలువఁ
బెంపుమీరువసంత పేషువాహుజూరున
నుండి చెలావణిపహారారు దెలుప
నెమ్మిఁగోవెలనిశా నీదారుగములుక
ర్నాచీడ మారమున్నాదు సేయ
సరణికావాలురంగు ఝుల్ఛాపుటమ్ములు
రహిగనటియించు చిలుక హి రాకినెక్కి
కెంజిగురుసైపుకేల నంకించుకొనుచు
మదను పాదుసహా దండుగదలెనపుడు

[అని, ౩,౫, ౧౯

తెలుఁగు కవులలో నీతఁడు ఆభ్యంతరరతిని విచ్చలవిడిగ వర్ణించి యున్నాఁడు. ఆభ్యంతర రతి యనఁగా స్త్రీపురుషుల సంభోగవర్ణనము.

ఒక విశేషము

పెద్దనాది ప్రబంధకవులిట్టి వర్ణనములు కావ్యములో నెక్కడనో యొకటి రెండు పద్యములతోఁజెప్పి దాటించుకొని పోయినారు. కాని యీకవి యిట్టి వర్ణనమొక్కచోటనున్న చాలదని కాఁబోలును తనకావ్యములలోఁ బెక్కుచోట్లఁ జొప్పించినాఁడు. అనిరుద్ధచరిత్రమునందు నాలుగు సారులును, కవిరాజ మనోరంజన

---

వితరణఖేలనావిభవ
విభ్రమ నిర్జిత కల్పభూరుహుం
డతఁడు దరిద్రతాగుణము
నందు దరిద్రునిఁజేయు నాతనిన్

[౧,౫౭.

మందు నైదు సారులును ఇట్టి వర్ణనములు కలవు! రుక్మలోచన వివాహమప్పుడొకసారి, ఉమకు స్వప్నము వడ్డప్పుడొక్కసారి, ఆమె సఖులతోఁ జెప్పుకొనునప్పుడొక్క సారి, నిజముగాఁ బతిని కలసినప్పుడొక్కసారి యిట్లు వీలయినచోట నెల్ల మన్మథరతిని వర్ణించినాఁడు. నాయికానాయకుల యొకదినము రతివర్ణించి, తృప్తినొందక 'మఱియొక్క నాఁడు.' (3-౯౯) అని ఉపోద్ఘాతము చెప్పి తిరిగి యాత్రియను పది పద్యములతోఁ జెప్పెను. ఇట్లే కవిరాజ మనోరంజనంబునందు బుధునకు నిలాకన్యకు, పురూరవునకు నూర్వశికిఁ జరిగిన సమాగమంబు చిన్నెవన్నెలతోఁ బెక్కుచోట్లఁ జిత్రించెను! ఇంతియగాదు. ఒకచోట 'సామాన్యరతి'యు (అని. 3 ఆ. ౭౫-౭౩) ఒకచోట 'సమరతి'యు (కవి. ౨ ఆ. ౧౭౨-౧౭౪), ఒకచోట 'ఉపరిరతి'యు (కవి. ౫ ఆ. ౨౪౩ - ౨౪౪), ఒకచోట 'గర్భిణీరతి జనితసౌఖ్యము'ను (అని 3 ఆ. ౧౦౨), ఒక చోట 'ప్రసవితానంతర ద్వితీయమాససమాగమాధిక్యసుఖము'ను (కవి. ౨ ఆ. ౧౯౧.), ఒకచోట 'సురతనాట్యసుఖము' (కవి. ౪ ఆ. ౧౩౯) ఇట్లు విచ్చలవిడిగ సురతవర్ణనములు గుప్పివేసినాడు!

ఇట్లీకవి రతివర్ణనము హెచ్చుగఁజేసినను సంస్కృత భూయిష్టముగఁ జెప్పియున్నాఁడు. అందువలన సామాన్యజనుల కాపద్యములు సాధారణముగ నర్థముకావు. అర్థమైనను కాక పోయినను ఇట్టి వర్ణనములను ఇంతవిశేషముగ జేయుట కావ్యముయొక్క మర్యాదకు లోపమనియే చెప్పవలెను. ఇచ్చట నీవర్ణనములు 'నీతి నతిక్రమించుచున్నవా? చట్టములకు లోఁబడునా?' యన్నప్రశ్నములను మేము విచారించుటలేదు. పూర్వకవియుఁ బదగుంభనము కలవాఁడును అగుటచే నాభయము మనకవికుండ దనుకొందము. కాని యిట్టివర్ణనములు కావ్యముయొక్క రసమాధుర్యమునకును, కల్పనాగాంభీర్యమునకు, భావసౌందర్యమునకును (Aesthetic beauty) తప్పక భంగము గలిగించుననుటకు సందేహము లేదు. నాయికానాయకులను ఒక్క చోటికిఁదెచ్చి యొక్కగదిలో విడిచినట్లు వర్ణించి యంతతో వర్ణనముచాలించి మిగిలిన భాగము చదువరుల యూహకువదలినఁ జాలదా? పచ్చిగఁ చెప్పినదానికంటె ధ్వనిమూలకముగఁ దోచునట్లుచేయుట ప్రతిభావిశేషముకాదా?

ఈకవి భగవద్భక్తుఁడుగాఁ గానవచ్చుచున్నాడు. తన రెండుకావ్యములును నరాంకితముచేయక దేవాంకితము చేయుటయే గాక యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

> క. భగవంతుని సద్గుణములు
> పొగడుటవివేకంబె తమకపూర్వైశ్వర్యం
> బగుట నరస్తుతిసేయరు
> జగతిన్ సత్కవులు తుచ్ఛసంపదకొఱకై.
> [అని. ౧-౧౭.

> క. ధాతలకుధాత భువన
> త్రాతలకున్ద్రాత శౌరితత్పుత్రుఁడట యా

దాతలదాతన్విడిచి యి
లాతల నేతల నుతించు లాఘవమేలా?
[కవి, ౧-౧౫

ఇట్టి భగవద్భక్తుఁడుగూడ సురతవర్ణనము లో నింత శ్రద్ధవహించుట మిక్కిలి యాశ్చర్యముగ నున్నది ! [కొ. ల.

**అబ్బాటె.** నికోలోడేల్ అబ్బాటియని యితని పూర్ణమైనపేరు (౧౫౧౨ - ౭౧). ఇతఁడు ఇటలీ దేశములోని మెదీనానగరమున జనించి కోరెజ్జియోకడ విద్యాభ్యాసముచేసి ప్రసిద్ధికివచ్చి చిత్రకారుఁడయ్యెను. ఫాంటెసీబ్లోమందిరము నలంకరించుటయందు ప్రైమాటిస్సియో యను వానికిఁ దోడ్పడియెను. ఇతఁడు అపోస్తలులయిన పీటరు, పాలు అను వారి చిత్తరువులను చిత్రించెను.

**అబ్బాడీ.** ౧. ఈతని పూర్ణమైన పేరు ఆంటోయనీథామ్సన్‌డి అబ్బాడీ (Antoine Thompson D' Abbadie; ౧౮౧౦-౯౭). ఇతఁడొక ఫ్రెంచిపండితుఁడును పరిశోధకుఁడునై యుండెను. ఇతఁడు డబ్లిన్‌నగరమున జనించినవాఁడయినను ఫ్రాన్సుదేశమునందే విద్య నభ్యసించెను.

౧౮౩౫ వ సంవత్సరమున ప్రకృతిశాస్త్ర పరిషత్సభ వారొక పనిమీఁద బ్రెజీలునకుఁ బంపిరి. ౧౮౩౭ మొదలుకొని ౧౮౪౮ వఱకు అబీసీనియాదేశమును బరిశోధించు పనిలో నుండెను. ఇతఁడు తరువాత ప్రకృతిశాస్త్ర పరిషత్సభలో సభ్యుఁడుగ నియమింపఁబడియె. ఇతఁడు కెల్విన్ ప్రభువుతోఁగూడ ఆరగో పతకమును బహుమానము నొందెను. సాలునకు ౮౦౦౦౦ ఫ్రాంకు లాదాయము వచ్చెడి అబ్బాడీయను జమీ, ఏబదిసంవత్సరములలో ౫౦౦౦౦౦ నక్షత్రములఁ జూచి వారు ప్రకటించు పద్ధతిమీఁద, ప్రకృతిశాస్త్ర పరిషత్తునకు మరణశాసనముద్వారా వశపఱిచెను. ఇతఁడు ౧౮౯౦ వ సంవత్సరమువఱకు భూగోళ ఖగోళశాస్త్రసంబంధములయిన పెక్కు గ్రంథములను రచించెను.

౨. (జేమ్సు అబ్బాడీ; James Abbadie). ఇతఁడు ౧౬౫౪-వ సంవత్సర ప్రాంతమున బేరాన్ మండలమున నేయనుగ్రామంబున జనించి ప్రఖ్యాతిగాంచిన ప్రొటస్టాంటు మతస్థుఁడు. ఇతని తల్లితండ్రులు మిక్కిలి బీదవారగుటచేత స్నేహితుల ప్రాపునఁజక్కని విద్య నభ్యసించెను. సేడన్‌పట్టణమున విద్య నభ్యసించి పదునేడవ యేటనే పరమార్థవిద్య (ఈశ్వరవిషయికవిద్య) యందు డాక్టరు పట్టమునొంది మిక్కిలి ఖ్యాతిగాంచెను. ఇతఁడు బర్లిన్ నగరమున కొన్ని సంవత్సరములు గడపిన తరువాత ఫ్రెంచి ప్రొటస్టాంటు చర్చిలో ప్రధాన మతబోధకుఁడుగ నుండి ౧౬౮౮-వ సంవత్సరములో మార్షల్‌స్కాంబర్గుతోఁ గూడ ఇంగ్లాండునకుఁబోయి లండనులోని శావాయ్‌ఫ్రెంచిచర్చిలో ప్రధానమతబోధకుఁడయ్యెను. విలియమ్ రాజునెడ మిక్కిలి ప్రేమానురాగములు గలవాఁ డగుటచేత ౧౬౮౮వ సంవత్సరమున సంభవించిన విప్లవ

ష్కువ హాస్యగాఁడు, సంవిధానమున కావ శ్యకుఁడు. ఈ విధూషకుని ఏకాంతమందు రాజునొద్ద నుండనిచ్చి, పిదప రాజునొద్దనుండి తొలఁగ నీయవలయు నని కవిప్రయత్న ముగఁ గానవచ్చుచున్నది. అందుకే రెండవ యంకమునందు రా జాతనిని రాజధానికిఁ బంపివేయును. అయిదవ యంకము నందు హంసపదికయొద్దకుఁ బంపివేయును.

ఈ నాటకమందలి హాస్యముఁ జూడవలె నన్న మాఢవ్యునిమాటలు విన్నఁ బ్రయో జనము లేదు. పంచమ షష్ఠాంకములకు నడుమనున్న బెస్తవాని సంబంధమైన ప్రవే శమును జూడవలెను.

ఈనాటకముమీఁది టీకాగ్రంథములు

ఈ నాటకముయొక్క యోగ్యతనుబట్టి యిందుపైఁ బెక్కు టీకా గ్రంథములు వ్రాయఁబడి నవి. మూలగ్రంథ మంత కఠినము కాదు గాన టీకాగ్రంథములతోఁ బండితులకు నంతగాఁ బ్రయోజనము లేక పోయినను, విద్యార్థులకు నివి బహు సహకా రులు. ఇదియుఁగాక వేఱువేఱు పాఠములను గనుఁగొనుటకును, ఏయే దేశమందు నేయే కాలమందుఁ బాఠము లెట్లెట్లు మాఱినవి తెలిసికొనుటకును ఈ టీకాగ్రంథములు ఉప యోగకరములు. శాకుంతల టీకాకారులలో నీక్రిందివారు పేర్కొనఁదగినవారు:—

అభిరామభట్టు, కాటయవేముఁడు, కృష్ణ నాథ పంచాననుఁడు, చంద్రశేఖరుఁడు, డమర వల్లభుఁడు, నారాయణరాఘవుఁడు, రామ భద్రుఁడు, శంకరుఁడు, శ్రీనివాసుఁడు, చంద్ర శేఖరుఁడు, ప్రకృతాచార్యుఁడు, ఘనశ్యా ముఁడు, ప్రేమచంద్రుఁడు.

వీరిలో అభిరామభట్టు, కాటయవేముఁడు, చంద్రశేఖరుఁడు, శంకరుఁడు అనువారు పురాతనులు. టీకాకారులలో కాటయ వేముఁడు, శ్రీనివాసుఁడు, ఆంధ్రులు.

కాటయవేమారెడ్డి, కొండవీటిరాజ్యము నేలిన ప్రోలయవేమారెడ్డికి(౧౩౨౪-౧౩౫౩) దౌహిత్రుఁడును, అనపోతారెడ్డికి (౧౩౫౩-౧౩౬౪) మేనల్లుఁడును, అల్లుఁడును, కుమా రగిరి రెడ్డికి (౧౩౮౩-౧౪౦౦) బావయు మంత్రియు నై యుండెను. కుమారగిరిరెడ్డి వలన రాజమహేంద్రవర రాజ్యము వడసెను. (Epi. Indica. IV. 318 తు త్తరమూడి శాస నము). ఈతఁడు క్రీ. శ. ౧౪౧౫ వఱకుఁ బ్రతికియుండిన నుండవచ్చును. ఈతఁడు శూరాగ్రేసరుఁడుగ నుండుటయేగాక పండి తుఁడై కాళిదాసరచితమైన శాకుంతల విక్ర మోర్వశీయ మాళవి కాగ్నిమిత్రములను నాటకత్రయముమీఁదఁ జక్కని టీకలు వ్రా సెను. ఈ టీకకు వసంతరాజీయ మని పేరు. ఈతని బావయు, యజమానుఁడును అగు కుమారగిరిరెడ్డికి వసంతరాజని మాఱుపేరు. ఆతఁడు వసంతరాజీయమన్న పేరిట ఒక నాట్య శాస్త్రమును రచించెను. ఆ నాట్యశాస్త్ర మును అనుసరించి కాటయవేమారెడ్డి వసంతరాజీయమను ఈ మూఁడుటీకలను వ్రాసెనఁట. ఆ టీకకుఁ బ్రారంభమందున్న శ్లోకములను ఈ క్రింద నిచ్చుచున్నా

రము. * కాటయ వేముని వ్యాఖ్యానము పెక్కు పండితులచే మిక్కిలి కొనియాడఁ బడినది. "ఈ టీకాగ్రంథమువలన నీగ్రంథకర్త పూర్ణపండితుఁడనియు, సమర్థుఁడైనవ్యాఖ్యాతయనియుఁ గానవచ్చును. ఈతఁడు శబ్దములయొక్క ధ్వన్యర్థమును కనుఁగొనుటలో సూక్ష్మదృష్టికలవాఁడు. కావ్యసౌందర్యమును జక్కఁగ జూడఁగల్గురసికుఁడు. నిస్సంశయముగ నీవ్యాఖ్యానముగొప్ప యోగ్యత గలది. అయిన నిందు స్వల్పవిషయములు వివరింపఁబడనందునఁ దరుణవిద్యార్థుల కంత యుపయోగకరము కాదు' అని యొకపండితుని యభిప్రాయము.** ఇట్టి యుత్తమ వ్యాఖ్యాన మింకను అచ్చుపడ లేదు!

ఆంధ్రుఁడైన మఱియొక్క టీకాకారుఁడు శ్రీనివాసుఁడు లేక శ్రీనివాసాచార్యుడు. ఈతఁడు ప్రతి యంకమునకుఁ జివర వ్రాసికొనిన" ఇతి శ్రీరమణ వేంకటాచలేశ్వర పాదారవింద సమారాధక వైఖానసకులతిలక శ్రీ కౌశిక గోత్ర శ్రీ తిరుమలాచార్య పుత్రేణ.....శ్రీనివాసాచార్యేణ విరచితాయాం శాకుంతలా వ్యాఖ్యాయాం...అంకః" గద్యమును చూడ నీతఁడు తిరుపతిలోని దేవర సన్నిధానమందున్న పూజారి యని తోఁచుచున్నది. ఈతని కాలము నిర్ణయించుటకు నాధార మేమియు లేదు.

**ఈ నాటకమునకుఁ దెనుఁగు భాషాంతరములు**

తెనుఁగునఁ బూర్వకవులు నాటకములు వ్రాయలేదు. నాటకమునందుఁ బాత్రలననుసరించి గ్రామ్యభాషను వ్యవహరింపవలసి వచ్చునని కాఁబోలును వారు నాటకములను తెలింగింపవలసి వచ్చినప్పుడు దృశ్యకావ్యములుగా మార్చక, శ్రావ్యప్రబంధములుగానే వ్రాయుచు వచ్చిరి. మంచనకవి మొదట పదునాల్గవ శతాబ్దమున విద్ధసాలభంజికయనుసంస్కృత నాటకమును కేయూరబాహు చరిత్రమను[1] కావ్యముగఁ దెలింగించెను. పదునైదవ శతాబ్దమువారగు నంది మల్లన ఘంట సింగన యనుకవులు కలిసి ప్రబోధ చంద్రోదయ మను సంస్కృతనాటకమును తెలుఁగుప్రబంధముగ మార్చిరి. ఇట్లే పదునాల్గవశతాబ్దాంతమువాఁడగు పిల్లలమఱ్ఱి పినవీరభద్ర కవి కాళిదాసునినాటకము ననుసరించి

---

* మునీనాంభరతాదీనాం భోజాదీనాంచ భూభృతాం।
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థ వేదినాం॥౧
ప్రోక్తంవసంతరాజేన కుమారగిరి భూభుజా ।
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమం॥
తత్రోక్తైనైవ మార్గేణ దర్శితా శేషలక్షణః ।
కవీనామాశ్రయోమంత్రీ కాటభూపతనూభవః॥ 3
సోయంవేమవిభుః కుమారగిరిణా రాజ్ఞానియుక్తఃకృతీ ।
నాట్యానాంత్రితయంకృతం కృతధియా శ్రీకాళిదాసేన తస్యోదీర్ణరసార్ణవస్యరసికశ్లాఘ్యం కుంతలాదేస్స్వయం[యత్
వ్యాఖ్యానంకురుతేకుమారగిరిరాజీయాఖ్యమస్మైహితం॥

** "The commentary indicates that the author was a sound scholar and able expositor. He penetrates into the suggested sense of the word and seems naturally able to appreciate beauty in poetry. The Commentary is undoubtedly of a high order, but does not explain minor points and is not therefore fully serviceable to young students" *Patankar's Abhijnana Sakuntalam.*

శృంగారశాకుంతల మను నామాంతరము గల శకుంతలాపరిణయము [1] రచించెను అది మూఁడాశ్వాసముల గ్రంథము. ఇతఁడు గాక, కృష్ణకవి యొక శకుంతలాపరిణయమును, పిండిప్రోలు లక్ష్మణకవి మఱియొక దానిని, పెద్దాడ నాగయామాత్యుఁ డింకొక దానిని రేవుణూరి వేంకటార్యుఁడు మఱియొక దానిని, వ్రాసిరి. కృష్ణకవి నెల్లూరిమండలమువాఁడు. ఈగ్రంథము చిఱుమామిళ్ల పాపయ్య యను కమ్మనాయని ప్రేరణమువలన రచియింపఁబడినది. ఇందు శాకుంతలములోని పెక్కు పద్యములు చక్కఁగ భాషాంతరీకరింపఁబడినవి. పిండిప్రోలు లక్ష్మణకవి గోదావరీమండలమున గుమ్మెటిగ్రామ నివాసి. నాగరాజు గోదావరీమండలమందలి వీరవాసర వాస్తవ్యుఁడు. ఇందు భారతకథ యెక్కువగ ననుసరింపఁబడినది. ఈముగ్గురు కవులును ఇంచుమించుగా పదునెనిమిదవ శతాబ్దమువారు. ౧౮౯౦ సంవత్సరమున నూజివీడు విద్వాంసు లగు విద్వాన్ మాడభూషి వేంకటాచార్యులవారు "భరతాభ్యుదయ" మను కావ్యమును రచించిరి. ఇయ్యది కాళిదాసునినాటకము ననుసరించి వ్రాయఁబడిన ప్రౌఢ ప్రబంధము. ఈకావ్యములు కాళిదాసుని నాటకమునకు భాషాంతరములని చెప్పుటకు వీలు లేకపోయినను శాకుంతలకథను అనుసరించి యాంధ్రమున వ్రాయఁబడినకావ్యము లని చెప్పవచ్చును.

1 ఈగ్రంథము కాకినాడలోని సరస్వతీ పత్రికయందుఁ బ్రకటింపఁబడినది.

సంస్కృతనాటకములను తెనుఁగులో నాటకములుగ భాషాంతరీకరించు పద్ధ పందొమ్మిదవశతాబ్దాంతమునందుఁ బ్రార భమైనది. శాకుంతలమునకుఁ దెనుఁగున వచ్చ పడినట్టిభాషాంతరములు పెక్కులుకలవు. కా క్రమముగఁ జూచిన, మొదట భాషాంత రించినవారు శ్రీ వీరేశలింగము కవిగా (క్రీ. శ. ౧౮౮౩). తరువాత శ్రీ రాయ దుర్గము నరసయ్యశాస్త్రిగారు తెనిఁగించి (౧౮౯౪). మూఁడవది శ్రీ వేంకటరాయ శాస్త్రిగారి భాషాంతరము (౧౮౯౬). తరు వాత శ్రీ దాసుశ్రీరాములుగారు అచ్చతెను గున వ్రాసిరి (౧౮౯౭). అచ్చతెనుఁగున వ్రాయఁబడిన నాటక మిదియొక్కటియేయ తోఁచుచున్నది. పిదప శ్రీవడ్డాది సుబ్బ రాయుఁడుగా రొక భాషాంతరమును ప్ర టించిరి (౧౯౦౬).

ఈగ్రంథకారులందఱును మాకు సమకా లీను లగుటచే నీ భాషాంతరముల యోగ్య తాయోగ్యతలనుగుఱించి చర్చించుట సము జసముకాదు. కావున నాపసమాని శాకుంత లమందలి శ్లోకచతుష్టయమునకు వీరందఱును చేసిన తెలుఁగుపద్యములను ఉదాహరించి యీ భాషాంతరముల హెచ్చుతగ్గులు నిర్ణ యించుకొను భారము చదువరులమీఁదనే మోపెదము.

[కొ. ల.

శ్లోకచతుష్టయము. *

౧. యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా
కంఠః స్తంభితబాష్పవృత్తికలుషశ్చింతాజడం దర్శనమ్।
వైక్లవ్యం మమ తావదీదృశమహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖైర్నవైః.

కం. వీరేశలింగము గారు.

ఉ. కొందలమందె డెందము శకుంతల తా నిపుడేగునంచయో!
క్రందుగ బాష్పరోధమునఁ గంఠమునుం జెడె దృష్టిమాంద్యముం
బొందె; నొకింత పెంచినతపోధనులే యిటుకుంద నెంతగాఁ,
గుందుదురో తమంతఁ గనుకూఁతులఁ బాయుగృహస్థు లక్కటా!

రా. నరసయ్యశాస్త్రి గారు.

ఉ. నెమ్మన ముత్తలమ్ముగను నేఁడుశకుంతల యేగునంచు బా
ష్పమ్ముల యాఁకచేనెలుఁగు పర్వకరాల్పడుఁ జింతఁజూడ్కిమాం
ద్యమ్మునఁబొందు నెమ్మిని వనస్థుఁడనేయిటుకుందుదుం గటా!
యెమ్మెయిఁ గ్రొత్తయుమ్మలిక యేఁచునొ కూఁతులు వాయుగేస్తులన్.

వేదము వేంకటరాయశాస్త్రి గారు.

ఉ. కుందుజనించె నేఁగెడు శకుంతలయిప్పుడె యంచు బాష్పపుం
గ్రందు నడంప లోనెలుఁగు గాడ్పడెఁ, జింతకుఁ జూపుమాన్పడెన్;
వందురనిట్లు ప్రేమవనవాసినె నేదముఁ బాసి క్రొత్తగా
నందనలేగ నావగ మనంబున నెట్లుగృహస్థు లోర్తురో!

దాసు శ్రీరాములు గారు.

ఉ. గుండెలు జల్దరించెడి శకుంతలయేగెడిఁ గ్రుక్కమ్రింగి గొం,
తెండినమాట బొంగురగు, నేడువనేడువఁ జూపుమాన్పడెన్,
దండిగఁ గానకాపునయి దగ్గఱదీసిన నాదుపాట్లె యి
ట్లుండఁగఁ గన్న గేస్తులకెటో తొలుసారిగ బిడ్డ నంపుచోన్॥

వడ్డాది సుబ్బారాయుడు గారు.

చ. హృదయము బెంగఁగొంచునిపుడేగ శకుంతలయంచునెట్లు గ
ద్గదమగు బాష్పమాఁచుకొన; దర్శనముం జెడెఁజింతఁ; గానలో,
బ్రదికెడునాకె యింతవగ పాటిలఁ గూరిమిఁ, గన్నకూఁతులన్,
వదలుటనావినూతనపు వంత గృహస్థుల నెంతయేఁచునో!

* అభిజ్ఞానశాకుంతలమునఁ జతుర్థాంకమందు శ్లోకచతుష్టయ మెద్దియన్న విషయమునఁ బండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. ఆంధ్రదేశమునందు సాధారణముగ వాడుకలోనున్న నాలుగుశ్లోకములను మే మిచ్చట నుదాహరించి యున్నారము.

౧. పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాఽపి భవతాం స్నేహేన యా పల్లవమ్.
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతామ్.

కం. వీరేశలింగము గారు.

చ. ఎవతె జలంబు మీకిడక యెన్నఁడుఁ ద్రాగదు తాను ముందుగా
నెవరితె ప్రేమచేఁ జిదుమ దీప్సితభూషణయయ్యు మీ చిగు
ళ్లెనతెకు మీరు తొల్త నన లెత్తుట పండువుగాఁగ నుండు నా
ప్రవిమలగాత్రి యేఁగుఁ బతిపజ్జకు నంద అనుజ్ఞయీయరే!

రా. నరసయ్యశాస్త్రి గారు.

గా. తొలుతం ద్రావఁగ నెవ్వతపూనదు తోయముమీరలు గొనకున్నం
జెలిమిం బ్రియమండనయయ్యును మీచివురుల నెవత గ్రహింపదు మీ
తొలునన కాలు నిజోత్సవముగ సంతోసిలు నెవ్వత యట్టి శకుం
తల ప్రాణేశ్వరుపాలికిఁ జనుఁగాన న్వీడ్కొలుపరె మీరెల్లన్.

వేదము వేంకటరాయశాస్త్రి గారు.

ఉ. త్రాగదెవర్తె డస్సినదె త్రావకయుండ జలంబు మీరు మున్,
దాఁ గయిసేఁతకే నెవతె దాఁకద క్కూరిమి మీ ప్రవాళమున్,
సాగును బండువెవ్వతెకుఁ జయ్యన మీతొలుపూవుపూతచే,
నేఁగెడు నా శకుంతల యిదే మగనింటికి వీడుకొల్పరే.

దాసు శ్రీరాములు గారు.

చ. మొనయదు మీరు ద్రాగుటకు ముందర నీళులు ద్రావ గైకొనం
జనుమను మీననన్ నెనరుతో నగలాస నటారియైనదా
నొనరుచు పబ్బపబ్బముగ నోపిక మీతొలుపూఁతకాఁ టిదే
చను మగనింటికిన్ సెల వొసంగుఁడు మీరు శకుంతలమ్మకున్.

వడ్డాది సుబ్బారాయుడు గారు.

ఉ. పోయక మీకునీ రెవతె పూనదొ ముందుగఁ ద్రోవ, దేనికా
నో మొదయుమ్మదాద్య కుసుమోదయవేళను బండువేదితాఁ
గోయదొ మీయిగుర్న గను గోరియుఁగూరిమి, భర్తయింటికిన్
బోయెడు నా శకుంతల; యనుంగున కింద అనుజ్ఞయీయరే.

3. అస్మాన్ సాధు విచింత్య సంయమధనానుచ్చైః కులం చాత్మన
స్త్వయ్యస్యాః కథమప్యబాంధవకృతాం స్నేహప్రవృత్తిం చ తాం।
సామాన్యప్రతిపత్తిపూర్వకమియం దారేషు దృశ్యా త్వయా
భాగ్యాయత్తమతః పరం న ఖలు తద్వాచ్యం వధూబంధుభిః॥

కం. వీరేశలింగము గారు.

ఉ. మమ్ములఁ దపోధనుల, మాన్యభవ త్కులమున్, స్వబంధులన్
సమ్మతి వేడ కీమె యెటులో సల్పిన నీపయి కూర్మి, నెంచి మా
కొమ్మను నేలుకొమ్ము సరికొమ్మలతో సమ గౌరవంబునన్;
బిమ్మటి దెల్లభాగ్య మగుఁ, జేర్కొనరా దది యింతిబంధువుల్.

రా. సరసయ్యశాస్త్రి గారు.

ఉ. మమ్ముఁ దపోధనోజ్జ్వలుల మానితమౌ స్వకులంబు నెట్టి చం
దమ్మననో యబాంధవకృతం బయి నీ దెస నొప్పుదీని నె
య్యమ్ముఁ దలంచి దీని సతులందు సమప్రతిపత్తిఁ జూడు మిఁ
కిమ్మగు నెల్ల భాగ్యమది యింతుల బంధులు సెప్పవచ్చునే?

వేదము వేంకటరాయశాస్త్రి గారు.

ఉ. పోలఁగ నెంచు మమ్ములఁ దపోధను ల, న్నిజసత్కులంబు, నీ
బాలిక యెట్లొ నీపయి నబంధుకృతంబుగఁ గొన్న యాతమిన్;
బాలన సేయు బాల నిజ భామలలో సరిప్రేమ; నాపయిన్
మేలగు నెల్ల భాగ్యము; జనీ స్వజనం బది వేఁడఁ బాడియే?

దాసు శ్రీరాములు గారు.

చ. తలఁపులు చిక్కఁబట్టు జడదాలుపులన్ మముఁ బారఁజూచి, మీ
కొలమున గొప్పనెంచి, నినుఁ గుట్టుగ నెట్టులొ కట్టుకొన్న యీ
చెలిమినిఁ గాచి, నీదు పెరచేడెల నెక్కువగం దలంచు మా
చెలి, నిఁక నాడుబందుగులు చెప్పరు; తక్కిన నెగ్గునోము దే.

వడ్డాది సుబ్బరాయుఁడు గారు.

కవిరాజ. తలఁచి తపోధనులన్ మము లెస్సగఁ, దావకమైన మహాకులమున్,
నెలఁత కబంధుకృతంబుగ నెట్టులొ నీయెడఁ గల్గిన యీ చెలిమిన్
సలుపుము నీవు సమప్రతిపత్తిని జాయలలోపల దీనికి; న
వ్వలిది యదృష్ట వశం బది బాలిక బంధులు నాకొనరాని దగున్.

ర. శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాపి రోషణతయా మా స్మ ప్రతీపం గమః।
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యేష్వనుత్సేకినీ
యాంత్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః.

కం. వీరేశలింగము గారు.

చ. గురులకు సేవఁజేయు మనుఁగుంగతిఁ జూడుము నీ సపత్నులన్;
వరుఁ డలుక న్వహించినను భర్తృవిరుద్ధవు గాకు మీసునన్;
పరిజనులందుఁ జూపుము కృపం గడుఁ; బొందకు భాగ్యగర్వమున్;
తిరిగిన నిట్లు, కాంతురు సతీత్వము కాంతలు; నింద్య లొందు చోన్.

రా. నరసయ్యశాస్త్రి గారు.

చ. గురువులఁ గొల్వవమ్మ సరికొమ్మలఁ జెల్మిని జూడవమ్మ మిం
చి రమణుఁ డేమి విప్రియము సేసిన నల్క నెదుర్పకమ్మ బ
ల్కరుణ మెలంగవమ్మ బలగంబు దెస న్సిరినుబ్బకమ్మ దా
ల్తురు గృహిణీపదం బిటు సతు ల్మఱి వామలు వంశపాంసనల్.

వేదము వేంకటరాయశాస్త్రి గారు.

చ. గురువులఁ గొల్వుభక్తిఁ, జెలికూటమిగాఁ గనుమీ సపత్నులన్,
వరుఁడు శఠించినం గినుక వట్టి కువాడము సల్ప కెప్పుడున్,
బరిజనము న్దయ న్మనుపు, భాగ్యములైనను బొంగ, కింతు లీ
నెరవునఁ గాంతురమ్మ గృహిణీపదముం; గుటిల ల్కులవ్యథల్.

దాసు శ్రీరాములు గారు.

చ. కొలువుము పెద్దలన్ సవతికొమ్మల నీ చెలికత్తె లట్లుగాఁ
దలపుము పెన్మిటెంత బెడిదంబుగ నల్గిన మాఱుపల్క కి
మ్ముల బలగంబుపై నెనరు పూనుము గల్మికి నుబ్బఁబోకు మి
ట్లలరిన గేస్తురాల్ నలుగు కానన్ఁ దక్కిన నింటిచేటగున్.

వడ్డాది సుబ్బారాయుడు గారు.

చ. పని విని కొల్వు పెద్దల; సపత్నులచోటఁ బ్రియాళివృత్తిఁ గై
కొను; పతియల్గనల్గి ప్రతికూలవుగాకుము; భోగభాగ్యముల్
గనుఁగొని పొంగఁబోకు; దయ గల్గుము సేవకులందు; నాతి గాం
చును గృహిణీపదం బిటులె; చూడఁగ లోతి కులాధి యేసుమీ.

**అభిధ.** ఆలంకారికుల మతమున సంకేతితార్థమును బోధచేయునట్టిదియు, శబ్దమునందుండునదియు నగు (శబ్దనిష్ఠ) నొకశక్తి (వృత్తి). వీరిమతమున పదమునకు వాచ్య, లక్ష్య,వ్యంగ్యములను మూఁడర్థములుండును. వానిలో ముఖ్యమైనదియు, సాక్షాత్ సంకేతిత మైనదియు నగు నర్థము వాచ్యమనునది. అనఁగా సాధారణముగ లోకములోనేపదమే యర్థమందు వాడఁబడుచున్నదో యది యా పదమునకు వాచ్యార్థము (కావ్యప్రకాశము. ద్వితీయోల్లాసము). ఇట్టి ముఖ్యార్థమును స్ఫురింపఁజేయునట్టి వ్యాపారమునకు అభిధ యనిపేరు. దీనిని కావ్యప్రకాశకారుఁడు వ్యాపారమనెను, సాహిత్యదర్పణకారుఁడు శక్తియనెను, ప్రతాపరుద్రీయకారుఁడు వృత్తియనెను. ఇతనిమతమునశబ్దవృత్తులు మూఁడు; అభిధా, లక్షణా, వ్యంజన, లనునవి. సంకేతితార్థగోచరమైన శబ్దవ్యాపార మభిధ యనఁబడును. అది రెండువిధములు; రూఢిపూర్వక, యోగపూర్వక. భువనము అనునది మొదటి దానికిని, వసుమతీ రత్నగర్భ యనునవి రెండవదానికిని ఉదాహరణములు (కావ్యప్రకరణము).

భాట్టమతమున అభిధ యనఁగ ఫలమును పుట్టించునట్టి వాచకశబ్దగతవ్యాపారము. దీనికే భావన యని పేరు. ఇది యొక వేఱు పదార్థమని వారి యభిప్రాయము. దాని జ్ఞానమునకే ప్రవర్తకశక్తి కలదు. దానియందే భావనాత్మరూపమున విధిశక్తి యుండును.

[వాచస్పత్యము.]

**అభిధర్మకోశవ్యాఖ్య.** అభిధర్మకోశమని వసుబంధునిచే రచియింపఁబడిన సంస్కృతకోశ మొకటి యుండెను. అది యిప్పు డెచ్చటను కానరాదు. దానిపై వ్రాయఁబడిన వ్యాఖ్యలుమాత్రము చీనా, టిబేట్ దేశములందు కానవచ్చుచున్నవి. దీనికి చైనీస్, టిబిట్ భాషాంతరీకరణము లిప్పటికిని గలవు. ఇందు బౌద్ధమత సంబంధము లయిన విషయము లన్నియు జర్చింపఁబడి యుండెను.

**అభిధమ్మము (అభిధర్మము).** బౌద్ధుల వేదములకు త్రిపిటకములని పేరు. వీనిలో అభిధమ్మమను నది మూఁడవ పిటకము. ఇయ్యది సప్తప్రకరణంబులుగా విభజింపఁబడినది. ఈ గ్రంథము క్రీ. పూ. ౪౦౦ మొదలు ౨౫౦ నఱకు జరిగిన కాలమునందు వ్రాయఁబడియెనని విద్వాంసుల యభిప్రాయము. ఇందలి మొదటి ప్రకరణము మొదట వ్రాయఁబడె ననియు,మూఁడవ ప్రకరణము చివర వ్రాయఁబడెననియు,నూహింపఁబడుచున్నది. ఈ గ్రంథమునందలి బోధలన్నియు స్వయముగా బుద్ధునిచేఁ జెప్పఁబడియెనని బౌద్ధుల యభిప్రాయము. బౌద్ధమతమునకు సంబంధించిన నైతిక తత్త్వములన్నియు నిందు వివరముగఁ జర్చింపఁబడినవి. మొదటి ప్రకరణమునందు ధర్మముల పట్టికయు (ధమ్మసంగని), రెండవ ప్రకరణమునందు ధర్మనిరూపణమును (విభంగ), మూఁడవ ప్రకరణమునందు మతములకు మూలాధార

ములను (కథావత్థు), నాల్గవ ప్రకరణము నందు వ్యక్తివిశేషములను (పుగ్గలపన్నత్తి), అయిదవ ప్రకరణమునందు చిన్న చిన్న నైతిక ప్రకృతులకుఁగల సంబంధమును (ధాతు కథా), ఆఱవ ప్రకరణమునందు నైతిక యమకమును (యమక), నేడవ ప్రకరణము నందు నైతిక స్థితియొక్క యభివృద్ధియు (పత్తాన) వర్ణింపఁబడి యున్నవి. ఈ గ్రంథ మంతయు పాలీభాషలో వ్రాయఁబడి యున్నది. సర్వాస్తివాదులనువారు బౌద్ధులలో నొక తెగవారు. వారి సిద్ధాంతములకు ననుకూలముగా మఱియొక అభిధమ్మమును నిర్మించుకొనిరి. హిందూదేశమునందు ఈ భాగము నశించినది. కాని చీనాదేశమునందు దీని భాషాంతరము కలదు.

**అభిధానచింతామణి.** హేమ చంద్రరచితమైన కోశము. ఇందు జైన సిద్ధాంతములు చక్కఁగ వివరింపఁబడినవి.

**అభిధాననిఘంటువు.** హేమ చంద్రకృతమైన శబ్దకోశము.

**అభినయము.** నటుఁడు తన హృద్గత క్రోధాదిభావములను శరీరాది చేష్టలవలన వ్యక్తీకరించుట అభినయము. రామయుధిష్ఠి రాదుల యవస్థలను రంగాది సాహాయ్యము చే జూపుట యభినయముయొక్క ప్రయోజనము. అభినయమునకు ననుకరణ మావశ్యకము. లోకమునందుఁ దండ్రి తన కుమారుని ముద్దాడుట అభినయ మనిపించి కొనదు. పితాపుత్రులు కాని వారు వారి వేష ములు వేసికొని, యందుఁ దండ్రి వేషము వేసికొనినవాఁడు కొడుకు వేషము వేసికొ[ని]న వానిని ముద్దాడిన నది యభినయ మగు[ను]. భరతముని ప్రణీత నాట్యశాస్త్రమత[ము]న అభినయము నాలుగువిధములు, ౧. ఆం[గి]కము, ౨. వాచికము, 3. ఆహార్యము. [౪.] సాత్వికము (౮-౯). ఇక వీనినిగుఱి[చి] కొంచెము కొంచెము విచారింతము.

ఆంగికము

నేత్రముఖహస్త పాదాదికముల వ్యా[పా]రమువలన మనో వ్యా[పా]రములఁ దెలియఁజేయు[ట] ఆంగికాభినయము. లోకమునందు జను[లు] కోపము వచ్చినప్పు డొకవిధముగను, ప్రే[మ] యధికమైనపు డొకవిధముగను, విషాద[ము] కలిగినపుడొకవిధముగను ముఖవికాసము[ను] హస్తపాద విక్షేపములను జేయుట మన[ము] చూచుచున్నారము. ఒకనిని బహిరింద్రి[య] వ్యాపారమునుబట్టి యతని మనోవ్యాపా[ర]మును మనము కనుఁగొనఁ గలము. లో[క]మందలి యీ శారీరక వ్యాపారము[లను] నటులు చక్కఁగ ననుకరణముఁ జేసినఁగా[ని] ప్రేక్షకులకు నానందము కలుగనేరదు. ఇం[త] యకాదు, ఈయంగ వ్యాపారములు లో[క]ము ననుసరించి బాలురకు, తరుణులకు, వృద్ధులకు, గొప్పవారికి, భృత్యులకు వే[ఱు] వేఱుగ నుండవలెను. గంభీరుఁడైన నాయ[]కుఁడు దుఃఖసమయమున బాలునివలె భో[రు]రుమని యేడ్చినఁ బాగుండునా! ఒకపు[రు]షుఁడే యొక్కభావమునే భిన్న భిన్న వ్యక్తు[లు] [illegible] జూపుచునపుడు భిన్నాభినయము[లు]

జూపవలయును. ఒకానొక పురుషుఁడు ప్రేయసినిఁ బ్రేమించునప్పుడును, సోదరినిఁ బ్రేమించునప్పుడును, పుత్రునిఁ బ్రేమించునప్పుడును, ఒక్కవిధమైన యభినయమే చూపుటకు వీలు లేదుగద!

నాటకమునందు ఆంగికాభినయ ప్రాధాన్యముఁ జూపుటకు రెండు ఉదాహరణములఁ జూపెదను. శాకుంతల నాటక ప్రథమాంకమందలి యీ క్రిందిభాగము చూడుఁడు:—

శకున్తలా:— (శృంగార లజ్జాంరూపయతి)

సఖ్యౌ:— (ఉభయోరాకారం విదిత్వా, జనాంతికం) హలా! శకుంతలే! యద్యత్రాద్య తాతః సన్నిహితో భవేత్.

శకుంతలా:— (సరోషం) తతఃకింభవేత్.

సఖ్యౌ:— ఇమం జీవిత సర్వ స్వేనాప్యతిథి విశేషం కృతార్థం కరిష్యతి *

ఇచ్చట శకుంతల కూర్చుండియున్నది. మాటలాడుట లేదు. కాని యామె అనురాగ వ్యంజకములగు "ఉర్వీలేఖన, చింతన, ముఖావనమన, నఖకర్తన, వస్త్రాంగుళీభుక స్పర్శాది" కములయిన యంగ చేష్టలవలన శృంగారలజ్జను అభినయించి నందున సఖుల కామెభావము తెలిసెను. అట్లే నాయికా నాయకుల యాకారమునఁగా పరస్పర స్నిగ్ధావలోకనమువలన వారి భావమును సఖులెఱింగిరి. కావున దుష్యంత శకుంతల వేషములను వేసికొనినవారు, వారిభావము ప్రేక్షకులకుఁ దెలియునట్లు అభినయింపవలెను. లేనియెడల నీభాగము ప్రేక్షకులకు రమ్యముగ నుండదు.

శాకుంతలమునందలి యింకొక ప్రసంగము చూడుఁడు:—

శకుంతల:— అనసూయే! అభినవకుశసూచ్యా పరిక్షతం మే చరణం కురబకశాఖా పరి లగ్నంచ వల్కలం। తావత్పరి పాలయతం మాం యావదేనత్ మోచయామి * (రాజాన మవలోకయంతీ సవ్యాజం విలంబ్య సహసఖీభ్యాం నిష్క్రాంతా).

ఇచ్చట శకుంతల, కాలికి దర్భాంకురము గ్రుచ్చుకొనె ననియు, పయ్యెద చెట్టు కొమ్మకుఁ బట్టుకొనె ననియు, సాకులు కల్పించుకొని కొంతకాలయాపనముచేసి యితరులకుఁ దెలియనట్లుగ రాజును జూచును. పైనిచూపిన యభినయమున కంటె నిది మెక్కుడు కష్టము. ఇచ్చట కాలికి దర్భ గ్రుచ్చుకొనినట్లును కొంగు చెట్టుకుఁ బట్టుకొనినట్లును అభినయము చేయుటయేగాక యా చేష్ట

* చదువరుల సౌకర్యార్థమై ప్రాకృతమీయక, సంస్కృత ఛాయయే యీయఁబడినది. అర్థము:—

శకుంతల:— (శృంగారలజ్జ నభినయించుచున్నది).

సఖులు:— (ఇరువురి యాకారమునుంగని, జనాంతికము) సఖీ శకుంతలా, నాయన యిపు డిచట నుండిన?

శకుంతల:— (రోషముతో) ఉండిననేమి?

సఖులు:— జీవిత సర్వస్వమేని యిచ్చి యీ యతిథిని కృతార్థునిఁ జేయుదురు.

[వే. వేం. గారి భాషాంతరీకరణము]

* కొన్ని దాక్షిణాత్య పాఠములలో నీవాక్యము లేదు. అర్థము:— శకుంతల - అనసూయ! సూదివంటి క్రొత్త దర్భపుడక నాపాదమునం గ్రుచ్చుకొన్నది. నాచీర కురువక వృక్షముయొక్క కొమ్మం జిక్కుకొన్నది. దీనిం దీసికొనువఱకు నిలిచి నన్ను వెంటఁ గొనిపొండు. (అని మిష పెట్టి రాజుం జూచుచు నాలస్యముచేసి సఖులతో వెడలిపోవుచున్నది) కం.వీ.

లన్నియు రాజును జూచుటకై కల్పింపఁబడిన వ్యాజములు (సాకులు) అని ప్రేక్షకులకు నభినయమువలననే బోధపడునట్లు నటింపవలెను. ఇది యభినయములోని యభినయము.

ఉత్తర రామచరితమందలి యీక్రింది ప్రసంగము చూడుఁడు:—

సీతా:— ఏతేఖలు తత్కాలకృత గోదాన మంగలా శ్చత్వారో భ్రాతరః । వివాహదీక్షితా యూయమ్ । అహోజానామి తస్మిన్నేవ ప్రదేశే తస్మిన్నేవకాలే వర్తే।

* * * *

లక్ష్మణః:— !ఇయమార్యా । ఇయమప్యార్యా మాండవీ । ఇయంవధూః శ్రుతకీర్తిః ।

సీతా:— వత్స, ఇయమప్యపరా కా ?

లక్ష్మణః:— (సలజ్జాస్మితమ్ । అపవార్య స్వగతమ్) అయే ఊర్మిళాం పృచ్ఛత్యార్యా । భవతు । అన్యతః సంచారయామి (ప్రకాశం) ఆర్యే దృశ్యతాం ద్రష్టవ్యమేతత్ । అయంచ భగవాన్ భార్గవః *

* సీత - నిజముగా వీరప్పుడే గోదాన మంగల కార్యమును నెరవేర్చిన నలుగు రన్నదమ్ములు. మీరు వివాహదీక్షను గైకొనినవారు. ఆహా! ఆ ప్రదేశమునందే యాకాలమునందె నేనిప్పు డున్నట్లున్నది.

* * * *

లక్ష్మణుఁడు:— ఈమె వదినెగారు. ఈమె మాండవీ వదినెగారు. ఈమె మఱఁదలు శ్రుతకీర్తి.

సీత:— వత్సా! ఇది గోయింకొకతె యున్నదే ఈమె యెవరు?

లక్ష్మణుఁడు:— (సిగ్గుపడి, నవ్వుచు, మొగము త్రిప్పి, తనలో) - ఆహా! మా వదినెగారు నన్ను ఊర్మిళనుగుఱించి యడుగుచున్నారు. సరే. మంచిది. ఆమెను ఇంకొకవైపునకు ద్రిప్పెదను. (ప్రకాశముగ) ఇదుగో మీరు చూడఁదగినది చూడుఁడు, ఇతఁడు భగవంతుండగు భార్గవుఁడు.

ఇచ్చట లక్ష్మణుఁడు తమ నల్గురి యన్నదమ్ముల వివాహకాలపుఁ బటముఁజూపుచు సీత, మాండవి, శ్రుతకీర్తులఁ బటముఁ జూపి పేర్కొనెను. తన భార్యయైన ఊర్మిళ పటమును సిగ్గుచేఁ జూపక యూరకుండెను. అంత సీత ఊర్మిళపటముఁ జూపి లక్ష్మణునకు 'ఇదుగో యిచ్చట నింకొక యామె యున్నదే, ఈమె యెవరు?' అని యడిగెను. అంత లక్ష్మణుఁడు 'వదినెగారు ఊర్మిళను గుఱించి యడుగుచున్నా'రని మనసులో నను కొని ముసిముసి నవ్వులు నవ్వి యామాట తప్పించి వివాహకథలోని తరువాతి భాగము పరశురామ గర్వభంగ ప్రకరణమునకు బోవును. ఇచ్చట కేరడమాడి నప్పటి సీత ముఖవికాసమును, లక్ష్మణుని మనోభావముఁ దెల్పు ముసిముసి నగవులును నటుడు చూపలేక పోయినయెడల నీకథాభాగమందలి స్వారస్య మంతయు వ్యర్థమగు నదియు, నట్టి యభినయములేని నాటక ప్రదర్శనము రసములేని పిప్పివంటి దనియుఁ జెప్ప వలసి యున్నది.

ఈ యాంగికాభినయమును నాట్యశాస్త్రకారు లనేకవిధములుగ విభజించి యున్నారు. ఆంగికాభినయము మూఁడువిధములు: శారీరము, ముఖజము, చేష్టాకృతము. మొగము గాక శరీరముయొక్క యితరభాగములవలన గానవచ్చునది శారీరము, ముఖభాగము వలనఁ గానవచ్చునది ముఖజము, క్రియా విశేషములచే గానవచ్చునది చేష్టాకృతము

ఇందు ముఖరాగాన్వితము శ్రేష్ఠమైన దని చెప్పఁబడినది :—

* శాఖాంగోపాంగ సంయుక్తః
కృతో ఽప్యభి నయ స్త్వయం ।
ముఖరాగవిహీనస్తు
నైవ శోభాన్వితో భవేత్ ॥
శారీరాభినయో ఽల్పో ఽపి ముఖరాగ సమన్వితః।
ద్విగుణాం లభతే శోభాం రాత్రా విన దివాకరః॥
నయనాభి నయో ఽపిస్యా న్నానాభావ రసస్ఫుటః।
ముఖరాగాన్వితో యస్మా న్నాట్యమత్ర ప్రతిష్ఠితః॥

మనస్సునందలి భావములు మారిన కొలఁదిని ముఖముమీఁది వికారములు (రాగములు, రంగులు) మారుచుండవలెను. ముఖము హృదయ ప్రతిబింబమును జూపు అద్దము. హృద్గతభావములు ముఖము మీఁదఁ జూపఁ గల్గిన నటుఁ డతి శ్రేష్ఠుఁడు. మనస్సునందలి భావములు మారినకొలఁదిని యొక్క క్షణములో ముఖరాగములు మార్చవలసి యుండును. ఇందుకు మన నాటకములలో నుండి రెండు ఉదాహరణములు తీసి కొందము.

౧. శాకుంతల నాటకమునందలి పంచ మాంకమున, శకుంతల రాజునొద్దకు వచ్చి నిరాకరింపఁబడిన ప్రకరణమునందు, ఆమె మనస్సులోఁ గ్రమముగ ఆతురతయు, (రాజు తనను గౌరవించునో గౌరవింపఁడో యన్న శంకయు) నిరాశయు, కోపమును, దుఃఖమును, అను మనోవికారములు కథా సందర్భమునుబట్టి యుత్పన్న మగును. ఆమె ముఖముమీఁదఁగూడ నీభావముల ప్రతిబింబములు ప్రేక్షకులకుఁ గానరావలయును. అట్లు చూపలేని నటుఁడు శకుంతల వేషము వేసికొనినయెడల నాటకముయొక్క మూఁడు వంతుల శోభ తగ్గుననియే చెప్పవలెను.

౨. ఉత్తరరామచరిత మందలి మూఁడవ యంకమును విశేషముగ నిందున గుఱించి గమనింపవలయును. అందు రామునకుఁ గాన రాకుండ సీత యాతని యాలాపములను వినుచుండును. అతఁడు మూర్ఛపోయినపు డాతనిని ఆతనికిఁ గానుపింపకుండ ముట్టు కొనును. ఈయొక్కరంగమందు నామె మనస్సులో నెన్నియోభావము లుదయించును. ఈ క్రింది సందర్భముఁ జూడుఁడు :—

సీతా:— అహో ఉద్భ్రాంతాస్మి.

*   *   *   *

సీతా:— బహుమానితాస్మి పూర్వ విరహే। నిరవధి రితి హా హతాస్మి।

*   *   *   *

సీతా:— (సోద్వేగం తమసామాశ్లిష్య) హా భగవతి తమసే, గచ్ఛతీదానీ మార్యపుత్రః కింకరోమి.

*   *   *   *

రామః:— అస్తిచేదానీ మశ్వమేధ సహధర్మ చారిణీ మే.

---

* అంగోపాంగములతోఁ గూడుకొనియున్న శాఖా(ఆంగికా)భినయము చక్కఁగఁ బ్రదర్శింపఁబడినను ముఖరాగము లేనిది శోభింపదు. శారీరాభినయము కొద్దిగా నున్నప్పటికిని ముఖరాగముచేఁ గనఁబడు ముఖాభినయ మున్నయెడల, రాత్రిపూటఁ జంద్రునివలె రెట్టింపు శోభ కలుగును. నేత్రాభినయము ముఖరాగముతోఁ గూడుకొనినయెడల నన్ని భావములను, రసములను అది స్పష్టపఱుపఁగలదు. కావుననే నాట్యము దీనియందు నిల్పఁబడినది. (నాట్యమునకు నిది మూలాధార మని భావము). [భరతాచార్య కృతనాట్య శాస్త్రమ్ - బొంబాయి నిర్ణయసాగరప్రతి.అ. ౮. శ్లో. ౧౪౮-౧౫౧.]

సీతా:—(సాక్షేపమ్) ఆర్యపుత్ర! కా?

వాసంతీ:—పరిణీత మపి కిం

రామః:—నహి నహి హిరణ్మయీ సీతా ప్రతికృతిః

సీతా:—(స్వోచ్ఛ్వాసాస్రమ్) ఆర్యపుత్ర! ఇదానీ మసి త్వం। అహో ఉత్ఖాతిత మిదానీం మే పరిత్యాగ శల్య మార్యపుత్రేణ.

* * * *

తమసా (సస్మిత స్నేహార్ద్రం పరిష్వజ్య) అయి వత్సే ఏవమాత్మా స్తూయతే।

సీతా:—(సలజ్జం) పరిహసితాస్మి భగవత్యా *

---

* సీత:—అయ్యయో! పిచ్చిదాననైతిని.

* * * *

సీత:—పూర్వ విరహమున గౌరవింపఁ బడితిని. ఇప్పటి విరహము, నిరవధిక మనినతోడనే నాప్రాణము లెగిరి పోయెను.

* * * *

సీత:—(దిగులుతో గట్టిగ తమసను బట్టుకొని) ఓభగవతి తమసా! నాప్రాణేశ్వరులు వెళ్లెద రటమ్మా. ఏమి చేసెదను?

రాముఁడు:—అయినను, అశ్వమేధ క్రతువులో నాకు సహధర్మచారిణి యున్నది గదా.

సీత:—(ఉత్తలపాటుతో) ప్రాణేశ్వరా! ఆమె యెవరు?

వాసంతి:—వివాహము కూడఁ జేసికొంటిరా యేమి?

రాముఁడు:—లేదు. లేదు. బంగారముతోఁ జేయఁబడిన సీతాప్రతిమ.

సీత:—(నిట్టూర్పు విడిచి, కన్నీటితో)—ప్రాణేశ్వరా! మీ కిప్పుడు నామీఁదఁ దొల్లిఁటి యనురాగము పోలేదు గదా! నిశ్చయముగా నాహృదయములోనుండి మీ యంతట మీరే పరిత్యాగ లజ్జాశల్యమును పెకలించితిరి.

* * * *

తమస:—(స్నేహాశ్రువులు రాల నవ్వుచుఁ గౌఁగిలించుకొని) కుమారీ! ఇది యాత్మస్తుతి కాదే?

సీత:—(సిగ్గుదోఁపఁ గ్రిందుచూచుచు స్వగతముగా) భగవతి తమసి నన్నుఁ బరిహాసము చేయుచున్నది గదా! [వా.వా.]

ఒకస్త్రీకి తనభర్త యింకొకస్త్రీని వివాహము చేసికొనెనేమోయన్న సంశయము వచ్చినప్పు డామె ముఖముమీఁద నుండు వికారమును, ఇం[illegible]కస్త్రీని చేసికొనలేదు తనయందుఁగల ప్రేమచేఁ దన బంగారు ప్రతిమనే చూచి సంతోషించు చున్నాఁడని విన్నతరువాత నామె ముఖముమీఁదఁ గల బహు వికారమును అభినయింపలేని నటుఁడు నటుఁడే కాఁడని చెప్పవలెను.

ముఖరాగము స్వాభావికము, ప్రసన్నము, రక్తము, శ్యామములని నాలుగువిధములు (౮-౧౪౫). మధ్యస్థాదిభావ నిరూపణమునకు స్వాభావికమును, అద్భుతహాస్య శృంగారములకు ప్రసన్నమును, వీరరౌద్ర కరుణమదాదికములకు రక్తమును, భయానక బీభత్సములకు శ్యామమును, అగు ముఖరాగమును ఉపయోగింపవలయు నని భరతాచార్యుల యభిప్రాయము(౮;-౧౪౬-౮)

ఆంగికాభినయము మరల రెండువిధములుగ విభజింపఁబడినది. అంగికాభినయము ఉపాంగికాభినయము. శిరస్సు, హస్తములు, ఉరము, పార్శ్వము (ప్రక్కలు), కటి (నడుము), పాదములు అనునవి షడంగములు. నేత్రములు, భ్రూవు (కనుబొమ) నాస, అధరము (పెదవి), కపోలము (చెక్కిళ్లు), చిబుకము (గడ్డము) అనునవి ఉపాంగములు. ప్రత్యంగములని యాజ్ఞ కలవు; బాహువులు, వీపు, కడుపు తొడలు పిక్కలు. కొందఱు మణికట్లు మోకాళ్లు మోచేతులుకూడ ప్రత్యంగములని చెప్పిరి.

ఈప్రకార మంగము లన్నియు విభజించి యొక్కొక యంగముయొక్క చలనభేదము లను నాట్యగ్రంథకారులును, అభినయ గ్రంథ కారులును, విశేషముగ వర్ణించి, యున్నారు. అవి యసంఖ్యములు. హస్తభేదములుమూఁడు వందలకు హెచ్చుగ నున్నవి. వాని నన్ని టిని నిచ్చట నుదాహరించుట యనావ శ్యకము. దిక్ప్రదర్శనముగఁ గొన్నింటినిఁ జెప్పెద.

చేతివ్రేళ్ల నన్నిటిని చాచి అంగుష్ఠము మిగిలిన నాల్గువ్రేళ్లను తాకునట్లు నుంచిన యెడల నది పతాకహస్త మనిపించుకొనును. పతాకహస్తమందలి యనామికను వంచిన త్రిపతాక హస్తమగును. పతాకహస్త మందలి యనామికకనిష్ఠికలవంచిన అర్ధపతాక హస్తమగును. కొన్ని హస్తముల ప్రతిమ లీ ప్రక్క పుటయందుఁ జూపఁబడినవి. అందు వలన వాని లక్షణములు తెలియఁగలవు. ఏ యే హస్తము లే యే ప్రసంగము లప్పు డుపయోగింపవలసినదియు నాట్యశాస్త్రము నఁ జెప్పఁబడినది. ఆవాహనము, అవతరణము, విసర్జనము, ధారణము, ప్రవేశము, ఉన్నా మనము, ప్రణామము, మొదలయిన ప్రసం గములందు త్రిపతాకహస్తమును ఉపయో గింపవలెను. ఈలాగుననే నేత్రాదికముల కును నియమములు గలవు. నటుఁడీనియమ ముల నన్నిటిని నేర్చుకొనుట మంచిదియే కాని, యిట్టి నియమముల ప్రకారమభి నయము చేయఁబోయిన నది యొకానొక ప్పుడు కృత్రిమాభినయ మగునె గాని స్వా భావికముగ నుండదు. నటునకుఁ బ్రపంచ జ్ఞాన ముండి లోకవ్యవహారము ననుసరించి యభినయము చేసిన నది ప్రేక్షక మనోరంజ నము చేయునే కాని కృత్రిమాభినయము చేయఁజాలదు. కావుననే భరతాచార్యుల వారు అభినయవిశేషములను చెప్పి చెప్పి చివ రకు నిట్లు వ్రాసిరి:—

యానిశాస్త్రాణి యే ధర్మాయాని శిల్పాని యాః క్రియాః।
లోకధర్మ ప్రవృత్తానినాట్యమి త్యభిసంజ్ఞితమ్॥ ౧౨౮
నచ శక్యం హి లోకస్యస్థావరస్య చరస్యచ
శాస్త్రేణ నియతం కర్తుం నానా చేష్టావిధిం ప్రతి॥౧౨౯
నానా శీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితం।
తస్మాల్లోకప్రమాణంహిజ్ఞేయంనాట్యంప్రయోక్తృభిః॥*

(౨౬ వ అధ్యాయము.)

రవివర్మాది చిత్రకారులచేఁ జిత్రింపఁ బడిన రాధామాధవాది పటములవల్లను, ఇటీవల వాడఁబడుచున్న బైస్కోపు పట ములవల్లను, అభినయము కొంతవఱకు నేర్చు కొనవచ్చును. కాని నిజమైన యభినయమును నేర్చుకొనవలె నన్న లోకమందలి ప్రజల యాచరణమునుచూచియే నేర్చుకొనవలెను. ప్రేమ హెచ్చుగ నున్నప్పుడు తల్లి తన చంటి బిడ్డ నెట్లు ముద్దాడునో, శోక విషాద

---

* ఏశాస్త్రములు, ఏధర్మములు, ఏశిల్పములు, ఏక్రియలు లోకధర్మమును అనుసరించి యుండునో దానిని నాట్యమందురు ౧౨౮. స్థావర జంగమాత్మకమైన లోకముయొక్క చేష్టావిధుల నన్నిటిని శాస్త్రముచే నరికట్టుట సాధ్యము కాదు ౧౨౯. ప్రకృతులు పెక్కు శీలములు కలవి, శీలమునందే నాట్యము నిల్చియున్నది. కావున, నాట్యమునకు లోకమే ప్రమాణమని నాటక ములఁ బ్రదర్శించువారు తెలిసికొనవలెను. ౧౩౦.

# అభినయము.

(కొన్ని హస్తములు)


పతాక


త్రిపతాక


అర్ధపతాక


కర్తరీముఖ


మయూ


అర్ధచంద్ర


అరాళ


శుకతుండ


హంసపక్షు


ముష్టి


చతుర


లాంగూల


[illegible]


సింహాముఖ


భ్రమర

సంతాప సమయములలో ముఖవికాసము లెట్లుమారునో తెలిసికొనవలయునన్న యట్టి ప్రసంగములు లోకమునందుఁ జూచి తీరవలయును. ఎన్ని పటములఁజూచిన నేమి? కావున నాటకాభినయములో నటునకు, నేర్చిన విద్య కంటె లోకానుభవమే యెక్కుడు ఉపయోగకారి యగును.

నటుఁడు శరీరాభినయము వలనఁ దన భావములను తెల్పుటగాక వాక్కువలనను తెలుపును. ధ్వనిభేదముచేతను, కాకుభేదముచేతను, విరామభేదముచేతను, ఒక్కవాక్యమునకే వేఱువేఱు తాత్పర్యము లేర్పడును. కావునఁ బాత్రమునకుఁ దగినట్లును, ప్రసంగమునకుఁ దగినట్లును, మాటలాడవలయును. ఉపన్యాసములఁ జేయు వక్తలకును, ఈ అభినయ మావశ్యకము. నాటకము లోకవ్యవహార ప్రతిబింబము గనుక, పాత్రములనుబట్టి వారి భాషయు మాఱుచుండవలె నని సంస్కృత నాట్యశాస్త్రకారుల మతము. ఈ విషయమై 'నాటక' శబ్దముక్రింద నెక్కుడుగా వివరింపఁబడును. కాని యిచ్చట నొక విశేషము చెప్పవలసి యున్నది. ఇతర దేశ భాషలు నాటకములలోఁ బాత్రోచితముగ వాడవచ్చు నని చెప్పి, యాంధ్ర ద్రావిడ భాషలు గద్యముగ వాడవలదనియు, పద్యముగ వాడవచ్చు ననియు భరతుఁడు చెప్పి యున్నాఁడు:-

వాక్యాభినయము

న బర్బరకిరాతాంధ్రద్రవిడాద్యాసు జాతిషు ॥
నాట్యయోగేతుకర్తవ్యం కావ్యంభాషాసమాశ్రయమ్।
జాతిష్వేతేషుసర్వాసు శ్రద్ధాసుచ ద్విజోత్తమాః ॥
శౌరసేనీం సమాశ్రిత్య భాషా కార్యాతు నాటకే।
అథవా ఛందతఃకార్యా దేశభాషా ప్రయోక్తృభిః॥ *

శాకుంతల నాటకమునందు శార్ఙ్గరవ దుష్యంత సంభాషణములో మొదట శార్ఙ్గరవుఁడు శాంతముగ మాటలాడి పిదపఁ గోపముతో మాటాడును. ఆ రెండు సమయములందలి యాతనిధ్వని వేఱు వేఱుగ మారవలెను. షేక్సుపియరుకృత జూలియస్ సీజరు నాటకమునందు జూలియస్ సీజరు చనిపోయిన తరువాత నాతనిని గుఱించి చెప్పుచు, అంటోని బ్రూటసును అధిక్షేపించుచుఁ జెప్పుచు ('Brutus is an honourable man') 'బ్రూటసు మర్యాదస్థుఁడు' అని మూఁడు సారు లనును. ఈ మూఁడుసారులును ఈ వాక్యమును మూఁడువిధముల నుచ్చరింపవలయును. అట్లుచ్చరించినఁ గాని యందలి యర్థవిశేషము ప్రేక్షకులకు బోధపడ నేరదు.

ఆహార్యాభినయ మనఁగా నేపథ్యవిధానము. అనఁగా నటులను వారివారి భూమికలకుఁ దగినట్లుగ వస్త్రభూషాదులచే నలంకరింపఁ జేయుట. ఇందుకు సమకాలమందలి వస్త్రభూషాదుల జ్ఞాన మావశ్యకమగుటయే గాక, పూర్వకాలమందలి ఋషి నృప కంచుక్యాదుల వస్త్రభూషాదుల జ్ఞానము గొంతవఱకుఁ గలిగి యుండవలెను.

ఆహార్యాభినయము

* నాట్యశా. అ. ౧౭. శ్లో. ౪౪-౪౫.

మాలతీమాధవ నాటకమునందలి అఘోర ఘంటుఁడు, కపాలకుండల మొదలయిన భూమికలకు వేషములు వేయుటకై తాంత్రిక మతమువారు పూర్వము వేసికొనునట్టి వేషముల నెఱుంగవలయును. అట్లే ప్రబోధ చంద్రోదయమునందలి పాత్రములను సింగారించుటకు నందు వర్ణింపఁబడిన మతముల వా రెట్టిదుస్తులు మొదలయినవి ధరించు చుండిరో తెలిసి యుండవలెను. లేనియెడల వేషములు శోభింపనేరవు. రంగాలంకారము లన్నియు,రంగముమీఁదఁ జూపఁబడు వనజల పర్వతాదులన్నియు నిప్పటివారిచేఁ బ్రదర్శింపఁబడు తెరలు మొదలగునవియు నాహార్యాభినయమునకు సంబంధించినవియే.

సాత్త్వికాభినయము

సాత్త్వికభావములను,అభినయించుట సాత్త్వికాభినయ మనిపించుకొనును. ఆలంకారికుల మతమున సాత్త్వికభావము లెనిమిది: స్వేదము. (చెమట), స్తంభము(ప్రమానుపాటు), రోమాంచము (గగుర్పాటు), స్వరభేదము (మాటమారుట), వేపథువు (మాట తడఁబడుట), వైవర్ణ్యము (వెలవెలబాఱుట), అశ్రువు (కన్నీరు), ప్రళయము (మూర్ఛ).

ఇతరుల సుఖదుఃఖములను జూచి వానియెడ మనస్సునకు సానుభూతి గలిగినఁ గాని యీ భావము లుత్పన్నములు కావు గనుక వీనికి సాత్త్వికభావములని పేరువచ్చెను. సత్త్వము లనఁగా మనస్సులోనుండి పుట్టినవి; లోకధర్మమును, అనుసరించుటచే, నాట్యమునకు సత్త్వము కావలెను. ఏ భావమును అభినయించునప్పు డాభావము గల పురుషునితో తాదాత్మ్యముఁ బొందవలెను. దుఃఖము రోదనాత్మకము. దానిని అదుఃఖితుఁ డెట్లు అభినయించును? సుఖము ప్రహర్షాత్మకము. దానిని దుఃఖితుఁ డెట్లు అభినయింపఁ గలఁడు? కావున నటుఁడు తాను గైకొనిన భూమికతోఁ గొంతవఱకైనను ఐక్యముఁజెంది యా భావములను నటింపవలెనని భరతాచార్యుల వారి యభిప్రాయము.*

ఈ సాత్త్వికభావముల నేయేపట్ల సూచింపవలసినది యిట్లు చెప్పినాఁడు.

హర్షభయశోక విస్మయవిషాద రోగములను జూపుటకు స్తంభమును, క్రోధ భయ హర్ష లజ్జా దుఃఖ శ్రమ రోగ తాప వ్యాయామ శ్రమముల పరిణామముగ స్వేదమును, శీత భయ హర్ష రోష స్పర్శ జరా రోగములకుఁ గంపమును, స్పర్శ భయ శీ

* అత్రాహ - కిమన్యే భావాః సత్త్వేన వినా అభినీయంతే యే నైతే సాత్త్వికా ఉచ్యంతే। అత్రోచ్యతే ఇహ హి సత్త్వం నామ మనః ప్రభవమ్। తచ్చ సమాహిత మనస్త్వాదుచ్యతే. మనః సమాధానాచ్చ సత్త్వ నిర్వృతిరితి। తస్యయోఽసౌ స్వభావో రోమాంచాశ్రు కృతః స నశక్యతే ఽన్యమనసా కర్తు మితి। లోక స్వభావానుకరణాచ్చ నాట్యస్య సత్త్వ మీప్సితమ్। కో దృష్టాంతః। ఇహ హి నాట్య ధర్మ ప్రవృత్తాః సుఖదుఃఖకృతోభావా స్తథా సత్త్వవిశుద్ధాః కార్యా యథాసరూపాభవన్తి. దుఃఖం నామ రోదనాత్మకం తత్కథ మదుఃఖితేన, సుఖంచ ప్రహర్షాత్మకమసుఖితేన దుఃఖితే నాభినేయా। ఏతదేవాస్యసత్త్వం యత్సుఖితేన దుఃఖితే న సుఖితేనవా అశ్రురోమాంచౌ దర్శయితవ్యౌ ఇతి కృత్వా సాత్త్వికాభావా ఇత్యభివ్యాఖ్యాతాః। నాట్యశాస్త్రము, ౭ వ అధ్యాయము.

హర్ష క్రోధ రోగములవలన రోమాంచము, భయ హర్ష క్రోధ జరారోగ మద జనితము స్వరభేదమును, సంతోషము బెదరించుట జ్వరము, కోపము మొదలయిన వానిచే వేపథువును, శీత క్రోధ భయ శ్రమ రోగ శ్రమ తాపజము వైవర్ణ్యమును, ఆనందము కోపము పొగగాని కాటుకగాని కండ్లలోనికిఁ బోవుట, శోకము, రెప్పవాల్పక చూచుట శీతము రోగములవలన అశ్రువులు, శ్రమ మూర్ఛా మద నిద్రాభిఘాత మోహాదుల వలన ప్రళయము.

ఇట్లు వీని ప్రయోజనములు చెప్పుచు, అభినయమునందు వీనిని నెట్లు చూపవలయునో యీ క్రిందివిధముగఁ జెప్పినాఁడు:—

అంగములన్నియు నిష్క్రియముగ నుండుటయే స్తంభము. చెమట తుడుచుకొనుట, విసనకఱ్ఱతో విసురుకొనుట, గాలిని కోరుట యను క్రియలచే స్వేదమును; శరీరమును చేత స్పృశించుటవలన (గాత్ర సంస్పర్శనేన) రోమాంచమును; డగ్గుత్తిక - (గద్గదము) మొదలైనవానిచే స్వరభేదమును; ధ్వనికంపమును, స్ఫురణము (అదురుట), శరీర కంపములవలన వేపథువును; ముఖముమీది కళను మార్చియు, ఇడా పింగళాది నాడులను బిగబట్టియు వైవర్ణ్యమును, కనులు తుడుచుకొనుట కన్నీరుగార్చుట మొదలయిన వానివలన నశ్రువులును, నిశ్చేష్ట నిష్కంప శూన్య జడాకృతి దాల్చుటవలనను, భూమిపైఁ బడుటవలనను ప్రళయమును అభినయింపవలెను.

పై భావములు గనుపఱుచవలసిన విధము లిట్లు తెల్పఁబడినను, అభినయమునకు నటుని యొక్క యనుకరణ ప్రవృత్తియే మూలాధారము. ఈ ప్రవృత్తి లేనివాఁడు నటుఁడుగఁ బనికిరాఁడు. అందఱి నటులకు నన్నిరసములను గాని అన్ని భావములను గాని అనుకరణము చేయు కౌశల్య ముండదు. కొందఱకు హాస్య మభినయించుటయందును, కొందఱకు వీర్య రౌద్రాదులను జూపుటయందును, కొందఱకు శాంతాదికముల నటించుటయందును మాత్రము ప్రజ్ఞ యుండును. వారివారి ప్రజ్ఞల ననుసరించి వారివారికి వేషములు వేయవలయును.

పైని అభినయముయొక్క భేదములు నాల్గు చెప్పఁబడినవి. వానిలో ఆంగిక వాచిక భేదములు ముఖ్యాంగము లనియు, ఆహార్య సాత్త్వికములు ఉపాంగము లనియు, నొకవిధముగఁ జెప్పవచ్చును. వీనిలో ఆంగికాభినయమే ప్రధానముగఁగల విద్యలలో మన దేశమందు బోగమువాండ్ర యాటయు, పాశ్చాత్య దేశమునందు ప్యాంటోమైమ్ (Pantomime) అను నాటక విశేషమును, ముఖ్యములు. ఇటీవల వెలసినట్టి బయోస్కోపు అను ఆటలును ఇట్టివే. ఇందు శబ్దమెంతమాత్రమును లేకుండ కేవల మభినయమువలననే కథాభాగ మంతయుఁ జూపఁబడును. ఆంగికాభినయము మనోభావమును ఎంతచక్కఁగ వెల్లడిచేయఁగలదో చూపుటకు నీ బయోస్కోపుఆటలు మంచి దృష్టాంతములు. డిడార్ సెట్ అను ఫ్రెంచివిద్వాంసుఁడు

నాటకముఁ జూడఁ బోయినప్పుడు చెవులు మూసికొని యుండువాఁడఁట. కేవ లాంగికాభినయమువలన నటు లెంత యర్థమును బోధింపఁగలరో చూచుట యాతని యుద్దేశము. వాచికాభినయము ప్రధానముగాఁ గలది యొక యర్థమునందు సంగీతము, మఱి యొక యర్థమునందు వక్తృత్వము. అన్ని యభినయములును కావలసినది నాటకము. ఇందును బెక్కు భేదములు గలవు. ఇందునగుఱించి యింకను అధికము తెలిసికొనఁ గోరువారు 'నాటకము' 'నాట్యము' 'భరతము' అను శబ్దములను జూడ నగును.

[కో. ల.

## అభినవ గుప్తాచార్యుఁడు.

౧. కాశ్మీరమండలి గొప్పపండితుఁడు, ఆలంకారికుఁడు, మహా మాహేశ్వరాచార్య బిరుదాంకితుఁడు. ఇతఁడు క్రీస్తాబ్దీయమైన పదవ శతాబ్దముయొక్క చివరకాలమందును, పదునొకండవ శతాబ్దారంభమందును, ఉండెను. వరాహగుప్తుఁడు తాత, చుఖలుఁడు తండ్రి, మనోరథగుప్తుఁడు తమ్ముఁడు, లక్ష్మణగుప్తుఁడు భట్టేందురాజు, భట్టతౌతు లనువారు విద్యాగురువులు, కర్ణక్షేమరాజాదులు శిష్యులు. ఈతనిచే రచింపఁబడిన గ్రంథములు (౧) అనుత్తరాష్టికా (౨) కావ్యకౌతుక వివరణమ్ (3) క్రమస్తోత్రమ్ (౪) ఘటకర్పరకులకవివృత్తిః (౫) తంత్రవటధానికా (౬) తంత్రసారః (౭) తంత్రాలోకః (౮) దేహస్థ దేవతాచక్ర స్తోత్రమ్ (౯) ధ్వన్యాలోకలోచనమ్ (౧౦) నాట్యలోచనమ్ (౧౧) పరమార్థ చర్చా (౧౨) పరమార్థ ద్వాదశికా (౧3) పరమార్థసారః (౧౪) పరాత్రింశికా వివరణమ్ (౧౫) ప్రకరణస్తోత్రమ్ (౧౬) ప్రత్యభిజ్ఞావిమర్శినీ బృహతీవృత్తిః (౧౭) ప్రత్యభిజ్ఞావిమర్శినీ లఘువృత్తిః (౧౮) బోధపంచదశికా (౧౯) భగవద్గీతా టీకా (౨౦) భారతీయ నాట్యశాస్త్ర టీకా (౨౧) భైరవ స్తోత్రమ్ (౨౨) మహోపదేశవింశతిః (౨౩) మాలినీ విజయ వార్తికమ్ *

౨. ఆసామి దేశమందలి మహాపండితుఁడు. శాక్తుఁడు. బ్రహ్మసూత్రములపై శాక్త భాష్యమును రచించెను. శంకరాచార్యులు దిగ్విజయార్థమై బయలుదేరి కామరూప దేశమునకుఁ బోయినప్పు డీతనితో వాదముసల్పి యాతనిని గెల్చెను. అంత నీతఁడు పైకి పలికి నాచార్యులశిష్యత్వము నంగీకరించెను. కాని మనస్సునందు ద్వేష ముంచుకొని మంత్రతంత్రము లెఱింగినవాఁడగుటచే దుర్మంత్రబలముచే నాచార్యులవారికి భగందర రోగముఁ బుట్టించెనఁట. ఎంతగొప్పరాజ వైద్యులు వచ్చి యుపచారము చేసినను ఆరోగ్యము కుదురలేదు. అందుమీఁద పద్మపాదాచార్యుఁడు ప్రతిప్రయోగముఁ జేసి యాచార్యునిఁ బాగుచేసెనఁట. అభినవగుప్తుఁడా రోగముతోనే చచ్చెనఁట. (మాధవకృతశంకర దిగ్విజయము, ౧౬ వ సర్గము.)

* (కావ్యమాలా ౨౫, ధ్వన్యాలోకనమునకు సంస్కృతమున వ్రాసినట్టి యుపోద్ఘాతముఁ జూడుఁడు.)

ఈ యభినవగుప్తుఁడు వాదించినది యాది శంకరునితోఁ గాదనియు, ఆ పీఠముమీఁదఁ గూర్చుండిన విద్యాశంకర భారతి యను శంకరాచార్యునితో వాదించె ననియు, ఈ సమాచారము శా. శ. ౮౬౨లో జరిగె ననియు అర్వాచీనకోశకారుఁడు వ్రాసినాఁడు, కాని ప్రమాణ మేమియు నిచ్చినవాఁడు కాఁడు.

**అభినవచంద్రుఁడు.** ఇతఁడు కన్నడమున 'అశ్వవైద్యము' అను గ్రంథమును వ్రాసిన బ్రాహ్మణ గ్రంథకర్త. ఈతఁడు క్రీ. శ. పదునాలుగువందల సంవత్సరప్రాంతమునం దుండియుండునని కర్ణాటకకవి చరిత్రకారు లభిప్రాయపడి యున్నారు.

**అభినవ మంగరాజు.** 'కవి మంగాభిధాన' మనఁబడు అభినవ నిఘంటువును కన్నడమునందు వ్రాసినవాఁడు. 'చింతామణిపతిపదము' అనుగ్రంథమును గూడ నితఁడు వ్రాసెనని ప్రతీతి కలదు కాని ఆ గ్రంథము దొరకినదికాదు. అభినవనిఘంటువు క్రీ. శ. ౧౩౯౦ లో రచింపఁబడుటచే నీకవి పదునాల్గవశతాబ్దపు అపరార్ధమున నుండినవాఁడు. ఇతఁడు బ్రాహ్మణుఁడు.

**అభినవశ్రుతముని.** ఇతఁడు మల్లిషేణ రచితమైన 'సజ్జన చిత్తవల్లభము నకు' కర్ణాటకవ్యాఖ్య వ్రాసినవాఁడు. శ్రవణ బెళ్గొళమునందలి యొక శాసనమునుబట్టి యీ కవి పదునాల్గవ శతాబ్దపు చివరకాలమున నున్నవాఁడని యూహింపఁదగి యున్నది.

**అభిమతి.** అష్టవసువులలోని యొక వసువుభార్య.

**అభిమన్యుఁడు.** ౧. ఆఱవ చక్షుర్మనువుయొక్క పుత్రులలో నొక్కఁడు.

౨. (చం. వం.) పాండవమధ్యముం డగు అర్జునునకును, శ్రీకృష్ణునకుఁ జెల్లియ లగు సుభద్రకును బుట్టిన కుమారుఁడు. ఇతఁడు అష్టవసువులలోని సోమనామకవసువు పుత్రుఁడైన వర్చా యనువాని యంశమునఁ బుట్టెను (భార. ఆది. అ. ౬౭). ఈతఁడు జన్మకాలమునందు దీర్ఘబాహుఁడుగను, మహాక్రోధిగను కానవచ్చినందున ఇతనికి అభిమన్యుఁడని నామకరణము సేసిరి. ఇతఁడు అర్జునునియొద్ద దశవిధ ధనుర్వేదమును అభ్యసించి దివ్యాస్త్రములను సంపాదించెను. ధనుర్వేదమం దితనికిఁ గల యప్రతిమ ప్రావీణ్యమును జూచి బలరాముఁడు సంతసించి యాతనికి రౌద్ర నామక శ్రేష్ఠధనుస్సు నొసంగెను. ఇతని రథమునకు పింగళవర్ణముగల గుఱ్ఱములును, శార్ఙ్గపక్షి ధ్వజమును గలవు. సుమిత్రుఁడను వాఁ డితని సారథి. ఇతఁడు ఆకారమునందును, శౌర్యమునందును తన మేనమామయైన కృష్ణుని పోలి యుండెను. ఇతని కిద్దఱు భార్యలుండిరి. పెద్దది బలరాముని కూఁతురైన వత్సల (జైమిని-అశ్వ). రెండవది విరాటరాజు కూఁతు రయిన ఉత్తర. శౌర్యమునం దీతఁడు

కృష్ణార్జునులకు సమానుఁడు. ఇతఁడు భారత యుద్ధమునందు పదుమూఁడవనాఁడు, అనఁగా ద్రోణాచార్యులు సైన్యాధిపత్యము వహించిన మూఁడవనాఁడు, కౌరవులచే నిర్మింపఁబడిన పద్మవ్యూహమును, ధర్మరాజు ప్రేరణచే భేదించి, లోనికిఁ జొచ్చి, సైంధవుఁ డడ్డపడుటచే ధర్మరాజాదులు తనకు సహాయార్థము రాకపోయినను, ఒక్కఁడే, కౌరవసైన్య మంతటితోను భీకరముగఁ బోరాడి, గొప్ప గొప్ప వారైన పెక్కురాజులను సంహరించి ద్రోణకర్ణశల్య దుర్యోధన దుశ్శాసనాది వీరుల ననేక పర్యాయముల నోడించి పాఱఁదోలి తన యనన్యసామాన్య పరాక్రమంబును వెల్లడించెను. ఆనాఁడాతనిచేఁ జచ్చిన పదివేల రథులలో దుర్యోధన భ్రాతయైన వృందారకుఁడు, మగధ రాజ పుత్రులయిన శ్వేతకేతువు, అశ్వకేతువు, కుంజరకేతువు, కోసలరాజైన బృహద్బలుఁడు, దుర్యోధన కుమారుఁడయిన లక్ష్మణుఁడు, సత్యశ్రవుఁడు, శల్యనందనుండైన రుక్మరథుఁడు, శల్యుని సోదరుఁడు, కర్ణుని తమ్ముఁడు, కర్ణపుత్రుఁడయిన వృషసేనుఁడు, ముఖ్యులు. తుదకు కర్ణ ద్రోణాదు లార్గురు మహావీరు లధర్మ యుద్ధమునకుం జొఱఁబడి, వెనుకనుండి కర్ణుఁడు విల్లుఁద్రుంచి ద్రోణుఁడు కవచమును భేదించి, అశ్వములను జంపి, కృతవర్మ సారథిం జక్రరక్షకులం గూల్చి, అభిమన్యుని విరథుం జేసిరి. అంత నాతఁడు వాలుంబలకయుఁ దీసికొని కొంత వఱకుఁ బోరాడె. శత్రులు, వాలుంబలకయుఁ బగులఁగొట్ట, రథచక్రము తోడను, ... తోడను కొంతకాలము యుద్ధముచేసి పెక్కు యోధుల సంహరించెను. తుదకు దుశ్శాస[న] కుమారుఁడు పోరునకు రాఁగా వా... యులు ఘోరముగాఁ బోరుచుండ కౌ... సైనికు లందఱును చుట్టు ముట్టి, తమశా... ములచే నభిమన్యుం జంపిరి. ఇట్లు భారత... నందు వర్ణింపంబడిన అభిమన్యుని యు... ప్రకార మత్యద్భుతము. ఈతఁడు కీర్తిశే... డైనప్పు డీతని భార్యయైన ఉత్తర గర్భ... దాల్చియుండి, తరువాత బుత్రునిం బడసె... ఆతఁడే పరీక్షి న్నరేంద్రుండని విఖ్యా... బడసె.

(భార-ద్రోణ. అ 3౫-౪...

3. ఇతఁడు కాశ్మీరదేశపురాజు. కనిష్క... తరువాత రాజ్యమునకు వచ్చెను. క్రీ... రెండవశతాబ్దప్రారంభమునం దున్న వా... అభిమన్యుపుర మను పట్టణమును కట్టి... యచ్చట శివాలయముఁ బ్రతిష్ఠించెను. ఈ... కాలమువఱకు పతంజలికృత మహాభాష్య... యొక్క ప్రచారము కాశ్మీరమునం... లోపించినందున, నీతఁడు దేశాంతరము... నుండి చంద్రాచార్యాదులచే దానిని తెప్పి... చెను. చంద్రాచార్యాదులు కూడ వే... వ్యాకరణములను క్రొత్తగా వ్రాసిరి. కాశ్మీర... నందు బౌద్ధుల మహిమ హెచ్చినందున నా... దేవతలకుఁ గోపమువచ్చి శపింప కాశ్మీర... నందుఁ బ్రతిసంవత్సరమును మంచు అ... ముగఁ గురిసి, జనక్షయము కలుగుచుం డెను... యజ్ఞ యాగాదులు చేయునట్టి బ్రాహ్మణుల...

అది బాధ చేయకుండెను; కాని బౌద్ధులు మాత్రము నాశముఁ జెందుచుండిరి! కాశ్యప గోత్రుఁడైన చంద్రదేవుఁడను బ్రాహ్మణుఁడు నీలుఁడను నాగదేవునితపస్సుచే మెప్పించెను. ఆతఁడు నీలపురాణమును ఇచ్చి కాశ్మీరమును మంచునుండియు, బౌద్ధభిక్షువులనుండియు రక్షించెను. (రాజతరంగిణి౧-౧౭౮-౧౮౬)

౪. కాశ్మీరరాజు. క్రీ. శ. ౯౫౮ మొదలు ౯౭౨ వఱకు రాజ్యముచేసెను. ఇతనితండ్రి క్షేమగుప్తుఁడు, తల్లి దిద్ద. ఇతఁడు రాజ్యమునకు వచ్చినప్పుడు చిన్నవాఁడుగ నున్నందున నాతనితల్లి యాతనిపాలికగా రాజ్యముచేసెను. ఈమె పాలనకాలమందుఁ గొందఱు సరదారులు తెఱుగఁబడిరి. కాని వారు చివరకు నోడిపోయిరి. రాజయక్ష్మచే అభిమన్యుఁడు ౯౭౨ లో మృతుఁడయ్యె. ఆతని కుమారుఁడు నంది గుప్తుఁడు. (రాజతరంగిణి ౬-౧౮౮-౨౯౨)

**అభిమానుఁడు.** స్వాయంభువు మన్వంతరంబునం దుండిన ధర్మఋషియొక్క పుత్రుఁడు. ఈయన తల్లిపేరు ఉన్నతి.

**అభిషిక్తరాఘవము.** దీనికి తిరు వేంకటనాథ చరిత్రమనియుఁ బేరు. కవి నడిపింటి వేంకటకవి. ఇది మట్ల అనంతభూపాలుని కుమారుఁడయిన తిరువేంగళనాథుని ప్రేరేపణచే వ్రాయఁబడినగ్రంథము. గ్రంథాదిని మట్ల సంతతి వారి చరిత్ర కొంత గలదు. కాని గ్రంథము సమగ్రముగ లేనందున నితర విశేషము లెవ్వియు నెఱుంగఁజాలము.

**అభిసారము.** కాశ్మీరమునకు సమీపమునం దుండిన యొక దేశము. (భార. సభా. అ ౨౭.

**అభిసారిక.** ప్రియునింగూర్చి సంకేత స్థలమునకుఁ బోయెడి స్త్రీ. నాయికా భేదము. (చూఁడు నాయిక)

**అభిసారి పురి.** అభిసారదేశమునకు రాజధాని. ఇచ్చటిరాజు చిత్రసేనుఁడు. (చూఁడు. చిత్రసేనుఁడు)

**అభూతరజస్సు.** రైవతమన్వంతరంబున నుండెడి దేవతావిశేషము.

**అభ్రకము.** ఆంధ్రదేశమునందు నభ్రకమునకు కాకి బంగారము, గిరిజము, బేగడ యన్న పేళ్లుకలవు. ఈక్రింద నుదాహరించినట్లు కొన్నిగుణములుగల ఖనిజపదార్థములకు అభ్రకములనిపేరు. వీనికి ముఖ్యమయినగుణములు.

1. పలకలు సులభముగా ఒకటేపతఱుపున పొరలుపొరలుగా చీలుట.

2. వంచినప్పుడు సులభముగ విఱుగక వంగుచుండుట.

3. మిక్కిలి పలుచగ తీసినరేకులు పెళుసుగ నుండియు సులభముగ పగులకపోవుట.

4. తళుకు గలిగియుండుట.

5. అభ్రకపురేకులు గోటితోనొక్కిగీచిన చిన్నగుర్తు పడునంత మెత్తదనము గలిగి

యుండును. ఇవి అభ్రకముల ముఖ్యలక్షణములు.

**భేదములు** అభ్రకమునందు రంగునుబట్టియు స్వచ్ఛతనుబట్టియు ముఖ్యముగా రెండు భేదములుగలవు. కొంచెము నలుపు మిశ్రమై మలినవర్ణముగల దానిని కృష్ణాభ్రకమనియు, వజ్రాభ్రకమనియు నందురు. తెలిక రంగుగల దానిని స్వచ్ఛమయిన దానిని శ్వేతాభ్రకమందురు. శ్వేతాభ్రకములలో పొటాసియము, సోడియము, అను క్షారసంబంధమయిన పదార్థములుండును. కృష్ణాభ్రకములో లోహ(ఇనుము) సంబంధమయిన పదార్థములు చేరియుండును. అభ్రకము లన్నిటియందును అల్యూమినియమును శైలమును(Silcon) ప్రాణవాయువుతో చేరియుండును. కొన్ని అభ్రకములందు లిథియము, మెగ్నీషియము, ఫ్లోరీను, వెనేడియము, బంగారము మొదలగు లోహములు కూడ చేరియుండును. మన దేశమునందు విస్తారముగా దొరకు అభ్రకములు శ్వేతాభ్రక జాతిలోనివి.

ఈ రకములలో, వ్యాపార రీత్యా లాభకరమగు నది శ్వేతాభ్రకమే. దీనిని మస్కొవైటు (Muscovite) అందురు. ఇది పెద్ద పెద్ద రేకులుగా దొరకును. చిన్న చిన్న ముక్కలనుకూడ నొకానొక విధమయిన జిగురుతో రేకులుగా నతికించి కృత్రిమపు అభ్రకపు రేకులను ఇప్పుడు చేయుచున్నారు. దీనికి మైకానైటు (Micanite) అనిపేరు. ౧౮౭౦ సం॥రములో ఈవిషయమును కనిపెట్టిరి. అంత వఱకు మన దేశమునందు తక్కువ వెలవచ్చు అభ్రకమునకుకూడ అప్పటినుండి వెలవచ్చి అభ్రక వ్యాపారము హెచ్చినది.

**ఉత్పత్తిస్థానము** భూమియొక్క ఉపరిభాగమునందు నుండు ద్రవ్యము ౧౦౦ కి ౮ చొప్పున అభ్రక ముండును. ఈ అభ్రకము మనము 'నల్లరాయి' (Granite) అని చెప్పురాయి ఫెల్‌స్పార్ (Felspar), శిలాస్ఫటికము ( Quartz ), అభ్రకము (Mica), ఈమూడు పదార్థముల, సంయోగముచే నైనది. ఇవి సామాన్యముగ కలిసియుండునుకాని యొక్కొకచోట అభ్రకపు రేకులు ఇతరపదార్థములతో ఒక దానిపై నొకటిచొప్పున, కొన్ని అంగుళములు మొదలు అడుగులమెత్తువఱకు పఱపులుగ నేర్పడును. ఈ పఱపుచుట్టు కంకర, నల్లరాయి మొదలగునవి ఆవరించి యుండును. ప్రపంచమునందు దొరకు అభ్రకములో సగమువంతు అభ్రకము హిందూదేశమునందు చిరకాలమునుండి దొరకుచుండెను. అందుముఖ్యముగా బంగాళదేశమునందలి గనులు మిక్కిలి పురాతనమైనవి. గయ, హజారిబాగ్, మాంఘేర్ జిల్లాల సంధిలో ౧౨ మైళ్ల వెడల్పును ౬౦ మైళ్ల పొడవునుగల ఒక ప్రదేశము మిక్కిలి ప్రసిద్ధమయినది. దీని తరువాత తెలుగుదేశములోని నెల్లూరు జిల్లాయందలి గనులు ముఖ్యమయినవి. ఈ గనులు త్రవ్వుట యారంభించి ౧౮౯౨ సంవత్సర ప్రాంతములందు ప్రారంభమైనట్లు కనుపడుచున్నది. ఇవిగాక వ్యాపార

చేసి లాభము సంపాదించుటకు చాలినంత లేకపోయినను, అక్కడక్కడ, అనగా విశాఖ పెంట్న జిల్లాలో కోడూరు ప్రాంతములందును, మైసూరునందును, పడమటి కనుమలలో వైనాడ్ ప్రాంతములందును, తూర్పున కొన్ని మెట్ట ప్రదేశములందును, రాళ్లగనులలో లాంతరు అద్దములకు పనికివచ్చునంతటి రేకులు అప్పుడప్పుడు దొరకుచున్నట్లు నిదర్శనములు గలవు. 1913 వ సంవత్సరములో సేలము జిల్లాలో 816 టన్నుల అభ్రకము దొరికినది. బంగాళా దేశమునందలి అభ్రకములో కొంచెము కెంపురంగును నెల్లూరు అభ్రకములో కొంచెము నలపురంగును చేరి యుండును.

హిందూదేశమునందు దొరకు అభ్రకములో చాలభాగము శ్వేతాభ్రకమే యని చెప్పవచ్చును. అమెరికాఖండమునందు సంయుక్తరాష్ట్రములలోను, బ్రేజిల్ నందును, కొన్ని శ్వేతాభ్రకపు గనులు గలవు. 1912 సంవత్సరములో జర్మనులు తూర్పాఫ్రికాలో కొన్ని గనులను కనిపెట్టి విరివిగ పనిచేసినట్లు తెలియుచున్నది. కృష్ణాభ్రకము కనడాయందును, సింహళ దేశమునందును వ్యాపారమునకు తగినంత దొరకుచున్నది.

ఉపయోగములు

అభ్రకముయొక్క ఉపయోగములు, ఆ యా రకముల గుణములను బట్టి యుండును.

1. స్వచ్ఛత :— నిర్మలమైన అభ్రకము గాజునకు బదులుగా లాంతర్లలో అద్దములకు చిమ్నీలకును ఉపయోగించుదురు.

2. వేడి యెక్కినను పగలకపోవుట:— గాజునకువలె అభ్రకమునకు శీఘ్రముగ వేడి యెక్కదు. ఎంత వేడికయినను పటాలున పగలదు. కావున ఇంజనులలోని బాయిలర్ల చూపుడు రంధ్రములలో గాజు పలకలకు బదులు అభ్రకపు రేకులను బెట్టిన గాజువలె పగలవు. *

3. పటములు వ్రాయుట:— ఇండ్లకు అలంకారములుగా నుండి అనేకరంగుల వెలుతురు ఇండ్లలోనికి వచ్చుటకు ఈ అభ్రకపు రేకులమీద చిత్రమయిన రంగులు పూసి యు బొమ్మలను వ్రాసియు ఇంటికప్పుల పైభాగములందును కిటికీలయందును అభ్రకపు రేకులను అమర్చుదురు. పూర్వకాలమునందు దేవాలయములందును గోపురములందును పతాకములందును రాజుల దుస్తులయందును విసనకఱ్ఱలయందును చిత్రమయిన కుండసామానులయందును పిల్లలాడుకొను బొమ్మలయందును ఉపయోగించెడివారు. ఛాయాపటములు వ్రాయువారు కాగితమునకు బదులు అభ్రకపు రేకులపై వ్రాయుచుండిరి.

4. తళుకు:— గోడలమీదను స్తంభములమీదను అంటించు కాగితములలో తళుకిచ్చుటకై అభ్రకపు పొడికలసిన రంగులను పూయుదురు. నాటకాదులయందు తెరలకు శోభ నిచ్చుటకై అభ్రకపు పొడి నుపయోగింతురు. నాజూకైన కుసుంబా మొదలగు రంగు చీరలలో అభ్రకపు పలు

* స్టౌవులలో కూడ గవాక్షములందు దీని నుపయోగింతురు.

కులను అతికింతురు. మహమ్మదీయ లిట్టి చీరెలను ఎక్కువగ మెచ్చుకొందురు.

5. నునుపు:— అభ్రకపు పొడి మిక్కిలి నున్నగ నుండుటచే కాగితములు తయారు చేయునప్పుడును రంగులు తయారు చేయునప్పుడును ఈపొడి నుపయోగించెదరు.

6. ద్రావకములలో సాధారణముగా కరుగక పోవుట:— ఈగుణముచే ఫొటగ్రాఫ్‌లు తీయువారు అద్దములకు బదులుగా నుపయోగింతురు. అద్దములవలెగాక అభ్రకపు రేకులను చుట్టలుచుట్టలుగా జుట్టి చీకటి గొట్టములలో దాచుటకు వీలుగా నుండును. మాజిక్ లాంతరుల స్లైడులకుకూడ నుపయోగించును.

7. చదునుగానుండుట:—మిక్కిలి చదునుగా నుండుటచే విలువగల దస్తావేజులు మొదలగు పత్రములను విలువగలపటములను అభ్రకపు రేకులపై నతికించి చుట్టలుచుట్టలుగా చుట్టి యుంచుకొన వచ్చును.

8. మిక్కిలి పలచగనున్నను పగిలిపోకుండుట:—ఇందుచే విలువగల యంత్రములలో మిక్కిలి చిన్న అద్దములకు బదులు అద్దపు రేకులను అమర్చుదురు.

9. ఇది శీఘ్రముగ వేడి యెక్కదు. లోపలివేడిని బయటకును బయటివేడిని లోపలకును పోనీయదు:—ఇందుచేత వేడి నీళ్ల గొట్టములకును స్టీమ్ గొట్టములకును బాయిలర్లకును చుట్టును అభ్రకపు రేకులు చుట్టుదురు.

10. విద్యుచ్ఛక్తిని తనగుండ పోనీయదు. ఈగుణమే యిప్పుడీయభ్రకమునకు నెక్కువ విలువ తెచ్చినది. ఈ యుద్ధమునందు ఉప యోగపడు విమానములలో నుండు అను స్యాంతములలో నొకతరహా విద్యుచ్ఛ మరియొకతరహా విద్యుచ్ఛక్తినుండి విడదీయుటకై వానిమధ్య అభ్రకపు రేకులను కూర్చెదరు. ఈ రేకులందు స్వచ్ఛతవలన ప్రయోజనము లేదు. కాబట్టి యెంత మలినమైనను మచ్చలుపడినదైనను అభ్రకమీ పనకు పనికి వచ్చును. నల్లనిరేకు లిం హెచ్చుగ నుపయోగ పడును. ముక్కలైన రేకులుకూడ ఇందుల కుపయోగపడును.

11. చెట్ల అభివృద్ధికి కావలసిన లోహములు కొన్ని అభ్రకమునందుగలవు. ఇందుకే అభ్రకపుపొడి కొన్ని చేలకు మంచి యెరువుగా నుపయోగపడును.

12. స్వదేశ వైద్యులు మందులలో అభ్రకము నుపయోగింతురు. ఆయుర్వేద శాస్త్రము ననుసరించి వ్రాయబడిన వ్యాసమును చూడుడు.

బంగాళా దేశములో ఒక గుట్టయొక్క ఉపరితలమునందు నెక్క  
గనులు త్రవ్వు విధము  
డనో ఒకచోట తళుకు  
తళుకు మను అభ్రకపు పొరను కనిపెట్టి అక్కడినుండి దానిమార్గమునే అనుసరించి సొరంగమును త్రవ్వు కొనుచు వంకరటింకరలుగా పురుగులు దొలచినట్లు లోలోపలకు తొలచుకొని పోవుదురు. ఇట్టి సొరంగములు 2, 3, వందల అడుగులవరకు భూమిలోపలికి పోవును.

సారంగములను త్రవ్వినప్పుడు మెత్తని భాగము లెక్కుడ దొరకునో ఆ దారినే త్రవ్వుదురు; కాని కఠినమైన రాళ్లనుగొట్టి క్రొత్తమార్గములు చేయరు. ఇందుచే గనుల యధికారుల అదృష్టమునుబట్టి సరకు దొర కునంతవరకును, నీటివల్ల పనిచెరుపు లేనంత వరకును, త్రవ్వుచు నెప్పుడునష్టముగనుండునో అప్పుడు ఆ గనిని విడచి వేఱొకగనిలోనికి బోవుదురు. ఈగనులలో మన్ను నీరు మొద లగునవి చేరి యటుతరువాత పనిచేయువార లకు అభ్రకపుపొరలు దొరకుమార్గములు దొరకక విలువగల గనులుగూడ నొకానొక ప్పు డెందునకు పనికిరాకుండ బోవును. ఇందుచే నీ సారంగములపద్ధతి గనుల యధికారులకు ప్రస్తుతము లాభకారిఅయినను మొత్తముమీద లాభకారికాదు. నేలమీద నుండి విస్తారము లోతులేకుండ పొరలు పఱ పుగ పోవుచు, నీ ధూరకుండు నంతవరకు ఈ పద్ధతి చక్కగ పనిచేయవచ్చును. కాని సరి యైన మార్గములు లేని సారంగములనుండి రాళ్లు, నీళ్లు, మొదలగువానిని నెప్పటికప్పుడు పై కెత్తివేయుటకు కూలి అధిక మగును. రాత్రులయందు పనివిడచి మరునా డుదయ మున తిరిగి ప్రారంభించక పూర్వము 1, 2, గంటలవఱకు నీరు తోడుటకై కాలము వృథా పోవును. వర్షాకాలములో రెండు మూడు నెలలు బొత్తిగ పనిచేయుటకే వీలుండదు.

నెల్లూరుజిల్లాలో పెద్దపెద్ద గనులు త్రవ్వి కంకర, రాయి మొదలగు భాగములను పైకి యెత్తివేసి అభ్రకపు గనులను బయలుచేయు దురు. పైనుండు రాళ్లను లెక్కలేకుండ మోటుగ పగులగొట్టినయెడల, క్రిందనుండు అభ్రకపు రేకులు పగిలిపోయి సరకుయొక్క వెల తగ్గిపోవును. కాబట్టి డైనమైటులతోను యంత్రసహాయముతోను పనిచేయుట ఒకా నొకప్పుడు మిక్కిలి ఉపయోగకారిగా నుండి నను జాగ్రత్తగ పనిచేయవలయును. మన దేశములో అభ్రకపు గనులలో యంత్ర సాహాయ్యము లేకపోవుటచే కూలి యెక్కు వగ నుండినను ఈమధ్య 2, 3, సంవత్సర ములనుండి ఆవిరియంత్రములతోను చేతి యంత్రములతోను నీళ్లు వేగముగ తోడ గలుగుచున్నారు. ఇతర యంత్రసాహాయ్య ములచే రాళ్లను రప్పలను సులభముగా పైకి నెత్తుచున్నారు. వరుసగ 20 మంది కూలీలు అంచెలమీద చేయవలసినపని ముగ్గురు మనుష్యులు యంత్రసాహాయ్యముచే చేయు చున్నారు. అయినను 1915 సంవత్సరములో అభ్రకపు గనులలో 10791 మంది మను ష్యులు పనిజేసియుండిరి. ఈగనులలో పని చేయు జనులకు అపాయము కలుగుటయు గలదు. పై సం॥ రములో నలుగురు నేలమీద కూలుటచేతను ఒకడు పైనుండి గనిలోనికి పడి పోవుటచేతను, ఒకడు పొరపాటున డైనమైటు నకు నిప్పంటుకొనుట చేతను మృతినొందిరి.

ఇప్పుడిప్పుడు ఒకగనిలోని అభ్రకపు పొరలు పై పైనుండునవి పూర్తిఅయినతరువాత లోపలి పొరలను కనిపెట్టుటకు బలమైన ద్రామాను పల కలును ఇటుకగోడలును కట్టుకొనుచు నూతు

లవలెలోపలికి త్రవ్వుకొనుచు పోయి క్రొత్త పొరలను కనిపెట్టుటకు ప్రయత్నించుచున్నారు. ఈపద్ధతుల నవలంబించిన తరువాతనే 5, 6, సంవత్సరములనుండి గనులు త్రవ్వుట కొంతవఱకు అభివృద్ధి నొందినది. బంగాళా దేశపు సారంగముల పద్ధతిలో పెద్దరేకు లనేకములు నలగిపోవును. అభ్రకము యొక్క వెల రేకు పెద్దదైనకొలదిని స్వచ్ఛమయిన కొలదిని హెచ్చును. మచ్చలుపడినను నలిగిపోయినను వెల తగ్గును. రకమును బట్టి మంచిరేకులకు పౌను 1కి రు 3-0-0లు మొదలు 40 రూపాయలవఱకు వెలగలదు. కాని సామాన్యముగా టన్ను 1కి రు 60 ల చొప్పున మంచిఅభ్రకమునకు వెలయుండును. 1898 సంవత్సరములో చిన్న చిన్న అభ్రకపు రేకులకు ముక్కలను అతికించి పెద్ద రేకులను తయారుచేయు పద్ధతి కనిపెట్టబడెనని పైన చెప్పియుంటిమి. అప్పటినుండి చిన్నముక్కలకుగూడ వెల యేర్పడినను సరియైన ధర లేకపోవుటచేత వ్యాపార మంతగా సాగ లేదు. కాని 1905 వ సంవత్సరమునుండి పై రవానా హెచ్చగుటచే గనుల స్వంత దారులు వేనవేలుగ చిన్నపిల్లలును ఆడువాండ్రను పెట్టి అంతవఱకు పనికిరాకుండ విడచివేసిన మట్టిగుట్టలన్నిటిని తిరిగి వెతికించి వెలతక్కువ సరకును చాల హెచ్చుగ తయారుచేయుటకు ప్రారంభించిరి. ఈ సంవత్సరములో ప్రత్యేకము ముక్క లేరుటకుమాత్రము 5000 మంది కూలీలు పనిచేసిరి. ఇందుచే కొన్ని సంవత్సరములవఱకు అభ్రకపు వెల తగ్గినదిగాని పిమ్మట క్రమక్రమముగ వృద్ధి యగుచు వచ్చినది.

నెల్లూరు జిల్లాలోని గనులలోని ప్రపంచకమునం దెక్కడనున్న సరి కంటెను ప్రశస్తమయిన దని చెప్పుదురు. ఇనుకూర్తిగనిలో దొరకిన అచ్చు కొన్ని 10 అడుగుల యెత్తును 15 అడుగుల చదరమును గలిగి యుండెను. నలుపుముగా నుండు ఒంటొంటిరేకులు పగుళ్లు గీట్లును లేనివి రెండులేక రెండున్నర అంగుల చదరము గలవి యుండెను. పెద్దపెద్ద అభ్రకపు అచ్చులను గనులనుండి పైకి తీసిన తరువాత మనకు కావలసిన దళముగ చిన్న పలకలుగాను రేకులుగాను చీల్చుదురు. ఈ రేకుల అంచులయం దుండు వంపులను కత్తిరించి చిన్న పెద్దలనుబట్టి వేఱువేఱుగ నేర్పఱచుదురు. పిమ్మట ఈ రేకులను స్వచ్ఛతనుబట్టియు వర్ణమునుబట్టియు కూడ వేఱువేఱుగా నేర్పఱచి, నలిగిన భాగములను మచ్చపడినభాగములను కత్తిరించి వేయుదురు. ఇట్లు ఏర్పఱచగా మిగిలిన ముక్కలను మైకనైట్ అను ఒక విధమయిన జిగురు పదార్థముతో అంటించి అభ్రకపు రేకులకు బదులుగా నుపయోగింతురు. ఇంకను మిగిలిపోయిన పొడుముగూడ అనేక విధముల నుపయోగపడును; కాన దానిని కూడ వేఱుగ నేర్పఱతురు.

గడచిన 10 సంవత్సరములలో హిందూ దేశమునుండి ఎగుమతి రాబడి అయిన అభ్రకపు మొత్తము

## ఇండియాదేశములో 1915-వ సంవత్సరములో అభ్రకపు గనులలో పనిచేసినవారి సంఖ్య సరుకు మొత్తము తెలుపు పట్టి

| దేశము | జిల్లాలేక గనియున్న ప్రదేశము | గనుల సంఖ్య | యంత్రశక్తిచే పనిచేయునవి | యంత్రశక్తి లేకనే పనిచేయునవి | మొత్తము మీద సైకి యెత్తిన సరుకు టన్నులు | గనులలో పనిచేసిన మనుష్యులు | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | భూమిలోపల | | | | భూమిపైని | | | | మొత్తము |
| బీహారు ఒరిస్సా | గయ | 36 | ... | 30 | 4,810 | 480 | 268 | 71 | 819 | 135 | 188 | 144 | 407 | 3286 |
| | హజారీబాగ్ | 248 | ... | 248 | 13986 | 1981 | 1029 | 286 | 3296 | 1219 | 1116 | 474 | 2808 | 6104 |
| | మోంఘీర్ | 10 | ... | 10 | 503 | 93 | 38 | 3 | 134 | 32 | 27 | 12 | 71 | 205 |
| చెన్నపట్టణము | నెల్లూరు | 68 | 14 | 55 | 3870 | 1178 | 821 | 114 | 2113 | 276 | 247 | 275 | 798 | 2911 |
| రాజపుత్రస్థానము | అజిమీర్ | 5 | ... | 5 | 703 | 79 | 15 | | 94 | 73 | 24 | | 97 | 191 |
| | మేర్వార | 4 | ... | 4 | 191 | 44 | 8 | | 52 | 12 | 12 | | 24 | 76 |
| | నసిరాబాద్ | 1 | ... | 1 | | 10 | | | 10 | 4 | 4 | | 8 | 18 |
| 1915 | మొత్తము | 366 | 13 | 353 | 24063 | 3865 | 2179 | 474 | 6518 | 1751 | 1617 | 905 | 4273 | 10791 |
| 1914 | మొత్తము | 582 | 15 | 567 | 38,189 | 6376 | 3847 | 693 | 10916 | 2405 | 2812 | 1852 | 6069 | 16985 |

మును తెలియజేయుపట్టి నీప్రక్క నుదాహరించి యున్నాము.

గడచిన 10 సంవత్సరములలో ఇండియా దేశమునుండి త్రవ్వబడిన అభ్రకపు మొత్తము.

| సంవత్సరం | అభ్రకపు మొత్తం టన్నులు |
|---|---|
| 1906 | 50438 |
| 1907 | 44919 |
| 1908 | 46208 |
| 1909 | 32011 |
| 1910 | 21375 |
| 1911 | 31686 |
| 1912 | 41660 |
| 1913 | 43650 |
| 1914 | 38189 |
| 1915 | 24063 |

ఈ పట్టీ చూడగా పదిసంవత్సరముల నాటికంటె ఈదేశపు రాబడి 1910 సంవత్సరమువఱకు క్రమముగ తగ్గుచువచ్చిన దనియు పిమ్మట తిరిగి 1913 సంవత్సరమునఱకు హెచ్చుచు వచ్చెననియు తెలియగలదు. 1914 సంవత్సరములో యుద్ధము వచ్చినతరువాత పెక్కుగనులను మూసివేయవలసి వచ్చినది. నెల్లూరుజిల్లాలోని పెద్దగనులు కొన్ని జర్మనుల స్వాధీనములో నుండెను. వారియొద్ద నుండి యాగనులను దొరతనమువారు లాగుకొన్నారు. యుద్ధము వచ్చినవెంటనే సరకునకు ఖర్చు లేకపోవుటచేతను, ఓడ కూలి హెచ్చుటచేతను చాల గనులు మూసివేయవలసి వచ్చెను.

ఈ సంవత్సరములో 44 గనులు [illegible] నిల్పివేయబడెను. యుద్ధమునకు కావలసిన విమానములు వగైరాలకు అభ్రకపు [illegible] కావలసియుండుటచే వెల నిలువబడియున్న[illegible] 1915 సంవత్సరములో నెల్లూరుజిల్లాయం[illegible] 19 గనులు క్రొత్తవి పుట్టినను, 13 గనులు మూసి వేయబడెను. ఈ సంవత్సరములో హిందూ దేశమున మొత్తముమీద 115 క్రొత్త[illegible] పుట్టినవి. 73 క్రొత్తగనులు మూసివే[illegible] బడినవి. ఈదేశమునం దీసంవత్సరములో [illegible] జిల్లాలలో ఎంతసరకు బయలుదేరు[illegible] తెలియజేయు పట్టిని ప్రక్క పుటలో నుదాహరించి యున్నాము. [illegible]

ఈదేశమునుండి రవానాయగు అ[illegible] రవానా ములో 100కి 75 [illegible] ఇంగ్లాండు దేశము[illegible] పోవును. రమారమి 15 పాళ్లు తిన్నగా [illegible] రికాకు పోవును. కాని ఇంగ్లండు[illegible] పోయిన అభ్రకములో చాలభాగము జ[illegible] గాని అమెరికాలోని సంయుక్తరాష్ట్ర[illegible] నకుగాని పోయి చేరును.

(ఆయుర్వేదశాస్త్రము ననుసరించి) అధునాతనముగాక నాగార్జునాది [illegible] కారులకాలంబునుండి ప్రచారంబులో నున్న ఖనిజపదార్థము.

ఉత్పత్తికల్పన-సార్థకనామములు: వృత్రాసురుని సంహరించుటకొఱకు [illegible] ద్రుండు వజ్రంబును [illegible] త్తగా నా వజ్రంబు[illegible] యుదయించిన కాంతి[illegible] బులు గగనంబున కెగసియందుండి పర్వత[illegible] రంబులందు చెదఱిపడి యభ్రకరూపంబు[illegible]

పరిణమించినవి. ఈ వజ్రకాంతి కణంబులు క్రిందపడునపుడుఢుముఢ్రూం లెధ్వనిచేయుచు పడుటచేత నీ ఖనిజపదార్థము "అభ్రక" మనియు ఆకాశంబునుండి కాంతికణములు పడుటచే "గగనం" బనియు ఇంద్రవజ్రము నుండి జనించుటచే "వజ్రాభ్రం" బనియు వ్యవహరింపఁ బడుచున్నది. (ఆయుర్వేద ప్రకాశము. అధ్యా 4)

జాతి — మత భేదములు

ప్రాచీనులగు రసతంత్రకారులు నానా విధములగు ఖనిజ పదార్థములను విభజించి సులభముగా తెలిసికొనుటకై గొన్నిటిం జేర్చి పారిభాషికంబుగా "మహారసములు" "ఉపరసములు" "లోహములు" "సాధారణరసములు" ఇత్యాది నామంబుల నిడి యాయా పదార్థమును అట్టి పారిభాషిక పదముచే వ్యవహరించుచు వచ్చిరి. కాని ఇట్లు రానురాను కొందఱు గ్రంథకర్తలు అట్టి పారిభాషిక నియమములను పాటింపక స్వాభిప్రాయాను సారముగా వ్రాయ మొదలిడిరి. ఒకరు మహారసములలోఁ జేర్చిన పదార్థమును మరి యొకరు ఉపరసములలోఁ జేర్చుట, ఇంకొకరు సాధారణ రసములలోఁ జేర్చుట, ఒకరు ఉపరసములలోఁ జేర్చిన దానిని కొందఱు మహారసములలోఁ జేర్చుట, ఇట్లు విధి నియమాదులు లేక స్వతంత్రముగా నిచ్చ వచ్చినట్లు వ్రాయుట తటస్థించినది. కొందఱు మహారసమునుగాఁ జేర్కొనిన దానిని తద నంతరులు పరిశోధించి యయ్యది ఉపరసమని సిద్ధాంతముజేసి ఉపరసములలోఁ జేర్చిరని గాని, ఉపరసమని చెప్పఁబడిన పదార్థమును పరిశోధనాదులచే మహారసమని సిద్ధాంతముచేసి మహారసములలో జేర్చిరని గాని, యనుకొనుటకు మార్గంబు గానంబడదు. తొలుదొల్త ఎట్టి గుణములను జెందిన యేయేపదార్థములకుమహారసనామంబునుగాని, ఉపరస నామంబునుగాని, ఇడిరో అట్టి వివరణము ఆమహారస ఉపరసాది శబ్ద నిర్వచనము రసతంత్రంబులందు గానరాదు.

ఇట్టి యభిప్రాయభేదంబు అభ్రకము పైగూడ జనించినది. రసరత్న సముచ్చయము, రసేంద్రచింతామణి, రసప్రకాశ సుధాకరము, మున్నగు గ్రంథములందు అభ్రకము మహారసములలోఁ జేర్పఁబడి యున్నది. భావ ప్రకాశము, రసేంద్ర సారసంగ్రహము, రసరత్నాకరము, ఆయుర్వేదప్రకాశము, రససారము, మున్నగు గ్రంథములందు ఉపరసమని వ్యవహరింపఁబడియున్నది.

భేదములు - అవాంతరభేదములు

తత్తద్దేశభేదంబుచే నుత్పన్నంబై యభ్రకము "పినాకాభ్రకము" "నాగాభ్రకము" "మండూకాభ్రకము" "వజ్రాభ్రకము" అను నాలుగు భేదంబులుగా విభజింపఁబడి యున్నది. అందు వజ్రాభ్రకమే కృష్ణాభ్రకంబని గూడ వ్యవహరింపఁ బడును. ఇదియునుంగాక ఈ నాల్గింటిలో ప్రతియభ్రకము తెలుపు ఎఱుపు పసుపు నలుపు అను నాల్గురంగులు గలిగి నాల్గు విధంబులుగా నుండును. అనఁగా నభ్రకంబు పదునాఱు విధంబులని తేలుచున్నది.

పీనాకాభ్రకమును కొలిమిలో నైచి యూదిన రేకులు విడిపోయి పొట్టుగామారును. నాగాభ్రకంబును కొలిమిలో యూదిన సర్పంబువలె బుస్సలు కొట్టును. మండూకాభ్రకంబును కొలిమిలో నైచి యూదిన కప్పవలె గంతులు వైచును. వజ్రాభ్రకంబును కొలిమిలో నూదిన నందలి దోషంబు లన్నియు నశించి స్వచ్ఛంబై ప్రకాశముతో నుండును.

అభ్రక పరీక్ష

(రసరత్న సముచ్చయము)

పైఁజెప్పఁబడిన యభ్రకంబులలో వజ్రాభ్రకంబుత్తమమై యుండును. 'దానినే రాసాయనిక క్రియలందును ఔషధనిర్మాణము లందును ఉపయోగింప వచ్చును' అని గ్రంథకారులందఱు నేకగ్రీవముగా నుడివియున్నారు. ఇంతియగాక వజ్రాభ్రకంబుకంటె నితరంబులగు మూఁడు అభ్రకంబులలో పీనాకాభ్రకంబును భుజించిన దుస్సాధ్యంబగు కుష్ఠరోగము జనించును. నాగాభ్రకంబును భక్షించిన మండల కుష్ఠము జనించును. మండూకాభ్రకంబును సేవించిన కృచ్ఛ్రసాధ్యంబగు అశ్మరీరోగము జనించును. దానంజేసి, పైమూఁడు అభ్రకంబులను సేవింపఁగూడదు. వజ్రాభ్రకంబును మాత్ర ముపయోగించ వలెను.

అభ్రక శ్రేష్ఠత

వజ్రాభ్రకంబు కాటుకవలె నల్లనై కఠినముగానుండి బరువుగలిగి యుండును. ఉత్తరదేశపు పర్వతములయందు జనించు వజ్రాభ్రకము అధికముగా సత్వమును గలిగి యుండును, గుణాధికంబై యుండును. దక్షిణదేశపు పర్వతములయందు జనించు అభ్రకము అల్పసత్వంబై హీనగుణంబై యుండును. ఇట్టి వజ్రాభ్రకంబును ఒక పురుషుని ప్రమాణముగా గోయి త్రవ్వి యందున్న యభ్రకమును తీసికొనవలెను. భూమి పై భాగమున నున్న యభ్రకము నిస్సత్వంబై యుండును గాన దానిని గ్రహింపఁ జనదు. ఇందులకు కారణమును అనేకగ్రంథకర్తలు చెప్పియుండ లేదు. కాని రసహృదయకారులుమాత్ర మిట్లు వివరించి యున్నారు. ఖనిజపదార్థము లన్నియు సూర్యకిరణస్పృష్టంబు లైనచో నట్టివానియందు సత్వము స్వల్పముగా నుండును. అయ్యవి భూమియందుండి ఎండవేడిమిని బొందకుండిన బహుళసత్వంబులై యుండును.

వజ్రాభ్రకము-ఉద్గ్రహణ నిర్ణయము

అభ్రకంబును కొలిమిలో గాల్చి ఏడుమాఱులు పాలలోగాని గోమూత్రములోగాని ముంచిన భూసంబంధమువలన జనించు దోషము హరించి శుద్ధంబగును.

అభ్రక శోధనము

(రసరత్న సముచ్చయము)

అభ్రకంబును కొలిమిలో గాల్చి ఏడుమాఱులు త్రిఫలాక్వాథంబులో గాని పులికడుగునందు గాని ముంచిన శుద్ధం బగును.

శతపుటాభ్రకము

(ఆయుర్వేద ప్రకాశిక)

అభ్రకంబును గాల్చి రేగుపట్ట కషాయంబులో ముంచి ఎండినపిమ్మట చేతులచే నలిపిన శుద్ధం బగును.

(రసమంజరి)

ఒకభాగము ధాన్యమునాలుగు భాగములు శుద్ధిచేసిన యభ్రికము. వీనిని ఒకవస్త్రములో మూటగాఁగట్టియా మూటను మూఁడుదినములు పులికడుగులో నానవైచి నాల్గవ నాఁడు ఆమూటను రెండుచేతుల మధ్యనుంచుకొని నలిపినయెడల నాయభ్రికంబు, ఇసుకరేణువులువలె నాపులికడుగులోనికిఁబడును. పిమ్మట నాపులికడుగును వంచివైచి యందలి యభ్రికంబును తీసియుంచుకొనవలెను. ఇయ్యదిధాన్యాభ్రికంబనఁబడును. ఇట్టిధాన్యాభ్రికమును మొదట సిద్ధముచేసికొని దానినే భస్మముచేయవలెను.

**ధాన్యాభ్రకము**

ఈ విషయంబున గ్రంథకారులు భిన్నభిన్నములుగా వివరించియున్నారు. అభ్రికభస్మమనఁగా, అభ్రికమును ఔషధ సముదాయముతోనూరి పిడకలయందు పుటమువైచి సిందూరముగా మార్చి యందలి పరమాణు సంయోగమును విడఁగొట్టి సేవనయోగ్యముగాఁ జేయుట. కొందఱు ఒక పుటముచేతనే సిందూరముగా పరిణమింపఁ జేయు ప్రక్రియలను వివరించిరి. మరికొందఱు పదిపుటములు, ఇంకొకరు నలువదిపుటములు, వేఱొకఱు నూఱుపుటములు, కొందఱువేయి పుటములు, ఈ రీతిగా ప్రక్రియలను జేర్కొని యుండిరి.ఎవ్వరేవిధంబుగావివరించినను,అభ్రికమును సిందూరముగామార్చి యందలి తళుకు పోవునట్లుగను, పరమాణ్వాకర్షణము నశించునట్లుగను, జేసి సేవనయోగ్యంబుగాఁజేయుట సర్వసమ్మతమగువిషయము. నూఱుపుటములు వైచిన యభ్రికము, వేయిపుటములు వైచిన యభ్రికము,ఉత్తమంబులని లోకప్రసిద్ధిగలదు. ఇట్లుండఁ బది పుటములతోడను, ఒక పుటముతోడను, అభ్రికము నిశ్చంద్రికంబై సిందూర రూపమునుబొంది సేవనయోగ్యంబగునా యనెడుసందేహ మవసరములేదు. అయ్యది అభ్రికముతోఁ జేర్చుపదార్థమును బట్టియుండును. ఆ పదార్థము పైఁజెప్పినశక్తిని గలిగియుండినచో నొక్కపుటముచేతనే నిశ్చంద్రికంబగు సిందూరముగావచ్చును. కొన్ని అభ్రికభస్మ యోగములు, ఈక్రింద వివరింపఁబడును.

**అభ్రకభస్మము**

ధాన్యాభ్రికము, టంకణము, వీనిని సమముగాఁ గలిపి మంటిపాత్రమునందువైచి క్రింద మంటఁబెట్టుచు, పాత్రములోని అభ్రికమును ఇనుపబండతో నూరుచుండిన కొంతకాలమునకది యంతయు మాఁగును. పిమ్మట దానిని ఆవుపాలతో నూరినచో నందలి తళుకునశించి నిశ్చంద్రికమగును. (ఆయుర్వేద ప్రకాశము)

**ఏకపుటాభ్రకము**

ధాన్యాభ్రికంబును కసివింద రసముతోగాని, తుంగముస్తలరసముతోగాని, చిట్టికూర రసముతోగాని, నూరి పదిపుటములు వైచిన నిశ్చంద్రికంబగు భస్మంబగును.

**దశపుటాభ్రకము**

(రసరత్న సముచ్చయము)

తుంగముస్తల కషాయము, తెల్లగలిజేరు రసము, కసివిందరసము, తమలపాకులరసము, జిల్లేడుపాలు, మఱ్ఱియూడల కషాయము, నేల తాడివేళ్ళరసము, పెద్ద పల్లేరు కషాయము, దూలగొండి రసము, అరటిగడ్డ రసము, నీటి గొబ్బిరసము, లొద్దుగ చెక్కరసము, వీనిలోనొక్కొక్క దానిచే మూఁడేసి పుటములను, పాలచే రెండు పుటములను, పెరుగు, నేయి, తేనె, చక్కెర, వీనితో ప్రత్యేకముగా నొక్కొక్కపుటమును వైచిన అభ్రకము నిశ్చంద్రకంబై సేవనయోగ్యంబగు భస్మమగును. (ఆయుర్వేద ప్రకాశము)

నలువదిపుటముల యభ్రకము

మఱ్ఱిపాలు, జెముడుపాలు, జిల్లేడుపాలు, తుంగముస్తలకషాయము, నరమూత్రము, మఱ్ఱియూడల రసము, మేకనెత్తురు, వీనితో నూఱు పుటములువైచిన, పద్మరాగంబు వోలె నెఱ్ఱని సిందూరమగును.

శతపుటాభ్రకము

(యోగరత్నాకరము)

ఇట్లే సహస్రపుటంబులు, వింశతిపుటంబులు, అఱువదిపుటంబులు, గ్రంథాంతరములందు భిన్నముగా సిందూరపరిణామములు వివరింపఁబడి యున్నవి.

సత్త్వపాతనంబనఁగా ఖనిజంబులగు అభ్రకము, వైక్రాంతము, మాక్షికము, మయూరతుత్థము మున్నగుద్రవ్యములనుండివానియందు రసాయన సంయోగముచే నిమిడియున్న లోహము, రాగి మున్నగు ధాతువులను రసాయన వైయోగికప్రక్రియలచే విడఁగొట్టుట.

అభ్రకసత్త్వ పాతనము

ఆయుర్వేదమునందిట్టి సత్త్వపాతనప్రకారములు కొన్ని మహారసముల విషయమై వివరింపఁబడియున్నవి. కొన్ని ఖనిజపదార్థములయందుధాతువులిమిడియున్నవనియు, వానిని ప్రక్రియావిశేషంబులచే విడఁదీయ వచ్చుననియు,ప్రాచీన రసతంత్ర కారులెఱింగినవిషయమే. అభ్రకమునందుసయితము లోహమువంటిపదార్థమొకటి గలదనియు, అయ్యది రసగ్రాస కర్మయందు ప్రధానంబనియు,అట్టిసత్త్వముగ్రహించి దానిని భస్మముగావించి సేవించిన సర్వరోగములు నశించుననియు, వివరింపఁబడియున్నది. తదనుకూలంబుగా నధునాతన రసాయన తంత్రవేత్తలు అభ్రకమును పరిశోధించి యందుమగ్నశైలితము(Silicate of magnesia),లోహము (Iron), విశేషముగాఁగలవనిసిద్ధాంతము చేసియున్నారు. ఆయుర్వేదమునందు వివరింపఁబడిన అభ్రకసత్త్వపాతన ప్రకారము లీక్రిందఁ గొన్ని వివరింపఁబడును. ధాన్యాభ్రకంబును, నీటిప్రబ్బలిరసములో, నయిదుమారులుభావన చేసి పిమ్మట నయిదు పుటంబు లిడిన భస్మంబగును. ఆభస్మంబును కొలిమిలోనుంచి యూఁదిన నిర్మలంబై కిట్టరహితమై లోహంబుతో సమంబుగానుండు సత్త్వ మందుండి వెలువడును.

(రసహృదయ తంత్రము.)

అభ్రకపు రేకులను మెత్తగాఁ జూర్ణము గావించి యాచూర్ణమును గంజి, అడవికంద రసము, అరటిగడ్డరసము, వీనితోఁ బ్రత్యేకముగ నొక్కొక్కదినము భావనచేసి యనంతరంబున నీయభ్రకపు చూర్ణంబులో నాలవపాలు టంకణము, చిఱుచేపలు, వీనిని గలిపి నూరి పిమ్మట (బత్తెపేడ) మహిషీ పురీషముతోఁగలిపి ఉండలుగాఁ జేసి ఎండఁబెట్టి పిమ్మట మూసయందుంచి కొలిమిలోనూఁదిన లోహతుల్యంబగు సత్వంబు పూసలు పూసలుగా మూసయందుపడును. అట్టిపూసలనుగ్రహించి మిత్రపంచకము(నేయి, తేనె, గుగ్గిలము, గురువింద విత్తులు, టంకణము) తోఁగలిపి మరల మూసయందుంచి కొలిమిలోనూఁదిననాపూసలన్నియు, కంచువలెఁ గఱిగి ఏకంబగును.

(ఆయుర్వేద ప్రకాశము)

అభ్రకధృతి

ధృతియనఁగా ఖనిజపదార్థములు ప్రక్రియా విశేషంబులచే శాశ్వతంబుగ పారదమువలె ద్రవీభావమును జెంది యుండుట. రసాయన తంత్రములలోఁ బ్రతిగ్రంథకారుండును ప్రతి ఖనిజ పదార్థమునకును,ద్రవీకరణ ప్రక్రియలను దెలిపియున్నాఁడు. ఇట్టిధృతిని ప్రాచీనగ్రంథకర్తలునిజముగాఁ జేయఁగలిగిరా? యనుసందేహము బాధించుచున్నది. ఏలయనఁగారసరత్నసముచ్చయ కారుండగు వాగ్భటుఁడు, ఇట్టి ధృతిని జేయుటకై యనేక పరిశోధనలం జేసియు నందు కృతార్థుండుగానేరక ఇట్లు వచించి యున్నాఁడు. "ధృతిప్రక్రియలుశాస్త్రములం దనంతములుగావివరింపఁబడియున్నవి.అయినను అట్టిధృతీకరణ సామర్థ్యంబు పరమేశ్వరుని యనుగ్రహంబు లేకున్న దుర్లభంబు" అభ్రకధృతి ప్రక్రియలలో నొకటి యీక్రిందవివరింపఁబడును.

ధాన్యాభ్రకమును, అవిసియాకుల రసముతో మర్దనచేసి,ఆముద్దను అడవికందగడ్డలో నుంచి పైనమన్నుతో లేపనముచేసి పశువులు వసించు స్థలమున బారెడులోతుగ గోయి త్రవ్వి యాగోతియందు, ఈ పదార్థము నుదనునిచి గోతినిపూడ్చి నెలదినములుంచినపిమ్మట తీసిన నాయభ్రకంబు పాదరసమువలె శాశ్వత ద్రవీభావమును జెందియుండును.

(ఆయుర్వేద ప్రకాశము)

భస్మరూపంబుగఁ బరిణమింపజేసిన యభ్రకంబుగాని, యట్టి భస్మముచే నిర్మింపఁబడిన యౌషధంబుగాని నరములకు బలమునుగలుగఁ జేయును. వీర్యమును వృద్ధి నొందించును. పాండురోగము,కామిల

అభ్రకగుణములు, యోగములు

మూత్రరోగములు, గ్రహణి, అతిసారము, ప్లీహోదరము, పురాణజ్వరములు, క్షయ, వీనిని తొలగించును. ఇయ్యది ప్రధానంబుగా ప్రమేహరోగంబున స్వతంత్రశక్తిని గలిగి యున్నది. ఇంతియకాక ఇతర ఖనిజపదార్థ సమ్మిళితంబై యనేకరోగములఁ బాపును. అట్టి యోగంబులలోఁ గొన్ని క్రింద నుదాహరింపఁబడును.

శుద్ధిచేసిన పాదరసము, శుద్ధగంధకము, సైంధవలవణము, శుద్ధిచేసిన వత్సనాభి, వీనిని సమముగా గ్రహించి యీ మొత్తమునకు సమముగా లోహభస్మము, లోహభస్మమునకు సమముగ నభ్రిక భస్మముగలిపి మొత్తముగా నీయౌషధమును ఖల్వములో వైచి వావిలియాకు రసముతో బాగుగ మర్దనచేసి పిమ్మట నందు పాదరసమునకు సమముగ మిరియపు చూర్ణమును గలిపి రెండుయవలు (2 grains) ప్రమాణంబుగా తమలపాకుల రసముతో నిచ్చిన సర్వజ్వరములు నశించును. ప్లీహోదరము శమించును. (శైవజ్వరత్నావళి.)

జ్వరాశని రసము

అర్జునాభ్రికము

వేయిపుటంబులు వైచిన యభ్రిక భస్మమును మద్దిపట్టకషాయములో నేడు దినములు భావనచేసి ఎండించి పిమ్మట రెండు యవల (2 Grains) ప్రమాణముగా నుపయోగించిన హృద్రోగమును శమింపఁజేయును. అతిసారము, రక్త పిత్తము, అగ్నిమాంద్యము మున్నగు రోగముల నణంచును.

(రసేంద్రసార సంగ్రహము)

గళితకుష్ఠారిరసము

శుద్ధిచేసిన రసము, శుద్ధిచేసిన గంధకము, తామ్రభస్మము, లోహభస్మము, శుద్ధిచేసిన గుగ్గిలము, చిత్రమూలము, శిలాజితు, శుద్ధిచేసిన విషముష్టివిత్తులు, త్రిఫలములు, ఇయ్యవి ఒక్కొకభాగము, అభ్రికభస్మము నాలుగు భాగములు, క్రానుగవిత్తులు నాలుగు భాగములు, ఇటుల వీనిని ఖల్వములోవైచి తేనె, నేయి, వీనితో ప్రత్యేకముగా నూరి ఒకనేతిపాత్రయందుంచి కర్షప్రమాణముగా సేవించిన దారుణంబగు కుష్ఠరోగము శమించును. ఈ యౌషధంబును సేవించునపుడు, వరిబియ్యపు అన్నము, పాలు, తేనె, నెయ్యి, చక్కెర వీనిని మాత్రము సేవింపవలెను. స్త్రీసంయోగమును వర్జింపవలయును. (భావ ప్రకాశము.)

అనుపాన వివరణము

మరియు నభ్రికభస్మంబు, అనుపానభేదంబులచే ననేక రోగములను నశింపఁజేయును. అభ్రికంబును, పసుపు, పిప్పళ్ళు, తేనె, వీనితో సేవించిన ప్రమేహంబులను, కరక్కాయ, బెల్లము, ఏలకులు, చక్కెరవీనితో సేవించిన రక్తపిత్తమును, ఏలకులు, పెద్దపల్లేరు, నేల యుసిరిక, చక్కెర, ఆవుపాలు వీనితోఁ గలిపి సేవించిన మూత్రకృచ్ఛ్రమును, పిప్పళ్ళు, తేనెవీనితో సేవించిన నజీర్ణంబును, ఆవుపాలు నేలగుమ్మడి, వీనితో సేవించిన దార్బల్యంబును, నల్లజీడివిత్తులతో సేవించిన మూలరోగంబును శమింపఁజేయును. ఇట్లు అనుపానభేదంబుచే ననేకరోగంబులను శమింపఁ జేయుటయేగాక శరీరమందలి ముదిమిని తొలఁగించిదీర్ఘాయుస్సునొసంగును*

(యోగరత్నాకరము.)

[గంll దూll

* అభ్రికమును ఆంగ్లేయ వైద్యులు ఉపయోగించరు. పైనివర్ణింపఁబడిన మందులలో ననేకములయందు

**అభ్రమువు:** ఇంద్రుని వాహనమైన ఐరావతమనెడి యేనుఁగుభార్య.

**అమఝెరాజిల్లా:** సెంట్రల్ ఇండియా యేజన్సీలోని గ్వాలియర్ సంస్థానమందలి విడిగానున్న యొకజిల్లా. ఇది వింధ్యపర్వతము యొక్క యేటవాలు ప్రాంతముననున్న భిల్లుల ప్రదేశము. సరాసరి ౧౮౦౦ అడుగులెత్తుండును. ఈప్రాంతము విశేషముగ నరణ్యము తోడను దరుల లోయలతోడను నిండియున్నది. అందుచే వ్యవసాయమున కంతగ నుపయోగపడదు. విస్తీర్ణము ౧౩౦౧ చదరపు మైళ్లు. జనసంఖ్య ౯౬౪౨౬ (౧౯౦౧). ఈ జిల్లాలో ౪౬౪ గ్రామములుగలవు. ఇది అమఝెరా, బాకానెర్ అనురెండు పరగణాలుగ విభజింపఁబడినది. భూమిశిస్తు రు. ౧౫౧౦౦౦. ఇందు విశేషభాగము ఈనాములు గలవు.

**అమఝెరాగ్రామము:** ఈపేరుగల జిల్లాకుముఖ్యస్థలము. జనసంఖ్య ౨౯౫౪. పదునాఱవ శతాబ్దమున జోధపురపు రాజయిన మాల్‌దెవ్‌రాథోడ్ అనువాని కుమారుఁడగు రాజారాంసింగ్ అనువాఁడు దీనిని కట్టించెనందురు. అప్పటినుండి యది యొక చిన్న రాజ్యముగ నుండెను. పదునెనిమిదవ శతాబ్దమునందు గ్వాలియర్ రాజులకు (సిందియాలకు) లోనయ్యెను. అచ్చటి చిన్న సంస్థానాధీశ్వరుఁడు ౧౮౫౭ లోఁ దిరుగఁబడెను. ఆతనిఁబట్టుకొని యింగ్లీషువారు ఇందూరులో నురితీసి యాతనిరాజ్యము సిందియాకు నిచ్చివేసిరి.

**అమటి:** ఇట్యాలీ దేశమందు ఒకవిధమైన ఫిడీల్లు చేయుటకై పేరువడసిన కుటుంబము. ఆంద్రియా, నికాలో, (౧౫౩౦-౧౬౧౧) అను సోదరులిద్దఱు ఈకుటుంబమునకు మూలపురుషులు. క్రొత్తవిధముగ ఫిడీళ్ళుచేసి మిగుల ఖ్యాతిఁగాంచిరి. ఈ వంశమునందు వంశపరంపరగ నీవిద్యయభివృద్ధి యయ్యెను. ఆంద్రియాకొడుకులు ఆంటోనియో (౧౫౫౦-౧౬౩౮) గిరొల్యామొ (౧౫౫౬-౧౬౩౦) అను వారు తండ్రికంటె నెక్కువ రమ్యముగఁ జేయఁదొడఁగిరి. వీరిచే నిర్మింపఁబడిన ఫిడీళ్ళకు నిప్పటికి రు. ౩౦౦౦ మొదలురు. ౪౫౦౦ రు వెలవచ్చును. గిరొల్యానోకుమారుఁడునికోలో (౧౫౯౬-౧౬౮౪) అనువాఁడీకుటుంబములో మిక్కిలి ప్రఖ్యాతిఁ జెందినవాఁడు. ఇతఁడు 'గ్రాండ్ అమటి' అన్న పేరుతో క్రొత్తఫిడీలు నిర్మించెను. ఆకార సౌష్ఠవమందును, లావణ్యమునందును, పనితనపుఁ బరిపూర్ణతయందును, మధుప్రతిధ్వను లీనుటయందును, ఈజంత్రములను మించినవిలేవని చెప్పెదరు.

---

అభ్రకముగాక ఇతర పదార్థములు చేరియుండుటచేత, ఆ మందులగుణము తక్కిన పదార్థముల గుణములే గాని అభ్రకముయొక్క గుణము కాదని ఆంగ్లేయ వైద్యులనేకులు అభిప్రాయ పడుచున్నారు.

(సంపాదకుఁడు.)

వీనికిప్పుడు రు. ౪౫౦౦ మొదలు రు. ౬౦౦౦ వఱకు వెలవచ్చును.

**అమడీయస్.** ౧. ఈ పేరుగల రాజులు తొమ్మిదిమంది ఫ్రాన్సులోని సెవాయ్ సంస్థానమున కధిపతులయిరి. వారిలో ముఖ్యముగఁ బేరొందినవారు ముగ్గురు. (౧) ౫-వ అమడియస్ (౧౨౪౯-౧౩౨౩). ఇతనికి ఘనుఁడు, (The Great) అనిపేరు. ౧౨౮౫ లోఁ బ్రభుత్వమునకు వచ్చెను. యుద్ధములలోఁ జాల కాలము గడిపెను. ర్హోడ్సునకు ముట్టడివేసిన తురుష్కులనోడించివారు లేచి వెళ్లునట్లు చేసెను (౧౩౧౫). తనసంస్థానమునువిస్తరించెను. (౨) ౬-వ అమడియస్ (౧౩౪౨-౮౩) ౧౩౫౪ లో, ఫ్రెంచివారిని నోడించెను. వారితో సంధి చేసికొని యిదివఱకు సెవాయిసంస్థానాధిపులకు లేవని వియన్నా రాజపుత్రులు పేచీలు పెట్టుచున్న యధికారము లన్నిటిని పేచీలు లేకుండునట్లు సంపాదించెను. ఇటలీదేశమందలి ఆల్ఫ్సుపర్వతములవైపు తనరాజ్యమును అభివృద్ధిచేసెను. ఆతఁడు చిన్నసంస్థానాధీశుఁడైనను మిక్కిలి బలవంతుఁడగుటచే యూరోపులోని గొప్పగొప్పరాజు లాతని స్నేహమును సాయమును గోరుచుండిరి. ఆతఁడొక్కఁడే తుర్కీ దేశముమీఁదికి ధర్మయుద్ధమునకై దండెత్తిపోయి వచ్చెను. పదభ్రష్టుఁడైన గ్రీకు రాజును సింహాసనాసీనుఁజేసెను. ఇటలీదేశమందు నేరాజులకుఁ బోరాటమువచ్చినను, ఈతనినిమధ్యవర్తిగఁగోరుకొనుచుండిరి. ఈజియన్ సముద్రమందలి టెనెడాస్ అను దీవిని గుఱించి వినిషియాజనులును, జినోవాజనులును చాల కాలమువఱకుఁ బోరాడి తుదకుదానిని, ఈతని కిచ్చిరి. ఇతఁడు నేపల్సునకుఁబోయి కొన్ని యుద్ధములుగెల్చిఁ ౧౩౮౨ లో నొకయింట వ్యాధితగిలిచచ్చెను. (3) ౮-వ అమడియస్ (౧౩౯౧-౧౪౫౧). ౧౪౧౬ లో స్వతంత్రుఁడని ఆస్ట్రియా చక్రవర్తివలన నధికారము నొందెను. ఇతఁడు డ్యూక్ అన్న బిరుదమును చక్రవర్తివలనఁబడసెను. అంతకుఁ బూర్వమీ సంస్థానాధీశులకు 'కౌంటు' అన్న చిన్న బిరుదమేయుండెను. వర్ సెలీ ప్రాంతమును గెల్చెను. జనెవాయిన్ ప్రాంతమును గొనెను. మఱికొన్ని అధికారములను సంపాదించెను. చుట్టుపట్టునన్న రాజ్యములందలి ప్రజలు పరచక్రములవలన మిక్కిలి బాధపడుచుండగా నీతఁడు తనప్రజల కేవిధమైన బాధయు లేకుండ రక్షించెను. నలువదిమూఁడు సంవత్సరములు రాజ్యముచేసి కుమారునకు రాజ్యమిచ్చిసన్న్యసించి పరిపయ్ లెయను న్నాశ్రమమునందు నివాసముచేసెను. ౧౪౩౯-లో నీతనిని పోపు (క్రైస్తవ శంకరాచార్యునిగ) నెన్నుకొనిరి. ఫ్రాన్సు, ఇంగ్లండు, స్పెయిన్, జర్మనీ, లొంబార్డీ దేశములవారీతనిని ఆచార్యునిగ నొప్పుకొనిరి. ఇటలీలోఁ గొంతభాగము, వెనిషియాలోనివా రొప్పలేదు. తొమ్మిది సంవత్సరముల తరువాత నీతఁడా యధికారమును వదలుకొని (౧౪౪౯) మరలఁ దనయాశ్రమమునకు

బోయెను. ౧౮౫౧ లో జనేవాలో మృతుఁడయ్యె.

౨. (స్పెయినురాజు) ఇటలీదేశమునకురాజయిన విక్టర్ ఇమ్మ్యానుఅల్ అనువాని రెండవ కుమారుఁడు. ౧౮౭౦ లో స్పెయినుదేశమునకు రాజుగ నెన్నఁబడెను. కానియచ్చటి ప్రజలకు నాతనికిఁ బడనందున ౧౮౭౩లో రాజ్యమును వదలుకొనవలసిన వాఁడాయెను. ౧౮౯౦లో మృతుఁడయ్యె.

**అమడియో.** (గియోవనీ ఆంటోనియో, ౧౪౪౭-౧౫౨౨) ఇటలీదేశజుఁడు. పేరొందినశిల్పి, విగ్రహనిర్మాత (Sculptor) ఇతనిపనులలో, వేనిసువాఁడును సేనాధిపతియునగు బార్టోలోమియో కొల్లియోని యనువాని విగ్రహమును దానిక్రిందనుపైనను జేయఁబడిన చెక్కడపుఁ బనియు నా కాలమందలి యతి శ్రేష్ఠపుఁబనులలో నొక్కటి యనియెదరు. మిలన్ పట్టణమందలి దేవాలయముఁగూడ నితఁడు కొంత పనిచేసెనఁట.

**అమరకంటకము.** సెంట్రల్ ఇండియాలోనున్న రీవాసంస్థానము మధ్యప్రాంతమందలి బిలాస్‌పూరు జిల్లాకుఁ దగిలియున్న వైపున మైకలపర్వతము పైనున్న చిన్నపల్లె. ఇది నర్మదానది పుట్టినస్థలము. కావున క్షేత్రముగ నెంచఁబడును. ఇది 3000 అడుగుల యెత్తుననున్నది. చుట్టుపట్టు పదిక్షేత్రములు గలవు. వానిలో నర్మదపుట్టినచోటును, కపిలధారయను జలపతనమును (Water fall), భీముని అడుగులును, సోన్‌ముండయను నవి చూడఁదగినవి. ఇచ్చట పురాతన దేవాలయములునుగలవు. వానిలో నర్మదాదేవి గుడియుఁ గలదు.

**అమరకము.** "అమరకము" అనుపదము, అమరుధాతువు మీఁదఁబుట్టిన భావార్థక కృదంతము. అమరు, అనఁగాకుదురు, పొందికపడు, ఒప్పు, సిద్ధపడు అని అర్థము. కావున అమరకము అను భావార్థకపదమునకు, కుదుర్చుట, పొందికపడుట, ఒప్పుదల, సిద్ధపడుట అని అర్థమగుచున్నది. దీనింబట్టి అమరకము అనుపదము భూస్వామికిని కర్షకునకును తత్ఫల విషయమయి చేసికొనఁబడు నేర్పాటునకు రూఢముఁజేయఁబడినప్పుడు భూస్వామికిఁకర్షకుఁ డీయవలసిన ఫలభాగమునుగురించి యేర్పఱచుకొనఁబడిన ఒప్పుదలయనియు, కుదురుపాటనియు గ్రహింప వలసియున్నది. అయినను, అమరకపదము భూవిషయమునందే రూఢముగాని యితరవ్యవహారములయందలి పొందికను జెప్పదని చెప్పుటకునలనుపడదు. ఈ అమరకపదమునకు మారుగా నీయర్థమునందే పొందిక, కుదురు, అతుకుబడి, అనుపదములుకూడ వాడుకలోనున్నవి. ఈపదములును అమరకపదమువలెనే భూవిషయమగు రూఢ్యర్థమునే చెప్పుచున్నవి. ఈపదముల యర్థమందే (Lease, letting, renting) లీజు, లెటింగు, రెంటింగు, అను నాంగ్లేయపదము

లును ఇజారా, సర్ఖాత్, ఖిరాయ్, పట్టాదరీ మొదలగు హిందూస్థానీ పదములును వాడు కలోనున్నవి. కాని అమరకము, కుదురు, అతుకుబడి పదములవలె భూవిషయకమైన రూఢ్యర్థమునేనిచ్చుచు పై మూడింగ్లీషు పదములును గృహాదికములు ఆద్దెకుయిచ్చుట మొదలైన యర్థములయందుఁగూడ వాడఁబడుచున్నవి. ఈ యర్థమునందు వినియోగింపఁబడుచున్న హిందూస్థానీ పదములుగూఁడ నిట్టివిశాలార్థము నిచ్చుటయేగాక భూవిషయమునం దుపయోగించినప్పుడు అవాంతరభేదములనుగూడఁదెల్పుచుండును. మఱియు, అమరకాదిపదములు భూవిషయమునందు రూఢములై సాధారణముగా వ్యవహరింపఁబడుచున్నను చెట్లు, తోఁటలు, దుకాణములు, సంతలు, గ్రామములు, అడవులు మొదలగు వానియందుఁగూడవాడఁబడుచున్నవి. కాఁబట్టి ఈపదము, అర్థవిచారణచేసి నప్పుడు, యజమానునకును, ఫలపఱచు గుత్తదారునకును జరుగు భూమ్యాదుల ఫలగ్రహణవిషయమగు నేర్పాటునుదెల్పును.

కాఁబట్టి అమరకము విషయమై చర్చించునప్పుడు భూమ్యాదులకును వానియందు హక్కుఁగల యజమానులకును గలసంబంధమునుగుఱించియు, అట్టి యజమానులకును ఫలపఱచు గుత్తదారులకునుగల సంబంధమును గుఱించియు, అట్టి ఫలపఱచుగుత్తదారులకును భూమ్యాదులకునుగల సంబంధమును గుఱించియు విమర్శింపవలసియున్నది. ప్రస్తుతము, అమరకము విషయమై వ్రాయునప్పుడు ముందు భూమివిషయమై చర్చింతము. భూస్వామి, భూస్వామివలన భూమిని అమరకము పొందువాఁడు, ఆభూమిని సేద్యము సేయువాఁడు, అను ఈముగ్గురకును, భూమితో సంబంధము గలదు. ఈముగ్గురికిని భూమితోఁగల సంబంధధర్మముముగ్గురియందుఁగాని యిరువురయందుఁగాని యొక్కనియందుఁగాని యుండవచ్చును. అనఁగా భూమియందు హక్కుఁగల భూస్వామియే ఇతరుల కాభూమి నమరకము సేయక స్వయముగాఁగాని కూలిపనివాండ్ర నేర్పఱచిగాని సేద్యముచేసి ఫల మనుభవింపవచ్చును. లేదా, భూస్వామికిఁ గొంత ప్రతిఫలమిచ్చు పద్ధతి మీఁద భూమిని, అమరకము పొందినవాఁడే తానుస్వయముగాఁగాని కూలి పనివాండ్రను నియమించిగాని సేద్యముచేసి భూస్వామికీయగా మిగిలిన ఫలమంతయు ననుభవింపవచ్చును. అట్లు కానియెడల నట్లమరకముపొందినవాఁడుతిరిగి కొంతలాభము తనకుఁజెందు పద్ధతిమీఁద నింకొకని కమరకము సేయనచ్చును. ఇట్లీముగ్గురికిని భూమి విషయమైజరుగు నేర్పాటు అమరకము. ఈ అమరకము పరస్పరము నమ్మకముమీఁద మూజువాసీగాఁగాని లిఖితరూపకముగాఁగాని జరుగుచుండును. లిఖితరూపకముగా జరిగినప్పుడు భూస్వామి తనభూమిని గుత్తదారునకిచ్చు పద్ధతులన్నియు వ్రాయఁబడు పత్రము

నకు కవులు, సనదు, పట్టా అనియు గుత్త దారుఁడు పై పద్ధతులకుఁ దనయంగీకారమును సూచించుచు వ్రాసియిచ్చుపత్రమునకు, కదపా, కబూలియత్, ముచ్చలికాయనియు పేరులు గలవు. ఈపదములు హిందూస్థానీపదములు. ఈపదముల యాథార్థ్యమునిచ్చు సంస్కృత పదములుగాని, ఆంధ్రదేశ్యపదములుగాని లేవు. పత్రమను సంస్కృతపదమును, కమ్మ యను తెలుగుపదమును, లిఖితసామాన్య మును దెలుపుపదములుగాని కవులు మొద లయిన వానివలె విశేషవాచకములు కావు. అట్టియాథార్థ్యమును దెలుపు విశేషవాచక పదములు కావలసినప్పుడు దీనిని సమాస ములో తత్తద్వాచకపదములతోఁగూర్చి విశే షార్థములయందుపయోగించుకొనవలయును. భూమియొక్క హక్కువిషయమును జర్చించు టకుముందు, భూమి ఎవరిది, ఎటువంటిది, ఎట్లుచెందఁబడినది, అనువిషయములు చర్చింప వలయును.

భూమియొక్క హక్కుతయు నాభూమి గల రాష్ట్రమును బరిపాలించు రాజునదగునా? కాదా? అను విషయ ము. విమర్శనీయము.

భూస్వామ్యము

భూపతియను పదమువలన రాజునకుఁ దన రాష్ట్రమునందున్న భూమికంతకును సంపూర్ణ మైన హక్కుకలదని యోజింపఁదగుటకు వీలు లేదు. నరపతియను పదమున్నను, ఆపదమువలన రాజునకుఁ బ్రజలయందు సంపూర్ణమైనహక్కు లేని విధమువనే భూపతియను పదమువలన రాజునకు భూమియందు సంపూర్ణమైనహక్కు లేదని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. రాజున కున్న నరపతి పదమువలన తనరాష్ట్రప్రజల యోగక్షేమములు కాపాడినందులకుఁ బ్రతి ఫలముగా నితరవిధములయిన పన్నులు ప్రజల నుండి గ్రహించుట కధికారము వచ్చినట్లుగనే భూపతిపదమువలనఁ గర్షకుల యోగక్షేమ ములు కాపాడినందులకు బ్రతిఫలముగా భూమి యొక్క ఫలసాయములోఁగొంత భాగము పుచ్చుకొనుటకు మాత్రమే హక్కుగలదు. కాని భూమియందు సర్వస్వాతంత్ర్యములుగల హక్కు రాజునకున్నట్లు సిద్ధాంతముచేయు టకు వీలు లేదు. రాజునకు భూమియందుఁ గాని యితరవ్యవహారములయందుఁగాని పన్ను పుచ్చుకొనుటకు మాత్రము హక్కున్నట్లు కనిపించుచున్నది.

శ్లో॥ పంచాశద్భాగ ఆదేయో రాజ్ఞాపశుహిరణ్యయోః
ధాన్యానామష్టమోభాగష్షష్ఠో ద్వాదశ ఏవవా॥
ఆదదీతాథషడ్భాగం ద్రుమాంసమధుసర్పిషాం
గంధౌషధిరసానాంచ పుష్పమూలఫలస్యచ॥
పత్రశాకతృణానాంచ చర్మణాంవైదళస్యచ।
మృణ్మయానాంచ భాండానాం సర్వస్యాశ్మ
మయస్యచ॥ మనువు॥

అనఁగా రాజు ప్రజల యోగక్షేమము కొఱకు తానుపుచ్చుకొను శ్రమకుఁ బ్రతిఫలముగాఁ గ్రయవిక్రయాదులవలన వచ్చినలాభమునుండి పన్ను పుచ్చుకొనవలయునని మనుస్మృతియం దుఁ జెప్పఁబడియున్నది. పశు హిరణ్యముల

విషయమున నేఁబదియవ వంతును, పండించిన ధాన్యాదికమునందు నాఱవ వంతుగాని యెని మిదవ వంతుగాని పండ్రెండవ వంతుగాని పన్నును, చెట్లు, రాళ్ళు, తేనె, నెయి,పరిమళ ద్రవ్యములు, ఓషధులు, రసములు, వీని క్రయ విక్రయమువలన వచ్చినలాభములో నాఱవ వంతుపన్నును, ఆకులు, గడ్డి, కూరలు, చర్మములు, దళములు, మట్టికుండలు, రాతివస్తువులు, వీని క్రయవిక్రయము వలన వచ్చిన లాభములో నాఱవవంతు పన్నును, రాజు గ్రహింప వలయునని మనుస్మృతియందు నుడువంబడియున్నది. మఱియు నితరవృత్తుల విషయమందుఁగూడ రాజుగ్రహింపఁదగిన పన్ను విషయమయి స్మృతికారులు వ్రాసియున్నారు. కాని, అవి ప్రస్తుతాంశమున కనవసరము లగుటచే నిందువిస్తరింపలేదు. భూమివిషయమై కర్షకుఁడు పండించినపంటలో నాఱవ వంతుగాని యెనిమిదవవంతుగాని పండ్రెండవ వంతుగాని రాజుపుచ్చుకొనఁ దగునని మనువు (౭-౧౩౦). చెప్పియున్నాఁడు.

మఱియుభూమినిఎక్కువగా క్రయ విక్రయ మాచరించినట్లుగాని కర్షకుని పాఱఁదోలి రాజు పుచ్చుకొనినట్లుగాని పూర్వగ్రంథములయందుఁ గాన్పింపదు. కాని భూస్వామి తనభూమి కుదువ పెట్టుకొనుటకును నితరులకు దానమొనర్చుటకునునధికారము కలిగియున్నట్లు నిదర్శనములు లేకపోలేదు. సేద్యముసేసికొనుటకుఁ గావలసినంత భూమి యున్నందువలనను,భూమి కావలయునని యాచించువారు లేకపోవుటచేతను, భూమికి విరళముగ క్రయవిక్రయాదిక మాచరించుటకవకాశము లేక పోయియుండవచ్చును. రాజు స్వయముగాగాని కూలివాండ్ర నేర్పఱిచిగాని స్వలాభము కొఱకు భూమిని సేద్యముచేయువాఁడు కాకపోవుటవలనను, సేద్యముచేయఁబడిన భూమియొక్క ఫలములోఁ గొంతభాగమును గ్రహించుటకు మాత్రమే యంగీకరించియుండుటచేతను, సేద్యగాండ్రను దొలఁగించి భూమిని రాజు స్వీకరించుట కవకాశము కలిగియుండ లేదని చెప్పినను జెప్పవచ్చును. దీనింబట్టిచూడఁగా సేద్యముగావింపఁబడు భూమియందు రాజునకు సర్వస్వాతంత్రాధికారము లేనట్లు తోఁచుచున్నది.

రాజునకు తనరాజ్యమందలి భూమిమీఁదఁ గొంతహక్కు కలదనుటకు సందేహము లేదు.

పూర్వమీమాంస

కాని ఆహక్కు ఎటువంటిది? 'రైతును భూమినుంచి తొలఁగించునట్టి హక్కుగలదా? లేక రైతునొద్దనుంచి శిస్తుమాత్రము వసూలు చేయు హక్కుకలదా?' యన్న విషయమును గుఱించి పూర్వమీమాంసలో జైమిన్యాచార్యులవారు మీమాంసించియున్నారు. పూర్వమీమాంస అధ్యా. ౬. పాద. ౭. సూత్ర. 3 నందు 'భూమి ఒక్కరాజుసొత్తె కాదు, ప్రజలందఱకు దానియందు హక్కు గలదు' అని చెప్పఁబడినది. సూత్రముపై భాష్యమువ్రాయుచు మాధవాచార్యులవారిట్లు

మీమాంసించి యున్నారు. 'విశ్వజిత్' అను యజ్ఞమునందుఁ జక్రవర్తి తన సర్వస్వమును దానముచేయును. చక్రవర్తి మేతబీళ్ళు, రాజమార్గములు, చెరువులు, కుంటలు మొదలయిన వానినన్నిటిని—అనఁగా వేనిమీఁదఁ బ్రజలకందఱకుఁగూడ హక్కుకలదో వానినన్నిటిని గూడ - దానము చేయవచ్చునా? 'లోకాధిపతికి లోకమంతయు మండలాధిపతికి మండలమంతయు దానముచేయుటకు నధికారముగలదా?' అన్న ప్రశ్నలకు జవాబేమనఁగా, పృథ్వీశ్వరునకు పృథ్విమీఁదఁగాని, మండలేశ్వరునకు మండలముమీఁదఁగాని పూర్ణస్వామ్యములేదు. దిగ్విజయమువలన రాజునకు నెట్టిహక్కులుకలుగును? తన శత్రుఁడైన రాజుయొక్క యిండ్లమీఁద స్వంతభూముల మీఁద స్వామ్యముకలుగును. దుష్టశిక్షణము, శిష్టపాలనము చేయుటకు రాజునకు నందఱిమీఁద నధికారమున్నట్టు చెప్పఁబడినదిగాని, ప్రజల భూములను తీసికొనుటకుఁగాదు. అట్లు లేనియెడలఁ బ్రజలుండు నిండ్లును వారి క్షేత్రములును రాజువేకావలయును. పన్ను తీసికొను నధికారము మాత్రము రాజునకుఁ గలదు. భూమి, ఒక్క రాజుదేకాదు. తమతమ పరిశ్రమఫలమును ననుభవించునట్టి ప్రజలందఱకు నది సామాన్యము. భూమిమీఁదనందఱి ప్రజలకును హక్కుకలదు గనుక, ఒకానొక క్షేత్ర మొకానొక పురుషునకు నిచ్చుటసంభవించినను భూమి నంతయు దానముచేయుట సంభవింపదు. విక్రయముద్వారా కొన్ని గృహములను క్షేత్రములను నీయవచ్చును.* వ్యవహార మయూఖకారుఁడైన నీలకంఠుఁడిదే విషయమును గుఱించి యిట్లువ్రాసెను :-

"క్షత్రియులకు జయమువలన సొత్తువచ్చునని చెప్పఁబడినది. జయింపఁబడిన రాజునకు నేయేగృహ క్షేత్రద్రవ్యములయందు స్వత్వముండెనో యా యాగృహక్షేత్ర ద్రవ్యములయందు జయించినరాజునకు సత్వముగలుగును. జయింపఁబడిన రాజునకు శిస్తువసూలు చేయు నధికారము మాత్ర మే భూములయందు నుండునో వానియందు జయించినవానికి నాహక్కు గలుగును. స్వత్వముకలుగదు." కావున నే సార్వభౌముఁడు సంపూర్ణపృథ్వియు, మాండలికుఁడు మండలమును నిచ్చుటకువీలు లేదని పూర్వమీమాంస యొక్క షష్ఠాధ్యాయమునందుఁ జెప్పఁబడినది. భూమిమీఁది ఆయాగ్రామక్షేత్రములసత్వము, ఆయాభూములు దున్ను వారివి. రాజునకు కరగ్రహణాధికారము మాత్రము గలదు. కావున నిటీవలి పారిభాషిక క్షేత్ర దానాదులయందు భూదానముసిద్ధింపదు. కేవలము వృత్తికల్పనము మాత్రము సిద్ధించును. భూమినిదున్ను వారియొద్దనుండి కొన్నిగృహక్షేత్రాదులయందు స్వత్వముతప్పక యుండును. కావుననచ్చట భూదానఫలము కూడఁ గలు

* వైజైమినీ సూత్రముమీఁద మాధవాచార్యులవారి భాష్యము, జైమినీయన్యాయమాలా విస్తరముచూడుఁడు.

గును."* ఇట్లు ప్రాచీన స్మృతికారుల మతమున రాజునకు భూమియందు మేల్ వరం (శిస్తువసూలు చేసికొను) హక్కు మాత్రమున్నట్లును, కుడివరం (జిరాయితి) హక్కు లేనట్లును స్పష్టము.

భూమియొక్క హక్కు యెవరిది? ఈ హక్కు యెట్లేర్పడినది? ఏవిధముగా రాజువలన నంగీకరింపఁబడినది? అను విషయములిఁక జర్చింపవలెను.

మనుష్యులనాగరకులై యడవులయందు సంచరించుచు, పండ్లు, దుంపలు, ఆకులు, తాము వేటాడిచంపినమృగములు, మొదలగు వానివలన జీవించుచుఁ గాలముగడపినంతవఱకు భూమిని సేద్యముచేయుట తటస్థింపలేదు. తరువాతఁబశువులను, మేకలను బెంచుకొని వానివలన జీవనముచేయుచు నొక ప్రదేశము నుండి యింకొక ప్రదేశమునకుఁ బోవుచుఁ గాలము గడపుచున్న యవస్థయందుఁ దమకుఁ దోఁచినస్థలమందు ననువైనయెడల సేద్యము సేసి ధాన్యాదికమును బండించుకొని తమ కుటుంబ పోషణము చేసికొనుచుఁ దమకిష్టము వచ్చినప్పుడు మఱియొక ప్రదేశమునకుఁబోయి యచ్చట సేద్యముచేసి ధాన్యాదులను పండించుకొనుచు నిలకడలేక తిరుగుచున్న యవస్థయందు మనుష్యునకు భూమియందు హక్కేర్పఱచుకొనుట యసంభవము. కనుక నట్టి యవస్థయందు భూమియందు హక్కేలేదు. ఏపదార్థమునకుఁగాని మనుష్యునకు హక్కేర్పడుటకుఁగొంతకాలమాపదార్థమతని యనుభవమందును, అతని స్వతంత్రాధికారమునందును నుండవలెను. నిలకడలేక తిరుగుచున్న సమయమందు నేప్రదేశమును మనుష్యునకట్టి చిరకాలానుభవ స్థితియందుఁగాని, స్వతంత్రాధికారము క్రిందఁగాని, యుండుట యసంభవము. కాన మనుష్యుఁడట్టియవస్థయందున్నంతకాలము భూమియందుఁ గలుగు హక్కుగాని యాస్తిగాని యతనికేర్పడుట లేదు. తరువాత నిలకడగలిగి మనుష్యకుటుంబములు కొన్నిగాఁ జేరిగాని ఒక్కొక్కటిగాఁగాని యొక్క ప్రదేశమునందు స్థిరపడియుండఁగలిగి నప్పుడు నిలకడగాఁ దాము నివసించి యున్న సమీపమున సేద్యమేర్పఱచు కొన్నప్పుడు మనుష్యునకు భూమియందు హక్కుగలుగుటయు భూమి యాస్తియగుటయు, తటస్థించినది.

ఆయవస్థయందుఁ బ్రతికుటుంబమువారును నేఁటేఁటనొక్క ప్రదేశమే సేద్యము సేయుటయుఁ జిరకాలానుభవము గలిగి యుండుటయు, దానింబట్టి స్వతంత్రాధికారము గలిగియుండుటయుఁ దటస్థించినది. ఆకాలమందు మనుష్యులకు సేద్యమే ముఖ్యజీవనాధారముగనుండి యుండుటంబట్టి వారికి భూమియందు నత్యాదరణదృష్టియు నాశయుఁగలుగుట సంభవించినది. ఆర్యులు ప్రథమమున హిందూదేశమునకు వచ్చినప్పుడు సేద్యము సేయువారుగనే యుండిరి.

* వ్యవహారమయూఖము ఘార్పురేవారి, బొంబాయి (౧౯౧౪), ౪౦-వ పుట.

ఋగ్వేదమందునను,నథర్వవేదమందును,భూమిని నినుపకఱ్ఱుగల నాగఁలితోఁదున్ని విత్తులుచల్లి యవధాన్యమును బండించినట్లు చెప్పఁబడి యున్నది. ఆకాలమునందుఁ జిన్నచిన్న పిల్ల కాల్వలు త్రవ్వి భూమికి నీరెక్కించుకొను సాధనము వారికిఁ దెలిసియున్నట్లే చెప్పఁబడి యున్నది. మఱియు నారెండు వేదములయం దును వ్యవసాయమునకు సంబంధించిన వస్తువు లుపమానములుగా వాడుచుండుటచే వారికి సేద్యమం దధికగౌరవము గలిగియున్నట్లు స్పష్టమగుచున్నది. మఱియు నాసమయమందు నన్నిజాతులవారును సేద్యముసేయుట యేగౌరవ మయిన వృత్తిగాఁ బరిగణించుచుండిరి. దక్షిణ హిందూస్థానమందు, ఆర్యులు ప్రవేశించి తమ నాగరకత నించుమించుగఁ బ్రచురపఱిచిన విషయముంగూర్చి రెండభిప్రాయములు గలవు. అందులో మొదటియభిప్రాయముంబట్టి, ఆర్యు లుత్తరదిశనుండి రెండు పర్యాయములుగా వచ్చి దక్షిణహిందూస్థాన మాక్రమించుకొని నట్లును, నందులోఁ బ్రథమమున సేద్యము సేయు నట్టియుఁ బశువులను బెంచునట్టియు బ్రాహ్మ ణులును, దరువాత యుద్ధనిపుణులగు చేర, చోళ, పాండ్య, రాజుల మూలపురుషులును, జయించి యాక్రమించుకొనినట్లును గొంద అభిప్రాయము. కాని యిది వాస్తవమయిన దని తోఁచదు. రెండవయభిప్రాయమే సహే తుకమయినది. ఆయాశయముంబట్టి యార్యులు దక్షిణ హిందూస్థానమును జయించి యాక్ర మించు కొనలేదుగాని వలసవచ్చి నెమ్మదిగా నీ దేశము నందుఁ బ్రవేశించిరి. ఆర్యులు దక్షిణదేశమునకు రాకమునుపే ద్రావిడరా జులగు, చేర, చోళ, పాండ్యాధిపతులున్నట్లును, వారి దేశమునకాయార్యులువచ్చి వారియాదర ణమువడసి వారియొద్ద నుద్యోగములు సంపా దించుకొని స్నేహభావముతో సంచరించి నట్లును, గన్పించుచున్నది. ఎట్లయినను ఆర్యులు దక్షిణదేశమునకువచ్చి తమనాగరకతను దక్షి ణదేశమందుఁ బ్రచురించుట మాత్రము నిశ్చ యము. ఆర్యులు కృషివ్యాపారము ముఖ్యా ధారముగా నున్నవారని చెప్పుటకు సందే హము లేదు. మనుస్మృతియందుఁ బృథివియం తయుఁ బృథుచక్రవర్తిభార్యయయినట్లును, బ్రప్రథమమున భూమిని బాగుపఱిచి సేద్యము సేయఁదగినస్థితిలోనికిఁ దీసికొనివచ్చినవానికి హక్కుగలిగియుండునట్లును జెప్పఁబడి యు న్నది. దీనింబట్టిచూడఁగాఁ బృథుచక్రవర్తియె యాదిచక్రవర్తి యయినట్లును నితనిపేరిట బృ థివీపదమువచ్చినట్లును మనము యోజించి భూమియందధికారమును బ్రప్రథమమునఁ జెంది యది లభించినస్థలమందు కృషి మూలమున లాభమును గ్రహించినవారిలో మొదటివాఁడు పృథుచక్రవర్తియనియె మన మూహింపవచ్చు ను. ఏది యెట్లయినను మనుస్మృతియందు సేద్యముచేయఁబడిన భూమివలనఁ గలిగినఫల ములోఁ గొంతభాగము తీసికొనుటకు రాజున కధికారము గలదని చెప్పఁబడిన వాక్యములను,

అంతకుఁ బూర్వము వ్యవహారా చరణమం దున్నదని మనువే చెప్పియున్న మాటలంబట్టి మనము గ్రహించి, తదాచార మనాదిసిద్ధ మనియు, పురాణాధారములంబట్టి యోజింపఁగాఁ బృథుచక్రవర్తికాలమునుండి, వచ్చినదని యుఁ దలఁపవలయును. తరువాత గౌతముఁడు (గౌతమస్మృతి ౧౦-౩౯.) విజ్ఞానేశ్వరుఁడు (మితాక్షర 3-౧-౧3,) వీరమిత్రోదయుఁడు (౧-౧3,) మొదలగువారును, సరస్వతీ విలాస మందును(౪౬౬,) కేవలసంగ్రహణమును, నను భవమును, మాత్రమే భూమియందును నీటి యందును దృణాదులయందును వంటచెఱకు మొదలగు నితరవస్తువులయందును మనుజున కధికారము కలుగుటకుఁ గారణములని చెప్పిరి.

ఇక మహమ్మదీయుల కాలములో మహమ్మదీయ శాస్త్రపద్ధతి ననుసరించి భూమి యందు మనుష్యునకెట్టి యధికార మున్నదో యోజింపవలసియున్నది. మతప్రవర్తకుఁడైన మహమ్మదు హిదాయా యను గ్రంథమందు (౪-౪౫,౧౨౯) "బంజరు భూములను సేద్యము చేసినవాఁడు వానికి యజమానుఁడగును" అని చెప్పెను. కాని దీని పై భాష్యము వ్రాసిన యాతనిశిష్యుఁడగు అబూహనీఫా అనువాని మతముననుసరించి సేద్యగానికి భూమియందు సంపూర్ణాధికారము గలుగుటకు దేశాధికారి సమ్మత మవసరమని తెలియును. కాని అతనిశిష్యులగు

మహమ్మదీయులకాలము

ఆబూయూసిఫ్, ఇమాంమహమ్మదు అను వారిమతములంబట్టి సేద్యముచేయఁబడక యనాది బంజరుగాఁగాని అటవీ ప్రదేశముగాఁగాని యున్న ప్రదేశములందుఁ బ్రథమమున సేద్యము చేసిన వానికిహక్కు భుక్తమును గలవని కనిపించుచున్నది (౪-౪౫,౧౨౯). వీనినన్నింటిని బట్టి యోజించి మునుముందుభూమిని సేద్యము చేసిఫలప్రదాయినిగా నొనర్చిన వానికే భూమియందు న్యాయ్యమైన హక్కుగలదని నిశ్చయింప వలసియున్నది. కాఁబట్టి రాజునకు సేద్యము చేయఁబడిన భూమివిషయమై దాని ఫలసాయములోఁ గొంతభాగము మాత్రమే పుచ్చుకొనుటకు నధికారము గలదని స్పష్టమగుచున్నది.

మనుస్మృతియందు రాజు ఆఱవ భాగముగాని యెనిమిదవ భాగముగాని పండ్రెండవ భాగముగాని గ్రహించుట కధికారము గలదనియు, (౭-౧3౦) యుద్ధాది విప్లవములు తటస్థించినపుడు నాలవభాగముపుచ్చుకొనవలయుననియుఁ జెప్పఁబడియున్నది (౧౦-౧౧౮). మఱియు యాజ్ఞవల్క్యుఁడు షష్ఠభాగమును (౧-౫-33౪,౫,౭) ఆపస్తంబుఁడర్ధభాగమును, గౌతముఁడు దశమ భాగమునుగాని అష్టమ భాగముకుగాని షష్ఠభాగముగాని (౧౦-౫-౨౪) బోధాయన (౧-౧౦-౧౮-౧) నారద (౧౮-౫-౪౮) విష్ణువులు (3-౫-౨౨) షష్ఠభాగమును, పుచ్చుకొనుట కధికారము గలదని ధర్మశాస్త్రములందు వ్రాసియు

మన్వాదిస్మృతులు

చిరి. మఱియు మనుస్మృతియందు నే యేస్థితి యందిట్లు రాజునకు భాగగ్రహణమం దధికార ముగలదో, ఎట్టియవసరములయం దింతకంటె నెక్కువగాఁబుచ్చుకొనుట కధికారముగలదో, ఎట్టి సమయములయం దేభాగమును బుచ్చి కొనక యూరకుండవలయునో, ఎట్టెట్టి కాల ములయందు శిక్షావిధిగా పన్నువసూలు చేయుటకు రాజునకధికారము గలదో, సవి స్తరముగాఁ జెప్పబడినది (౭, ౮, ౧౦-వ అ. చూడుఁడు). భూమిపన్ను విషయము యింతసవిస్తరముగాఁ జెప్పఁబడినను హిందూ ధర్మశాస్త్రములయం దెక్కడను సేద్యగాని వలననుండి భూమిని తీసికొనుటకుగాని యట్టి భూమిని మఱియొకనికిచ్చుటకుగాని రాజున కధి కారమున్నట్లు చెప్పఁబడియుండలేదు. కాని మహమ్మదీయరాజుల పరిపాలన కాలమందు పన్నియని భూస్వాములయొద్దనుండి భూమిని దీసికొని మఱియొకనికిచ్చు స్వాతంత్ర్యపద్ధతి యేర్పడినది. మహమ్మదీయుల పరిపాలనకాల ములో భూమిపైని పన్నెక్కువ సేయఁబడిన కారణమున భూస్వాములు భూములను వదలి పెట్టుటయు నట్లు విడుదలచేయఁబడిన భూము లను దమపన్నుకొఱకు మహమ్మదీయ రాజు లితరులకు సేద్యములనిమిత్త మిచ్చుటయుఁ దటస్థించుచువచ్చినది. కాని, హిందూ ధర్మ శాస్త్రముబట్టి పన్నుకొఱకు రాజు భూమిని జప్తుచేసి యితరులకమ్ముటగాని శిస్తునకమ్ముట గాని వాడుకలో నున్నట్లెక్కడను గానరాదు.

పయిన వ్రాసిన విషయముబట్టి హిందూ ధర్మశాస్త్రములయం దెచ్చటను రాజునకు భూమియందు సంపూర్ణ స్వాతంత్ర్యాధికార మెన్నఁడును గలిగియుండలేదనియు నట్టియధి కార మేరాజును చలా యించి యుండలేదని యుస్పష్టమగుచున్నది.

ఇటీవలి ధర్మశాస్త్ర టీకా కారులు

పైని తెల్పిన జైమిని మతము ననుసరించియు రాజునకు భూమియందు సర్వాధికారము లేన ట్లే కన్పించుచున్నది. కాని జగన్నాథతర్క పంచాననుఁడు మాత్రము భిన్నాభిప్రాయము నిచ్చియున్నాఁడు. ౧౭౭౩-వ సంవత్సరము నందు సర్ విలియమ్ జోన్సు అనునాతఁడడు గఁగా రాజునకు సర్వస్వతంత్రాధికారము భూ మియందుఁ గలదని యభిప్రాయ మొసఁగెను. ఇందునకు జగన్నాథతర్కపంచాననపండితుడు పరశురాముఁడు క్షత్రియ నిర్మూలనముం జేసి భూమినంతను కశ్యపునకు ధారవోసినట్లును, నందువలనఁ గశ్యపుఁడు సర్వస్వతంత్రాధి కారముగలిగి భూమి ననుభవించినట్లును నా యధికారమంతయుఁ దరువాత రాజులకుసంక్ర మించినట్లును నందువలన రాజులే భూమియందు సర్వ స్వతంత్రాధికారము గలవారయినట్లును నరసింహపురాణమునుండి యొక యుక్తిని పన్నెను. కాని శ్రీకృష్ణతర్కాలంకారుఁ డిందు లకు సమ్మతింపక భూమి జంతువుల యాధా రము కొఱకు సృజింపఁబడినదగుటవలన భూమి యందన్ని జంతువులకు స్వాతంత్ర్యము గల

దనియుఁ బ్రజలను సంరక్షించిన కారణముం బట్టి రాజునకుఁ గొంతపన్ను పుచ్చుకొనుటకు మాత్రమే అధికారముగలదనియు నీయంశము భాగవత పురాణమునందును మనుస్మృతియందును జెప్పఁబడియున్నదనియుఁ జెప్పి జగన్నాథ పండితునిసిద్ధాంతమును ఖండించెను. వీనినన్నింటినిబట్టి చూడఁగా హిందూసిద్ధాంతముంబట్టి రాజునకు సేద్యములోనున్న భూమియందు సర్వస్వతంత్రాధికారము లేదనియు హిందూ రాజులెన్నఁడునట్టి యధికారమును చలాయించుకొనలేదనియుఁ గనిపించుచున్నది.

మహమ్మదీయశాస్త్రమునననుసరించి యిందు విషయమై కొంతవఱకు భిన్నాభిప్రాయములున్నట్లు పైననే వ్రాయఁబడినదిగదా.

హిందూ దేశముపైకి మహమ్మదీయులు రెండు పర్యాయములు దాడివచ్చినట్లును, ఉత్తరహిందూస్థానము నాక్రమించుకొన్న విధమునఁ గాకపోయినను,

**మహమ్మదీయుల సిద్ధాంతము**

దక్షిణ హిందూస్థానమునుగూడ జయించి స్వాధీనపఱచుకొన్నట్లును జరిత్రలు తెలుపుచున్నవి. క్రీ. శ. ౧౩౦౦ సంవత్సరములో అల్లాఉద్దీను దక్షిణహిందూదేశమును సంపూర్ణముగా జయించెను. క్రీ. శ. ౧౩౪౭ సంవత్సరములో కృష్ణానదివఱకు మహమ్మదీయుల యధికారమునకు లోఁబడెను. రాజునకు భూమియందధికారమున్నదను సిద్ధాంతము మహమ్మదీయులదిగాని హిందువులదిగాదు. బలవంతముగా జయింపఁబడిన దేశమును ఇమామ్ సెలవ్రమీఁద బంచిపెట్టుటకుగాని అంతకుఁ బూర్వమున్న భూస్వాముల యనుభవమునందే యుండనిచ్చుటకుఁగాని రాజునకు స్వాతంత్ర్యముగలదని మహమ్మదీయుల యభిప్రాయము. జిజియత్తు అను తలపన్నునుగాని ఖరాజ్ అను భూమి పన్నునుగాని విధించి పూర్వపు భూస్వాములనే భూమిననుభవింప నిచ్చుచుండిరి. ఊషర్ అను పన్ను మాత్రము మహమ్మదీయుల వలన వసూలుచేయుచుండిరి. హిందూదేశమున, ఆబూహనీఫాసిద్ధాంతమిదియే. ఈసిద్ధాంతమునే మనదేశమున మహమ్మదీయులనుసరించిరి. ఇతరమహమ్మదీయశాస్త్ర సిద్ధాంతముంబట్టి జయింపఁబడిన దేశమునందలి సేద్యమందున్న భూములన్నియు నాయాభూస్వాముల యనుభవములో నుండనిచ్చినను వానియందలిసంపూర్ణాధికారము మాత్రము రాజుదేయని కనిపించుచున్నది. లేక జుగత్ అనుభూమిపన్ను, అతిసులభమైనది గనుక మతాభిమానముంబట్టి యిదిమహమ్మదీయులకుమాత్రమే విధించిరి. ఖరాజ్ అనుపన్ను బలువైనది. ఇది మహమ్మదీయేతరులకు విధించిరి. మహమ్మదీయులకుఁగూడఁ గొన్నిపట్ల ఖరాజ్ అనుపన్ను విధించుట సంభవించినది. ఈఖరాజ్ అను పన్ను సేద్యము చేయఁబడిన భూమివంతటను వసూలు చేయవలయు నని అల్లాఉద్దీను మొదలైన మహమ్మదీయ ప్రభువులు, అనేక పర్యాయములు ప్రయత్నించిరి. కాని అంతకు

బూర్వము హిందూరాజులకాలములో వాడు కలోనున్న విధముగా భూమియొక్క ఫలసాయములోఁ గొంతభాగము మాత్రమే వసూలు చేయఁగలుగుచుండిరి. తరువాత షేర్ఖాన్ సలీమ్‌ఖాన్ అనువారు ఫలసాయములో భాగమునకు మారుగా రొక్కము పుచ్చుకొను పద్ధతి నెలకొలిపిరి.

పిమ్మట, అక్బరుపాదుషా కాలములో సేద్యము చేయఁబడుభూమియొక్క విస్తీర్ణమును, ఫలమును యోచించి న్యాయ్యమైన ఖిరాజ్ పన్ను వసూలు చేయుపద్ధతి యేర్పడెను. ఇట్లుమహమ్మదీయ ప్రభువులు ఖిరాజ్‌ను వసూలుచేయుచున్నను, దీని నిచ్చుచున్నంతవఱకు భూమిని లాగికొనుటకుగాని, అట్టిభూమిని మఱియొకరి కిచ్చుటకుగాని, అధికారము కలిగి దానిని చెలాయించినట్లు కనుపడదు. అట్టిభూము లితరులకిచ్చినప్పుడు తమకువచ్చుచున్న పన్నులు వసూలుచేసికొనుటకు మాత్రమే అధికారము పొందినట్లును, భూమియందు సర్వస్వాతంత్రాధికారము పొందనట్లును కన్పించుచున్నది. ఈ విషయముంబట్టి యోజింపఁగా భూమిపైని స్వతంత్రాధికారవిషయమై హిందూమహమ్మదీయ మతములకు భేదమంతగాఁ గానిపింపదు. కాని హిందూరాజుల కాలమందు వలెగాక తురకరాజుల ప్రభుత్వమందు భూమిపన్ను మిక్కిలిగా హెచ్చింపఁబడుటచేత భూస్వాములు భరింపఁజాలకుండిరి. లుండీ పలాన్ అను పరగణాలు ఔరంగజీబును, అక్బరాబాద్ ఇలహాబాద్ అను కోటలు కట్టుటకొఱకుఁగొన్ని భూములు, అక్బరుపాదుషాయును, షాజిహనాబాద్ కోటకట్టుటకు గొన్ని భూములను, షాజిహానును, ఔరంగాబాద్ అనుకోటను గొన్ని మసీదులును గట్టుటకుఁ గావలసిన భూములను అలంగర్ పాదుషా యును భూస్వాములవద్దనుండి కొనుటచూడఁగా మహమ్మదీయుల కాలమందుఁగూడ రాజులకు భూమియందు సర్వస్వాతంత్రాధికారము లేనట్లు గ్రహింపవలసియున్నది.

మహమ్మదీయులు హిందూదేశమును జయించినప్పటికిని నంతకు మున్నున్న పద్ధతులను, వ్యవహారాచారములను, సంపూర్ణముగా మార్చివేసి క్రొత్తక్రొత్త వ్యవహారపద్ధతుల నేర్పఱచలేదు. తరువాత నాంగ్లేయ ప్రభుత్వ మారంభమైనపుడు

బ్రిటిషు అధికారుల యభిప్రాయము

మొదట నాంగ్లేయదేశ వ్యవహారపద్ధతి ననుసరించి భూమియందలి సర్వస్వాతంత్రాధికారము రాజులదేయని యుద్దేశించిరి. మహమ్మదీయ ప్రభువుల కాలమందు భూమిపన్ను ఎక్కువ చేయఁబడుటవలన సేద్యము చేయుటయందు లాభములేక కొందఱును, పేదవడికొందఱును, భూములను వదలుచుండుట తటస్థించినది. అట్టి భూములపై శిస్తురాకపోవుటవలన సర్కారునకు నష్టము వచ్చునని వాని నితరులకు నమర్చుట సంభవించుచు వచ్చినది.

మఱియు జనసంఖ్య హెచ్చుటచేతను, సేద్యముచేయుటకుఁ గ్రొత్తభూములు కావలసి వచ్చుటచేతను, ఎన్నడును కృషిలేక బంజరుగానున్న భూములను పన్నుగట్టి కొందఱ కిచ్చుచుండుట సంభవించుచువచ్చినది. ఈ సందర్భమును బట్టి ఆంగ్లేయులు మహమ్మదీయ ప్రభువులకు సర్వస్వతంత్రత భూమిపైఁ గలదనియు, వారు హిందూరాజుల వ్యవహార పద్ధతులను సంపూర్ణముగా మార్చియుండక పోవుటవలన వారికిఁగూడ నట్టి స్వాతంత్ర్యమే యుండినదనియు, నభిప్రాయపడి యుండవచ్చును.

ఇంగ్లండునందలి పూర్వపుఁబద్ధతిప్రకారము రాజే భూమియంతకును బ్రభువు. కావున హిందూదేశమునందును నట్టిపద్ధతియే యున్నదనుకొని భ్రమపడి క్రీ. శ. ౧౭౯౬-వ సంవత్సరమునందు మద్రాసు ప్రభుత్వమువారట్టి యభిప్రాయమును దెల్పిరి.[1] కాని రెవిన్యూ బోర్డువారు వెంటనే యా యభిప్రాయము సరియైనదికాదని తెలిపిరి.[2] హైందవులయిన రైతుల హక్కులనుగుఱించి మిక్కిలి వ్యతిరేకాభిప్రాయముగల సర్ థామస్ మన్రోవంటివాఁడుగూడ "హిందూదేశమున భూమిఖామందన్న బిరుదెవనికన్నఁ జెల్లునెడ నది రైతునకే చెల్లును. అతఁడు భూమియందలి హక్కులన్నియు దొరతనమువారితో సమానముగఁ బంచుకొనును. దొరతనమువారికి లేనిహక్కు లాతనికి భూమియందుఁగల్గును. ఇష్టమువచ్చినప్పుడుగాని, కొన్ని సంవత్సరములకు గాని వానిని వెడలఁగొట్టుటకు వీలులేదు. ఇంకొకఁడెక్కువ శిస్తు ఇచ్చెదనన్న నాతనిని వెడలఁగొట్టుటకు వీలు లేదు" అని చెప్పియున్నాఁడు. ఇందునగుఱించి జేమ్సు స్టుఅర్టుమిల్, ఈ విధముగ వ్రాసియున్నాఁడు:- "రైతునకు భూమియందు స్వత్వమున్నదనుటకు సందేహము లేదు. కాని యాస్వత్వ ముపాధిసహితము (With a limitation). దొరతనము వారికి భూమియందు స్వత్వమున్నదనుటకు సందేహము లేదు. కాని, యదియు నుపాధిసహితమే. రైతుస్వత్వమునకు దొరతనమువారి స్వత్వము ఉపాధి, దొరతనమువారి స్వత్వమునకు రైతుస్వత్వముఉపాధి"[3].

భూమియొక్క స్వామ్యమెవరిదియన్న విషయమునుగుఱించి భేదాభిప్రాయములన్నియు నాలోచించి మద్రాసు గవర్నమెంటువారీక్రింది తీర్మానముఁ జేసిరి.

"(1) అనాదికాలమునుండివచ్చుచున్న యాచారమునకు వ్యతిరేకముగ, దొరతనమువారికి బంజరు (Unoccupied) భూములలోని లోహములపైఁ బూర్ణాధికారమున్నదని చెప్పుటకు వీలు లేదు. కానిభూమిలోఁబండిన ధాన్యాదులలోనుండి పాలుతీసికొనుటకు దొరతనమువారికెట్టి హక్కుకలదో యట్టిహక్కే ఇందును గలదు. (2) భూమియందు రైతునకు నిర

1. Mirasi papers, 23.

2. Mirasi papers, 33.

3. As quoted in Srinivasaraghava Iyengar's Forty year's Progress of the Madras Presidency p. 57.

పాధికమైనట్టియు (absolute) పూర్ణమైనట్టియు (complete) స్వత్వము(Proprietary right) గలదు. ప్రభుత్వ వ్యయములకై పంటలోఁ గొంతభాగమాతఁడు ప్రభుత్వమువారి కీయవలయునన్న షర్తుకుమాత్ర మీహక్కు లోఁబడియుండును. (3) రైతునకు తనభూమితాకట్టు పెట్టుకొనుటకును, అమ్ముకొనుటకును, మరణశాసనముద్వారా ఎవరికైన నిచ్చివేయుటకును నధికారముగలదు. (4) ఈసిద్ధాంతముల ననుసరించి భూమి, అనాదికాలమునుండియు నొకనియొద్దనుండి మఱియొకనికిఁ జెందుచున్నది. కావున శాస్త్రప్రకారముగాని, ఆచారప్రకారముగాని, ఎన్నడును దొరతనమువారికి లేనట్టిదియు, దొరతనము వారెన్నడును గోరనట్టిదియు నగు నీహక్కు (భూమియందుఁదమకు స్వత్వముఁగలదన్న క్రొత్తహక్కు) గలదని దొరతనమువారు నేఁడందురేని (ఆ ప్రదేశమునందుఁ బ్రజలలో దొరతనమువారియెడ) అపనమ్మికయు, అసంతృప్తియుఁ గలుగును. వీనిని తొలఁగించుటకెంతయో దీర్ఘకాలముపట్టును. (5) క్రొత్తగాభూమిరైతునకు నమరకము సేయునపుడు, ఆభూమిలోని లోహములన్నిటిపై దొరతనమువారికి సర్వస్వాతంత్ర్యము గలదన్న షర్తు రైతు ఒప్పుకొనవలయునని చెప్పుట, దొరతనమువారి హక్కులను ననావశ్యకముగ సాగదీయుటయే. విశేష సమయములయందుఁ బ్రజలలాభమునకు నావశ్యకమేని యిట్టిషర్తు పెట్టినఁ బెట్టవచ్చును. (6) ఇదివఱకు రైతాధీనమైన భూమినిగుఱించియు, ఇఁకముందు వ్యవసాయము నిమిత్తము రైతాధీనము కాఁబోవు భూమిని గుఱించియు నిట్టిషర్తు పెట్టుటవలన నేమియుఁ బ్రయోజనముండదు. జనులమనస్సులో నపనమ్మికపుట్టించి దానిని నెక్కువగ వ్యాపింపఁజేయుటకుమాత్ర ముపయోగపడఁగలదు."*

ఇట్లు భూమియందు స్వత్వము గలవాఁడు రైతు. అనఁగా వ్యవసాయముచేసి పండించువాఁడు. అందులో కొంతపాలు శిస్తుగఁ దీసికొనుహక్కు కలవాఁడు రాజు. కొందఱి యభిప్రాయప్రకారము భూవిషయమై, రాజు, రైతు, మధ్యవర్తులు భాగస్థులు. రాజు నిద్రఁబోవు (Sleeping) భాగస్థుఁడు. లాభములోఁ దక్కువపాలుఁ దీసికొనువాఁడు. రైతు వ్యవహారముఁజేయు భాగస్థుఁడు. లాభములో నెక్కుడు భాగముఁ దీసికొనువాఁడు. కావున భూమినిగుఱించి రాజునకు రైతునకు మాత్రము హక్కుండును. మూఁడవవాని కెవనికిని హక్కుండనేరదు. కాని రైతే ప్రకారము తనహక్కును నితరులకిచ్చివేయనచ్చునో యట్లే రాజుగూడఁ దన హక్కును నితరుల కీయవచ్చును. రాజు హక్కు అనఁగా శిస్తు వసూలు చేసికొను హక్కు. రైతునొద్దనుండి తాను స్వయముగ రాజు శిస్తువసూలుచేయక, మధ్యవర్తి నొకని నేర్పాటుచేసి వాఁడు రైతులయొద్దనుండి

* G. O. No. 1008, dated 21st, September, 1882.

శిస్తు వసూలు చేసికొనునట్లును, అందుఁగొంత ప్రతిఫలముక్రింద వాఁడు తీసికొనునట్లును, కొంత రాజునకిచ్చునట్లు, ఏర్పాటు చేయ వచ్చును. ఈ యేర్పాటు లనేక విధములుగ నుండవచ్చును. వాని వివరమంతయు ముందుఁ జెప్పఁబడును. ఇచ్చటఁ జూడవలసినదేమనఁగా, 'ఈమధ్యవర్తికి భూమియందు నెట్టిహక్కు గలదు? ఆతనికి భూమియందు స్వత్వముగలదా?' యన్న యంశము. రాజుకే లేని హక్కు వీరికెట్లు వచ్చును? రాఁజాలదు. కావున వీరికిఁగూడ శిస్తు వసూలు చేసికొను హక్కు కలిగి యుండునే కాని భూమియందు స్వత్వము గలిగియుండదు. కాని, యీసంగతిఁ బాటింపక పెక్కురు జమీందారులు తమకు భూమియందు స్వత్వమున్న దనియు, తమ రైతులను తమ యిష్టమువచ్చి నప్పుడు భూమినుండి తొలఁగించుటకుఁ దమకు నధికారమున్న దనియుఁ జెప్పఁదొడఁగిరి. దొరతనమువారును దమకు భూమియందు స్వత్వ మున్న దని భ్రమపడి, భూమియొక్క స్వత్వము జమీందారుల కిచ్చితిమని ౧౮౦౨-వ సంవత్సరపు ౨౫-వ రెగులేషనులోఁ జెప్పిరి. కాని, వారు తమ పొరబాటును గొంతకాలమునకుఁ గనుఁగొని ౧౮౨౨-లో ౪-వ నెంబరు రెగ్యులేషన్ అమలులోనికిఁ దెచ్చిరి. రైతులకు భూమియందు నంతకుఁ బూర్వమున్న హక్కులకు భంగము గలిగించుట ౧౮౦౨-వ సంవత్సరపు ౨౫-వ రెగ్యులేషన్ యొక్క యుద్దేశము గాదని యిందుఁ జెప్పఁబడినది. ఇట్లు దొరతనము వారు చెప్పినను, జమీందారులు మాత్రము వీలయినంతవఱకు రైతునకు భూమి యందు స్వత్వము, అనఁగా జిరాయితి హక్కు, లేదని యనుటయు, రైతులు జమీందారులు పోరాడి కోర్టుల కెక్కుటయు, కొన్ని తీర్పులిట్లు, కొన్ని తీర్పులటునగుటయు, ౧౯౦౮-వ సంవత్సరమున "ఎస్టేటుల్యాండు ఆక్టు" (౧౯-వ చట్టము) నిర్మింపఁబడువఱకు జరుగుచునే యుండెను. ఈ చట్టము వచ్చినప్పటినుండియు జమీందారి రైతులకందఱకు జిరాయితిహక్కు గలదన్న సిద్ధాంతము స్థిరపడిపోయినది. కాని అగ్రహారములలోని రైతుల హక్కునుగూర్చియు, ఈ నాముల రైతుల హక్కునుగూర్చియు, ఈ చట్టము స్పష్టముగ నేమియుఁ జెప్ప నందున, ఈనాముదారులకు వారి రైతులకు నింకను పెక్కు వ్యవహారములు జరుగుచునే యున్నవి. రైతువారి అమరకపు భూముల పట్టాలుగల వారు పెక్కుమంది ఎక్కువ భూములుండుటవలనను, స్వయముగ వ్యవసాయము చేయుటకు నోపికయు, వీలును లేనందునను, తమ భూము లెల్లప్పుడును రైతులకే అమరకము చేయుచుందురు. ఇట్టి రైతులకు నాభూమియందు నెట్టి హక్కుగలదన్న విషయ మింకను విచారణీయము.

రాజుభూస్వామితోఁగాని భూస్వామి సేద్యగానితోఁగాని భూమిపన్ను విషయమైగాని ఫలసాయము లోనిభాగ విషయమైగాని, అట్టి భాగమునకు సరియైన ఖరీదుగల రొక్కము

విషయమైగాని, జరుపుకొను నేర్పాటే అమ రకము. భూమిపన్ను వసూలుచేయు విషయ ములో ననేక విధములగు నేర్పాటు లున్నవి. భూమికిని భూస్వామికిని గాని, భూమికిని సేద్య గానికిని గాని, గలసంబంధము లనేక విధము లైనవి. ఇట్టిసంబంధ భేదములంబట్టి క్షేత్రాను భవములు(Tenures)కూడ ననేకవిధములైనవి. ఇందు,పన్నిచ్చుచు ననుభవించునవి కొన్నియు, పన్నీయనక్కఱ లేకుండ ననుభవించునవి మఱి కొన్నియు నున్నవి.

నిలకడ గలిగి యొకప్రదేశము నాక్రమించి యందు గృహములు గట్టుకొని మనుష్యులు కాపురముసేయు నునికి పట్టునకుగ్రామము,అని పేరు. ఇట్లు గ్రామ

గ్రామము, గ్రామస్థులు, వారిక్షేత్రములు

మందు నివసించు గ్రామస్థులకును నాగ్రామ మున కందుబాటుగా నుండు భూమికిని గలసం బంధమును, గ్రామస్థులం దొండొరులకుఁ గల సంబంధమును, గ్రామస్థులకుఁ దాముసేద్యము సేయు భూమియందుఁగల హక్కును, మనము విమర్శించి నిశ్చయింప వలసియున్నది. ఈవిన్యా వ్యవహారమునకు గ్రామము ముఖ్యమైనది. కావున గ్రామము యొక్క విధములును నవి యేర్పడిన యేర్పాటులును జక్కఁగాఁ దెలిసి కొనుట యవసరము. భూమిని బాగుపఱచి సేద్యమున కర్హముగాఁ జేయుటకును, వన్య మృగముల వలని బాధలను దప్పించు కొను టకును, అన్యోన్య సాహాయ్యము చేసి కొనుచు నొక్క గ్రామములోని వారందఱు గలసి తమక్షేమ లాభములకై పాటుపడుట, అత్యావశ్యకముగా నేర్పడినది. అందువలన గ్రామస్థు లందఱకు నొకవిధమగు స్నేహ బంధమును స్థలాభిమానమును గలుగుట తట స్థించినది. హిందూదేశ మందలి గ్రామముల స్వభావములను బరిశీలించిన యెడల రెండువిధ ములుగా గ్రామములు విభజింపఁ బడఁదగి యున్నవి.

ఇందు, గ్రామములలోఁ గృషిసేయఁబడు క్షేత్రములు వేఱువేఱుగా గ్రామస్థులలో నొక్కొక్కనిహక్కుగా నెంచఁబడుచుండునవి యొకవిధమైనవి. ఇట్టి గ్రామములు రైతువారీ గ్రామములని చెప్పఁబడును. ఇట్టిగ్రామముల లోని గ్రామస్థులు ప్రత్యేక క్షేత్రములు (వేఱు వేఱు పొలములు) కృషిచేసికొని యొకరితో నొకరు సంబంధము లేనట్లున్నను దమక్షేమ లాభములకొఱకుఁ దమలో బలవంతుఁడగు నొక్కని గ్రామాధికారిగా నెన్నుకొని యత నికి లోఁబడి గ్రామస్థులపనులు నెఱవేర్చుటకు గొందఱను గ్రామసేవకుల నేర్పఱచుకొని సుఖము గానుందురు. ఈ గ్రామాధికారిని పటేలు, లంబార్ దారు, రెడ్డి, పెత్తనదారు, మొదలగు పేర్లతోఁ బిలుతురు. ఇట్టిరైతు వారీగ్రామములు మదరాసు, బొంబాయి, బిరారు, రాష్ట్రములయందును మధ్యపరగణా లయందును విస్తారముగానున్నవి. మధ్యపర గణాలలోని గ్రామముల స్వభావము తర్వాత

మార్పఁబడినను బ్రథమమున నిట్టిదియే యని నిశ్చయింపవలెను. బంగాళా రాజధానిలోని గ్రామములుకూడ నిట్టివియే యైనను అనేక గ్రామములనుగలిపి పరగణాలుగను, జమీందారీమెస్టేట్లుగను నేర్పఱచి జమీందారీ సెటిల్‌మెంటుచేసియున్న హేతువున నారాజధానియందలి గ్రామముల స్వభావమంతగా విచారణీయముగాఁ గనుపింపలేదు. ఇఁక రెండవ తరగతి గ్రామముల స్వభావము విచారింతము. ఒకఁడుగాని యొకకుటుంబమువారు పలువురుగాని పరస్పరసంబంధ బాంధవ్యము గల యొక్క తెగవారుగాని యొక్కచో గ్రామమును నిర్మించుకొని యాగ్రామమునకు సంబంధించిన భూమియంతయు తమస్వాధీన భుక్తమైనదిగాఁజేసికొని తరువాత కుటుంబము వృద్ధియై జనసంఖ్యహెచ్చినప్పుడు పైభూమియంతయు పిత్రార్జితమువలె భాగములుగాఁ బంచుకొని యనుభవించుచుండునవి రెండవతరగతి, గ్రామములు. ఇట్టి గ్రామములలో గ్రామస్థులందఱు నించుమించుగా సమానమైనహక్కుగలవారు. కనుక గ్రామాధికారినొకని నియమించుకొని యతనికి లోఁబడియుండక వారందఱుగలసి యొకపంచాయితీనేర్పఱచుకొని గ్రామ వ్యవహారములు చక్కఁబెట్టుకొనుచుందురు. ఈ రెండవతరగతి గ్రామములు, "ల్యాండులార్డువిలేజీలు" అని పిలువఁబడును. రైతువారీగ్రామములలో సేద్యములోనున్న భూమి యంతయు నన్యోన్యసంబంధములేని వేఱువేఱుక్షేత్రములుగా వేఱువేఱు గ్రామస్థుల భుక్తములోనుండును. ల్యాండులార్డువిలేజీలో సేద్యములోనున్న భూమియంతయు గ్రామస్థులు తమతరతరములంబట్టి భాగములుగలిగి యనుభవించుచుందురుగాని యాభూమియంతయు సంఘాధికారము గలదిగా నుండును. ఒకప్పుడు రైతువారీ స్వభావము గల గ్రామము ల్యాండులార్డు గ్రామముగా మాఱుటగూడగలదు. అదితిరిగి రైతువారీ గ్రామముగానుండుట తటస్థించును.

ఇట్టి మార్పులు దక్షిణహిందూస్థానమునందలి గ్రామములలోఁ గలిగినవి. మదరాసు రాజధానిలో చెంగల్పట్టుమొదలైన జిల్లాలలోనున్నగ్రామము లొకప్పుడు ల్యాండులార్డు గ్రామముల స్థితియందుండి మిరాశీగ్రామములని పిలువంబడుచుఁ దరువాత రైతువారీ గ్రామములై పోయినవి. ల్యాండులార్డుగ్రామములు పైనిచెప్పినప్రకారమునకేకాక యితర విధములుగాఁగూడ నగుచున్నవి. ఇట్టిగ్రామములు పట్టీదరీ గ్రామములనియు, భాయిచారా గ్రామములనియు, రెండువిధములు. ఈ రెండు విధములలో లక్షణములు సంపూర్ణముగాఁ బట్టనవికూడగలవు. ల్యాండులార్డుగ్రామముల మీఁది భూమిపన్ను గ్రామస్థులకున్న భాగముల వరుంబడినిబట్టి గ్రామము శిస్తంతయు వసూలు చేయఁబడుచుండెడు గ్రామములు నాలుగు విధములు.

(1) ఒకఁడేఅధికారిగాఁగలవి. వీనిని'జమీం ధారీ ఖాలీస్' అందురు.

(2) అవిభక్తులైన కొందఱ భుక్తములో నున్నవి. వీనిని 'జమీందార్ ముస్తార్కా' అందురు.

(3) కూటస్థానుసారభాగములు (Divided on ancestral shares) గలవి లేక పట్టీదారి గ్రామములు.

(4) సంపూర్ణలక్షణము లేని పట్టీదారి గ్రామములు.

గ్రామస్థులు తాము కేవలము భుక్తపఱచు కొనుచున్న క్షేత్రము మెట్టభూమిలో నెన్నవ వంతో మెట్టగ్రామముశిస్తులో నన్నవవం తె శిస్తుయిచ్చు గ్రామములు. రెండవ తరగతి ల్యాండులార్డు విలేజీ గ్రామములు. ఇవి రెండు విధములు.

(1) భాయిచారా.

(2) అసంపూర్ణ భాయిచారా.

ఈల్యాండులార్డు గ్రామము లేర్పడుటకు మూఁడు కారణములుగలవు. అందు 1 బలవంతుఁడగు నొక పురుషుఁడు గ్రామమును

వీ నియుత్పత్తి

నిర్మించి యాగ్రామమునకంతయు హక్కు గలిగి యుండుటవలనగాని యొకరివలన బహుమతిగాగాని దానపూర్వకముగా చెందియుం డుట వలనగాని, గ్రామముయొక్క భూమి పన్నంతయుఁ జెల్లించుటకుఁ గుత్తగొని యుం డుటవలనఁగాని, సంభవించుట. (2) పూర్వపు రాజుల యొక్కయు, నధికారుల యొక్కయు, కుటుంబములు విభక్తములై గ్రామములు పంచుకొనుటవలన సంభవించుట.(3) ఒకతెగ వారందఱుఁగలసి యొక్కగ్రామము నిర్మించు కొని యందా తెగకంతకును హక్కు, భుక్తాధి కారమునుగలిగియుండుట. ఇందు మొదటి రెండు కారణములవలనఁగలిగిన గ్రామములు సంయుక్తరాష్ట్రము(United Provinces) నందును, ఆగ్రా,అయోధ్యాపరగణాలయందును, సాధారణముగా నున్నవి. మూఁడవ కారణమువలన సంభవించిన గ్రామములు పంజాబు పశ్చిమోత్తర పరగణా (North west Frontier) ప్రదేశములయందుఁ గాన్పించును. ఇందు జాటులు, గుజరులు, రాజపుత్రులు, మొదలగు తెగలవారు నిర్మించిన గ్రామము లనేకములు గలవు. పై మూఁడు కారణములు కాక గ్రామములో నొక కుటుంబ మేకారణముననో ప్రబల స్థితికివచ్చి బలాత్కారముగా గ్రామమంతయు స్వాధీనపఱచుకొనుటవలనఁ గాని, యలజడి సమయములయందొక బలవంతుఁడు గ్రామమును బలాత్కారముగా స్వాధీన పఱచుకొనుటవలనఁగాని, యిట్టిగ్రామములు గలుగుటగూడ సంభవించెను. రెండవ కారణమువలనఁ గలిగిన గ్రామములు పశ్చిమ సముద్రతీరమున మళయాళదేశమునందుగన్పించుచున్నవి. పూర్వ మాదేశమును బరిపాలించినరాజులును, రాజసంబంధులును, గణించిన

వెనుక, వారియధికారముపోయిన పిదప, వారి వంశస్థులు గ్రామాధికారులై యుండఁబట్టి యాగ్రామములు ల్యాండులార్డ్సు గ్రామము లగుట తటస్థమైనది. ఇప్పుడున్న నాయర్ జన్మి భూస్వాములట్టివారే. 'జన్మి' అను పదము జన్మశబ్దమువలనఁ బుట్టినది. కావున వారికి భూమియందు జన్మసంబంధమైన హక్కుగలదని యూహింపఁదగినదిగానున్నది. మద్రాసు రాజధానియందలి గ్రామములు సాధారణముగా రైతువారీ గ్రామములని యిదివఱకే చెప్పఁబడియున్నది. ప్రప్రథమున నన్యోన్యరక్తసంబంధములేని కొందఱుగలసి యొకగ్రామమునునిర్మించి యట్లు గ్రామమును గట్టిన వారందఱు వేఱువేఱు క్షేత్రములను సేద్యము చేసికొనుచుఁ దాము సేద్యముచేసిన భూములమీఁదిపన్నులు మాత్రమే యిచ్చుచు నొక గ్రామాధికారి యధికారమునకు లోఁబడియున్న కారణమువలన నీగ్రామములు గలిగినవి. ఇందుఁ బ్రప్రథమమున గ్రామమును నిర్మించినవారి కుటుంబములలోఁ జేరినవారికి భూమియందు నెక్కుడు హక్కుగలిగి యా హక్కు నేటికిని నేదియో విధమున నామ మాత్రమైన ననుభవించుచున్నారు. ఈహక్కు ఖణియాచి, కాణాచి, మిరాశీ, అను పేళ్లతో నొప్పుచున్నది. ఇట్టి గ్రామములు తంజాపూరు, చెంగల్పట్టుజిల్లాలలోనున్నవి. చెంగల్పట్టుజిల్లా పూర్వపు తొండమండలములోఁ జేరినది. క్రీ. శ. ౧౧-వ శతాబ్దమునందు బలవంతులగు వెల్లాలజాతివారీ గ్రామములను స్థాపించిరి. ఈ తొండమండలమునందుఁగొన్ని ల్యాండులార్డ్సు గ్రామములుగూడ నున్నవి. కాని, యవి చోళదేశాధిపతి కొందఱు బ్రాహ్మణుల కుచితముగా నిచ్చుటవలనఁ గలిగినవి. ప్రప్రథమమున నీతొండమండలమున గ్రామముల నేర్పఱచిన వెల్లాలవారు గ్రామములకు సంబంధించిన భూములను నుమ్మడి మీఁద సేద్యము చేయుచుండిరి.

తరువాత మహారాష్ట్రులు దండెత్తి తంజాపూరునందు రాజ్యమేర్పఱచుకొని యా దేశము నాక్రమించుకొన్నప్పుడు గ్రామము లందు గ్రామస్థు లుమ్మడిగా ననుభవించుచున్న పద్ధతిపోయి యవిరైతువారీగ్రామముల క్రింద మాఱినవి. అట్లు మాఱినను బూర్వపు మిరాశీ కుటుంబములవారు తక్కిన గ్రామస్థులకంటెఁ గొన్ని విశేషములైన హక్కు మామూళ్ళను గలిగి యున్నారు. ఇట్టిమిరాశీ కుటుంబములవారు ప్రప్రథమమున గ్రామముల నిర్మించినవారి కుటుంబములలోనివారు. ఇట్టి రయితులు 'ఉట్కాడి' రయితులనియు, తరువాత గ్రామములలోఁ బ్రవేశించి కాపురమున్న యితరులగు రయితులు పాలకూడి, రయితులనియుఁ జెప్పఁబడుచున్నారు.

మదరాసురాజధానికాక హిందూదేశమున నితరప్రదేశములయందుఁ గూడ గ్రామస్థులలో నిట్టిభేదము లున్నట్లు కనుపడుచున్నది.

అందు (౧) "ఖుద్‌ఖాస్తు"* అను వారు :- ఈ రైతులు ప్రప్రథమమున గ్రామమును నిర్మించినవారి సంతతిలోనివారు. వీరితరగ్రామస్థుల కంటె నెక్కుడుస్వాతంత్ర్యము కలిగి యాస్వాతంత్రతను అనుశృతమగు నాచారమువలన ననుభవింపఁ గలిగినవారు. వీరు భూమిపన్నిచ్చు నంత వఱకు భూమినుండి తొలఁగింపఁ బడుటకు వీలగువారు కారు. వీరికి తమభూములను ఇతరుల కిచ్చుటకుగాని యమ్ముటకు గాని యధికారము లేదని సర్ జాన్‌సొర్ (Sir john shore), హారింగ్టన్ (Harrington) అనువారి యభిప్రాయము (౨) పైఖాస్తు అనువారు:- వీరితర గ్రామములనుండివచ్చి గ్రామమునఁ గాపురమున్నవారు. వీరికి పై (ఖుద్‌ఖాస్తు) రైతులకున్న స్వాతంత్రము లన్నియు లేవు. వీరికి ఖుద్‌కాస్తు రయితులకున్న హక్కులన్నియు లేకపోయినను శాశ్వతముగా వంశపారం పర్యమగు హక్కుమాత్రము లేకపోలేదు. కాని గ్రామమునందు మొదటి తెగవారికుండు గౌరవము మాత్రములేదు. (౩) పాయికారి అనువారు:- వీరు ప్రథమతరగతి రయితుల భూములను సేద్యముచేసి పెట్టుటకు నితర గ్రామములనుండి వచ్చినవారు. వీరిని భూములనుండి యిచ్చ వచ్చినట్లు తొలఁగింప వచ్చును. వీరికి భూములయందేవిధమగు హక్కుగాని గౌరవముగాని లేదు. వీరు మొదటి తరగతి రైతులకు కిస్తు చెల్లించుటలో 'పాయికార' రైతులు. అరవ దేశపు గ్రామములయందు 'వారపత్' 'తీరువాపత్', 'తరిసు' 'పొరంబోక్' అని నాలుగువిధములుగా విభజింపఁబడినట్లు కన్పించుచున్నది. వారపత్ అనఁగా ఫలసాయములో భాగమిచ్చి సేద్యముచేయునది. ఇవి సాధారణముగా పల్లపుసాగుబడికి అర్హమైన భూములు. తీరువాపత్ అనఁగా ద్రవ్యరూపకముగాఁ బన్నీయఁబడినది. సేద్యమయిన బంజరు భూములు తోటలు నిట్టివి. 'తరిసు' అనఁగా గయాళు భూములు. ఇవి రెండువిధములు. షేకల్‌కరంబో, అనఁగా సేద్యము చేయఁబడిన గయాళులును అనాదికరంబొ అనఁగా సేద్యము సేయఁబడని గయాళులును. పొరంబోకి:- సేద్యము చేయఁగూడనట్టి సేద్యమునకుఁ బనికిరాని భూములు. ఇందుఁగొండలు, రాజమార్గములు నదీప్రవాహ ప్రదేశములు, చెఱువులు, జలాశయములు, రుద్రభూములు, మాలపల్లెలు, మొదలైన ప్రదేశములు.

**ఈనాములు, మాన్యములు వగైరా**

తెలుఁగు దేశములలోని గ్రామములు అరవ దేశములలోని గ్రామములవంటివే అయియున్నవి. ఇందుఁగూడభూమియంతయు సేద్యము చేయఁబడుచున్న భూమిగనుగయాళుభూమిగనువిభజింపఁబడియున్నవి. సేద్యమగుభూములు మాన్యములు. అనఁగా సర్కారున కీయఁబడు పన్ను గృహస్థులు వసూలు చేసికొనుటకు హక్కుగలిగినవియు,

*"ఖుద్‌ఖాస్తు" అనఁగా స్వయముగ వ్యవసాయము చేయువారని యర్థము.

'ఖండిగ్రిగలు'అనఁగా సర్కారునకుఁ జెందవలసిన పన్నులోఁ గొంతభాగముమట్టుకే గృహస్థులు వసూలు చేసికొని అనుభవించుటకు హక్కుగలిగినవియునని రెండువిధములు. ఇందు మాగాణిభూములనఁగా పల్లపుపంటపండునవి. ఈభూములలోఁబండుపంటలోనిసర్కారుభాగమునకు 'కోరు' అనిపేరు. రయితుభాగమునకు 'మేడిపాల'నిపేరు. మెరకభూములపై అరవభూములవలెనే రొక్కపుశిస్తువసూలు చేయఁబడుచున్నది. మధుర, తిర్నల్వేలి జిల్లాలలోని గ్రామములకు 'కారె' అనిపేరు. ఈగ్రామములు మిరాశీ గ్రామములవంటివే. అయినను ఇందలి గ్రామస్థులహక్కులు కేవలము మిరాశీ గ్రామస్థుల హక్కులవంటివికావు. మఱియు సముదాయము లేక 'ఫసంకరే' అనుగ్రామములుగూడ కలవు. ఇట్టిగ్రామములలోఁగ్రామస్థులనుభవించుభూమిభుక్తము 'ఫలభాగ' మనియు'ఆచంద్రార్కము' లేక 'అరుండికరే'అనియుఁబేళ్ళు. గ్రామసముదాయమువారు భూమియొక్క మంచిచెడ్డలనుబట్టి కొన్నిసంవత్సరములకొకపర్యాయముపంచుకొనక భూస్వభావములు తెలిసినతరువాత తిరిగి మార్చుకొనకుండ తమభూములను శాశ్వతముగా నుంచుకొనినప్పుడు అవి పైపేళ్ళఁబరగు. ఇట్టిభూములమీఁద సర్కారున కీయఁబడవలసిన సర్కారుభాగము ఆయాభూము లనుభవించువారివియే అయియున్నవి. కావుననిట్టిగ్రామములు గ్రామసముదాయపు హక్కుగల గ్రామములయినను రైతువారీ గ్రామముల స్వభావముగల గ్రామముల లక్షణములనే కలవియైయున్నవి. తంజావూరుజిల్లాలలో 'ఏకభోగము'లేక 'యజమాన్యగ్రామము' అను గ్రామములు గూడ గలవు. చెంగల్పట్టు జిల్లాలలోనున్న మిరాశీ గ్రామముల మిరాశీదార్లు, మిరాశీదార్లుకాని గ్రామస్థులకు దొరతనమువారు భూమినిచ్చి వసూలుచేయు పన్నులుమీఁద 'తుండువరం' లేక 'స్వామిభోగం' అను నొకవిధమయిన రుసుము ననుభవించుటకు హక్కు గలిగియున్నారు. మఱియు నీమిరాశీదారులు 'కాని' లేక 'గ్రామ' 'అనువూరుమాన్యము' అను కొంత సేద్యప్రదేశము పన్నులేక స్వేచ్ఛగా ననుభవించుటకుఁ గూడ హక్కు గలిగియున్నారు. ఈ మిరాశీదార్లకుఁగల హక్కులను గురించి సవిస్తరముగ వ్రాయుటకు నిందు వీలులేదు. మఱియు గ్రామవ్యవహార విషయములను సవిస్తరముగా గ్రామ విషయపై వ్రాయఁబడు వ్యాసమునందు వ్రాయఁబడును.

**రైతువారీపద్ధతి**

ఈ పద్ధతికి అమానీ పద్ధతి యనికూడ నామాంతరముకలదు. ఇందు పట్టాదారగు రయితువలనమధ్యస్థుల యవసరము లేక యే దొరతనమువారు గ్రామోద్యోగస్థుల ద్వారా పన్నువసూలుచేయుదురు. ఈపన్ను పంటలో భాగమురూపముగగాని రొక్కరూపముగగాని వసూలుచేయవచ్చును. ఫలములో భాగరూపముగా వసూలుచేయుపద్ధతి "అసరా"

"వారం" అను పేర్లుగలిగియుండును. కడప, కర్నూలు, బళ్లారిజిల్లాలలో "అప్పనము" అను పద్ధతి యొకటిగూడకలదు. ఈపద్ధతియందు మంచితరగతిభూములకు నెక్కుడగు శిస్తుకట్టి అందులకుఁ బ్రతిఫలముగఁ దక్కువతరగతి భూములను సులభములగు శిస్తులకిచ్చుట కలదు. 'దిట్టము' అనునది వ్యవసాయ తరుణమునందు రైతులంతకుఁబూర్వము సేద్యముసేసిన భూములలో నే యేభాగములు సేద్యముసేయ నిశ్చయించుకొని యేయేభాగములు వదలివేయఁ దలఁచికొనిరో నిశ్చయించుపద్ధతి. రైతులశక్తికి మించిన భూములు వారిపైఁబడ వేయుటవలన వానిని సేద్యముసేయ నేరక కొంతభాగమే సేద్యముచేయఁ గలుగుటవలన శిస్తువసూలు కొరకు నీపద్ధతి ఏర్పాటు చేయఁబడినది. తిరునవ్వేలి; తంజావూరు జిల్లాలలో "ఒలంగు" "మోతాఫైసల్" అనుపద్ధతులున్నవి. ఒలంగుపద్ధతిలోఁ బంటమొత్తమునకు అప్పటిధరల ప్రకారము ఖరీదు కట్టి సర్కారున కీయవలసినభాగము రొక్కరూపముగాఁ బుచ్చుకొనుపద్ధతి. ఇది రైతుకు సమ్మతిలేనియెడల పంటమొత్తములో ధాన్యభాగమునే యియ్యవచ్చును. ఈపద్ధతిలో ధరలు నిర్ణయించుటలోఁ గొన్ని నియమములుగలవు. మోతాఫైసల్ పద్ధతి ఒలంగుపద్ధతివంటిదే. అయినను ధరలు నిర్ణయించు పద్ధతి మాత్రము వేరుగానుండును. తంజావూరు హిందూరాజుల యేలుబడిలో నున్నప్పుడు 'పాట్‌వాల్'అను నొకపద్ధతివాడుకలో నుండెను. ఈ పద్ధతిలో 'పాటహక్కుదారు' అను మధ్యవర్తితోఁ బ్రత్యేక గ్రామముల యొక్కగాని కొన్నిగ్రామముల యొక్కగాని శిస్తు యేర్పాటుచేసికొని వసూలు చేయుదురు. "పట్టుకట్టు" పద్ధతి:-ఈపద్ధతి యందు రైతుసేద్యముసేసిన భూమియేదియు నెప్పుడు వదలిపెట్టవలనుపడదు. 'తరంభర్తి' పద్ధతి యందు రైతుస్వాధీనమందున్న ఎక్కువశిస్తుగల భూములను వదలిపెట్టి తక్కువ శిస్తుగల భూములనే సేద్యము చేయవలెననినచో తక్కువ శిస్తుగల భూములతోపాటు వదలిపెట్టిన యెక్కువశిస్తుగలభూములమీదిపన్నుఁ గూడ పుచ్చుకొనుపద్ధతి. ఈపద్ధతియందుఁ గూడ పట్టుకట్టు పద్ధతివలెనే రయితులు భూములను వదలిపెట్టుటకు అవకాశము లేకుండుటకుఁ గారణమగుచున్నది. 'వీసబడిపద్ధతి':-ఈపద్ధతి త్రిలింగదేశమునందుఁ గలదు. ఈ పద్ధతియందు గ్రామములలోఁ గొందఱు పెద్ద రయితులుచేరి గ్రామములోని భూమియంతయు గ్రామరయితులందఱుఁ దమతమశక్త్యనుసారముగ సాగుబడికిఁ బుచ్చుకొని యందుల కీయఁదగినగ్రామమొత్తపుపన్నునందు న్యాయమయిన భాగమును నిచ్చుకొందురు. "కుల్‌వాత్" పద్ధతి:-ఈపద్ధతి బారామహాల్ దేశములోను సేలంజిల్లాలోను నున్నది. ఈపద్ధతి యందు మధ్యవర్తులతో నిమిత్తము లేకుండ రహితువద్దనుండి శిస్తు గ్రామోద్యోగస్థుల మూలమున వసూలుచేసి రహితులకుఁ దాము

సేద్యము సేయు భూములయందు పూర్ణమయిన హక్కు గలిగియుండునట్లు చేయఁబడెను.

హిందూరాజుల కాలమున భూముల క్రయవిక్రయము చేయుపద్ధతి యంతగా లేదనియు తనఖా పెట్టుట మాత్రము కొంతవరకు కలదనియు పైని వ్రాయఁబడెనుకదా?* ఈ తనఖా పెట్టు నాచారముండుటవలన భూమియందు భూస్వాములకు హక్కు కలదని చెప్పుటకు వీలు కలిగియున్నది. హిందూరాజుల పరిపాలనా కాలమందు శిస్తుయియ్యని రహితుయొక్క భూమిని అమ్మి వానిని దానినుండి తొలఁగించి మరియొక రహితునకిచ్చి శిస్తు వసూలుచేయు పద్ధతి యున్నట్టు కనిపింపదు. రహితుశిస్తు యియ్యనియెడల వాని చరాస్థి అమ్మిగాని వానిని దండించి బాధపెట్టిగాని వసూలుచేయు నాచారముకలదు. మళయాళదేశమునందు దక్కిన ప్రదేశములకంటె భూస్వాములకు భూములయందు నెక్కుడు హక్కును స్వాతంత్ర్యమును కలదు. పూర్వకాలమునందు కూలివాండ్లను కొంచెము హెచ్చుతక్కువగా దాసులుగా చూచుచుండినట్లు కనిపించుచున్నది. మళయాళ కన్నడదేశములయందు భూస్వాములయొక్క పనిచేయు కూలివాండ్రను అమ్ముటకును తాకట్టు పెట్టుటకును గూడ భూస్వాములకు నొకవిధమగు స్వాతంత్రతయుండెను. ఏండ్రను భూమితో సంబం

* పూర్వకాలమందు భూమిని అమ్మునట్టి పద్ధతి లేదనికొందఱటీవ లింగ్లీషు గ్రంథకారులు భ్రమపడియున్నారు. ఇప్పుడున్నట్లుభూమికప్పుడు వెలలేకపోయి నందునను, భూమియెక్కువగను రైతు తక్కువగను ఉన్నందునను భూమిసంబంధమైన క్రయవిక్రయము లెక్కువగా లేకపోవచ్చును. అంతమాత్రమున హిందూరాజులకాలమునందు రైతులకు తమభూమిని అమ్మనధికారములేదని చెప్పుటకు వీలులేదు. భూమిని విక్రయించుచుండిరని జూపుటకుఁ బ్రబల ప్రమాణములున్నవి. చాణక్యరచితమైన అర్థశాస్త్రమునందుభూమిని విక్రయించు పద్ధతులు చెప్పఁబడియున్నవి. భూమిని అమ్మఁదలఁచినవాఁడు మొదట జ్ఞాతులకు, తరువాత సామంతులకు (ప్రక్క వారికి) తరువాత అప్పుల వాండ్రకు నమ్మవలెను. అనఁగా వీరికి ఒకరితరువాతనొకరికి భూమియెడ నొకవిధమైన హంసాయిహక్కు (Pre-emption) కలదు. వీరెవరును కొననియెడల ఇతరులకమ్మవచ్చును. అమ్మునెడ భూమితో సంబంధములేని వారిని, నలుబది యిరుగు పొరుగు ఇండ్లవారిని పిలిచి వారికి విక్రయము సంగతి తెలుపవలెను. తరువాత నమ్మఁబడునట్టి క్షేత్రము, తోట, కాలవ, తటాకము, ఆధారము, ఇదియని సరిహద్దులతోఁ జెప్పి 'యీ వెలకు నెవరు కొందరు' అని మూఁడుసారులు అడుగవలెను. ఆపైని ఆభూమినిరాటంకముగఁ గొనువానిదియగును.[1] శిస్తు ఇచ్చువారు శిస్తుచ్చువారికే యమ్మవలెను. బ్రాహ్మణాగ్రహారములు బ్రాహ్మణులకే యమ్మవలెను.[2] అని చెప్పఁబడియున్నందున క్రీ. పూ. ౪వ

[1] "వాస్తువిక్రయః. జ్ఞాతిసామంతధనికాః క్రమేణ భూమిపరిగ్రహాన్ క్రేతుమభ్యాభవేయుః. తతోఽన్యే బాహ్యాస్సామంత చత్వారింశత్కుల్యాః గృహప్రతిముఖే వేశ్మ శ్రావయేయుః. సామంత గ్రామవృద్ధేషు క్షేత్రారామం సేతుబంధం తటాకమాధారం వా మర్యాదాసు యథాసేతుభాగం 'అనేనార్ఘేణకః క్రేతా' ఇతి త్రిరాఘుషితే వీతమవ్యాహతం క్రేతా క్రేతుం లభేత"

[కౌటిలీయమ్ అర్థశాస్త్రమ్ ౩ అధి ౯ అధ్యా. ౬౦ శ్లో.]

[2] కరదాః కరదేష్వాధానం విక్రయం వా కుర్యుః బ్రహ్మదేయికా బ్రహ్మదేయకేషు [౬౨ ప్ర]

ధము లేక వేరుగా చరాస్తివలె భావించి అమ్ముటకు భూస్వాముల కధికారముండెను. అరవ

దేశమునందుఁ గూలివాండ్రు భూమితో నమ్మఁబడువారుగను భూమి యెవ్వరిస్వాధీనమందున్న

శతాబ్దమునందు ననఁగా చంద్రగుప్త చక్రవర్తికాలమునందు భూమి విక్రయముండెననుట స్పష్టము. బృహస్పతిస్మృతి యందు స్థిరాస్తిని సంపాదించు మార్గములేడు చెప్పఁబడినవి. విద్య, క్రయము, తాకట్టు, శౌర్యము, భార్య(స్త్రీధనము), దాయము, వారసులు లేని జ్ఞాతులసొత్తు (అనంతరవార సత్వము.) [౯.౨]

ఆస్మృతియందే "ఆస్తిరెండు విధములు: స్థిరాస్తి. చరాస్తి. విక్రయముపూర్తియైనతోడనే యీరెండింటికి 'పణ్యము' అన్న పేరువచ్చును. (౧౮.౨)" అనియున్నది.

ఇట్లు పూర్వము రైతుకు భూమి విక్రయించునధికారమున్నట్టు స్పష్టము. కానియాకాలమున నేఁగానుమనకు నాగ్రామము స్వతంత్రముగ నుండుటవలన వీలయినంతవఱకు గ్రామములోని భూములు గ్రామములోనివారికే యమ్మవలయు నన్నయొక విధమైన నిర్బంధము మొదట నున్నట్టు గానవచ్చుచున్నది. మితాక్షరకారుఁడు 'స్వగ్రామజ్ఞాతిసామంత దాయాదానుమతేనచ హిరణ్యోదకదానేన షడ్భిర్గచ్ఛతి మేదినీ' (తనగ్రామస్థుల, జ్ఞాతుల, హాంసాయిదారుల, దాయాదుల సమ్మతివలనను, బంగారముతోడను, నీళ్ళతోడను దానమువలనను - ఇట్లాఱు విధముల భూమి యొకరినుండి మఱియొకరికిఁబోవును) అనినపూర్వుల శ్లోకమును ఒకదానినితీసికొని, అవన్నియు వేఱువేఱు ఉద్దేశములతో జెప్పఁబడెనుకాని, విక్రయమునకునివి యావశ్యకములుకావని వ్రాసెను. జరిగిన విక్రయవ్యవహార మందఱకుఁ దెలియవలెనని 'గ్రామానుమతి' కావలెనని చెప్పెనేగాని యదిలేనిదివ్యవహారసిద్ధిలేదన్న యుద్దేశముతోఁ గాదు. సరిహద్దుల తకరరులేకుండ నుండుటకై హాంసాయిదార్ల (సామంతుల) యనుజ్ఞ వలయునని చెప్పఁబడినది. జ్ఞాతిదాయాదుల యనుజ్ఞ యెందుకననఁగా, కుటుంబము సమ్మిశ్రమైన యెడల

మిగిలిన భాగస్థుల సమ్మతియావశ్యకము. వ్యష్టియైన యెడల 'వారసమ్మిశ్రకుటుంబములోని వారా వ్యష్టికుటుంబములోని వారా' యన్న సంశయము ముందురాకుండనుండుటకైకాని జ్ఞాతుల సమ్మతిలేనిది విక్రయము చెల్లదనుటకుకాదు. భూమినిదానము చేయుట 'పుణ్యప్రదమని చెప్పినాఁడుగనుక, విక్రయించినప్పటికి, ఒక బంగారు నాణెము పెట్టినీళ్ళు విడువవలసినది'. అని యాజ్ఞవల్క్యస్మృతి యొక్క వ్యవహార కాండము, ౧ అధ్యాయము, ౧-3౧,3౨ శ్లోకముపై వ్యాఖ్యానము వ్రాయునపుడు మితాక్షరా కారుఁడువ్రాసి, సమ్మిశ్రకుటుంబములోఁ జేరనివాఁడు తనభూమిని తనయిష్టమువచ్చినట్టు విక్రయింపవచ్చునన్న భావమును తెలిపినాఁడు. భూమిని విక్రయించినయెడల కుటుంబమునకుఁగల శాశ్వతమైన జీవనాధారము పోవునేమోయని కొందఱు స్మృతికారులు నీతిబోధగ స్థిరాస్తిని అమ్మగూడదని వ్రాసిరేకాని, ఆచారము మాత్రము పైని మితాక్షరకారుఁడు వ్రాసినట్టేయుండెననుటకు సందేహము లేదు. చోళపాండ్యరాజుల ప్రభుత్వకాలమునందు భూముల విక్రయము 'ఖాహాటముగా జరుగుచుండెనని చూపుటకా కాలపు పెక్కుశాసనములు వెలువడినవి.[3] గ్రామస్థులయొద్దనుండి భూములు కొనిపుణ్యాత్ములనేకులు దేవాలయములకు దానమిచ్చినట్లు పెక్కు శాసనములలోఁ జెప్పబడినవి. సర్కారు శిస్తు చెల్లించుటకు శక్తిలేనందున వేళంగూడి కాపరస్తులయిన మరవలు తమ భూమినిఅమ్మికొనినట్లు శా.శ. ౧౪౨3 (క్రీ.శ.౧౫౦౧) సంవత్సరపు శాసనము గలదు. ఇది విజయనగరమువారి ప్రభుత్వకాలములోనిది.[4]

3 Ephigraphical Report of Southern Circle 1915-16 Stone's Inscriptions No. 29, 61, 64, 71, 74, 75, 81. etc.

4 Ibid Stone Inscription No. 50 of 1916.

వాని స్వాధీనము నందుండి పనిచేయువారుగను నుండిరి. కాని సర్కారునకియ్యవలసిన పన్ను తేలికగ నున్నంతవరకు భూస్వాములు కూలి వాండ్రచే (పాలేళ్లచే) సేద్యము సేయింపఁ గలుగుచుండిరి. మహమ్మదీయ ప్రభుత్వ కాలమందు భూమిశిస్తు ఎక్కువఁగఁ జేయఁబడి నందునఁ దామే స్వయముగ సేద్యము చేసినఁ గాని లాభము లేకపోవుటవలన భూస్వాములే స్వయముగ సేద్యము చేయవలసిన యవసరము కలిగినది. ఆంగ్లేయ ప్రభుత్వారంభమున సర్కారు ఖర్చులక్రింద వసూలుచేయఁబడు పన్ను భూమిపన్నొకటియే యగుటవలనను ఇతర విధములగు పన్నులు వాడుకలోనికి రాకపోవుటవలనను భూమిపై శిస్తే ప్రధానమైన పన్నుగ నిప్పటికిని బరిగణింపఁబడుచున్నది. హిందూరాజుల కాలమునందు ఫలసాయములోఁ గొంతభాగము తీసికొనుచు వచ్చుచున్నందున భూమియొక్క ఫలవత్తతను బట్టియు పండింపఁబడిన ధాన్యాదుల విలువనుబట్టియుసర్కారుపన్ను ఏర్పడుచువచ్చినది. ఆంగ్లేయులు అమానీపద్ధతి యారంభముచేసిన తరువాత ద్రవ్యరూపమున శిస్తు వసూలు చేయుచు భూముల యొక్క పంటస్థితినిపట్టి రొక్కరూపమున శిస్తులు వసూలుచేయుచు వచ్చిరి. దక్షిణ హిందూస్థానమునందు ఒక్కొక్కభాగమున నొక్కొక్కయాచారముండెను. కాని అంతట నొక విధముగ భూమి భుక్తముండ లేదని పైవ్రాసిన యంశములనుబట్టియే తెలియఁగలదు. అరవదేశమున నొక విధముగను తెలుఁగుదేశమున మరియొక విధముగను మళయాళ కన్నడదేశములం దింకొకవిధముగను నిట్లు ఒక్కొక్క ప్రదేశమున నొక్కొక్క విధముగ భూమిభుక్తము వాడుకలో నున్నది.

పశ్చిమతీరము నందుత్తరమున గోకర్ణ క్షేత్రము మొదలు దక్షిణమునఁ గన్యాకుమారి వఱకు, కేరళము లేకమళయాళ దేశమని వాడఁబడును. తిరువాన్కూరు కొచ్చి రాజ్యములు ప్రప్రథమమున నుండియు స్వదేశ ప్రభువుల పాలనమునందే యుండెను. మళ

**మళయాళ దేశమందలి అమరకపు విధములు**

యాళముకూడ [illegible]దవ శతాబ్దమువఱకు నీవిధముననే స్వదేశ ప్రభువుల పాలనముననుండెను. కాని తరువాత కళ్లికోటయందలి "జామరిన్" ప్రభుత్వము క్రిందికివచ్చెను. "తుళువ" అను కన్నడ వంశము ప్రత్యేక ప్రభుత్వముగానుండెను. కాని పన్నెండవ శతాబ్దమునందు పాండ్యరాజుల స్వాధీనములోనికిని ఇంకొక శతాబ్దము తరువాత విజయనగర రాజులగు నాంధ్ర ప్రభువుల స్వాధీనములోనికిని వచ్చెను. ఈ ప్రదేశమందలి భూమిభుక్తపద్ధతి విశేషమయిన దగుటచేత దానినిగురించి కొంత విస్తారముగఁ జెప్పవలసిన యవసరము వచ్చినది. ఈదేశము ప్రప్రథమమున నంబూద్రిబ్రాహ్మణులయొక్కయు శౌర్యవీరులగునాయరులయొక్కయు భుక్తమునందుండెను. వీరిరువురి క్రిందను తీయరు

లను సేద్యము చేయు నొక జాతివారు సేద్యము వలననే జీవించుచుండిరి. వీరు ప్రప్రథమమున సింహళ ద్వీపమునుండి తీసికొనిరాఁబడినవారు. నాయరులు రాజులకు భూమిపన్నీయక తమ తమ సైనికులతో రాజులకు యుద్ధసమయమున మాత్రము సహాయపడుచుండిరి. నంబూద్రి బ్రాహ్మణులుకూడ భూమిపన్నీయక దేవాలయములను సంరక్షించి పోషించుబాధ్యత మాత్రము కలిగియుండిరి. తొమ్మిదవ శతాబ్దమున కల్లికోట రాజగు జామరిన్ మహమ్మదీయ మత మవలంబించుటవలన ననేకులు మహమ్మదీయులా దేశమువచ్చుట కవకాశము కలిగినది. ఈతురకలు 'మోప్లా'లని పిలువఁబడుదురు.

వీరు సాధారణముగ వర్తకముచేయుదురు. వీరికిఁగూడ భూమిపన్ను నిచ్చు బాధ్యతలు లేవు. ఇంకను మళయాళ దేశమందున్న భూస్వాములకు ననేకవిధములగు స్వతంత్రతలు కలవు. అందువలన వీరికి భూమియందు సర్వస్వతంత్రతయు, హక్కునుకలదని చెప్పవచ్చును. తుళువదేశము పాండ్యరాజుల పాలైనతరువాత పూర్వము భూమి ననుభవించుచుండిన నాయరులను తొలఁగించి భూమిపై పన్ను హెచ్చించి ''హల్లర్ల''ను కర్షకుల కియ్యఁబడినది. ఈ దేశము తెలుఁగుదేశపు రాజుల పాలనములోనికి వచ్చిన తరువాత తెలుఁగుదేశపుఁ బద్ధతులు కొన్ని వాడుకలోనికిఁ దేఁబడినవి.

మదాసు రాజధానియంతయు నేకకాలమున నొక్కవిధముగ నాంగ్లేయపరిపాలనలోనికివచ్చి యుండకపోవుటఁబట్టియు, నంతకు పూర్వమునందున్న పద్ధతులనే సాధ్యమయినంతవరకు ననుసరింపవలయునను తలంపు చేతను, నొక్కొక్కభాగమున నొక్కొక్కవిధమగు అమరకపుఁబద్ధతు లేర్పరుపఁబడినవి. ఉత్తర సర్కారులను గంజాం, విశాఖపట్టం, గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలయందు, బంగాళాదేశపు అమరకపుపద్ధతి ననుసరించి 'శాశ్వతమగు జమీందారీ అమరకపుఁబద్ధతి' యేర్పాటుచేయఁబడెను. మదరాసు పట్టణమునకు చుట్టుపట్లనున్న దేశము ఆర్కాటునవాబు వలన ౧౭౫౦, ౧౭౬౩ సంవత్సరములయందు దఖలు పడియుండుటవలన ఆ ప్రదేశమునందలి జిల్లాలయందు అంతకుఁ బూర్వమునందున్న పద్ధతి ననుసరిరచి "జాగీరు" పద్ధతిని అమరకము చేయఁబడెను. ౧౭౯౩-సంవత్సరమున టిప్పూసుల్తాన్ ఓడిపోయిన తరువాత బారామహాలును సేలంజిల్లాయు మళయాళమును ఆంగ్లేయులస్వాధీనమైనవి. పిమ్మటటిప్పూసుల్తానుతో రెండవ యుద్ధమయినతరువాత కన్నడదేశమును కోయంబుత్తూరు దేశమునువచ్చినవి. ౧౮౦౦-సంవత్సరమున హైదరాబాదు నవాబుతో జరిగిన సంధి ననుసరించి తుంగభద్రా కృష్ణా నదులకు దక్షిణమునందున్న ప్రదేశమంతయు నాంగ్లేయుల స్వాధీనమయినది. ౧౮౦౧-సంవత్సరములో ఆర్కాటునవాబునకు కర్ణాట దేశమునందున్న రాజ్యమంతయు

ఆంగ్లేయుల స్వాధీనమైనది. ఇట్లు అనేక పూర్వ రాజులనుండి యనేకవిధములుగ నాంగ్లేయులకు స్వాధీనపడిన నీ ప్రదేశములయందు ననేకవిధములగు నమరకపుఁబద్ధతులు యేర్పాటు చేయవలసి వచ్చినది.

ఉత్తర సర్కారులని పిలువఁబడు ప్రదేశమునందున మహమ్మదీయ ప్రభువుల వలనను యంతకు పూర్వపుహిందూ రాజులవలనను చెందఁబడిన భూములుగాని అట్లుభూములు చెందిన భూనాయకునవలనఁ జెందినభూములుగాని యనేకములుంఁడుటవలననీనివిషయమై యాంగ్లేయ ప్రభుత్వమువార లనేకవిధమగు అమరకము చేయవలసిన యవసరము కలిగినది. భూనాయకులవలనఁ జెందఁబడినభూములు కలవారిని పాలెగార్లు అనిపిలుతురు. వీరు మూఁడువిధములుగా నుండినవారు.

పాలెగార్లు

౧. పూర్వము రాజ్యము లేలిన విజయనగరము, కాంచీపురము, మధుర మొదలగు దేశాధీశుల సంతతిలోనివారు కొందరు.

౨. పూర్వపురాజులయొద్ద సేనాధిపతులుగానుండి మహమ్మదీయుల దండయాత్రనడ్డగించుకొని స్వశక్తివలనఁ గొంతదేశమునకు నాయకులై తరువాత నాయాప్రదేశములకుఁ బ్రభువులుగా నంగీకరింపఁబడినవారుకొందరు.

౩. జిల్లాకధికార్లుగనుండి కాలక్రమమున మహమ్మదీయుల యధికారమునకు లోఁబడక స్వతంత్రులై ఆయాజిల్లాలపై ప్రాభవమును సంపాదించుకొన్న వారు కొందరు.

మహమ్మదీయులీభేదమించుకయుఁ గనపరచక యీ ముత్తెగలపాళ్యగార్లను నొకవిధముగానే చూచుచు పాళ్యగార్ల బలాబలములనుబట్టియుఁ దాము చెలాయింపఁదగిన యధికారమునుబట్టియుఁ గప్పముఁ గొనుచుండిరి. కాని ఒకపద్ధతి ననుసరించి యమరకముఁజేసి శిస్తుగాని కప్పముగాని వసూలు చేయలేదు. ఈపాళ్యగార్లు తమ యిచ్ఛవచ్చినట్లు తమ క్రిందనున్న ప్రజలను, గ్రామములను, పరిపాలించుకొనుట కధికారము కలిగి మహమ్మదీయులకంతగాఁ లోఁబడకయుండిరి. వీరు సర్వదా ఒండొరులతోఁ బోరాడుచు మహమ్మదీయ ప్రభువులతోఁ బోరాడుచుఁ గాలముఁ గడపుచుండిరి. మహమ్మదీయులకుఁ గట్టవలసిన కప్పము బరువుఅని తోచినప్పుడు సాధ్యమయినంతవరకు శిస్తుచెల్లింపకుండు ప్రయత్నముచేయుచు, నట్లపహరించుటకు వీలుగానప్పుడు తామీయవలసిన శిస్తుచెల్లించి తమ యెస్టేట్లకుఁ బ్రాంతములయందున్న సర్కారు గ్రామములను దోచికొని తాము సొమ్ము వసూలు చేసికొనుచుండిరి. ఇట్లు దోచికొనఁబడు గ్రామములయందున్న సర్కారురైతులడుగడుగున కీబాధపడలేక తమ్ముబాధింపకుండ విడచిపెట్టినందుకు 'కావల్' అనుపన్ను ఇచ్చుచుండిరి. తరువాత నాంగ్లేయ ప్రభుత్వ దినములలో నీపాళ్యగార్ల దౌర్జన్యము లడఁ

చుట కనేక ప్రయత్నములు జరిగినవికాని యీపాళ్యగార్ల యెస్టేట్లమీఁద వీరికున్న న్యాయ్యమైన హక్కువిషయమై మాత్రము నిశ్చయముగాఁ దెలిసికొనుట కవకాశముగలిగినది కాదు. అప్పుడు వారితో శాశ్వతమైన యమరకపుపద్ధతి నొకదానిని యేర్పఱచుకొని వారి యెస్టేట్లమీఁద వారికి రాఁదగిన మొత్తము మూఁడవవంతు తమకిచ్చుపద్ధతిని చిత్తూరు, కాలహస్తి, వెంకటగిరి, బొమ్మరాజుపాళెము, మొదలగు యెస్టేట్ల నమరకము గావించిరి.

**మళయాళపు పద్ధతులు**

దక్షిణము నందున్న అరవదేశములో 33 గురు పాళ్యగారులుండిరి. వీరిసంఖ్యానానాటికి క్షీణించి యిప్పుడు కొందఱు మాత్రమే మిగిలియున్నారు. బారామహల్ ప్రదేశమునందు రైతువారీపద్ధతి నమరకము చేయఁబడినది. మళయాళకన్నడ దేశములలో వాడుకలోనున్న. యమరకపు పద్ధతులు ఈక్రింద వివరింపఁ బడుచున్నవి. మళయాళదేశమునందలిభూస్వాములు జెన్మికార్లు, జెన్మీలు, అని చెప్పఁబడుదురని యిదివఱకే చెప్పఁబడెను. వెరుమ్‌కారీ, వెరుంకోలు,అనఁబడు వెరుంపట్టం పద్ధతిగలదు. అనఁగా భూస్వామిభూమిపన్నులో కొంతసొమ్ము బజానాపుచ్చుకొనకుండ నమరకము చేయుపద్ధతి. "కనోమ్‌పద్ధతి" అనఁగా సేద్యగాఁడు విత్తనములయొక్క ఖరీదును, సేద్యపుఖర్చులును పోను మిగిలినపంటలో మూఁడవవంతుతీసికొని రెండువంతులు భూస్వామికిచ్చు పద్ధతి. "తాళపట్టం అనుమనుపట్టం" దీనికి కట్టకోణం అనికూడపేరు. అనఁగా భూస్వామికి కవులు ఆరంభమున నొకసంవత్సరపుశిస్తు అడ్వాన్సుగానిచ్చి అమరకము చేయుపద్ధతి. భూమియందున్న చెట్లను ఒక్కసంవత్సర మనుభవించుట కీయఁబడిన యమరకము "మేలుపట్టం" అందురు. ఇందు కౌలుదారులకు "కుళిక్కణం" అనఁగా భూమిని ఖర్దుపఱచి భూస్వామితో నేర్పఱచుకొన్న యేర్పాటు ప్రకారముగాఁ జెట్లునాటి పెంచి భూమిని బాగుపఱచు పద్ధతిమీఁద 12 సంవత్సరముల వఱకు శిస్తు ఈయనక్కరలేకుండునట్లు అమరకముచేయు పద్ధతి. ఇంతియేకాక వెరుంపట్ట, కుళిక్కణ, కుళిక్కణోం, కుట్టిక్కణోం అనునితర అమరకపు పద్ధతులుకూడ వాడుకలోనున్నవి. మఱియు బ్రహ్మస్వము, అనుభవము, లేక శాశ్వతము, కరంకారి లేక జన్మం కోరూ, అదిమ లేకకుడిమ, కారియేమా, సంతతి బ్రహ్మస్వము, అనుశాశ్వతపు అమరకపు పద్ధతులును, చూండిపాణయం, తోడుపాణయం, కూడినుంపాడ్, ఉందరూడిపాణయం, ఉభయపట్టం, ఒట్టి, ఒట్టికూపరం, నీర్మదల్, జన్మపణయమ్, అత్తిపర్, పెరుయాడమ్, కూడికఒట్టి అనుతనఖా అమరకపుపద్ధతులును మళయాళమునఁ గలవు.

దక్షిణకన్నడ దేశమందలి భూమి యొకానొకప్పుడు మళయాళ దేశస్థులగు నాయర్ల యనుభవమునందుఁగూడ నున్నట్లగపడు

చున్నది. కన్నడ దేశమునందలి భూమియందు శాశ్వతపు హక్కుగల సేద్యగానికి ముజ్‌గని అనిపేరు. ఒక్కేశిస్తునకు పూర్వము నుండియు వ్యవసాయము నందుండినట్టిగాని క్రొత్తగా వ్యవసాయము చేయఁబడుచున్నట్టిగాని భూమిని దున్నుటకు వంశపారం పర్యము 'వలతి' అని ముజ్‌గపదమున కర్థము. శాశ్వతపు కవులు కలిగి భూమినుండి తొలఁగింపఁబడకుండ కృషి చేయు రయితు 'ముజ్‌గనిగారు' అని పిలువఁబడును. కొంతసొమ్ము పుచ్చుకొని వ్యవసాయ దారునకు కవులిచ్చు పద్ధతి అర్ధముజ్‌గని యందురు. ధాన్యరూపముగా గాని ద్రవ్య రూపముగా గాని భూమిపై శిస్తువసూలు చేయుపద్ధతి దక్షిణకన్నడ దేశమునం దున్నది. కాని ఫలసాయములో కొంతభాగము పుచ్చుకొను పద్ధతి యెన్నఁడు నున్నట్టు తోఁచదు. ఈముజ్‌గనీరైతు నాయర్‌ముజ్‌గనీ యనియు షడ్‌ముజ్‌నీ యనియు రెండు విధములు. నాయర్ ముజ్‌గనీ యనునది పురాతనపద్ధతి. షడ్‌ముజిగనీ యనునది భూమికొనిన తరువాత నేర్పడిన పద్ధతి. కొన్ని సంవత్సర ములకు మాత్రమే కవులిచ్చు పద్ధతి వెయిద్గనీ యందురు.

రైతువారీ అమరకపుపద్ధతి చేయఁబడు నప్పుడు అంతకు పూర్వము హిందూరాజుల కాలమందును తరువాత మహామ్మదీయరాజుల కాలమందును రైతులకును భూస్వాములకును పూర్వమునుండియు భుక్తములోనున్న హక్కులను ఆంగ్లేయ దొరతనమువారు సాధ్యమగు నంతవరకు గమనించి యే భూమినమర్చిరి. (భూమికి వెలపుట్టుట, హెచ్చుట, తగ్గుట) ప్రథమమున హిందూ రాజుల ప్రభుత్వకాలమందు కృషికి తగిన భూమి అమితముగా నుండుటవలనను భూమి నంతను సేద్యములోనికిఁ దీసికొనివచ్చుటకు చాలినంతమంది రైతులు లేకపోవుటచేతను ప్రజోపయోగము కొఱకు మాత్రమే కావలసినంత ధాన్యమును పండించుకొను నవసరము కలిగియుండుటచేతను కృషికరులు తమశక్తికిఁ దగినట్లు తమకు వలను పడినంత ప్రదేశమును మాత్రమే వ్యవసాయము చేయుచువచ్చిరి. ఆ కాలమున భూమి నపేక్షించువారుగాని భూరూపమైన ఆస్తిని సంపాదించుకొనవలయునని యాసక్తిపడువారుగాని భూములు కొనువారు గాని యుండుట తటస్థపడలేదు. అట్టి సమయమందు పంటలో రాజుభాగమును మాత్రము రాజు వసూలుచేసికొనుచు కర్షకుఁ డిచ్చవచ్చినట్లు భూమిని స్వేచ్ఛగా ననుభవించునట్లు అవకాశ మొసఁగుచువచ్చిరి. అందువలన భూమి సేద్యమైనకొలఁది రాజునకు ద్రవ్యము వచ్చుటయు నేకారణము చేతనయిన భూమి సేద్యము కాఁబడని యప్పుడు రాజునకు ద్రవ్యము రాకపోవుటయు తటస్థించుచుండెను. గ్రామములు రెండు విధములైనవనియు గ్రామముయొక్క స్థితి ననుసరించి ఆగ్రామమునకు సంబంధించి యున్న పంటభూమియందు గ్రామస్థులకు

హక్కేర్పడినదనియు నింతకుమున్నే వ్రాయఁబడెను. గ్రామస్థు లావిధముగా భూమియందు హక్కు భుక్తములుకలిగి దేశాచారమునుబట్టి సంచరించుచు తమతమ గ్రామ వ్యవహారములను తామే నెఱవేర్చుకొనుచు రాజులకులోఁబడియుండిరి. తరువాత మహమ్మదీయుల కాలములోఁగూడ పూర్వపు పద్ధతులను మార్చివేయక పంటభూములమీఁద శిస్తువసూలుచేయుటకు కొన్ని క్రొత్తపద్ధతులనుగూడ నమలులోనికిఁ దీసికొనివచ్చిరి. ఈ కాలమున వ్యవసాయము చేయువారు వృద్ధియగుటయు భూమిపన్ను మిక్కిలిగా హెచ్చింపఁబడుటయు కొంతమందికయిన భూమి సంపాదింపవలయునను నాసక్తి కలుగుటయు సంభవించినది. మహమ్మదీయుల ప్రభుత్వకాలములో భూమిలేని వానికన్న భూమికలవానికి ఎక్కువ పరపతియు గౌరవమును గలుగుట తటస్థపడెను. రొక్క రూపమైన ద్రవ్యమెంతయున్నను భూస్వాస్త్వము గలవాని కెక్కువ గౌరవముండెను. ఈ కారణములంబట్టి కొందఱకు భూమి సంపాదింపవలయునను కోరిక పుట్టుట కవకాశము కలిగినది. అయినను భూమిపన్ను మిక్కిలి హెచ్చింపఁబడుటచేత సేద్యము సేయుటవలన లాభములేక భూములను వదలిపెట్టవలయునను తలంపుకలవారలనేకులుండిరి. భూమి సేద్యమయినకొలఁది తమకు ద్రవ్యమెక్కువవచ్చునను నాశచే సాధ్యమగునంతవఱకు ఎక్కువభూమిని సాగుచేయించుట కమర్చవలెనని మహమ్మదీయ ప్రభువులయొద్దనున్న యుద్యోగస్థులు అనేక ప్రయత్నములుచేయ నారంభించిరి. దేశ మభివృద్ధి చెందుటకును ప్రజలు భాగ్యవంతులగుటకును రాజులకు విస్తారము ద్రవ్యము వచ్చుటకును భూమి విరివిగ మంచిపద్ధతులమీఁద సేద్యముచేయఁబడుటయే ముఖ్యకారణము. ఈవిషయము మహమ్మదీయ ప్రభువులును వారి యుద్యోగస్థులును గ్రహింపకపోలేదు. అయినను నిప్పటివలె ధాన్యాదులకు ధరలు లేకపోవుటవలన నెంతప్రయత్నము చేసినను అభిరుచితో వ్యవసాయము చేయవలెనను ఆశమాత్రము రైతులకు చాలకాలమువఱకు లేకపోయెను. సాధ్యమగునంతవఱకు భూమిని సాగుచేయునట్లు రైతులను ప్రోత్సాహపఱచియు నిర్బంధపఱచియు భూములు వదలిపెట్టకుండ నభ్యంతరములు కలుగఁజేసియుమహమ్మదీయప్రభువుల క్రింది యుద్యోగస్థులు అనేక సాధనములతోఁ బలువిధములగు పద్ధతులమీఁద భూమి నమరకముచేయుచు వచ్చిరి. మహమ్మదీయ ప్రభుత్వకాలమున సేద్యము చేయుట కిష్టములేనప్పుడుగాని సేద్యమువలన లాభములేదని తోచినప్పుడుగాని రైతు భూమిని వదలిపెట్టినట్లును అట్టి విడుదల మహమ్మదీయ ప్రభువులంగీకరించినట్లును కనుపించదు. హిందూరాజులపరిపాలనాకాలమునగాని మహమ్మదీయ ప్రభుత్వకాలమునగాని రైతుగాని భూస్వామిగాని భూమి పన్నీయనప్పుడు అట్టి

పన్ను అతని చరాస్తి అమ్మించిగాని అతనిం దండించి చెఱసాలనుంచి శిక్షించిగాని బాధ పెట్టిరని వినియుందుముగాని భూమి జప్తుచేసి శిస్తు వసూలుచేయుపద్ధతి యున్నట్లువినము. కాని హిందూరాజుల కాలములో భూమిని క్రయవిక్రయపఱచు వాడుక తక్కువగ నుండె నను మహమ్మదీయ రాజ్య సమయము స మాత్రము అక్కడక్కడ భూము లమ్ముకొను పద్ధతి హెచ్చినది. సర్కారుభూమిని జప్తుచేసి అమ్మించుపద్ధతి మాత్రమంతగాఁ గన్పింపదు.

రైతులను తొలఁగించుట

వారసులు లేక చనిపోయినవాని (ఘాతి) యొక్కగాని యూరువిడిచి పాఱిపోయిన వాని (పరారి) యొక్కగాని భూములను దప్పెద క్కినవాండ్ర భూములను సర్కారు తీసికొని యన్యాక్రాంతముచేయు పద్ధతికూడ మహ మ్మదీయుల కాలములోనైన నంతగాఁ గాని పింపదు. రాజద్రోహులు, గొప్ప నేరమును జేసిన యపరాధులు శిక్షింపఁబడుటయే కాక వాని భూములను మహమ్మదీయ ప్రభువులు తీసికొని యితరుల కుచితముగా నిచ్చుటగాని శిస్తు కట్టియిచ్చుటగాని వాడుకకలదు. దీనిం బట్టియోజింపఁగా రైతు భూమిపన్ను చెల్లించు చున్నంతవఱకుఁ దనభూమిని స్వేచ్ఛగా కృషి చేసికొని అనుభవించుటకు హక్కు కలిగియే యుండెనని చెప్పవలసియున్నది. మఱియు రైతులు సాధారణముగా ఫలవత్తరమైనమంచి భూముల నుంచుకొని తక్కిన నీరసభూములను బరిత్యజించు వాడుకకూడ నుండియుండెను.

లాభములేని పనిచేయుట మనుష్యస్వభావముకాదు. కావున సేద్యము సేయుటవలన లాభమున్న భూములను విశేషవ్యయప్రయాస లక్కరలేకుండ లాభమునకు వ్యవసాయము చేయఁదగిన భూములను మాత్రమె వ్యవసాయము చేయుటకు రైతు లిచ్ఛగించుచుఁ దక్కిన భూములను నిరాకరించుచుండిరి. కాని మహమ్మదీయ ప్రభువులు భూమినంతను మంచి స్థితిలోనికిఁ దీసికొనివచ్చి అన్ని విధములగు భూములను సేద్యపఱచునట్లు ప్రోత్సాహము చేయుటవలన లాభ

పెక్కు విధములయిన అమరకము పద్ధతులు పుట్టుటకు కారణము

మును గ్రహించి అందు విషయమై తమయుద్దేశములు సఫలీ కృతములగుటకుఁ దగిన యుపాయములను పన్ని ఆ యుపాయములను నెరవేర్చుటకు తగిన షరతులతో అనేకవిధములగు అమరకపు పద్ధతులను ఏర్పఱచి ఆయాపద్ధతులమీఁద అమరకము చేయుచువచ్చిన హేతువునుబట్టి ఒక్కరైతువారీ యమరకపు పద్ధతియందే యనేకవిధములగు నంతర్భేదము లుండుట కవకాశములు కలిగినవి. మఱియు దేశకాల పాత్రములను బట్టియు నాయాదేశములయందు భూమిశిస్తు వసూలుచేయు మార్గభేదములను, మర్యాదాభేదములను బట్టియు సాధ్యమగు నంతమట్టుకు అలజడిలేకుండ శిస్తు వసూలు చేసికొనుట

కును విరివిగా భూమి సేద్యమగుటకు ప్రోత్సాహపఱచుటకును రైతుల యొద్దనుండి స్వయముగా శిస్తు వసూలుచేసికొను కష్టములు తగ్గించుకొనుటకును తాలూకాదారీ, గ్రామవారీ, జమీందారీ, మొదలగు కొన్ని పద్ధతులనుగూడ మహమ్మదీయు లవలంబించిరి.

ఆకాలమున అక్బరు చక్రవర్తి రాజ్యమునకు వచ్చునంతవఱకును భూమిని బరిశీలించి ఫలవత్తనుబట్టి శిస్తు నిర్ణయించి ఏవిధమగు "సెటిల్‌మెంటు"ను మహమ్మదీయరాజులు చేసియుండక పోవుటవలన తత్కాలోపయుక్తమైన అనేక విధములగు నేర్పాటులు చేయవలసివచ్చినది. ఆసేతుహిమాచలపర్యంతమగు హిందూదేశమంతయు నెక్కని యేలుబడియందు నేకకాలమున నొక్కని స్వాధీనములోనికి వచ్చియుండలేదు. దేశమంతయు భిన్నభిన్న రాజ్యములగను ననేకరాష్ట్రములగను విభజింపఁబడియుండుటచేతను ఒక్కొక్కరాష్ట్రమందు నొక్కొక్కరాజు నేలుబడియందు నొక్కొక్కపద్ధతి ననుసరించి ప్రజలకు భూమియందు హక్కును నాస్తియు నధికారమును నేర్పడియుండుటంబట్టియు నొక్కేరాజ్యమును నొక్కే రాష్ట్రమును ననేకప్రభువులపాలనకులోఁబడి యనేకవిధములగు వ్యావహారిక భేదములను జెందియుండుటచేతను బూర్వపు పద్ధతు లెంతగా మార్పకుండఁ గాపాడఁబడుచు వచ్చినను కొన్నిమార్పులు మాత్రము రాకతప్పినవికావు. అమరకపుపద్ధతులనుగూర్చి యోచించునప్పుడును తద్విషయక వ్యవహారములను విమర్శించునప్పుడును పలువిధములగు అమరకపు భేదములను విమర్శించునప్పుడును, ఈ విషయమును మనమునం దుంచుకొనకతప్పదు. ఆంగ్లేయులు హిందూదేశము నంతను జయించి స్వాధీనపఱచికొనిరనిగాని బలాత్కారముగా నూడదీసికొనిరనిగాని బహుమాన పూర్వకముగాఁ బొందిరనిగాని చెప్పుటకు వీలులేదు. ఈదేశమంతయు నొక్కపర్యాయముగా నాంగ్లేయ ప్రభుత్వమునకుఁ జిక్కలేదు. ఒక్కొక్కరాష్ట్రమొక్కొక్క విధముగా నొక్కొక్క సమయమున నాంగ్లేయుల యేలుబడిలోనికి వచ్చినది. అందువలన హిందూదేశమునందలి రాష్ట్రములయందు వాడుక యందున్న అమరకపు పద్ధతులన్నియుఁ బలువిధములైనవి. మహమ్మదీయ ప్రభుత్వకాలమందు వాడుకలోనున్న అమరకపు పద్ధతులన్నింటిని వీరు మార్చివేయలేదు. ఆంగ్లేయ ప్రభుత్వారంభ దినములలో మహమ్మదీయుల అమరకపు పద్ధతులనే యనుసరించుచు భూమివిషయమై భూస్వాములకుఁగల హక్కు తమ స్వదేశమగు నింగ్లాండు దేశములోని హక్కునంటిదేయని భ్రమపడి కొన్ని మార్పులను జేసిరి. వివిధములగు రాష్ట్రములయందు భూస్వాములకు భూమియందుఁ గల హక్కు సాధ్యమగునంతవఱకు పరిశీలించి వారివారి హక్కులకు భంగము కలుగకుండ నాయారాష్ట్రములకుఁ దగినవిధమున గ్రామ

ముల స్వభావములుకూడ గమనించిఅమరకపు పద్ధతుల నేర్పఱచిరి.

కాబట్టి యిప్పుడు మనము అమరకమువిష యమై యోచించునప్పుడు హిందూదేశము నందలి యన్నిరాష్ట్రముల యందును అన్ని ప్రదేశములయందును అన్ని జిల్లాలయందును వాడుకలోనున్న పలువిధములయిన అమరకపు పద్ధతులను యోజించుచు గ్రామస్వభావములంబట్టి గ్రామములయందు మార్పు చెందిన అమరకపు భేదములంగూడ నిర్ణయింప వలసియున్నది. శిస్తు (౯విన్యూ) సంబంధమైన వ్యవహారమునకు గ్రామము ప్రధానాంశము.

గ్రామము

ఆ గ్రామమునకు సంబంధించి గ్రామస్థులు ఇండ్లుకట్టుకొని కాపురముండు ప్రదేశము కొంతయు; నట్టం, గ్రామకంఠం, మొదలయిన పేర్లతో వ్యవహరింపఁబడు ప్రదేశము కొంతయుఁ; జెరువులు, నూతులు, మార్గములు పుంతలు, పోరంబోకులు, స్మశానభూములు, ధాన్యము నూర్చుకొనుట కేర్పడిన ప్రదేశములు, ధర్మారామములు, మొదలగునవి యుండు ప్రదేశము కొంతయు; గ్రామస్థుల యందఱ యుపయోగార్థము నుమ్మడిగా ననుభవింపఁదగిన స్థలములుకొన్నియు; గ్రామస్థుల పశువులు మేయుటకును దిరుగుటకును నున్న ఉమ్మడిభూమి కొంతయు; సేద్యము చేయఁబడుచున్న భూమికొంతయు; సేద్యమునకుఁ దగియున్నను సేద్యము కాకయున్న భూమి కొంతయుఁ గృష్యర్హతకుఁ దేఁదగిన భూమి కొంతయు నడవి కొంతయు నుండుట సాధారణము. గ్రామముయొక్క వైశాల్యమును బట్టియుఁ బ్రాముఖ్యమును బట్టియు నడవి ప్రదేశమునకు దూరముననుండుట దాపున నుండుటంబట్టియు నీయీ ప్రదేశములయొక్క వైశాల్యములుండుట సంభవించును. ఇందు గ్రామస్థు లుమ్మడిగా ననుభవింపఁ దగినట్టియు సేద్యము చేయఁదగినట్టియు ప్రదేశములుగాక ౧ సేద్యములోనున్న ప్రదేశము. ౨ కృష్యర్హత గలిగి కృషి చేయని ప్రదేశము. 3 కృష్యర్హతకు దేఁదగిన ప్రదేశము. ౪ అడవి. ఈ నాల్గింటి విషయమై కొంచెము చెప్పవలసియున్నది.

౧ వ్యవసాయములోనున్న ప్రదేశము

రైతువారీపద్ధతిక్రింద నమరకములోనున్న గ్రామములలో వేర్వేఱురయితులకు 30సంవత్సరముల కొకపర్యాయము భూమియొక్క వైశాల్యమును బట్టియు ఫలవత్తను బట్టియు శిస్తునిర్ణయించి ఆశిస్తు ఇచ్చుచుండువఱకునిరాటంకముగాననుభవించు పద్ధతిని నొకపట్టాతో నీయఁబడినభూమి. 30 సంవత్సరముల తరువాత మరల "సెటిల్మెంటు" శిస్తు ఏర్పాటుచేయునపుడు విధింపఁ బడుపన్ను నంగీకరించినంత వఱకు రైతును తొలఁగించుట సంభవింపదు. భూమి యక్కఱ లేనప్పుడు సకాలములో భూమినివిడుదల పెట్టుటకు రైతుకుహక్కు కలదు. రైతు భూమిపన్ను చెల్లింపనప్పుడు భూమినంతనుగాని అందు

కొంతభాగముగాని వేలమువేసి అమ్మి శిస్తు వసూలుచేసికొనుటకు సర్కారున కధికార మున్నది. ఈషరతులకు లోఁబడిచి పట్టాదారైన రైతుభూమి నమ్ముకొనుటకుగాని దాన మిచ్చుటకుగాని తనఖాపెట్టుటకుగాని స్వాతంత్ర్యముకలదు. ఒక్కతిరునల్వేలి జిల్లాలోఁ దప్పతక్కిన జిల్లాలలోనిట్టి పట్టాభూములలోని చెట్లయందుఁగూడఁ రైతునకు స్వాతంత్ర్యము కలదు. భూమిలోని ఖనిజములకు మాత్రము సర్కారునకు హక్కుకలదు. వారట్టివి త్రవ్వ కొనునప్పుడు ఖనిజముల స్వభావమునుబట్టి 'రాయల్టీ' అనుపన్ను వసూలు చేయుదురు. ఇట్టిభూమియందు రైతుతనకిష్టమైన సస్యమును వేసి పండించు కొనవచ్చునుగాని సర్కారు నీటివలన పల్ల పుసాగుబడి చేసినప్పుడు మాత్రము వారువిధించిన నీటిపన్ను అధికముగా నిచ్చుకొనవలయును.

ఇట్టిభూములు జిరాయితీభూములనఁబడును. ఒక్కొక్క గ్రామములలోని భూములనుగొలిచి కొంతకొంత భూమికొక్కొక్క నెంబరుగానేర్ప రుచుపద్ధతి సర్వేయందురు. పట్టాదారులైన రైతులపట్టాలలో నొక్క పట్టాలోననేక నెంబర్లు కలసియుండుటగాని ఒకపట్టాలోచేరిన యొక నెంబరునందనేక భుక్తదారులపేర్లు చేర్చియుం డుటగాని తటస్థించుచుండును. పట్టాదారయిన రయితుఒక నెంబరుభూమిలో తనయిష్టము వచ్చినంతప్రదేశము తనకిష్టము వచ్చిన వారికి దాన విక్రయాధికారములతో నిచ్చివేయుట కధికారముకలిగి యుండుటవలనను భూములు కుటుంబమువారు పంచుకొనుటవలనను ఒక్కనెంబరు భూమి అనేకులక్రింద భుక్తములో నున్నట్లు రిజిష్టరులో వ్రాయుచుండుట తటస్థించును. భుక్తమునుబట్టి భూమిహక్కు నిర్ణయింపఁబడుటచేతపట్టాఅంతఅత్యావశ్యకమైనదికాదు. ఇంతియేకాక రైతుఇయ్యవలసినశిస్తుమొత్తము తెలియఁబడుచుటకు మాత్రమే పట్టా యుపయోగముగాని అందువలన రైతున కొక హక్కును గలుగఁజేయు పత్రమువంటిదికాదు. సేద్యమగుభూమిలో శిస్తువసూలు చేయఁబడు ఈజిరాయితీ భూమిగాక శిస్తులేకుండ ననుభవింపఁబడు చుండునట్టియు, దేవాలయములు, మసీదులు, సత్రములు, గ్రామనౌకర్ల వేతనములు మొదలగువాని కొఱకీయఁబడినట్టియు భూములుకూడఁ గొన్ని యుండును. ఈభూములంగూర్చి ముందుఁజర్చింఁబడును. జిరాయితీ భూములమీఁద 30 యేండ్లకొకపర్యాయము శిస్తునిర్ణయించుపద్ధతి "సెటిల్‌మెంటు" అనఁబడును. 30 యేండ్లకు తక్కువకాలమునకుఁ జేయఁబడిన "సెటిల్‌మెంట్లు" గల గ్రామములున్నవిగాని యెక్కువకాలము చేయఁబడిన సెటిల్‌మెంట్లుగల గ్రామములులేవు.

జమీందారీ గ్రామములలోను తాలూకాదారీ గ్రామములలోను జేరిన జిరాయితీ పద్ధతులకును గవర్నమెంటు జిరాయితీ పద్ధతులకును భేదముకలదు. వానివిషయమై ఆయాసందర్భములయందు చర్చింపఁబడును.

ఇట్టిభూమి యొకప్పుడు సర్వేకాఁబడి నెంబరుగా విభజింపఁబడుటయుకలదు. ఇట్టిభూమి దరఖాస్తు మీఁదగాని వేలముపాడి యెక్కువ పాట పాడిన రైతునకు గాని రివిన్యూ బోర్డువా రేర్పఱిచిన నిబంధనల ననుసరించి శిస్తునిర్ణయించి అమరకముచేయఁ బడుచుండును.

౨ వ్యవసాయార్హమై వ్యవసాయములోలేని భూమి

ఇట్టిభూమి సాధారణముగా సర్వేకాఁబడి యుండదు. కాని దరఖాస్తుచేయఁబడిన తరువాత సర్వేచేయఁబడి శిస్తు నిర్ణయింపఁబడును. దరఖాస్తుదారుని పరపతిని యోజించి రివిన్యూబోర్డువారేర్పఱిచిన నిబంధనలకు లోఁబఱిచి అమరకము చేయఁబడును.

3 వ్యవసాయార్హతఁ దేదఁగినభూమి

ఇట్లురైతు స్వాధీనము చేయఁబడిన ౨-3తరగతుల భూములుకూడ జిరాయితీ భూముల లక్షణముఁజెందును.

సర్కారు రైతువారీ గ్రామములలోనున్న అనాదిబంజరు భూములయొక్కయు బంజరు భూములయొక్కయు హక్కు సంపూర్ణముగా సర్కారుదే. ఇట్టిభూమిని, రయితునకు దరఖాస్తుమీఁద నిచ్చునప్పుడు ఇతరులకంటె నా గ్రామస్థులకు నిచ్చుట సర్కారుమతము.

జమీందారీ గ్రామములోని అనాదిబంజరు భూమియుజమీందారుయొక్క సంపూర్ణమగు హక్కునకు లోఁబడియుండును. జమీందారీ గ్రామములయందు రయితుచే విడుదలపెట్టఁబడినట్టిగాని జమీందారుచేఁగొనఁబడినట్టిగాని, మఱియేవిధముగానైన జమీందారువశమైయున్నట్టి భూములవిషయముంగూర్చియు అనాది బంజరుభూములను గూర్చియు నమరకముచేసికొనుటకు సర్వాధికారము జమీందారులకున్నను ౧౯౦౮-వ సంవత్సరమున జారీచేయఁబడినఎస్టేటు ల్యాండు ఆక్టునందలి షరతులకు మాత్రము సంబంధించి నట్లమరకము చేయఁబడవలెను. సర్కారు జిరాయితీ గ్రామముల యందలి జిరాయితీ, బంజరు భూములను రయితుల కిచ్చు నేర్పాటులన్నియు సర్కారు రివిన్యూశాసనములలో విస్తరించి చెప్పఁబడియే యున్నవి. ఈ శాసనములలో రయితుకున్న స్వాతంత్ర్యములును హక్కులును సర్కారుకున్న స్వాతంత్ర్యమును నధికారమును విస్పష్టముగాఁ జెప్పఁబడియున్నవి. అమరకపు పద్ధతులన్నింటినిఁగూర్చి రివిన్యూబోర్డువారు జారీచేసిన "స్టాండింగు ఆర్డరుల" యందును రివిన్యూ అధికారులు జారీజేయు నధికారపత్రికలంబట్టియు వ్యవహరింపఁబడుచుండును. కాని రయితువారీ శెటిల్‌మెంటుయొక్క ప్రధానలక్షణములు మాత్రము మార్పుఁజెందవు. అగ్రహారములు, శ్రోత్రియములు, ముఖాసా గ్రామములు మొదలగు శాశ్వతపు అమరకముఁ జెందిన గ్రామములయందలి జిరాయితీ భూములును బంజరు అనాదిబంజరు భూములును జమీందారీ గ్రామములయందలి

యీ భూముల లక్షణమే యించుమించుగాఁ గలిగియుండి వాని అమరకము విషయమైకూడ "ల్యాండుఆక్టు" వరతులే వర్తింపఁజేయఁబడు చుండును. నీలగిరి, లైనాడ్, మొదలగు దేశములయందలి అమరకపు పద్ధతులు వేఱు విధములైనవి. తేయాకు, కాఫీ, రబ్బరు, చింకోనా, మొదలగు తోఁటలు వేయుట కర్హమైన భూముల అమరకపు పద్ధతులు గూడ వేఱువిధములైనవే. ఈసాధారణరైతు వారీ అమరకము పద్ధతులుగాక సర్కారువారు శాశ్వతముగాగాని తొంబదితొమ్మిది సంవత్సరములకుగాని వారియిష్టము వచ్చిన కొన్ని సంవత్సరములకుగాని యిండ్లు కట్టడములు, ఫ్యాక్టోరీలు, మొదలగునవి నిర్మించుటకుగాని యితర ఖారుఖానా పనులు చేసికొనుటకుగాని గనులు త్రవ్వుకొనుటకుగాని భూముల నమర్చు పద్ధతులు గలవు. ఇట్టివాని విషయమై వేఱువేఱు చట్టములును నిబంధనలును నేర్పడియున్నవి. ఆయాచట్టములను నిబంధనలను అనుసరించి అట్టివాని అమరకపు విశేషములు అమలు జరుగుచుండును. సర్కారు రయితువారీ భూముల యమరకపు పద్ధతులు మొదలగు వానివిషయమై బొంబాయి రాజధానియందు "బొంబాయి రివిన్యూఆక్టు" అనునొకచట్టము నేర్పఱచి ఆచట్టము నిబంధనల ననుసరించి వ్యవహారము జరుపుకొనుచున్నారు. కాని మనరాష్ట్రమందు మాత్రము దొరతనము వారట్టి నిబంధనలు చేయక సందర్భానుసారముగాఁ దాము జారీచేయు నిబంధనలనుబట్టియే రివిన్యూవ్యవహారము జరుపుచుండుటచేత నీరాష్ట్రమందు రివిన్యూవ్యవహారము కేవలము దొరతనమువారి చిత్తవృత్తి ననుసరించియే జరుపఁబడుచుండుట కవకాశము తటస్థించినది. ఇంతియేకాక జమీందారీగ్రామములలోని జిరాయితీ భూముల శిస్తుపెంచఁబడుటకు కొన్ని నిబంధనలును కొన్ని మితులును "ల్యాండుఆక్టు" నందు వివరించి విధించి యుండిరి. కాని 30 సంవత్సరముల తరువాత సర్కారు భూములు మరల సెటిల్‌మెంటు చేయునపుడు ఇట్టి నిబంధనలనుగాని మితులనుగాని వివరించి విధించియుండ లేదు. రయితువారి పద్ధతిలో "ఊలుగు" "మోతాఫిసల్" "అమానీ" అనుభేదములు గలవు. ఊలుగు పద్ధతిలో రయితు వారీపద్ధతి యందువలె సెటిల్‌మెంటు సమయమునందలి ధరలను బట్టిగాక ఎప్పటికప్పుడు ధాన్యమున కున్న ధరలంబట్టి శిస్తునిర్ణయింపఁ బడుచుండును. గ్రామసముదాయోపయోగము నిమిత్తముగా నేర్పాటుచేయఁబడిన "పోరంబోకులు" "పుంతలు" మొదలగునవియుఁ చెఱువులు మున్నగునవియు, నవి నిర్ణయింపఁబడిన కార్యముల కుపయోగింప నప్పుడును గ్రామోపయుక్తములు కానపుడును సర్కారు వేలంపాటమీఁదగాని, దరఖాస్తుమీఁదగాని శిస్తు కట్టి రయితులవశము చేయుచుండు నాచారము గలదు.

౩౦ సంవత్సరములకొకసారి రయితువారీ భూమిపై శిస్తునిర్ణయించునపుడు (సెటిల్ మెంటు చేయునపుడు) భూమియొక్క ఫలవత్తను బట్టితరగతులునిర్ణయించిఅట్టి తరగతినిబట్టియు జలాధారాది సదుపాయములనుబట్టియుఫలసాయమమ్మఁబడుప్రదేశమునకుఁగల దూరమును బట్టియు, పొలములోనుండి ఫలసాయ మావలకు దీసికొనిపోవుటకున్న మార్గసదుపాయములంబట్టియు, కూలిపనిచేయు కూలివాండ్ర జీతములంబట్టియు, నంతకుమున్ను ౧౦ సంవత్సరములయందున్న ధాన్యపువెలలు దామాయిషీచేసి దానింబట్టియుఁ గాలవైపరీత్యముంబట్టి సంభవింపఁబోవు నష్టములనుగుర్తించియు సేద్యముగావించుటకు రయితునకగు నన్నివిధములగు ఖర్చులను రయితులకుఁ గాలవైపరీత్యమువలన సాధారణముగా సంభవించు నష్టములను, పంటమోతకూలి వగైరా ఖర్చులును భూమి బాగుజేసికొనుటకును నెరువు పెట్టుటకుఁగాదగిన సొమ్ముమీది వడ్డీయును లెక్కచూచి అవిపోఁగా, మిగిలినదానిలో సగముభాగము భూమికి శిస్తు కట్టనలసినదని సర్కారువారియేర్పాటు. భూమిశిస్తు నిర్ణయించుపద్ధతియునట్లునిర్ణయించువిధమును సవిస్తరముగా సెటిల్ మెంటురూల్సులోఁ జెప్పబడుటయేగాక దేశకాలపాత్రములంబట్టి రివిన్యూబోర్డువారును సర్కారువారును నుత్తరువులు జారీచేయు వాడుకగూడకలదు. ఒకజిల్లా "సెటిల్ మెంటు" చేయునపుడు సెటిల్ మెంటు ఆఫీసరు, ఆజిల్లాలోని భూములనుకొన్నింటిని తనిఖీచేసి అంతకు పూర్వముచేసిన సెటిల్ మెంటునందలి శిస్తులనువిమర్శించి భూములతరములు పరీక్షించి సెటిల్ మెంటు మాన్యూయలులోనున్న నిబంధనలంబట్టి పల్లపుభూములయు మెరక భూములయు శిస్తురేట్లను నిర్ణయించి సవిస్తరముగా నొకరిపోర్టువ్రాసి దానిని రివిన్యూబోర్డువారికి కలెక్టరు ద్వారాపంపును. ఆ రిపోర్టునే "స్కీముర్రిపోర్టు" అందురు. ఆస్కీము రిపోర్టు పరిశీలించి తమ యభిప్రాయములతో రివిన్యూబోర్డువారు దానిం బ్రచురింతురు. అప్పుడును అంతకుపూర్వము సెటిల్ మెంటు ఆఫీసరు శిస్తురేట్లను నిర్ణయించునప్పుడు చేయువాకబు సమయమందును భూస్వాములును రయితులును దమతమ ఆక్షేపణలను చెప్పుకోవచ్చును. తరువాత రివిన్యూబోర్డువారి యభిప్రాయముతోఁ బంపఁబడిన "స్కీమురిపోర్టును" గవర్నమెంటువారుపరిశీలించి దానిపైని తుట్టతుది యుత్తరువును జారీచేతురు. ఆయుత్తరువు ననుసరించి శిస్తురేట్లుకట్టి సెటిల్ మెంటు ఖాయముచేసి పట్టాలీయఁబడును. మొదట స్కీమురిపోర్టులో సెటిల్ మెంటు ఆఫీసరుకట్టిన రేట్లనుఆమోదించుటకుగాని తగ్గించుటకుగాని హెచ్చించుటకుగాని రివిన్యూబోర్డువారి కధికారముగలదు. అందుపైని గవర్నమెంటువారుత్తరవు జారీచేయునపుడు రేట్లనుమార్చుటకు వారి కధికారముగలదు. ఈ అధికారములంబట్టి సాధారణముగాస్కీమురిపోర్టులో సెటిల్ మెంటు

ఆఫీసరు సిఫారసుచేసిన రేట్లను బోర్డువారు హెచ్చించుటయు నారేట్లనుమరల దొరతనము వారు హెచ్చించుటయు సంభవించు చుండుటంబట్టి స్వయముగా భూమినిజూచి పంటలు పరిశీలించి శిస్తు నిర్ణయించిన సెటిల్ మెంటు ఆఫీసరు సిద్ధాంతమెందులకుఁ బనికిరాకపోవుటయుఁ దటస్థించుచుండును.

౪ అడవి

పూర్వము హిందూరాజుల కాలమున నడవికి విలువగాని హక్కుగాని యున్నట్లగపింపదు. జనులకు తమ యిష్టము వచ్చినట్లు అడవిలోఁ దిరుగుటకును ఇష్టమువచ్చిన ప్రదేశములయందు సాగుబడి చేసి కొనుటకును కలప మొదలగు అడవి ఫలసాయమును స్వేచ్ఛగా ననుభవించుటకును అధికారముండెడిది. తరువాత మహమ్మదీయ రాజుల కాలమందుఁ గూడ మహారణ్యములలో నిట్టి యధికారమే ప్రజలకున్నను గ్రామము లేర్పడిన తరువాత నాయాగ్రామములకు సంబంధించి దాఁపున నున్న అడవులను నాయాగ్రామస్థులే అనుభవించు వాడుక కలిగినది. దానింబట్టి గ్రామస్థులు తమగ్రామములకు సంబంధించి దాఁపున నున్న అడవియందు వంటచెఱుకు, కలప, ఆకులు, పండ్లు, కంప, గడ్డి, మొదలగు నడవియందలియుపయుక్తవస్తువులన్నియు స్వేచ్ఛగా ననుభవించుచుఁ గాలము గడుపుచుండిరి. ఇతర గ్రామస్థులు తమ గ్రామముతో సంబంధించిన అడవి ననుభవింపకుండునట్లు నివారింపకుండ నూరకుండుటయుఁగలదు. అది గ్రామస్థుల యిష్టముంబట్టియు గ్రామస్థుల శక్తినిబట్టియు అడవియొక్క వైశాల్యమునుబట్టియు నడవియొక్క స్వభావముంబట్టియు,జరుగుచుండెను. ఆకాలమందు కలప మొదలగు నడవివస్తువులకు ఖరీదు లేదనియె చెప్పవచ్చును. అందువలన నవి అమ్ముకొను వాడుక లేదు. ఇండ్లు కట్టుకొనుటకు కలప, వ్యవసాయము చేసికొనుటకు కఱ్ఱలు కంప మొదలగునవియు, భూమి కెరువుకట్టుటకు పారుటాకులు మొదలగునవియు, గృహోపయోగము నిమిత్తము కట్టెపుల్లలును, ఆవులను ఎడ్లను గొఱ్ఱెలను మేకలను మేఁపుటకు గడ్డి గాదర మొదలగునవియు, నవి తిరుగుటకుఁ గావలసినంత ప్రదేశమును వ్యవసాయదార్ల కత్యవసరము. గ్రామస్థులు వ్యవసాయదార్లగుటంబట్టియు వ్యవసాయమే ప్రధానవ్యాపారముగాఁగలవారగుటచేతను వారికి అడవి బహూపయుక్తముగాఁ గావలసినదైనది. వ్యవసాయదార్లగు గ్రామీయులకు నడవియందలి వస్తువులు వ్యవసాయమున కత్యవసరముగాఁ గావలసియుండుటంబట్టియు నట్టివస్తువులు వారికి చేకూరనియెడల వ్యవసాయము జరగదను కారణముంబట్టియు వ్యవసాయమున కేవిధమగునాటంకము గలుగకుండఁ జేయుటకై గ్రామస్థులు తమతమ గ్రామములకు సంబంధించిన అడవులను స్వేచ్ఛగా ననుభవించుటకు నేవిధమగు నాటంకమును మహమ్మదీయ ప్రభువులు కల్పింప

లేదు. కాని అడవులలోనున్న మంచి గంధ వృక్షములు మొదలగు విలువగల చెట్లను మాత్రము కొట్టకుండఁ గొంతవఱకుఁ గట్టుదిట్టము చేయుచుండిరి.

తరువాత నాంగ్లేయప్రభుత్వమారంభమైన పిమ్మటను నేగ్రామముతో సంబంధించిన అడవిని నాగ్రామస్థులు స్వేచ్ఛగా ననుభవించుటకుఁ బ్రతిబంధింపక యేగ్రామముతోడను సంబంధింపకుండు పెద్ద అడవులవిషయమై యేవిధమయిన యేర్పాటును జేయక యుంచిరి. గ్రామస్థులు చాలకాలము నుండి వారివారి గ్రామములతో సంబంధించియుండు నడవులనుభవించుచుండుటవలన దానియందు వారికొకవిధమయిన భుక్తమువలన సంభవించిన హక్కు కలిగియుండెను. కాని గ్రామముతో సంబంధించిన యడవి యెంతయను విషయమునుగుఱించి యోచించి నిశ్చయింపవలసిన యవసరము కలిగినది. ౧౮౬౫-వ సంవత్సరమువఱకును నడవుల విషయమై యేవిధమైన శాసనమును జేయుటకు దొరతనము వారు ప్రయత్నింపలేదు. కాని అడవి పాడువడ జేయకుండునట్లును గార్చిచ్చులు మొదలగు వానివలన దగ్ధముకాకుండు నట్లును గొన్ని ప్రయత్నములు అప్పుడప్పుడుచేయుచువచ్చిరి. ఇందు విషయమై యుచితమగు పద్ధతులను మాత్ర మేర్పరుపలేదు. మనదేశము యొక్క శీతోష్ణస్థితినీబట్టియు మనదేశస్థుల వృత్తివిశేషముంబట్టియు నడవి మిక్కిలి ముఖ్యమైనది. అడవుల స్థితినిబట్టి శీతోష్ణస్థితియు వాతావరణగతియు అతివృష్టి అనావృష్టులును నేర్పడుచుండునను సిద్ధాంతముంబట్టి మనదేశములయందలి అడవులయందు సంభవమగుచున్న మిక్కిలి విలువగల కలప, మొదలగువస్తువుల యొక్క విశేషముంబట్టియు నడవులు మనదేశమునకు ముఖ్యములైనవియు నమూల్యములైనవియు నని పరిగణింపఁబడవలసి వచ్చినది. ఆంగ్లేయులీవిషయముననుగ్రహించి అడవులను గాపాడుటవలన దేశమునకును బ్రజలకును క్షేమమనియు లాభమనియు దొరతనము వారికి విశేషద్రవ్యాదాయము వచ్చుటకు సాధనమనియు గ్రహించిరి. ఈయుద్దేశముంబట్టి యడవులను కాపాడవలయునని వారు నిశ్చయించికొని యాపనికై పూనుకొనిరి. అడవులు ఎవరి వశమందును నుండని వగుటచే దొరతనమువారికి సర్వస్వాతంత్రత గలవిగా పరిగణింపఁ బడవలెను. కాని జమీందారీ యెస్టేట్లు, జాగీర్లు, అగ్రహారములు, శ్రోత్రియ గ్రామములు, తాలూకాదారీ యెస్టేట్లు, మున్నగువానికిని స్వతంత్ర రాజ్యములకును సంబంధించిన యడవుల హక్కు వారిదేగాని గవర్నమెంటు దెంతమాత్రముకానేరదు. కాన బట్టి సర్కారుఅడవి యేదియో యితరులఅడవి యేదియో ముందునిర్ణయించుట కవసరము కలుగుటచే దొరతనమువారా నిర్ణయముఁ గావించి సరిహద్దు లేర్పఱచిరి. దొరతనము వారి యడవులయందు వారికి సర్వస్వాతంత్ర

మైన హక్కు కలదుగాని పూర్వము నుండియు గ్రామస్థు లనుభవించుచున్న హక్కుభుక్తము లు కేవలము పరిగణింపఁబడకుండుటకు వీలు లేకపోయినది. ౧౮౬౫ వ-సంవత్సరము తరువాత నడవులను కేవలము నిరాకరించి విడిచిపెట్టుట కియ్యకొనక గ్రామస్థుల కడవి యందున్న హక్కుభుక్తముల విషయమై పరిశీలించుచు "నేయేగ్రామముతో సంబంధించునది యెంతో" అనుసంగతి సిద్ధాంతీకరించు నేర్పాటులను చేయుసాధనములను యోజించుచు నడవులను శిస్తున కిజారాల కిచ్చుపద్ధతి నమలులోనికిఁ దీసికొనివచ్చిరి. తరువాత గ్రామస్థులు తమతమ గ్రామములకు సంబంధించినట్టియుఁ దమ కుపయుక్తమగునట్టియు నడవులను నిజారాకుఁ బుచ్చుకొను పద్ధతియేర్పడినది. ప్రస్తుతమమలులోనున్న "ఫారెస్టులా" ౭-వ నెంబరు శాసనముగా ౧౮౭౮-వ సంవత్సరమున జారీచేయఁబడినది. తరువాత మద్రాసు దొరతనమువారిందువిషయమయి ౧౮౮౨-వ సంవత్సరమందు ౫-వ నెంబరు ఆక్టుజారీచేసిరి. ఈ ఆక్టు ౧౮౭౮-వ సంవత్సరమున చేయఁబడిన శాసనముకన్న విపులమైనది. ఈ రెండు శాసనము లనుసరించియు దొరతనము వారేర్పఱచిన నిబంధనలననుసరించియు యడవుల వ్యవహారమిప్పుడు జరుగుచున్నది.

అడవులను గాపాడి పెంచవలయు ననునుద్దేశముతో కొన్నింటిని ఆకట్టి "రిజర్వుఫారెస్టు" లనియుఁ దక్కినవానిని ఆకట్టక "అన్‌రిజర్వుడుఫారెస్టు" లనియు రెండు విధములుగా విభజించిరి. గ్రామస్థులకు వ్యవసాయ గృహోపయోగములవిషయమయి తప్పక కావలసినంత యడవిని మాత్రము ఆకట్టక "అన్‌రిజర్వుడు ఫారెస్టు" గానుంచి తక్కినదానిని ఆకట్టుపద్ధతి నమలులోనికిఁ దెచ్చిరి. మొదటి యిజారాపద్ధతిమీఁద నడవుల నమరచు మార్గము వదలిపెట్టి అడవులను "అమానీ" చేసి అడవివస్తువులన్నిటికి "ఫీజు" నిర్ణయించి అట్టి వస్తువులునిర్ణయింపఁబడిన ఫీజుచెల్లించి అసంరక్షితారణ్యముల నుండి గ్రామస్తులు తెచ్చుకొను నేర్పాటు చేసిరి. పెద్ద అడవులలోనున్న మ్రానుకలప మొదలగు వానికిఁ గూడ ఫీజురేట్ల నేర్పఱచిరి. ఈపద్ధతులన్నియు నాకట్టబడక సంపూర్ణముగాఁ బెరిగిన యడవులయందే అమలు జరుపఁబడుచున్నవిగాని ఆకట్టఁబడిన యడవుల యందమలు జరుపుటలేదు. అట్టిఅడవులలోఁ బ్రవేశించినను ఏకలపగానికొట్టినను శిక్షించు విధికూడ నేర్పఱుపఁబడినది. ఈపద్ధతుల ననుసరించి గ్రామస్తులు వ్యవసాయముకొఱకు గాని గృహోపయోగమునకైగాని కావలసిన యడవి వస్తువులన్నిటికిఁ బన్నుఁజెల్లించి తెచ్చుకొనవలసిన యవసరమును దమమేఁకలు గొఱ్ఱెలు ఆవులు మొదలగు వాని నడవిలో మేపుకొన్నందులకు పన్ను అనఁగా పుల్లరి చెల్లింపవలసిన యవసరమును గలిగినది. అడవిలోఁ బుట్టిన మైనము, తేనె, లక్క, బెదడు, ఆకులు,

బంక మొదలగు సర్వపదార్థములుఁ దెచ్చు కొనుటకుఁగూడ పన్ను రేట్లు కట్టఁబడుటవలన నడవివస్తు వేదియును నెవ్వరును స్వేచ్ఛగాఁ దెచ్చుకొని వాడుకొన్నుటకు వీలులేదు.

జమీందారీ యెస్టేట్లు, శాశ్వతపు అమర కపుపద్ధతిలోనున్న అగ్రహారములు, శ్రోత్రియ ములు, ముఖాసాలు, జాగీర్లు, మొదలగునా నిలోఁజేరిన అడవులాయాయధికారుల హక్కు భుక్తములుకలిగి వారిసంపూర్ణాధికారమునకు లోఁబడియుండుటచేత నాయాఅడవుల అమర కమువిషయమై వారియిష్టానుసారముగా వ్యవ హరించుకొనుట కవకాశము గలిగియున్నది. ఇట్టిపై ప్రైవేటు అడవులపై వానిహక్కుదారులు చేసికొను నేర్పాటులయందు సర్కారువారికే విధమగు జోక్యమును లేదు. గాని సర్కారు అడవికి నష్టమువచ్చునట్లు వారు వ్యవహరించిన యెడల దొరతనమువారు జోక్యముకలుగఁ జేసికొనుటకు మాత్రము "ఫారెస్టులా" లో అవకాశము నేర్పఱచుకొనిరి. ఇప్పటి దేశ కాలస్థితులను బట్టియు నడవివస్తువుల ధరలను బట్టియు నడవులు మిక్కిలి లాభములైనవియు ఖరీదుగలవియు నగుటయేగాక కొన్నిచోట్ల సేద్యముసేయుప్రదేశములకంటెఁగూడ ముఖ్య మైన వయినవి.

మదరాసు రాజధానిలో రైతువారీ అమ రకపుపద్ధతి ముఖ్యమైనదయినను జమీందారీ అమరకపుపద్ధతి గూడకలదు. ఈరాజధానిలో ౧/౩వ వంతుప్రదేశము జమీందారీ అమరకపు పద్ధతిక్రిందనున్నది. బంగాళారాజధాని యం తయు జమీందారీ పద్ధతిమీఁదనే అమరకము చేయఁబడినది.

**వేఱుపఱగణాలలోని అమ రకపు పద్ధతి**

సంయుక్తరాష్ట్రము, పంజాబు, మధ్య పరగణాల యందు గ్రామము ముఖ్యముగానెంచి గ్రామ వారీ సెటిలుమెంటుపద్ధతిని అమరకము చేయఁ బడినది. అట్టిగ్రామవారీ అమరకపుపద్ధతిలో గ్రామమునకంతకును ఒక్కఁడే హక్కుదారుఁడు గాగాని, గ్రామసముదాయమంతయుఁ గలసి హక్కుదారులుగాగాని యుండినను సెటిలు మెంటు రికార్డులో తఫ్సీళ్లన్నియు వ్రాయఁ బడినను శిస్తువసూలు పద్ధతిమాత్రము రైతు వారీసగాక గ్రామమంతకును మొత్తముగా తత్తదధికారులవలన వసూలు చేయఁబడును. ఈ గ్రామవారీ సెటిలుమెంటును రయితువారీ సెటిలుమెంటువలె 30 సంవత్సరములు మా త్రమే పరమితిగలది. బొంబాయి రాజధానిలో నక్కడక్కడ నితర విధములైన అమరకపు మార్గములున్నను సాధారణముగా మదరాసు రాజధానియందు వలెనే రైతువారీ అమరకపు పద్ధతియేవాడుకలో నున్నది. అయోధ్యలో ౧౮౫౮వ సంవత్సరమున జరిగినపితూరీ తరు వాత నక్కడనున్న పెద్దపెద్ద భూస్వాములను బలవంతులైన నాయకులను సర్కారువారి క్రిందనున్న యెస్టేట్లకు తాలూకాదారులను నామముతో సర్వాధికారులుగా నంగీకరించి బంగాళా రాజధానియందున్న జమీందారుల

కంటెఁ గూడ నెక్కువ స్వాతంత్ర్యము కలిగి యుండునట్లు అమరకపు మార్గమేర్పఱుపఁ బడినది. "ఆస్సాము" దేశములోని అమరకము రయితువారీ అమరకము వంటిదే. అయినను ఇచ్చటనున్న న్ని కట్టుపాట్లతో నిండియుండ లేదు. బర్మాదేశములో వ్యవసాయము పూర్వ పద్ధతినే జరుపఁ బడుచుండుటవలన నక్కడి అమరకపుపద్ధతులుసులభములైనవియు భూమి పన్ను సులభమైనదిగాను ఉన్నది. ఈ అమ రకపు పద్ధతులనుగూర్చి వేఱు వేఱుగా వివరింపఁ బడుచున్నది.

శాశ్వతపుహక్కుతో జమీందారీ పద్ధతిని జేయఁబడిన అమరకము బంగాళారాజధాని యందంతటను మదరాసు రాజధానిలో ౫వ వంతు ప్రదేశమందును వాడుకలో నున్నదని యింతకుమున్నే వ్రాయఁబడినది. బంగాళము, బేహారురాష్ట్రము, ఓఢ్ర (ఒరిస్సా) దేశము, ఉత్తరసర్కార్లు అని పిలువఁబడు ఇప్పటి గంజాము, విశాఖపట్టణము, గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలును, ఈస్టిండియాకంపెనీ వారికి ఢిల్లీ చక్రవర్తి ౧౭౬౫-వ సంవత్సరమున నిచ్చివేసెను. అందువలన నాదేశమంతయు మొదట కంపెనీప్రభుత్వమునకును, పిదప నాంగ్లేయ రాజుల ప్రభుత్వమునకును లోఁబడుట తటస్థమైనది. ఉత్తరసర్కార్లు కంపెనీవారి స్వాధీనములోనికి ౧౭౬౫-౬౬ సంవత్సరము

శాశ్వతపు పద్ధతిలోఁ జేయఁబడిన జమీందారీ అమరకము (Permanent settlement)

లలో వచ్చినను ౧౮౨౩-వ సంవత్సరము వఱకును హైదరాబాదునవాబునకు సంవత్సరమునకు ౧౨లక్షల చొప్పున కప్పము కట్టవలసిన యవసరము కలిగియే యుండెను. ౧౮౨౩లో మొత్తముగా ౧౨కోట్ల రూపాయలొక్కసారి యిచ్చి యికముందుఁ గప్పము లేకుండఁ జేసికొనిరి. అటుపిమ్మట నుత్తరసర్కార్లపై కంపెనీ వారికి సంపూర్ణాధికారము వచ్చినది. ఆంగ్లేయులు తమ స్వాధీనములోనికి వచ్చిన దేశములయందంతకు పూర్వము అమలులోనున్న అమరకపు పద్ధతులను మార్చివేయక ఆపద్ధతుల ననుసరించియే అమరకపుపద్ధతు లేర్పఱచిరని యిదివరకే వ్రాయఁబడియున్నది. బంగాళా, బేహారు, ఒరిస్సా దేశములును, ఉత్తరసర్కార్లును జయింపఁబడినదేశములు గాక దానపూర్వకముగాఁ జెందఁబడిన దేశము లగుటవలన అదివఱ కాయాదేశముల యందు ప్రజలనుభవించుచున్న హక్కులకు భంగము కలిగించుటకును చక్రవర్తికున్న అధికారము కంటె నెక్కువ యధికారమును కల్పించుకొనుట న్యాయశాస్త్రవిరుద్ధ మగుటవలన నీవిషయము కూడ పాటింపవలసివచ్చినది. గవర్నరు జనరల్ అగు "కార్నవాలిస్" ప్రభువు బంగాళారాష్ట్రము (బంగాళా, బేహారు, ఒరిస్సా) లో శాశ్వతపు హక్కుగల జమీందారీ అమరకపు పద్ధతిని ౧౭౯3-వ సంవత్సరములో అమరకము చేసెను.

మహమ్మదీయులు ఈదేశము నాక్రమించుకొనిన తరువాత హిందూసామంత రాజుల క్రిందను హిందూ ప్రభువులక్రిందను బ్రప్రథమమున భూమిశిస్తు వసూలుచేయుట కేర్పడి బలవంతులై కాలక్రమమున నాయా ప్రదేశములకు నాయకులై అధికారమును సంపాదించుకొన్న వారి వశమందున్న ప్రదేశములను వారుతమకుఁ గొంత కప్పము కట్టుపద్ధతిని వారిక్రిందనే నుండనిచ్చి తక్కినదేశమంతయుఁ బెద్దపెద్ద ఖండములుగా నేర్పఱిచి ఆయాఖండముల భూమి పన్ను వసూలుచేయుటకు నొక్కొక్కయధికారిని నియమించుచు వచ్చిరి. ఈ యధికారులకు మొదట "క్రోరీ" లనియుఁ దరువాత జమీందారులనియు వాడుకవచ్చినది. ౧౭౬౫ లో బంగాళారాష్ట్రము ఈస్టిండియా కంపెనీ స్వాధీనములోనికి వచ్చినతరువాతఁ బూర్వపునీ పద్ధతులవలన శిస్తువసూలుచేయు పద్ధతి యెంత చక్కనిస్థితికిఁ దేవలెనని ప్రయత్నించినను గొనసాగక యనేకవిధములగు నక్రమముల కవకాశము కలుగుచువచ్చినది. కంపెనీవారు అమరకపుపద్ధతిని సరియైనమార్గమునకుఁ దీసికొని రావలెనని యనేక ప్రయత్నములుచేసి తుద కుచితముగా వ్యవహరింపని జమీందారులను తీసివైచి జిల్లాయంతయునొక్కనికి గాని యిద్దరుముగ్గురకుగాని అయిదుసంవత్సరములు కవులు కిచ్చి క్రొత్తజమీందారులను గొందఱి నేర్పఱిచిరి. ఈపద్ధతిగూడ సరిగా అమలు జరుగకపోవుటచేత పూర్వమున నున్న జమీందారులకే తిరిగి ఆయాప్రదేశములనొక్కొక్క సంవత్సరమునకుఁ గవులుకిచ్చి పూర్వపుమొత్తమును బట్టియే శిస్తుమొత్తమేర్పఱచిరి. ఇట్లు బంగాళారాజధానిలో అమరకపుపద్ధతినిగుఱించియు శిస్తువసూలును గూర్చియు చేయఁబడిన యేర్పాటులు చక్కఁగా నమలు జరుగక పోవుటయుఁ గంపెనీవ్యవహారములు కల్లోలముగా నుండుటయు నింగ్లాండుదేశమునఁ బార్లమెంటు సభవారికి దెలిసినది. అంత ౧౭౭౩-వ సంవత్సరములో "రిగ్యులేటింగుఆక్టు" అనుచట్టము పార్లమెంటుసభవారు ప్యాసుచేసిరి. దానింబట్టి బంగాళారాజధానిలోనున్న కంపెనీవారి ప్రభుత్వమునకుకొంతయధికారమువచ్చినది. కాని రివిన్యూ వ్యవహారవిషయమై మాత్రము చక్కని స్థితిలోనికిఁ దీసికొనివచ్చుట కీచట్టము చాలకపోయినది. అందువలన ౧౭౮౪-వసం॥రివిన్యూ వ్యవహారమును జక్కపఱచు నిమిత్తమింకొక చట్టము పార్లమెంటులో చేయఁబడినది. ఈచట్టము ప్యాసుకాకమునుపు కంపెనీప్రభుత్వము వారికి రివిన్యూవ్యవహారవిషయమై సరియైన గట్టి యేర్పాటు లేమిచేయుటకును అధికారము లేకపోయెను. తరువాత నీదేశమునకు ౧౭౮౬ సంవత్సరమున గవర్నరు జనరల్‌గా వచ్చిన "లార్డుకార్నువాలీస్ ప్రభువు" ఈవిషయమై గట్టిశ్రద్ధచేసి పని చేయుట కారంభించెను. అప్పుడాయనతోనున్న కంపెనీయుద్యోగస్థుడు "సర్ జాన్ షోర్" అను నాయనకూడ నాయనకు సహాయుఁడై పనిచేసెను. రివిన్యూ విష

యమై ఈ "సర్ జాన్ షోర్" విశేషశ్రమపడి సంగతి యంతయుఁ దెలిసికొని విశేషానుభవము కలిగి పనిచేసెను. జమీందారుల స్థితిగతులను గూర్చియు వారిపూర్వ చారిత్రములను గూర్చియు వారేవిధముగా నాపదవిని పొందుటకు కారణము కలిగినదో దానింగూర్చియు వారిక్రింద నున్న జమీందారీ ప్రదేశములు న్యాయముగా భరించి యీయఁదగిన శిస్తు మొత్తమును గూర్చియుఁ బురాతనపు లెక్కలను బట్టియు నితర రికార్డులనుబట్టియు ననేకవిధములుగా ననేకదినములు శ్రమపడి సవిస్తరముగా సంగతి యంతయు సాధ్యమగునంతవఱకుఁ దెలిసికొనుటకు ప్రయత్నించి, పెక్కుసంగతులు గ్రహించి తరువాత జమీందారులతో ౧౦-సంవత్సరముల కొకసారి యమరకముచేసికొను పద్ధతి నొకదానిని నేర్పఱిచి యందుకుఁదగిన నిబంధనలను సమకూర్చెను. ప్రతిరైతు నొద్దనుండియు ప్రతిగ్రామమునుండియు భూమిపన్ను వసూలు చేసికొను కష్టము లేకుండఁ జేసికొనుటకు మహమ్మదీయులు ప్రథమమున నేర్పఱచిన జమీందారీ అమరకపు పద్ధతియే కంపెనీ ప్రభుత్వమువారు కూడ మరల నవలంబించి తుదకు ౧౦-సంవత్సరముల కొకసారి అమరకముచేయుపద్ధతియే మంచిదని యోజించిరి. తరువాత జమీందారులు రైతుల నొద్దనుండి శిస్తువసూలు చేయుటకు నొకవిధమైన అధికారమును, తమ జమీందారీ యెస్టేట్ల యందలి భూముల యందు హక్కును గలిగి యుండనియెడల శిస్తు వసూలు అగుటయే దుర్ఘటమని యెంచి వారికొకవిధమైన యధికారమును గౌరవప్రపత్తియు భూములయందు హక్కునుగలుగఁజేయుట అత్యవసరమని యెంచి ఈ ౧౦-సంవత్సరముల సెటిలుమెంటు సంపూర్తికాకమున్నే మార్చి ౧౭౯౩ వ సంవత్సరము జమీందారులకు వారివారి క్రిందనున్న యెస్టేట్లయందు వంశపారం పర్యముగావచ్చు శాశ్వతపుహక్కును దాన విక్రయ దమనాధికారములుకలుగఁజేసి వారీయవలసినశిస్తు (పేష్కష్) మొత్తము చెల్లించుచున్నంతవఱకు వారు యథేచ్ఛగా ననుభవించి తమతమ యెస్టేట్లను బాగుపరచుకొనఁ గలుగునట్లుగావించిరి. బనారస్ (కాశీ) పరగణాకూడ నీ పద్ధతినే ౧౭౯౫-వ సంవత్సరము అమరకము చేయఁబడినది. నార్తర్న్ సర్కార్లుకూడ నీవిధముగానే జమీందారీఅమరకపుపద్ధతినిఅమరకముచేయవలసినదని ౨౧ ఏప్రిల్ ౧౭౯౫-వ సంవత్సరమున "కోర్టు ఆఫ్ డైరక్టర్సు"వారు మదరాసు దొరతనమువారికి, ఆజ్ఞపంపిరి. కాని,మదరాసు దొరతనమువారికి ఆపద్ధతి యీరాజధానిలో నవలంబించుటంతగా నిష్టము లేకపోయినది. ౧౭౭౯-న సంవత్సరమున జమీందారీపద్ధతి తప్పక అవలంబింపవలసినదని కఠినమైన యుత్తరువు జారీచేయుటవలన నీజిల్లాలన్నియు జమీందారీ యెస్టేట్లగా నేర్పఱచి అప్పటికున్న యెస్టేట్లను యథాస్థితిగానుంచి వారు చెల్లింపఁదగిన "పేష్కష్" మొత్తమును నిర్ణయించుటకు



౦౫౩

సమకట్టిరి. ఉత్తరసర్కార్లు కంపెనీవారి యేలు బడికివచ్చిన తరువాతఁ గొన్ని సంవత్సరములు అమరకమువిషయమైగట్టిప్రయత్నములేవియు జరుపక యథాస్థితముగానేపోనిచ్చిరి. తరువాత ప్రతిజమీందారీ యెస్టేటు యొక్క రాబడిని తెలిసి కొనుటకు "యెస్టేట్సట్ల రిజిష్టర్లు" (Estates' register) అనుపేర ౧౦ సంవత్సరముల లెక్కలు తయారు చేయించిరి. తరువాత జమీందారీగ్రామముల గుడికట్టు, ఖీర్దు, నాఖిరుదు, వగైరాభూములనుగూర్చి ౧౨ సంవత్సరముల లెక్కలు తయారు చేయించిరి. ఈ లెక్కలనే "బారాఫసలీ" లెక్కలందురు. ఒక కమిటీని నిర్ణయించి ఆకమిటీ దేశమంతయుఁ దిరిగి జమీందారీయెస్టేట్ల స్థితిగతులును వాని మీఁదవచ్చు పన్నుమొత్తమును నిర్ణయించుట కొకయేర్పాటుచేసిరి. ఈకమిటీనే "సర్క్యూటు కమిటీ" యందురు. వీరును కొన్ని లెక్కలు తయారు చేసిరి. తరువాత ౧౮౦౨-వ సంవత్సరములో జమీందారీ యెస్టేట్లమీఁద విధింపఁబడిన "పేష్కష్" మొత్తమును నిర్ణయించుటకు నేర్పాటుచేసి ఆసంవత్సరము జారీచేసిన ౨౫-వ నెంబరు "రిగ్యులేషన్" ను బట్టి జమీందారీ అమరకపు పద్ధతి నుత్తరసర్కార్లలో నమలునకుఁ దీసికొనివచ్చిరి. ఇట్లమరకము చేయఁబడిన జమీందారీ యెస్టేట్ల కధికారులగు జమీందారులలోఁ బురాతన కాలము నుండియుఁ దమతమ యెస్టేట్ల ననుభవించుచున్న పూర్వరాజులసంతతిలోని వారు కొందఱును, ప్రబలులై మహమ్మదీయ ప్రభువుల యనుగ్రహము వలన జమీందారులైన నాయకుల సంతతివారు కొందఱును, నరాజకముగా దేశమల్లరిలో నున్నప్పుడు ప్రబలులై ఆధిపత్యము సంపాదించుకొన్నవారి సంతతివారు కొందఱును, కేవలము భూమిపన్ను వసూలునిమిత్తమే యేర్పరుపఁబడినవారిసంతతివారుకొందఱును, ఉన్నారు. ఇట్లు జమీందారీపద్ధతి నమరకము చేయునప్పుడు ఆయా జమీందారీ యెస్టేట్లవలనవచ్చు శిస్తుమొత్తము లెక్కచూచి సేద్యములోలేని భూమికిఁగూడ కొంతశిస్తుకట్టి అట్టిమొత్తములో సాధారణముగా ౩ వంతులలో ౨ వంతులు పేష్కష్‌గా నిర్ణయించిరి. పర్వత ప్రాంతములయందున్న జమీందార్ల హక్కులకును వెల్లడి ప్రదేశములయందున్న జమీందారీ హక్కులకును కించిత్తు భేదముచూపించిరి. పర్వతప్రదేశములయందున్న జమీందారులను సంపూర్ణముగా స్వాధీనపఱచుకొనుటకును లొంగఁదీయుటకును వీలు గలుగకపోవుటవలన వారికిఁ గొన్ని యెక్కువ స్వాతంత్ర్యము లీయవలసివచ్చినవి.

ఉత్తర సర్కారులోనున్న జమీందారులు సాధారణముగా మూఁడు విధములుగా నున్నారు.

(౧) పూర్వరాజుల సంతతిలోని వారుగాని, సామంత నాయకులుగాని, పూర్వరాజులకు భూమిపన్ను వసూలుచేసి చెల్లించుట కేర్పఱుపఁబడిన వారుగాని, యొక తెగవారు.

(౨) మొగలాయీల ప్రభుత్వకాలమందు మొగలాయి చక్రవర్తులక్రింద భూమిశిస్తు వసూలుచేయుట కేర్పఱుపఁబడిన పెద్దయుద్యోగస్థుల సంతతివారు. వీరిని దేశముఖ దేశపాండ్యాలనుచుండిరి.

(3) హవేలీభూములుకవులుపొందినవారు.

దత్తమండలమందును కన్నడదేశమందును ఈ జమీందారీ అమరకము క్రిందనున్న "పాళ్యగార్లు" నాలుగు విధములుగా నున్నారు.

(౧) పూర్వరాజుల సంతతిలోని వారు.

(౨) బందిపోట్లుదారిదోపుఁడు మొదలయిన పనులు చేయువారికి నాయకులుగానుండి దేశమందలజడి జరుగకుండఁనట్లు ప్రజలను కాపాడు పోలీసు ఉద్యోగము చేసినందులకు నియోగింపఁబడిన వారియొక్కగాని, అట్టి యుద్యోగమును తమంతటతామేకల్పించుకొని నెరవేర్చుచు వచ్చిన వారియొక్కగాని సంతతి వారు.

(3) హిందూరాజులక్రింద గౌరవ్యోద్యోగములుచేసి వారుచేసిన యుపకారములకుఁ బారితోషికముగాగాని అట్టి రాజుల సెలవు అయినప్పుడు కాల్బలమును గుఱ్ఱపుదండును సమకూర్చుపద్ధతిని ఆ సేనలను భరించుటకు గాని యీఁబడిన గ్రామములు పరగణాలును ననుభవించువారి సంతతివారు.

(౪) జిల్లాలను ఇజారాపాడిన వారియొక్కగాని గొప్ప రివిన్యూ యుద్యోగస్థులయొక్కగాని తుదకుఁ బ్రబలులైన గ్రామోద్యోగస్థుల యొక్కగాని సంతతివారు.

ఉత్తర సర్కారులయందలి జమీందారుల వలె ఈపాళ్యగార్లలో పూర్వరాజుల సంతతి లోని వారికిఁ దప్ప తక్కిన వారికి భూమియందు సంపూర్ణమయిన హక్కున్నట్లు కన్పింపదు. వారి హక్కులకును నితరుల హక్కులకును గొంత భేదముకలదు. పూర్వము హైదరాబాదు నవాబువారి స్వోపయోగముకొఱకును, సర్కారు ఉపయోగము నిమిత్తమును, నుత్తర సర్కారులలోఁ గొన్ని ప్రదేశములు "హవేలీ" లేక "సర్కారు" భూములక్రింద నుండెను. మఱియు సేలంజిల్లాలో సర్కారు లేక 'ఆయర్' భూము లనుపేర కొన్ని ఎస్టేట్లును ముఠాలును నుండియుండెను. అట్టివాని నన్నింటిని దొరతనమువారు వేలముపాడి యెక్కువ శిస్తు కట్టుకొన్న వారికి జమీందారి యెస్టేట్లవలె ఆపద్ధతులమీఁదనే శాశ్వతపు కవులునకు నమరకముఁజేసిరి. ౧౮౦౨-వ సంవత్సరమున జారీచేయఁబడిన "రిగ్యులేషన్"ను బట్టి జమీందారులకు వారి యెస్టేట్లమెడ సర్వస్వతంత్రాధికారమున్నట్లగుపించుచున్నది. కాని తరువాత ౧౮౨౨-వ సంవత్సరములో ౪-వ నెంబరు "రిగ్యులేషన్" జారీచేయఁబడినది. ఈచట్టములో స్పష్టముగ నేమిచెప్పఁబడియున్నదనఁగా౧౮౦౨-వ సంవత్సరపు ౨౫-వ చట్టమువలన రైతునకు నదివఱకున్న యేహక్కునుతీసివేయఁబడలేదు. అనఁగా నాచట్టము

వలన రైతుహక్కు తీసి జమీందారునకు నీయఁబడలేదు. ఇందునగుఱించి కొన్ని తీర్పులును బుట్టియున్నవి. ౧౮౦౨-వ సంవత్సరపు ౨౫-వ ఆక్టులోని ౨-వ సెక్షనులో వాడఁబడిన "స్వామ్యస్వాధీనత" (Proprietary possession) అను పదమును పారిభాషిక (Technical) పదముగనెంచి గవర్నమెంటుకు స్వయముగశిస్తుచెల్లించుచున్నవాఁడని అర్థము చేయవలెను. భూమియందు సర్వాధికారియని అర్థము చేయఁగూడదు.[1] రైతుయొక్క హక్కులు దొరతనమువారికిఁబూర్వమే(వారు ఈయకుండగనే) పుట్టినవిగనుక, గవర్నమెంటువారు తమకు భూమియెడఁగల హక్కును మాత్రమే యీయఁగలరుగాని రైతుకుఁగల స్వామ్యము నీయలేరు. దొరతనము వారికి, మేల్ వారమ్, కుడివారమ్ అను రెండుహక్కులునుగల గయాళుభూములవంటి వాని విషయమై వారు, ఈ రెండు హక్కులను నీయఁగలరేగాని, ఇతరయన్ని భూములవిషయమై ఒక్క మేల్ వారమ్ (శిస్తువసూలు చేసికొను) హక్కు మాత్ర మీయఁగలరు.[2]

ఈ రెండు రిగ్యులేషనులబట్టియు జమీందారీ అమరకపుపద్ధతి యిప్పటికిని వ్యవహరింపఁబడుచున్నది. ఈ అమరకపుపద్ధతిని విధింపఁబడిన 'పేష్కష్' భూమిపన్ను శాశ్వతమైనది. రైతువారీ అమరకమునందువలె వీరికే కారణమునగాని "రిమిషన్" అనఁగా శిస్తుకొట్టివేయుట అమలు జరుపఁబడదు. జమీందారులకు వారి వారి యెస్టేట్లనుగూర్చి "సనద్-ఇ-ముల్క్-ఇ స్తిమిరార్" అను శాశ్వతపు పట్టాలీయఁబడి వారివలన "కబూలీయత్" అను ముచ్చిలకాలు తీసికొనఁబడినవి. ఈ పట్టాలనుబట్టి ఉప్పు పన్ను సూరెకారముపన్ను శాయరు శేట్లు, సముద్రముమీఁద నుండిగాని భూమిమీఁద నుండిగాని వచ్చు సరకులమీఁద పన్నులు, కల్లు, సారా, మొదలగు మత్తుద్రవ్యములమీఁది పన్నులు, నాజిరాజు భూములమీఁది పన్నులు, అదివఱకు నౌఖరీ నిమిత్తమీయఁబడిన భూములమీఁది పన్నులు, మోతర్ఫా పన్నులు మొదలగునవి మాత్రము వసూలుచేయుటకు జమీందారుల కధికారము లీయక తోటలు, చెట్లు, పుల్లరిభూములు, చేపలుపట్టు ప్రదేశములు, కార్ఖానాలక్రిందనుపయోగింపఁబడు భూములు, దుకాణము మొదలగు నితర కట్టడములు, మొదలగు వానినుండి పన్ను వసూలుచేయుట కధికార మీయఁబడినది. చెఱువులను సరియయినస్థితిలోనుంచినందులకు ఈనాందారుల వలన జమీందారుల కీయఁబడు "ఘట్టుతూములు" అను పన్ను జమీందారు వసూలుచేసికొన వచ్చునని తీర్మానింపఁబడినది. ఈ విధముగా జమీందారుల కుండు స్వాతంత్ర్యము లన్నియు స్పష్టముగా నిర్ణయింపఁబడినవి. జమీందారు తన యిష్టము

[1] The Collector of Trichinopoly, v. Lekkamani I. I. A. 282; 14 Ben. L. R. 115; 21 W. R. 358.

[2] 1 Mad. 205 (212); 16 Mad. 271; 20 Mad. 299 (302); 26 Mad. 252.

వచ్చినట్లు అంతయుఁగాని కొంతయుఁగాని దాన విక్రయదమనములు చేయుట కధికార మీయఁ బడినది. అట్లు జమీందారులచే విక్రయింపఁ బడినవి, దత్తములు, అయిన జమీందారీల లోని భాగము వేఱు జమీందారీలుగా విభజించి వానిమీఁద "పేష్కష్" పంచికట్టి శాశ్వతపు హక్కుగలుగునట్లు చేయుటకు జిల్లాకలక్టరుల కధికార మీయఁబడినది.

ఇట్లు శాశ్వతపు హక్కుతో జమీందారీ పద్ధతులమీఁద, అమరకము చేయఁబడిన జమీందారీ యేస్టేట్లలో చాలకాలమువఱకు రైతుల యొద్దనుండి జమీందారులు పన్నువసూలు చేసికొనుటకు తగిన యేర్పాటులు చేయఁబడి యుండకపోవుటచేతను శిస్తులు చాలభాగము రైతువల్ల చెల్లక బకాయిపడిపోవుట వలనను, జమీందారులు తాముసర్కారుకు చెల్లింపవలసిన "పేష్కష్" చెల్లింపలేకపోవుట తటస్థించుచువచ్చినది. అట్లు "పేష్కష్" చెల్లింపలేని యెస్టేట్లను దొరతనమువారు వేలము వేసి బాకీమొత్తమిచ్చిన వానికి తిరిగిపూర్వపు షరతులతో శాశ్వతపుహక్కుతో పేష్కష్ నిర్ణయించి వేలంపాటమీఁద విక్రయించుచు వచ్చిరి. తరువాత కొంతకాలమునకు, అనఁగా ౧౮౭౭-వ సంవత్సరమునకుఁ దర్వాత నట్లు పేష్కష్ చెల్లింపలేని యేస్టేట్లనువిభజించిగాని యేకముగాఁ గాని పూర్వపుఅమరకపు పద్ధతికే అమర్పక రైతువారీపద్ధతి నమరకము చేయ నారంభించిరి. ౧౮౬౫-వ సంవత్సరమున "రెంటురికవరీ" ఆక్టుఅనుచట్టము జారీచేయువఱకు జమీందారులు తమతమ రైతులయొద్దనుండి శిస్తువసూలుచేయుటకుఁ దగినచట్టమే లేకపోయెను. ఇంకువిషయమై కొన్నిచట్టములు, నిబంధనలు ఉన్నను అవి అంతగాఁ బనిచేయునవిగా నుండలేదు. తరువాత ౧౯౦౮-వ సంవత్సరములో జమీందారీరయితులకును జమీందారులకునుగల భూవిషయమును గూర్చియు శిస్తువిషయమును గూర్చియు సంబంధములును పద్ధతులును విపులముగానిర్ణయించి యేర్పఱుపఁబడినవి. ఇట్టిజమీందారీ యెస్టేట్లలోఁ గొన్ని అవిభక్తములగు జమీందారీలుగా నెంచఁబడి ౧౯౦౪-వ సంవత్సరమున నొక చట్టమునిర్ణయింపఁబడినది. జమీందారీ గ్రామ సేనకుల విషయమై ౧౮౯౪ సంవత్సరములో నొకచట్టము జారీచేయఁబడినది. ఇదిజారీచేయుటకుఁ బూర్వము ౧౮౦౨-వ సంవత్సరములో జారీచేయఁబడిన ౨౯-౨౯ నెంబర్లు రెగ్యులేషనులఁబట్టియే వ్యవహారము జరుపఁబడుచు వచ్చినది. జమీందారులకు తమయెస్టేట్లలో నున్న ఖనిజములు, లోహములు, రత్నములు మొదలగు నన్నివస్తువులును త్రవ్వుకొనుటకు సర్వాధికారముగలదు. వారుత్రవ్వించిన చెఱువులు, నీటికాలువలు మొదలగు వానివలన రైతులకీయఁబడిన నీటికి నీటిపన్ను వసూలు చేసికొనుటకుఁగూడ నధికారమున్నది. సర్కారునీటి నుపయోగించుకొనినయెడల నానీటిపన్ను సర్కారునకే చెల్లును. ఇందు

విషయమై ౧౭౯౨-౯౩-వ సంవత్సరమున జారీ కాఁబడి ౧౮౧౩-వ సంవత్సరమున సవరింపఁబడిన చట్టముంబట్టి అమలుజరుపఁ బడుచుండును.

శాశ్వతముగా జమీందారీ పద్ధతి నమరకము చేయఁబడిన బంగాళారాజధానియందుఁగూడ "టెంపొరరీ" సెటిలుమెంటు చేయఁబడిన ప్రదేశములుకూడఁ గొన్ని కలవు. సర్కారు స్వాధీనములోనుండి యక్కడక్కడ చెదరియున్న కొన్ని భాగములును గారణాంతరమువలన జమీందారీ హక్కుతో శాశ్వతపు అమరకము చేయఁబడని కొన్ని భూములును మిగిలియుండుట తటస్థమగుటవలన కటకము మొదలగు నోథ్రిజిల్లాలును ఆగ్రాపరగణాలో జేరినజిల్లాలును నాంగ్లేయులస్వాధీనమైన పిదపనీభాగమంతయు నమరకము చేయవలసిన అవసరము తటస్థమై ౧౮౦౨-వ సంవత్సరమున ౨-న నెంబరున నొకరిగ్యులేషన్ జారీచేయఁబడి భూస్వాములతోడను గ్రామసంఘములతోడను నొకవిధమైన "టెంపొరరీ" అనఁగా అశాశ్వతపు అమరకము చేయఁబడినది.

బంగాళా రాజధానిలో నీవిధముగా టెంపొరరీ సెటిల్‌మెంటు చేయఁబడిన యెస్టేట్లలో నమరకము చెందిన భూస్వామి ఆ యెస్టేట్లమీఁద వచ్చువరబడిలో రు. ౧౦౦లకు రు. ౨౦ వంతువఱకు సర్కారునకిచ్చునట్లు యేర్పఱుపఁబడినది. జమీందారీ యెస్టేట్లపైని పేష్కష్ నిర్ణయించునపుడు, ఆయా యెస్టేట్లరాబడిని పూర్వపు లెక్కలను బట్టి నిర్ణయించి యేర్పఱుపఁబడినది. ఆకాలములో కంపెనీవారికి సరియైన లెక్కలు దొరకక పోవుటచేతను నాయా యెస్టేట్ల మంచి చెడ్డలు తెలిసికొనుట కవకాశము లేక పోవుటచేతను, అప్పటికి దొరికిన లెక్కలనుబట్టి అమరకము చేయఁబడినది. పోరంబోకులు, గ్రామకంఠములు, గ్రామస్థు లుమ్మడిగా ననుభవించుటకేర్పఱుపఁబడిన ప్రదేశములు, చెఱువులు, నీటికాలువలు మొదలైనవి, ధర్మాదాయములు, అగ్రహారములు, శ్రోత్రియములు, మొదలగు నీనాముభూములు యెస్టేట్ల మొత్తపు ఆదాయములోనుండి తగ్గింపఁబడి వానిపై పేష్కష్ చెల్లింపఁబడక పోవుటచే జమీందారులు తమయిష్టమువచ్చినట్లుపయోగపఱచుకొనుటకును వీలు లేకపోయినది. అట్టిప్రదేశము లుపయోగపడినప్పుడు వాని మీఁద న్యాయమైనశిస్తుకట్టి అది పేష్కష్‌లోఁ జేర్చి ఆభూములు జమీందారులకే యియ్యఁబడును. ఇట్టివిషయములను గుఱించి బోర్డుస్టాండింగు ఆర్డరులోనున్న నిబంధనలననుసరించి వ్యవహారము జరుపఁబడుచుండును. జమీందారీ యెస్టేట్లలోనున్న అనాదిబంజరుభూమియందును బంజరుభూమియందును స్వంతసేరీ భూములయందును జమీందారులకు స్వతంత్రమయిన సంపూర్ణమయిన హక్కుగలదు. జమీందారీ యెస్టేట్లయందున్న అడవులమీఁద వారికిసంపూర్ణమైన హక్కుకలిగి యుండుటవలన వానిని వారిష్టము

వచ్చినట్లువ్యవహరించుటకు నధికారముగలదు. ౧౮౦౨-వ సంవత్సరం జూలై ౧-వ తేదికి పూర్వమందున్న చెట్లహక్కు, ఆచారమువల్ల గాని రైతులచే వ్రాయఁబడిన ఒప్పుదల ప్రకారముగాని జమీందారునకు నున్న యెడల నాతనిదే, లేనియెడల నాహక్కు జిరాయితీ రైతుదే. ఆ తేది తరువాతఁబుట్టు చెట్లహక్కు రైతులదె (౧౨-వ సెక్షన్.) చెఱువులు, ఆవలు, జలాశయములు, కొండకాల్వలు మొదలగు వానియందు చేపలు పట్టుకొనువారిపై పన్ను వేయుటకుఁగూడ వారికి సంపూర్ణమైన అధికారముకలదు. మహమ్మదీయ ప్రభుత్వకాలమందు కొన్నివిధములయిన "శాయరు" పన్నులు వసూలు చేయుటకు యాత్రస్థుల యొద్దనుండియు వివాహాది శుభకార్యములు జరిగినప్పుడును కొన్ని పన్నులు వసూలుచేయుటకు తహస్సీలుపన్ను రోడ్డుపన్ను మొదలయినకొన్ని పన్నులుగూడ జమీందారులకు వసూలుచేసికొను నధికారముండెనుగానిఆంగ్లేయులప్రభుత్వ మారంభమైన తరువాత అట్టి పన్నులలోకొన్ని అన్యాయమని అసలేకొట్టివేసి తక్కినవానిని వసూలు చేసికొనుటకుఁగూడ వీరికి అధికారములేకుండఁ జేసిరి.

జమీందారీ యెస్టేట్లలోఁ బ్రవహించు నదీగర్భములయొక్క హక్కుజమీందారులదే యని నిశ్చయింపఁబడెను. జమీందారు భూమిలో నట్టియేటిదరినుండి యేఱు తగ్గినప్పుడు బయలుపడిన ప్రదేశము జమీందారునిహక్కు కలది యగుటవలన నాజమీందారు దానిని యిష్టము వచ్చిన ట్లనుభవింప వచ్చును. అప్పుడప్పుడు నీటిముంపుల కాశించుచును నదియొడ్డునఁ దేలినభూములు బంగాళారాజధానిలో 'చూర్ డై రేల్ భూములు' అని చెప్పఁబడును. అట్టిభూములును జమీందారునివే. అట్లుకాక పెద్దపెద్ద నదులకు సంబాధించిన యిసుకనేలలో దర్భగడ్డి యేటివరద వచ్చినప్పుడు నందుమన్ను వలన పెంచఁబడిన భూములు లంకలనఁబడును. ఈ లంకప్రదేశములు జమీందారులకు సంపూర్ణమైనహక్కు కలవి. గవర్నమెంటు గ్రామములోనున్న లంక భూములు సెటిలుమెంటు లంకలనియు పడుపై భూములు అనియు యిజారా లంకలనియు మూడువిధములుగా సర్కారువారువిభజించిరి. పడుపైభూములు (సర్కారు సెటిలుమెంటు లంకలు) 30 సంవత్సరములకొకసారి తక్కిన జిరాయితీ భూముల వలెనే సెటిలుమెంటుకాలమందు శిస్తు యేర్పఱుపఁబడి అమరకము చేయఁబడుచుండును. ఇజారాలంకలు కొన్ని సంవత్సరములకొకసారి వేలముపాడి యెక్కువ శిస్తు పెట్టినవారికి కొన్ని సంవత్సరము లమరకము చేయఁబడుచుండును. జమీందార్లు తమ యెస్టేట్లలోని గ్రామములను భూములనుకొన్ని సంవత్సరములకుఇజారాయిచ్చుటకుగానికొంత శిస్తుకట్టి, కట్టుబడిక్రిందను, నిమెబడిక్రిందను, నిచ్చుటకుగాని నౌఖరీనిమిత్తముగాని అనుగ్రహపూర్వకముగాఁగాని దానపూర్వకముగాఁగాని

యిచ్చుటకును అధికారముకలదు. జమీం దారీ గ్రామములోనున్న జిరాయితీభూముల యందలి ఫలసాయము రెండు భాగములుగా వ్యవహరింపఁబడు చున్నది. అందులో జమీందారునకు రావలసినభాగము మేల్వార మనియును (మేల్వారమనియును) రయితుభాగ ము కుడివరమనియుఁ జెప్పఁబడును. దీనింబట్టి జమీందారుయొక్కయు రయితుయొక్కయు హక్కు మేల్వారము హక్కనియు, కుడివారం హక్కనియుఁ వరుసగా జెప్పఁబడును. పర్మ నెంటు సెటిలుమెంటు తరువాతజమీందారులచే సౌఖరీకొఱకుఁగాని దయాపూర్వకముగాఁగాని యియ్యఁబడిన యీనాంభూములు మొదలయి నవి వారికా సౌఖరీ అవసరము లేనప్పుడును దయాపూర్వకముగా నిచ్చినవారిసంతతి యంత రించినప్పుడును, అట్టిభూములు వారుశిస్తుకట్టి అమర్చుకొనుటకు హక్కుగలదు. కొన్ని గ్రామములను గొన్ని సంవత్సరముల షరతు నకు యిజారాకిచ్చుపద్ధతి సర్కారు వారొ కప్పు డవలంబించినను నిప్పుడాపద్ధతి వదలి పెట్టిరి. కొంతకాలముక్రిందట విశాఖపట్టణము జిల్లాలో ౮౭ గ్రామములును, గోదావరిజిల్లా లో ౨౩ గ్రామములును, చెంగల్పట్టుజిల్లాలో ౧౨ గ్రామములును, నార్తార్కాడుజిల్లాలో ౧ గ్రామమును, ఇట్టియిజారాపద్ధతియందుండెను. కాని అవియన్నియు నేడు రైతు వారీ పద్ధతి అమరకములోనే యున్నవి. కొద్దికాలము వఱ కును గోదావరిజిల్లాలోని యరణ్యప్రాంతమం దలి గ్రామములు, ఇట్టి యిజారా అమరకము పద్ధతి యందుండెనుగాని ఇప్పుడు అవి సయి తము రైతువారీ అమరకపు పద్ధతిలోనికిఁ దీసి కొనిరాఁబడినవి.

గోదావరి జిల్లాలోనున్న భద్రాచలము, నూగూరు, చెర్లఆల్బాకా అనుతాలూకాలలో నింకొకవిధమగు అమరకపు పద్ధతికలదు. ఆజిల్లాలలో రైతువారీ అమరకపు పద్ధతితోఁ గూడ నొకవిధమగు ప్రొప్రైటరీ జమీందారీ అమరకపు పద్ధతికూడ నున్నది. ఆ యమర కపుపద్ధతి ననుసరించి ౩౦ సంవత్సరముల కొకసారి కొన్ని గ్రామములు యెస్టేట్లగా విభ జించి ఒక్కొక్కనికిఁ గొంత మొత్తమునకు నమరకము చేయుపద్ధతి వాడుకలోనున్నది. ఇట్టి అమరకముఁ బొందువారు "సుపీరియల్ ప్రొప్రైటర్సు" అనియు "ఇంపీరియల్ ప్రొప్రై టర్సు" అనియు రెండు తెగలువారుగా నేర్పరు పఁబడి సర్కారుతో నీవిధమయిన అమరకపు పద్ధతిలోనున్నారు. ఈతాలూకాలు మధ్య పరగణాలలోఁ జేరినవగుటచేత నక్కడ వాడుకలోనున్న పద్ధతిని బట్టి అట్టి అమరకమే యీ తాలూకాలలోఁ గావింపఁబడినది. ఇది మధ్యపరగణాలలో నున్న మల్గుజారీ పద్ధతి వంటిది.

శాశ్వతపు సెటిలు మెంటుకు పూర్వము ౫౦-సంవత్సరములనుండి పన్ను చెల్లించుట ననుభవించుచున్న హేతువుంబట్టి శాశ్వతపు సెటిలుమెంటు కాలమున శాశ్వతపుపట్టాలు

సర్కారీయ నిశ్చయించి నప్పు డందు కిష్టపడక శాశ్వతపు సన్నదులు చెందని పాళ్యముల తర గతిలోఁ జేరిన కొన్ని యెస్టేట్లుకూడఁ గలవు. అట్టిపాళ్యములను "అన్ సెటిల్డు పాళ్యము" లందురు. ఇట్టి పాళ్యములకును శాశ్వతపు హక్కుతో నమరకము చేయఁబడిన జమీం దారీ యెస్టేట్లకును గలభేద మేమనఁగా జమీం దారీ యెస్టేట్లమీఁది పేష్కష్ హెచ్చించుటకు సర్కారువారి కెన్నటికినిస్వతంత్రత లేదనియు, "అన్ సెటిల్డుపాళ్యముల" విషయమై ఆయా పాళ్యముల స్థితిగతులంబట్టి పేష్కష్ హెచ్చిం చుటకును, తగ్గించుటకును సర్కారుకుగలహ క్కును నిర్ణయింపవలసియుండుననియు, "ప్రీవి కౌన్సిలు"వారుతీర్పు చేసిరి. ప్రస్తుతముశాశ్వత ముగా నమరకము చేయఁబడిన జమీందారీ తరగతిలోఁ జేరినపాళ్యము యెస్టేట్లకును, అట్లు గాని అన్ సెటిల్డుపాళ్యము యెస్టేట్లకును, భేద మంతగాఁ గన్పింపదు. ఈ రెండువిధములైన పాళ్యములును పేష్కష్ నిశ్చయింపఁబడి ఒక్కే విధమైన వంశపారంపర్యముగల హక్కుభుక్త ములకు లోనైయున్నవి. ఇట్టి అన్ సెటిల్డుపాళ్య ము యెస్టేట్లపై ని "డిమేండు" మార్చఁబడునది కాకపోయినను భుక్తము వలన వచ్చినహక్కు తప్ప శాశ్వతపుహక్కును చెప్పు పట్టాలు మాత్రము లేవు. జమీందారీ యెస్టేట్లలో భూము లమరకము సేయునప్పుడు "వంతువా రడి" అనునొకపద్ధతి కొన్నిచోట్ల వాడుకలో నుండెను. ఒకరయితు మరియొక రయితు సేద్య ములోనున్న భూమిపై సదరుభూమి తన కిచ్చు పద్ధతిని ఆభూమిపై నంతకు మున్ను చెల్లఁబడు శిస్తుకంటె నెక్కువ కట్టుకొందునని పోటీకి వచ్చినప్పుడు ఆభూమి ఆయెక్కుడు శిస్తునకు అప్పుడు సేద్యము సేయుచున్న రైతు సేద్యము చేయుటకు నొప్పుకొనని యెడల వారిరువురి భూములను నొకరికొకరికి మార్చివేయుపద్ధతి "వంతువారడి" అనఁబడును. ఇట్లు రయితుల లో నొకరిపై నొకరుపోటీకివచ్చి భూములను మార్చుకొను పద్ధతి యుండుటవలన భూములు మోయఁగలిగినంత శిస్తు వానిపైఁ బెరుగుట కును జమీందారులకు భూములపై నెక్కుడు శిస్తు వచ్చుటకును, భూములలోని తేడాలు వారికి స్పష్టముగఁ దెలియుటకును గారణమగు టవలన నీపద్ధతి కొన్ని జమీందారీ యెస్టేట్లలో నవలంబింపఁబడ్డది. కానియిందువలననొక రైతు శ్రమపడి సొమ్ము వెచ్చించి భూమి బాగుపఱచు కొనిన యెడల దానిఫలమతనికిఁ గాకుండుటకుఁ గారణమగుచుండినది. అందువలన భూములు బాగుపఱచవలయునను నుత్సాహము రయితు లకుఁ గలుగకపోవుటకును నందువలనఁ దుదకు రయితులకును జమీందారులకును గూడ నష్టము సంభవించుటకును గారణమగు చుండెను.

మఱియు పూర్వముజిరాయితీ భూము లమర్చునప్పుడు రయితులకు గ్రామములలో నున్న అన్నిరకముల భూములును గొంచెము కొంచెముగా నమర్చఁబడుచుండుపద్ధతి వాడు

కలో నుండెను. ఇట్టివాడుక జమీందారీ యెస్టేట్లలోఁ దఱుచుగనుండెను. ఒక రయితు నకుఁ బల్లము, మెరక, గరువు, రేవడి, లంక మొదలగు గ్రామములోని నన్ని రకముల భూములు, అతని మోతుబరినిబట్టి కొంతకొంత పరిమితిగా నమర్చఁబడుచుండెను. గ్రామము లలోనున్న అన్ని రకముల భూములు సేద్యము లోనికిఁ దేఁబడవలయునను నుద్దేశముతోడను రయితులొక్కరకముపంట నేపండించి యూర కుండక అన్నిరకములపంటలను బండింపఁ గలుగుటకు వారికిఁ బ్రోత్సాహము గలిగింప వలయుననియు నీపద్ధతి వాడుకలోనికిఁ దెచ్చి నట్లు తోఁచుచున్నది. రయితు ఇన్నిరకముల భూములు తీసికొనక తప్పదు. మంచిభూము లనే తీసికొనవలయునన్నచో నే భూమియు నతనికీయకుండ చేయుటగాని ఆతఁడు తీసి కొనవలసిన భూముల మీఁది మొట్టశిస్తు అంతయు ఆతఁడు సేద్యము సేయఁ దలఁచుకొన్న భూములమీఁదనే యిచ్చుకొనవలసిన బాధ్యత గలిగి యుండుటగాని అమలులో నుండెను. పంటలకు ధరలులేని పూర్వకాలములో నిట్లు నిర్బంధములుకల్పించి రయితులు పలువిధము లగు భూములు సేద్యముచేసి అన్నిరకముల పంటలను పండింపఁగలిగినట్లు ప్రోత్సాహము కలిగించుటవలననే ప్రతిగ్రామమందును ననేక విధములగు పంటలు పండించుటకును, అన్ని రకముల భూములు సేద్యములోనికిఁ దేఁబడు టకును గారణమైనది.

ఈపద్ధతి ఆగ్రా మొదలగు పరగణాలలో వాడుకలోనున్నది. ఇది శాశ్వతమైన అమర

**గ్రామవారీ లేక మహల్వారీ పద్ధతి**

కపుపద్ధతికాదు. గ్రామ సముదాయములకు హక్కు భుక్తములుగల నీ యమరకపు పద్ధతి గ్రామములున్న దేశము లలో నవలంబింప వలసిన యవసరము కలిగి నది. గ్రామసముదాయమున కంతకు తద్గ్రామ భూములయందు హక్కుభుక్తములుకలిగియుం డుటవలన భూమిపన్ను చెల్లింపవలసినభారము, ఆగ్రామసముదాయ మందుండుట తటస్థ మైనది. మఱియు నొకగ్రామముపైఁగాని కొన్ని గ్రామములు కలసినపరగణాలపైఁగాని హక్కు భుక్తములను బడసిన భూస్వామితోఁగూడ నిట్టియమరకపు పద్ధతియే సులభముగాఁ గన్ప ట్టినది. కాఁబట్టియే అయోధ్యయందలి తాలూ కాదారీ అమరకముఁగూడ నీతరగతి క్రిందనే వచ్చునని చెప్పుట కవకాశము కలిగినది. ఈ గ్రామవారీ అమరకపుపద్ధతి "హాజమీరు" రాజ్యము,-పంజాబుదేశము, "మధ్యపరగణాల" యందు, జేయఁబడినది.

ఇంగ్లీషు ప్రభుత్వము రాక పూర్వము ఉత్తరసర్కా రులుగూడ నైజాము స్వాధీనమునందుండెను. ఆకాలము నందును, అంతకుఁబూర్వము గోలకొండనవాబుల క్రిందను, బహామనీసుల్తానుల

**నైజాము రాజ్యమందలి పూర్వపు అమరకపు పద్ధతి**

క్రిందను, ఈ త్తరసర్కారుల లోను ఇందులకుఁజుట్టుపట్టు నైజాము రాజ్యమందలి జిల్లాలలోను భూసంబంధమైన అమరకము ఈ క్రింది

విధముగజరుగుచున్నట్టు కానవచ్చుచున్నది. ఏఁబదియో నూటో గ్రామములుకలిసి యొకపరగణా యనఁబడుచుండెను. పరగణానే తాలూకాయని అనుటయుఁ గలదు. ఒక్కొక్కగ్రామమునకు నొక్కొక్క కరణమును, పెద్దకాపును, దొరతనమువారిపక్షమున వంశపరంపరాగతములైన యధికారములతో నుండిరి. అట్లే యొక పరగణాకు నొక దేశముఖుఁడును, ఒక దేశపాండ్యాయును నుండిరి. దేశముఖుఁడుసాధారణముగశూద్రుఁడు; దేశపాండ్యా సాధారణముగ బ్రాహ్మణుఁడు. దేశముఖుఁడు పరగణాలోని పెద్దకాపులకందఱకు నధికారి. దేశపాండ్యా కరణముల కందఱకు నధికారి. దేశముఖ శబ్దము దేశముఖ్యశబ్దభవము, దేశపాండ్యాశబ్దము దేశపండిత శబ్దభవము. పెత్తనమంతయు దేశముఖులది. లెక్కజవాబుదారియంతయు దేశపాండ్యాలది. అధికారమునందుఁ గొన్ని విషయములలో దేశముఖులను నిప్పటి తహస్సీలుదారుతోడను, దేశపాండ్యాలను తాలూకాశిరస్తాదారుతోడను బోల్చవచ్చును. సర్కారు దర్బారులో వీరి యిద్దఱకును సమానమైన మర్యాదలుండెను. వీరిలో వీరొకరినొకరు చూడఁబోయినప్పుడు, కూర్చున్నవారులేచి నిలువఁబడి గౌరవించుచుండిరి. దీనినే ఖడీతాజిం అందురు. వీరికి సర్కారు దర్బారులోఁ గూర్చుండుటకుఁ గుర్చీయిచ్చుచుండిరి. కరణములకేమి దేశముఖ దేశపాండ్యాలకేమి, శిస్తు వసూలు చేయుట మొదలైన సర్కారుపనులు నెఱవేర్చినందునకు, ఈనాముభూములును, గ్రామపు ఆదాయము మీఁదను, పరగణా ఆదాయముమీఁదను నూటికి నింతయని రుసుమును దొరకుచుండెను. కొందఱు దేశముఖుల మీఁద సర్ దేశముఖులును, కొందఱు దేశపాండ్యాల మీఁద సర్ దేశపాండ్యాలును నుండిరి. కొన్ని పరగణాలు కలిసి యొకసర్కారు (జిల్లా) యనఁబడుచుండెను.

ఇది యిట్లుండ, భూమి అమరకమునిమిత్తమై, సాధారణముగాఁ బ్రతిసంవత్సరమును, నొకప్పుడు మూడు, అయిదుఏండ్లకును, పరగణాలవంతుననుు, ఒకప్పుడు విడివిడి గ్రామములును, అమరకమునకై పాటపాడుచుండిరి. ఆపాటనిమిత్తమై అన్ని పరగణాల దేశముఖ దేశపాండ్యాలు సర్కారులోనికి వెళ్ళుచుండిరి. అనఁగా గోలకొండకో, హనుమకొండకో, ఖమ్మంమెట్టుకో, రాజమహేంద్రవరమునకో బందరుకో పోవుచుండిరి. సాధారణముగ నేపరగణాదేశముఖుఁ డాపరగణాకుఁబాటపాడి తనపేరటనే కౌలుతీసికొనివచ్చుచుండెను. కర్మముచాలక మఱియొకఁడుపాటకువచ్చి ఖత్తువ్రాసెనో, ఆపర్గణా యధికారులగుటచే, దేశముఖ దేశపాండ్యాలేకమై ఆక్రొత్త యిజారాదారునకు శిస్తు వసూలు కాకుండ ననేకవిధములఁ జిక్కుపెట్టుచుండిరి. కావున సాధారణముగ నొకని తాలూకాపాటకు మఱియొకఁడు వచ్చువాఁడుకాఁడు. ఇట్లు దేశముఖులు సర్కారునకు ఖత్తువ్రాసివచ్చి రైతులకు భూము లమరకపఱచుచుండిరి. తమఖత్తు మొత్తమునననుసరించి కొంచెము హెచ్చించియో కొంచెము తగ్గించియో పూర్వపురైతులకే మరల భూముల నిచ్చుచుండిరిగాని పూర్వము వారిని వెడలఁగొట్టి క్రొత్తవారికి నిచ్చుచుండెడివారుకారు. ఈప్రకారము పర్గణాయంతయుఁ బాటపాడి ఖత్తువ్రాసి వచ్చుపద్ధతిని 'సర్ బస్తాలపద్ధతి' యందురు.

ఇట్లు పర్గణాయందు దేశముఖులకు రెండు విధముల యభిమానముండెను. ఒకటి యది వారిదేశముఖాగిరి మిరాసి; రెండు యది వారి యిజారా. కావున పర్గణాను ఆబాదుచేయుటకు వారు తమ శక్తికొలఁదిని బాటుపడిరి. క్రొత్తగ గ్రామములనిర్మించి, దేశదేశముల నుండి క్రొత్తరైతును తీసికొనివచ్చి, వారికిఁదగిన సదుపాయములుకల్పించి భూమిని అమరకముచేయుచుండిరి. చెరువులు కుంటలు వేయించిరి. అధికారమున్నను లేకున్నను ఇష్టము వచ్చినవారికి మాన్యములు, మళ్ళు ఇచ్చుచుఁడిరి. ఇజారాదార్లను దేశముఖులును వీరైయైనందున వలదను వారుగాని, ఈనాముల నడ్డగించువారుగాని లేరైరి. శిస్తులప్పుడప్పు డెక్కించుచున్నను భూమినుండి రైతులను తప్పించువారు కారు. అమరకము నిమిత్తమై రైతులను లాలించుచు పాలించుచు

నుండిరి. సంవత్సరాది పండుగునాడు గ్రామముల నుండి పెద్దరైతులను బిలిపించి, క్రొత్తరైతులను బిలిపించి, వారికి విందులు చేసి, గంధములు పూయించి తాంబూలములిచ్చి, పంచాంగము చదివించి, 'ఈయేట మంచివర్షములుకురియును, పంటలు సమృద్ధిగఁబండును' అని పౌరోహితునిచేతఁ జెప్పించి, ఖత్తులు వ్రాయించుచుండిరి! ఎప్పుడు రైతు ఖత్తువ్రాయునాయని అప్పటి జమీందారులచింత. ఎప్పుడు రైతు భూమి విడుదల చేయునాయని యిప్పటి కొందఱు జమీందారుల చింత!! ఇది యంతయుఁ గాలమహిమ!!!

అరాజకపుదినములలో దేశముఖులు కొందఱుదోపిడి పనులుచేసినను తమరైతులను దోచుకొనువారు కారు. పెరదేశముఖుల రైతులను దోచుకొనుచుండిరి.

ఇట్లు జరుగుచుండగా నుత్తర సర్కారు లనఁబడు అయిదు సర్కారులలో (జిల్లాలలో) ముస్తఫానగర్ (కొండపల్లి), ఏలూరు, రాజమండ్రి, శ్రీకాకుళము సర్కారులు నైజాముతోఁ జేయఁబడిన వడంబడిక ప్రకారము (౧౨-వ నవంబరు ౧౭౬౬) ఇంగ్లీషువారి స్వాధీనమయ్యెను. ముర్తజానగర్ (గుంటూరు) ౧౭౭౮లో నింగ్లీషువారికివచ్చెను. ౧౭౬౬ మొదలు ౧౭౬౯ వఱకు ఈజిల్లాలు హుసెనల్లి యను వానికి నిజారాగా నుండెను. ౧౭౭౦ మొదలుకొన్ని సంవత్సరములవఱకు కంపెనివారు పూర్వపు దేశముఖులే భూమికి యజమానులనియెంచి యేటేట వారికి కౌల్లు ఈయఁదొడఁగిరి, ఈదేశముఖులనే, బంగాళాదేశమందలి జమీందారులన్న పేరును బట్టి యప్పటినుండియు, జమీదారులని పిలువఁదొడంగిరి. ఇది ఉత్తరసర్కారులలో నింగ్లీషువారిచేఁ గ్రొత్తగఁ బెట్టఁబడినపేరు. ఈజమీందారులకుఁ గొన్ని యేండ్ల వఱకు నెపేటికౌల్లును, పిదప మూఁడేండ్లకౌల్లును, పదేండ్లకౌల్లను నిచ్చిరి. పిదప ౧౮౦౨ లో వీరికే అప్పటి యాయమును బట్టి సులభమైనశిస్తునకు శాశ్వతమైన కౌల్లిచ్చిరి. దానివివర మిదవఱకె వ్రాయఁబడినది. ఇట్లు బ్రిటిషు ప్రభుత్వము క్రిందికివచ్చిన దేశముఖులు సులభమగుశిస్తు ఇచ్చుపద్ధతిమీఁద గొప్పగొప్ప సంస్థానములకు నధిపతులైరి. దేశముఖీహోదాకు సంబంధించిన యధికారము ౧౮౦౨ లోఁ బ్రభుత్వమువారు తీసివేసిరి. దేశపాండ్యాలకు సంబంధించిన యధికార మిదివఱకే, శాశ్వతపట్టాలు వచ్చినతరువాత కొన్నిచోట్ల జమీందారులే తీసివేసిరి. కొన్నిచోట్ల సర్కారువారే తీసివేసిరి. ఈయధికారమును తీసివేయునపుడు కొందఱు దేశపాండ్యాలకుఁ గరిణీకములిచ్చిరి, కొందఱకు దేశపాండ్యాగిరికిఁ బదులు అగ్రహారములిచ్చిరి. కొందఱు దేశపాండ్యాలకు జమీందారులు కూడ నీయఁబడినవి.

ఇంక నైజాములోనున్న యాంధ్రదేశమునందలి దేశముఖుల స్థితి యేమైనదో చూతము. కొన్ని దినములు పోయినతరువాత ఇజారాపద్ధతి మానివేసి గ్రామములను రైతులకే అమరకపతిచి అమానీపద్ధతిని బ్రారంభించిరి. అంత దేశముఖుల యధికారము తగ్గి, గ్రామముమీఁద వసూలైన పైకములోనుండి నూటికినింతయని రుసుము మాత్రము పూర్వమువలెనేవారికి ముట్టుచుండెను. శిస్తు వసూలుచేయుట మొదలయిన యధికారములుండెను. అంత నీపూర్వ పద్ధతి మానివేసి; జిల్లా బందిచేసిరి. జిల్లా బందియనఁగా బ్రిటీషుప్రభుత్వములో నున్నట్లు జిల్లాలుగను తాలూకాలుగను దేశమును విభజించి, వానికి వేఱు వేఱు అధికారులను నియమించి, ఆయధికారులకు వంశపరంపర హక్కులేమియు లేకుండ నిక్కడివారిని నక్కడికిని నక్కడివారిని నిక్కడికిని మార్చుట. ఇట్లు జిల్లా బంది అయినతరువాతఁ గూడఁ గొంతకాలమీదేశముఖులు తమయధికారమును నిలుపుకొనిరి. తుదకు సర్ సాలార్ జంగు మంత్రిత్వకాలమున దేశముఖాగిరి హోదాను తీసివేసి, అప్పటికి దేశముఖులుగ నున్నవారికి వారివారి పరగణాలమీఁద నప్పుడు చెల్లుచున్న శిస్తునుబట్టి నూటికి అయిదు రూపాయలు చొప్పున రుసుము-అనఁగా శాశ్వతమైన పెన్షను - నేర్పఱిచిరి. వారిభుక్తములో నదివఱకున్న సావరము భూములు శిస్తులేకుండ నిచ్చిరి. కొందఱకు గ్రామము పటేల్గిరీలు (మునసబుపనులు)ఇచ్చిరి. ఇట్లు నైజామురాజ్యమందలి

దేశముఖులంతరించిరి. వారిసంతతి వారిప్పటికిని అధికారవిరహితమైన దేశముఖపదవిని ధరించుచువంద రెండు వందల రుసుమును తెచ్చుకొనుచు జీవనముగడుపుకొనుచున్నారు. ఇప్పటికిని వీరిని మీరెవరని నడిగినయెడల మేము దేశముఖులము, మాకు నలుబది గ్రామములుగలవు, ఏబది గ్రామములు కలవు, అని చెప్పుదురు. నలుబది గ్రామము లున్న వియనఁగా, పూర్వము నలుబది గ్రామములకు వారిపూర్వులు దేశముఖులన్న యధికారులుగ నుండిరి. రుసు మేర్పరచినపుడు, ఈ గ్రామములమీఁదిఅప్పటి యాదాయమునుపట్టి యేర్పరచిరని యర్థము. ఇప్పుడా గ్రామాదులలో వీరికే విధమైన యధికారమును లేదు, జనుల యజ్ఞానమును బట్టి యింకను కొందఱు దేశముఖ వంశము వారు ఆ గ్రామాదులలో తామే దొరలమని అధికారము చలాయించుకొనుచున్నారు. కాని యది వేఱుసంగతి. ఇట్లు పూర్వమొక్క విధమైన యధికారమునే గలిగియున్న దేశముఖులలో బ్రిటీషు ప్రభుత్వము క్రిందికి వచ్చినవారు జమీందారులై తమ తాలూకాలకు శాశ్వతప్రభువులై యనుభవించుచున్నారు. నైజాములోనేయున్న వారు మొదటి ఇజారులను బోఁగొట్టుకొని అధికారమునుగూడ గోలుపోయి, చిన్న మొత్తములను ఉపకారవేతనముగఁ బొందుచు నితరరైతులతోఁ ఖాటువ్యవసాయదారులైరి! ప్రభుత్వభేదమువలన దేశముఖుల స్థితి గతులలో నెంత భేద మేర్పడినది ! మునగాల జమీందారుల పూర్వులు మునగాల పర్గణాకును చింతకాణి పర్గణాకును దేశముఖులుగ నుండిరి. ౧౭౬౬ విభజనలో మునగాల బ్రిటీషులోఁ బడ్డది. చింతకాణి నైజాములోఁ బడ్డది. అంతకుఁ బూర్వము వీరు రెండు పరగణాలకును సమానమైన హక్కును గలవారే యైనను, రెండు తాలూకాలు వైశాల్యమునందును, ఆదాయమునందును సమానములైనను, ఆకుటుంబములో నొక శాఖవారికి మునగాల శాశ్వత జమీందారిగఁ దక్కినది. రెండవ శాఖవారికి చింతకాణికి నైజాము వారివలనసంవత్సరమునకుఅయిదు వందల రుసుముమాత్రము ముట్టుచున్నది.

బేహారు సరిహద్దు మొదలుకొని యమునానదివఱకు నున్న ప్రదేశమందలి గ్రామములు సాధారణముగా "ల్యాండులార్డ్సు" గ్రామములు. కావున నవి "పట్టాదరీ" "భాయిచారీ" తరగతులక్రిందనుండుట తటస్థమైనది. బంగాళా రాజధాని యందు వలెనే ఈదేశమునందుఁగూడ గ్రామాధికారులగు భూస్వాములలో ౧౦-సంవత్సరములవఱకుతునకు నొక విధమగు అమరకము చేయఁబడినది. గ్రామాధికారిత్వము, ఒకనికి గాని అనేక భాగస్వాములకు గాని, గ్రామసముదాయమునకుగాని యుండవచ్చును: సంపూర్ణ, అసంపూర్ణ, పట్టాదరీ, భాయిచారీ భేదములతోనున్న ల్యాండులార్డ్సు గ్రామలక్షణములను బట్టి యిట్టి యధికార మేర్పడును గాన ల్యాండులార్డ్సు గ్రామలక్షణములను సవిస్తరముగా గ్రహింపవలసియుండును. ఈ గ్రామముల నమరకము చేయుటలో పదిసంవత్సరముల యమరకమయిన పిమ్మట నా యమరకముల యనుభవముంబట్టి శాశ్వతముగాఁ జేయవలయునని మొట్టమొదట నుద్దేశించిరిగాని అట్లు చేయుటవలన గ్రామములయందలి న్యాయమైన హక్కుదారుల హక్కులకు భంగము కలుగుట తటస్థించుననియు గ్రామసంఘములోఁ జేరిన రయితుల హక్కు భుక్తములను నిర్ణయించుట యత్యావశ్యకమనియుఁ దలఁచి శాశ్వతపు అమరకపు పద్ధతిని వదలిపెట్టి ౧౮౨౨-వ సంవత్సరమున

బేహారు మొదలయిన ప్రదేశములు

జారీ చేయఁబడిన ౭-వ నెంబరు "రిగ్యులేషను" ను బట్టి టెంపొరరీ గ్రామవారీ అమరకముచే సిరి. ఈవిధముగా నీరిగ్యులేషనునుబట్టియే ఓఢ్ర దేశమందుఁ గూడ నమరకము చేయఁబడినది. అందు నొక్కొక్క గ్రామమును దీసికొని ప్రతి వ్యవసాయదారుని యొక్కయు రైతుయొక్కయు భూస్వామియొక్కయు హక్కుభుక్తములను సవిస్తరముగాఁ బరిశీలించి ౧౮౩౩-వసంవత్సరమున ౬౦-సంవత్సరముల షరతునకు గ్రామ వారీ అమరకము చేయఁబడినది. తరువాత ౧౮౯౦-సం॥రం మొదలుకొని ౧౯౦౦-సం॥ రములోపున ఈఅమరకము మఱలఁ బరీక్షింపఁ బడి గ్రామావారీ అమరకము చేయఁబడినది. ఈగ్రామవారీ అమరకపుపద్ధతిలో సాధ్యమగు నంతమట్టుకు పూర్వపురాజ భాగమైన పంట లోని యాఱవవంతు పన్నుగాఁ బుచ్చుకొను టయే ప్రథానోద్దేశము. ఈగ్రామవారీ సెటిలు మెంటు ఆగ్రా,అయోధ్య మధ్యపరగణాలలోఁ జేయఁబడినను ఆయాదేశములలోఁ గొంచెము కొంచెము భేదములుకలిగి యున్నది. ఈయమ రకపుపద్ధతి ౧౮౩౩-వ సంవత్సరములోఁగొన్ని మార్పులు చెందినది. గ్రామములయొక్క సరి యైన రాబడి మొత్తమును నిర్ణయించుట ముఖ్యమయినందున నందువిషయమై అనేకము లయిన యేర్పాటులు చేసి నిశ్చయింప వలసి వచ్చినది. ఆమొత్తము నిశ్చయించిన పిదప గ్రామమునందు హక్కుభుక్తములు గలవారి హక్కుభుక్తముల సంగతి సరిగా నిర్ణయించిన పిమ్మట నాయాగ్రామములపైఁ జెల్లవలసినశిస్తు నిర్ణయింప వలసివచ్చినది. ఇట్టి యేర్పాటు లన్నియు సాధ్యమగునంతవఱకు జాగరూక తతోఁ జేసి గ్రామవారీ సెటిలుమెంటు చేయఁ బడినది. అయోధ్యయందు తాలూకాదారీ సెటిలుమెంటు చేయునప్పుడు గ్రామవారీ శిస్తు మొత్తము నీవిధముగానే నిశ్చయించి తాలూ కాదారు భుక్తములోనున్న గ్రామములన్నింటి శిస్తుమొత్తము తాలూకాదారువలన సర్కారు వారుపుచ్చుకొనుచుండిరి. మధ్యపరగణాలలో నీగ్రామవారీ అమరకమే మఱికొన్ని యేర్పా టులతోఁ జేయఁబడినది. పంజాబుదేశమందుఁ గూడ నీగ్రామవారీ యమరకమే యింక గొన్ని యేర్పాటుతోఁ జేయఁబడినది. ఈపైనఁ జెప్పిన దేశములయందంతట సాధారణ ముగా గ్రామవారీ అమరకపు పద్ధతినే అమ రకము చేయఁబడినను శిస్తు నిర్ణయించుట మాత్రము వేఱువేఱు విధమగు రీతి ననుస రించి చేయఁబడినది.

ఎడారులయందును పెద్దపెద్ద నదులవలన నప్పుడపుడు భంగముఁ జెందుచువచ్చు ప్రదేశ ములయందును, కొన్ని సంవత్సరముల షరతు నకు శిస్తు నిర్ణయించి అమరకముచేయు పద్ధ తికి వీలులేదు. కాఁబట్టి అట్టి భూములయందు ప్రతివత్సరము సాగుచేయఁబడిన ప్రదేశమును నందలి పంటను నిశ్చయించి దానింబట్టి శిస్తు నిర్ణయించు నేర్పాటు జరుగుచున్నది. ప్రస్తుత మిట్టియమరకపు పద్ధతి పంజాబు బర్మాదేశము

లలోనున్నది. పంజాబుదేశమున సాగుబడిలో నున్న ప్రదేశములో ౮-వ వంతు ఇట్టి యమరకములోనే యున్నది. ఉత్తరబర్మాదేశములో ననావృష్టిదోషము తఱుచుగావున నచ్చటఁ గూడ నీయమరకపు పద్ధతియే అవలంబింపఁబడినది. పంజాబులో "కెనాల్ కాలనీస్" యంమను బొంబాయి రాజధానిలో సింధునదీ ప్రాంతములయందును నీయమరకపు పద్ధతియే అవలంబింపఁబడినది. బీరారు రాష్ట్రమందు బొంబాయి రాష్ట్రమునందలి రైతువారీ పద్ధతినే అతిస్వల్ప భేదములతో నమరకముఁ జేయఁబడినది.

గ్రామవారీ సెటిలుమెంటు పద్ధతిలోనొక్క భూస్వామి భుక్తాధికారములో ననేకగ్రామములుండి వానికన్నింటికి నతఁడే యజమానుఁడుగా నున్నపట్ల నాగ్రామములన్నింటి మీఁద మొత్తముగా నొకశిస్తు నిర్ణయించి అట్లు శిస్తు నిర్ణయింపఁబడిన గ్రామములుగల యేస్టేట్ల లోని గ్రామములను మరల లోపాయికారీ సెటిలుమెంటు చేసి గ్రామవారీ శిస్తునిశ్చయించుటయుఁ గలదు. ఒక్కగ్రామముగాని, అనేక గ్రామములలోనున్న వేఱువేఱు భూములుగాని కలసి కొందఱుభూస్వాముల యనుభవములో నుండుట తటస్థపడి యాజమాన్యమును బట్టియు సెటిలుమెంటు చేయఁబడినప్పుడు అట్టి గ్రామమునకుఁగాని అట్టిభూముల సముదాయమునకుఁగాని యేర్పరుపఁబడిన శిస్తుమొత్తమంతయు వానియందను భూత భుక్తము గల వారందఱును నీయవలసియుండును. ఆశిస్తున కందఱు కలసికాని ప్రత్యేకముగఁగాని చెల్లించుటకు బాధ్యత గలిగియున్నారు. ఎవరిభాగము వారు వేఱుగా విడదీసికొను వఱకు నీబాధ్యత తప్పదు. అయినను గ్రామముల స్వభావముంబట్టి భాగస్వాముల యొక్క హక్కు-బాధ్యతలను ప్రత్యేకముగా నిర్ణయించి లెక్కలలో వ్రాయఁబడుచున్నది. గ్రామమందలి భూములను అట్టిభూములు సేద్యము సేయువారిని, శిస్తుచెల్లింపవలసిన బాధ్యతకలవారిని, గ్రామములు సర్వేచేసి సెటిలుమెంటు చేయు కాలమున విశదముగా లెక్కలలో వ్రాసి యుండుటవలన గ్రామవారీశిస్తు నిర్ణయించుటకును శిస్తుచెల్లించుటకు బాధ్యత కలవారి నేర్పఱచుటకును, గ్రామాధికారుల యొక్కయేగాక రయితులయొక్కయు లోపాయికారీ భూస్వాముల యొక్కయు సేద్యగాండ్రయొక్కయు తదితరులయొక్కయు నా గ్రామ భూములయందలి హక్కులను ఫలసాయములోని భాగములను నిశ్చయింపఁబడుచున్నవి.

అస్సాముదేశములో సాధారణముగా భూమియంతయు రైతువారీ పద్ధతినే అమరకము చేయఁబడినది. ఈదేశమునఁగొన్ని యెస్టేట్లు "నిస్ఫకిరాజ్" అనుపేర శిస్తు లేకుండ ననుభవింపఁబడుచున్నవిగా నున్నవి. బ్రాహ్మణులవల్లను ధర్మకార్యముల నిమిత్తము నను

అసామ్ దేశము

భవింపఁబడుచున్నవి. అట్టియెస్టేట్ల నాంగ్లేయులు కొన్నియుచితముగా ననుభవించుటకు వదలి తక్కినవానికి శిస్తుకట్టిరి. ౧౦ సంవత్సరములు భుక్తములోనున్న భూమికి కవులిచ్చి ఆభుక్తదారుని భూస్వామిగానంగీకరించుచుండిరి. బంజరు భూములలో తేయాకు పంట కుపయోగింపఁబడునవి తప్పఁదక్కిన భూములు అస్సాము అమరకము విషయమయి యేర్పఱుపఁబడిన నిబంధనల ననుసరించియే అమరకము చేయఁబడినవి. బంజరు భూములు ఎకరము ౧-కి కొంతశిస్తుకట్టి 30 సంవత్సరముల కొకసారి వేలము వేయఁబడుచుండును. ఇట్లు హక్కుగలిగి భూస్వాముల యనుభవము క్రిందనున్న భూములు కవులున కమర్పఁబడిన భూములునుగాక ప్రతిసంవత్సరముగాని ౧౦ సంవత్సరముల తక్కువకాలముగాని పట్టాల మీఁద నమరకముచేయు భూములుకూడకలవు. అస్సాముదేశములో 'బారా' లేక "బస్తీ" కట్టుకొనుటకు, తోటలు పెంచుటకుఁదగిన అనఁగా ఇల్లునేల, "రూపిత్" అనఁగా వరిపండు భూమి, ఈరెండు విధములైన భూములుగాక "ఫరింగాత" అని మరియొకవిధమగుభూమిగను భూమి మూఁడువిధములుగా విభజింపఁబడియుండెను. ౧౮౯౩-వ సంవత్సరము వఱకు నమరకము మూఁడు తరగతులను బట్టియేచేయఁబడుచువచ్చెను. తరువాత భూమినంతను ఫలవత్తునుబట్టి ౮ తరగతులుగా నేర్పఱచి ఆతరగతులనుబట్టిపన్నుగట్టి ౧౦ సంవత్సరముల అమరకము చేయఁబడెను. ఈ ౧౦ సంవత్సరములు సెటిలుమెంటు ఆఖరు అయిన పిమ్మట ౧౮౦౩-వ సంవత్సరమున భూములు ప్రత్యేకముగా సర్వేచేయించి రయితువారీ పద్ధతిని అమరకము ౧౦ సంవత్సరములకేచేసిరి. అయినను యీరైతువారీ అమరకపు పద్ధతి బొంబాయి, చెన్న రాజధానులయందలి రైతువారీ యమరకపు పద్ధతివలె తగిన కట్టుపాట్లతో చేయఁబడుచుంటలేదు. ఇదిగాక "మౌంజాదారీ" అమరకపు పద్ధతి యింకొకటికలదు. ఈ అమరకపు పద్ధతినిపట్టి "మౌంజదారు" అను యిజారాదారు మౌంజ సరిహద్దులో నున్న భూములమీఁది శిస్తు అంతయుఁ దనకు వసూలు అయినను లేకపోయినను యిచ్చికొనుపద్ధతి మీఁద చేయు అమరకపుపద్ధతి, ఈమౌంజా దారు చేతిక్రింద 'మండల్' అను భూమికొలచి లెక్కలు వ్రాయువాఁ డొకఁడుండును. వసూలు కాఁబడిన మొత్తముమీఁద కొంత కమిషను మౌంజుదారున కొసంగఁబడుచుండును. ఈ పద్ధతియింకను వాడుకలోనున్నను ఇప్పుడిప్పుడు కొన్ని మౌంజాలనుకలసి ఒక తహశ్శీలుగాఁజేసి తహశ్శీల్దారునకు కమీషనుకు మాఱుగా జీతము నిచ్చుపద్ధతి నేర్పఱచిరి. అస్సాదేశములోనున్నది కొండప్రదేశములలో సరియయిన అమరకపుపద్ధతి యింకను లేదు. అస్సాముకొండలలోని మధ్యప్రదేశములుమాత్రము ౧౮౯౩-౮౦ సంవత్సరములలో జరీ

చేయఁబడిన రిగ్యులేషనుల ననుసరించి అమరకము చేయఁబడుచున్నవి.

ప్రస్తుతము అస్సాము రాజ్యములో చేరిన "గోల్పారా" "కచార్" "సిల్‌హిట్" జిల్లాలు పూర్వము బంగాళా రాజధానిలోని వగుటవలన ఈషద్భేదముతో శాశ్వతపు జమీందారీ అమరకపు పద్ధతిలోనే చేరియున్నవి.

౧౮౨౬-వ సంవత్సరములో బర్మారాజ్యము నింగ్లీషువారాక్రమించుకొనుటకుఁ బూర్వము దక్షిణబర్మాదేశము బ్రిటిషుబర్మాయని పిలువఁబడుచుండెను. ఇపుడు బర్మాదేశము లోయరు బర్మాలనియు, అప్పరు బర్మాయనియు, రెండు విధములుగా వ్యవహరింపఁబడుచున్నది.

బర్మాదేశము

పూర్వము లోయరు బర్మాలోఁజేరిన పట్టణములు వేఱు వేఱు ఖండములుగా విభజింపఁబడి ఆయా ఖండములశిస్తు "థుగీ"యను నుద్యోగస్థుని ద్వారా వసూలుచేయఁబడుచుండెను. ఈథుగీ భూమిపన్ను వసూలుచేయుటయేగాక క్రొత్తగా సేద్యము చేయఁబడినభూమిని కొలిచి ప్రతి సంవత్సరము శిస్తుమొత్తమును దెలియఁజేయు లెక్క తయారుచేయవలెను. ఇప్పుడు ఆథుగీలనుతొలఁగించి క్రమక్రమముగా గ్రామమున కొక్కొక్క పెద్దను నేర్పఱచుచున్నారు. పూర్వము బర్మా రాజ్యములో భూమిహక్కు, ముందు భూమిని వ్యవసాయమునకుఁ దీసికొని వచ్చినవాని దయియే యుండెను. ప్రప్రథమమున భూమి విస్తారముగానుండి జనసంఖ్య తక్కువగా నుండుటవలన ఒకటి రెండు సంవత్సరము లొకప్రదేశమును వ్యవసాయము చేసి తరువాత రెండుమూఁడు సంవత్సరము లింకొకచోట వ్యవసాయము చేయుచు నిట్లిష్టమువచ్చినచోట వ్యవసాయము చేయుచు వచ్చిరి. ఇట్లు వ్యవసాయము చేయఁబడిన ప్రదేశమును ప్రతి సంవత్సరమును కొలిచి ప్రథానరివిన్యూ అధికారి శిస్తు నిర్ణయించి ఆ ప్రకారమే కొన్ని సంవత్సరములు వసూలు చేయుచు వచ్చుచుండెను. బర్మాదేశములోని భూమి మిక్కిలి ఫలవత్తరమైనది. ఈభూమిలో వరిపంట విస్తారముగా పండుభూమి గలదు. తక్కినభూమిలోఁ గొబ్బరిచెట్లు మొదలయిన ఫలవృక్షారామములు వేయుచుందురు. తోటలలోఁ జెట్టుకింతయని పన్ను వేసి అమరకపు శిస్తు వసూలుచేయఁబడును.

ఇప్పుడిప్పుడు లోయరుబర్మాలో సరియయిన సెటిలుమెంటు చేయఁబడినది. ఆసెటిలుమెంటు రయితువారీ అమరకపు పద్ధతిని బోలియున్నది. ప్రతిభూస్వామియు తనభుక్తములోనున్న భూమియొక్క వైశాల్యముంబట్టి యేసంవత్సరమున కాసంవత్సరము విధింపఁబడుశిస్తును సెటిలుమెంటు రేట్లప్రకారము, ఇయ్యవలసియున్నది. అట్టిభూస్వామి, అక్కఱ లేనప్పుడు తన సేద్యములోని భూమిని, అంతయుఁగాని కొంతయుఁగాని, వదలిపెట్టవచ్చును.

మొదటపండినపంటలో ౧/౭-వ వంతు పన్నుగా వసూలుచేయఁబడుచుండెను. తరువాత వ్యవసాయపు ఖర్చులుపోఁగా మిగిలినదానిలో సగము వసూలుచేయుట కారంభించిరి. యోమా కొండల ప్రదేశములో 'టామ్‌యా'అను పోడు వ్యవసాయము చేయఁబడుచున్నది. ఈవ్యవసాయము, అడవి ప్రాంతములయందలి వారు చేయునదిగావున వారికుటుంబములలో "దా" అను కత్తిని ధరించి దాని నుపయోగింపఁగల మనుష్యులకందఱకుఁ గొంచెము రొక్కము పన్నుగా విధించి సంవత్సరమున కొకసారి వసూలుచేయఁబడుచున్నది.

థీబారాజు, రాజుగా నుండిన కాలమున, అప్పరుబర్మాలో భూములు రెండువిధములుగా విభజింపఁబడి యుండెను.

(౧) రాజుల స్వంతభూములనియు,

(౨) రాజుస్వంతముకాని భూములనియు,

ఇందు రాజు స్వంతభూములలోఁ గొన్ని రాజుగారి యుపయోగార్థము బానిసగాండ్రచే సేద్యము సేయఁబడుచుండు భూములు, లంకలును, మిక్కిలి ఫలవత్తరమైన భూములును, అశ్వసైనికులకును, రాజుగారి యుద్యోగస్థులకీయఁబడినభూములును, రాజుస్వంతభూములు. తక్కిన వ్యవసాయమగునట్టియు కానట్టియు భూములన్నియు నితరములైనవి. ఈభూముల మీఁద పన్నింత నిశ్చయింపఁబడలేదు. వ్యవసాయము చేయుచున్న భూములయొక్క హక్కు-భుక్తము లాచారమునుబట్టినిర్ణయింపఁబడుచుండెను. ప్రజలందుఱు భాగ్యవంతులును బీదలునుగూడ నొక్కేవిధమైన ఒక్కేరేటు గల "థాథమేడు" అను ఇంటిపన్ను నిచ్చుచుండిరి.

ఈథాథమేడాపన్నే భూమిపన్నుగా నింగ్లీషుదొరతనము వారుమార్చి భూమినమరకము చేయుపద్ధతి అమలులోనికిఁ దీసికొనివచ్చిరి. ౧౮౦౧ సంవత్సరమున జారీచేయఁబడిన రిగ్యులేషనునుబట్టి భూములు, అమరక పఱచి శిస్తులు వసూలుచేయఁబడుచున్నవి. బర్మాదేశమందలి భూముల అమరకపుస్థితి రైతువారీ పద్ధతి ననుసరించి యున్నను నింకను సరియైన స్థితిలోనికి వచ్చియుండలేదు.

ప్రస్తుతము బర్మాదేశములో వ్యవసాయము చేయు రయితులు తక్కువగానున్న హేతువు వలన బంజరుగానున్న భూమి విస్తారముగలదు. ఈభూమి మిక్కిలి ఫలవంతమైన దయినను సేద్యముచేయుటకు రయితుమోపులేక బంజరుగానున్నది. ఇప్పుడు దొరతనమువారు దరఖాస్తుదార్లకు దరఖాస్తునిబంధనల ననుసరించి భూములనిచ్చుచున్నారు. భూములు గావలసిన వారు మంచిఫలవంతమైన భూమిని బర్మాదేశములో జిరాయితీహక్కులతో దరఖాస్తుల మీఁద బొందుటకిప్పుడు మంచి యవకాశము గలదు. రహితులనుజేర్చి బర్మాదేశమందలి భూమిని మంచివ్యవసాయములోనికిఁ దీసికొని రానెంచి దొరతనమువారీ యేర్పాటులను జేసిరి. రయితులు విస్తారముగా నక్కడ(ప్రవే

శించినకొలఁది నిప్పటి సదుపాయములను దొరతనమువారు కొంతకాలమునకుఁ దీసివేయ వచ్చును.

భూమిపన్ను చెల్లింపఁబడని భూములన్నియు "లాఖిరాయ్" భూములని చెప్పఁబడును.

లాఖిరాయ్ భూములు

ఇట్టిభూములు శిస్తులేకుండ నితరులకీయఁబడినవి. ఇందు భూస్వాములకు భూమియందు హక్కుకలుగు నట్లీయఁబడినవి "మిల్కు" అని చెప్పఁబడును.

ఇట్టిభూములు భక్తులకును పండితులకును ప్రసిద్ధులగు దైవజ్ఞులకును పాఠశాలలు, మసీదులు, దేవాలయములు, దివ్యక్షేత్రములు, గోరీలు మొదలగువానికి నీయఁబడినవి. భూమి మీఁద చెల్లింపఁబడుచున్న శిస్తుకొట్టివేయఁ బడినట్టిగాని శిస్తులేకుండగనే యియ్యఁబడి నట్టిగానిభూములు "ముఆఫీ" లేక యీనాములు అనఁబడును. ఇట్లు యీయఁబడిన భూములు గాక సర్కారునకు యుద్ధవిషయమునఁ గాని యితర వ్యవహారవిషయమునఁగాని మేలుచేసిన వారికి పెద్దపెద్ద ప్రదేశములు శిస్తు లేకుండ జాగీర్లు అను పేరుగల వీయఁబడినవి. మొగలాయి చక్రవర్తులరాజ్యమున సర్కారుఉద్యోగముచేసిన యుద్యోగస్థులకందఱకు మనసబ్ హిదాలత్తోపాటు శిస్తులేకుండ కొన్ని కొన్నిప్రదేశములు వారివారి ప్రపత్తులంబట్టి యియ్యఁబడెను. వీనినన్నిటికి జాగీర్లులని పేరు.

నాఱిరుదుగానున్న బంజరుభూములు దేశమందంతటనుగలవు. బంగాళా రాజధానిలో నిట్టిబంజరు భూములు శాశ్వతముగా నమరకముచేయఁబడిన యెస్టేట్లకు సంబంధించినవి. ౧౮౧౯-వ సంవత్సరమువఱకునాయాయెస్టేట్ల జమీందార్లిష్టము వచ్చినట్లు ఆక్రమించుటకు వీలుకలుగుచుండెను. తరువాత ౧౮౭౮-వ సంవత్సరమున జారీచేయఁబడిన రిగ్యులేషను బట్టి అట్టి బంజరుభూముల నాక్రమించుకొనక కొన్నింటిని పబ్లీకు అడవుల క్రిందను దక్కినవానిని వ్యవసాయ దారులకు కవులు క్రిందను ఇచ్చుచు వచ్చిరి. సంయుక్త పరగణాలు అయోధ్యయందున్న అడవులు ఏగ్రామముతో సంబంధించినవి, ఆగ్రామముతో కలిపి అమర్చుచు వచ్చిరి.

పర్వతప్రాంతమందలి జిల్లాలలోని పెద్ద బంజరుభూములును పెద్దపెద్దఅడవులును దొరతనమువారి వశమునందేయుంచుకొనిరి. అయోధ్యలో తాలూకాదారీ యెస్టేట్లకు సంబంధించిన బంజరుభూమి ౫౦౦ యకరములవఱకు, ఆయాయెస్టేట్లకిచ్చి తక్కినవానిని దొరతనమువారే వశముచేసికొని శిస్తు నిర్ణయించిరి. మధ్యపరగణాలయందును పంజాబు దేశమందును ప్రతిగ్రామమునకును సేద్యము కాఁబడిన భూమికి ౧౦౦-కి ౨౦౦ లుగా బంజరుభూమి గ్రామస్థుల యుపయోగమునిమిత్తము వదలిపెట్టి తక్కినభూములకు శిస్తుకట్టిరి. రయితువారీ అమరకములోనున్న బొంబాయి మధ

రాష్ట్రరాజధానులయందున్న బంజరుభూమిలో ప్రతిగ్రామమునకును బశువుల మేతకు కావలసినంతభూమి విడచిపెట్టి తక్కినదంతయు స్వంతహక్కుగల భూమిగా నెంచఁబడి సర్వే నెంబర్లగా విభజింపఁబడి ఆయాభూముల స్థితిని బట్టి శిస్తు ఏర్పఱచి అమలులోనికి తీసికొని రాఁబడెను. బంజరుభూములు సాధారణముగా నీక్రింద వివరింపఁబడిన పద్ధతులనుబట్టి అమరకము చేయఁబడుచున్నవి:-

(౧) పెద్దపెద్దచెట్లచే నిండియుండి అడవిగా నుపయోగింపఁబడుటకు వీలైనవి అమరకము చేయఁబడవు. కాని చిట్టడవితో నిండియుండి సేద్యమునకు గాని తేయాకుతోటలు మొదలగునవి నాటుటకుఁగాని వీలుపడు బంజరు భూములు అమరకము చేయఁబడును. బంజరుభూములు ముందు తనిఖీచేసి అవి అడవిగా నుపయోగించుటకు పనికిరావని తోచినపుడు బంజరుభూమి అమరకమును గురించి వ్రాయఁబడిన నిబంధనల ననుసరించి అమరకము చేయఁబడును.

బంజరు భూముల అమరకము

(౨) ఇట్లమరకముచేయఁబడుభూమి కొన్ని సంవత్సరములకు వ్యవసాయమునకు లాయకుగా చేసికొనుటకు అవసరమైన కాలపరిమితి ననుసరించి సదుపాయమైనశిస్తునకు కవులీయఁబడుచుండెను.

(3) ఇట్టి భూములను సర్వేచేసి రోడ్డులు రస్తాలు నదులు పంటకాల్వలు చేపలుపట్టు ప్రదేశములు గనులు రాలు మొదలగు వాని యందు హక్కుగలుగకుండ నీబడుచుండును.

(౪) ఇట్టి కవులుదారుఁడు తనకవులులో నున్నభూమిని న్యాయముగా నుపయోగించి సరియైనస్థితిలోనికిఁ దీసికొని వచ్చినయెడల కొన్నిపద్ధతులమీఁద నాభూమియందు శాశ్వతపు హక్కుపొందవచ్చును.

(౫) ఇట్టిభూమికి నితరప్రొప్రైటరీ యెస్టేట్లకు వలెనే సెటిలుమెంటుచేసి శిస్తు నిర్ణయింపఁబడును. ఇట్టి భూముల విషయమై ఒక్కొక్క రాజధానియందొక్కొక్క విధమగు నిబంధన లేర్పడియున్నవి. విశేషధనము వెచ్చించి పెద్దపెద్ద వైశాల్యముగల భూములయందు తేయాకు, కాఫీ, చింకోనా మొదలగు తోటలు వేయుభూములకు అమరకము వేరుగా నుండుటయు, ౧౦ యెకరములు మొదలుకొని ౨౦౦ ఎకరములవరకు సాధారణముగా వ్యవసాయముచేయుటకు కవులు పొందబడు భూములయొక్క అమరకపు పద్ధతులును వేరువేరుగానుండుటయుఁనవసరమును న్యాయమును గావున వానివిషయమై సందర్భానుసారముగా నమరకపు పద్ధతు లేర్పఱుపఁబడుచుండును. ఒకప్పుడుబంజరు భూములు దరఖాస్తుమీఁదనే యీయఁబడును. కాని విస్తారప్రదేశ మమరకముచేయునప్పుడు అట్టి ప్రదేశము సర్వేచేయుటకు కావలసిన ఖర్చులిచ్చుపద్ధతిని కొంత సొమ్ము హామీపుచ్చుకొని ఆభూమికి తగినశిస్తు కట్టి అమరకము చేయఁబడును. ఈవిధముగా హిందూదేశమందలి రాజధానులయందు

అనేకవిధములగు అమరకపుపద్ధతులమలులో నున్నవి. ఈ అమరకపుపద్ధతులన్నియు, కొంచెముగనో గొప్పగనో సర్కారునకు పన్ను చెల్లించునవి. ఇఁక సర్కారుకుపూర్ణమైనశిస్తుచెల్లింపబడకుండ భూస్వాముల యనుభవభుక్తములో నున్న భూములనుగూర్చి వివరింపవలసియున్నది.

ఇట్లు సేద్యము సేయఁబడు భూమియేగాక యితర ఆస్తులుకూడ నమరకము చేయుపద్ధతి కలదు. ఇండ్లు, ఫ్యాక్టరీలు, ఇతరకట్టడములు మొదలగునవి కట్టుటకు స్థలము కొన్ని సంవత్సరముల వరకు కమరకముచేయుటకలదు.

ఇతరస్థిస్తుల యమరకము

తోటలు, దొడ్లు మొదలగునవి తదధికారియు రహితును నేర్పఅచుకొను షరతులమీఁద నమరకము చేయఁబడుచుండును. తోటలు కాపును బట్టిగాని అంతకుఁ బూర్వమేగాని వీలునుబట్టి కొంతమొత్తము శిస్తున కమరకము చేయఁబడుచుండును. కల్లుగీచుకొను నిమిత్తము తాటిచెట్లమీద గీతపన్నొకటివిధించి చెట్టునకు కొంత సొమ్ము చొప్పున వసూలుచేయు పద్ధతికూడ కలదు. ఇట్టిచెట్లు ఆబుకారీయుద్యోగస్తులు నెంబర్లువేసి చెట్లను కల్లునిమిత్తము గీచుకొను వారివద్ద నట్టిపన్నును వసూలుచేయుచుందురు. ఈపన్ను కొన్ని సంవత్సరముల క్రింద లేదు. ఇప్పుడు యేజన్సీ ప్రదేశములయందుకూడ నీపన్ను వసూలు చేయఁబడుచున్నది.

సముద్రప్రాంతముల యందలి చవిటినేలలు ఉప్పుపండించుకొనుటకును సు శే కా ర ము చేయుటకును అమరకము చేయబడుచుండును. ఈ అమరకముగూడ ఫలసాయముంబట్టి రయితులు కొంతమొత్తము శిస్తున కమర్చుచుందురు. ఉప్పుపంట సర్కారు తప్ప ఇతరులు పండింపగూడనిది కావున నట్టి భూములమర్చుకొను నధికారము భూస్వామికి కలిగియుండినను అందుపండిన పంటమాత్రము అందు విషయమై యేర్పడిన నిబంధనల ననుసరించి సర్కారువారికే అమ్మవలయునను యేర్పాటు గలదు. చెఱువులు జలాశయములు మొదలగు వానిలో సర్కారు గ్రామములలో నున్నవానిని సర్కారును నితరభూస్వాముల గ్రామములోనున్న వానిని నితరభూస్వాములునుచేపలు పట్టుకొను నిమిత్తమును నందలితామరాకులు మొదలగునవి యుపయోగించుకొనుటకును శిస్తునకమరకము చేయఁబడుచుండును. సముద్రతీరములయందు సున్నపుగుల్ల మొదలయినవి తీసికొనుటకుఁ గూడ నొకవిధమయిన అమరకము కలదు. ముత్యములు పగడములు మొదలగునవి దొరకు ప్రదేశములోని సముద్ర ప్రదేశములు విశేషపు మొత్తపు శిస్తున కమర్పఁబడుచున్నవి. మఱియు రేవుదాటినట్టి యేటిప్రదేశములు, త్రోవలలోని ఘాటీలు సంతలు ఉత్సవదినములలోని టెంపొరరీ దుకాణములు, మొదలగునవికూడ నాయా ప్రదేశముల కధికారులగు వారికి కొంతశిస్తు మొత్తమున కమర్పఁబడుచుండును. మఱియు కల్లు, సారాయి, దుకాణములు, నల్లమందు, గంజాయి మొదలగు మత్తుద్రవ్యముల దుకాణములుసర్కారువారి 'ఆబుకారీ' యుద్యోగస్థుల

వలన వేలంపాటపాడబడి యెక్కువశిస్తుకట్టు కొన్నవాని కమరకము చేయఁబడుచుండును. ఇట్టిదుకాణములు అమరకము చేయఁబడుట యందు శిస్తురాబట్టవలెనను నుద్దేశమేకాక అట్టిమత్తు ద్రవ్యముల యుపయోగము సాధ్య మైనంతమట్టుకు నిర్బంధించి కట్టిపెట్టింప వల యుననియే దొరతనమువారి యుద్దేశము. అడ వులు, పుల్లరిభూములు, పాటిపేరళ్లు మొద లగునవికూడ వానియందధికారము కలవారిచే నమర్చఁబడుచుండెను.

ఇట్టి అమరకము పద్ధతిలోనున్న భూము లనుమాన్యములనియు ఈనాములనియు వాడు దురు. శిస్తులేకుండఁగాని తక్కువ శిస్తునకుఁ గాని సైనికులజీతముక్రిందను నుద్యోగస్తుల వేతనములక్రిందను దేవాలయముల యొక్క సంరక్షణ కొరకును వాని సేవకులయొక్క భుక్తి కొఱకును సత్రములు మొదలగు ధర్మముల నిమిత్తమును కవులు, శాస్త్రజ్ఞులు, పండితులు, దైవజ్ఞులు మొదలగువారి జీవనాధారము కొఱకును దొరతనమువారికిఁగాని దొరతనమువారిమెప్పు వడయునట్లుచేసిన ప్రజాక్షేమమునకుఁ గాని చేసిన గొప్పకార్యములకు బహుమతిగా భూములను గ్రామములను నిచ్చువాడుక చిర కాలమునుండి యీ హిందూదేశమునఁగలదు.

భూస్వామ్యముల లబ్ధికొఱకుఁ జేయబడిన యమరకము

హిందూరాజులకాలములో నిట్లు గ్రామములు భూములు నిచ్చునప్పుడు, అట్టి యీవిని ప్రక టించుచు శాసనములుమీఁద వ్రాయువాడుక కలదు. ఇవి రాజుగాని సంధివిగ్రహాద్యధికారి యని పిలువఁబడు మంత్రిగాని యిచ్చువాడుక కలదు. సైనికులకిట్టి భూములనిచ్చుపద్ధతి విజ యనగరరాజ్యమందును, దక్షిణహిందూస్థాన మును మహమ్మదీయులు జయించినప్పు డక్క డను గలిగియుండెను.

ఇట్లు హిందూరాజులచే వ్యవహరింపఁబడు పద్ధతిని మహమ్మదీయులుగూడ నవలంబించి జాగీర్లను మిల్లుభూములును నుచితముగా నిచ్చుచుండిరి. అట్టిభూములనన్నింటిని "ఈనాము భూములు" అను సామాన్యపదముచే వాడు చున్నారు. ఇట్టి ఈనాములలో విజయనగరము నేలిన హిందూరాజులును, మధురరాజ్యమును బాలించిన పాండ్యులును, తంజావూరు మొద లగునవియేలిన మహారాష్ట్రప్రభువులును, ఓఢ్ర దేశమునేలిన గజపతులును నాయకులును, నాయాదేశములేలుచు విస్తారముగా ధర్మకా ర్యముల నిమిత్తమిచ్చిన భూములు నగ్రహార ములును నాయాప్రదేశములందును నుత్తర సర్కారులయందును ఇట్టి యీనాములలో నె క్కువగాఁగలవు. తరువాతహిందూరాజ్యములు క్షీణించి దేశ మరాజక స్థితిలోనికివచ్చి పిమ్మట మహమ్మదీయులవశమైన తరువాతఁ జిన్న చిన్న దేశనాయకులును ప్రబలులైన స్థలాధికారు లును బలవంతులైన సర్కారుద్యోగస్థులును స్వతంత్రించి యిట్టి భూముల నిచ్చుచువచ్చిరి.

హిందూరాజులు

ఉత్తర సర్కారులో నిట్టి యీనాముభూము లనేకము అప్పటి జమీందారులవలన, ఫౌజు దారుల వలన, గ్రామములు పరగణాలు నిజారాపాడిన యిజారాదారులవలనఁగూడ నీయఁబడిన యిట్టి చిన్నచిన్నయీనాము లనేకములుకలవు. దత్తమండలములోను దక్షిణాది జిల్లాలలోను నున్న పాళ్యగార్లుకూడ నంతకంటె నెక్కువగా నీనాములిచ్చుచు వచ్చిరి.

మహమ్మదీయ రాజులు

శాశ్వతముగా శిస్తులేకుండ భూములను గ్రామములను నిచ్చుపద్ధతి మహమ్మదీయ రాజుల కంగీకారము కాక పోయినను బ్రాహ్మణులయొక్క దేవాలయము మొదలగువానియొక్క అనుభవములోనున్న భూములభుక్తమునకు మాత్రము, అడ్డగించుటవారికిష్టము లేకపోయెను. ఇంతియేకాకవారుగూడఁగ్రొత్తగానట్టి వారికట్టిభూములనిచ్చిరి. తరువాతనింగ్లీషువారికిని ఫ్రెంచివారికిని జరిగిన యుద్ధములలో దేశమల్ల కల్లోలముగానున్న యవస్థయందు నేవిధమైన న్యాయమైన యధికారము లేని వారుగూడ నిట్టిభూముల నిచ్చుచుండిరి.

ఇంగ్లీషు ప్రభుత్వము

ఆంగ్లేయ ప్రభుత్వారంభ దినములలోఁ బూర్వాచారము ననుసరించి శాశ్వతముగాఁ గాని కొన్నితరముల వఱకనుభవించునట్లు గాని కొన్ని జాగీర్లనిచ్చుచుండిరి. తరువాత ౧౮౦౨-వ సంవత్సరమునందును ౧౮౧౫-వ సంవత్సరమునందును, ఈష్టిండియా కంపెనీవారి యుద్యోగస్థులకు ఇంగ్లాండు దేశమునుండి "కోర్టాఫ్ డైరక్టర్సు" పంపించిన యుత్తరువులనుబట్టి పారితోషికముగా, ఈనాము భూముల నొసఁగు వాడుకమాని అట్టివారికి పెన్షను పూర్వకముగా రొక్కమే యిచ్చుపద్ధతి నవలంబించిరి. ఇట్టి భూములు ప్రథమమున నియమింపఁబడిన పనులకంటె భిన్నమగు పనులక్రింద వినియోగపడుటకు వలను పడదని ౧౮౩౧-వ సంవత్సరమున నొక నిర్బంధ మేర్పఱచి ౧౮౪౫-వ సంవత్సరము మొదలుకొని అట్టి భూముల నన్నింటిని సర్కారునకుదాఖలు చేసికొనుపద్ధతి నవలంబించిరి. తరువాత ౧౮౫౮-వ సంవత్సరము నవంబరునెలలో "ఈనాము కమిషన్" ఒకటి యేర్పఱుపఁబడి ఈనాముల సంగతియంతయుఁ బరీక్షించి న్యాయమగు వానికి శాశ్వతపు పట్టాలీయ నారంభింపఁబడెను. ౫౦-సంవత్సరముల భుక్తము ఋజువుపడిన యీనాము భూములన్నింటికి నట్టి భూము లే నియమముతో పుట్టబడినను శిస్తులేకుండ శాశ్వతముగా నీయఁబడినవి. అట్లు ౫౦ సంవత్సరముల భుక్తము కనుపఱచక చాల సంవత్సరములు కనపఱచినవారికిఁగూడ శిస్తులేకుండ నీయఁబడినవి. ఉచితముగా నీఁబడిన యీనాములు దాన విక్రయాద్యధికారములు లేకుండ నిష్టము వచ్చినంతకాల మనుభవించుటకు గాని అట్టి దానవిక్రయాది స్వతంత్రాధికారము పొందవలె నన్నచో సంవత్సరమునకు స్వల్పముగా

ఈనాం కమిషన్

క్విట్ రెంటు, అనుపన్ను నిచ్చుకొను పద్ధతిమీద గాని ఒక్కపర్యాయమే క్విట్ రెంటు క్రింద కొంతసొమ్మిచ్చి స్వేచ్ఛగా పన్ను లేకుండ ననుభవించు పద్ధతిమీఁదఁగాని యేర్పాటు గావించి పట్టాలొసంగిరి. ఇట్లు విధింపఁబడిన "క్విట్ రెంటు" స్వల్పమైనను నది యిచ్చుట కీయకొనకకొందఱు ఈనాముదారులు తమకుఁ గలుగ చేసిన విక్రయాద్యవకాశమును బోగొట్టుకొనిరి. అట్టియీనాములు "నటగ్రీటు" ఈనాములని చెప్పఁబడును. అట్టి యీనాములిప్పటికిని గొన్నిగలవు. వానిని ఈనాముదారులు వంశపారంపర్యముగా ననుభవించుటకు హక్కున్నదిగాని ఇతరులకుఁ జెందఁజేయుట కధికారములేదు. అట్టిభూములు దానవిక్రయాదిమార్గమున నితరులకుఁ జెందినపుడు సర్కారుజిరాయితీ భూమిగా నెంచఁబడి తగిన జిరాయితీ శిస్తువిధింపఁబడును. నౌఖరీ క్రింద నీఁబడిన యీనాములలో నవసరమున్న నౌఖరీల బాపతు వానినుంచి తక్కినవానికి క్విట్ రెంటు కట్టిగాని కొన్నిసంవత్సరముల క్విట్ రెంటు పుచ్చుకొని పన్ను లేకుండఁ గాని యిచ్చిరి. ఇట్టి నౌఖరీ యీనాములకు మాత్రము, ఈనాందారు లంగీకరించినను నంగీకరించక పోయినను క్విట్ రెంటు బలవంతముగా గట్టి యిచ్చివేసిరి. దేవాలయములు మసీదులు మొదలగువాని సంరక్షణకొఱకును వానివిషయమై యేర్పఱుపఁబడిన నౌకర్ల జీతముల క్రిందను ఇయ్యఁబడినభూములు, ఆయాకార్యములు చక్కఁగా జరుగుచున్నంత వఱకు భూము లనుభవించుపద్ధతితో పట్టాలీఁబడెను. ఆకార్యములు జరుగకపోయినప్పుడు మాత్రము దొరతనమువారు లాగికొని జిరాయితీపన్ను కట్టుటకు హక్కుంచుకొనిరి. ఈనాముదారుల హక్కును గూర్చియు, అట్టి యీనాము భూములమీఁదనున్న దొరతనమువారి స్వాతంత్ర్యమును, గూర్చియు సాధ్యమగునంత వఱకుఁ జక్కఁగాఁబరిశీలించి మిక్కిలి యుదారబుద్ధితో సాక్ష్యములు నిదర్శనములు పరీక్షించి హక్కుభుక్తములు నిర్ణయించి యీ "కమీషన్" వారు పట్టాలొసంగిరి.

ఈనాము భేదములు

ఈనాములు "సన్నద్ యీనాములు" "మరంజామ్ యీనాములు" "జాగీర్లు" "వజీఫాలు" "వాకఫ్లు" "దేవస్థానములు" అని అనేక విధములు గలవు. జమీందారులు శాశ్వతపు సెటిలుమెంటునకుదరిమిలా నిచ్చిన యీనాములు దరిమిలా యీనాములని వాడఁబడుచున్నవి. ఇట్టి యీనాములు శిస్తు లేకున్నను, తక్కువ శిస్తున కీయఁబడినను, జమీందారీ జిరాయితీ భూములవంటివే యని గ్రహింపవలయును. కొన్ని యినాము భూములును గ్రామములును సిద్ధసాధ్యములగు తరులతా గుల్మోదక పాషాణనిధి నిక్షేపములతోఁ గూడ నీయఁబడినవి కూడఁగలవు. దానపూర్వకముగాఁ బ్రతిగ్రహీతల క్షేమలాభముల కీయఁబడిన యీనాములు, ఒక గ్రామముగాఁగాని

గ్రామములోఁ గొన్ని భూములుగాఁగాని యున్నవి. ఒకగ్రామమంతయు దానమిచ్చినపుడు "దేవశాత్తు" లేక "మేజరు" ఈనాములనఁబడును. ఒకగ్రామములో నీయఁబడిన యీనాములు మైన రీనాము లనఁబడును. మైన రీనాములకంటెఁ బెద్దవై గ్రామ మనిపించుకొనని యీనామ "ఖండ్రిక" లేక "పోహల్ శోత్రియ" మనఁబడును. అదివఱకు సేద్యములో నున్న గ్రామ మీనాముగా నీయఁబడినప్పుడు నిమాం జే గ్రామయీనామనఁబడును. ఒక పెద్దవై శాల్యముగల భూమిపై నొకపల్లె కట్టఁబడి అది యీనాముగా నీయఁబడినచో నట్టిపల్లె గ్రామలెక్కలలోఁ బ్రత్యేక గ్రామముగా వ్రాయఁబడి యుండనపుడు, అది గ్రామగర్భ ఖండ్రిక యనఁబడును. ఇట్టి ఈనాములు రెండువిధము లయినవి. తారాపది యీనాములు లేక మాన్యము లనియు, సనదు లేక దుంబాలా యీనాము లనియు, గ్రామము ప్రప్రథమమునఁగట్టఁబడి నప్పుడు గ్రామోపయోగము నిమిత్త మీయఁబడిన గ్రామ మాన్యములు, అనఁగా, రివిన్యూ, పోలీసు, గ్రామనౌకర్లు, గ్రామదేవత, గ్రామదేవాలయములు, మొదలగు వానిక్రిందనీయఁబడి చిరకాలభుక్తములో నున్నవి తారాపదీ యినాములని చెప్పఁబడును. ఇవి రాజుచేతఁగాని గ్రామ సముదాయము వారిచేఁగాని యియ్యఁబడిన యీనాములు. రాజుచేఁ బ్రతిగ్రహీతులకును ధర్మకార్యముల నిమిత్తమును మత సంబంధమగు విషయములకును నియ్యఁబడిన యీనాములు "సనద్" లేక "దుంబాలా" యీనాము లనఁబడును. తంజావూరునందు రాజ్యముచేసిన హిందూ రాజులవలన నీయఁబడిన యీసనదీ యీనాములుకూడ త్రివిధములు:-

(౧) క్రమమయిన పట్టాలతో నీయఁబడినవి శికాసనదులు. ఈ శికాసనదుల క్రింద భూమియనుభవింపక దానిమీఁద రొక్కపు శిస్తురూపకముగా ననుభవింపఁబడునవి ఆయకట్టు మాన్యములనఁబడును.

(౨) రాజుయొక్క నగరునందలి ఖాసు లెక్కలలో, ఈనాముభూమి దరఖాస్తు విషయమై వ్రాయఁబడి యందుపైన యీనామిచ్చినట్లు రాజుయొక్క అంగీకారము పొందినవి "దత్తకొరోఖాలు" అనఁబడును.

(3) ఈనా మిప్పించవలసినదని కోరియిచ్చుకొన్న అర్జీ మీఁద, ఈనామిచ్చినట్లు వ్రాయఁబడినవి "అర్జీరొఖాలు" అనఁబడును. మిరాశీదార్లకు తమమిరాశీ గ్రామమందలి బంజరు భూమిని దీసికొని దాని క్రింద నీయఁబడిన యీనాములు గ్రామభాగ యీనాములని తంజావూరుజిల్లాలోఁ బ్రచురింపఁబడియున్నది. ఒకప్పుడు జాగీరుగానున్న చెంగల్పట్టు నందు నొకవిధమయిన సనదు యీనాములు గలవు. ఈసనదు యీనాములు ప్రతి సంవత్సరమీయఁబడు పట్టాలననుసరించి భుక్తములో నుండునవిగాఁ గన్పించుచున్నవి.

ఈనామములు, శిస్తుకొంచెమేని ఇచ్చుకో నక్కఱలేకుండఁగాని శిస్తులోఁగొంత భాగ మిచ్చుకొను పద్ధతిమీఁదఁ గాని కొంచెము సొమ్మిచ్చుపద్ధతిమీఁదఁగాని యీయఁబడెను. ఇందు మొదటితరగతివి సర్వయీనామములు లేక "సర్వమాన్యములు" "సర్వ దుంబాలాలు" అనఁబడును. ఇట్టియీనామములు సాధారణముగా ధర్మకార్యముల కొఱకును దైవజ్ఞులు పండితులు కవులునగు బ్రాహ్మణులకొఱకును వేద వడిన రాజకుటుంబములలోని వారికిని నీయఁ బడినవి. శ్రోత్రియములను ఈనామములు వేదములు చదువుకొన్న వారి కీయఁబడిన వేయైనను కాలక్రమమున నితర బ్రాహ్మణులకిచ్చు ఈ నామములు కూడ శ్రోత్రియము లనఁబడుచు వచ్చెను.

రెండవతరగతి యీనామములు. ఇవిశిస్తులోఁ గొంతభాగమిచ్చుకొను పద్ధతి నీఁబడినవి :-

(౧) అర్ధమాన్యములు :-శిస్తులో సగముశిస్తున కీఁబడినవి.

(౨) చాతుర్భాగములు, లేకపాతికబడులు:- భూమిశిస్తులో నాల్గవ వంతు మాత్రము సర్కారున కీయవలసిన యీనామములు.

(3) ముప్పాతికబడి:-భూమిశిస్తులో ముప్పాతిక వంతు మాత్రము సర్కారునకు పన్నీయ వలసిన యీనామములు.

(౪) రాయయత్ ముఖాసాలు :-ప్రతి సంవత్సరమును జేయఁబడుచున్న సాగుబడిని బట్టి తక్కువశిస్తుకట్టి యీఁబడిన ముఖాసా గ్రామములు.

(౫) త్రిభాగములు :-భూమిపండిన పంట మొత్తములో మూడవ వంతుమాత్రము సర్కారునకిచ్చు ఈనామములు.

ఇట్టి యీనామములలో, క్విట్ రెంటు లేక "జోడీ" "బేడిగ" "పొరుపు" "కట్టుబడి" అనుపన్నులు చెల్లించి యనుభవించు ఈనాములుచేరియున్నవి. ఇట్టి ఈనామములలోనొక్క పర్యాయమె నిర్ణయింపఁబడిన శిస్తు యేటేట చెల్లించునవి "బిల్మక్తా" యీనామ లనియు, ప్రతిసంవత్సరము పండుపంటనుబట్టి యీయవలసిన శిస్తు నిర్ణయింపఁబడినవి "హంగామీ జోడీ" యీనామములనియుఁ జెప్పఁబడును. పూరాశిస్తుకంటె తక్కువశిస్తురొక్క రూపకముగాఁ జెల్లించునవి "కట్టుకుట్టగై" భూములనఁబడును. ఇట్టిభూములు యుద్ధములోఁబని చేసిన సైనికుల కీయఁబడినవి. ప్రతిసంవత్సరము నొక పర్యాయము నిర్ణయింపఁబడిన క్విట్ రెంటుపన్నునిచ్చు ఈనామ భూముల "ఖాయమ్‌జోడీ" లేక "హరసాల్ ముక్తా" లనఁబడును. "జోడీ" కంటె నెక్కువ గాను న్యాయమైన సర్కారుపన్నుకంటెఁ దక్కువగను శిస్తుచెల్లించుచు ఖాయమైన అమరకపు పద్ధతిలోనున్న గ్రామములు "రొక్కకుట్టగై" గ్రామములనఁబడును.

(౧) నేల్‌కుట్టగై :- పూ రా శి స్తు కం టె తక్కువయినశిస్తుధాన్య

ధాన్యరూపముగా పన్నిచ్చియనుభవింపఁబడు భూములు

రూ ప ము గాఁ గా ని అప్పటికైన ధాన్యమూల్యముగాఁగాని పన్నిచ్చునవి.

(౨) పాతంభూములు - ధాన్యరూపముగా తక్కువశిస్తు చెల్లించు పల్లపుభూములు. స్థలనిర్ణయము లేకుండ భూములుపాయింపు చేయఁబడకుండ నీఁబడిన యీనాములు.

(౧) గ్రామముపైఁ జెల్లు సర్కారు శిస్తుమీఁద రూపాయకుఁగొన్ని అణాలవంతున అనుభవించుటకు హక్కుగలుగఁ జేయఁబడిన గ్రామములన్ని శ్రోత్రియము లనఁబడును.

(౨) దిట్టము:—అనఁగా గ్రామములో నేటేట సాగుబడి చేయఁబడు భూమిలోఁ గొంత భాగము వేఱుపఱచి, ఆభాగము మీఁదిశిస్తు గ్రామలెక్కలలోఁ జేర్పకుండ ననుభవించు గ్రామములు.

(3) ఈవుమాన్యము:—"సర్కారునకుఁ జెల్లఁబడు భూమి శిస్తులోఁ గొంతభాగము" అని అనుభవించునది.

ఇట్లుగాక స్థలనిర్దేశమేర్పడి సరిహద్దులు గలిగిన యీనామములు

చక్‌బందీ యీనాములు

"చక్‌బందీ" ఈనాములనఁబడును. ఈయీనాములు రెండువిధములు.

(౧) రివిన్యూలెక్కలలో నమోజు కాఁబడినవి దాఖలా యీనాములు.

(౨) అట్లు లెక్కలలో నమోజుకానివి గైర్‌దాఖలా యీనాములు.

మఱియును, ఈనాములు ప్రతిఫల మపేక్షింపక యీఁబడినవనియు నౌకరీ నపేక్షించి యీఁబడినవనియు రెండువిధములు. ఇవిగాక దస్తర్‌తోటలనియు, తోపు యీనాములనియు, దక్షిణార్కాటు జిల్లాలో నొక తెగ యీనాము భూములు గలవు. ఇవి తోటలువేసి పెంచుటకుఁ బ్రోత్సాహము కలిగించు నిమిత్తము తోటలు వేయు వారి కీయఁబడినవి. అట్టి యీనాము భూములలోని తోటలు చచ్చిపోయి నప్పుడు భూములు సర్కారునకుఁ జెందును. వీనినే ధర్మారామ ఈనాము లందురు.

స్వకుటుంబ పోషణార్థమొకని కనుగ్రహపూర్వకముగా బహుమతిగా వంశపారం పర్యానుభవము గలహక్కుతో దానవిక్రయాద్యధికారములతో నీయఁబడినవి కొన్నియు, ప్రతిగృహీతవంశ మున్నంతవఱకు ననుభవింపఁబడునట్లు కొన్నియు, ప్రతిగృహీతయావజ్జీవము మాత్రమే యనుభవింపఁ దగినట్లు కొన్నియు, నీఁబడిన యీనాములు గలవు. ఈనాము కమీషన్ కాలమందు దానవిక్రయాద్యధికారములేని యీనాములు దత్తపుత్రుల వంశస్థులకు దానరూపముగాఁగాని దయారూపముగాఁగాని దఖలుపడిన వానికిని దప్పఁ దక్కిన యీనాము లన్నింటికిని క్విట్ రెంటుపన్ను కట్టఁబడి పట్టాలీఁబడినవి. బ్రాహ్మణుల కీయఁబడిన ఈనాములు బ్రహ్మదాయము లనఁ

బడును. ఇవి అధ్యయన, భారత, భట్టవృత్తి, పంచాంగ, పురాణ, వేదవృత్తులను నాలుభేద ములు చెంది యున్నవి. ఇట్లు గ్రామమంతయు నీయఁ బడినప్పుడు, అగ్రహారములని పిలువఁ బడుచు నొక్కకుటుంబము వారికి నిచ్చినప్పు డా కుటుంబము వారును, ఒక్క కుటుంబము కంటె నెక్కువ కుటుంబముల వారికిచ్చినప్పుడు, అన్ని కుటుంబము లన్ని భాగములుగా ననుభ వించుటకు హక్కు గలిగి యున్నారు. ఇట్టి అగ్రహారములలోఁ గొంత క్విట్ రెంటు కట్టి ఈయఁబడినవి బిల్మక్తా అగ్రహారములనియు, కొంతపన్ను కట్టి యీయఁబడినవి కట్టుబడి లేక జోడీ అగ్రహారము లనియు, అగ్రహారములోఁ బండిన పంటమీఁద పుట్టి ౧-కి యింతశిస్తు అని నిర్ణయించి శిస్తు కట్టఁబడినవి పుట్లకట్టుబడి అగ్రహారములనియు, ఏపన్నును నీయకుండ నీయఁబడినవి సర్వాగ్రహారములనియు, పంట లో మూఁడవవంతుశిస్తుగా నిచ్చియనుభవింపఁ బడు నగ్రహారములు త్రిభోగాగ్రహారము లనియుఁ జెప్పఁబడును. అగ్రహారములో నున్న బ్రాహ్మణ కుంటుంబముల వారందఱుతక్కువ పన్ను చెల్లించుచు ననుభవించు నగ్రహారము లు ధర్మాసనా గ్రహారములని పిలువంబడును. శ్రోత్రియాగ్రహారములు వేదాధ్యయన సంప న్నులగు బ్రాహ్మణుల కీయఁబడినవే కాక యితర బ్రాహ్మణులకీయఁబడినవి కూడగలవు. బ్రాహ్మణే తరులకు ధర్మార్థ మీయఁబడిన ఈనాములు ఖైరాతీ యీనాము లనఁబడును. తొల్లింటి హిందూరాజులచే శాసనములు వ్రాయఁబడి దఖలుపడిన ఈనాములు "అల్తమఘా" యీనాములని పిలువఁబడును. ఆ ఈనాందారు లకు దానవిక్రయా ద్యధికారములతో సర్వాధి కారము గలిగి వంశపారంపర్యముగా శాశ్వత ముగా నవి యనుభవింపఁబడుచున్నవి.

ఈయీనాములు కాక పారితోషికముగాఁ గాని ప్రతిగృహీతలు చేసిన కార్యములకు బహు మతిగాఁ గాని, యీయఁబడిన యీనాములు కొన్ని గలవు. అవి యేవనఁగా:-

అడైయోవిమాన్యము - అడవికొట్టి భూమిని వ్యవసాయార్హముగాఁ జేసినందున కీయఁ బడిన యీనాము.

అరసినాగె యీనాము - వివాహ కాలమందు కట్నముగా నీయఁబడిన యీనాము.

బాఘ్మారీ- పెద్దపులిని జంపినందుల కీయఁ బడిన యీనాము.

బురూజ్ లేక కొటాఖడ్జి- గ్రామము కాపాడుట కొఱకు నొకబురుజు కట్టినందులకుఁగా నీయఁబడిన యీనాము.

దండుగ - రాజకార్యములనిమిత్తము విస్తారము సొమ్ముఁ దీసికొనఁబడుటవలన మిక్కిలి నష్టముపొందిన వారికీఁబడిన యీనాము.

ఏరువాక - గ్రామములో భూమిని మొట్టమొదట కాడికట్టి దున్నిన వాని కీయఁబడిన యీ నాము.

గడ్డితీరువ - వ్యవసాయము చేయుటకు మిక్కిలి కష్టతరమైన మెరకభూములను సేద్యము

చేసినందులకు తక్కువశిస్తుకట్టి యీఁబడిన యీనాము.

ఈడిగ - కల్లునిమిత్తమై యీతచెట్లు వేసినవాని కీఁబడిన యీనాము.

ఇరుంబుకట్టి - రాళ్లనుండియినుముతీసి కమ్మరి పనిచేయుటకుఁ బ్రోత్సాహము కలిగించి నందుల కీఁబడిన యీనాము.

జూలాహట్కా - నేతగాండ్రు గ్రామములో నివసించి యుండుటకుఁ బ్రోత్సాహము కలిగించినందుల కీఁబడిన యీనాము.

మేటి - సేద్యగాండ్రను దీసికొనివచ్చి గ్రామములోఁగాపురము పెట్టించిన పెద్దరైతున కీయఁబడిన యీనాము.

నారివెట్టి - వేటలో నక్కలను జంపినందుల కీఁబడిన యీనాము.

నెత్తురుకట్టు, నెత్తురువెట్టు, రక్తమాన్యము, ఉదరపట్టు - పలిక్కణీ, రక్తకొడగె, అనుపేర్లు గల ఈనాములు, యుద్ధములోఁజచ్చి పోయినవారి కుటుంబ పోషణార్థముగాని, పరోపకారార్థము శరీరమునందు గాయములుపొందినవానికిని వానికుటుంబమునకుఁగాని, ప్రతిఫలముగా నీయఁబడిన ఈనాములు.

నీర్ సరిహద్దు - ఇంకొక గ్రామోపయోగార్థము తమభూములగుండ నీటికాలువ త్రవ్వట కంగీకరించి నందులకుఁ బ్రతిఫలముగా నీయఁబడిన యీనాము.

పెల్లెట్టు - చెఱువుత్రవ్వునప్పుడు మొట్టమొదటఁ బెల్లువిఱచి త్రవ్వటమొదలిడినవాని కీయఁబడిన యీనాము.

పల్లికట్టు - గ్రామము కట్టినవాని కీయఁబడిన యీనాము.

పులికట్టు - మంత్రసామర్థ్యముచేత పులినోరు కట్టి దానివలని అపాయము తప్పించి నందుల కీయఁబడిన ఈనాము.

పంగువాలీ లేక పట్టువాలీ - గ్రామమందుమ్మడి హక్కుగలరైతులకు, ఆగ్రామకృషి వృద్ధి పఱచినందుల కీయఁబడిన యీనాము.

స్థల ఈనాము - ఉత్తరార్కాడుజిల్లాలో పల్లికట్టు యీనాములనే స్థల యీనాములని పిల్తురు. తిరుచునాపల్లి మొదలగు కొన్ని దక్షిణాది జిల్లాలలో గ్రామస్థులందఱకుఁ గావలసిన పనుల విషయమై సేద్యము చేయఁబడు భూములలోనుండి రైతులందఱచే గొంచెము కొంచెముగా నీఁబడు మాన్యములు స్థల ఈనాము లందురు.

భ శేలోగ్ - రాజునాస్థానమునకుఁ దఱుచుగా రా నీఁబడుచు నచటగౌరవమును జెందుటకర్హత గల పెద్దమనుష్యుల పోషణముకొఱకును వారు రాజగౌరవము కాపాడుకొనుటకు నీయఁబడిన ఈనాము.

ముడవలేకసప్పణి- నడవలేనికుంటివాని కీయఁ
బడిన ఈనామము.

ముతలికన్- ఒకగొప్పగొరవస్థుని యాశ్ర
యించుకొన్నవారికిని సేవచేయువారికిని
నీయఁబడిన ఈనామము.

నిర్వాణమాన్యము-దిగంబరుఁడై తిరుగుసన్యాసి
కీయఁబడిన ఈనామము.

రాజబంధువు- పాళ్యగార్లయొక్కయు జమీం
దారులయొక్కయు బంధువుల కుటుంబ
పోషణార్థ మీయఁబడిన యీనామము.

వేదాన్ - వేటలోఁబ్రజ్ఞకలవాని కీయఁబడిన
యీనామము.

భూస్వాములకుఁగానిజమీందారులకుఁగాని
స్వంత నౌకరీ నిమిత్తమీఁబడినవియు, గ్రామ
సముదాయమునకుఁ గాని

నౌకరీ యీనామములు

ప్రజాక్షేమము కొఱకుఁ
గాని నౌకరీచేయుట కేర్పఱుపఁ బడినవనియు
నివి రెండువిధములు. ఇందు మొదటిరకము
ఈనాములు, పాళ్యగార్లవలనఁగాని దేశాధి
పతులవలనఁగాని పోలీసు లేక మిలటరీనౌకరీలు
చేయఁబడినందుల కీయఁబడిన భూములు. ఇవి
'అమరం' భూములనఁబడును. వీని ననుభవించు
వారి నమరందారులని పిలుతురు. అట్టియుద్యో
గములను జేయు బంట్రౌతుల కీయఁబడిన
భూములుకట్టుబడు లనఁబడును.గంజాంజిల్లాలో
పర్లాకిమిడి జమీందారిలో చేరిన "మలయా"
లను కొండభూములయందు నొ క వి ధ మ గు
మిలటరీ నౌకరీయీనాముల భుక్తపద్ధతి కలదు.

ఈప్రదేశమున నివసించు ప్రజలు సవర లనఁ
బడుదురు. వీరు తిరుగుబాటు చేయుచు వెల్లడి
ప్రదేశముల యందలి ప్రజలను బాధించుచు
వచ్చుచుండిరి.

సవరలు నివసించు మలయాప్రదేశములన్ని
యు ౧౧ ముతాలుగా విభజించి అలజడిలే
కుండ దేశమును గా

మలయా

పాడుటకును, మలయా
లనుండి వెల్లడి ప్రదేశముల కేతెంచు మార్గ
ములలో దోపిళ్లు దొంగతనములు లేకుండ
దేశమును సంరక్షించి నందులకును నీ ౧౧
ముతాలకును౧౧ గురు బిస్సోయిాలను నాయ
కులను నియమించిరి. ప్రతిబిస్సోయిాయు నొక
చిన్న కోటఁగట్టుకొని పాయక్‌లను తమక్రింది
యుద్యోగస్థులతోఁ గాపురముండి తమ యేలు
బడి ముతాలలోనున్న సవరాజాతివారిఁగట్టు
బాటులో నుంచుచుండిరి. ఇట్టిబిస్సోయిాలు
తమ ముతాలను బైనఁజెప్పిన నౌకరీచేసినం
దులకు ఈనాములుగా ననుభవించుచున్నారు.
వీరికిఁ గొంచెము కట్టుబడి పన్నుకూడ కట్టుట
గలదు. ఈబిస్సోయిాలు తమక్రింది పాయక్
అను నుద్యోగస్థులకు భూరూపముగాఁగాని
రొక్కరూపము గాఁగాని ధాన్యరూపముగాఁ
గాని జీతము లిచ్చుచుండిరి. ఈబిస్సోయిాలు
యేలుబడిలోనున్న సవరాలు బిస్సోయిాల
స్వంతభూములను సేద్యముచేయుటకు వెట్టి
చేయుటవలనఁగాని లేక వారుచేయు కుమురీ
లేక పోడు వ్యవసాయమునకు నింటికొక్క రూ

పాయివంతున రొక్కమో, ఒకపుట్టి ధాన్యమువంతున ధాన్యమో, యిచ్చుటవలనఁగాని బిస్సోయీలకు శిస్తుకట్టుచుండిరి. ఇదిగాక సంవత్సరమున కాలుపర్యాయములు పండ్లు కాయగూరలు రూపముగా "సంబోలో" అనుపన్ను గూడఁజెల్లించుచుండిరి. ఇట్లుదేశోపయోగము కొఱకేర్పఱుపఁబడిన బిస్సోయీలు పాయక్కలుగాక సవరలవలన బాధలేకుండ గ్రామములను గాపాడినందులకు దొరలని పిలువఁబడుచుండిరి. పర్లాకిమిడి జమీందారీలో ౨౩ గురిట్టి దొరలుగలరు. వీరుచేయు సాకరీ నిమిత్తమనుభవించు భూములు దొరతన మీనామలందురు.

జీవితములు

మఱియు, మధురజిల్లా రామనాధపురములో నిట్టి యీనాములుగలవు. ఇవి యుత్తర సర్కార్లలోని "ముఖాసా" లను బోలియుండును. ఇవి జమీందారులు తమకు చేసిన సాకరీకిఁబారితోషికముగాఁగాని చేయవలసిన సాకరీ నిమిత్తముగాఁగాని కుటుంబపోషణార్థము తౌజీలగాఁగాని తమ్మా వ్రాయించుకొన్న యాశ్రితులకును రాజబంధువులకును నీఁబడిన యీ నాములు.

కట్టుబడి

ఆయుధములు ధరించిన తమ సాకరులకుఁ దమకు సాకరీ చేయుపద్ధతిని జమీందారుల వలనఁ దక్కువ శిస్తున కీఁబడిన భూములు. ఈ కట్టుబడి భూములు సంవత్సరమంతయు గ్రామసాకరులుగానుండి సాకరీచేయుట కీయఁబడినవి. గ్రామకట్టుబడులును అవసరము వచ్చునప్పుడు మాత్రము సాకరీచేయుట కీయఁబడినవి "జంగీకట్టుబడు"లనియును జెప్పఁబడును. ఈకట్టుబడిభూములు సాకరీ అక్కరలేనప్పుడు మరలఁదీసికొనచ్చును. మఱియును, తాలూకా యుద్యోగస్థులకు గ్రామములనుండి వస్తువులను దీసికొనిపోయి యిచ్చుసాకరీభూములు "అనకాలకట్టుబడు" లనియు భూములకు నీరు పంచిపెట్టి మామూలుగాఁ జేయవలసిన పనులకు రైతులను సమకూర్చినందుల కీయఁబడిన భూములు "అంగజాలకట్టుబడు"లనియు, కట్టుబడి బంట్రౌతులలోఁ బెద్దవాని కీయఁబడినది "దండీయకట్టుబడి" యనియు సాకరీ యిట్టిదని నిర్ణయములేక యేసాకరీచేయకుండఁగనే యీఁబడినది "జీతవృత్తి" లేక "జీతోత్తర" కట్టుబడియనియు, బళ్లారిజిల్లాయందలి పశ్చిమ తాలూకాలయందు తాము సేవ్యముచేయు భూములలోఁ గొంతశిస్తు మినహాయింపఁబడి, అనుభవింపఁబడు భూములు "ఖండాచార" కట్టుబడులనియు, గంజాంజిల్లాలో నాయుధము ధరించి జమీందారులకు సాకరీచేయు వారికిచ్చుభూములు "కోలపాయకో" కట్టుబడులనియు బంట్రౌతు ఉద్యోగముచేసినందులకు ముత్రాసు జాతివారికీయఁబడినవి "ముత్రాసు" కట్టుబడులనియు గంజాంజిల్లాలో మిలటరీసాకరీ నిమిత్తమీయఁబడిన భూములు "పాయక్" కట్టుబడులనియు, విశాఖపట్టణము జిల్లాలో

దేశమునందు దొంగతనములు దోపిళ్ళు మొదలగు నలజడులు లేకుండఁ గాపాడినందులకు నాయుధములుధరించిన బంట్రౌతులకు పర్వత ప్రాంతమందలి జమీందారులచే నీయఁబడిన భూములు "తిరస్తు కట్టుబడు"లనియుఁ జెప్పఁబడును.

తక్కువ శిస్తున కొకగ్రామముగాని కొన్ని గ్రామములుగాని నౌకరీ నిమిత్త మీయఁబడినవి ముఖాసాలనఁబడును. ఇట్టి ముఖాసా లను భవించువారు చేయునౌకరీ సామాన్యముగా మిల్టరీ పనియే. ఇట్టి ముఖాసాలలోఁ గొంచెము తక్కువ క్విట్ రెంటు చెల్లించుచు ననుభవించునది కట్టుబడి ముఖాసా లనియు, ప్రతి సంవత్సరము పండు పంటలనుబట్టి నిర్ణయింపఁబడుచు తక్కువ శిస్తున కనుభవించునవి రాయయత్తు ముఖాసా లనియు, ఏ నౌకరీచేయకుండ ననుభవించునవి సర్వముఖాసాలనియుఁ జెప్పఁబడుచుండును. తంజావూరు జిల్లాలో శరభోజీమహారాజు తనదేశమును సర్కారున కిచ్చునపుడు తనక్రింద నుంచుకొన్నట్టియు, లేటు రాజా అనుభవ భుక్తములలో నున్నట్టియు, ప్రైవేటుయెస్టేటు, ముఖాసా అనుపేరఁబిలువఁబడుచున్నది. ఈముఖాసా సర్కారునకు నీటి విషయమై చెల్లించు నీటితీరువయు లోకలు సెస్సు మొదలగు తక్కిన పన్నులుగాక చెల్లింపవలసిన భూమి శిస్తేమియు లేదు.

ముఖాసా

ఈనౌకరీ యీనాములు గాక అనేకవిధములగు చిల్లరనౌకరీ యీనాములు పెక్కులు గలవు. అవి యీక్రింద వివరింపఁబడుచున్నవి.

(౧) అత్తర్ - పాళ్యగారులకు పరిమళద్రవ్యములనిచ్చు నౌకరీ నిమిత్త మీయఁబడిన యీనాము.

(౨) బారుత్ గోలా- పాళ్యగారులకు, తుపాకిమందు గుండ్లు సమకూర్చుట కీయఁబడిన యీనాము.

(3) భట్రాజులేక సంగీతము - జమీందారులయు, పాళ్యగారులయు, ప్రాభవమును గయివారముసేయు భట్రాజులు మొదలైన స్తుతిపాఠకుల కీయఁబడినయీనాము.

(౪) బోయీ లేక గదబా లేకగదబాలు లేక పెండీ- పాలకీలు సవారీలు మొదలగునవి మోయుబోయీల కీయఁబడిన యీనాము.

(౫) దర్జీ లేక తయల్కార్ - జమీందారులకును పాళ్యగార్లకును కుట్టుపనిచేసినందుల కీయఁబడిన యీనాము.

(౬) డేగ - డేగలను పట్టుకొని పక్షుల వేటాడు జమీందారీనౌఖరున కీయఁబడిన యీనాము.

(౭) దొమ్మర - దొమ్మరియాటలాడు వారి కీయఁబడిన యీనాము.

(౮) ఎఱుకల- మందులనిమిత్తము అడవిదుంపలు మొదలగు గ్రంథిలాదులు జమీందారులకుఁ దెచ్చియిచ్చు నౌకరీ కీయఁబడిన యీనాము.

గొడమండ లేకగొల్ల లేక పాల్కాలయకుండు-జమీందారులకు, పాలుపెరుగుసమకూర్చి నందునకును, గ్రామమునందలి భూములకు మందకట్టుటకును, గొల్లలకీయఁబడిన యీనామము.

గొడుగు - జమీందారులకు గొడుగు పట్టు నౌకరీకీయఁబడిన యీనామము.

గుఱ్ఱపుఈనాం - జమీందారుల గుఱ్ఱములను తనిఖీచేయుచు వానికి నడకచెప్పి శిక్షించుటకును గుఱ్ఱములను సంరక్షించుచుండుటకును, నీయఁబడిన యీనామము.

జెట్టీ-పాళ్యగార్లయు జమీందారులయు సమీపమునందు, కుస్తీచేయువాని కీయఁబడిన యీనామము.

కడెయ్యర్ - జమీందారులకు, చాపలు, వ్రాతకుపయోగించు తాటి యాకులు, సమకూర్చు నౌకరీ కీయఁబడినయీనామము.

కవిరోయర్ లేకపులవర్ - జమీందార్లయు పాళ్యగార్లయు నాస్థానమందున్న కవుల కీయఁబడిన యీనామము. ఇట్టిభూమి బ్రాహ్మణకవుల స్వాధీనములో నున్నప్పుడు "కవితాపట్టం" అనఁబడును.

ఖాసా - జమీందారుల యిండ్లలోని నౌకర్ల కీయఁబడిన యీనామము.

కొమ్ము - తహసీల్దారుముందుకొమ్ము, భాకా,యూదునౌకరి కీయఁబడినయీనామము.

కోన్ - జమీందారుగాని అతని యుద్యోగస్థులు నౌకర్లుగాని గ్రామములో మకాము చేసినప్పుడు పాలు, పెరుగు, నెయ్యిమొదలైనవి సమకూర్చు నిమిత్తమీయఁబడిన యీనామము.

కుడుకుడుపై - శకునములుచెప్పి నందునకు బుడుబుక్కలవాని కీయఁబడిన యీనామము.

మటాపటీ-సర్కారుద్యోగస్థులకు పాలుతెచ్చి యిచ్చినందునకును గ్రామాధికారులగు రెడ్లు సర్కారుపనిమీఁద గ్రామము విడచి పయికివెళ్ళినప్పుడు, అన్నమువండి పెట్టినందులకును నీయఁబడిన యీనామము.

నగారా - నవాబుల గుమ్మములదగ్గరను మసీదులదగ్గరను నగారావాయించుట కీయఁబడిన యీనామము.

పాలపట్టీ - గ్రామదేవత జాతర అయినప్పుడు యూరిసరిహద్దులో పాలుపోయు నౌకరీ చేయువాని కీయఁబడిన యీనామము.

పెరియ అరమ్మణి - జమీందార్ల గృహములకుఁ గావలి యున్నందుల కీయఁబడిన యీనామము.

పెరుకులి - అప్పుడు రాజ్యము చేయుచున్న జమీందార్ల పేర్లు పిల్లలకు పెట్టుకొనిన వారికిఁగాని జమీందారుల పిల్లలకు నామకరణము చేయించిన పురోహితునకుఁగాని యిచ్చిన యీనామము.

పుష్పాడి - జమీందారునకు పువ్వులు సమకూర్చినందుల కీబడిన యీనామము.

శైకల్గా - జమీందారుల ఆయుధములు బాగు చేసినందుల కీయఁబడిన యీనాము.

శమ్మర్ - జమీందారులకు సున్నము సమ కూర్చినందుల కీయఁబడిన యీనాము.

శ్యాహీవాలా - ఉద్యోగస్థులకు సిరాచేసి యిచ్చినందుల కీయఁబడిన యీనాము.

తబేలా - జమీందారుల గుఱ్ఱపులాయమును తనిఖీ చేయువాని కీయఁబడిన యీనాము.

తమలపాకుల యీనాం - తమలపాకుల నిచ్చువాని కీయఁబడిన యీనాము.

ఉస్తాద్-జమీందారులకు కఱ్ఱ, కత్తి, త్రిప్పట మొదలగు సాము నేర్పినందుల కీయఁబడిన యీనాము.

వలయన్-జమీందారులకు వలలు వేసి చేపలు తెచ్చిపెట్టువాని కీయఁబడిన యీనాము.

జింగార్-జమీందారులకొఱకు గుఱ్ఱపుజీనులు తయారుచేయువాని కీయఁబడిన యీనాము.

గోనెబరకాలు - గోనెసంచులు తయారు చేయుచు వాని నమ్ముకొనుచు గ్రామములో నివసించియుండి కొన్ని రుసుములు మామూళ్లు ననుభవించుటకు హక్కుగలిగి తాము కాపుర మున్న యిండ్లయందు మాత్రము హక్కులేని రైతులు కసవర్గరైతు లనఁబడుదురు. ఈరైతులు సేద్యముసేయు భూమిలో వారికిహక్కు లేదు.

గ్రామస్థులకు నౌకరీచేయుట కొఱకు కీయఁబడిన యీనాము భూములు. ఇందు దశబంధము, లేక కట్టుకొడిగె అను యీనామములు ముఖ్యములైనవి.

దశబంధము

మెట్ట పంటలో ౧౦-వ వంతు యీనాముగా నీయఁబడుటచే నివి దశబంధ యీనాములని పేరు చెందినవి. చెఱువుగాని నూయిగాని నీటికాల్వగాని త్రవ్వి దానిని మంచిస్థితియందుంచు చున్నందులకు భూరూపకముగాఁగాని శిస్తురూపకముగాఁగాని యీబడు యీనాములు దశబంధ యీనాము లనఁబడును. భూరూపకములకు "ఖండదశబంధ" మనియు, శిస్తురూపకముగా నీయఁబడినప్పుడు "షమీలద్దశబంధ" మనియుఁ జెప్పఁబడును. ఇట్లు యీనాముగా నీయఁబడిన భూమికిమ్మత్తుగాని రొక్కపు మొత్తముగాని, ఆపనికి వెచ్చింపఁబడిన సొమ్ముమొత్తమునుబట్టి యీఁబడుచువచ్చెను. కడపజిల్లాలో సర్కారు భూములకు నీరు సమకూర్చు చెఱువులను మంచి స్థితియందుంచుటకుఁగాని భూములను చదును చేసి సేద్యార్హముగాఁ జేసినందులకుఁగాని బంజరుభూమి సేద్యముచేయఁబడు స్థితికిఁదెచ్చినందులకుఁగాని దశబంధమను పేరనే యీనాములు పుట్టఁబడినవి. ఉత్తరార్కాటుజిల్లాలో దశబంధ మీనాందారు, ఆయకట్టు భూమి మీఁది నాలవవంతు, యీనాముగాఁ బొందినప్పుడు "చౌతాయిదశబంధందారు" అనియు, ఆయకట్టుభూమియంతయుఁ దక్కువ శిస్తున కనుభవించునప్పుడు "వలవాడీ. దశబంధందారు" అనియు, పిలువఁబడుచుండును. ఈదశ

బంధం యీనాందారులు చెఱువులను మంచి స్థితిలో నుంచనప్పుడు వారికీయఁబడిన యీనాము భూములనుగాని చేసిన సదుపాయములనుగాని తొలఁగింపవచ్చును. లెక్కదాఖలా భూములకన్న నెక్కువనేల దంపసాగుబడి అయినప్పుడు అట్లు అదనముగా సాగుబడి అయిన భూములలోవచ్చినలాభములోఁ గొంత భాగము కూడ షమీాలద్దశబంధ యీనాందార్లు పుచ్చుకొనుటకు హక్కుకలిగియుండుట గలదు. క్రొత్తగా, పల్లపుసాగుబడి కాఁబడు భూములమీాఁద చెల్లఁబడునీటి పన్నులో రు. ౧౦౦కి రు. ౨౦ వంతున ఖండందశబంధందారులనుభవించుటకు హక్కుకలిగి యున్నారు. శాశ్వతపు జమీాందారీ సెటిలుమెంటు అగు నాఁటికి ఇట్టి దశబంధం యీనాములు భుక్తములో నుండి యున్నను జమీాందారీ యెస్టేట్లలోనున్న అట్టి యీనాముల హక్కు సర్కారువారు పూర్ణముగా వదలివైచిరి.

**గ్రామస్థుల నౌఖరీ నిమిత్తము పుట్టఁబడిన యితరయీనాములు**

అలొట్టి-మామూలుగాఁ జేయవలసిన పనులకొఱకు రయితుల నందఱను సమకూర్చు వానికీయఁబడిన యీనాము.

అంబిక లేకపల్లి వాఁడి లేక తెప్పన్ - ఏఱు దాటించు నౌకరీకీయఁబడిన యీనాము.

అన్నేకరమ్- ఏటిగట్లు, ఆనకట్టలు, మొదలగునవి పశువులుత్రొక్కి పాడుచేయకుండఁ గాపాడి వానిపై గడ్డి పెంచినందుల కీయఁబడిన యీనాము.

బండెలా - పశువులు చేలలోఁబడి సస్యము పాడుచేయకుండ కాపాడినందుల కీయఁబడిన యీనాము.

కరేమాన్యం లేక కలంవెట్టు లేక కమ్మాయి వెట్టు - చెఱువులు బాగుచేయు నిమిత్తము కూలివాండ్రను సమకూర్చినందుల కీయఁబడిన యీనాము.

ఖుల్గా లేక పటలా- ఇది చెఱువులకును కాలువలకును చిన్న చిన్న రిపేర్లుగావించి త్రవ్వుచున్నందుల కీయఁబడిన యీనాము.

కులంకావల్ - రయితులు చెఱువులో నీరు వృథాగా ఖర్చుపెట్టకుండఁ గాపాడినందుల కీయఁబడిన యీనాము.

నానల్ - ఆనకట్టలమీాఁదను, పంటకాల్వలగట్టు మీాఁదను, దుబ్బుగడ్డి పెంచు నౌకరీకీయఁబడిన యీనాము.

నీరుమునక - నీటిలోమునిఁగి చెఱువు తూములను తెఱచు నౌకరీకీయఁబడిన యీనాము.

పట్టి - పశువులు చేలలోఁబడి మేయకుండఁ గాపాడు నౌకరీ కీయఁబడిన యీనాము.

సాగుబడి - సర్కారు భూములను సాగుబడి చేయుటకుఁ బ్రోత్సాహపఱుచుచున్నందునకుఁ బెత్తనదారుల కీయఁబడినయీనాము.

ఉప్పర లేక ఒడ్డె - చెఱువులు మఱమ్మత్తు చేయు నౌకరీ కీయఁబడిన యీనాము.

ఉరని - గ్రామస్థులవాడుక నిమిత్తము మంచి నీళ్ల చెఱువులను మంచి స్థితియందుంచు నౌకరీ కీయఁబడిన యీనాము.

వాయిక్కాల్ - నీటికాల్వలు, పంట భూముల యొక్క యితర నీటి యాధారములు సరి యయిన స్థితి యందుంచినందుల కీయఁ బడిన యీనాము.

కృషి యాధారముగను వృత్తిగను నొక గ్రామమందుఁగాపురమున్న గ్రామస్థులు తమ వ్యవహారము లన్నియుఁ జక్కఁగా నెఱవేర్చు కొనుటకును, తమ వృత్తులకుభంగము లేకుండ సుఖముగా జీవించుటకును, ముఖ్యమగు నేర్పా టులన్నియుఁ బ్రతిగ్రామమందును జేయఁబడి యున్నవి.

**గ్రామోద్యోగస్థుల కీయఁబడిన యీనామభూములు**

గ్రామ లెక్కలు వ్రాయుటకు, కరణములను నధికారు లుండిరి. వీరినే మహారాష్ట్ర దేశమున కులకరణి లనియు, ఉత్తరహిందూదేశమున పటవారీల నియు, అరవదేశమున కనకపిళ్లలనియు, నందురు. ఈవ్యవహారస్థులు ప్రతిగ్రామమునకునొకరిద్దఱు ప్రప్రథమమున నుండియు నేర్పడియున్నారు. ఈ యుద్యోగస్థునకును గ్రామస్థుల సదుపా యము నిమిత్తమేర్పడిన యితరగ్రామసేవకుల కును వారుచేయు పనులకుఁ బ్రతిఫలముగఁ గొంత భూమినిగాని కొంతశిస్తుగాని పంటలోఁ గొంత భాగముగాని మేరలు, రుసుములు 'స్వతంత్రము' అనుపేర నీయఁబడు చున్నవి. ౧౮౦౨-వసంవత్సరములో జారీకాఁబడిన ౨౯-వ నెంబరు ౨౫-వ నెంబరు రెగ్యులేషనుల ననుస రించి శాశ్వతముగా సెటిలుమెంటు కాఁబడిన జమీందారీ యెస్టేట్లయందలికరణములనునియ మించుట, శిక్షించుట, మొదలగు నధికారములు జమీందారుల కీయఁబడినవి. ఈ కరణముల యుద్యోగము వంశపారం పర్యముగ వచ్చు హక్కుకలది. ఈరిగ్యులేషనులు కరణముల విషయమునకే గాక తక్కినగ్రామ నౌకర్లు, అనఁగా గ్రామవడ్రంగి, గ్రామకుమ్మరి, గ్రామ మంగలి, గ్రామచాకలి, గ్రామకమ్మరి, గ్రామ జ్యోతిష్కుఁడు, గ్రామ పురోహితుఁడు నను నీ యేడుగురి విషయమై సంపూర్ణమైన యేర్పా టులును నిబంధనలును గలిగి యున్నవి. తరు వాత ౧౮౯౪-వ సంవత్సరమున జారీచేయఁ బడిన ౨-వ నెంబరు ఆక్టు అగు మదరాసు ప్రొప్రైటరీ యేస్టేట్లవిలేజీ సర్వీసు అక్టు జారీ కాబడి దానింబట్టి జమీందారులకు కరణ ములమీఁదియధికారమునకుఁగొన్ని మార్పులు కలుగఁజేసి అంతకుమున్ను కరణము లనుభ వించుచున్న నౌకరీ యీనాములకు శిస్తుకట్టి శాశ్వతపు హక్కుతోఁబట్టాలనిచ్చి సర్కారు గ్రామములయొక్క శిస్తునుబట్టియు, కరణము లు చేయఁదగు పనులను బట్టియు నెలజీతము లేర్పఱచిరి. తరువాత ౧౮౯౫-వ సంవత్సర మున 3-వ నెంబరున జారీ కాఁబడిన "హెరి డిటరీ విలేజీ ఆఫీసర్సు" ఆక్టును బట్టి గ్రామ వడ్రంగి, మంగలి, చాకలి, కుమ్మరి, జ్యోతి ష్కుఁడు, పురోహితుఁడు తప్ప తక్కిన గ్రామ

సేవకుల నేర్పఱచు విషయమున విపులముగా నిబంధన లేర్పఱుపఁబడినవి. గ్రామకరణము, గ్రామమునసబు, గ్రామతలారులను దప్ప తక్కిన గ్రామనౌకర్లను గ్రామములోఁ గాపుర ముండక పోయినను దమతమ నౌకరీలను జేయకపోయినను నుచితముగా ప్రవర్తింపక పోయినను దొలఁగించుటకుఁగాని కొంతకాల ము నిలుపుదల (సస్పెండు) చేయుటకుఁ గాని జమీందారుల కధికార మీయఁబడినది.

మతవిషయకమగు దేవాలయము మొదలగువాని నౌకరీ కీయఁబడిన యీనాములు

ఇట్టి యీనాములు అమ్ముకొనుటకుఁగాని యితరులకిచ్చుటకుఁగాని యీనాందారుల కధికారములేదు. దేవాలయాదికములలో సంబంధించిన నౌకర్లకీయఁబడిన యీనాములు వారివారికి నిర్ణయింపఁబడిన పనులు వారు యథోచితముగా చేయుచున్నంత వఱకు వారి కాయీనాములపై నధికారము గలదు. అట్టి నౌకరీలు వారుచేయనప్పుడు వారిస్థానే యితరులనునియమించి వారికాభూము లనుభవించు నధికార మీయఁబడును. శాశ్వతపు సెటిలు మెంటునకుఁ బూర్వమీయఁ బడినవియు, ఎస్టేట్లయొక్క జమమొత్తములోఁ (assets) జేర్పఁబడని శిస్తుగలవియునయిన యీనాములను లాభిరాజ్ భూములను వాని నియ్యఁబడిన యుద్దేశము నెఱవేర్పఁబడనప్పుడు వానినిదీసికొనుటకుసర్కారువారికిహక్కుగలదు. శాశ్వతపు సెటిలుమెంటునకుఁ బూర్వము "జోడీ" పన్ను చెల్లించుచున్నపుడును, నట్టి జోడీపన్ను యెస్టేట్లజమమొత్తములోఁ జేర్పఁబడినపుడును, జోడీపన్నుమాత్రము పుచ్చుకొనుటకు జమీందారులకు హక్కుగలదు కాని యీనాములఁ దీసికొనుటకు హక్కులేదు. సాధారణముగా సర్కారు ఈనాము భూములకు పట్టాల నిచ్చునపుడు అట్టియీనాములు భుక్తములో నున్నవారికే యిత్తురు. స్థలనిర్దేశము కాఁబడని యీనాములకు శిస్తు కట్టవలసి వచ్చినపుడు ఆభూమికిశిస్తుకట్టి దానికి పట్టాజమీందారునకే యీయఁబడును. శాశ్వతపుసెటిలుమెంటునకు దరిమిలానీయఁబడిన యీనాములు తీసికొని జిరాయితీ భూములకువలె పన్నుకట్టుట కధికారమున్నది. పైనవివరింపఁబడిన పలువిధములగు ఈనాముభూముల హక్కుభుక్తములు న్యాయశాస్త్రములఁబట్టియు, నితర శాసనములఁబట్టియు, దేశాచారములఁబట్టియు, హిందూధర్మశాస్త్ర సమ్మతములైన హక్కులనుబట్టియు, వ్యవహరింపఁ బడుచుండును.

(అ)

పయిని వివరింపఁబడిన అమరకపు పద్ధతులుగాక యీదేశమునందింకను గొన్నివిధములగు నమరకపుపద్ధతులు గలవు. అవి ఈ క్రింద వివరింపఁ బడుచున్నవి.

అయిమా - బంజరుభూములు వ్యవసాయములోనికిఁ దేబడునిమిత్తము ముందుగా శిస్తు లేకుండ నీయఁబడిక్రమక్రమముగాఁ గొన్ని సంవత్సరములకుఁ బూర్తిశిస్తుకట్టి అమర్చఁ

బడు భూములు. బంగాళా రాజధానిలో మిడ్నపూరు జిల్లాలోను బలరామపురం జమీందారీలోను నీవిధమగు నమరకము వాడుకలో నుండెను. మిడ్నపూరుజిల్లాలో "మండలీజాట్" అనునమరకపు పద్ధతియు నిట్టిదే!

అయిసీ - భూమిలోఁబండింపఁబడు ఫలసాయ ముంబట్టి మహమ్మదీయులు వసూలుచేయుచువచ్చిన శిస్తునుమార్చిమహారాష్ట్రులు గ్రామమందలి భూములన్నిటికిని దామాషాహిమీఁద నొకరేటుపన్ను నిర్ణయించి దానింబట్టి పూర్తిశిస్తు వసూలు చేయుటకు దక్కనులో నేర్పఱుపఁబడిన పద్ధతి.

ఖాల్సా- అజమీరు, మార్వాడ, ప్రదేశముల యందు స్థలాధికారియగు మహారాజు యొక్కగాని దేశనాయకుని యొక్కగాని యెస్టేటునందు నుయ్యిగానీ, చెఱువుగాని, మఱియొక విధమగు నీటిసదుపాయము గాని యేర్పఱచుకొని.వ్యవసాయముచేయు పద్ధతిని శాశ్వతపుహక్కుతో నాజలాధారముచే సేద్యముకాఁబడినంతభూమియమరకముఁ జెందుపద్ధతి. ఈదేశములో వర్షము మిక్కిలి యరుదుగాఁ గురియుటవలన నిట్టి యమరకముఁ జేయవలసివచ్చినది.

అనువాడా - రైతుసొమ్ముఖర్చుపెట్టి శ్రమపడి బంజరుభూమి సేద్యములోనికిఁ దీసికొని రావలసిన యవసరము లేకుండ భూస్వామియే అట్టిపనిచేయించి యితరబంజరు భూములకంటె నెక్కువ శిస్తుకట్టి అమరకముచేయు పద్ధతి. ఇదిపంజాబు రాజధానిలోనున్నది.

(క)

బాబర్ - పంజాబురాజధానిలో "బాబర్" అను తెగవారు తమ గ్రామములలోని భూములను సమానముగాఁ బంచుకొని యెవరికిని లోఁబడక స్వతంత్రమైన యనుభవము కలిగి శిస్తు చెల్లించుచు సేద్యము సేయు పద్ధతి.

దిథారీ - అయోధ్యలో భూస్వామి భుక్తము లోనున్న గ్రామమును నతని యిష్టము లేకుండఁ దీసికొను నప్పుడుగాని, యితర గ్రామములతోఁగలిపి తాలూకాదారీ అమరకము చేయఁబడునపుడుగాని, స్వల్పశిస్తు కట్టిగాని శిస్తు లేకుండఁగానిఅసలు హక్కుదారునకు గ్రామములో విడిచిపెట్టఁబడిన భూమి. ఒకగ్రామముకంటె నెక్కువగ్రామములు పోగొట్టుకొనువాని కొక్కగ్రామమంతయు నీయమరకపుపద్ధతిమీఁద నిచ్చుటయుఁ గలదు.

సర్ - స్వంత శేరీభూమి.

బిర్తు సంకల్ప్ — దర్భగాని తులసి గాని ఆశీర్వచించి యిచ్చినందులకు బ్రాహ్మణుల కీయఁబడిన భూమి అమరకము.

ఖీ - గ్రామము పాడుపడిపోయినపుడు గ్రామస్థులువిడచినగ్రామము మరలగ్రామముగా నేర్పడనపుడు పూర్వము గ్రామకంఠమున

జేరినదియు నిండ్లక్రింద నున్నదియు నగు భూమివ్యవసాయము చేయఁబడుటకు నమ రకము చేయుపద్ధతి.

దస్వాంతు చెహారమ్ } బంజరు భూమినిజక్కఁజేసి వ్యవసాయస్థితిలోనికిఁదీసికొని వచ్చినందులకునట్లు భాగుపడిన భూమిలో ౧౦-వ వంతుగాని ౪-వ వంతుగానిశిస్తుచెల్లింపకుండఁ జేయునమరకపు పద్ధతి.

పూర్వాబస్నా - గ్రామములను ఇజారాకిచ్చినపుడు ఆగ్రామముచుట్టునుండు బంజరు భూమి వ్యవసాయములోనికిఁ దీసికొనివచ్చినందునకు నాగ్రామమిజారా నున్నంతవఱకుచితముగా ననుభవింపనిచ్చి,ఆగ్రామము తీసికొనినప్పుడతఁడు పడినశ్రమకుఁ గొంత శిస్తుకట్టిగాని శిస్తులేకుండఁగాని కొంత భూమినిచ్చు షరతున కమరకము చేయు పద్ధతి.

మార్వాత్ - రాజును గనిపెట్టుకొని యుండి యతఁడు యుద్ధమునకు వెళ్ళునపు డతనితోఁగలసి యుద్ధమునకుఁబోవు పద్ధతిని అమరకము చేయుభూమి.

బాయిపితాయత్తు- ఒకగ్రామములోని భూమిని ఖండములుగా విభజించి యొక్కొక్క ఖండమును, అమ్మి అమరకము చేయు పద్ధతి.

బిస్వీ - భూస్వామి రయితుదగ్గరఁగొంతసొమ్ము బదులుపుచ్చుకొని ఆఋణము తీరువఱకు శిస్తులోఁ గొంతభాగము పుచ్చుకొనిగాని శిస్తంతయుపుచ్చుకొనకఁగాని అమరకము చేయుపద్ధతి.

(ర)

రఖౌనా - బంజరు భూమిలో పుల్లరి నిమిత్తముపయోగించుకొనుట కమరకము చేయు పద్ధతి.

-శాఘట్ట్ - భూస్వామియనుమతి లేకుండగనే భూమిలోఁ జెట్లువేసి పెంచుటవలన నాచెట్లుబ్రతికి యున్నంతవఱకు వానిఫలసాయమునందు హక్కుగలిగి యుండు పద్ధతి నమరకము చేయుట.

ఈ పదునొకండు అమరకపు పద్ధతులు, అయోధ్యలో నున్నవి.

బన్కీ - ఓఢ్రదేశములో సర్కారుక్రింద నున్న భూమి.

బన్ను - పంజాబు దేశములో నొకవిధమగు నమరకము.

బగ్రేయిట్ - బీహారురాష్ట్రములో ధాన్యరూపముగా శిస్తుచెల్లించు లోపాయకారీ అమరకపు పద్ధతి.

బార్హా - సంయుక్త రాష్ట్రములో గ్రామమునకు దూరముగా నుండుటవలన నెరువు మొదలగువానిచే బాగుపఱచు కొనుట కలవిగాని భూములు.

బారీ - అస్సాము దేశములో పాయక్కుల కిండ్లుకట్టుకొనుటకును ఆయింటిచెంటితోట వేసికొనుటకును శిస్తులేకుండ విడిచిపెట్టఁ బడిననేల. కొడగుదేశమునఁ బసువులమేఁత కొఱకు రయితులకీయఁబడిన నేలనుగూడ నీపదముననే వాడుదురు.

బారికే - కొడగు దేశమునఁ బసువులమేఁత కుపయోగించు పుల్లరిభూమి.

ఘట్వాలీ - ఛూతియా నాగపూరు, మాంఘీ యర్, శాంతల్ పరగణాలు మొదలగు జిల్లాలలో మొదట దేశసంరక్షణకై ప్రభ ులులకుఁ బుట్టఁబడి తరువాత వానివలననే దేశమున కుపద్రవమువచ్చుట తటస్థమై నప్పుడు శాశ్వతపు సెటిలుమెంటు కాల మున శాశ్వతమైన హక్కుతో నమరకము చేయఁబడిన భూములు.

బేత్ ఖేటా - ఛూతియా నాగపూరులోరాజు యొక్క స్వంతశేరీ భూములను వ్యవ సాయము చేయుకొఱకు శిస్తులేకుండ నీయఁబడిన కొంతభూమి.

బేవార్ - మధ్యపరగణాలలో నడవికొట్టి కాలిచి, ఆబూడిదె మీఁద విత్తనములు చల్లి పండించుపద్ధతి.

భోగ్ దానీ - అస్సాముదేశములోఁ బూర్వపు రాజులవలన శిస్తులేకుండ నమరకము చేయఁబడ్డభూమి.

భూమ్- ఛూతియానాగపూరులోఁ బ్రథమ మున గ్రామముల నేర్పఱచి యిప్పటికిని శాశ్వతపు హక్కులతో గ్రామాధికా రోద్యోగములు సేయుచున్న గ్రామాధి కారులకుఁ గొన్నివిశేషములైన హక్కు లతో నమరకము చేయఁబడినభూమి.

(జ)

భూమ్-హాజమీరు మార్వాడ, దేశములలో దేశముల కలజడిలేకుండఁ గాపాడుటకును, దేశములలో జరిగిన అక్రమములకు జవా బుదారులై యుండునిమిత్తమును, శాశ్వ తపు హక్కుతోఁజేయఁబడిన అమరకము.

బీజువార్ - దక్షిణకర్ణాటక దేశమున భూమి యందుఁ జల్లబడిన విత్తనములఁబట్టియు నందులకురాఁబడు ఫలసాయములంబట్టియు నిర్ణయింపఁబడిన శిస్తున కమరకముచేయఁ బడిననేల.

బిస్వాదరీ - హాజమీరుదేశములో భూమిలో నూయిత్రవ్వుటవలన శాశ్వతపుహక్కును పొందఁబడిననేల.

బిస్వీ-అయోధ్యలో, తనఖాపద్ధతివలనఁ జెందఁ బడిన లోపాయకారీ భూమి యనుభవము.

బొంబాయి రాజధానిలో దక్కను నందును రాజధానియందంతటను సామాన్యమైన పద్ధతి. | రైతువారీ అమరకపు పద్ధతి. పూర్వపుజాయంటు గ్రామముల పద్ధతులనుసంపూర్తిపోక, అమరకములోవాడుకలోనున్న అమరకపు పద్ధతులు.

గుజరాతు దేశము
- కొన్ని గ్రామములలో నార్వాలేక భాగ్ దారీఅమరక పద్ధతులు కలవు.
- కొన్ని గ్రామములలో తాలూకాదారీఅమరక పద్ధతులును పట అమరక పద్ధతి,
- మేవాసి అమరక పద్ధతి, మాలికి అమరక పద్ధతి, మొదలగునవియు.

ఉత్తరకొంకణములో - కోటీ, షిల్ హోత్రి, యిజాఫత్, అమరక పద్ధతులును.

దక్షిణకొంకణములో - దారెఖాలీపద్ధతులును గలవు.

ఛాక్ - బంగాళారాజధానిలోని చిట్టి అడవి కొట్టి భూమిని బాగుపఱచు పద్ధతిమీఁదఁ జేయఁబడిన అమరకము. సంయుక్త పరగణాలలో గ్రామములలోనున్న అన్ని రకములను, అన్ని తరగతులను గలిపి కొంచెముకొంచెముగా నమరకము చేయుపద్ధతికే యీపేరు కలదు.

ఛౌత్ సక్ దేశముఖీ- మహారాష్ట్రులు తాము జయించిన దేశమందు సరియైన అమరక పద్ధతి నేర్పఱచు దాఁక వసూలుచేయుచు వచ్చిన తాత్కాలిక (టెంపోరరీ) మగు అమరకపు పద్ధతి.

(చ)

చిరాఘీ - మసీదులలోను గోరీలదగ్గరను దీపము వెలిగించుపద్ధతిని నీఁబడిన భూమి.

"చిటగాంగు జిల్లాలో" ఇజ్, హారీ, హవాలా, మిరాస్‌హవాలా, కైవ్వనీహవాలా, కరారీహవాలా, రాయితీహవాలా, అను అమరకపద్ధతులు వాడుకలోనున్నవి. మఱియు నీజిల్లాలో కొండ ప్రదేశములలో "జుమ్" అనునొక అమరక పద్ధతిగలదు. "పంజాబు" దేశములో భూమియొక్క వైశాల్యమునుబట్టి మోహాదృష్టిచేఁగొంత శిస్తున కమరకముచేయు పద్ధతికి "చకోటా" అని పేరు.

దాదాయిల్లాహి - వంశ పారంపర్యముగాఁ గాక కేవల భుక్తమునే యేర్పఱచి హక్కుగలుగఁజేయు అమరకపుపద్ధతి.

దానాబాదీ - పంటనుగొలిచి గాని భూమిని గొలిచిగాని లేక కేవల మోహాదృష్టిచేఁ గాని సర్కారు శిస్తునిర్ణయించి అమరకము చేయుపద్ధతి.

గైరు మారూశీ - ఇష్టము వచ్చినప్పుడు రయితును తొలఁగింపఁబడు పద్ధతిని జేయఁబడు నమరకము.

ఘూసావత్తు - గ్రామముయొక్క భూమిశిస్తంతయు గ్రామస్థులు తామనుభవించు భూమినిబట్టి యిచ్చుటకును, అటులనే భాగస్వామియైనవాఁడు తనభాగము శిస్తునీయని యెడల, ఆశిస్తు మరియొక భాగస్వామి యిచ్చినచో నాభూమి నతఁడేయనుభవించుచుండు నటులు చేయఁబడిన అమరకము. మఱియు బంగాళారాజధానిలో రాయితీ,

గంఢీ, ముషాఖీ, థాక్‌సినీ, చౌహద్దీ, ముకర్రారీ, కైవ్వనీ, గుజస్తాజాట్, జిమ్మా మీనాస్, గోరాబందీ, మజ్కూరీ, పంచక్, బందోబస్తీ, మాలిఖానా, బ్రహ్మోత్తర్, శివ్వోత్తర్, దేవ్వోత్తర్, పీరోత్తర్, హజరాత్, దగ్గా, ఛాక్రామ్, పట్నీ, ఇజారా, జాగీఫేమ్కీ, గాచ్ఛ్, కిస్మత్, మల్గుజారీ, హవాలా, మొదలగు నమరక పద్ధతులు గలవు.

గిరానియా - ఇది, భూమిశిస్తువిధిగా రయితు చెల్లించునట్లును, అట్లు చెల్లింపని యెడల భూస్వామికిఁగానిసర్కారునకుఁగానినష్టము లేకుండునట్లును జాగ్రత్త పఱచుకొఱకుఁ జెల్లింపవలసినశిస్తునకుఁ జాలినంత కొంత భూమిని హామీయిచ్చు పద్ధతిని జేయఁబడిన అమరకము.

(ట)

గోవామట్టీ - అస్సాముదేశములో నిల్లు కట్టుకొనుటకును, కొంత తోటవేసి కొనుటకును,వరి పండించుకొనుటకును "పాయక్కు" లకుఁ జేయఁబడిన అమరకపు పద్ధతి.

గుజారా - పంజాబు దేశములో రయితులకు వారి పశువ్రలమేత నిమిత్తమును, వంట చెఱకు నిమిత్తమును, అనుభవించుట కమరకము చేయఁబడిన యడవి భూమి.

హాల్‌పెసాలా - ప్రతిసంవత్సరము భూమిలోఁ బండింపఁబడు ధాన్యాది విశేషములంబట్టి శిస్తు కట్టఁబడు నమరకపద్ధతి.

ఇంగ్లిస్ - బంగాళా రాజధానిలో నౌకరీకి బనికిరాకుండ గాయములు తగిలిన ఆంగ్ల సిపాయీలకుఁ గుటుంబపోషణ నిమిత్త మీయఁబడినభూమి.

జల్సాజార్ - ఛూతా్య నాగపూరులో నొక విధమగు పాయకారీ అమరకము.

జంగల్ బూరీ, జస్వోలు, బల్పబూరీ, మొదలయిన అమరకపు పద్ధతులు కూడ బంగాళాలోఁ గలవు.

కామ్‌దూరా - బంగాళారాజధానిలోని భూమిని బాగుపఱచు పద్ధతిని జేసిన అమరకము.

కామమ్ - మళయాళములో, తనఖా పద్ధతిమీఁదఁ జేయఁబడిన అమరకము.

కక్కీనా - బంగాళా రాజధానిలో ఇజారాదారువలన నమరకము చేయఁబడు పద్ధతి.

ఖోల్కారీ - ఛూతా్య నాగపూరులో భూమి యందలి చెట్లు, మొల్లను, గొట్టి వ్యవసాయము చేయు పద్ధతి.

ఖోటీ - కొంకణ దేశములోని యొకవిధమగు నమరక పద్ధతి.

ఖువాబడి - సంయుక్త పరగణాలలోని యొక విధమగు నమరకము.

ఖులావేష్ - పంజాబుదేశములోని హిందూదేశ సీమాప్రదేశములలో గుటుంబములో నున్న మనుష్యుల సంఖ్యనుబట్టి భూమి నిచ్చు నమరకపు పద్ధతి.

(డ)

ఈవిధముగా నమరకపుపద్ధతులు సమానములైనను గొంచెము కొంచెము భేదములతో నాయాదేశములయందు దేశభాషలలోని పేర్లతో వ్యవహరింపఁబడు నమరకపుఁబద్ధతులనేకములుగలవు. ఒకదేశములోనున్న యమరకపుపద్ధతియే పలుదేశములలోఁ బలువిధములగు నామములతో వ్యవహరింపఁబడుచుండుటవలన నమరకపుఁ బద్ధతులపేర్లు లెక్కకు మిక్కిలి యైనవి.

భూమి కొలత

భూమికొలత యనఁగాఁ జదరపుఁగొలత. ఒకానొక క్షేత్రముయొక్క వైశాల్యముఁ దెలిసికొనుట. దీనిని మన గణితశాస్త్రములో క్షేత్రవ్యవహారమని యెదరు. క్షేత్రపరిమాణమును దెలిసికొనుట సులభమైన పనికాదు. అందులకుఁ గొంత రేఖాగణితమును (Geometry) క్షేత్రగణితమును (Mensuration) తెలిసి యుండవలెను. హిందువుల కీవిద్యలు మిక్కిలి పూర్వకాలము నుండియుఁ దెలిసియుండెననుటకు సందేహము లేదు. ప్రతివేదశాఖకును సంబంధించినట్టి కల్పసూత్రములలోఁ జివరను "శుల్వసూత్రము" లుండును. ఇవి క్షేత్రపరిమితిఁ దెల్పు రేఖాగణితమునకు సంబంధించిన నియమములు. పురుషమన్నది యప్పటి యొకమానము. చేతులెత్తి పురుషుఁడు నిల్చిన నెంత పొడవగునో యంత (౧౨౦ అంగుళములు) పురుషమానము*. ఇట్టి పురుషప్రమాణముపొడవును పురుషప్రమాణము వెడల్పునుగల క్షేత్రము చతురస్ర పురుషము, చదరపు పురుషము. చిన్న యజ్ఞకుండము 24 చదరపు పురుషములుండవలెను. ఇది చతురస్రముగ నుండవలెను. ఇంతయె వైశాల్యముగల ముక్కోణపు కుండమును, చక్రాకారపు కుండమును గట్టవలెను. తరువాత నీ వైశాల్యముకంటె నొక్కొక్క చదరపు పురుషము వైశాల్యమధికముగ నుండువాని నిర్మింపవలెను. రెండు కుండముల వైశాల్యములు కలిసి మొత్తమగునో యంతదియు, ఒక దానిలోనుండి యొకటితీసి వేసిన నెంత యగునో యంతదియు నగు వేఱుకుండముల నిర్మింపవలెను. వైశాల్యము హెచ్చింపక తగ్గింపక సమచతురస్రము (Square) ను దీర్ఘచతురస్రముగను (Oblong) వృత్తముగను (Circle) మార్చవలెను. ఇట్టి వానికన్నిటికిని శుల్వసూత్రకారుఁడు సూక్ష్మనియమములను జెప్పియున్నాఁడు. కావున భూమి వైశాల్యముఁ గనుఁగొను విద్య వారికిఁ దెలియుననుట స్పష్టము. ఈ

*పురాతన కాలపు భూమికొలత*

* "అర్థాష్టమ పురుషః ప్రథమోఽగ్నిః" అన్న ౨-వ అధ్యాయమందలి ౧-వ సూత్రముమీఁద నిట్లు వృత్తి వ్రాయఁబడియున్నది. 'పురుషశబ్దేన పంచారత్నినా వింశత్యధిక శతాంగులేన వేణునా పరిమితం క్షేత్రముచ్యతే తత్ర చతుర్దశసహస్రాణి చత్వారిశతాన్యంగులయః పురుషే సంతి' [కాశీ విద్యాసుధానిధి, ౧౮౭౪ ఆగస్టు నెల సంచికలోని శుల్వసూత్రములు.]

సూత్రములు క్రి. పూ. ౪-౬. శతాబ్దముల కాలమునాఁటివి.

చంద్రగుప్త చక్రవర్తికాలమునందుఁ (క్రి. పూ. ౩౨౧-౨౯౭) పొలములు కొల్చు నాచారమున్నట్టు స్పష్టముగఁ గానవచ్చు చున్నది. కౌటిల్యార్థశాస్త్రము నందు భూమి కొలత లీయఁబడినవి. దేశమానములలోఁ బొడుగు మానములును, చదరపు మానములును జెప్పఁబడినవి.*

౧౦-వ అంగుళములు ౧ గార్హపత్యధనుస్సు (గజముబద్ద). గృహపతి యనువాఁడునద్దలగి. దీనినితో ప్రాలఁగొలుచుటకును, ప్రాకారములు కొలుచుటకును, ఉపయోగించుచుండిరి. అగ్ని చితులు కట్టుటలోఁ బౌరుషమనుమానమును నుపయోగించుచుండిరి. ఆఱు కంసములు పొడుగు గల దండము బ్రాహ్మణుల కిచ్చిన భూములు కొల్చుటలో నుపయోగింపఁబడెను. పదిదండములైన నొక్క రజ్జువు, రెండు రజ్జువు లైన నొక్క పరిదేశము, త్రిరజ్జుకమైన నొక నివర్తనము. పరిదేశనివర్తనములు క్షేత్ర (చదరపు) మానము.

నీటి పారుదలకు సంబంధించిన యధికారులె భూములు కొల్చుచుండిరని మెగస్థనిస్ వ్రాసియున్నాఁడు.[1] ౯-వ శతాబ్దమువాఁడయిన మహావీరాచార్యుఁడతని సారసంగ్రహ గణితములో దేశమానము లిచ్చుటయెగాక క్షేత్రవ్యవహారమని యొక్క అధ్యాయమువ్రాసి యున్నాఁడు. అందు త్రిభుజ చతుర్భుజవృత్తాది క్షేత్రముల చదరపు కొలత కనుఁగొను స్థూల (Approximate) సూక్ష్మ (Exct) పద్ధతులు చెప్పియున్నాఁడు. పండ్రెండవశతాబ్దము వాఁడగు భాస్కరాచార్యుఁడు లీలావతి గణితమునందు 'నివర్తనము'ను చదరపుమానమిచ్చి[2] క్షేత్ర వ్యవహారాధ్యాయమందు పొలముల విస్తీర్ణమును గనుఁగొను విధముల వివరముగఁ దెల్పెను. ఈ 'నివర్తనము' అనునది రమారమి రెండు ఎకరములగును. ఈ మానము చంద్రగుప్తుని కాలమునుండియు వచ్చుచున్నట్టున్నది.[3] మితాక్షరలోఁ[4] గూడ భూవివాదము వచ్చినప్పుడు 'ఒకఁడు నివర్తనముకంటెఁ బెద్దదియనును; ఒకఁడు నివర్తనముకంటెఁ జిన్నదియనును' అని చెప్పఁబడినది.

* "గార్హపత్య మష్టశతాంగులంధనుః ప్రథిపాకారమానం, పౌరుషంచ అగ్నిచిత్యానాం, షట్కంసో దండో బ్రహ్మదేయాతిథ్యమానమ్. దశదండోరజ్జుః ద్విరజ్జుకః పరిదేశః త్రిరజ్జుకం నివర్తనం, ఏకతో ద్విదండాధికోబాహుః". [కౌటిలీయం అర్థశాస్త్రమ్, Bibliotheca Sanskrita, No. 37, pages 106-107 Mahadeva Sastry's edition.]

1. Vincent Smith's *Early* History of India, 3rd Edition, p. 132.

2. "తథాకరాణాం దశకేనవంశః నివర్తనంవింశతి వంశసంఖ్యాం క్షేత్రం చతుర్భిశ్చ భుజైర్నిబద్ధమ్" [౧-వ అధ్యాయము]. పదియుకరములకు (మూరలు) నొకవంశము (వెదురు), ఇరువది వంశములు పొడుగు, ఇరువది వంశముల వెడల్పుగల చదరము నివర్తనము. అది నాలుగు భుజలచే నావరింపఁబడి యుండును.

3. చూఁడు, అర్థశాస్త్రము, ఇదివఱకును దాహరింపఁబడినభాగము.

4. వ్యవహారకాండము, భూవాదప్రకరణము.

క్రీ. శ. ౬౫౨-లోనిదియగు పశ్చిమ చాళుక్యరాజుయొక్క-తామ్రశాసనములో రెండు వందల నివర్తనముల భూమి దాన మిచ్చినట్లు చెప్పఁబడియున్నది.[1] కావున, మహమ్మదీయుల కాలములో 'బీగా' మానమును, ఇంగ్లీషు ప్రభుత్వకాలమున 'ఎకరము' అనుమానమును బాహాటముగ వాడుకలోనున్నట్లు హిందూ రాజుల ప్రభుత్వకాలమున మిక్కిలి పురాతన కాలమునుండియు 'నివర్తన' మను క్షేత్రమానము వాడుకలో నుండెనని స్పష్టమగుచున్నది.

పూర్వము సాధారణముగా భూములను వెదచల్లి పంటపండించు వాడుకయె యున్నట్లును, ఆకుపోసి యూడ్చునాచారము లేనట్లును గన్పించుచున్నది. దీనింబట్టి యెన్నివిత్తనములు చల్లుటకు తగిన భూమియో ఆవిత్తనముల కొలతనుబట్టి భూమి కొలత యేర్పడినట్లు తోఁచుచున్నది. అనఁగా కుంచెడువిత్తులు వెదజల్లుటకుఁ జాలిన భూమి కుంచె డనియు, తూమెడు విత్తులు విత్తుభూమి తూమె డనియు, ఏదుము విత్తులు చల్లఁబడు భూమి యేదుమనియు, పందుమువిత్తులు చల్లఁబడు భూమి పందు మనియు, పుట్టెడు విత్తులు చల్లఁబడు భూమి పుట్టెడనియు పిలువఁబడెను. పుట్టి యనగా ౮౦ కుంచములు పరిమాణము గలదియే యిచట గ్రహింపవలెను. రాజు పండిన పంటలో భాగము పుచ్చుకొనుటయే గాని మొదట మొదట భూమి పరిమాణము ననుసరించి పన్ను పుచ్చుకొను వాడుకయున్నట్టు కానరాదు. మిక్కిలి పురాతనకాలమందు వెదచల్లువిత్తనములమానము పేరిటనే విత్తనములు చల్లుభూమిని గూడ వాడుచునచ్చిరి. పాణినీయాష్టాధ్యాయి సూత్రములలో "తస్యవాపః" (అ౫పా౧సూ౪౫) వి త్తెడు విత్తనములనుబట్టి భూమికి పేరు వచ్చువిషయమే. చెప్పఁబడియున్నది. ధాన్యపరిమాణ వాచిపదములమీద "ఠక్" అను తద్ధిత ప్రత్యయము వాపార్థమందు, అనఁగా వెదచల్లఁబడు అనునర్థమందు విధింపఁబడినది. దానిచే కాడవికీ, ప్రాస్థికీ, ద్రౌణికీ, ఖారికీ, అనిక్షేత్ర భ క్తికిఁ (క్షేత్ర పరిమాణమునకు) పేళ్లేర్పడినవి. మఱియు నష్టాధ్యాయి "తదస్మిన్ వృధ్యాయ శుల్కోపదాదీయతే" (అ ౫ పా ౧ సూ ౪౭) సూత్రముంబట్టి "ఇంతరాజ భాగమీయఁబడు" ననునర్థమందుఁ బ్రత్యయము విధింపఁ బడుచున్నది. దానింబట్టి పంచకీ, శతికీ, అనిపేర్లు భూమికి వచ్చినవి. కావునఁ బూర్వ మీయఁబడు రాజభాగముంబట్టియు, చల్లబడు విత్తనములంబట్టియు, భూమికి మాన మేర్పడినట్లు కానవచ్చుచున్నది. మొదట ధాన్యమానము ననుసరించి భూమాన మేర్పడినను, భూమి బలమునననుసరించి యేకపరిమాణముగల వేఱు వేఱు పొలములలో ధాన్యము హెచ్చు తగ్గుగ విత్తుట సంభవించుటచే నామాన మజ్ఞజను

1. Epigraphical Report 1915—1916, No. 7th in the List of Copper-plates examined during 1915—1916.

లలోఁ దప్ప యెక్కువ వ్యాప్తిఁ జెందలేదు. వ్యవహారమునకుఁ జిక్కు వచ్చును. కావున నీధాన్య మానములు క్షేత్ర మానములుగాఁ ద్వరలోనే మార్చఁబడును. అనఁగా నింత పొడుగు ఇంత వెడల్పుగల భూమి పుట్టెడు అని మానమేర్పడును. క్రీ. శ. ౧౧-వ శతాబ్దము నంఁ దెనుఁగు దేశమునందు భూమికొలత బాగుగఁ దెలిసియుండె ననియు, 'పుట్టెడు' 'తూమెడు' భూమి అను మానములు క్షేత్ర మానములు (area measures)గా మార్పఁబడి యుండెననియు, పావులూరి మల్లనచే రచింపఁ బడిన* సారసంగ్రహగణితమందలి యీక్రింది పద్యముల వలనఁ దేటపడఁగలదు.

మఱియు వ్యవసాయము చేయఁబడు భూములు ఇన్ని 'కత్తులు' అని వ్యవహరింపఁ బడుట కలదు. పూర్వమందడవిగా నున్నప్పు డొక కత్తితో, పోడుకొట్టి యొకదినములో నొకమనుష్యుఁడు సేద్యమునకుదీసికొని రాదగి

* క. మానుగ నిడుపు వెడల్పును
గానొకకోల * కుంటఁగదియ గానగు పుట్టెం
డేనూఱుకుంట, లిరువది
యేనొకతూమెడు, తదర్ధమిరసనఁబరగుఁన్.
క. కానులు మొదలుగచిన్నము
మానము కొలయగును కుంటమానము, మఱిభూ
మానము, ధాన్యముతోటి స
మానముగావ్యవహరింత్రు మహినాంధ్రజనుల్.
[౧-వ ఆశ్వా.

'కోల' యనఁగా 'దండము', నాలుగు 'హస్తములు' (మూరలు) అయిననొక 'దండము' అని యీ గ్రంథమునందె చెప్పఁబడియున్నది.

నంతభూమి యొకకత్తిపరిమాణము కలదియని ప్రమాణ మేర్పడినది.

మహమ్మదీయ కాలపు కొలతలు

అక్బరుచక్రవర్తి కాలమున భూమి యొక్క మానమేదియనఁగా 33 ఇంగ్లీషు చదరపు టంగుళములు ౧ గాసు, ౬౦ గాసులు ౧ షాజిహానీ "బిఘా", ౧ బిఘా=30౭౬ చతురపుగజము=౫౭ ($\frac{౯}{౮}$) ఎకరము.

బంగాళా రాజధానిలో వాడుకలోనున్న బిఘా-౧౬౦౦ చతురపు గజములు 1-1 ($\frac{1}{3}$) ఎకరము.

బిఘా ౨౦ బిస్వాలక్రిందను, బిస్వా ౨౦ బిస్వాన్సీలక్రిందను,విభజింపఁబడెను. బంగాళా రాజధానిలో బిస్వా, బిస్వాన్సీలను, కొట్టా లేక కర్టాలేక గండాఅనివాడుదురు. పంజాబు దేశములో భూమికొలత "ఘుమాన్వాల" ను బట్టి వాడఁబడును. హిందూస్థానిలో "ఘుమానా" అనఁగాఁ దిరుగుదల యనియర్థము. అనఁగా నొక నాఁగలి తిరిగిన ప్రదేశము, ఒక "ఘుమావు" అనఁబడును. ఇట్టి ఘుమావు ౮ ఖనాలక్రిందను,ఖనాలు ౨౦ మార్గక్రిందను విభజింపఁబడును. ఈ ఘుమావొక్కొక ప్రదేశమున నొక్కొకపరిమాణముకలది. ఒక యకరము ప్రదేశమఁుండుటరుదు. ఇది సాధారణముగా $\frac{౩}{౪}$ యకరముండును. ప్రస్తుతము ౨ యకరములు=ఒక ఏదుము, ౨ ఏదుములు పందుము,౨ పందుములు ఒకపుట్టెడు,అనియు వ్యవహరింపఁబడుచున్నది.

మఱియు దక్షిణాది జిల్లాలలో "కాణీ" యనునొక భూపరిమాణము కలదు. "కాన్" అనఁగా నరవములో చూచుట అనియర్థము. కంటిచేజూడఁబడి ఆనవాలుపట్టఁ దగినదని కాణీశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము. ఈ పదము కన్నడ ద్రవిడ భాషల యందున్నది.

౧౦౦ కూజీలు = ౧ కాణీ= ౫౭, ౬౦౦ చతురపు టడుగులు - ౧.౩౨౨ ఎకరములు. సేద్యమగుభూమి కాణి నూరుకూజీల క్రిందను ఇండ్లుకట్టుకొనుట కుపయోగించునేల కాణి, ఇరువదినాల్గు మున్నీలులేక ౬౦×౪౦ చతురపుటడుగులుగల స్థలముల క్రింద వాడఁబడుచున్నది. మధుర తిరుచునాపల్లి జిల్లాలలోఁ గొన్ని భాగములలో కాణి యిరువదొక్క చతురపు టడుగులుగల నూఱు కూజీలు లేక ౪౪౧౦౦ చతురపు టడుగులు, లేక ౧.౦౧ యకరము పరిమితిగల నేలకు వాడఁబడుచున్నది. కొన్నిచోట్ల కాణి ౫౭౬౦ చతురపు అడ్డీలుగా నెంచఁబడుచున్నది.

అల్లొంచఁబడి నప్పుడు యకరము కంటెఁ దక్కువపరిమితిగల నేల యగును. ౧౮౦౨-వ సంవత్సరమునకుఁ బూర్వమున్న భూమికొలత.

౧ కోలు లేక కట్టు=౨౪ అడుగులు.

౧ చతురపుకోలు=౧ కూజీలేక గుంట= ౫౭౬ చతురపు అడుగులు.

౧౦౦ కూజీలు లేక గుంటలు = ౧ కాణీ=౫౭౬౦౦ చతురపుటడుగులు, లేక ౧.౩౨౨౩౧౪ యకరములు.

రివిన్యూలెక్కలలో కాణి ౧౬ భాగములుగా (అణాలక్రింద) ను వ్యవహరింపఁ బడుచుండెను.

౧ అణా = ౩౬౦౦ చతురపుటడుగులు.

౧ చిరా = ౨౫౦౦ చతురపు టడుగులు.

కాళహస్తి జమీాందారీలో భూమిని గొఱ్ఱులక్రిందఁగొలిచి,ఆప్రమాణముతో వాడుచుండిరి.

౧ గొఱ్ఱు=౩౫ గుంటలు.

౧ గుంట = ౯౪ దేశవాళీ చతురపు టడుగులు

సూరపూడి మొదలగు గ్రామములలో:—

౧ గొఱ్ఱు = ౪౦ గుంటలు.

౧ గుంట = ౭౨ దేశవాళీ చతురపు టడుగులు.

పాతరవేడు మొదలయిన గ్రామములలో :—

౧ గొఱ్ఱు=౫౬ గుంటలు.

౧ గుంట = ౬౪ దేశవాళీ చతురపు టడుగులు.

సూరంపూడి మొదలగు గ్రామములలో:—

౧ గొఱ్ఱు = ౨౫ గుంటలు

౧ గుంట = ౪౮ దేశవాళీ చతురపు టడుగులు

దేశవాళీ అడుగు, ఆయాప్రదేశముల యందున్న యొక పొడుగుపాటి మనుష్యుని పాద ప్రమాణముఁబట్టి యేర్పఱుచుకోఁబడినందున దాని కిన్ని భేదములు తటస్థించినవి. ఇవి వరుసగా ౭౯.౧, ౬౬, ౬౦.౧, ౪౨ ఇంగ్లీషు అడు

గులకు సరిపడి యుండును. దేశవాళీ అడుగు వరుసగా ౧౧.౩౨, ౧౧, ౧౧.౧౪, ౧౦.౫ ఇంగ్లీషు అంగుళముల ప్రమాణము గలిగి యున్నది. దీనిని బట్టి పైనఁజెప్పిన ప్రదేశముల యందలి గొఱ్ఱులు వరుసగా ౫, ౪, ౪.౬౬, ౧.౦౧ యకరముల ప్రమాణము గలిగి యుండును.

కార్వేటి నరగము జమీందారీలో గూంట అనఁగా ౬౦ అడుగులుగల గొలుసుపొడుగును గొలుసు వెడల్పుగల మెరక నేల యనియు, ౫౬ దేశవాళీఅడుగుల పొడుగుగల ౧ గొలుసు పొడుగును ౧ గొలుసు వెడల్పునుగల పల్లపునేల ౧ గుంటయనియు వ్యవహరింపఁ బడుచుండెను. కాఁబట్టి చెంగల్పట్టునందువలె దేశవాళీ అడుగు ౧౦.౨౮౫౭ అంగుళములని భావించినయెడల మెరక నేల గూంట .౦౬౦౭ యకరమును పల్లపునేలగూంట .౫౩ ఎకరము పరిమితిగలిగియుండును. కంగుంది జమీందారీలో వెదజల్లఁబడు విత్తనములం బట్టి భూమికొలత యేర్పడినందున ౬౩ మద్రాసు పళ్ల ధాన్యము చల్లఁబడుపల్లపునేల ౧ కాణియని ౧౫౺ మద్రాసు పళ్ళధాన్యము చల్లఁబడు మెరక నేల "కాణి" యనియు వాడఁబడుచుండెను.

౫౹ మూరలు ౯౹ యింగ్లీషు అడుగులకు సరిపడియుండును. దీనినిఁబట్టి ౧ మూర ౨౦.౭౨౭౩ అంగుళములు లేక ౧.౭౨౭౩ అడుగు లగును. ఈ అడుగు ప్రక్కపుటలో వ్రాయఁబడిన ఫారములోని నెం. I. యొక్క కొలత కుపయోగింపఁబడినది.

తోటభూమి విషయమైన కొలతయందు ౪౹ మూరలు ౭ అడుగుల ౮ అంగుళములు లేక ౧ మూర – ౨౦.౪౪౪ అంగుళములు. ఈకొలత నెం. II. బాపతుకొలత.

బెజవాడలో ౪౺ మూరలు ౮ అడుగుల ౨ అంగుళములు లేక ౧ మూర-౨౦.౬౨౧ అంగుళములగును. నెం. III. బాపతుకొలత.

భూమి కొలత కత్తులను బట్టి గూడ సాధారణముగా వ్యవహరింపఁ బడుచుండును. కత్తి ఒకచోట ౩౨ కుంటలుగను నింకొకచోట ౩౫ కుంటలుగను మఱొకచోట ౩౦ కుంటలుగను వ్యవహరింపఁబడుటచే ప్రక్కఁ గనపఱచిన పట్టికలో నీమూఁడు పరిమితులుగూడ నుపయోగింపఁబడినవి. మఱియు ౧ కుంట ౧౬ వీసములుగను, ౧ వీసము ౪ కఱ్ఱలపొడుగును ౪ కఱ్ఱలు వెడల్పును గల ప్రదేశముగను వ్యవహరింపఁబడును. ఈకఱ్ఱ ౫౹, ౫, ౪౺, ౪౹ మూరలప్రమాణము కలదిగా నొక్కొక్కచోట వ్యవహరింపఁబడుచుండును. ఈనాలుగు కొలతలుగల కఱ్ఱలనుబట్టి క్రమముగా ౨౩౧౦౪, ౧౯౦౯౦, ౧౭౦౬౮, ౧౫౦౪౭ చదరపుటడుగులు ఒక్కొక్కకుంట ప్రమాణమని తేలుచున్నది.

ఇందు కుదాహరణముగా:-

౪ కఱ్ఱలు=౫ మూరలు=౪×౮.౬౩౬= ౩౪.౫ అడుగులు ౩ (౩౪.౫)=౨.౧౯౦౯౦ చతురపుటడుగుల నేలయగుచుండును.

రాజమహేంద్ర ప్రాంతములలో

౧ కత్తి=3౨కుంటలు. ౧కుంట=౮౦ మూరలపొడవు, అంతేవెడల్పుకలది. మూర౧౯. ౮ అంగుళములు పొడవు కలది. బందరులో మూర౨౦.౭౨౭3 అంగుళముల పొడవు గలది. కాబట్టి రాజమహేంద్రవరప్రాంతముల యందు వాడబడు కత్తి ౧౨.౮ యకరములు కలది. ఇది బందరు కత్తి.

కర్నూలు జిల్లా ౧౮3౯- సంవత్సరమున నాంగ్లేయుల స్వాధీనములోకి రాక పూర్వము ఆజిల్లాలో "కూడు" అను ప్రమాణము భూమి కొలతకు వాడుకలో నుండెను. ఒకకూడు ధాన్యము విత్తనములుగాఁ జల్లఁబడు నేల కూడు పరిమాణము కలదిగా వ్యవహరింపఁబడు చుండినది. ఈ కూడు 3 యకరములు మొదలు 3౻ యకరములవరకు వైశాల్యము కల్గి యుండెను. మఱియు పైనిజెప్పఁబడిన గొఱ్ఱుకొలత గూడ నీ జిల్లాలో వాడుకగానుండెను. ఉదయము మొదలు రాత్రివరకు నొకకాశిమెల్లచే లాగఁబడు నొక గొఱ్ఱుచే విత్తనములు నాటఁబడు నేల యొకగొఱ్ఱుప్రమాణము కలది. తరువాత ౧౮౮౧-వ సంవత్సరములో సాగుబడి భూములు 33 అంగుళములు పొడవుగల గొలుసుచే గొలవఁబడి యకరములుగను, గుంటలుగను నిర్ణయింపఁబడుచువచ్చెను.

మధురజిల్లాలోని రామనాథపురము, శివగంగ మొదలగు జమీందారీలలో భూమిని బే(bhey) ల క్రింద గూలీ (gooly) ల క్రిందను తచ్చకొల (Tatchakola) ల క్రిందను కురుకముల క్రిందను బౌహం (Bouham) ల క్రిందను గూంట (Goonta)ల క్రిందను కొలత ప్రమాణము నేర్పఱచుకొని భూపరిమాణము తెలుపుకొను చుండిరి. ఉత్తర మళయాళములో మెక్లిమోడ్, మెడగలి, యను ప్రమాణములు వాడుకలో నుండిరి. ఏఁబది మైను. మొదలు డెబ్బదిరెండు మెక్లి మోడు మెడగలి = ఒక యకరమగును. కాని యావరేజీని అరవైమెడగలీలు ఒక యకరముగ భావించిరి. దక్షిణ మళయాళమున "పఱ" అను భూమికొలత వాడుకలో నున్నది. ఎకరమునకు నిట్టి పఱలు తొమ్మిది వంతున లెక్క చూడఁబడు చుండెను.

నెల్లూరు జిల్లాలోని భూమికొలత:

33 × 33 అడుగులు=చదరపు గొలుసు.

౧ చదరపుగొలుసు=౧౦౮౯ చదరపుటడుగులు లేక గూంట. ౪౦ గూంటలు=౪3౫౬౦ చదరపుటడుగులు=౧ ఎకరము.

పూర్వరాజుల కాలమందీ జిల్లాలో ౫.౨౻ ఇంగ్లీషు అడుగులకు సమానమైన 3౨ మూరల కఱ్ఱతో తోటభూములు కొలువఁబడు చుండెను. దీనిని బట్టి మూర ౧౯.౬౮ అంగుళముల పొడవగును. ఇట్లు ఒక కఱ్ఱపొడవును ఒక కఱ్ఱవెడల్పును=౨౭౫౬౯ చదరపు టడుగులు=ఒక గూంట= .౦౬33 ఎకరము; ౫౦

గూంటలు=౧ గూర్తు=౧౩౭౮౧౨౺ చదరపు టడుగులు=3.౧౬౩౭ ఎకరములు; గూర్తు ౨౺తూముల విత్తనములు చల్లుటకు తగు ప్రదేశమని సాధారణముగా వాడఁబడు చుండును. తూము=౧౬ పక్కా శేరుల బియ్యము వచ్చు ధాన్యము. తోట లేక జరీబు భూములు ౨౧ మూర లేక ౩౮$\frac{1}{2}$ ఇంగ్లీషు అడుగుల పొడవు గల కఱ్ఱతో కొలవఁ బడు చుండెను. ఇట్లు ఒక కఱ్ఱపొడవును ఒక కఱ్ఱ వెడల్పును కలది=౧౧౮౭ చదరపుటడుగులు=౧గూంట=. ౦౨౭ ౨౯ఎకరములు; ౧౬గూంటలు=౧గూర్తు లేక ౧.౩౭౬౩చదరపుటడుగులు, లేక 3.౧౬౧ఎకరములు. గుంటూరు సరిహద్దున నున్న వంగవోలు తాలుకాలో కూటచేల్ అను పరిమాణముండెను. ౧ కూటచేలు = ౮ గూర్తులు లేక దాదాపు ౨౯ ఎకరముల నేల. తంజావూరు జిల్లాలో మహాలు, వేలీలు, కానీలు, తిర్నవ్లేల్ జిల్లాలో పూడ్డీలు, మెరకాలు, కుడూచీలు, అను పరిమాణములును, సేలంజిల్లాలో నొక్కొక్క ప్రదేశమున నొక్కొక్క విధమగు పైని జెప్పఁబడిన భూమికొలతలును నుండెను. విశాఖపట్టణము జిల్లాలో నొక్కొక్క తాలూకాలో నొక్కొక్క భూమికొలత వాడుకలో నుండెను.

పాలకొండ గోలకొండ తాలూకాలలోను, జమీందారుల యెస్టేట్లలోను భూమికిఉన్న కొలత:—

౮౪౩చదరపుటడుగులు=౧కుంచము. ౨౦ కుంచములు= ౧ పుట్టి=౧౭౬౮ చదరపుటడుగులు. ౩౦ పుట్లు= ౧ గరిసె=౫౩౦౪౦చదరపుటడుగులు=౧. ౨౧౭౩౮ ఎకరములు.

తక్కిన ప్రదేశములలో

౩౩౩౧౫చదరపుటడుగులు=౧పఱ్ఱ=.౦౭౦౬౮ ఎకరములు. ౧౬పఱ్ఱలు=౧వీసము లేక ౧గరిసె. ౧౬ వీసములు=౧కత్తి అనఁగ ౧౯.౮౭౮౨ ఎకరములు. గరిశెడు నేల అనఁగ గరిశెడు ధాన్యముపండునది యని యర్థము.

విశాఖ పట్టణముగరిశె ౧౮౦౦ సేర్లుకలది అయినను గంజాంజిల్లాలోని గరిశెడు నేలలో విశాఖపట్టణము జిల్లాలోని గరిశెడునేల సగమేయుండును ఇట్లు భూమికొలత ఒక్కొక్క జిల్లాలో నొక్కొక్క ప్రదేశమున నొక్కొక్క విధమయినది గానుండెను. కాని యిప్పుడు సాధారణముగ ఎకరముల పరిమితి వాడుకలోనికిఁదేబడి అంతటను ఎకరముల పరిమితియే వాడఁబడుచున్నది. ఎకరము=౪౮౪౦ చదరపు గజముల నేల.

కివిన్యూ వ్యవహార పద్ధతి. కివిన్యూ వ్యవహార విషయమై గ్రామము ప్రధానాంశముగా గ్రహింపవలయునని యిదివరకే చెప్పఁబడియున్నది. గ్రామము యొక్క అమరకపుపద్ధతులు, భూవిషయమయినట్టియు శిస్తువిషయమైనట్టియు లెక్కలను తయారుచేయుటకును, గ్రామముమీద చెల్లవలసిన శిస్తు

వసూలు చేయఁబడుటకును, గ్రామకరణము, గ్రామమునసబు గ్రామమణేగారులను గ్రామోద్యోగస్థులు కలరు. గ్రామమునసబునకుఁ గొంతవరకు సివిల్ మేజస్ట్రీటు అధికారము లుకూడ కలవు. ఇట్టి గ్రామములను కొన్నిఁటినిఁ జేర్చి ఫిర్కా లేక రివిన్యూ రేంజిగాఁ జేయఁబడి అందలి గ్రామములయొక్క భూముల అమరకము, విమదలలు, దరఖాస్తులు, రిమిషన్ దరఖాస్తులు మొదలగు వానిని తనిఖీచేయుటకు రివిన్యూ యినస్పెక్టరను నుద్యోగస్థుఁడు నియమింపఁబడి యుండును. ఇట్టి ఫిర్కాలు రెండుమూడు కలసిఒకతాలూకాగాఁ* జేయఁబడి దానినితహశ్శీల్దారు అనునుద్యోగస్థుని క్రిందనుంచెదరు. ఇట్టి తాలూకాలు రెండుగా నిమూఁడుగాని కలపి యొక్కడివిజన్ గాఁ జేయఁబడి దానిని నొక డివిజనల్ ఆఫీసర్ క్రింద నుంచుదురు. ఇట్టి డివిజనల్ ఆఫీసర్లుగల కొన్ని డివిజనులు కలిపి జిల్లాగాఁ జేయఁబడి అందున కధికారిగా నొక కలెక్టరు నియమింపఁబడును. ఇట్టిజిల్లాలు కొన్నిఁటినిఁ జేర్చియొక రాజధానిగాఁ జేసి జిల్లాకలెక్టర్లందరిపై కొందరుమెంబర్లతోఁ గూడిన రివిన్యూ బోర్డుఅను కార్యస్థాన ముండును. అది పెద్దప్రాంతములలో (మేజర్ ప్రావిన్సులో) నాలోచనసంఘముతోఁగూడిన గవర్నరు క్రిందను, చిన్నప్రాంతములలో (మైనరు ప్రావిన్సులలో) లెఫ్టినెంటు గొర్నరు క్రిందఁగాని ఛీప్ కమీషనరు అను నధికారి క్రిందగాని నుంచబడును. కొన్ని రాజధానులలో రివిన్యూబోర్డునకు మారుగ నాలుగైదు జిల్లాలకొక కమీషనరు నియమింపఁబడిఅతండాయాజిల్లాల రివిన్యూ మొదలగు శిస్తులవ్యవహారమును పరిశీలించును. భూములపై శిస్తు చెల్లింపఁబడు చున్నంత వఱకు జిరాయితీ భూములను పట్టాదార్లు మొదలగు భూస్వాముల యొద్దనుంచిగాని, ఈనాము భూములను ఆయా ఈనాము దార్లయొద్దనుంచిగాని, సర్కారు పనుల నిమిత్తము రైలు రోడ్లు, మొదలగు దేశోపయోగకరమగు కార్యములకుఁ దీసికొనవలసి వచ్చినప్పుడు ప్రభుత్వమువారు వానిని దీసికొని వానికి మఱియొకచోట వానికించుమించుగా సరియగుభూమినిచ్చుచుండెడివారు. ఇప్పుడట్టి భూములను దీసికొని వాని ఖరీదులు కట్టి సొమ్ము ఇచ్చుచున్నారు. ఇట్లు దొరతనమువారు భూములను భూస్వామి సమ్మతములేక పోయినను దీసికొనుటకు "ల్యాండు అక్విజిషన్ ఆక్టు" (Land Acquisition Act) వలనఅధికారమునుగలిగించుకొనియున్నారు.

ఈఆక్టును బట్టి భూములనేగాక అందుండు చెట్లు మొదలగు వానిని, ఇండ్లు మొదలగు కట్టడములను గూడ వాటికి న్యాయముగానియ్యదగ్గ సొమ్మిచ్చి దీసికొని ఇష్టము వచ్చినట్లుపయోగ పఱచు కొనుటకు దొరతనము వారికి హక్కుకలదు. జమీందారీ గ్రామము

* ఉత్తరదేశమునందు "తాలూకా"ను "తహసీల్" అందురు. దానికి నధికారి "తహసిల్ దారు".

లోని భూములు ప్రజల యుపయోగము కొఱకు చేయఁబడు పనులనిమిత్తము గావలసి వచ్చినప్పుడు అట్టి జనోపయోగకరములగు పనులు చేయించువారు సర్కారు వారైనను జమీందారైనను ఈ ఆక్టుకు బట్టి భూములను సొమ్మిచ్చి దీసికొనుటకు అవకాశ మేర్పఱుపఁబడినది.

BIBLIOGRAPHY.


Baden Powell's *Land Revenue in British India*; *Land systems in British India* 3 volumes; *Indian Village Communities*;

Sir Henry S. Mayne's *Village Communities in the East and West*;

Tagore Law *lectures on Land Tenures*;

Dr. Mclean's *Manual of Administration Vols.* 1, 2 *and* 3, *Vyavahara Mayukha Yagnavalka*; *Smruti* by Rao Saheb V. N Mandalik;

Turner's *Minute on the Draft Bill relating to Land tenures of Malabar*;

Huddle Stone's *Collection of papers on Mirasi Rights*;

*Moore's Malabar Law and Custom*;

*Selections from the minutes of* Sir Thomas Munro; Sir Alexander Arbutnut;

*Standing Orders of the Board of Revenue*;

DewanBahadur S. Srinivasa RagavaAyangar *Progress of the Madras Presidency during the last* 40 *years*

Lieutenant Colonel Marks Wilks *History of Mysore*;

Wilson's *Glossory*;

Baden Powell's *Forest Law*;

*Ain-i-Akbari*;

*Fifth Report of the Select Committee on the affairs of the East India Company Vols* 1. *and* 2;

Harrington's *Analysis*;

*Report of the Rent Law Commission of Bengal*;

District Manuals;

Soundara Raja Aiyangar, *Tenures in the Madras Presidency*

*Settlement Manual*;

Elphinstone's *History of India*;

Sir W. W. Hunter's *Imperial Gazetteer Manusmruti*; *Report of the Inam Commission*; *Forest Acts*; *Mining rules*

*Circuit committee's reports and accounts*

Seton Karr's *Cornwallis* (Rulers of India series.)

*Land Revenue Administration in the Central Provinces.)*

*Land Revenue Policy published by the Government of India.*

R. C. Dutt *Economic History of India.*


(కొ. రా. వెం.కృ.)

**అమరచింత సంస్థానము.** దీనినే ఆత్మకూరు సంస్థాన మనియెదరు. ఇయ్యది నైజాం హైదరాబాదు రాజ్యమునందు రాయచూరు జిల్లాలో నున్నది. ఇందు ౬౯ గ్రామములు కలవు. విస్తీర్ణము ౧౯౦ చదరపు మైళ్లు. జనసంఖ్య 3౮. ౪౭. ఆదాయము రు ౧౮౦౦౦౦. నైజాము వారికి చెల్లింపవలసిన కప్పము రు. ౬. 3౬-3లు. ఆత్మకూరు అనునది సంస్థానాధీశ్వరుం డుండు స్థలము. ఇచ్చట మంచికోట గలదు. కృష్ణానది ఈ సంస్థానమునకు దక్షిణముగాఁ బ్రవహించును. ఆనదికి దక్షిణమున అమరచింతకు సరిహద్దున గద్వాల్ సంస్థానము గలదు. ఇచ్చట మిక్కిలి సన్నవి, సొగసైనవి మల్లు వస్త్రములు రుమాళ్లు, ధోవతులు తలగుడ్డలు నేయుదురు. వానికి పట్టంచును జరీయంచును ఉందును.

**అమరసింగ్.** ౧ గూర్ఖాజాతి మహావీరుఁడు; సేనాపతి. ౧౮౧౫లో నేపాలముగూర్ఖావారికిని ఇంగ్లీషు వారికిని యుద్ధముజరిగినప్పుడు మిక్కిలి పౌరుషముతోను దేశభక్తితోను పోరాడెను. కాని చివరకు నోడిపోయెను. అతనికి అమీరసింగుటప్పా అనియు పేరు కలదు.

౨ ప్రతాపుని కుమారుఁడు. ఇతనికిఅభయసింహుఁడని నామాంతరము (చూఁడుఅభయసింహుఁడు.)

3 పటియాలరాజు. సరదార్ సింహుని కుమారుఁడు.

౪ రాజపుత్రవీరుఁడు; రాటోడ్ వంశజుఁడు. గజసింహుని కుమారుఁడు. సాహసుఁడు. ఈతఁడు ౧౬౪౪ లో షాహజహాన్ చక్రవర్తి యెదుట సలాబత్ ఖాన్ మీర్ బక్షీ అను వానిని నరికివేసెను. అంత చక్రవర్తి ఆజ్ఞను సైన్యములు వెంబడింప నాతఁడు ఆగ్రాద్వారమునొద్ద వారితో ఘోరముగ పోరాడి వీరస్వర్గము నొందెను.

౫ కాశీనివాసుఁడు. కవి. ఇతనికి కవిత్వసంబంధమై కుష్గో అన్న పేరు గలదు. ఇతఁడు కోబల్ జిల్లాలో దొరతనము వారి యుద్యోగము నందుండెను. ఇతఁడుఅకబర్ రాజమందిరమును తాజ్ మహాలును వర్ణించుచు చరిత్రవ్రాసెను. మరియుదానిష్ అను గ్రంథమును పద్యకావ్యముగ రచించెను.

**అమరకోశము.** అమరసింహునిచే రచియింపఁబడిన సంస్కృత శబ్దసంగ్రహము. దీనికి నామలింగానుశాసనమని పేరు. ఇందు నామముల యొక్కయు, అనఁగ విశేష్యముల యొక్కయు, వాని లింగముల యొక్కయు వివరముండును. ఇంగ్లీషు కోశములకును తెనుఁగు కోశములకును లింగసంగ్రహముతోఁ బనిలేదు. నామ సంగ్రహము మాత్రముండినఁ జాలును. ఎందుకన ఆయాభాషావ్యాకరణ సంప్రదాయ ప్రకారము శబ్దముల యర్థమునుబట్టి వాని లింగములను నిర్ణయించు కొనవచ్చును. పురుషుఁడని యర్థమిచ్చునది పుల్లింగము, స్త్రీ యని అర్థమిచ్చునది స్త్రీలింగము, స్త్రీ పురుషభావము లేనిది నపుంసకలింగము. సంస్కృతమునం దట్లు కాదు. లింగ మర్థనిష్టము కాదు, శబ్దనిష్ఠము. కావున సంస్కృతకోశము లందు ప్రతిశబ్దము యొక్క లింగమును తెల్పుట యత్యంతావశ్యకము. ఈకోశముమూడుకాండములుగ విభజింపఁ బడినది. ప్రథమకాండము సంపు, స్వర్గ, వ్యోమ, దిక్, కాల, ధీ, వాక్, శబ్ద, నాట్య, పాతాళ, భోగి, నరక, వారి, వర్గము లనఁబడు ౧౨ వర్గములు గలవు. ద్వితీయ కాండమునందు, భూ, పుర, శైల, వనౌషధి, సింహాది, మనుష్య, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్గము లన్న ౧౧ వర్గములు గలవు. తృతీయ కాండమునందు విశేష్య, నిఘ్న, సంకీర్ణ; నానార్థ, అవ్యయ, లింగాది సంగ్రహ

వర్గములనునవి ౬ వర్గములు కలవు. ప్రథమకాండమునందు ౨౯౯ శ్లోకములును, ద్వితీయకాండమునందు ౭౩౧ శ్లోకములును, తృతీయ కాండమునందు ౪౮3 శ్లోకములును మొత్తముమీద ౧౪౯3 శ్లోకములు ఈగ్రంథమునందుగలవు. వర్గసంఖ్యయుశ్లోకసంఖ్యయుఁ గొన్ని ప్రతులలోఁ గొంచెము వేఱు విధముగ నుండును. ఇందు౧౧ వేల శబ్దముల సంగ్రహము కలదు. దీనికి పూర్వము కొన్ని కోశములుండినను ఇది వాని నన్నిటిని వెనకకుఁ ద్రొక్కి హిందూ దేశములో నంతటను సంస్కృత విద్యాభ్యాసక్రమమునందువిద్యార్థులకుఁజెప్పబడు ప్రథమ గ్రంథముగ నేర్పడినది. గ్రంథకర్త బౌద్ధుఁడైనను హిందువు లందఱును ఈగ్రంథమునెడ నింత గౌరవముఁ జూపుట చూడ దీని యోగ్యత వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. ఈ గ్రంథముమీద మహేశ్వరుఁడు క్షీరస్వామి, నీలకంఠుఁడు, వామముకుటుఁడు, భోజరాజు, రాజదేవుఁడు, భరతమల్లికుఁడు, రామతర్కవాగీశుఁడు, భానుదీక్షితుఁడు, రుద్రభట్టు, నారాయణః చక్రవర్తి, అచ్యుతోపాధ్యాయుఁడు, మధురేశ పండితుఁడు, మహాదేవభట్టు వేదాంతి, లింగాభట్టు మొదలైన పెక్కురు పండితులు టీకలు వ్రాసియున్నారు. వీనిలో నుత్తరదేశమునందు భానుదీక్షితుని రామాశ్రమీ టీకయు, ఆంధ్రదేశము నందు లింగాభట్టీయమును, ఎక్కువప్రచారము కలిగి యున్నవి. తాళ్లపాక అన్నయ్యవంశజుఁడగుతిరు వెంకటయ్యలింగాభట్టీయమునకుఁ దెనుఁగున గురుబాల ప్రబోధికయను పేరుబెట్టి చక్కని టీక వ్రాసియున్నాఁడు. అది పెక్కుసార్లు లచ్చుకూడఁ బడినది.

(చూఁడు అమరసింహుఁడు)

**అమరగడ తాలుకా.** పంజాబు దేశమందలి, పటియాలా సంస్థానములోనిఅమరగడనిజామతుకుసంబంధించిన ఒకతాలూకా. విస్తీర్ణము 33౭ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧౨3౮౬౮. గ్రామములుసంఖ్య ౧౬౧. ధోరి, అనునది ముఖ్యపట్టణము. చెల్లుబడి. 3౮౦,౦౦౦

**అమరగడనిజామత్.** పంజాబు దేశమందలి పటియాల సంస్థానమందలి ఒక నిజామత్. నిజామత్ అనగాజిల్లా. నిజాం అను ఒక అధికారిచే పాలింపఁబడు దేశభాగము. విస్తీర్ణము ౧౭౪౮ చదరపు మైళ్లు. జనసంఖ్య 3౬౭౪౪౮. గ్రామములసంఖ్య ౬౦౭. ముఖ్యస్థానమగు బాసి, పీల్, సర్హెన్త్ అనునవి పట్టణములు. చెల్లుబడి రు. ౯౧౦,౦౦౦. ఈ నిజామత్‌లో 3 తాలూకాలు గలవు. ఏతేగడ్, సాహింబ్‌గడ్, అమరగడ్

**అమరదాసుఁడు.** సిక్కులమూడవ గురువు. తండ్రి అమృత సరమున నుండు క్షత్రికులజుఁడగు తేజభాతనుఁడు. తల్లి సులఖని. జన్మము క్రీ.శ. ౧౪౭౯. మరణము ౧౫౭౯. నూఱు సంవత్సరములు బ్రతికెను. ౧౫౫౨

లో అంగదజీ, యొక్క శిష్యుఁ డాయెను. ౧౫౫౨లో అంగదజీ పరధామమునకుఁ బోగ నీతఁడు సిక్కులకు గురుఁడాయెను బాల్యాపంథమనఁబడు సిక్కు మతము మిక్కిలి యభివృద్ధిఁ జెందెను. ఇతఁడు గొప్ప భక్తుఁడు. రాత్రిందినమును భజనయు ఈశ్వరోపాసనముఁ జేయుచుండెను. పర్వత ప్రాంతము నందలి పెక్కురురాజులను తన మతమునకు రావించెను. చక్రవర్తి అయిన అక్బరునకు నితనియందు గౌరవము. ఇతని తరువాత, ఈతని అల్లుఁడైన రాందాస్‌జీ అనునతఁ డీతని సింహాసనమెక్కెను. పంజాబులోని గోయందబాలముల్‌క్ అను గ్రామమందు నీతనివంశజులు పెక్కుమంది యిప్పటికి నున్నారు

[మదనకోశము]

**అమరనాథ క్షేత్రము** కాశ్మీర దేశమందలి క్షేత్రము. నిర్జనప్రదేశము. ఇచ్చట అమరనాథుఁడను పేర శివుఁ డుండును. ఇయ్యది కాశ్మీరమునకుఁ దూర్పున నున్నది. దీనికి నుత్తరమునటిబ్బెటు దేశము ౧౫,౦౦౦ మొదలుకొని ౧౬,౦౦౦ అడుగులయెత్తుననున్నది. భాద్రపద పౌర్ణిమ దినమున నిచ్చట గొప్ప యుత్సవము జరుగును. ఉత్తర హిందూదేశ మందలి జనము విశేషముగ నీయాత్రకుఁ బోవును. ఇయ్యది శ్రీనగరమునుండి రమారమి ౬౦ మైళ్ల దూరమున నున్నది. భాద్రపదమాసము ప్రారంభమైనతోడనె శ్రీనగరమందలి రామబాగ్ అను తోటలో దొరతనమువా రొక్క పతాకము నెత్తించెదరు. యాత్రకు వెళ్లఁదలఁచిన వారందఱును దాని యొద్దఁ జేరుదురు. ఈ జెండా ముందునడుచును, జనులు వెనుక నడిచెదరు. శ్రీనగరమునుండి అమరనాథము వఱకు నెన్నియో తీర్థములు కలవు. క్రమముగ వానిని సేవించుకొనుచు, మక్కాములుచేసి కొనుచు యాత్రికులు వెళ్లెదరు. కొంతదూరము వెళ్లిన తరువాత గ్రామము లుండవు, తిను బండారములు గాని మఱియే ద్రవ్యములుగాని దొరకవు. క్రిందినుండియే తీసికొని వెళ్ళుదురు. దేవుఁడు గుహలోనుండును. కొన్నిచోట్ల ఈ గుహ ౧౫ మూళ్ళకంటె వెడల్పుండదు. లింగము మీద నెల్లప్పుడును పైనుండి తుషారములు పడు చుండును. కావున దానిని జలలింగమని యెదరు. ఈలింగముయొక్క కళలుకూడ చంద్రునితో హెచ్చుచుఁ దగ్గుచుండునని చెప్పెదరు!

**అమరపురము.** బర్మాదేశమునందలి ఒక గ్రామము. మండలె పట్టమునకు సమీపమునం దుండును. ఒకప్పుడిది బర్మాదేశమునకు రాజధానిగ నుండెను. ౧౭౮౩ లో నిది నిర్మింపఁ బడెను. క్రమక్రమముగ నభివృద్ధిఁ జెందెను. ౧౮౧౦లోనిందు ౧౭౦, ౦౦౦ ప్రజ లుండిరి. ఆ సంవత్సరములోనే ఈ పట్టణము అగ్నిచే చాల భాగమునాశ

నము నొందెను. అప్పటినుండియు దిన దినము హీనావస్థ నొందుచు నేడు అచ్చట౧౦,౦౦౦ జనమైనను నుండుట లేదు. ౧౮౬౦ లో రాజధాని మాండలేకుమార్చిరి. ఇప్పుడచ్చట పూర్వపు భవమును సూచించు జీర్ణమందిరము లనేకములు కలవు. ఇప్పుడు దీనిని బర్మా దేశమువారు మియోహాంగ్ అందురు. ఇచ్చట బౌద్ధదేవాలయములు చూచుటకు సొం పైనవి పెక్కులు గలవు.

**అమరసింహుఁడు.** సంస్కృత శబ్దశాసనుఁడు. 'అమరము' అని సామాన్యముగ వాడఁబడు సంస్కృత నామలింగానుశాశనగామునకుఁ గర్త. ఇతని నిజచరిత్రమేమియు తెలిసికొనుటకు సాధనములు లేవు. పూర్వకాలమునుండి వచ్చుచున్న దంతకథలే యాధారములు. అమరసింహుఁడు బౌద్ధుఁడఁట, విక్రమార్కుని సభలోనున్న నవరత్నములలో నొకఁడఁట. ఈ కథయే నిజమైన యెడల ఇతఁడును కాళిదాసుఁడును ఒక కాలము వారై యుందురు. కాళిదాస కాళిదాసుని కాల మింకను నిశ్చితముగఁ తేలలేదు కొందఱతఁడు క్రీ.శ. ౪వ శతాబ్దము వాఁడని యందురు. ఈతఁడే రాజు సభలో నుండెనో ఆరాజు హుయన్ సాంగుచే వర్ణింపఁబడిన చంద్రగుప్తవిక్రమా దిత్యుఁడే యని కొందఱందురు.

ఈతని కాలమును ఒక విధముగ నిర్ణయించుటకు రెండు మూడు ప్రమాణములు కాన వచ్చుచున్నవి. అమర కోశమును ఉజ్జయిని నివాసుఁడగు గరారాతుఁ డనువాఁడు. ౬-వ శతాబ్దమునందు చీనా భాషలోనికి భాషాంతరీకరించెను. * కావున నిది యంతకు పూర్వ ముండె ననుటకు సందేహములేదు. ప్రథమకాండమందలి కాలవర్గములోని ౧౩-వ శ్లోకమునందు "ద్వౌ ద్వౌమాఘాది మాసౌస్యాదృతుస్తైరయనంత్రిభిః", అనగా "మాఘాది మాసములు రెండురెండింటికి ఒక ఋతువును, మూఁడు ఋతువులుగలసి నొక అయనమును"అగును అని చెప్పఁబడి యున్నది. దీనిమీద టీక వ్రాయుచు క్షీరస్వామి "మాఘాద్యుపక్రమస్తత్రోఽయనారంభాత్",అనగ మాఘమాసమునుండి ప్రారంభమని చెప్పుటకు కారణము అప్పటినుండి అయనము ప్రారంభమగుటయె అని చెప్పియున్నాఁడు. కావున అమరసింహుఁడు తన కోశము వ్రాయుకాలమున నుత్తరాయణము మాఘమాస ప్రారంభమునందు వచ్చుచుండెను. లెక్క వేసి చూడగా నిట్లు ౧౪-౧౬ వందల సంవత్సరములకుఁ బూర్వము జరుగుచుండెనని తెలియుచున్నది. కనుక అమరుఁడు క్రీ. శ ౪-వశతాబ్దమునందుననో ౫-వశతాబ్దమునందుననో యుండెనని మన మూహింపవచ్చును.

ఈతఁడు, బౌద్ధుఁడని యనుకొనుటకు ఈతనికోశమునందునొకటి రెండుప్రమాణము

* Max muller's India: what can it teach us? 1st Edition page 328.

లుకానవచ్చుచున్నవి. గ్రంథాదిని దైవప్రార్థన చేయునపుడు హిందువుల సంప్రాదాయము ననుసరించి చేయక బౌద్ధులసంప్రదాయ మును బట్టిచేసినట్టు కానవచ్చుచున్నది. అమరకోశమునకు మొదటిదైన "యస్య జ్ఞానదయాసింధో" యను శ్లోకముయొక్క అర్థము నిర్గుణ పరబ్రహ్మపరముగఁ జేయుటకు వీలున్నను ఈ ప్రార్థనాసంప్రదాయము కాళిదాసాదుల ప్రార్థనా సంప్రదాయమును పోలి యుండలేదు. దేవతాచులనామమును చెప్పునపుడు అమరకోశములో మొదట బుద్ధునియొక్క నామములనుజెప్పుటయేగాక పర్యాయపదము లిచ్చునపుడు ఆతని ఉత్కర్షత తెలుపునట్టి పదముల నుమొందుగనిచ్చెను. అమరమునందలి బుద్ధుని పర్యాయ పదములలోఁ గొన్నిఁ జూడుఁడి: సర్వజ్ఞుఁడు, సుగతుఁడు, ధర్మరాజు, తథాగతుఁడు, భగవంతుఁడు, మార జిత్తు, లోక జిత్తు, జినుఁడు, షడభిజ్ఞుఁడు, దశబలుఁడు, అద్వయవాది, మునీంద్రుఁడు, శ్రీఘనుఁడు, శాస్త, శాక్యసింహుఁడు, సర్వార్థసిద్ధుఁడు.

మండనమిశ్రుని కాలములోను శంకరాచార్యుని కాలములోను బౌద్ధజైనుల గ్రంథములన్నియు నాశనము చేయించి, ఈ తని గ్రంథము విద్యార్థులకు నత్యంతోపయుక్తమగుటచే దీనిని మాత్రము కాల్చివేయక యుంచిరని కథలు చెప్పెదరు. (చూఁడు అమరకోశము)

**అమరప్రాదము.** భారత వర్షీయ తీర్థము.

**అమరాపురము.** బొంబాయిప్రాంత మండలి రీవాకాంతలోని మిక్కిలి చిన్న సంస్థానము.

**అమరావతి.** ౧. దేవతుల ముఖ్యపట్టణము. ఇంద్రునిరాజధాని. దీనినే స్వర్గలోకమని యెదరు. ఇయ్యది మేరుపర్వతము మీఁదనున్నది. ఇందు దేవతలు, అప్సరసలు, కిన్నరులు, యజ్ఞయాగాదులు చేసిన మానవులు ఉందురు. ఇందుండు వారికి ఆకలి, దప్పి, నిద్ర, ముసలితనము, చావు లేవు. ఇందు నందవవనమను, తోటయు, అత్యద్భుతమైన ఇంద్రసభయుఁ గలవు. ఇచ్చటి యిండ్లువాకిండ్లు, శిఖరములు మొదలైన వన్నియు బంగారముతోఁ జేయఁబడినవి. ఇందున గుఱించి యధికము తెలిసికొనఁగోరువారు భారతము సభాపర్వము౭వ అధ్యాయము, (తెలుఁగు భారతము౧-వ ఆశ్వాసము), కాశీఖండము ౧౦-వ అధ్యాయము (తెలుగు ౧వఆ.) చూడనగును.

౨. వర్హాడు (బీరారు) ప్రాంతములకు ముఖ్యపట్టము. దీని నిజమయిన పేరు ఉమరావతి. మహారాష్ట్రులందఱును అట్లేవ్రాయుదురు. "ఉమరావతి" పదమును ఇంగ్లీషులో వ్రాయునపుడు మొదట నెవఁడో Amaraoti (అమరావతి) అని వ్రాసెను. ఆతప్పే యిప్పటివఱకుఁ బరంపరగ వచ్చుచున్నది. కావున 'ఉమరావతి' శబ్దము చూడనగును,

3. గుంటూరుజిల్లా, సత్తెనపల్లి తాలూకాలో కృష్ణానదియొడ్డుననున్న యొక యూరు. అక్షాంశము ౧౬°.3౪'-౪౯''-ఉ; రేఖాంశము ౮౦°-౨౪'-౨౧''-తూ. ప్రస్తుతమిది యొక చిన్న పల్లెటూరు. జనసంఖ్య ౬,౧౨౦. అయినను ఈస్థలమును దీని సమీపము నందున్నట్టి




కృష్ణానది యొడ్డున అమరావతీ, ధరణికోటల యునికిఁ దెల్పు పటము.

ధరణి కోటయను గ్రామమును మిక్కిలి వైభవము ననుభవించిన పట్టణములు. ఇప్పటికిని దీనిని అటువైపు వారు అమరావతీ పట్టణమనియందురు. రెండు వేల యేండ్లకుఁబూర్వము కట్టఁబడిన బౌద్ధస్తూప రాజమునుబట్టి యీగ్రామమున కిటీవల లోకవిఖ్యాతి కలిగెను. (ప్రా

డు అమరావతి స్తూపము) ఇచ్చటఁ బూర్వము బౌద్ధులుండిరనియు, వారికిని హిందువులకును బోరాటము జరిగి హిందువులు వారిని వెడలఁ గొట్టిరనియు, ఆ పోరాటమునందు విప్రవినో దులను వారు బ్రాహ్మణులకు సాయముఁ జేసి రనియు విప్రవినోదులు కథలు చెప్పెదరు. ఈ కథలెంతవఱకు నిజమో తెలియదు కాని రెండువేల యేండ్లక్రింద నిచ్చట బౌద్ధదేవాల యములున్నట్టును, వేయియేండ్లక్రిందట నిచ్చ టనే అమరేశ్వ రాలయమున్నట్టును శాసన ములమూలమునఁ గానవచ్చుచున్నది. బౌద్ధ స్తూపమునందు క్రీ. శ. ౧౩౯లో రాజ్యము చేసిన ఆంధ్రరాజగు పులుమావి వశిష్ఠపుత్త్రుని శాసనము కలదు.[1] ధరణికోటలో లోకా శ్రయ విష్ణువర్ధనుని శాసనమొకటి కలదు.[2] కావున నప్పటికే అనఁగా వేయియేండ్లకుఁ బూర్వమే అమరేశ్వరాలయమున్నదని తెలియుచున్నది. బౌద్ధస్తూపముపోయి అమ రేశ్వరదేవాలయ మెప్పుడేర్పడినదో చెప్పు టకు వీలులేదు. ఇచ్చటి అమరేశ్వరాలయము చుట్టుపట్టు వారిచే గొప్పక్షేత్రముగా నెంచఁ బడుచున్నది. ఆంధ్రదేశమునందుఁ గలపంచా రామములో నీయది యొకటి. ఇచ్చటి లింగము మిక్కిలి యెత్తుగనుండుటచే కొన్ని మెట్లెక్కి అభిషేకము చేయవలెను. ఆలయము యొక్క క్రింది యంతస్తు మూసివేయఁబడి యున్నది. దేవాలయమునందు కోటకేత రాజు (క్రీ. శ. ౧౧౮౨) శాసనమును, కొండ వీటి రెడ్డిరాజుల (క్రీ. శ. ౧౩౮౬) శాసనము ను, కృష్ణదేవరాయల (క్రీ. శ. ౧౫౧౫) శాసనమును*ఉండుటచే నీయది ఆంధ్రదేశ మునఁ బ్రఖ్యాతిఁగాంచియుండెనని చెప్పవలసి యున్నది. ఇప్పుడు అమరేశ్వరుఁడనఁబడు లిం గము జైనుల లేక బౌద్ధుల విగ్రహమనియు, బౌద్ధులు వెడలిపోయిన తరువాత బ్రాహ్మ ణులు దానిని లింగముగ మార్చుకొనిరనియు కొందఱి చరిత్రకారుల యభిప్రాయము. ఇప్ప టికిని కొన్ని జైనప్రతిమలు దేవాలయసమీ పప్రదేశమునఁ గానవచ్చుటవలనను ఈ ఆల యము కొన్ని విషయములలో బౌద్ధస్తూప మును బోలియుండుటవలనను పై యభి ప్రాయము రూఢమగు చున్నది. ఈపట్టణము జీర్ణస్థితినుండ ౧౮౭౬లో చింతపల్లి జమీం దారుఁడైన రాజా వాశిరెడ్డి వెంకటాద్రి నాయుఁడు చింతపల్లిని విడిచి, ఈపట్టణమును తన నివాసస్థలముగఁ జేసికొనెను. ఇతఁడు పట్టణమునందు విశాలములైన వీధులనేర్పఱి చెను; నలువైపులను రమణీయములైన తోట లను వేయించెను. చింతపల్లి, పెనుగంచి ప్రోలు, నందిగామ, బేతవోలు (జగ్గయ్యపేట) మొదలయిన స్థలములనుండి కోమట్లను ర ప్పించి, వారికిఁ గొంత ధనసహాయముఁ జేసి గ్రామమును మిక్కిలి యభివృద్ధికిఁ దెచ్చెను. ఇచ్చటనతఁడొక భవ్యమయిన రాజమందిర

1 Burgess 'Amaravathi Stupa' p. 100.
2 Kristna District Manual p. 164.

* Epigraphical reports for 1897. Nos. 257, 259, 266, etc.

మును గట్టించెను.[1] ఈ మేడపై కప్పు ధళ ధళ మను రాగి రేకులతోఁ గప్పఁబడెనఁట ! వెంకటాద్రినాయుని మరణానంతరమున (౧౮౧౬) ఆతని దత్తపుత్త్రిలలోఁ గలహములు పుట్టి వారి సంస్థానమంతయుఁబోయి గవర్నమెంటు వారిక్రిందకు వచ్చెను. ఇచ్చటి అమరేశ్వర స్వామికి నైజామ్‌రాజ్యములోఁ గొన్ని యీనాము భూములును, సంవత్సరమునకుఁ గొంతధనమును ముట్టుచుండును. ఈయేర్పాటులు చందూలాలు మంత్రిగా నున్నకాలమందుఁ జేయఁబడినవని యందురు. (చూఁడు అమరావతి స్తూపము)

**అమరావతి స్తూపము.** స్తూపమనఁగా మట్టిదిబ్బ. ఇందుండియే 'తోపు' శబ్దము పుట్టినది. పూర్వపు గ్రామములు దేవాలయములు కట్టడములు శిథిలములై పూడిపోయి దిబ్బయేర్పడిన యెడల దానిని స్తూపమని యెదరు. గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలోని అమరావతీగ్రామమునొద్ద యిట్టి స్తూపమొక్కటి కలదు. పూర్వమిచట బౌద్ధులయొక్క గొప్పదేవాలయ ముండెను. అది కాలక్రమమున శిథిలమగుచుఁ బూడిపోయి దిబ్బగా నేర్పడెను. దీనినే అచ్చటి జనులు దీపాలదిన్నె యని పిలుచుచుండిరి. పదునెనిమిదవ శతాబ్దాంతమున చింతపల్లి జమీందారుఁడైన వాశిరెడ్డి వెంకటాద్రి నాయుఁడు అమరావతిలోఁ దనమేడను గట్టుకొనుటకును, అమరేశ్వ రాలయమును నిర్మించుటకును, శివగంగ మొదలగు కోనేటులను గట్టించుటకును, ఈదిబ్బను గొంతఁ ద్రవ్వించి, అచ్చట దొరకిన గొప్ప నాపబండలను, పెద్దపెద్ద యిటుకల నుపయోగించుకొనెను. చుట్టుపట్టు వారు నాపబండలు కావలసి వచ్చినపుడెల్ల, ఈదిబ్బలోనుండి బండలను దీసికొని పోవుచుండిరి. సున్నము కాల్చుటకుఁ గొన్నిబండలు దగ్ధము చేయఁబడెను. ఇట్లీ విలువలేని శిల్పసంపద నాశనముఁ జెందుచుండఁగా, క్యాప్టన్ మెకంజీయను నతఁడా ప్రాంతములకు వచ్చుట తటస్థించెను (౧౭౯౨). ఆతఁడచ్చటి కట్టడముల చక్కఁదనముఁ జూచి, అందున గుఱించి కొంత వర్ణనము వ్రాసెను.[1] తరువాత నాతఁడు ౧౮౧౬ లో మఱల నచటికి వచ్చి ఆ ప్రాంతమునంతను సర్వేచేసి పటము వ్రాసెను. ఇంతియగాక వెంటఁ గొందఱు చిత్రకారులఁ దీసికొని వచ్చి యచ్చటి శిలలమీఁదగల చెక్కడపు పనుల ప్రతిమలు వ్రాయించి యొకగ్రంథమును సిద్ధపఱిచెను. అది ఇప్పుడు ఇండియా ఆఫీసులోనున్నది. తరువాత ౧౮౪౦ లో వాల్టర్ (తరువాత సర్) ఈలియట్ అనువాఁడు ఈస్తూపమును ద్రవ్వి పెక్కుశిలలను జెన్నపట్టణమునకుఁ బంపెను. కొన్నిశిలలు బందరు కలకత్తాలకుఁ గొనిపోఁబడినవి. చెన్నపట్టణమునందున్న శిలలనుగూర్చి ఫెయిలరు

1 'Burgess' Amaravati p. 14; Kistna Manual p. 164.

1 Asiatic Researches for 1807 vol. IX.

అను నతఁడు కొన్ని వివరములను వ్రాసెను. కానియవి అర్థ రహితములుగా నుండెను. చెన్నపట్టణమునుండి వానిలోఁ బెక్కు లింగ్లాండునకుఁ బంపఁబడెను. అవి గొన్ని యేండ్లచ్చట కారణాంతరములచే మఱుగువడియుండి ఫెర్గ్యుసన్ అను శిల్పకళా శాస్త్రజ్ఞుని కంటఁబడెను. అతఁడందలి శిల్పనైపుణ్యమున కచ్చెరువంది దాని నవగాహనము చేసికొని



౧వ పటము.

ఆస్తూపమునుగుఱించి ఒక యుద్గ్రంథమును ప్రకటించెను (౧౮౬౮). ౧౮౭౭ లో దొరతనమువారి యాజ్ఞానుసారము రాబర్ట్ స్యూయల్ అను నాతఁడు మిగిలిన దిబ్బనుద్రవ్వించి, దానినిగుఱించి సవిస్తర వృత్తాంతమును౧౮౮౦ లోఁ ప్రకటించెను. తరువాతనిందలి శిల్పవైభవ

ములనుజూపు పటములతోనీస్తూపమునుగూర్చి బర్గెస్సు అనునాతఁడుసంపూర్ణ వర్ణనమునువ్రాసె ను(౧౮౮౧). అమరావతినుండి తీసికొనిపోఁబడి నచెక్కడపుశిలలలో నెక్కుడు భాగము లండను లోని బిటిషుమ్యూజియములోను, క్రొద్దిగ చెన్నపట్టణములోని మ్యూజియములోను ఉన్నవి.

**స్తూపముయొక్క ఆకారము**

ఈస్తూపరాజ మొక ప్రాకారముచేఁ బరివృతమైయుండెను.* గుండ్రముగనున్న అడుగు చట్రముమీద నీస్తూపము గోపురాకారమునఁ గట్టఁబడెను. ౧౨ పటముఁ జూఁడుము. దీనిచుట్టునున్న ప్రాకారము వలయాకారముగ నుండెను. స్తూపముయొక్క అడుగు చట్రమువ్యాసము(Basal Diameter) ౧౬౨ అడుగులు కలిగి౬ అడుగుల యెత్తున నుండును. ప్రాకారము యొక్క పరిఖము(చుట్టు కొలత circumference) ౮౦౩ అడుగులు. ఈ ప్రాకారము ౧౪ అడుగుల యెత్తుకలిగి చిత్తరువులు చెక్కఁబడిన నాప రాళ్లతోఁ గట్టఁబడి యుండెను. స్తూపము ఇటుకలతోఁ గట్టఁబడి చిత్ర విచిత్రములయిన నాప రాళ్లచే గూర్పఁ బడెను. ఈ నాపరాళ్ల మీద నత్యంత శిల్పనైపుణ్యముఁ జూపు చెక్కడపుఁ బనిచేయఁబడినది. నడుమనున్న స్తూపము దేవాలయమో, దాగోబయో, చైత్యమో, విహారమో చెప్పుటకుఁ దగిన యాధారము లేదు. ఏలయన ౧౭౯౭ లో మెకంజీ చూచువఱకే యీభాగమంతయు వెంకటాద్రినాయనిచేఁ ద్రవ్వఁబడినందునఁ బెద్దలోయ యైయుండెను. దాని నొక కోనేరుగ మార్చవలెనని యాతఁ డనుకొనెనుగాని, ఆపని పూర్తిగాకమునుపే యతఁడు మరణించెను.

అయినను గొన్ని కారణములను బట్టి మధ్యనున్న మందిరము నూఱడుగుల యెత్తుకలదిగను, రెండుమూడంతస్తులు కలదిగ నుండెనని యూహింపఁబడినది. దాగోబలని చిన్నచిన్న యాకారములతోఁ గట్టఁబడిన మందిరముల వలెనే యదియుఁ బెద్దదిగ నుండెనని యూహింపఁబడుచున్నది. ఈమందిరమునకును ప్రాకారమునకును నడుమ చిన్న చైత్యములును, అచ్చటి యధికారులుండు మందిరములును నుండెను. వెలుపల ప్రాకారము చుట్టును, ద్వారముల ప్రక్కలను గొన్ని చిన్న చైత్యములును, సన్యాసులకును సన్యాసినులకును నివాసమునకై కట్టఁబడిన విహారము లుండెను.

* ఈ స్తూపము రెండు ప్రాకారములచేఁ జుట్టఁబడి యుండెనని కొన్ని యాధారములచే నిర్ధారణజేసి, ఫెర్గ్యూసన్, బర్గెస్సు అనువారు తమగ్రంథములందు వ్రాసియున్నారు. కాని ఇటీవల ప్రచురింపఁబడిన ఫెర్గ్యూసనుగారి 'హైందవ శిల్పచారిత్రమ'ను గ్రంథమునందు ఫెర్గ్యూసనుగారు తామిది వఱకు వ్రాసిన పొఱబాటును దిద్దుకొనిరి. లోపలి ప్రాకారమునందలి పలక లొక వైపున మాత్రము చిత్రితములగుటయు, దక్షిణద్వారము నొద్ద దొఱకిన చిన్న చైత్యముయొక్క అడుగు చట్రము అట్టి పలకలచేఁ గప్పఁబడి యుండుటయు, హిందూదేశము నందలి తక్కిన స్తూపములకొక్క ప్రాకారమే యుండుటయు, ఇట్టి యూహకుఁ గారణములు.

౨వ పటము.




దిబ్బలలోపల గుండ్రముగఁ గనఁబడు వెలపలి వలయము స్తూపప్రాకారము. లోని వలయముఁగూడ ప్రాకారమని కొందఱును, కాదు స్తూపపుఁ బునాదియేయని కొందఱును చెప్పెదరు. "కచటత" గుర్తు వేయఁబడిన చౌకము వెంకటాద్రినాయఁడు చెరువుకొరకు త్రవ్వించినలోయ. దానిలోను ఉన్న "గజడద" చౌకము ఒకబావి.

రాత్రిసమయములందు స్తూప శిఖరము మొద లుకొని పాదము వఱకును వేలకొలఁది దీపము లుపెట్టుచున్నట్లు గానవచ్చుచున్నది. ఆవాడు కఁబట్టియే యిప్పటివఱకు నీదిబ్బకు దీపాల దిన్నెయని పేరువచ్చుచున్నది.

కర్నల్ మెకంజీ ౧౮౧౭లో ఈదిబ్బను కొలచి, తీసినపటమిూప్రక్కన నీయఁబడినది. ఆపటముచూఁడు. దానినిగుఱించి యాతఁడిచ్చిన వర్ణనముయొక్క సారాంశమిచ్చట సంక్షేపముగా నిచ్చుచున్నాము.

దీపాలదిన్నె.

దీపాలదిన్నె యనునది గ్రామమునకు దక్షిణమువైపున గుండ్రముగను,ఎత్తుగనుఁడుండును. దిబ్బకు లోపలిభాగమున పైనుండి౧౦అడుగులలోతున, చెక్కడపుఁబనిచేయఁబడినరాళ్లతో గుండ్రముగ రెండువృత్తములు ఒకదాని లోపల నొకటికలవు. ఈ రెంటికిని నడుమ ౧౩ అడుగుల యంతరము కలదు. ఈయంతరము బాగుగ నున్నంతవఱకు నాపబండలతో గప్పఁబడినది. లోపలివృత్తముయొక్క వ్యాసము (diameter) ౧౯౬ అడుగులు. ఈ వృత్తములలోని ప్రదేశమునందు మొదట నేమియుండెనో, తెలిసికొనుటకు వీలులేదు. వెంకటాద్రినాయుఁడుగారు దీనిని చెరువు చేయవలయునని యత్నించిరి. కాని యాపని పూర్తి అయినదికాదు. ఈవృత్తములలోపలిభాగమున దక్షిణపువైపు సున్నముతోఁగట్టఁబడిన యొక గట్టికట్టడము కనఁబడుచున్నది. ఇట్టిదే చుట్టు నుండెననియు,దిబ్బత్రవ్వి మన్నుతీసికొనిపోవువారు దానినికూడ త్రవ్వివేసిరనియు జనులు చెప్పుటవలన లోపలఁ బూర్వము చుట్టును గోడయుండెననియు, దానిశేషమే యిదియనియు నూహింపఁబడుచున్నది. దీనికి నాలుగు త్రోవలు కలవని చెప్పెదరు.

మధ్యన త్రవ్విన భాగము ఎటుచూచినను రమారమి౧౦౦ అడుగులు పొడవుగల సమచతురస్రము. దానికి నడుమకొన్ని యడుగులుగల బావి త్రవ్వఁబడినది.

వెంకటాద్రి నాయుఁడు ఈదిబ్బను తూర్పుభాగమున త్రవ్వింపగానొక చిన్నగుడి కానవచ్చెను. దానికిఁ గొంచెము పశ్చిమమున రెండు స్తంభములు గానవచ్చెను. అది యొకప్పుడు చిన్నగుడికి ద్వారముగ నుండిన నుండవచ్చును. పశ్చిమపు వైపు త్రవ్వింపగా నిచ్చటను ఒక చిన్నకట్టడము కాన్పించెను. అందు నొక పెద్ద రాగి దీపపు సెమ్మె దొరికెను. ఉత్తరపు వైపున నాలుగు స్తంభములు గల యొక మంటపము ఇటికెలతోఁ గట్టినది బయిటఁబడెను. ఇచ్చట పద్మాసనము వేసికొనిన తలలేనిప్రతిమ యొకటి దొరికినందున నిది జైనమందిరమై యుండునని తలంచుచున్నారు.

అప్రతిమాన సౌందర్యము నందును, శిల్పకళా విన్యాసమునందును, ఈప్రాకారముతో సరివచ్చునది హిందూదేశము నందు మఱెచ్చటను గానరాదు. ఇది రమారమి పదియడుగుల

ప్రాకారము.

మెత్తుగల నిలువు స్తంభములతోఁ గట్టఁబడెను. రెండు స్తంభములొక దానికి నొకటి కలిపిపెట్టక, కొంత యంతరముగ నిల్పఁబడి మూడు అడ్డ స్తంభములతోఁ (రాతిదూలములతోఁ)గలుపఁబడినవి. ఇట్లు ద్వారముల యొద్దతప్ప ప్రాకారమంతయుస్తంభములతోఁ గట్టఁబడెను. అనగా నిలువు స్తంభములలో సందులుచేసి వానిలో నడ్డరాతిదూలము లమర్చఁబడెను. ఈస్తంభములమీద సందులేకుండ నీ చివరనుండి యాచివరవఱకు అంచు గట్టినట్లు మఱుఁరు బండలు వేయఁబడెను. ఈబండలు ఒక్కొక్కటి ౨ అడుగుల ౯ అంగుళముల యెత్తును, ౧౩



3వ పటము. ప్రాకారమునందలి యొక భాగము.

అడుగులు మందమును, ౮ అడుగులు పొడవును కలవిగా నున్నవి. ఈ నిలువు స్తంభములును, అడ్డదూలములును పైయంచు రాళ్లును రెండువైపుల చిత్ర విచిత్రములయిన చెక్కడపుఁ బనులచేత సుశోభితములయి యున్నవి. మొత్తముమీద నీప్రాకారమునందు ౧౩౬ నిలువు స్తంభములును, ౩౪౮ అడ్డదూలములును, ౮౦౩ అడుగుల పొడవుగలపై యంచుశిలలును, ఉండెనని లెక్క వేయఁబడినది. ఈ ప్రాకారమునకు నలువైపుల గొప్పద్వారములున్నవి. ఒక్కొక్క ద్వారము ౨౬ అడుగుల పొడవును ౧౬ అడు

గుల వెడల్పును వైశాల్యము గలిగి, ఒక్కొక్క వైపున మూడు స్తంభములు, మూల దిరుగుచోట నొక స్తంభమును, బ్రక్కలరెండు స్తంభములును, మొత్తముమీద పండ్రెండు స్తంభములును కలిగియుండెను. వీని నన్నింటి మీదఁగలిసి, ౧౨౦౦౦ మొదలు ౧౪౦౦౦ వఱకుఁ బ్రతిమలుండవచ్చును. ఇక నీప్రతి మలవివరమును జూతము.

మొదట నీ ప్రాకారముయొక్క వెలుపలి చెక్కడమును బరిశీలింతము. 3-వ పటమును

**వెలుపలిచెక్కడము**

జూడుము. అది యీ ప్రాకారముయొక్క యొక భాగము వెలుపలనుండి యెట్లు కానవచ్చునది చూపును. బ్రిటిష్ మ్యూజియమునందున్న కొన్నిరాళ్లనుగల్పి యీ ప్రాకారము ఫెర్గ్యుసన్ చే నేర్పఱచబడెను. ఇందలి ప్రతినిలువు స్తంభమునకును నడుమ నొకచక్కని పూర్ణకమలమును, పైభాగమునను క్రింది భాగమునను ఒక్కొకయర్థకమలమును జెక్కఁబడియున్నవి. ఈకమలములొకదానినొకటి పోలక అసంఖ్య విధములైనవిగ నున్నవి. స్తంభముమీది పద్మములకు నడుమ బౌద్ధమత సంబంధమైన కథలను సూచించునట్టి ప్రతిమాదులు చెక్కఁబడినవి. అడ్డ దూలములమీద సాధారణముగా నొక్కొక గుండ్రటి పద్మమును, ఒకప్పుడు వేఱు ప్రతిమలును ఉండును. అడుగు భాగముననున్న అంచుబండలమీదఏనుగులు, వృషభములు, లేళ్ళుమొదలగు జంతువులను వెంబడించుచు బాలురు నవ్వుచు ద్రుళ్లుచు, పోవుచున్నట్లు అతిహాస్యయుతముగఁ జెక్కఁబడెను. పైనున్న యంచు బండలమీద అల



౪వ పటము. నిలువు స్తంభముయొక్క బైటిచెక్కడము.

వలెనుండు మోకుతోరణము మనుష్యులచే నీడ్వఁబడుచున్నట్లుఁ జిత్రింపఁబడినది. ఈ మోకుతోరణము జరీ పోగులతోఁ బురివేయఁ

బడి కట్లుకట్టఁబడినట్టును, పలు విధములైన లతలుచుట్టఁబడి అలలవలె వ్రేలాడఁ దీయఁబడినటును, దండలుగా గ్రుచ్చిన పుష్పహార మును తోరణములుగ నలంకరింపఁబడినట్లును మోకంతయునగిపీ చెక్కినట్లుండుటయే గాక ప్రతిపోగునందును కొంచెము శ్రద్ధతో విలోకించిన యెడల పలువిధములైన చక్కందనపు పూజలు కన్పించును. అల క్రిందికివచ్చునప్పుడు వికసించిన పద్మమును దానిపైని దాగోబా,ధర్మచక్రము, గరుడుఁడు, వజ్రాసనము మొదలగు పూజార్హములైన చిత్రములు చెక్కఁబడియున్నవి. మోకును లాగుచున్న, మనుష్యుల భుజములవద్దనున్న కట్లమీద జూపఁబడిన శిల్ప చాతుర్య మత్యద్భుతము. మొత్తముమీద నీ మోకుతోరణముమీద జిత్రకారుఁడు చూపిన కల్పనావైచిత్ర్యము (variety of designs) కడుఁజోద్యము.

పైవర్ణనములన్నియుఁ జక్కగ బోధపడవలయునన్న ౮-వ పటముఁ జూడనగును. ఇది ప్రాకారములోని యొకమూలనున్న నిలువు స్తంభము. దీని క్రిందిభాగము పగిలిపోయినది. ఇందు మధ్యనుండు పూర్ణకమలము, పైనుండు అర్ధకమలము, వీనికి నడుమనున్న చిత్రపటములు, పైని అంచురాయి (coping) మాత్రము గాన వచ్చుచున్నవి. ఇందొక విశేషము కూడకలదు. స్తంభము పై భాగమున పాలిభాషలో వ్రాయఁబడిన శాసన మొకటి కలదు. పగిలిన క్రిందభాగము నందొక యర్థకమలమును, దానికిని పూర్ణకమలమునకును నడుమ చిత్రపటములు నున్నట్లు పటముచూచిన తెలియఁగలదు. ఇందుఁ గానవచ్చు కమలముల పొంకమువలన ఈస్తూప స్తంభముల మీదఁ జెక్కఁబడిన వేలకొలఁది కమలముల యొక్క సొంపు నూహించు కొనవచ్చును. కమల మధ్యమున పూరేకులును, చుట్టును రెక్కలును, చివర వలయమునందు రమణీయములైన లతాపుష్పములు రెండుమకరముల నోటిలో నుండి వచ్చుచున్నట్లును గానవచ్చుచున్నవి. కమలమునకు నాలుగు మూలలందు కమలపుమొగ్గలు విచ్చుచున్నట్లుఁ జెక్కఁబడినవి. ఇఁక పద్మద్వయ మధ్యముననున్నఁ జిత్రపటముల వంకఁజూడుడు. సూక్ష్మముగ నిరీక్షించినయెడల నిందొక కథ వ్రాయఁబడినదని తెలియును. పైభాగమున నొకరాజు సింహాసనముమీద నాసీనుఁడైయున్నాఁడు. చారుఁడొకఁడు చేతులుజోడించుకొని యేదియో వార్త చెప్పుచున్నాఁడు. ఆతని యెదుటి భాగము నందు సైనికులు కోటను సంరక్షణ చేయుచున్నట్లున్నారు. అంతకు క్రిందిభాగమునఁ గోటద్వారములో నుండి సైనికులులోపలికిఁ జొఱఁబడుచున్నట్లున్నది. అందు ఏనుగులు, గుఱ్ఱములు, పదాతులు గూడనున్నారు. క్రిందనొకఁడు శత్రుడు కాఁబోలును సాష్టాంగముపడి శరణుఁజొచ్చినట్లు కానవచ్చుచున్నది. ఈ వార్తయే పైని చారుఁడు రాజుతోఁ జెప్పుచుండెఁగాఁబోలు.



౯వ పటము. మూలమలుపు స్తంభముయొక్క లోపలి చెక్కడము

స్తంభముయొక్క క్రిందిభాగముపగులక యున్న యెడల నీ కథయొక్క తదుపరివృత్తాంతము మనకుఁ దెలిసియుండును. రాతిమీఁది అంచుబండమీఁద చిత్రవిచిత్రముగాఁ దీఁగెలు పువ్వులు పత్త్రములు చెక్కఁబడినవి. ఇందలి శాసనములోని శబ్దములిట్లుండును.

1. లోనవలవకస సంఘరక్షితస చమరిణి (స) చ
2. భరియాయెసఘాయచ సఘదాసి య చ కుమలయచ దానమ్.

అర్థము:—'లోనవలవక' 'సంఘ రక్షిత' 'మరిణి" అను వారిభార్య లయిన 'సఘా' 'సఘ దాసి' 'కుమల' అను వారిచేఁ జేయఁబడిన దానము*

ఈ స్తంభమునకైన కర్చంతయు పీఁచిచ్చి నట్లు గానవచ్చుచున్నది.

ప్రాకారముయొక్క లోపలి భాగముకూడ వెలుపలిభాగమువలెనే చిత్రింపఁబడియుండెను. కాని, లోపలి వైపుపని తనము వెలుపలివైపుపనితనము కంటె చాల సున్నితమైనది. వెలుపలిపటములు సర్వసాధారణముగ నందఱకు దెలిసినవే. లోనివి కొంచె మాలోచించినఁ గాని యర్థముకావు. ఇది నిర్మించినవాని శిల్పకళాభిరుచియు, ఔచిత్య

లోపలిచెక్కడము

జ్ఞానమును వెల్లడి చేయుచున్నది. ఏలయన, శిల్పనైపుణ్యమును బరీక్షింపఁ దలఁచిన వానికి వెలుపల నిలువఁబడి చూచుచుండుట కన్న లోపల నిలువఁబడి సావకాశముగఁ జూచుటకు వీలుండును. నిలుపుస్తంభములకు వెలుపలి వలెనె లోపలను, క్రిందపైన అర్థకమలము లుండినను మధ్యమాత్రము పూర్ణకమలమునకు మాఱుగా నొక వృత్తముండి, అందు బౌద్ధపురాణాదులలోని కథలు చిత్రింపఁ బడియుండును. ఈమధ్యవృత్తమునకును పైనిక్రిందనున్న అర్థకమలములకును నడుమనున్న భాగము నందుఁగూడ కొన్ని పటము లుండును. అట్లే రెండు నిలుపు స్తంభముల నడుమనుండు మూఁడు అడ్డదూలములలో పైదానిమీఁదను గ్రింది దానిమీఁదను కమలములు జెక్కఁబడి మధ్యదానిమీఁద నేకవృత్తములోపల పురాణకథలు చిత్రింపఁబడియుండును. పైయంచు బండమీఁద నంతటను పౌరాణిక గాథలు, యుద్ధరంగములు, సంఘస్థితిని దెలుపు పటములును చిత్రింపఁబడియున్నవి. ఇట్లు లోపలి భాగమునఁ జిత్రపటముల సంఖ్య హెచ్చు. ఇందుకుఁగొన్ని యుదాహరణములఁజూడుఁడు. ౫-వ పటమునందొక మూలమలుపు స్తంభము కలదు. ఇది మలుపు తిరిగి యుండుటచే రెండు స్తంభములుగఁ గాన వచ్చుచున్నది. మూలమలుపువైపు చెక్కడము నందొక యర్థకమలమును, రెండు పూర్ణకమలములును కనఁబడుచున్నవి. వీనిమీఁద నింకొక పూర్ణ కమలమును,

* ఈ పేళ్లుగలవారెవరో, ఏకాలమువారో తెలిసికొనుటకు వీలులేదు. అక్షరములను, భాషను బట్టిచూడ నాల్గవ శతాబ్దముకంటె తరువాతివారుగారని తోఁచుచున్నది.

ఒకఅర్ధకమలమును ఉండెనఁట. ఇది ద్వార మునకుఁ దగిలి యున్నవైపు. దీనికిఁ బ్రక్కనిలువు స్తంభముమీఁది చెక్కడమున్నది. ఇదియుఁ బై భాగమునఁ బగిలియున్నది.* అడుగుభాగమున నొక యర్ధకమలము దానిమీఁద మూఁడు పటములు, ఆపైని ఒక వృత్తము, అందులోఁ గొన్నిపటములు గానవచ్చుచున్నవి. పై భాగమునఁ గొన్ని పటములును, వానిమీఁద నర్ధకమలమును, ఉండియుండును. వీనినన్నిఁటికిని గ్రిందఁ జిత్రముగఁ జెక్కఁబడిన యంచు గూడఁగలదు.

మధ్యవృత్తమందలి ప్రతిమలలోఁ గొన్ని పగిలిపోయినను, అందొక బౌద్ధబోధకుఁడుఁ స్త్రీపురుషుల కేదియో బోధించుచున్నట్లును, వారందఱును భక్తిశ్రద్ధలతో వినుచున్నట్లును, వారిపైని దేవగంధర్వులు పూజాద్రవ్యములు గొనివచ్చి యర్పించుచున్నట్లును గానవచ్చుచున్నది. బోధకుని తల లేనందున నీతఁడు బుద్ధుఁడో, బోధిసత్త్వుఁడో, మఱియెవఁడో తెలిసికొనుటకు వీలు లేకుండ నున్నది. పైవృత్తమునకును క్రిందికమలమునకును నడుమనున్న పటములుమూఁడుగళ్లగా విభజింపఁబడియున్నవి. మొదటిగడిలో నొక రాజు సింహాసనముమీఁదఁ గూర్చుండినట్లును, ఒకయువకుఁడు భూమిమీఁద నాసనము వేసికొని కూర్చుండినట్లును, ఒకవీరుఁడాతని కేమియో చూపి వీరావేశసంభాషణము గావించు చున్నట్టును, రాజీసంభాషణము వినుచున్నట్టును జూపఁబడినది. రెండవగడిలో ఈ సంభాషణముయొక్క ఫలము చూపఁబడినది. రాజొక ఏనుఁగునెక్కి తొందరగాశత్రువులమీఁదికిఁ బోవుచున్నాఁడు. ఆతనివెంట నిద్దఱుస్త్రీలు మాత్రమున్నారు. శస్త్రములు కూడ లేవు.

ఆతని వెంట సైన్యము వచ్చుచున్నది. ఆకాశమునుండి దేవ గంధర్వులు పుష్పమాలలు వేయుచున్నారు. మూఁడవ గడిలో వాయువేగమున పఱుగిడుచున్న యశ్వముల నెక్కి శత్రువులు పాఱి పోవుచున్నట్లు జూపఁబడినది. ౬-వ ౭-వ పటములను జూడుఁడు. ఇవి పైయంచు మీఁద ౮౦౦ అడుగులు పొడవున నెడతెగకుండ నతినేర్పుతో జెక్కఁబడిన బౌద్ధపురాణకథలకు సంబంధించిన పటములలో రెండు. ౬వ పటమునందుబుద్ధుఁడు జన్మించు నిమిత్తమై భూమిమీఁదికి వచ్చుటకుఁ బూర్వము తుషిత స్వర్గమునందు ఉచ్ఛధ్వజ రాజమందిరమున దేవతలకు ధర్మముయొక్క ౧౦౮ త్రోవలను బోధించు ప్రసంగము చిత్రింపఁబడినది.* ౭వ పటము బుద్ధుని తల్లియగు మహామాయయొక్క స్వప్నవృత్తాంతమును దెలుపుచున్నది.

---

*స్తూపపురాళ్లను, ఇష్టమువచ్చినట్లు వెంకటాద్రినాయఁడు పగులఁ గొట్టించినందునను మిగిలిన వానిని ఇంగ్లండు పంపుటవలన నీరాళన్నియుఁ బగిలిన స్థితిలో మనకుఁ గానవచ్చును.

* ఇది బుద్ధుని తండ్రియయిన శుద్ధోదనుఁడు సభయందుఁ గూర్చుండి చేయుచున్న ప్రసంగమును దెలుపుచున్నదని కొందఱి యభిప్రాయము.



౬వ పటము. అంచురాయిమీఁదిలోపలి చెక్కడము. (బోధిసత్త్వుని ప్రసంగము.)



౭వ పటము. అంచురాయిమీఁది లోపలి చెక్కడము. (మాయాదేవి స్వప్నము.)

బుద్ధుఁడామె గర్భమునందుఁ బ్రవేశించునాఁడు భోధిసత్త్వుఁడు గజరూపమున నామె యుదరమునందుఁబ్రవేశించినట్లామెకలగనెను. ఇందు శయ్యపైఁబవ్వళించిన స్త్రీమాయాదేవి. క్రిందఁ గూరుచుండిన వారలామె దాసీలు. ముప్వురు దాసీలు నిలువఁబడియామెకు విసరుచున్నారు. నాల్గు మూలల నలుగురు పురుషులు నిలువఁబడియున్నారు. వారు నాల్గుదిక్కులను రక్షించునట్టి దిక్పాలకులు.* వీరచ్చట నెవ్వరికిని గనఁబడకుండ నున్నారని భావము. పైని కనఁబడుచున్న ఏనుఁగుగున్న బుద్ధుఁడు. ఆ రూపముతో నాతఁడు స్వర్గమునుండి దిగివచ్చెనని బౌద్ధగ్రంథములు చెప్పుచున్నవి. ఈ లోపలి చెక్కడమునందుఁగల చిత్రపటములలో మనోరంజకము లగునవి యనేకములు కలవు. వానిలో తుషితస్వర్గమునందు బుద్ధుని కమండలము నొకపల్లెరమునందెత్తి పట్టుకొని చుట్టునుదేవతలును, అప్సరసలును వలయాకారముగ దిరుగుచు మహోత్సాహముతో నృత్యముచేయుచుండిన పటమును, అతిఘోరముగ జరుగుచున్న నిజముగ జరుగుచున్నదో యనునట్లు భ్రమింపఁజేసెడి రణరంగము వర్ణించుపటమును ప్రశస్తములైనవి.

ఇట్లీ యంచులమీఁదను వృత్తములమీఁదను బౌద్ధపురాణ గాథలేకాక, ఆకాలపు రాజసభలును, పట్టణగ్రామ పరిసరములును, యుద్ధరంగములును, సముద్రప్రయాణములును, వేయేల ఆకాలపు రాజకీయ సాంఘికస్థితియంతయు కన్నులకుఁ గట్టినటు లతిమనోహరముగఁ జెక్కఁబడియున్నవి. ఇందుఁగల ప్రతివృత్తాంతమును, గాథయు బయస్కోపులోని పటములవలె నొకదాని తరువాతనొకటివచ్చునట్టు పటములమీఁద వరుసగాఁజెక్కఁబడియున్నవి. ప్రతిపటమునందును శిల్పకౌశల మత్యద్భుతముగనుండుటయేగాక జీవకళ లుట్టిపడుచుండును. ఈ చిత్రపటములవలన హిందూదేశమునందు ముఖ్యముగ నాంధ్రదేశమునందు వ్యాప్తిఁజెందిన బౌద్ధమతస్వరూపము బూర్తిగఁదెలియవచ్చుచున్నది. వీనినుండి అప్పటికే జనులు బుద్ధునొక యవతారముగనెంచి పూజింప మొదలిడిరనియు, ఆతనిగూర్చి పెక్కు పురాణగాథలల్లి వానిని నమ్ముచుండిరనియు మనము గ్రహింపవచ్చును.

దీపాల దిన్నెను వెంకటాద్రి నాయుఁడు త్రవ్వించినపుడు అందుండి బయల్పడిన చెక్కడపు బండలన్నియు నాశనముగావింపఁబడెను. దిబ్బనంతయుఁబూర్తిగాఁ ద్రవ్వివేయుటచేత స్తూపమునకు సంబంధించిన రాతి పలకలేమియు మిగుల లేదు. కానిస్తూపాకారముచిత్రింపఁబడిన పలకలనేకములు భూమిలోఁబాతుకొనియుండుటచే తరువాత ఇలియట్ త్రవ్వించినపుడు బయల్పడినవి. ఈపలకలు రమారమి ౬ అడుగుల

స్తూపము

* ఈదిక్పాలురలో వైశ్రావణుఁడు ఉత్తర దిక్కును విరూఢకుఁడు దక్షిణమును, ధృతరాష్ట్రుఁడు తూర్పును, విరూపాక్షుఁడు పడమరను పాలించుచుండురని బౌద్ధమతగ్రంథములు నుడువుచున్నవి.

ఎత్తుగలిగియున్నవి. ఇవి అడుగు చక్రము చుట్టును నిలువఁ బెట్టఁబడియుండును. ఇవి ౬ అడుగుల యెత్తు గలిగి యుండుటచే స్తూపము యొక్క అడుగు చక్రము ౬ అడుగులయెత్తు గలిగియుండెనని యూహింపఁ బడుచున్నది. ఈపలకలను రావ పటమునందు పూర్వమడుగు చక్రమెట్లుగానవచ్చెనో ఆవిధముగ ఫెర్గ్యూసర్ ఊహచేసి యమర్చి యున్నాఁడు. ఈచక్రపుబండలయందు నిజమైన స్తూపమును పోలి చిన్న యాకారమును గలిగిన చైత్యము లనేకములు చెక్కఁబడియున్నవి. ఇందు చైత్యముల ప్రతిరూపములే గాక చెరియొక వైపు స్తంభములు కలిగిన చక్రస్తంభమును వానిమధ్య బౌద్ధత్రిమూర్తులును కనఁబడుచున్నవి. ఇవి నిలువు స్తంభము మీఁది ప్రతిమలు. ఇవి గాక వీని పైభాగమున నొకయంచురాయి పొడుగున కలుపఁబడి యున్నది. ఈ యంచురాయిమీఁద నడుమ నకుఁ బైభాగముగల మనుష్యప్రతిమ లొక వరుసగను, బరుగెత్తుచున్న మృగము లొక వరుసగను, బౌద్ధగాథల తెలుపు చిత్రవిచిత్రములైన చిత్రములు మఱియొక వరుసగను ఉన్నవి. ఈ చక్రపుబండలమీఁది చెక్కడపుఁబని మిక్కిలి సున్నితమైనది. ఇందలి ప్రతిమలు మిక్కిలి చిన్నవగుటచే నిందుఁగనఁబడిన శిల్పకౌశలము ప్రతిమానము. ఈ పలకల మీఁదఁ జేసిన పనితనము రాతిచెక్కడము వలె లేదు; దంతపుపనిని పోలియున్నది. ఈ పలకలమీఁది శిల్పమింత నాజూకయినందుననే పాశ్చాత్యులు వీనినెంతయో ప్రశంసించి యున్నారు. ఈరాతి పలకలమీఁదఁ గల ప్రతిమల సంఖ్య యింతయని లెక్కించుటకు వీలు లేదు.

స్తూపమునకు దాగోబాయనికూడ పేరు. "దాగోబా" యను ప్రాకృతముమాట "ధాతుగర్భ" శబ్దమునుండి పుట్టినది. బుద్ధుని దంతమో, తలవెండ్రుకయో, లేక బౌద్ధులకుఁ బూజ్యమైన మఱియేవస్తువో పెట్టెలోఁ బెట్టి దానిమీఁద గుళ్లుగోపురములు కట్టిన యెడల దానిని 'దాగోబ' యందురు. అమరావతిలోని యంతర్గర్భాలయ మిట్టిదని కొందఱి యూహ. మొట్టమొదట బుద్ధునియొక్కయు, అతని శిష్యులయొక్కయు దంతములు, వస్త్రములు, పాత్రలు మొదలగు వస్తువు లతిపవిత్రముగఁ బూజింపఁ బడుచుండెను. తరువాత నీవస్తువు లుంచఁబడిన మందిరములే పూజింపఁబడుచు వచ్చెను. ఇట్లర్చింపఁబడుచున్న దాగోబా లనేకము లీస్తూపమునందుఁ గానవచ్చుచున్నవి. మొదట దాగోబాలు రావ పటమునందుఁ గనఁబడు దాగోబావలె నిర్మింపఁబడెను. రావ పటమునందలి దాగోబానుపరీక్షింతము.* ఇం దయిదు పడగల నాగుబాముమాత్రము

* సాంచిస్తూపద్వారములు నిర్మింపఁబడక పూర్వము అనగా క్రీ పూ ౨౦౦ సంవత్సరములప్పుడిట్టి చైత్యమొకటి అమరావతిలో నుండెనని ఇట్టిప్రతిమలవలన మనమూహింపవచ్చును.

చెక్కఁబడియున్నది. కాలక్రమమున దాగోబ అనేకమార్పులనుజెంది బౌద్ధమతము విస్తార వ్యాప్తిని గాంచునప్పటికి ౧ వ పటమందుఁ గానవచ్చు దాగోబయొక్క ఆకృతినిఁదాల్చెను. ఈ పటమునందుఁ గ్రింద రెండు చివరల నిద్దఱు మరుగుజ్జువాండ్రు నెత్తిమీఁద పళ్లెరములఁ బెట్టుకొనివచ్చుచున్నారు. అందు పూజాద్రవ్యములు గలవు. వారికి నివతల మూఁడు పూర్ణకమలముల వరుసలున్నవి. ఆదిస్నే ప్రాకార స్తంభము. అందు మొదట నొకస్త్రీ కూర్చుండి బూజాద్రవ్యముల నమ్ముచున్నది. ఇంకొకస్త్రీ నిలువఁబడి పుష్పాదికములఁగొనుచున్నది. తరువాత మరుగుజ్జు వాఁడును, ఆస్త్రీయును గలిసి దేవాలయములోని కేగుచున్నారు. ఆపైని దేవాలయ స్తంభాదులును కప్పును దాకును. దేవాలయ ముఖద్వారమున కటునిటు స్తంభములపై సింహముల ప్రతిమలత్యంతరమణీయముగ సిల్పఁబడినవి. దాగోబాయొక్క ప్రక్కలందు మఱి రెండు సింహద్వారములు కానవచ్చుచున్నవి. తరువాత లోనికిఁబోయితిమేని నడుమ నిలుచుండిన బుద్ధదేవుఁడు పరివేషయుతముగ ప్రత్యక్షమగును. క్రిందివఱకు ముడతలు ముడతలుగ వ్రేలాడుచున్న కాషాయాంబరము ధరించి, ఎడమచేతితో వస్త్రమును బట్టికొని, కుడిచేతిని జూపుచు భక్తులకు బోధించుచున్నాఁడు. అతనిని నెత్తిమీఁద జలకుంభము లున్న నల్గురు స్త్రీలు సేవించుచున్నారు. కొందఱు నాగదేవతలుకూడ నాతనిఁ బూజించుచున్నారు.

వీరి క్రింది భాగమున నున్న భక్తులు కొందఱు దండప్రణామము లాచరించుచున్నారు. ఇట్లు మధ్యనున్న ముఖ్యవిగ్రహము కొన్ని దాగోబారాళ్లయందు నిలుచున్న బుద్ధుఁడుగను, కొన్నింటిలోఁగూర్చుండినబుద్ధుఁడుగను, కొన్నిఁటిలోఁబడగలువిప్పిన నాగముమీఁదఁగూర్చుండిన బుద్ధుఁడుగను, కొన్నిఁటిలో నశ్వారోహణము చేయుచున్న బుద్ధుఁడుగను, కొన్నిఁటిలో ఏనుఁగుచేఁ గాళ్లకు మ్రొక్కించు కొనుచున్న బుద్ధుఁడుగను నుండును. మఱి కొన్నింటిలో పెక్కుఫణులుగల నాగసర్పము, ధర్మచక్రము, బోధివృక్షము, కాంతకాశ్వము, పరివారసహితుఁడగు నాగరాజు, పాముచుట్టల్లోని బుద్ధునిపాదములు, ద్రోణయుక్తమగు వజ్రాసనము, బుద్ధునిపాదములను పూజించుచున్న నాగరాజు, చిత్రరుపులు చెక్కఁబడిన పతకము మొదలగునవి బుద్ధునికి బదులుగ నుపయోగింపఁబడినవి. దీని పైఅంతస్తుమీఁద పలువిధములగు మృగముల నెక్కి విహరించుచున్న మనుష్యుల పటములు గలవు. ఇంకొక యంతస్తుపైకి నెక్కినయెడల బుద్ధచరిత్రములోనికథానకములను దెల్పు చిన్న చిన్న ప్రతిమ లున్నవి. మధ్యభాగమున కటునిటు రెండుసింహములు కూర్చుండి యున్నవి; నడుమ బుద్ధుఁడు కూర్చుండిశిష్యవర్గమునకుబోధ చేయుచున్నాఁడు. ఆవరుసలో కొనలందులింగాకారములు పోలిన స్తంభములును, కొన్ని గాథలును చెక్కఁబడి యున్నవి. వీనిపై భాగమున నిరుప్రక్కల సన్నని

విచిత్రప్రతిమలత్యంత రామణీయముగనున్నవి. మధ్య నిలువు గీటులవలె అయిదు స్తంభములు కలవు. ఈ స్తంభములపైని ఒకచిన్నదాగోబా కలదు. ఈకల్పమందలి బుద్ధులైదుగురు, ధ్యానము చేయుచున్నట్టి బుద్ధు లయిదుగురు, భూతములైదు; ఇట్లు బౌద్ధమతమునందు పంచకసంఖ్యకు గౌరవము మెండు. కావుననీ అయిదు స్థంభములు వీనిలో దేనినయినను సూచించును. వీనిమీఁదఁబరుగెత్తుచున్న జంతువులవరుసయు, వివిధపూజలుగల తోరణముల వరుసయు, మనుష్యులచే నీడ్వఁబడుచున్న మోహనతోరణపు వరుసయు, పైని కట్టడపుఁగాసులపేరువలెఁ జెక్కినభాగములు కలవు. ఈగోపురముపైని శిఖరమువలె పెట్టె కలదు. అందు బుద్ధునిపాదములో,దంతములో యున్నవని భావము. దానిపై నెగురుచున్న పతాకములును, ఉభయపార్శ్వముల నాకాశమార్గమున వచ్చి పూజించుచున్న దేవ, నాగ, యక్ష, గంధర్వాదుల ప్రతిమలును జిత్రింపఁబడియున్నవి. ఇది మూల దాగోబాలప్రతిమ. ఇట్టి దాగోబ పలకలు మొత్తముమీఁద ముప్పదిమూఁడు దొరికినవి. లోబండల నొకింతశ్రద్ధతోఁ బరికించిన దాగోబానిర్మాణ విధము మనకు స్ఫురించును.

చక్రస్తంభము

చక్రస్తంభమున కటునిటు రెండు స్తంభములు కలవు. ఆ స్తంభముమీఁదఁ బుద్ధునిజీవితసంబంధములైన విషయములొకఁటి పైనొకఁటిగఁ జెక్కఁబడియున్నవి. ఆ పటములపై, అనఁగా స్తంభంముయొక్క పైభాగమున నొక చిన్న దాగోబా కలదు. ఇఁక చక్రస్తంభపుఁగ్రింది భాగమున నొక వజ్రాసనమును, బుద్ధుని పాదము లుంచఁబడిన ముక్కాలు పీటయు నున్నవి. ఇద్దఱు పరిచారకులు వింజామరలు తాల్చి నిలిచియున్నారు. ఇద్దరు దేవతలు గూర్చుండి పూజ చేయుచున్నారు. ఈ వజ్రాసనము వెనుక నుండియే చక్రస్తంభము లేచుచున్నది. ఈ స్తంభమునకు రెండువైపులను కొందఱు గుఱ్ఱముల నెక్కియు, కొందఱు స్త్రీముఖముగల జంతువుల నెక్కియు,యక్షులు స్వారిదీయుచున్న ట్లతిచిత్రముగ ప్రతిమలు చెక్కఁబడి యున్నవి. వీని పైభాగమున మూఁడు సింహము లొక పీఠమును మోయుచున్నవి. పీఠముపైననే చక్రము గలదు. చక్రమధ్యమునుండి కిరణములవలె రేఖలు ప్రసరించుచున్నవి. దీని పైని నృత్యముచేయుచున్న యొకస్త్రీయును, గానము చేయుచు గంతులు వైచుచున్న దేవ గంధర్వాదులును గానవచ్చుచున్నారు.

ఆవ పటమును చూడుఁడు. పటముయొక్క మధ్యభాగము మూఁడు గళ్లగ విభజింపఁబడి

బౌద్ధత్రిమూర్తులు

యున్నది. ఈ మూఁడు గళ్లలోను బౌద్ధమత సారమును సూచించెడి త్రిమూర్తులు గలవు. త్రిమూర్తులు దాగోబా,ధర్మచక్రము, బోధివృక్ష మనునవి. పైభాగమున ప్రాకారపరివృతమగు చైత్య

మును, బౌద్ధధర్మచిహ్నమగు చక్రమును, క్రింద సంఘమునుసూచించు బోధివృక్షమును, ముందుభాగమున వజ్రాసనమును ఉన్నవి. వజ్రాసనముమీఁద పీతాంబరమునందు భద్రపఱుపఁబడిన బుద్ధునిదండము గానవచ్చుచున్నది. ఈ మూటిలో చక్రము బౌద్ధమతధర్మమును దెలుపు సామాన్యచిహ్నము. ఎన్నటికి నెడతెగక చక్రమువలె మరల మరల



౬ వ పటము.

కలుగుచుండు పునర్జన్మములనుండి మానవుని బుద్ధుఁడురక్షింపఁబూనెనని, యీ చక్రమునందలియంతరార్థము.

*అంచురాయి మీది ప్రతిమలు.*

ప్రతిమల మీఁదఁ జూపిన పనితనమింతింతయని చెప్పుటకు వీలులేదు. ఇందు శిల్పకళాప్రావీణ్యమత్యద్భుతముగ జూపఁబడినది. ఇది ౧౯ అంగుళముల మెత్తును ౯౨౧ అడుగులపొడవును గలిగి అంతమేరను దంతపుఁబనిని మించినపనితనముతో శోభిల్లుచున్న ప్రతిమలచే నలంకరింపఁ బడియున్నది. ఇందు మనుష్యులయొక్కయు, దేవతలయొక్కయు ప్రతిమలు ౯౦౦౦ గలవు. ఒక్కొక్క కథ యొక్కొక్కభాగమందు జెక్కఁ బడినది. దుర్భిణీయంత్రసాహాయ్యమునదూరప్రదేశములనుజూడఁ గలుగురీతిని మన మీచిత్తరువుల మూలమున ౨౦౦౦ ఏండ్లక్రింద మనదేశపుస్థితినంతయు నెట్టయెదుట నున్నట్టు కాంచఁగలుగుచున్నారము.

ఈ స్తూపమునందుఁ గానవచ్చు విశేషములింకనుగలవు. మనుష్యుని మెత్తుగల బుద్ధుని

*విగ్రహములు శాసనములు మొదలయినవి.*

విగ్రహములును, నడుమునకు పైభాగముగలమనుష్య విగ్రహములును చాలదొరికినవి. ౯ అడుగుల ౯ అంగుళముల మెత్తుగల బుద్ధవిగ్రహ మింతవఱకు దొరికినవానిలో గొప్పది. ముడుతలు ముడుతలుగల కాషాయవస్త్రమొకటి ఆతని యెడమ భుజముమీఁదుగ పాదముల వఱకు నున్నది. ఇవిగాక బుద్ధునిపూజించుచున్న శాలికుల విగ్రహములుకూడ పెక్కులందుఁ గలవు. ఇంకను విగ్రహములయొక్క తలలనేకములు దొరికినవి. ఇవి యాంధ్రరాజులయొక్కయు, రాణులయొక్కయు విగ్రహములని ఊహింపఁబడుచున్నవి. మఱియు నింక బుద్ధుని శ్రీపాదము లనేకములు దొరకినవి. ఈపాదములు

శేఖలు తీర్చిన చక్రములచేతను, భావభరితములగు పూజలచేతను, మనోహరమైన శిల్పవిన్యాసముచేతను విలసిల్లుచున్నవి.

ఈదీపాలదిన్నెయం దింతవఱకు దొఱకిన నాణెములు సీసముతోఁ జేయఁబడియున్నవి. కావునఁ బూర్వ మాంధ్రచక్రవర్తుల రాజ్యకాలమున సీసపు నాణెములు మాత్రమే ఉపయోగింపఁబడు చున్నట్లు గ్రహించిరి. కాని యిటీవల కృష్ణాజిల్లాలోఁ గొన్నిస్థలములందు బంగారు వెండి నాణెములు గూడ దొఱకుట వలన నాంధ్రచక్రవర్తుల కాలమున బంగారు, వెండిగూడ ఉపయోగింపఁబడుచుం డెననియూహింపవలసివచ్చుచున్నది* అయినను విస్తారముగ సీసపు నాణెములె యుపయోగములో నుండెను. ఈనాణెముల పైని ధర్మచక్రము, స్తూపము మొదలగు బౌద్ధ చిహ్నము లున్నవి. దీపాలదిన్నె వద్ద దొరికిన నాణెములలో ఒక వైపున అశ్వమును, చక్రవర్తినామమును, రెండవవైపున బౌద్ధచిహ్నమును ఉన్నవి. ఈ నాణెములమీఁది యక్షరములలో 'శాతక' యనిమాత్రము స్పష్టముగనున్నది. ఈనాణెములు పావుతులము మొదలుకొని 3 తులములవఱకు నెత్తుగలిగి యున్నవి.

కాలము. ఈ స్తూప మెప్పటిదియని విచారింప వలసియున్నది. ఇందుఁ బెక్కు శాసనములు కలవు. అన్నిటి కాలమును స్పష్టముగఁ దెలియదు. కాని యొకరెండు శాసనములను బట్టి కొంతవఱకుఁ గాల నిర్ణయముఁ జేయవచ్చును. వెలుపలి ప్రాకారము మీఁద నాంధ్ర రాజైన వశిష్టిపుత్రపులుమావి రాజు కాలపు శాసనము దొఱికినది.[1] అందున్నవి రెండు పంక్తులు. వానిలోను కొన్ని అక్షరములు పగిలి పోయినవి. ఆరెండుపంక్తుల యర్థ మిట్లున్నది:—

సిద్ధము! వశిష్ఠ యను నామెపుత్రుఁడైన పులుమావిరాజు రాజ్యకాలము........ సంవత్సరమున, పిండసుతరీయులయిన గృహపతికపూతరుఁడను వాఁడును, గృహపతిపురియనువాని కుమారుఁడైన ఇసిలయను వాఁడును సోదర.........సోదరీ యుక్తముగను నాకానికాయను భార్యాయుక్తముగను, పుత్రయుక్తముగను, చైతికీయుల స్వాధీనమందుండు ........... మహాచైత్యము యొక్క పశ్చిమద్వారమునొద్ద ధర్మ చక్రమును స్థాపించిరి.

ఆంధ్రరాజని పురాణకారులచే వర్ణింపఁబడిన యీవశిష్టపుత్రపులమావి రాజు క్రీ.శ. ౧౩౭-౧౬౩ వఱకు రాజ్యము చేసెనని వేఱు ప్రమాణములవలన నిశ్చయింపఁబడినది.[2] కావున నమరావతిలోని ప్రాకారము కీ. శ రెండవ శతాబ్దమధ్యమునఁ గట్టఁబడుచుం డెనని మనము నిశ్చయముగఁ దెలిసికొనవచ్చును. గర్భాలయ మింతకంటె పూర్వమందె నిర్మింపంబడి

* Numismatia Orientalia P. 22, 23.

1 Burgess' Amaravati, p. 100.

2 V. A. Smith's Ancient History of India, 3rd edition pp. 210, 211.

యుండవలెను. మౌర్యలిపివంటి లిపితో వ్రాయఁబడిన శాసనము లిందుకొన్ని కలవు. కావున నాలిపినిబట్టి యవి క్రీ. పూ. ౨౦౦ల ప్రాంతపువియై యుండనోపునని పండితు లూహించియున్నారు. స్తూపము మీఁది పల కలు ప్రాకారపుబండలకంటెఁదరువాత కాలము నాటివి యని తజ్ఞుల యభిప్రాయము.

ఈ బుద్ధదేవుని దేవాలయము పెక్కువం దల సంవత్సరములవఱకు బౌద్ధమతమువారికి గొప్పక్షేత్రముగ నున్నట్టు కానవచ్చుచున్నది. దూరదూరదేశములవారు వచ్చి యిచ్చట దానములు చేసినట్లు శాసనములు కలవు. నాగార్జునుఁ డను నాతఁడిచ్చట ప్రాకారమును కట్టించెనని తారానాథుఁడను టిబ్బెతు చరిత్ర కారుఁడు వ్రాసియున్నాఁడు.[1] నాగార్జునుఁడు క్రీ. శ. ౧౩౭ మొదలు ౧౯౪ వఱకు నుం డిన వాఁడు. అమరావతిలోఁ బల్లవుని శాసన మొకటి కలదు.[2] ఇందు రెండవ సింహవర్మ యను రాజు భాగీరథిని గోదావరిని, కృష్ణను దాఁటి ధాన్యకటకమునకు వచ్చి బౌద్ధాలయ మును దర్శించినట్లున్నది. ఈ తని కాలమనిశ్చి తము. అయినను అక్షరములఁ బట్టి ఈ శాసన మాఱవ శతాబ్దము నందలిది యని చెప్పవచ్చును. ఇచ్చట అమరేశ్వరుఁడన్న పేరిట శివాలయ మెప్పుడు స్థాపింపఁబడినది, బౌద్ధాలయ మెప్పుడంతరించినది చెప్పఁజాలము. కాని పండ్రెండవ శతాబ్దమున నిచ్చట అమ రేశ్వరదేవాలయమును, బుద్ధుని చిత్ర విచిత్రచిత్రితమైన చైత్యమును ఉండెననియు, ఒకఁడే భక్తుఁడు అమరేశ్వరుని, బుద్ధేశ్వరునిఁ గొల్చుచుండెననియు నిదర్శనము లున్నవి. ఆ గ్రామములో కోట కేతరాజు శాసనముకలదు. అది శా. శ. ౧౧౦౩ (క్రీ. శ. ౧౧౮౨) లో వ్రాయఁబడినది. అందు బుద్ధదేవునకు, అమరే శ్వరునకు గ్రామములు, దీపోత్సవమునకు ఈనాములు ఈయఁబడినవి. ఇంతియగాక శాసనము మొదట నిట్లువ్రాయఁబడియున్నది:

అస్తి శ్రీధాన్యకటకంపురం సురపురాత్పరం
యత్రామరేశ్వరః శంభు రమరేశ్వరపూజితః।
బుద్ధో దేవస్సన్నిధ్యాద్యత్ర ధాత్రా ప్రపూజితః
చైత్యమత్యున్నతం యత్ర నానాచిత్ర సుచిత్రితం। *

శా. శ. ౧౧౮౬లో బుద్ధదేవునకు రుద్ర దేవుని కూఁతురగుకోట బయ్యాలమదేవి భూమి దానముచేసి నట్లొక శాసనముకలదు.[1]

౧౨వ శతాబ్దమునందు ఓఢ్రదేశపు రాజ యిన సూర్యదేవుఁడనువాఁడు తన చేతి క్రింది సామంత రాజుండుటకై అమరావతీ పట్టణ మును స్థాపించెనని యుత్కల దేశపు చరిత్ర చెప్పుచున్నది.[2] దేవాలయము గూడ నప్పుడే

1 Burgess' Amaravati P. 5.

2 Madras Journal of Literature and Science 1886 1887 P. 56.

* Makenzie Collection అమరావతి శాసనము. Epigraphical Reports for 1897 No. 269. Epigraphia Endica, vol. VI p. 147.

1 Epigraphical Reports for 1897 No. 270.

2 Sterling in Journal of Asiatic Society 1837.

అమరావతీ స్తూపము



౧౦వ పటము.

ఇయ్యది లోపలి భాగమందలి ప్రాకారములోఁ జెక్కఁబడియున్న స్త్రీ ప్రతిమలలోనొక్కటి. ఈ ప్రతిమావిశేషమేమన దీని నెత్తిమీద నాగుపాము కలదు. ఒకని తలలోనుండి దూర్చిన కత్తియొక చేతిలోను, నరికిన శిరస్సింకొక చేతిలోను కలదు. ఇది ద్వార సమీపమునందు నుంచఁబడిన పటముగఁ గాన నచ్చుచున్నది.

అమరావతీ స్తూపము

ఒక శాసనము

౧౧వ పటము

ఈ యక్షరములొక చైత్య స్తంభము క్రింద వ్రాయఁబడియున్నవి:—

సిధం వానియ సకుటస స
భేరియస సపుతకస సదుహు
తుకుస సనతుకస దఖినాయా
క చేతియ ఖభోసధాదుకోదానం

అర్థము:—సిద్ధము (శుభము). వర్తకుఁడైనకుటుఁడను వాఁడు భార్యా పుత్రపుత్రికా పౌత్ర సమేతుఁడై సఖా తుకనైనట్టియు చైత్యమునకు దక్షిణమువైపున నున్నట్టియు స్తంభమును దానముచేసెను.

స్థాపింపఁబడి యుండవచ్చును. అమరేశ్వర లింగము ద్వాదశ జ్యోతిర్లింగములలో నొకటి. ఈ దేవాలయము ౧౪వ శతాబ్దమున జీర్ణమై పోగా క్రీ. శ. ౧౩౬౧ లో కొండవీటి అనపోతారెడ్డి మంత్రియైన వేమచమూపతి ఈదేవుని మరల ప్రతిష్ఠించెను. "వేమన్నంగారు శకవర్షంబులు ౧౨౮౩ ప్లవసంవత్సర శ్రావణ బ॥ పంచమీ గురువారము స్వస్తిసమస్త ప్రశస్తులైన శ్రీమతు అనపోతయరెడ్డింగారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని కనకవస్తువాహనసమృద్ధిని పుత్రపౌత్రాభివృద్ధిని అవునట్లుగాను పంచారామంబులకుం బ్రథమారామంబైన అమరారామంబగు ధాన్యవాటీపురంబునకు నధీశ్వరుండైన శ్రీ అమరేశ్వర శ్రీ మహాదేవరను ఆచంద్రార్క స్థాయిగాను పునఃప్రతిష్టచేసిరి"[1] అని అమరావతిలోని ఒక శాసనము చెప్పుచున్నది. దీనినిబట్టి చూడ నమరావతి యప్పుడు కొండవీటివారి స్వాధీనమున నున్నట్లుకానవచ్చుచున్నది. క్రీ.శ. ౧౪౯౧లో ధరణికోటను గన్నభూపాలుఁడను వాఁడు ఏలుచుండెననియు, ఆతనికి సూరాంబయను కూతురుండెననియు, ఆమె నాతఁడు కొండవీటి రాజైన పెదకోమటివేమారెడ్డి కిచ్చి వివాహముఁ జేసెననియు ఫిరంగిపుర శాసనమువలన దెలియుచున్నది.[2]

1. Elliot's Collections; Local Records Vol. 38 p. 28; No. 258 of the Gov. Epi. collections for 1897.

2. Epigraphia India, Vol. II p. 315.

## గ్రంథసంగ్రహము.

అమరావతిస్తూప ప్రతిష్ఠ జగమంతయు వ్యాపించి దాని ప్రతిమలు(models) ప్రపంచమందలి యన్ని చిత్రవస్తు సంగ్రహాలయములలో నుంచినను, తెనుఁగున మాత్రమందున గురించి యొక గ్రంథమైనను లేకపోవుట కడుశోచనీయము. ఆంధ్రుల చరిత్రము ౧వ భాగమునందు దీనిని గురించి కొద్దిగాఁ జెప్పఁబడినది. ఇందును గురించి యధికముగఁ దెలిసికొనఁ గోరువారు ఈక్రింది యింగ్లీషుగ్రంథములఁ జూడనగును.

(1) Tree and Serpent worship by Fergussen (1873).
(2) Report on the Tope at Amaravati by Sewell (1882).
(3) Topes at Amaravati and Jaggiahpet by Burgess (1887).
(4) History of Indian and Eastern Architecture by Fergusson (1899).
(5) Amaravati by V. A. Smith in Encyclopaedia of Religion and Ethics Vol. I.
(6) Kistna District Manual.

[కా. వీ.

**అమరావత్యుమామహేశ్వర శతకము.** విశ్వనాథకామయ్య కృతము. తెలుగులో వ్రాయఁబడిన శివుని స్తోత్త్రము.

**అమరి.** (మైకేల్ ౧౮౦౬-౧౮౮౯) ఇటలీదేశపుచరిత్రకారుఁడు. పౌరస్త్య(Oriental) భాషావేత్త, రాజకార్యనిపుణుఁడు. ఇతఁడు ౧౮౩౪లోను ౧౮౪౧లోను చరిత్రగ్రంథములు కొన్నింటిని ప్రకటించెను. సిసిలీ సంబంధమై యితఁడు వ్రాసిన గ్రంథమందలి రాజకీయాభి

ప్రాయమునకు వెరచి యప్పటి దొరతనము వారా గ్రంథమును అణగద్రొక్క యత్నించిరి. ఆగ్రంథము నాతఁడు ఫ్రాన్సులోని ప్యారీసు పట్టణమునందు మారుపేరుతో ప్రకటించెను. ౧౮౪౮లో సిసిలీదేశమున ప్రజలు తిరుగఁబడినప్పుడుఆతఁడుప్యారిసుపట్టణమునకుఁబోయి కొన్ని సంవత్సరముల వఱకు విద్యాప్రసంగములతో కాలము గడపుచుండెను. దేశోద్ధారకుఁడైన గ్యారిబాల్డీతోఁ గలిసి దేశసేవఁజేయవలెనని యాతఁడు ౧౮౫౯లో తిరిగి ఇటలీదేశమునకు వచ్చెను. ౧౮౬౧లో సెనెట్ సభాసదుఁడయ్యెను.౧౮౬౨-౪ కాలమున విద్యాశాఖకు మంత్రిగ నుండెను. కొన్ని సంవత్సరముల వఱకు పీసాలోను, తరువాత ఫ్లారెన్సులోను అరబ్బి బాషకు మహోపాధ్యాయుఁడుగ నుండెను.

**అమరుకకావ్యము.** నాయికానాయికుల శృంగారచేష్టలనువర్ణించునట్టియొక చిన్న సంస్కృతశతకము. ఇది అమరుకుఁడను కవిచే రచియింపఁబడెనని కొందఱందురు. మఱికొందఱు శంకరాచార్యులు కామశాస్త్రమును అభ్యసించు నిమిత్తమై తన శరీరమును విడిచి ఒకచోటనుంచి, చనిపోయిన అమరుకుఁడను రాజుయొక్క శరీరములోఁ బ్రవేశించి ఆతనిభార్యలతో విలాసంబును సలుపుకాలంబున నాతఁడు వ్రాసినట్టి కావ్యమిదియనిచెప్పుదురు. ఈ అమరుకుఁ డెవఁడో నిశ్చయముగఁ దెలియ లేదు. ౯ వ శతాబ్దమందుండిన ఆనందవర్ధనాచార్యుఁడు తన ధ్వన్యాలోకమను అలంకార గ్రంథమునందు నిందలి శ్లోకముల నుదాహరించుటచే నీయది యంతకుఁ బూర్వము రచింపఁబడినదని మన మూహింపవచ్చును.

ఇందుపై అర్జునదేవ, రుద్రమహాదేవ, సూర్యదాస, శేషరామకృష్ణ, పెదకోమటివేమభూపాలాది రచితములైన వ్యాఖ్యానంబులు పెక్కులు కలవు. వీనిలో పెదకోమటివేమభూపాలుఁడు కొండవీటిలో క్రీ. శ. ౧౪౦౦-౧౪౨౦ వఱకు రాజ్యముచేసిన రెడ్డిరాజు.

ఈ కావ్యమును తాళ్లపాక వెంకటేశ్వర దీక్షితుల కుమారుఁడైన తిరువెంగళప్ప తెనుఁగించియున్నాడు. [1] ఈభాషాంతరమందలి పద్యములు రసవంతములుగ నున్నవి. ప్రతి పద్యమునకును పూర్వము గ్రామ్యభాషలో వచనరూపమైన యవతారికఁగలదు. దీనికి సీస పద్యములతో చేయఁబడినమఱియొక భాషాంతరమును గానవచ్చు చున్నది. కాని, అదియంత సరసముగ లేదు. గ్రంథకర్త యెవఁడో తెలియదు. [2] దీనికి తెనుఁగున ప్రతి పదార్థము వ్రాసి వేమభూపాలుని వ్యాఖ్యానముతో నిటీవల బ్రహ్మశ్రీ వేదము వెంకటరాయ శాస్త్రి గారు ప్రకటించి యున్నారు.

1 Triennal Catalogue of Manuscripts in the Oriental ManuscrpitLibrary, Madras 1910-11 to 1912-13. No.

2 Do No. R. No. 17 లైబ్రరీలోని నెంబరు కె. ౪౧౭

**అమరణుఁడు.** ఒక బ్రహ్మర్షి (చూఁడు. అత్రి)

**అమర్షణుఁడు** (సూ. వం) శ్రీరామ చంద్రుని పుత్రుఁడైన కుశుని సంతతి వాఁడైన నభుని వంశమునందుఁబుట్టిన సంధియనురాజు యొక్క కుమారుఁడు. ఇతని పుత్రుని పేరు మహస్వంతుఁడు.

**అమర్త్యుఁడు.** ఉశనాఋషియొక్క యిద్దరి పుత్రులలో రెండవ వాఁడు.

**అమరేశ్వరుఁడు.** ఒక యాంధ్ర కవి. ఇతని కావ్య మెద్దియు నిప్పుడు కాన రాకున్నను ఒకప్పు డీతఁడు గొప్ప యాంధ్ర కవిగాఁ బరిగణింపఁ బడుచున్న ట్టీతని నితర కవులు స్తుతించుటచేఁ దెలియుచున్నది. ఇత నిని మొట్టమొదట స్తుతించినవాఁడు ఛందస్సును రచించిన అనంతామాత్యుఁడు. తనచే రచింపఁబడిన "భోజరాజీయము" నందుఁ బూర్వకవుల స్తుతించుచు "పే, రెన్నిక కెక్కినట్టి యమరేశ్వరుఁ ... ... ... దలఁతు" నని చెప్పెను. అనంతామాత్యుఁడు పదునైదవ శతాబ్ద మధ్యము నందు (క్రీ. శ ౧౪౩౪) నుండినవాఁడు. (చూఁడు అనంతామాత్యుఁడు) కావున నమరేశ్వరుఁడు ౧౩ లేక ౧౪వ శతాబ్దమువాఁడై యుండనోపు. "క్రీడాభిరామము" అను గ్రంథమునందు వల్లభరాయకవి "చిమ్మపూడియమరాధిపుఁడన్నను సత్కవీశ్వరుల్" అని చెప్పి యీతనిని గొప్ప కవులలోఁ జేర్చెను. వల్లభ రాయని కాలము క్రి. శ. ౧౪౨౦ అని యందురు*౧౬వ శతాబ్దాంతమువాఁడైన భట్టుమూర్తి "నరసభూపాలీయము" నందు నితనిని "శ్రీనాథుని పదప్రసిద్ధ ధారాశుద్ధి, యమరేశ్వరుని సహస్రముఖ దృష్టి" యని మహాకవులతోఁ సాటిగఁ బొగిడి యున్నాఁడు. ఇట్లీ కవి పూర్వకాలమునందు నన్నయ, తిక్కన, శ్రీనాథాదులతోఁ సమానముగ స్తుతింపఁ బడుచుండెను. పదునాఱవ శతాబ్దాంతము వఱకు నీతనిచే రచింపఁబడిన "విక్రమసేనము" అను కావ్యము వాడుకలో నుండినట్లు స్పష్టమగు చున్నది. పదునాఱవ శతాబ్దము వాఁడగు జగన్నాథకవి యను నాతఁడు వేఱువేఱు కవులవర్ణనములనుగ్రహించి ప్రబంధ రత్నాకరమన్న కావ్యమునొకదానిని రచించెను.[1] అందు నమరేశ్వరుని "విక్రమసేనము" లోనుండి ౫౦ పద్యముల కంటె నెక్కుఁడు పద్యము లుదాహరింపఁ బడినవి. ౧౮-వ శతాబ్ద మధ్యమందుండిన కూచిమంచి తిమ్మకవిరచిత సర్వలక్షణ సారసంగ్ర

* బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు క్రీడాభిరామము ప్రకటించి యందలి పీఠికలో "ఈ గ్రంథము క్రీ. శ. ౧౪౨౦ లోఁగా రచితమైనది" అని వ్రాసినారు. కాని యీకవికాలమిఁకను నిశ్చయముగఁ దెలియ వలసి యున్నది.

1 ఈ గ్రంథముయొక్క ప్రతి తంజావూరు పుస్తక భాండాగారమునం దున్నది.

హమునందు అమరేశ్వరుని విక్రమసేనము నుండి యొకపద్యమును ఇచ్చియున్నాఁడు. అతఁడీ గ్రంథమును స్వయముగఁ జూచియే వ్రాసెనో లేక యితర గ్రంథకర్తలయొద్దనుండి గ్రహించెనో ? ఎట్లయిన నేమి యీమహాకవి యొక్క విక్రమసేన కావ్యము ౧౮వ శతాబ్దమునుండి తెలుఁగు దేశమున లోపించినది. ప్రబంధరత్నాకరములో నిందుండి ౫౦-౬౦ పద్యము లీయఁబడినను అన్నియు వర్ణనములు గనుక, గ్రంథ విషయమును గుఱించిగాని, యందలి నాయికా నాయకులను గుఱించిగాని యేమియుఁ దెలిసి కొనుటకు వీలులేదు.

**అమల.** వైవస్వతమన్వంతరమందలి అత్రి ఋషియొక్క కన్య. ఈమె మిక్కిలి బ్రహ్మనిష్ఠగలది.

**అమల్ నేర్** (గ్రామము) బొంబాయి రాజధాని, తూర్పుఖాందేశ్ జిల్లాలోని అమల్ నేర్ తాలూకాకు ముఖ్యస్థలము. జనసంఖ్య ౧౦౭౯౪. ఇచ్చట ఒకమునిసిపాల్టీ కలదు. ఇక్కడ ధాన్యవర్తకము అధికముగానుండును. ఇక్కడ రెండు ప్రత్తిఫ్యాక్టరీలుగలవు. సఖారాంబావాయను ఒకమహాత్ముఁడు ౧౮వ శతాబ్దమున నిచ్చట నుండెను. అతనిపేర నొక దేవాలయ మున్నది. మే నెలలో ప్రతిసంవత్సరమును ఉత్సవము జరుగుచుండును. ఇచ్చట ఒక సబ్ జడ్జికోర్టును, ఒక ఆసుపత్రియు, రెండు బాలుర పాఠశాలలును, ఒకటి బాలికా పాఠశాలయు గలవు.

**అమల్ నేర్** (తాలూకా) బొంబాయి రాజధాని, తూర్పుఖాందేశ్ జిల్లాలోని ఒక తాలూకా. విస్తీర్ణము ౫౨౭ చదరపుమైళ్లు. గ్రామములసంఖ్య ౨౨౭. జనసంఖ్య ౧౧౧౭౯౩. భూమిపన్ను రు. ౩౪౦,౦౦౦. సెస్సులు రు.౨౩౦౦౦. తాప్తీనదియు, దానియుపనదులగు బోరి, పాంజ్రానదులును ఈతాలూకాలోని భూములకు జలమిచ్చును. ఇచ్చటి శీతోష్ణస్థితి ఆరోగ్యకరమైనది. వర్షమానము సంవత్సరమునకు ౨౩ అంగుళములు.

**అమలాపురము** (గ్రామము) అమలాపురము తాలూకాకు ముఖ్యస్థలము. జనసంఖ్య(౧౯౧౧లో) ౧౨౬౧౫. మగవాండ్రు ౬౧౧౦; ఆడవాండ్రు ౬౫౦౫; హిందువులు ౧౧౮౭౨. మహమ్మదీయులు ౬౪౦. క్రైస్తవులు ౯౩. ఇది ఒక యూనియన్ గ్రామము ఇక్కడనుండు అధికారులు:— తాహసీల్ దారు, స్టేషనరి సబ్ మ్యాజి స్ట్రేటు, డిస్ట్రిక్టు మునసబు, సబ్ రిజిష్ట్రారు. ఇచ్చట ఒకపోలీసు స్టేషను, రాదారి బంగళా, స్వదేశజలకై కారొనేషన్ విశ్రాంతి గృహము, లోకల్ ఫన్డు ఆసుపత్రి, హైస్కూల్ కలవు. ఇది రాజమహేంద్రపురమునకు ఆగ్నేయ దిక్కున ౩౫ మైళ్ళదూరమున ముఖ్యకాలువ మీాద నున్నది.

**అమలాపురము.** (తాలుకా) గోదావరి జిల్లాలోని ఒక తాలూకా. దీని

విస్తీర్ణము. ౩౬౭ చదరపుమైళ్లు. ఇందు మొత్తముమీద ౧౨౦ గ్రామములు కలవు. వానిలో ౧౦౦ గవర్నమెంటు గ్రామములు, ౧౩ జమీందారి గ్రామములు, ౭ ఈనాం గ్రామములు. ఈ తాలూకా ఒక త్రిభుజము వలెనుండును. గోదావరీనదీ శాఖలైన వశిష్ట, వైనతేయ, గౌతమి యను నదులకును, సముద్రమునకును నడుమ నుండును. ఇందు, నగరములంకయుఁ గలదు. ఇదియంతయు గోదావరీ నదియొక్క మధ్యడెల్టా లోనిభాగము. ఈతాలూకాలోని విశేషభూములు పంటకు మిక్కిలి అక్కరకు వచ్చునట్టి బండు భూములు. ఇందలి ౧౯౧౧ సం. జనసంఖ్య ౨౧౫౭౧౦. వీరిలో ౧౦౪౦౬౬ మంది పురుషులు, ౧౦౧౧౬౪౪ మందిస్త్రీలు. ౧౯౦౧. సం. కంటె ౧౯౧౧ సం. లో నూటికి, పదునాలుగు ప్రకారము జనసంఖ్య హెచ్చినది. గోదావరిజిల్లాలోని అన్ని తాలూకాలలోని కంటె నిందు అధికజనసమ్మర్దనము కలదని చెప్పవచ్చును. ఇచ్చట మొత్తముమీద ఒక చదరపుమైలులో ౫౭౮ మంది జను లుందురు. ఇందలిజనులలో ౨౮౪౨ మహమ్మదీయులు, ౪౪౯ మంది క్రైస్తవులు, ౧౦౦ గురు ఎరికలమొదలైన అడవిజాతివారు. మిగిలిన వారందఱును హిందువులు.

వీరిలో అక్షరజ్ఞులు పురుషులు ౧౦౫౧౬, స్త్రీలు ౮౬౧. ఇంగ్లీషువచ్చినవారు ౯౩౦ పురుషులు ౧౫ గురుస్త్రీలు. ఈ తాలూకా భూమి మొత్తము ౨౩౪౭౯౮. ఎకరములు.

అందుకు వివరము:—

| | | |
|---|---|---|
| రైతువారి. | ౧౧౪౧౯౮ | ఎకరములు |
| మైనరుఇనాము | ౪౬౭౩౬ | ,, |
| ఈనాము. | ౨౪౭౦ | ,, |
| జమీందారి | ౭౧౩౯౪ | ,, |
| | ౨౩౪౭౯౮ | ఏకరములు |

| | |
|---|---|
| అరణ్యము (Forest) | ౮, ౪౩౨ |
| పోరంబోకు | ౬౮, ౨౯ |
| గయాళు | ౩౧, ౩౬౬ |
| రైతాధీనము | ౧౨౬, ౬౭౧ |
| | ౨౩౪౭౯౮ ఎకరములు |

ఇందలి పల్లపుభూములన్నియు కాలువ పారుదలవలన ఫలించును. అయినను అచ్చటచ్చటభావులక్రిందను వ్యవసాయము చేయునాచారముకలదు. పురాతనకాలమునుండియు, ఈ తాలూకాలో పెద్దపెద్దభావుల క్రింద తోటలు మొదలైనవి పండించు నాచారము కలదు. కొన్ని పురాతనములైన భావులను జైనుల భావులని, రెడ్లభావులనియు అచ్చటి జనులు వాడుదురు. పూర్వకాల మచ్చట జైనులు నివసించిరని చెప్పెదరు. అచ్చటి జనులు ఈ దేశము పాంచాలదేశమనియు, అమలాపురము దానికి రాజధానిగ నుండెననియు చెప్పుదురు. కాని భారతము నందు వర్ణింపఁబడిన పాంచాలదేశ మిదిగాదనుట నిశ్చయము. అయ్యది యిప్పటి పం

జాబుదేశమునం దుండెను. ఈ తాలూకాలో వ్యవసాయమే ముఖ్యవృత్తి. ఇదివఱకు దేవాంగులు బట్టలను నేసి యితర దేశములకుఁ బంపుచుండిరి. కాని బెండమూడిలంక రేవు యొక్క ప్రముఖత తగ్గినప్పటినుండియు ఈవ్యాపారము నశించినది. బెండమూడిలంకలో ౧౭౫౧ సం., ఈష్టు ఇండియాకంపినివారు వర్తక నిమిత్తమై ఒక గిడ్డంగి (Factory) కట్టిరి. ఫ్రెంచిసేనానియగు, బుస్సి, ౧౭౫౭లో దానిని స్వాధీనపఱచుకొనెను. కొండూరు యుద్ధానంతరమున మరల నది కంపెనివారి స్వాధీనమయ్యెను. సీమబట్టలువచ్చిన తరువాత క్రమముగ నచ్చటి వర్తకము తగ్గిపోయెను. ఈతాలుకాలోని అంబాజిపేట అను గ్రామమునందు పుశువులసంత జరుగుచుండును. ఈ ప్రాంతమును ఆంధ్రులు సాధారణముగ కోనసీమయందురు. ఇందలి పేరూరు అను గ్రామమున మిక్కిలి పూర్వకాలమునందు ద్రావిడ బ్రాహ్మణులు కొందఱువచ్చి నివసించిరి. వారిని పేరూరుద్రావిడులందురు. నేదునూరు, ఆత్రేయపురము, అనుగ్రామములలో జైనులకు సంబంధించిన జీర్ణ శిలాశాసనాదులుకలవు.

**అమలుఁడు.** దుష్టబుద్ధియనుమంత్రి యొక్క కనిష్ఠ పుత్రుఁడు. (చూఁడు చంద్రహాసుఁడు)

**అమవసువు.** పురూరవుని కొడుకు. వీనికి విజయుఁడని నామాంతరము కలదు.

**అమానిగంజ్ హాట్.** బంగాళా రాజధాని యాల్డాజిల్లాలోని ముఖ్యమైన పట్టు వర్తకస్థలము. ఇచ్చట విశేషజనులు కాపురముండరుగానిచుట్టుపట్టునున్న ముర్షిదాబాదు, రాజహే జిల్లాలలోనుండి వర్తకులు పట్టు పురుగుల నిమిత్తమై, పట్టుదారము నిమిత్తమై వందలు వందలుగా సంతకు వచ్చుచుండెదరు. ఎక్కువగా వర్తకము జరుగుదినములలో ఒక సంతదినమున లక్షరూపాయిలవర్తకము గూడ జరుగును.

**అమార్గపథుఁడు.** ఒక బ్రహ్మర్షి. (చూఁడుభృగువు.)

**అమాల.** బొంబాయిరాజధానియందలి ఒక మిక్కిలి చిన్న సంస్థానము.

**అమావాస్య.** ఈశబ్దమునకు అమావస్యఅనియు రూపాంతరముగలదు. సూర్యచంద్రులకు పూర్వ,పశ్చిమాంతర మేమియు లేక పొద్దరును ఒక్కచోట నుండుకాలము. ఇది యే కృష్ణపక్షమందలి ౧౫ వ తిథి. ఈ దినమున చంద్రుఁడు కానరాఁడు. చంద్రుని కళలు బహుళపాడ్యమినుండి తగ్గుచు తగ్గుచు అమావాస్యవరకుపూర్తిగలోపించును. శుద్ధపాడ్యమి నుండి యెక్కుచు పౌర్ణమివరకు పూర్తియగును. ఈ విధముగ చంద్రకళలు హెచ్చుటకును తగ్గుటకును కారణములు విచారింతము. చంద్రునకు స్వతస్సిద్ధమైన తేజస్సు లేదు. భూమి

వలనే ఆతఁడును సూర్యుని తేజస్సు వలననే ప్రకాశించును. చంద్రునియొక్క యేభాగమునందు సూర్యకిరణములు పడునో యది ప్రకాశవంతముగను,మిగిలినభాగముచీకటిగను ఉండును. గోళాకారముగనున్న చంద్రుని అర్ధభాగముమీద సూర్యుఁడెప్పుడు ప్రకాశించుచుండినను, చంద్రుఁడు భూమిచుట్టును, తన చుట్టును తిరుగుచుండుటచే ప్రకాశవంతమైన ఆతని భాగమంతయు మనకు అన్నిసమయములందును కానరాదు. మనకు కనఁబడు వెలుతురుగల భాగమును అనుసరించి చంద్రబింబము మనకు ఒకప్పుడు చిన్నదిగను ఒకప్పుడు పెద్దదిగను కనఁబడుటయు, నొకప్పుడు కనబడకుండుటయు తటస్థించును. ఈక్రింది పటము యొక్క సాహాయ్యమున చంద్రుని కళల వృద్ధిక్షయములు తెలిసికొనవచ్చును.




చంద్రకళలను చూపు పటము.

ఈ పటమునందు చంద్రునియొక్క ఎనిమిదిరూపములు చూపఁబడినవి. ఈయెనిమిది ఒక నెలలోని ఎనిమిది తిథులను సూచించును. ౧. అమావాస్య, ౫. పౌర్ణిమ, ౨. శుద్ధతదియ, ౬. బహుళతదియ, 3. శుద్ధఅష్టమి, ౭.బహుళాష్టమి, ౪. శుద్ధద్వాదశి, ౮. బహుళద్వాదశి.

ఈ పటము అర్థమగుటకు నడుమ భూమియున్నదని అనుకొనుడు. కక్ష్యకు కుడివైపున బహుదూరమునసూర్యుఁడున్నాఁడనుకొనుఁడు. ౧వ స్థానమందు చంద్రుఁడు భూమికిని అనగ మనకును, సూర్యునకును నడుమ నున్నాఁడు. కావున వెలుతురుగలచంద్రార్ధభాగము మనకు మరుగై చీకటిగల యర్ధభాగమే భూమివైపు తిరిగి యుండును. ఇట్లు మనకు చంద్రుఁడు

క్కనఁబడఁడు. ఇది అమావాస్యదినము. అక్కడి నుండి చంద్రుఁడు బయలుదేరి వెళ్ళినకొలఁదిని వెలుతురుగల చంద్రార్ధ భాగములోని కొంచెము కొంచెము భాగము దినదినము మనకు కానవచ్చుచుండును.

౨-వ స్థానమునందు ౪ దినములైనతరువాత చంద్రుఁడుండుట తటస్థించి బింబములో నాలుగవవంతు మనకు ప్రకాశవంతముగా గానవచ్చును. ఇదియే శుద్ధతదియ వెడలి చవితి జరుగుచున్న కాలము. 3వ స్థానమునందు చంద్రునిమీఁది వెలుతురు భాగములో మనకు సగము కనఁబడుటవలన చంద్రబింబము సరిగ సగము కనఁబడును. ఇది శుద్ధసప్తమి గడచి అష్టమి జరుగుచున్న కాలము. ౪వస్థానమందు చంద్రబింబము రమారమి మూఁడువంతులు కానవచ్చును. ౫వస్థానమునకు చంద్రుఁడు వచ్చినప్పుడు భూమి చంద్రునకును సూర్యునకును నడుమ నున్నందున వెలుతురుగల చంద్రార్ధభాగమంతయు మనకుఁగానవచ్చును. ఇదియే పౌర్ణిమతిథి ౫వ స్థానమునుండి చంద్రుఁడు ౧వ స్థానమునకు. బోవుకాలము కృష్ణపక్షమని పించుకొనును ఈ పక్షము నందు చంద్రుఁడుకళలు గతగ్గుచు అమావాస్యవరకు పూర్తిగఁబోవునని పటములో ౬, ౭, ౮, ౧ అంకముల యొద్దనున్న చంద్రబింబాకారములవల్ల సూచింపఁబడినది.

**అమావాస్యశాండిల్యాయనుఁడు.** వంశబ్రాహ్మణమునందు అంశుధనంజయ్యునిఁ గురువుగఁ జెప్పఁబడిన వాఁడు.

**అమాసిస్** (లేక ఆహమెస్; క్రీ. పు. ౫౧౦-౫౨౬) ఈజిప్టుదేశపు రాజు. ఇతనిప్రభుత్వకాలమున ఈజిప్టుదేశము మిక్కిలి వైభవమును అనుభవించినది. గ్రీసుదేశముతో వర్తకము ప్రారంభించెను. గ్రీకుదేశపు పడుచును వివాహ మాడెను. సోలన్, థేల్స్, పైతగోరస్ అను తత్వజ్ఞులతో ఇతనికి స్నేహము ండెనఁట.

**అమిందీవిలంకలు.** మద్రాసు రాజధానిలోని దక్షిణ కన్నడజిల్లాకుసంబంధించిన పశ్చిమ (అరబ్బీ) సముద్రములోని దీవులు. ఇవి అయిదు. అందు నాల్గుదీవులమీఁద జనులు నివాసముందురు. ఆ నాలుగుదీవుల విస్తీర్ణము 3 చదరపుమైళ్లు. అవి పశ్చిమతీరమునుండి నూటడెబ్బది మొదలుకొని రెండువందల మైళ్ల దూరమునం దున్నవి. ఇవి సముద్రముమీఁద ౧౦ మొదలుకొని ౧౫ అడుగుల ఎత్తున నుండును.

ఈ దీవులు ౨ శతాబ్దముల వరకును క్యానన్నూరు సంస్థానాధీశుల సంరక్షణము నందుండెను. కాని క్రీ. శ. ౧౭౮౬ లో జనులు తిరుగఁబడి మైసూరివారి స్వాధీనమైరి. క్రీ.శ. ౧౭౯౯లో దక్షిణ కన్నడజిల్లా కంపెనీ

వారి స్వాధీనమైనప్పుడు ఈ దీవులుగూడ వారి ప్రభుత్వములోనికి వచ్చెను. క్యానసూరు సంస్థానాధీశ్వరియైన బిబ్బీకి నీ దీవులక్రింద కంపెనీవారు ౧౦౨౫౦ రూపాయనిచ్చిరి. ఇప్పుడు ఈ దీవులమీద నొక మణీదారుఁడు అధికారిగ నున్నాడు. వానికి మూడవక్లాసు మేజస్ట్రీటు అధికారము గలదు. కొన్ని సివిల్ కేసులుకూడ అతడు విచారించును. ఈవిచారణ చేయునప్పు డాతనికి గ్రామములోని కొందఱు పెద్దలు పంచాయతీగ నేర్పడి సహాయము చేయుదురు. జనసంఖ్య ౩౮౨౨.

ఇచ్చటి జనులు చాలమంది ముసలిమానులుగా మారిన హిందువులు. వీరు మాటలాడునది అపభ్రంశమైన మళయాళము భాష. వీరు మళయాళము నుండే వచ్చి యుందురని యూహింపఁ బడుచున్నది. ఇచ్చటిజనులు సాధు వృత్తిగలవారు, శాంతప్రియులు, సంతృప్తిగలవారు. గొప్ప నేరము లచ్చటరుదు. ఇచ్చట కొబ్బరి చెట్లు విస్తారముగ నుండును. ఇక్కడి ఆడువాండ్రు కొబ్బరినార, తాళ్ళు విశేషముగ చేయుదురు.

ఈనారయు, త్రాడులును ప్రభుత్వము వారేకొనుచురుగాని యితరులుకొన వీలులేదు. ప్రభుత్వము వారిచ్చు ధరకు నచ్చటి జనులు వాని నమ్మవలయును ప్రభుత్వమువారు మాత్రము వారిష్టమువచ్చిన వెలకు అమ్ముకొందురు. ఈవర్తకమువలననే క్యానసూరు సంస్థానము వారికి యియ్యవలసిన ౧౦౨౫౦ పోను ౨౩౮౨ రూపాయిలు లాభమువచ్చును.

**అమితాశ్వుఁడు.** ఇతనికి బర్హితాశుఁడని నామాంతరము గలదు.

**అమితౌజుఁడు.** భారతయుద్ధమునందు దుర్యోధన పక్షమునందు పోరినరాజు. హేతు మంతుండను అసురుని యంశంబున జన్మించిన వాఁడు. (భార. ఉద్యో. ౧౭౧)

**అమిత్రజిత్తు.** (సూ. వం) ఇక్ష్వాకు వంశజుఁడైన అంతరిక్ష రాజునకు పౌత్రుఁడు. సుతపోరాజునకుఁ బుత్రుఁడు.

**అమిత్రతపన శుష్మిణ శైబ్యుఁడు.** అత్యారాతిజానంతపియను వానిని చంపినవాఁడు (ఐతరే. బ్రా. ౮. ౨౩)

**అమీనా.** మహమ్మదీయ మత స్థాపకుడైన మహమ్మదుయొక్క తల్లి, అబ్దుల్లాభార్య, వాహబ్ కుమార్తె. అప్పటిస్త్రీలలో మిక్కిలి చక్కనిదనియు, బుద్ధిశాలిని అనియు, సద్గుణవతి యనియు పేరొందెను. మహమ్మదుపుట్టిన ఆఱవయేట అనగా క్రీ. శ. ౫౭౭వ ప్రాంతమున మృతినొందెను.

**అమీన్ అహమ్మద్.** ఇతనినే అమీన్ అహమ్మద్ రాజీ అందురు. ఈతఁడు అక్బరు చక్రవర్తి కాలమునందు హఫ్తఅక్లీమ్

అనగా సప్తప్రదేశములు అను చరిత్రాత్మకమైన కోశమును వ్రాసెను. సమశీతోష్ణ కటిబంధంబును,(Temperate Zone) ౭ ప్రదేశములుగా విభజించి అందొక్కొక్కదాని వివరణమును, అందలి ముఖ్యపట్టణమును ఇచ్చుటయేగాక, ఆ యాస్థలములందుఁ బుట్టిన ప్రసిద్ధ పురుషులయొక్కయు, ప్రసిద్ధకవులయొక్కయు చరిత్రమును వ్రాసియున్నాఁడు.

**అమీన్ గడము.** బొంబాయి రాజధాని, బిజాపూరుజిల్లా, హుంగుందు తాలుకాలోని ఒక గ్రామము. హుంగుందునకు తూర్పున ౭మైళ్ళమీద నుండును. జనసంఖ్య ౭౭౩౮. ఇచ్చట పశువుల సంతయొకటి గొప్పగ జరుగుచుండును. సముద్రముమీదనుండి వచ్చు టెంకాయలయొక్కయు, బియ్యము యొక్కయు వర్తకమునకు ఇది ముఖ్యస్థలమై యున్నది.

**అమీరసింగుటప్పా.** చూఁడు అవ అమర సింహుఁడు.

**అమీర్ ఖాన్** (నవాబ్.) ఢిల్లీచక్రవర్తి యగు మహమద్‌షాహాకాలమునాటి ఒక సరదారుఁడు. ౧౭౩౯ లో అలహాబాద్ ప్రాంతమునకు గవర్నరుగ నిర్మింపఁబడెను. ఇతఁడు చక్రవర్తితో మిక్కిలి చనువుగా భయము విడిచి మాట్లాడుచుండెను. ఇతనిని ఒకసేవకుఁడు చక్రవర్తి సమ్మతితో ౧౭౪౭లో పొడిచి చంపెను. ఇతఁడు కవిత్వముకూడ చెప్పుచుండెను.

**అమీర్ ఖాన్.** (పిండారీ)ఇతఁడు ప్రస్తుతపు టోంక్ నవాబునకు మూలపురుషుఁడు. ఇతఁడు మొదట యశవంతరావు హొళ్కరువద్ద సేనాపతిగ నుండెను. తరువాత ౧౮౦౬లో అచ్చటినుండి వెళ్లిపోయి పిండారులకుసరదారుఁడై దేశము లెల్ల కొల్లగొట్టెను. ఇతడు హొళ్కరు రాజులయొద్దనుండి సంపాదించిన రాజ్యమంతయు నితనికి ఇచ్చివేసి ౧౮౧౭లో నితనితో ఇంగ్లీషువారు సంధిచేసికొనిరి. ఇతఁడు తనయొద్దనున్న ఫిరంగులన్నియు ఇంగ్లీషువారికి నిచ్చివేసి తనసైనికులగు పిండారీ దోపుడుమూకను పంపివేసెను.

**అమీర్ బరీద్ ౧.** ఇతడు బేదర్‌లో రాజ్యమేలిన బేరద్‌శాహి నవాబులలోరెండవవాఁడు. కాశీంబరీద్ కుమారుఁడు. తండ్రి మరణానంతరమున ౧౫౦౪లో రాజ్యమునకు వచ్చెను. ఆకాలమునందు బహమనిరాజైన సుల్తాన్ మహమూద్‌షాహా అనువాఁడు ౧౫౧౭ లోమరణమునొందగా నతని స్థలమున ౩వ అలాఉద్దీను అను వానిని సింహాసనాసీనునిగాఁ జేసెను. వాఁడు కొద్దిదినములలో మృతినొందగా కలిఉల్లాఅను వానిని పేరుకు రాజ్యము మీద కూర్చుండఁబెట్టెను. వాఁడు అమీర్ బరీద్ పెట్టుచున్నట్టి బాధను పడలేక అహ

మహ్మదనగరమునకు పారిపోయి అచ్చటనే మరణమునొందెను వానితో బహమని వంశము పూర్తిగ నశించెను. అమీర్ బరీద్ అహమదాబాద్ బీహారు రాజ్యమును సర్వస్వతంత్రముతో ౧౫౪౯సం. పరిపాలించెను. ఇతని రాజ్యములో నుండి కొంతభాగము బిజాపూరురాజు తీసుకొనినందున ర; గ్ల లక్షలు వచ్చు రాజ్యము మాత్ర మీతనికి నిలచియుండెను. ఇతఁడు ౧౫౪౯లో దౌలతాబాదులో మృతినొందెను

౨. బరీద్‌షాహి రాజులలో చివరవాడు. ౨వ బరీద్ షాహ అనువానిని ౧౬౦౯లో గా జ్యభ్రష్టునిచేసి ఇతఁడు రాజ్యమునకువచ్చెను.

# అముద్రితగ్రంథచింతామణి.

ఇది నెల్లూరు నివాసులుగ నుండిన పూండ్ల రామకృష్ణయ్యగారిచే ౧౮౮౫ సం. జూన్ నెలనుండి ౧౯౦౪ సం. జూన్ మాసము వఱకును నడుపఁబడిన మాసపత్రిక. ఒడయరు వీరనాగయ్యగారును, పి. వెంకటరామానుజరావు నాయుఁడు బి. ఏ. గారును కొంతకాలము వీరితోఁగూడ సంపాదకులుగ నుండిరి. ఇందు ప్రాచీనాంధ్ర గ్రంథము లనేకములు ప్రకటింపంబడియెను. కొన్ని ప్రౌఢవిమర్శనలకుంగూడ నిదియే పుట్టినిల్లయ్యె. సమకాలిక గ్రంథకర్తల విషయమై వ్రాయఁబడిన వ్రాతలచ్చటచ్చట ఔచిత్యములుగఁ గన్పట్టకున్నను మొత్తముమీఁద నీ పత్రిక తత్కాలమున తెలుఁగు భాషయొక్క యభివృద్ధికి సాధుపడిన ముఖ్యోపకరణములలో మిన్న యని పేరుగాంచినది.

# అమూర్తరయుఁడు. (సూ. వం)

ఇనకులోత్పన్నుఁడగు గయుని వంశములోని వాఁడు.

# అమృతప్రభులు.

ఎనిమిదవ సావర్ణిమన్వంతరంబునందుఁ బుట్టఁబోవు దేవతావిశేషంబులు.

# అమృతనాదోపనిషత్తు.

ఒక యజుర్వేదోపనిషత్తు. దీనికి నాదోపనిషత్తని యుఁ బేరుగలదు.

# అమృతబజార్.

బంగాళాప్రాంతము జస్సూర్ జిల్లాలోని ఒకపల్లె. కొందఱు జమీన్‌దారులు కలిసి ఈ గ్రామమును కట్టించి తమ తల్లి పేరుపెట్టిరి. కలకత్తాలో ప్రకటింపఁబడు అమృతబజారు పత్రికయను దైనిక పత్రికారాజమునకు నిది పుట్టినిల్లు. ఆపత్రికాధిపతులు మొదట నీగ్రామములోనే బంగాళాభాషలో ఈపత్రికను ప్రకటించుచుండిరి.

# అమృతబిందువు.

యజుర్వేదోపనిషత్తు.

# అమృతబిందూపనిషత్తు.

ఇది అష్టోత్తరశతసంఖ్యగల ఉపనిషత్తులలోనొకటి. యజుర్వేదాంతర్గతము.

**అమృతము.** దేవతులకు మరణము లేకుండఁ జేయునట్టి రసవిశేషము. పృథురాజుశిక్షించునని భయముచే భూమిగోరూపము ధరించెను. అప్పుడు ఇంద్రుని దూడఁగాఁ జేసి దేవతలు సుపర్ణపాత్రలో నాధేను స్తనములనుండి ధారలను పితుకఁగా, అమృతము వచ్చెను. కాని దూర్వాస ఋషియొక్క శాపముచే నాయమృతము సముద్రముపాలయ్యెను. అంత దేవదానవులు సముద్రమథనముఁ జేసి యాయమృతమును పదునాల్గురత్నములలో నొకరత్నముగాఁ బడసిరి. సముద్రములోనుండి ధన్వంతరి యమృతకుంభమును దీసికొని పైకిరాగా నసురులుమీఁదఁబడి యాకుంభమును అపహరించిరి. ఇట్లమృతమును పోగొట్టుకొనిన దేవతలు విష్ణుమూర్తిని వేఁడఁగా నాతఁడు మోహినివేషము ధరించి, అసురులను మోహితులుగాఁ జేసి మీకిద్దరికి అమృతమును సమానముగాఁ బంచిపెట్టెదనని చెప్పి, వారియొద్దనుండి యమృతంపు కలశమును దీసికొని యసురులకు నొకబొట్టయిన నులేకుండ, అమృతమునంతయును దేవతలకుఁ బంచిపెట్టెను.

**అమృత రజుఁడు.** ౧. (చం. వం) విజయకులోత్పన్నుఁడైన కుశికరాజుయొక్క నలుగురు పుత్రులలో నొక్కఁడు.

౨. ఒక బ్రహ్మర్షి. ఇతని ముఖ్యనామము గయుఁడు (చూఁడు ౬ గయుఁడు)

**అమృతరాయకవి.** మహారాష్ట్ర కవి. ఇతఁడు దేశస్థబ్రాహ్మణుఁడు. ఇతఁడు శా. శ. ౧౬౨౦ లో జన్మించెను. ఇతఁడు మొదట హాస్యగాఁడు. మధ్వమునీశ్వరుఁడను భక్తుని నొకసారి వెక్కరింపఁగా నతఁడు కోపపడక 'నీకు భగవంతుఁ డమృతమువంటి వాణి నిచ్చియున్నాఁడు. తలిదండ్రు లమృతరాయఁడని పేరుపెట్టియున్నారు. నీవిట్టి విషతుల్యములైన మాటలనేల నుచ్చరించెద' నని మందలింపఁగా నితనికిఁ బశ్చాత్తాపము కలిగి యటివల హాస్యవృత్తిని విడిచి చక్కని కవిత్వము చెప్పఁదొడఁగెను. ఇతఁడు దామాజీ పంతుల చరిత్రము, శుకచరిత్రము, ధ్రువచరిత్రము, ద్రౌపదీ వస్త్రాపహరణము, మార్కండేయ చూర్ణిక, దుర్వాసయాత్ర మొదలైన పెక్కు కావ్యముల రచియించియున్నాఁడు. ఇతని కవిత్వము యమకప్రభోదమై వినుటకు సొంపుగా నుండును. ఇతఁడు హిందీభాషయందును కవిత్వము చెప్పినాఁడు. ఇతఁడు మిక్కిలి వైరాగ్యశీలుఁడు. మొదట ఔరంగాబాదులో గుమస్తాపనిచేసి పెత్తనమున దానినివదలి, హరికథలు చేయఁజొచ్చెను. బాలాజీ బాజీరావు పెష్వా కాలమందితని హరికీర్తన పెష్వాల మందిరమునందు జరిగెను. శా. శ. ౧౬౭౫ లో నితఁడు మృతిజెందెను.

**అమృతరావు.** రాఘోబాదాదా యనఁబడు రఘునాథరావు పేష్వా పెంచుకున్న పిల్లవాఁడు. గోపాళరావు భుస్కుటె యనునాతని యౌరస పుత్రుఁడు. రఘునాథరావుకు అతని పత్నియైన ఆనందీబాయికిఁ గుమారుఁడైన చివర పెష్వా బాజీరావు పుట్టకమునుపు రాఘోబా యితనిని పెంచుకొనెను. పెష్వాల ప్రభుత్వము పోయినతరువాత ఇంగ్లీషు వారీతనికిసంవత్సరమునకుఁ దొమ్మిదిలక్షుల చొప్పున వర్షాశన మేర్పఱిచి యీతనిని చిత్రకూటమునందుంచిరి. శా. శ. ౧౭౪౬లో నితఁడు మృతుఁడయ్యెను. ఇతని యౌరసునిపేరు వినాయకరావు.

**అమృతవర్షము.** ప్లక్షద్వీపమునందలి ఆఱవవర్షము.

**అమృతసరజిల్లా.** పంజాబుదేశమందలియొకజిల్లా. విస్తీర్ణము ౧౬౦౧ చదరపు మైళ్లు. రావి, బియాస్ నదులనడుమ దీర్ఘచతుర్భుజాకారముగ నుండును. ఈజిల్లాలో ౫ పట్టణములును, ౧౦౪౨ గ్రామములును ఉన్నవి. జనసంఖ్య ౧౦౨౩౮౨౮. శిస్తు ౨౩౭౬౦౦౦. ఈజిల్లాలో తాలూకాలు మూఁడు, అమృతసరము, తర్న్ తారన్, అజ్నాలా. ఈజిల్లాలో మ్యునిసిపాలటీగలపట్టణములు, అమృతసరము, జండి యాలా, మజిథా, తర్న్ తారన్. జనులలో సాధారణముగ ౧౦౦ంకి ౪౬ మంది మహమ్మదీయులు, ౨౮ మందిహిందువులు, ౪౬ మంది సిక్కులు. ఇచ్చటి భాషపంజాబి. ఇచ్చటిజనులలో ౧౦౦ంకి ౭ గురు చదువుకొన్న పురుషులు, ౨౦౦ంకు ౧త చదువుకొన్న స్త్రీ.

ఇచ్చట నెండకాలము లాహూరు కంటెఁ జల్లగనుండును. ఈజిల్లా మొత్తముమీఁద చలిజ్వరమునకుఁ బేరొందినది. కాలువలెక్కువయుండుటవలన నిట్లయినదని తజ్ఞుల యభిప్రాయము. చలికాలము మంచుకురియును. ఈ జిల్లాలోవర్షములు చక్కగఁ గురియుచుండును. ఇందువలనను, పెక్కుకాల్వలుండుట చేతను ఇచ్చట సాధారణముగఁ గరువురాదు.

**అమృతసరపట్టణము.** పంజాబులోని అమృతసర జిల్లాకు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౧౬౨౪౨౯. వీరిలో ౭౭౭౯౫ తురకలు. ౬౫౧౧౭ హిందువులు, ౧౭౮౬౦ సిక్కులు, ౧౧౦౪ క్రైస్తవులు, ౫౩౭ జైనులు, ౧౬ పార్సీలు. ఇయ్యది బారీనదియొక్క దుఆబ్ (అంతర్వేది) లోనున్నది. వర్షాకాలము చెమ్మగనుండును. సిక్కు మతమునకు ముఖ్య స్థలమగుటచే నీగ్రామమునకు మిక్కిలి ప్రఖ్యాతివచ్చెను. గురురాందాస్, అను సిక్కుగురువు ౧౫౭౪ వ సంవత్సర ప్రాంతమున నిచ్చటి చెరువు త్రవ్వించి నివాసమేర్పఱచుకొనెను. ౧౫౭౭లో అక్బరు చక్రవర్తివలన ౫ నూర్ల బీగాలస్థలమును వడసెను.

చెరువునకు అమృతసరమని పేరుపెట్టెను. తరువాత గురువైన అర్జున్ అనువాఁడు సరస్సునకు నడుమ దేవాలయము గట్టించెను. పట్టణము క్రమక్రమముగ నభివృద్ధికాఁ జొచ్చెను. కాని ౧౭౬౨లో అహమ్మదుశాహ దేవాలయమును ధ్వంసముచేసి, సరస్సులో మట్టిపోయించి, గోవులఁ గోయించి భ్రష్టముచేసి వెడలిపోయెను. కాని సిక్కులు వెంటనేదానిని మరల ౧౭౬౬ వఱకు బాగుచేసిరి. కొన్ని దినము లీ పట్టణము భంగిమిసల్ అనువారి స్వాధీనమునం దుండెను. ౧౮౦౧ లో రణజితు సింగు స్వాధీనమయ్యెను. ఆతఁడనేకముగ ధనము వెచ్చించి దేవాలయమును బంగారు నీరు పోసిన రాగిరేకులతోఁ గప్పించెను.

ఈపట్టణమునందు నైదుసరస్సులున్నను ముఖ్యమైనది అమృతసరము. ఇందులోనే సువర్ణదేవాలయము కలదు. ఈసరస్సురమారమి సమచతుష్కోణముగ నుండును. దీనిమధ్యభాగమున సువర్ణదేవాలయ మున్నది. దీనిని సిక్కులు "దర్బార్ సాహిబ్" (గౌరవనీయ మగుసభ) యనియందురు. గుడిలోనిమధ్యభాగమునకు హరిమందిరమనిపేరు. అది యొకచిన్న కొట్టు. గోడలవెలుపలి భాగముమీద తాజ్ మహలులోని చెక్కడపుఁబనిచేసి యున్నది. గోడలపైభాగమును పైకప్పును బంగారము నీరుగల రాగిరేకులతోఁ గప్పఁబడినవి. ఈమందిరములో సిక్కులవేదమగు 'గ్రంథ్'ఉండును. దానిని ప్రతిదినము మిగులభక్తితో సేవలకుఁ దెచ్చిపూజచేయుచుందురు. వైశాఖమాసమందును, కార్తికమాసమందునుఉత్సవములు కలవు.

ఇచ్చట రణజిత్ సింగు కాలమునుండి శాలువల వర్తకము విశేషముగ హెచ్చినది. కాశ్మీరమున కఱవు రాగా శాలువలు నేయు సాలెవాండ్రు పెక్కుమంది యచ్చటినుండి అమృతసరమునకు వచ్చి యచ్చట నివాస మేర్పఱుచుకొనిరి. ఒకప్పుడు నాలుగువేల మగ్గములు పనిచేయుచుండెను. ఇప్పుడు వేయి మగ్గములు పనిచేయుచుండును. శాలువల నేత తగ్గగనే తివాచీలనేత హెచ్చినది. పట్టువస్త్రములుకూడ నిచ్చట బాగుగ నేయఁబడును. ముడిపట్టు బొఖారానుండియు, చైనానుండియు వచ్చును. ఇచ్చటఁ జక్కని బట్టలు నేయుదురు. ఇచ్చటనుండి పెషావరకు, దాని కావలనున్న పరదేశములకు పట్టు బట్టల వర్తకము జరుగుచుండును. ఇచ్చట మైలతుత్తము, కర్రలమీఁదఁ జెక్కడపుఁబని, సబ్బు, హస్తిదంతపుఁబని, ఇత్తడి సరుకులు చేయఁబడును.

ఇచ్చట ఖాల్సాకాలేజ్, మిషన్ కాలేజ్ అను రెండు మహావిద్యాలయములు కలవు. బాలురకుఁ౪ హైస్కూళ్లును ౨ మిడిల్ స్కూలును, బాలికలకు 3 స్కూళ్లును కలవు. వృత్తులు నేర్పు పాఠశాల యొకటియు, వర్తకసంబంధమైన విద్య నేర్పు పాఠశాలయొకటియుఁ గలదు.

అమృతసరము సైన్యనివాసస్థానము. ఇచ్చట కొంత దేశీయ సిపాయీల పటాలమును, కొన్ని ఫిరంగులును ఉండును.

**అమృతసరతహసీల్.** తహసీల్ అనగా తాలూకా. అమృతసర్ జిల్లాలోని యొక తాలూకా. విస్తీర్ణము ౪౭౪౪ చదరపు మైళ్లు. ఇందు 323 గ్రామములు కలవు. జనసంఖ్య ౪౭౭౭3౬3. సిస్తు సెస్సులు రు ౬,౨౪౦౦౦లు. అమృతసర్ పట్టణము దీనికి ముఖ్యస్థలము.

**అమృతానుభవము.** ఇది తెలుఁగు తెలియని రోమను కాథలికు పాదిరీగా రెవరో వ్రాసియుండలెనని సి. పి. బ్రౌన్ దొరగా రభిప్రాయపడియున్నారు. క్రైస్తవుల వేదగ్రంథమగు బైబిలునందలి సువార్తలలోని కొన్ని భాగములే ఈ గ్రంథము యొక్క విషయము. రోమనుకాథలిక్ మతములోని నమ్మకములు కొన్ని ఈ గ్రంథమునఁ జొప్పింపఁబడి యున్నవి.

**అమృతుఁడు.** ప్రియవ్రత పుత్రుఁడగు ఇధ్మజిహ్వునియొక్క ఏడ్గురి పుత్రులలో నాలవవాఁడు. అమృతవర్షమున కధిపతి.

**అమృతౌఘ.** క్రౌంచద్వీపము నందలి నది.

**అమెజాను.** ఇది ప్రపంచమునందు మిక్కిలి పొడుగైననది. ఇదిదక్షిణ అమెరికాలో మిక్కిలి ఉత్తరపుభాగమునందు పశ్చిమతీరమందలి ఆండీస్ పర్వతములలో పుట్టి తూర్పువైపున అట్లాంటిక్ మహాసముద్రములోఁ గలియును. ఇది నాల్గువేల మైళ్ల పొడవుగనున్నది. దీని జలమువలన దక్షిణ అమెరికాలోని దాదాపు సగముభాగము పోషింపఁబడును. ఈ నదిలోసుమారు ౨3౦౦ మైళ్ళు సముద్రములో నుండి స్టీమర్లువచ్చి వెళ్ళుచుండును.

**అమెజానులు.** గ్రీసుదేశపు పురాణాదులలో వర్ణింపఁబడిన స్త్రీ సంఘము. వీరు మిక్కిలి బలముఁగలవారు. యుద్ధప్రియులు. యుద్ధము చేయునపుడు శస్త్రములకు అడ్డము రాకుండ వీరు తమ కుడి కుచములను కోసి వేసి కొందురు. వీరి దేశములో పురుషులు లేరు. వీరు సంతానోత్పత్తికొఱకు మాత్రము తమ దేశమునకు ప్రక్క దేశములనుండు పురుషులతోఁ గొంచము కాలము సహవాసము చేయుదురు. ఒకవేళ పురుష సంతానముగలిగిన దానిని జంపుచుండిరి, లేక తమదేశము నుండి వెడలఁగొట్టుచుండిరి. గొప్పగొప్ప యుద్ధములలో వీరు విడి పటాలముగ జేరి పోరాడుచుండిరి.

**అమెన్హోటెప్.** ఈ జిప్తుదేశముపై రాజ్యముజేసిన ఫెరాహోఁ (Pharao)అనఁబడు రాజులయొక్క ౧౮ వ వంశమందలి నలుగురి

రాజులపేళ్లు. (౧) ఇతఁడు క్రీ. పూ. రమారమి ౧౫౭౦ ప్రాంతమున పది సంవత్సరముల వరకు రాజ్యముచేసెను. ఇతని శవము ఘిజె (Ghizeh) వస్తుసంగ్రహాలయములో నున్నది. (౨)మూఁడవతోథిమస్ కుమారుఁడు. క్రీ. పూ. ౧౪౮౧ మొదలు ౨౫ సంవత్సరములు రాజ్యముచేసెను. (3) నాల్గవతోథిమస్ కుమారుఁడు. ఈతఁడు క్రీ. పూ. ౧౪౧౦ మొదలు 3౬ సంవత్సరములు రాజ్యముచేసెను. ఈతఁడు గొప్పగొప్ప మందిరములను నిర్మించెను. ఇతఁడు థిమస్ అను దేవునకు పెక్కు దేవాలయములు కట్టించెను. (౪) మూఁడవ అమెన్ హెూటెప్ కుమారుఁడు. క్రీ. పూ. ౧3౭౫ మొదలు ౧౮ సంవత్సరములు రాజ్యము చేసెను. ఈతనితల్లివిదేశ రాజకన్య, ఈతని భార్యయు నట్టిదే. ఆమె హిందూదేశపు స్త్రీయై యుండునని కొందరి అభిప్రాయము.

**అమెరికా.** పెక్కు దేశములును, ప్రభుత్వములును గల గొప్ప భూఖండము. ఆశియా, యూరోప్, ఆఫ్రికా, అమెరికా, ఒషేనియా అనఁబడునైదు ఖండములలో వైశాల్యమునందు నిది రెండవది. దీని విస్తీర్ణము ౧, ౫౦, ౦౦౦౦౦ (ఒక కోటియేఁబది లక్షల మైళ్ళు). ఈ ఖండమునకు సంబంధించినవియు, చుట్టుపట్టున నున్నవియు నగు చిన్న చిన్న ద్వీపముల విస్తీర్ణమును ఇందుఁ గల్పితిమేని దీని వైశాల్యము ౧, ౬౭,౦౦౦౦౦ మైళ్లగును. ఈఖండము ఉత్తరపు వైపున ఆశియా ఖండమును మిక్కిలి సమీపించి యున్నది. అచ్చట నీరెండు ఖండములకును నడుమ 3౫ మైళ్లుమాత్రము వైశాల్యముగల సముద్రము కలదు. దానికి బెయరింగ్ జలసంధి (Baring strait) అనిపేరు కలదు. ఈ ఖండము జనసంఖ్య పదునైదుకోట్లు. అనగా హిందూదేశపు జన సంఖ్యలో సగము.

ఈ ఖండము సృష్టిచే రెండు ఖండములుగ విభజింపఁబడినది. ౧. ఉత్తర అమెరికా, ౨, దక్షిణ అమెరికా. చూచుటకు నీ రెండు భాగములును స్వతంత్రములైన రెండు విశిఖండములుగాఁ గానఁబడును. సన్నగానుండునట్టి పెనామా యనఁబడు సంయోగభూమిచే (Isthamus of Panama) నీ రెండు దక్షిణోత్తర భాగములును ఒకటిగఁ గల్పఁబడినవి. ఈ సంయోగభూమి ౪౮౦ మైళ్లుపొడవును, 3౭ మైళ్లు మొదలు ౧౦౦ మైళ్ల వఱకు వెడల్పును కలది. ఈసంయోగభూమికిఁ దూర్పున అట్లాంటిక్ మహాసముద్రమును, పడమట పసిఫిక్ మహాసముద్రమునుకలవు. ఈమధ్య వ్యాపార సౌకర్యమునకై ఈసంయోగభూమిలో నడ్డముగ ౪౦ మైళ్ల కాలువత్రవ్వఁబడి యీరెండు సముద్రములును కలుపఁబడి ఉత్తర దక్షిణ అమెరికాభాగములు విడఁదీయఁబడినవి. ఈ కాలవవెడల్పు 300 అడుగులు మొదలు ౬౫౦ అడుగులవఱకుఁ గలదు.

ఉత్తర దక్షిణ అమెరికాలు ఆకారమునందు కొన్ని విధముల ఒకదాని నొకటి పోలియున్నవి. ఈరెండు భాగములును ఉత్తరమున వెడల్పుగను దక్షిణమునకు రానురాను సన్నగను కానిపించును. వీని పశ్చిమ ఒడ్డులపొడుగునను పెద్దవైన ఎత్తుభూములతోఁ గూడినపర్వత పంక్తులును, అగ్నిపర్వతములును, గలవు. మధ్యప్రదేశమంతయు ఉత్తరమునుండి దక్షిణమువరకును ఎడతెగకుండనుండు తగ్గుభూమి ఈ తగ్గుభూమి మిసిసిపి (Mississippi) ఒరినోకో (Orinoco) మెకెంజి (Meckenzie) ప్లెట్ (Plate) అను మహానదుల ప్రవాహముల వలన ఎక్కువసారవంతము గావింపబడును. తూర్పు ఒడ్డుమధ్యమధ్య పర్వతములచే వేరు చేయఁబడిన ఎత్తుభూములుగలవు.

ఉత్తర దక్షిణ అమెరికాల సముద్రతీరములు (Coast lines) భేదముగనుండును. యూరోప్, ఆసియాఖండములయందు వలె ఉత్తర అమెరికా సముద్రతీరము ద్వీపకల్పములతోఁగూడి అడ్డముదిడ్డముగా నుండును. దక్షిణ అమెరికాఒడ్డు ఆఫ్రికాఖండముయొక్క సముద్రతీరమువలె క్రమముగను, అవిచ్ఛిన్నముగను ఉండును.

శీతోష్ణస్థితులందు ఉత్తర దక్షిణ అమెరికాలు ఒకేరీతిగా నుండక వ్యతిరేకముగ నుండును. ఉత్తర అమెరికా శీతలదేశము. దక్షిణ అమెరికా దాదాపుగ ఉష్ణదేశము. ఎండకాలమున మిక్కిలి వేడిగను, చలికాలమున ఎక్కువ చల్లగనుండినను మొత్తముమీద ఉత్తర అమెరికా మిక్కిలి ఆరోగ్యవంతమైనది. ఇక్కడ వానకావలసినంత; దేశమంతయు ఖనిజములతోను, సస్యములతోను నిండియున్నది. ఇక్కడి జనసంఖ్యలో ఎక్కువమంది ఆంగ్లేయులు. తక్కినవారందఱు అమెరికన్ ఇండియనులు, నీగ్రో, స్పెనిషువారు, జర్మనులు, ఫ్రెంచివారు, డచ్చివారు.

దక్షిణ అమెరికా ఉష్ణప్రదేశమైనను,తక్కిన ఉష్ణదేశములందువలెఁగాక వాన విస్తారము కురియును. ఈ ప్రదేశముఁగూడ మిక్కిలి ఫలవంతమైనది. ఖనిజములు విస్తారముగ దొరుకును. సస్యములు సమృద్ధి. ఇక్కడి జనసంఖ్యలో విస్తారముమంది స్పెయినుదేశీయులు. తక్కినవారందరు ఉత్తర అమెరికాలోవలెనే వివిధదేశములకు చేరినవారు.

ఆసియా ఖండమునకు వాయవ్య దిక్కునుండి అమెరికాదేశము కొద్ది మైళ్లదూరముమీదనే యుండుటచే ఆసియాఖండములోని జనులు అనాదికాలమునుండి అమెరికాకు రాకపోకలు గలిగియుండినను, యూరోపుఖండమందలి వారికి మాత్రము పదునైదవ శతాబ్దమువరకు నిట్టి మహా భూఖండ మొకటున్నదని తెలియదు. క్రిస్టోఫర్ కొలంబస్ (Christophor Columbus) అనునావికుఁడు స్పెయిను దేశపురాణియొక్క నాజ్ఞననుసరించి హిందూదేశమునకు పశ్చిమజలమార్గమును గనుఁగొను

టకై సముద్రముమీద బయలుదేరి ౧౪౯౨వ సంవత్సరములో నీ దేశమును కనుఁగొనెను. అతఁడది హిందూదేశమనియే భ్రమపడెను. అందువలననే యిప్పటికిని యూరోపుదేశస్థులు అమెరికాదేశమును వెస్టిండీస్ (West Indies) అనగ పడమటిహిందూదేశమనియు, మనహిందూదేశమును ఈస్టిండీస్ (East Indies) అనగ తూర్పు హిందూదేశమనియు అనియెదరు. కొలంబసు (Columbus) తరువాత ౭ సంవత్సరములకు ఫ్లారెన్సు వాసుఁడగు ఆమెరిగో వెస్పుసీ (Amerigo Vespucci) అనునాతఁడు అమెరికా దేశమునకు వచ్చి కొన్నిస్థలములను గనుఁగొనెను. ఆతనిపేరనే క్రొత్తగా కనిపెట్టఁబడినయీదేశమునకు అమెరికా అను నామము వచ్చెను.

యూరోపుదేశస్థులు ఈ ఖండమునకు వచ్చుచుండుటకును ఈ దేశములో అరణ్యములలో నచ్చటచ్చట ఆరణ్యకజను లుండిరి. వారిలోఁ గొందఱు కొంచెము నాగరికతఁ జెందిన వారు, కొందఱు అనాగరికులు. వారిని అమెరికన్ ఇండియనులనిగాని, ఎఱ్ఱ ఇండియనులనిగాని పిలిచెదరు. ,,ఎఱ్ఱఇండియనులు'' అను శబ్దముక్రింద వీరిని గుఱించి వివరముగ వ్రాయఁబడును.

ఖాలీగనున్న ఈ విశాలదేశమును పదునైదవ శతాబ్దమునుండి యూరోపు ఖండములోని వివిధ దేశములవారు వలసపోయి యాక్రమించుకొనఁజొచ్చిరి. అందుచే క్రమక్రమముగ ఉత్తరదక్షిణ అమెరికా దేశములలో మహోన్నతిఁ జెందినటువంటి గొప్ప గొప్ప ప్రభుత్వములు వెలిసెను. ఆ వివరమంతయు ,,ఉత్తరఅమెరికా'' ,,దక్షిణ అమెరికా'' అను శబ్దములక్రింద విస్తరముగ వ్రాయఁబడును.

**అమేట్** రాజపుతానాలోని ఉదయపుర సంస్థానమునందున్న యొక జమీందారి. దీనిరాజధానిపేరు గూడ అమేట్. అది ఉదయపురమునకు నుత్తరమున ౫౦ మైళ్ల దూరమున చంద్రభాగానది యొడ్డున నున్నది. ఈ పట్టణముచుట్టును ప్రాకారము గలదు. ఈ జమీందారుఁడు మేవాడ్‌లోని మొదటి తరగతి సరదారులలో నొక్కఁడు. రావత్ అని ఆతని బిరుదు. జమీందారీలో ౨౬ గ్రామములు గలవు. సంవత్సరపు ఆదాయము రమారమి 30,000 రూపాయిలు. ఉదయపురపు దర్బారున కితఁడు ౨౨౦౦ రూపాయలు పేష్కష్ కట్టవలయును. ఈ జమీందారుఁడు శిశోదియా వంశములోనిది యగు చోండావత్ శాఖలోనివాఁడు. ఇతని పూర్వుఁడగు పట్టా అను నాతఁడు శౌర్యమునకై మిక్కిలి ప్రఖ్యాతివడసి క్రీ. శ. ౧౫౬౭లో అక్బరు చక్రవర్తి చిత్తూరిమీదికి దండెత్తివచ్చినప్పుడు రాంపోల్ ద్వారమునొద్ద ఘోరముగ నాతనితోఁ బోరి హతుఁడయ్యెను.



 

**అమేతీ.** ౧ యునైటెడ్ ప్రావింసెస్‌లోని సుల్తానుపూర్ జిల్లాయందలి ఒక తాలూకా. విస్తీర్ణము ౩౬౬ చదరపు మైళ్లు. జనసంఖ్య ౨౧౭,౨౦౭. ఇందు ౪౫౫ గ్రామములు కలవు. భూమి సిస్తువలన దొరతనమువారికి ఆదాయము రు. ౩౯౯౦౦౦. శెస్సులు రు. ౫౧౦౦౦.

౨ యునైటెడ్ ప్రావింసెస్‌లోని లక్నో జిల్లాలోని మోహన్‌లాల్‌గంజ్ తాలూకాలోని ఒక గ్రామము. ఇచ్చటమిక్కిలి పూర్వకాలమునందు అమేతియా రాజపుత్రులు రాజ్యము చేయుచుండిరి. వారియొద్దనుండి తురకలు క్రీ. శ. ౧౫౫౦లోఁ దీసికొనిరి. అప్పటినుండియు నది మహమ్మదీయమతమువారికి నాధారమైన పట్టణముగ నుండెను. ఈ మతము వారు తమ పీరులుగా నెంచునట్టి పెక్కుసాధువు లిక్కడ పుట్టిరి. వాజత్ అలీషా రాజ్యము చేయునప్పుడు ఈ గ్రామస్థుఁడైన మౌల్వీ అమీరల్లీ అనునాతఁడు అయోధ్యా పట్టణ మందలి హనుమంతుని దేవాలయమును పడఁగొట్టవలయునని యత్నించెను;గాని యప్పటి రాజుల యొక్క సైన్యములచే నతఁ డోడింపఁబడియె. ఇక్కడ బట్టలు నేయఁబడును.

**అమేలియా.** (౧౭౩౯ - ౧౮౦౭) జర్మనీ దేశమందలి శాక్సే,లీమార్, ఈసెనాఘ్ అను సంస్థానములకు జమీందారిణి (Duchess); అర్నెస్టు ఆగస్టు కాన్‌స్టెంటయిన్ అను డ్యూకుయొక్క భార్య. అతఁడుకాలము చేసిన తరువాత (౧౭౫౮) ఈమె తన పసిబాలుఁడగు కారల్ ఆగస్టు అను వానికి రక్షణకర్త్రిగా నుండెను. ఈమె తన సంస్థానములో కళా కౌశల్యములను, వర్తకములను మిక్కిలి అభివృద్ధి పఱచెను. విద్వాంసుల నాదరించుట యందు నీమె మిక్కిలి విఖ్యాతిఁ జెందెను. ఆమె సభలో ఆకాలమందలి కవిశ్రేష్ఠులును పండిత శ్రేష్ఠులును అగు హర్‌డర్, గెయిటీ జీలేంవు, షిల్లా అనువారు మిక్కిలి మన్ననఁ బడుటయేగాక పలుమారు సభ నలంకరించుచు నామెయొద్ద కొంతకాలము గడుపుచుండిరి.

**అమోఘవర్షుఁడు.** ఈ పేరుగల రాజులలో ముగ్గురు రాష్ట్ర కూటవంశము నందు కాన వచ్చుచున్నారు.

౧ మొదటి అమోఘవర్షుఁడురమారమి౬౦ సంవత్సరములవరకు కీ. శ. (౮౧౭-౭౭) రాజ్యమేలెను. ఇతనిక నృపతుంగుఁడు అను బిరుదు గలదు. ఈతఁడు వేంగిరాజులైన చాళుక్యులతోఁ బెక్కుయుద్ధములు చేసెను. ఈతఁడు తన రాజధానిని నాసికపట్టణమునుండి మాన్యఖేట పట్టణమునకు మార్చెను. దీని నిప్పుడు మాల్ ఖేడందురు. ఇది యిప్పుడు నైజామ్ రాజ్యములోనున్నది. ఇతఁడు ముసలివాఁడుకాగా తన కుమారుఁడైన రెండవ కృష్ణునకు రాజ్యమొసఁగి తాను యతియయ్యెను.

ఈతనికి దిగంబర జైనమతమునందు మిక్కిలి అభిమానము. ఇతని కాలమునందును, తరువాత కాలపురాజుల యాశ్రయమువలనను జైన మతము మిక్కిలి అభివృద్ధిఁజెంది భౌద్ధమతము నశించెను. కాంచీ నగరమువఱకు నీతని రాజ్యముండెననియు, ఈతనియొద్ద శైనాచార్యుఁడను చీనపండితుఁ డుండెననియుఁ జెప్పెదరు. శైనాచార్యుఁడు జైనమతములను గుఱించిన పెక్కు గ్రంథములను వ్రాసినాఁడు. (చూఁడు విన్‌సెంటు స్మిత్తు విరచితమైన అర్లీహిస్టరీ ఆఫ్ ఇండియా, భారత్ ఖండాచా అర్వాచీన కోశ.)

౨ రెండవ అమోఘవర్షుఁడు (౯౧౬-౯౧౭) వరకు రాజ్యము చేసినట్టు కానవచ్చుచున్నది.

3 మూఁడవ అమోఘవర్షుఁడు ౯3౫ లో రాజ్యమునకు వచ్చినట్టు తెలియుచున్నది.

**అమోఘసిద్ధుఁడు.** బౌద్ధులదేవతలలో నొక్కఁడు. అతనినిగూర్చి ప్రార్థన హవనముచేయు సంప్రదాయము గలదు.

**అమోఘుఁడు.** బృహస్పతికి తారయందుఁ బుట్టిన స్వాహాయను కన్యకయొక్క ముగ్గురు పుత్రులలోఁ గడగొట్టువాఁడు.

**అమోడ్** (తాలూకా) బొంబాయి రాజధానిలోని భడోచ్ (Broach) జిల్లాయందలి యొక తాలూకా. విస్తీర్ణము ౧౭౬ చదరపుమైళ్లు. జనసంఖ్య 3౯౧౧.ఇందు ఒక పట్టణము ౫౧ పల్లెలు కలవు. ఆదాయము రు. 3౨౦౦౦౦.

**అమోడ్** (పట్టణము) ఈ పేరుగల తాలూకాకు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౪3౭౫. ఇచ్చట ఠాకూరు అను నొక భూస్వామియుండును. వానికి ౨౧౨౦౦ యెకరముల భూమియు, రు. ౭౨౦౦౦ ఆదాయమును ఉండును. ఇక్కడ మంగలికత్తులు, చాకులు చేయఁబడును.

**అమ్ఝెరపల్లె.** గ్వాలియర్ సంస్థానమందలి అంఝెరజిల్లాకు ముఖ్యస్థలము ధార్ పట్టణమునకుఁ బశ్చిమమున ౧౨ మైళ్ల దూరమున నున్నది. జనసంఖ్య ౪౯౫౪. ఇయ్యది పదునాఱవ శతాబ్దమున జోధపుర రాజపుత్రుఁడైన రాజారామసింగునివలన స్థాపింపఁబడియె నందురు. తరువాత నిదియొక చిన్న సంస్థానముగా నుండెను. పదునెనిమిదవ శతాబ్దమున గ్వాలియర్ సంస్థానమువారికి నీ సంస్థానము లోఁబడెను. ౧౮౫౭వ సంవత్సరమునందు నిచ్చటి రాజైన రాజాభక్తావరసింగు సిపాయిల తిరుగుఁబాటులోఁ జేరెను. అతనిఁ బట్టుకొని యిందూరులో నురితీసి యింగ్లీషువారు అతని సంస్థానమును గ్వాలియరు వారి కిచ్చివేసిరి. ఈ పల్లెయందు సుబాకచేరి, ఒక స్కూలు, ఒక ఆస్పత్రి, ఒక సంస్థానపు టపాలాఫీసు, చావడి కలవు.

**అమ్ఝేరజిల్లా.** గ్వాలియర్ సంస్థానములోని యొకజిల్లా. మధ్య హిందూస్థానములో ౨౦° ౫'; ౨౨°౫౯ ఉ. కును, ౭౪° ౪౦' తూ.కును నడుమ నున్నది. వైశాల్యము ౧౩౦౧ చదరపు మైళ్లు. ఈ జిల్లాయంతయు వింధ్య పర్వతము యొక్క యొంపుభాగమున నున్నది. సముద్రముకంటె మధ్యమమానమున ౧౮౦౦లఅడుగులెత్తుమీదనుండును. జిల్లాయంతయు నరణ్యముచే నాచ్ఛాదితమై, కొండలోయలచే ఖండితమై యున్నందున వ్యవసాయము నకుఁ బనికిరాదు. జనసంఖ్య ౧౯౦౧లో ౯౬, ౪౨౬. ఒకచదరపుమైలుకు ౭౪ గురు చొప్పున జనులున్నారు. జిల్లాయంతయు అంఝేరా, బాకానేర్ అను రెండు పర్గణాలుగా విభజింపఁబడినది. ఇందు ౪౬౪ పల్లెలు కలవు. భూమి శిస్తు రు. ౧, ౫౧,౦౦౦లు. ఇందలి చాల భాగము ఇనాముల క్రింద నున్నది.

**అమ్మపటము.** తంజావూరు జిల్లా, పట్టు కొట్టాయి తాలూకాలోని యొక సముద్రపు రేవు. ఇచ్చటినుండి ముఖ్యముగ సింహళమునకు వర్తకము జరుగుచుండును. పశువులు విశేషముగ నెగుమతియగును. సింహళమునందలి తేయాకుతోటల నిమిత్తమై యిచ్చటినుండి కూలి వాండ్రు వారమునకు రెండు పర్యాయములు వెళ్లుచుందురు.

**అమ్మయనాయకనూర్.** మధుర జిల్లాలోని యొక జమీందారి. ఈజమీందారుని మూలపురుషుఁడు మాకయ్యానాయకుఁడు. ఈతఁడు విజయనగరపురాజుల యొద్ద నుండెను. విశ్వానాథనాయకుఁడు ౧౫౫౯లో మధురకుఁబోయెను. అచ్చట నాతనికి మధుర కోటలోని ౭౨ బురుజులమీద నధికారమును, ఈజమీందారియు నిచ్చిరి. మైసూరువారు దిండిగల్ పట్టుకొన్నపుడు జమీందారీలోఁగొంత భాగము తీసికొనిరి. ౧౭౩౬లో నీ గ్రామము నొద్దనే చందాసాహెబు వంగారు తిరుమల నాయకు నోడించి మధురనాయక వంశమును వినాశముచేసెను.

౧౭౫౫లో హైదరు దిండిగల్ పాళెగారులపై దాడివెడలగా నీజమీందారుఁడాతనికి సాయముచేసి తన మీదికాతఁడు రాకుండఁజేసికొనెను. శిస్తుబాకీ క్రింద ఈ జమీందారీని ౧౭౮౭లో టిప్పూజప్తుచేసెను. కాని ౧౭౯౦లో ఈస్టిండియావారు దానిని విడదలచేసిరి. ౧౭౯౬లో ఈజమీందారుఁడు దొరతనమువారిని కొంత తొందర చేసెను. తరువాత ఈ జమీందారినేలినవా రెక్కువగ నప్పులుచేసి, గ్రామములు ఒకప్పుడు యూరోపియను సోదరులకును, ఒకప్పుడు సెట్లకును తాకట్టు పెట్టుచు నిడుములఁబడుచుండిరి. అందు వలన రైతులకుఁగూడ మిక్కిలి చిక్కులు, బాధలు

కలుగుచుండెను. ౧౮౭3లో నీజమీకి శాశ్వ తపుకౌలు పుట్టినది.

ఇచ్చట వారసత్వము జమీందారుని పెద్ద కుమారునకురాదు. ఆతని మరణసమయమునం దునాతనివంశములో నెవ్వఁడు వయస్సునందుఁ బెద్ద వాఁడో వానికి వచ్చును. ఇప్పుడిచ్చట జమీందారుఁడు శ్రీ రామస్వామినాయకుఁడు.

## అమ్మరాజు విష్ణువర్ధనుఁడు.

(క్రీ. శ. ౯౧౮-౯౪౫) ఇతఁడు రాజమహేంద్ర వరమును రాజధానిగానేలిన తూర్పుచాళుక్య వంశమందలి యొక రాజు. ఇతఁడు నాల్గవ విజ యాదిత్యుని పెద్దకొడుకు. విష్ణువర్ధనుఁడు అను బిరుదువహించినవారిలోనీతఁడునీవంశమునందు నాలవవాఁడు. ఇతనికి రాజమహేంద్రుఁడన్న నామాంతరముండెను. ఇతఁడే రాజమహేంద్ర వరపట్టణము కట్టించెనని కొందఱుచరిత్రకారుల యభిప్రాయము. ఇతని దాయాదులు కొందఱు రాష్ట్రకూటులతోఁగలసి యీతనిఁ బదభ్రష్టుని చేయవలయునని ప్రయత్నించిరి;కాని యీతఁడు తన ప్రయత్నములచే వారి మనోరథము సిద్ధిం పకుండఁజేసెను. ఈ తనియొద్దఖండనాదిత్యుఁ డను సైన్యాధిపతియుండెను. ఇతని శాసన ములు రెండు కానవచ్చుచున్నవి. *

*(1) Ind. Ant, Vol XIII Sou Ind, Ins Vol 1.P.86.
(2) Ibid, Vol. VIII, P. 76.
(3) Mr. R. Sewell (Lists, Vol II, P. 260)

**అమ్రాపూర్.** ౧ బొంబాయి యందలి కాఠేవాడ్‌లోని ఒక మిక్కిలి చిన్న సం స్థానము.

౨ బొంబాయి యందలి రీవాకాంతా లోని ఒక మిక్కిలి చిన్నసంస్థానము.

**అమ్రాబాద్.** హైద్రాబాద్ సంస్థా నములోని మహబూబ్ నగర్ యందలి యొక తాలూకా. విస్తీర్ణము ౭౨౭ చదరపుమైళ్లు. జనసంఖ్య ౨౦౮౬౦. ఈ తాలూకాలో ౪౬ గ్రామములు కలవు. అందు తొమ్మిది జాగీర్ గ్రామములు. అమ్రాబాద్ అను గ్రా మము ముఖ్యస్థలము. ఆదాయము ౨౫౦౦౦ రూపాయిలు. ఇటీవల నిందు క్రొత్త గ్రామాదులు కొన్ని చేర్చిరి. ఇప్పు డిందు జా గీర్ గ్రామములుగాక ౬౭ గ్రామము లున్నవి.

**అమ్రేలి.** (ప్రాంతము) బఁరోదా (బరో డా) సంస్థానములోని ఒక జిల్లా. ఇది గుజ రాత్‌లో కాఠేవాడ్ దేశమునం దున్నది. దీని విస్తీర్ణము ౧౨౪౫ చదరపుమైళ్లు. పదు నేడు విడివిడి భూఖండములు కలిసి యీ ప్రాంతమైనది. వానిలో ఒఖామండల్ తా లూకా యను దానికి ఉత్తరమున కఛ్‌జలసం ధియు, పశ్చిమమున అరబ్బీ సముద్రమును గలవు. జనసంఖ్య ౧౭3౪3౬. వీరిలో నూటికి ౯౯ మంది గుజరాతీ భాష మాట్లాడుదురు. ఇందలి భూమిలో విస్తారముభాగము నల్లనిది యు, సారవంతమైనదియు నగును.

ఇందలి గీర్ అను పట్టణములోని ఆవులు మిక్కిలి ప్రఖ్యాతి. నూలుబట్టలు, చౌకపట్టు మీద జరీపనిచేయుట, వెండిపని, కొద్దిపాటి యినుపవస్తువులు తయారుచేయుట ఇక్కడి కళాకౌశలములు. ఈ ప్రాంతములో 2 ప్రత్తిని ఏకునట్టి ఫ్యాక్టరీలు కలవు. ఇందు కోడినార్, ద్వారకా, బేట్ అను మూడు సముద్రపు రేవులుగలవు. పశ్చిమ తీరమందలి మహాక్షేత్ర మైన ద్వారక ఇందులోనిదియే.

మొట్టమొదట మహారాష్ట్రులు కాఠేవాడ్ దేశముమీదికి ఖండేరావుదాభాడే, ప్రథమ దామాజీ గాయక్వాడ్ కాలమున వెళ్లిరి. కాని రెండవ దామాజీ గాయక్వాడ్ ౧౭౩౨-౬౮ కాలమువఱకును ఈ ప్రాంతము వారికి స్వాధీనమైనది కాదు. స్వాధీనమైన తర్వాత పూనాపేష్వాయును గాయక్వాడును కలిసి ప్రభుత్వము చేయుచుండిరి. ౧౮౧౮లో పేష్వా పభుత్వ మంతరించిన తరువాత కాఠేవాడ్ పై నాతనికి గల హక్కు ఇంగ్లీషువారికి సంక్రమించెను. గాయక్వాడుకు గల హక్కు వారికే యుండిపోయెను.

ఈ ప్రాంతము రమారమి ౬,౫౦౦౦౦ రూపాయిలు చెల్లును. ఈ జిల్లాలో ఆరు మున్సిపాలిటీలును, ఒక హైస్కూలును, ఒక ఆంగ్లో వర్నాక్యులరు స్కూలును, ౧౭౮ వర్నాక్యులరు స్కూళ్లును ౫సివిల్ ఆసుపత్రులును కలవు.

**అమ్రేలి.** (తాలూకా) బడోదా సంస్థానమున, అమ్రేలిప్రాంతమందలి ఒక తాలూకా. విస్తీర్ణము ౨౩౮ చదరపుమైళ్లు. జనసంఖ్య ౫౫౫౮౩. ఇందు ౫౮ పల్లెలును, ఒక పట్టణంబును కలవు. భూమిసిస్తు రు. 20000.

**అమ్రేలి.** (పట్టణము) అమ్రేలిప్రాంతమునకు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౧౭౯22. ఇది తేబీ అను నదియొడ్డున నున్నది. దీనిచుట్టు పూర్వము మంచి ప్రాకారముండెను. దీనిని పూర్వము అమరతల్లి అనుచుండిరి. ఇది కాఠేవాడ్ ప్రాంతమునగల ముఖ్యమైన ప్రత్తి సంతలలో నొకటి. ఇంగ్లీషువారి తరఫున నిచ్చట ఒక పొలిటికల్ అసిస్టంటు ఉండును. అతఁడు బడోదాలోనుండు రెసిడెంటుచేతి క్రింది వాఁడు.

**అమ్లజని.** (Oxygen) ఇదివట్టి రంగును,వాసనయు, రుచియు లేనట్టి యొకవాయురూపమైన మూలద్రవ్యము. దీనినే ప్రాణవాయువందురు. ఇది లేనిచో జంతుజాలము జీవింపనేరదు; నిప్పుమండదు. ఈ పదార్థము సృష్టియందు విపులముగ నున్నది. ఇది మనము పీల్చునట్టి గాలిలో నూటికి ౨౩ వంతునను, త్రాగునట్టి నీళ్లలో నూటికి ౮౯ వంతునను, మన భూగోళము దేనితో చేయఁబడినదో ఆ మన్నులో నూటికి ౫౦ వంతున నున్నది. దీని పరమాణుభారము(Atomic weight)౧౫.౯౬.

శోధన నిమిత్తమై అమ్లజనిని తయారు చేయువిధము:—

రససిందూరము (Mercury Oxide) నొక దిట్టమయిన పరీక్షణనాళిక (Test-tube) యందుంచి దానిని బిరడాతో బిగించి ఆబిరడాగుండ నొకవంపఁబడిన గాజుగొట్టమును దూర్చి క్రిందిపట

అమ్లజని తయారు చేయు పద్ధతి



ములో జూపిన ప్రకారము ఆగాజుగొట్టముయొక్క రెండవచివరను నీరుపోసిన తొట్టిలో ముంచవలెను. అప్పుడు దీపముతో పరీక్షణ నాళికను దిట్టముగ కాచిన యెడల గాలిబుడగలు తొట్టిలోనున్న నీటిగుండ బయలుదేరి కొద్దికాలములో నాగిపోవును. అట్లాగిపోయినను పరీక్షణనాళికను కాచినపక్షమున తిరిగి కొంతసేపటికి, బుడగలు కాన్పించును. అప్పుడొక గాజు పాత్రను నీటితో నింపి తలక్రిందుగ గాజుగొట్టపు చివరనుంచవలెను. కొద్దికాలములో నీబుడగలు గాజుపాత్రయందున్న నీటిని క్రిందికి త్రోసి దానిని ఆక్రమించును. గాజుపాత్రలోని నీరంతయు క్రిందికి బోయిన తరువాత దానిని జాగ్రత్తగ మూతవేసి తలక్రిందుచేసి పైకి దీసి పరీక్షించిన యెడలఅందున్న వాయువు అమ్లజనియని తెలియ వచ్చును.

ఇట్లు నాలుగయిదు పాత్రలను అమ్లజనితో నింపియుంచిన పక్షమున ఈ దిగువ చెప్పబోవు విషయముల కన్నటికిని దానిని మన ముపయోగపరుపవచ్చును.

ప్రయోగము.



౨వ పటము

అమ్లజని నిలువఁ జేసిన మొదటి పాత్రలోని కొక కొరవిని దించినవెంటనే ఆ కొరవి తిరిగి వెలుగ నారంభించును. ఒక పాత్రలో నున్న వాయువు అమ్లజని యౌనా కాదాయని నిశ్చయించుటకిదే సులభ మార్గము

ప్రయోగము. చిన్నగరిటెలో కొంచెము గంధకపుపొడిమంచిదీపముమీద గాచినచో నది స్వల్పకాలములో మండుటకు ప్రారంభించును. అప్పుడు దానిని ఆమ్లజనియున్న పాత్రలోనికి దించిన యెడల మిక్కిలి కాంతితోమండి పాత్రయంతయు తెల్లని పొగతో నిండి యుండును. ఇదిగంధకపు బొగ. వీనికి గంధకద్వ్యమ్లజనిదము, (Sulphur dioxide) అనిపేరు.

గంధకము మండిన తరువాత నాగరిటెదీసి ఆ పాత్రలో కొంచెము వాన నీరు పోసి కుదిలించినచో నాపొగంతయు నీటిలో నదృశ్యమగును. అట్లదృశ్యమయిన తరువాత నానీటిలోనీలిలిట్మస్ (Blue Litmus) కాగితమును ముంచినట్టయిన యెర్రనగును.

ప్రాణవాయువు సమస్తజంతువుల వృద్ధికిని అవసరమైయున్నదని చెప్పియుంటిమి. మనము గాలిని పీల్చునప్పుడు ఆ గాలిలోని ప్రాణవాయువును మాత్రము ఊపిరితిత్తులలో నిలువఁ జేసికొని దానికి బదులు కర్బనిక్ ఆమ్లము (Carbanic acid బొగ్గుపులుసు గాలి) ను గాలిలోనికి విడిచివేయుదుము. జనసంఘము

అధికముగగల ప్రదేశములో నెప్పటి కప్పుడు చక్కనిగాలి వీచుచుండనియెడల, నిలువయుండు గాలిలోని ప్రాణవాయువు క్రమేపితగ్గి, బొగ్గుపులుసువాయువు హెచ్చుచుండును. కాబట్టి యిట్టి చోట్లనుండుగాలి అనారోగ్యమైనది. ప్రాణవాయువునందు సూక్ష్మజీవులను చంపు గుణముగలదు. గాలిలో ప్రాణవాయువు హెచ్చుగ నున్నయెడల సూక్ష్మజీవులు తగ్గగనుండును. కనుక వ్యాధులనివారణకుగూడ అమ్లజని ఆవశ్యకము. అమ్లజని గూర్చిన ఇతర విషయములును గుఱించి రసాయనశాస్త్రిము జూడనగు.

**అమ్లపిత్తము.** ౧. చూడు అజీర్ణము.

౨. (ఆయుర్వేదము ననుసరించి) విరుద్ధ క్షీరమత్స్యాద్యాహారములు, పులుసు, విదాహకర ద్రవ్యములు, వమనకరద్రవ్యములు, పులిసిన యన్నము, పిత్తమును ప్రకోపింపంజేసెడి యన్నము, పానము, అనువాని సేవనమువలన వర్షాది ఋతువులవలన పిత్తము ప్రకోపించి భుజించిన యన్నాదులు జీర్ణము గాక పులిత్రేనుపులు వచ్చుటయే అమ్లపిత్తమని తెలియవలయు.

రోగోత్పత్తి కారణము

అందు అజీర్ణము, ఆయాసము, ఓకారములు దురద, పులిత్రేనుపులు, శరీరభారము, హృదయ, కంఠములయందు తాపముదప్పి, భ్రమ, మూర్ఛ, అగ్నిమాంద్యము గగుర్పాటు, ఒకానొకపుడు చేదుగ పుల్లగ వమనము జేయుట కడుపులో శూలించుట యీ లక్షణములు కల్గినది అమ్లపిత్తంబని యెరుంగునది.

సామాన్యలక్షణములు

ఇయ్యది అధోగతామ్లపిత్తము, ఊర్ధ్వగతామ్లపిత్తము అని గతిభేదముచే ద్వివిధంబగుచున్నది. అందు శరీరమునందధో భాగమున నానా విధంబులుగ నొకప్పుడుమలాదులు వెడలుటచేత అధోగత అమ్లపిత్తమనియు, చేదుగనయినను పుల్లగ నయినను పలువిధ రంగులతోగూడిన పసరునోట గ్రక్కుచుండుట ఊర్ధ్వగతామ్లపిత్తమనియు నెరుగదగు.

గతిభేదముచే ద్వివిధంబు

అమ్లపిత్తము నూతనముగ జనించినయెడల యత్నముచే సాధింపనగు. చిరకాలజమయినచో యాప్యమైయుండును. పథ్యనియమము గల వానికి నొకప్పుడు కష్టసాధ్యంబై యుండును. (ఇతి మాధవనిదానే)

సాధ్యాసాధ్యత.

పిప్పలికషాయములో పిప్పలికల్కమును వేసి ఘృతమును జేర్చి ఘృతపాకవిధి ననుసరించి పాకము గావించి అట్టి ఘృతములో తేనెగలిపి ఉదయమున సేవించినచో అమ్లపిత్తము శాంతించును. (చక్రదత్తః)

పిప్పలీఘృతం.

బూడిది గుమ్మడికాయరసము నూరు పలములు, ఆవుపాలు నూరు పలములు ఈ రెంటిని కలిపి ఉసిరి పప్పు చూర్ణమును ఎనిమిది పలములనువేసి పొయిమీదనుంచి సన్న శెగచే ముద్దయగువరకును వండి ఉసిరిపప్పుకు సమముగ చక్కెరను చేర్చుకొని లేహ్యపాకముగ దించుకొని జాగ్రత్త పెట్టియుంచవలెను. దీనిని పూటకు అరపలము చొప్పున సేవించినచో అమ్లపిత్తము శాంతించును. (యోగరత్నాకరె)

ఖండకూష్మాండము

అడ్డసరము, తిప్పతీగ, పర్పాటకము, నేలవేము, వేము, గుంటగలగర, త్రిఫలములు, కులకము వీనిని కషాయముకాచి, తేనెకలిపి సేవించిన అమ్లపిత్తము నిశ్చయముగా శాంతిఁ జెందును. (చక్రదత్తః)

దశాంగకషాయము.

యవలు, గోధుమలు, పెసలు, పాతశాలిధాన్యము, కాచి చల్లార్చినజలము, కాకరకాయ, అరటి పువ్వు, లేత వెదురు మొప్ప బాగుగ ముదిరిన బూడిద గుమ్మడికాయ దాడిమకాయ కఫపిత్త హార సర్వాన్నపానములు అమ్లపిత్తరోగులకు హితకరముగ నుండును. నువ్వులు మినుగులు, ఉలవలు,గొర్రెపాలు, ధాన్యామ్లము లవణామ్లకటు పదార్థములు, గుర్వన్నము, పెరుగు, మద్యము, వీనిని అమ్లపిత్తరోగులు వర్జింపవలెను. (యోగరత్నాకరె)

పథ్యాపథ్యము.

[గం. దూ.

## అమ్లము.

౧ షడ్రుచులలో నొకటి

౨. అమ్లజనితో, కొన్ని ఉపధాతువులు కలిసి నప్పుడు ఏర్పడు పదార్థము. దీని నింగ్లీషులో యాసిడ్ అందురు. నీటిలో గలిపిన యెడల అమ్లములగును. ఇందుచేతనే అమ్లజనికి ఆపేరు వచ్చినది. కర్బనము (Carbon) అమ్లజనితో కలిసినపుడు కర్బనికఆమ్లము (Corbonic acid) అగును. గంధకము అమ్లజనితో కలిసినపుడు గంధకికామ్లము (Sulphuric acid) గంధకద్రావకము అగును. ఇట్లే నత్రజని స్ఫురము ఇవి అమ్లజనితో గలుపగా నేర్పడిన పదార్థములు నీటితో జేరినప్పుడు నత్రికామ్లము, స్ఫురికామ్లము ఏర్పడుచున్నవి.

ఇట్లు ఏర్పడిన అమ్లములు సామాన్యముగ పుల్లనైన రుచిగలిగియుండుటచే దీని కీ పేరు గలిగినది. అమ్లజనితో వేఱొకపదార్థము యొక్క సంయోగమునకు అమ్లజనీకరణ (Oxdisation) మని పేరు. అమ్లజనీకరణము వలనగాక ఉదజని (Hydrogen), హరిణము (Chlorine) మొదలగు కొన్ని ఉపధాతువుల సంయోగమువల్ల గూడ ఉదజహరికామ్లము మొదలగు అమ్లములు గలుగును. నీలిలిట్మస్ అను కాగితమును ఎఱుపు వర్ణమునకు మార్చు

ద్రావకములన్నియు అమ్లములని గ్రహించునది. వివిధములైన అమ్లములగూర్చి ఆయా శీర్షికల క్రింద చూడనగును.

**అమ్లియార.** 'అమ్లియార' యను మిక్కిలి చిన్న సంస్థానముయొక్క ముఖ్యగ్రామము. ఈసంస్థానము బొంబాయిరాజధానియందు మాహికాంత యెజన్సిలో నున్నది. అహమదాబాదుపట్టణమునకు ఈశాన్యమున ౩౮ మైళ్లమీద నీ గ్రామమున్నది. జనసంఖ్య ౧౯౦౧ లో ౧౮౭౮. ఇందు నొకశివాలయమును, తురకలగోరీయును, పురాతన పట్టణముయొక్క జీర్ణావశేషములును గలవు.

**అమ్లోర.** పంజాబునందలి నాభాసంస్థానములో నొక నిజామత్ అనఁగా జిల్లా. దీని వైశాల్యము ౫౯౧ చదరపు మైళ్లు. జనసంఖ్య ౧,౧౫౦౭౪. ఇందు ౨౭౪ పల్లెలును, నాభా గ్రామమును ఉన్నవి. అంటోహా అనునది రాజధాని. భూమి శిస్తు, సెస్సులు కలిసి రు. 3,30,000లు. భూమిరేగడ, మిక్కిలి సారవంతము;నీరు పైననే పడును. సర్ హింద్ కాలవవల్ల భూములకు నీరుపారును. చలిజ్వరము ఇతర జబ్బులు కలవు.

**అయతి.** నహుషరాజు నల్గురు పుత్రులలో నాలవవాఁడు.

**అయనము.** అయనమనగ గమనము, నడక. సూర్యచంద్రాదు లాకాశము నందు ప్రతిదినమును తూర్పునుండి పశ్చిమమునకు పోవుటయేగాక సంవత్సరమునందు కొన్ని దినములు ఉత్తరమునుండి దక్షిణమునకును, దక్షిణమునుండి ఉత్తరమునకును పోవునట్లు కాన్పించెదరు. ముఖ్యముగ సూర్యునియొక్క యుత్తరదక్షిణ గమనమును గురించియే అయనశబ్దము వాడుకలో నున్నది. సూర్యుడు ఉత్తరమువైపు పోవునట్లు కాన్పించెడు ఆరు నెలల కాలమునకు ఉత్తరాయణ మనియు (Winter solstice), దక్షిణమువైపు పోవునట్లు కనిపించెడు ఆరు నెలలకాలమునకు దక్షిణాయన మనియు (Summer solstice) పేళ్లు. అట్లే సూర్యుఁ డాకాశమునందు నేస్థలమునుండి ఉత్తరమునకు పోవ నారంభించునో యా స్థలమునకు ఉత్తరాయణమనియు, ఏస్థలమునుండి దక్షిణమునకు పోవనారంభించునో యాస్థలమునకు దక్షిణాయనమనియు పేళ్లు.

సూర్యుఁడు మకరరాశిలో ప్రవేసించినపుడు అనగ మకరసంక్రాంతిదినము ఉత్తరాయణమునకు ప్రారంభమగును.

పాశ్చాత్యసౌరమానమున నిప్పుడు మకరసంక్రాంతి సాధారణముగ ౨౧వ డిశంబరు దినమున నగును. మకర, కుంభ, మీన, మేష, వృషభ, మిధునము లను నాఱురాసులలో సూర్యు డుండు కాలమంతయు ఉత్తరా

యణము. కర్కటకరాశిలో సూర్యుఁడు ప్రవేశింపగనే అనగ కర్కటకసంక్రాంతి దినమున దక్షిణాయనము ప్రారంభమగును. ఇది పాశ్చాత్యసౌరమానమున సాధారణముగ ౨౧వ జూన్ తేదీన నగును. కర్కట, సింహ, కన్యా, తుల, వృశ్చిక, ధనుస్సు లను ఆరురాశులలో సూర్యుఁ డుండు కాలము దక్షిణాయనము.

సూర్యుడు సంవత్సరములో వసంతసంపాత (Vernal Equinox ౨౧వ మార్చి) దినమునను, శారదసంపాత (Autumnal Equinox; ౨౨వ శెప్టెంబరు) దినమునను మాత్రము సూటిగ తూర్పున నుదయించి పడమర నస్తమించును. ఈ రెండు దినములందే రాత్రింబగళ్ల యహస్సులు సమానముగ నుండును.

సూర్యునియొక్క ఉత్తర దక్షిణ ప్రయాణములను చూడవలయునన్న ఈ రెండు దినములలో నొక్కదినము నుండి ప్రతిదినమును సూర్యుఁడెచ్చట నుదయించుచుండునో చూచుచుండవలయును. వసంత సంపాతము (౨౧వ మార్చి) నుండిమనము సూర్యుని చూచుచుండ మనుకొందము. ఆ దినమున సూర్యుఁడెచ్చట నుదయించునో గుర్తుపెట్టుకొనవలయును. మనము చూచుచున్న స్థలమునుండి ఒక కొమ్మకు సూటిగ సూర్యుఁ డుదయించు నను కొందము. తరువాత ప్రతిదినము ఆస్థలము నుండియే, ఆకొమ్మకు సూటిగనే సూర్యోదయమును చూచుచుండిన యెడల బ్రతి దినమును సూర్యుఁడా కొమ్మకు నుత్తరముగ నుదయించుచున్నట్లు గానవచ్చును, ఇట్లు సూర్యుఁడు ప్రతిదినమును ఉత్తరమునకు పోవుచు జూన్ ౨౧వ తేదీన ముందుకుఁ బోవనాగిపోయి అక్కడినుండిదక్షిణమునకు మరలును. ఆరోజు సాయనకర్కసంక్రమణమగును, దక్షిణాయము ప్రారంభమగును. అప్పటినుండి ప్రతిదినము క్రమక్రముగ దక్షిణమునసూర్యుఁ డుదయించును. శారదసంపాత (౨౨వశెప్టెంబరు) దినమున మరల సూటిగ తూర్పున నుదయించును. అనగ మనము మొదట నాతని నెచ్చట చూచిమో నచ్చట నుదయించును. ఆదినము తులా సంక్రమణ మగును. మరల నాటినుండి ప్రతిదినమును దక్షిణమున నుదయించుచు డిశంబరు ౨౧వ తేదీన దక్షిణ ప్రయాణమునాపి ఉత్తరమునకు మరలును. అదినము మకరసంకణమగును.

వసంత, శారద సంపాత దినముల నహోరాత్రములు సమానముగ నుండును. ఉత్తరాయణ దినమున రాత్రి అహస్సు ఎక్కువలో నెక్కువయు, పగటియహస్సు తక్కువలోఁ దక్కువయు నుండును. ఆదినమునుండి పగటి అహస్సుహెచ్చును, రాత్రి అహస్సు తగ్గును. దక్షిణాయణదినమున రాత్రిఅహస్సు తక్కువలోఁ దక్కువగను,పగటియహస్సు ఎక్కువలో నెక్కువగను ఉండును. ఆనాటినుండి రాత్రి అహస్సు హెచ్చును; పగటి అహస్సు తగ్గును.

| సంక్రాంతులు. | | ప్రారంభమగుదినము. | |
|---|---|---|---|
| మకరము | ... ... | డిశంబరు ౨౧ | ఉత్తరాయణము. |
| కుంభము | ... ... | జనవరి ౨౦ | |
| మీనము | ... ... | ఫిబ్రవరి ౧౯ | |
| మేషము | ... ... | మార్చి* ౨౧ | *వసంతసంపాతదినము. |
| వృషభము | ... ... | ఏప్రిల్ ౧౯ | |
| మిధునము | ... ... | మే ౨౦ | |

| సంక్రాంతులు. | | ప్రారంభమగుదినము. | |
|---|---|---|---|
| కర్కాటకము | ... ... | జూన్ ౨౧ | దక్షిణాయనము. |
| సింహము | ... ... | జూలై ౨౨ | |
| కన్య | ... ... ... | ఆగష్టు ౨౨ | |
| తుల | ... ... ... | శప్టంబరు ౨౨** | **శారదసంపాతదినము. |
| వృశ్చికము | ... ... | అక్టోబరు ౨౩ | |
| ధనుస్సు | ... ... | నవంబరు ౨౨ | |

సాయనవర్ష మానము ౩౬౫ దినములు ౧౪ గడియలు, ౩౨ విగడియలు. ఇంగ్లీషుమానమున ౩౬౫ దినములు, ౪౮ మినిట్లు, ౪౯ సెకనులు. అయనమువద్ద నుండి మరల నా ఆయనము వఱకు సూర్యుఁడు నడచుకాలము సాయన వర్షము.




నిరయనవర్ష మానము ౩౬౫ దినములు ౧౫ గడియలు ౨౩ విగడియలు. నిరయన సాయనవర్ష మానములకు భేదము ౫౧ విగడియలు లేక ౨౦ మినిట్లు, ౨౩ సెకనులు. ఒక నక్షత్రమువద్ద నుండి బయలుదేరి మరల నానక్షత్రము వద్దకే సూర్యుఁడు వచ్చుటకుఁ బట్టు కాలము నిరయన వర్ష మానము.

౧వ పటము.

సూర్యగమనము దెలుపుపటము.

ఇందు "సూ" అనునది సూర్యుఁడుగాను, "భూ" అనునది భూమిగాను, భావించుకొనవలయును. ౧,౨,౩,౪,౫ ౬,౭,౮,౯, అనుఅంకెలు పక్షమునకొక్కసారి భూమి యుండు స్థానములు. పెద్దచక్రము రాశిచక్రము. అందలివి రాసులు. భూమి౧వస్థాన మందున్నప్పుడు, అనగా ధనస్సులోనుండి మకరములోనికి బ్రవేశింపఁ బోవునప్పుడు సూర్యుడు, "సూ" అను సమ రేఖలో కర్కాటక రాశిలో ప్రవేశించుచున్నట్లు కనఁబడును. అర్ధరాత్రమందు సూర్యునికి పరాఙ్ముగానున్న అర్ధగోళమునందు ఈరాశికి ఎదురుగానున్న రాశికనఁబడును. భూమి ౨వ స్థానమునకు వచ్చినప్పుడు సూర్యుఁడు ఈరాశిలో మధ్యనుండును. భూమి ౩వ చోటికిరాగా సూర్యుఁడు "సింహ" రాశిలో ప్రవేశమగును. ఈ విధముగా భిన్నస్థానములను బొంది నపుఁడు సూర్యుఁడును భిన్నరాసులయందు ప్రవేశించినట్లు కనఁబడి, సంవత్సరమగునప్పటికి భూమియథాస్థానమునకు వచ్చినప్పుడు సూర్యుఁడుకూడ నాస్థానమునకు వచ్చినట్లు కనఁబడును.

సూర్యుఁ డిట్లు కొన్నిదినములు ఉత్తరము నకును కొన్ని దినములు దక్షిణమునకును ప్రయాణ మేల చేయును? అనుప్రశ్నమునకు జవాబు విచారింతము. వ్యవహార భాషలో సూర్యుఁడు నడుచుచున్నాఁడని మన మనినను నిజముగ సూర్యునిచుట్టు ప్రదక్షిణము చేయునది మనభూమియే యని చదువరులకు తెలిసియే యున్నది. కావున సూర్యుఁడు, కర్కాటకమునందుఁ బ్రవేశించినాఁ డన నేమి? భూమి మకరమునందు ప్రవేశించినదని అర్థము. మనము మకరరాశివైపు ఉన్నందున ఆరాశికి ఆరురాశు లవతల నున్న కర్కాటకరాశిలో సూర్యుఁడు ప్రవేసించినట్లు మన కగుపడును. భూమి యెచ్చటెచ్చటనున్న సూర్యుఁ డెచ్చ టెచ్చట నున్నట్లు కానవచ్చునో యీప్రక్క ౧వ పటమువలన తెలియవచ్చును

ఇట్లు సూర్యగమనమనగ భూగమనమే యని తెలిసికొని భాషా సౌకర్యార్థమై సూర్యుడే తిరుగుచున్నటుల వ్యవహరింతము.

సూర్యుఁడు ఆకాశమునందు నేవృత్తమార్గమున తిరుగుచున్నట్లు కాన్పించునో దానిని క్రాంతివృత్తము (Ecliptic) అనిమెదరు. ఇది ఆకాశమునందు నిశ్చితమైన మార్గము. దీనినే ౧౨ రాసులుగను, ౨౭ నక్షత్రములుగను విభజించిరి. ఈ క్రాంతివృత్తము ఆకాశములో మన భూమి యేత్రోవనఁబోవునో దానిఁదెల్పును. సూర్యునిచుట్టుతిరుగు పృథివి నిక్కపొడుచుకొని తనకక్ష(Orbit)కు లంబనము (Perpendicular) గఁబోక కొంతవంకరగఁ బోవును. భూమియొక్క అక్షము (Axis) భూకక్షకు ౬౬½ అంశ




౨వ పటము

"ఉద" భూమి యొక్క యక్షము. "భూమ" భూమధ్యరేఖ. భూకక్ష్యకును భూమ్యక్షమునకును ఎంతవంపుగలదో ఈ పటమువలనం దెలియును.

ములు వంగియున్నది. చూఁడు ఈ మీఁది టము. భూమియిట్లు వంగక లంబనముగ పోవుచుండిన యెడల భూమధ్యరేఖయు క్రాంతి వృత్తము సమ ప్రదేశములు (On the same plane) కలవియై యుండును. ఇట్లు లేనందున భూమిమధ్యరేఖా ప్రదేశమును పెంచిన నాకాశమునం దేమార్గ మేర్పడునో దానిని విషువవృత్త(Celestial Equator) మందుము. క్రాంతివృత్త మీ విషువవృత్తమును వంకరగా ఛేదించును. ఈ వక్రత (వంక) ఇపుడు ౨౩° అంశముల ౨ కళలు. దీనిని క్రాంతివృత్తము యొక్క తిర్యక్త్వ మందురు. ఇది బోధపడుటకై ఒక గుండ్రసిపెద్దగాజును దానిలో సమముగ పట్టునట్టిచిన్న గాజును తీసికొనుడు. మొదట ఒకదాని కొకటి తగిలించి యుంచి తరువాత ఒకటి పూర్వపశ్చిమముగ నిలుపఁబెట్టి అందు రెండవ దానిని దక్షిణోత్తరముగ నిలువ యుంచుఁడు.

అట్టిస్థితిలో ఆరెండు గాజుల వృత్తములును ఒక దాని కొకటి లంబముగా నుండును. అనగ వాని వక్రత ౯౦ అంశములుండును. దీనినిబట్టి ౨౩° వక్రతయన నెంతయో చదువరు లూహించుకొనవచ్చును. ఈక్రింద నిచ్చిన 3వపటమువలన క్రాంతివృత్త, విషువవృత్తములతిర్యక్త్వము బోధపడగలదు.




3వ పటము

,,ఖశే'' భూగోళామధ్యరేఖ ,,అఆ''కాంతి వృత్తము ,,దివి'' క్రాంతిపాతము.

పైరెండు గాజుల వృత్తములు ఒకటి నొకటి రెండుస్థలముల మాత్రము ఛేదించును. ఈ స్థలములను సంపాతబిందువు లందురు. క్రాంతివృత్తమును విషువృత్తమునుకలిసిన ఈవసంత, శారధ సంపాతము లను రెండుస్థలములకు సూర్యుఁడు వచ్చినప్పుడు ఈరెండు వృత్తముల తిర్యక్త్వము సున్న యగును. అందుచే సూర్యుఁడు సూటిగ తూర్పున నుదయించి ఉత్తర దక్షిణభాగములపై సమానముగ కిరణములు ప్రసరింపఁజేసి నందున అహోరాత్రములుసమాన మగును. అచ్చటినుండి సూర్యుఁడు ఉత్తరమునకు గాని దక్షిణమునకుగాని ౨౩°౨౮' వరకు వెళ్లి వచ్చినట్లు కానవచ్చుచుండును.



౪వ పటము

విషువత్తునాటిభూమిమీది యహస్సు.



౫వ పటము

ఉత్తరాయణము నాటిభూమిమీది యహస్సు.



౬వ పటము

దక్షిణాయనమునాటి భూమిమీదియహస్సు.

**అయన చలనము.** పైని సంపాతముల కాలములును అయనముల కాలములును సాయన సౌరమానము ననుసరించి ప్రత్యక్షముగఁ గాన వచ్చునట్టి దినములు వ్రాయఁబడినవి. కాని యిప్పుడు మనదేశమునందలి పంచాంగములలో నీయఁబడు అయనాదికముల తేదులు అనగ ఆయా సూర్య సంక్రమణముల తేదులు పైవానితో సరిపోవు. పింగళనామసంవత్సర పంచాంగములో వీనికి గనఁబడు భేద మీక్రిందఁ జూపుచున్నాము.

| సంక్రమణము. | నిజముగ జరిగిన దినము. | మనపంచాంగము లోచూపబడిన దినము. |
|---|---|---|
| ౧ మకరము. | | |
| (ఉత్తరాయణ ప్రారంభదినము) | ౨౧ డిసంబరు ౧౯౧౪ | ౧౪ జనవరి ౧౯౧౫ |
| ౨ మేషము. | | |
| (వసంత సంపాతము, విషువత్పుణ్యకాలము) | ౨౧ మార్చి ౧౯౧౪ | ౧3 ఏప్రిల్ ౧౯౧౪ |
| 3 కర్కటకము. | | |
| (దక్షిణాయన ప్రారంభము) | ౨౧ జూన్ ౧౯౧౪ | ౧౬ వ జూలై ౧౯౧౪ |
| ౪ తుల. | | |
| (శారదసంపాతము) | ౨3 శెప్టెంబరు '౧౪. | ౧౪ అక్టోబరు '౧౪ |

ఇట్లు దృగ్ప్రత్యయమునకును, మనపంచాంగములలో వ్రాయఁబడిన సంక్రమణముల కాలములకును ౨3, ౨౪ దినముల భేధ మెందుకుఁ గలిగినది? ఇందుకు ఆయనచలనమే కారణము. ఇదివరకు మనము ఆయన బిందువులును (Solstices), సంపాతబిందువులును (Equinoxes), స్థిరమనే వ్యవహరించితిమి. కాని అవి స్థిరములు కావు. ఈబిందువులు నక్షత్రమండలమునందు వెనకకుం బోవుచుండును. అందుచే అశ్విన్యాది నక్షత్రములు సంపాత బిందువుల వద్దనుండియు,అయన బిందువుల వద్దనుండియు, ముందుకు జరుగుచుండును. ఆ బిందువులు వెనుకకు జరుగు చుండును. అనగ క్రాంతి వృత్తముమీాద విషువ వృత్తముయొక్క ఛేదన బిందువులు మారుచుండును. అందుచే సంపాత బిందువులు మారుటయు సంభవించును. వృత్తముమీాది ఒక బిందువు చలించిన యెడల తక్కిన బిందువులన్నియు చలించును. అందుచే సంపాత బిందువులకు ఉత్తరముననను, దక్షిణముననను ౯౦ అంశముల మీాదనున్న క్రాంతి వృత్తముమీాది అయన బిందువులునుక్రమముగ మారును.ఇట్లు అయన బిందువులకు చలనము గలదు. వేదాంగజ్యోతిషమను పురాతన జ్యోతిష గ్రంధము కలదు. ఆకాలమునందు ధనిష్టా నక్షత్రపారంభమున ఉత్తరాయణము ప్రారంభమగుచుండెనని వ్రాయఁబడియున్నది. అది శకకాలమునకు పూర్వము ౧౪౭౭ సంవత్సరముల క్రింద వ్రాయఁబడిన గ్రంథము.తరువాత కొంతకాలమునకు శ్రవణా నక్షత్రమువద్దనుండి ఉత్తరాయణము ప్రారంభ మగుచుండెను. వరాహమిహిరుని కాలమున శా. శ. ౪౨౭ ఉత్తరాషాఢా నక్షత్రము యొక్క రెండవ చరణమునుండి ఉత్తరాయణముప్రారంభమగుచుండెను. ఇప్పుడు మూలానక్షత్రముయొక్క మూడవ పాదమునుండి ప్రారంభమగుచున్నది. అనగ ఆయనబిందు వింతదూరము వెనుకకు జరిగినదని అర్థము. దీనిని అయన చలన మనవచ్చును, సంపాతచలన మనవచ్చును. సూర్యుని అయనముల వలన ఈ చలనము మొదట తెలిసినందున మనవారు దీనిని అయనచలన మనిరి. సంపాత బిందువులు ముఖ్యమని తలంచినందున పాశ్చాత్యులు దీనిని సంపాతవిలోమ చలనము లేక విషువచలనము(Precession of the Equinoxes) అని అనిరి.

ఇట్లు అయన చలనమునకు ప్రతిసంవత్సరమును విలోమగతి గలదు. అది ప్రతిసంవత్సరమును ౫౦.౨ వికళలు వెనకకుం బోవును. ఇట్లు అయనము ౨౫౮౦౦ సంవత్సరములలో ఒకసారి క్రాంతివృత్తముయొక్క ధృవము (Pole) చుట్టుతిరిగివచ్చును. మనజ్యోతిష్కులు అయనముసాంవత్సరికగతి ౬౦ వికళలు అని గ్రహించియున్నారు. ఆలెక్కప్రకార మిప్పుడది సంపాతబిందువునుండి రమారమి ౨౨° అంశములు ముందునున్నది.

మన పంచాంగ కారులు గణితము వేయుటలో ఈ అయన చలనమును లెక్కలోనికి తీసికొనరు. అందుచే వారిపంచాంగమును నిరయనపంచాంగ మనవలయును. పాశ్చాత్య




౭వ పటము.

అయనమును అయనచలనమును తెల్పు పటము. ఇందు క్రాంతివృత్తముమీది ౨౭ నక్షత్రములను చూపబడినవి. అశ్విని మొదలుకొని ౨౧ నక్షత్రములకు నొక్కటిచొప్పనజూచిన మేషాది౧౨రాసులు ఏర్పడును. సంపాతస్థలములును అయనబిందువును వెను వెనుకకు నెట్లు జరుగునో ౧ ౨ ౩ అంకెలు వేసిచూపంబడినది,

పంచాంగకారులునుమన దేశమునందిటీవల ప్రారంభింపబడిన దృగ్గణితాది పంచాంగకారులును అయనాంశములను లెక్కలోనికి దీసికొందురు. గనుక వానినిసాయన పంచాంగములందురు. సాయనరవికిని మనపంచాంగములోని రవికిని గలభేదమే అయనాంశము లనబడును. లేక సంపాతబిందువులకును నిరయన పంచాంగముయొక్క ఆరంభ స్థానమునకునుగల అంతమును అయనాంశ మన వచ్చును. మన పంచాంగము లన్నిటిని సాయన పంచాంగములుగ మార్చవలయుననియు, అట్లుచేయనిచో క్రమముగ ఋతువులన్నియు వేరువేరు నెలలలో

వచ్చుట తటస్థించుననియు, మహారాష్ట్ర దేశమున శంకరబాలకృష్ణదీక్షిత్ మొదలైనవారు వాదించి సాయన పంచాంగములం బ్రకటింపం బ్రారంభించియుండిరి. దృగ్గణితపంచాంగమొకటి చెన్నపట్టణమున ఇంగ్లీషునాటికల్ అల్మనెక్కు ననుసరించి ప్రకటింపం బడుచున్నది. అదియు సాయన పంచాంగమనియే చెప్పవచ్చును. [కొ. ల.

**అయనుఁడు.** దేవ విశేషము. ధర్మ ఋషికి సాధ్యయను స్త్రీయందుఁబుట్టిన సాధ్య దేవతలనువారిలో నొక్కఁడు. (మత్స్య అ.౨౦౨.)

**అయవాహము.** భారతవర్షీయ దేశము.(భార. భీష్మ. అ. ౯)

**అయశ్శిరుఁడు.** కశ్యపుని వలన దనువునకుఁ గలిగిన దానవులలో నొకఁడు.

**అయస్కాంతము.** అయస్కాంతమనఁగా సూదంటురాయి. ఇనుముతోఁ జేయఁబడినసూది, పాళి, మొదలగు వస్తువులనాకర్షించుగుణమునుగలిగియుండుటచే నిదిఅయస్కాంతమనఁబడెను. దీనిని ఇనుపపొడిలోఁ బెట్టునపు



౧వ పటము

డు,అందలి ఇనుపపలుకులుదీనిచివరల గుబురుగ నంటుకొనును. ౧వ పటముచూడుఁడు. ఇది వ్రేలాడుచున్నపుడు, ఒకేవైపునకుఁదిరిగి ఉత్తరదక్షిణములఁ జూపించును.



౨వ పటము

౨వ పటమును చూడుఁడు. ఇట్టిగుణమును గలిగియుండుటచేఁ బ్రాచీన కాలమునుండియు నావికులు సముద్రముమీఁద దిక్కులనుదెలిసికొనుటకు దీని నుపయోగించుచున్నారు. ఈ లోహము మనదేశమందు సేలము, హాస్సాను, మొదలగు జిల్లాలలో దొరకుచున్నది. ఇనుము కొఱకీ రాయిని గనులలో నుండి త్రవ్వుదురు. ఇందు ఇనుము, ప్రాణవాయువు అను మూల పదార్థములు కలవు. ఒకయణువు సూదంటు రాయిలో ఇనుముయొక్క పరమాణువులు 3ను, ప్రాణవాయువుయొక్క పరమాణువులు ౪ను ఉండును. అనగా ౧౦౦కి ౭౨ వంతున ఇనుముండును. దీనికి రసాయనశాస్త్రమందు లోహామ్లితము అనిపేరు. లో౩ అ౪ ($F_3O_4$) అని రాసాయనికసంకేతము. దీనికి సూదంటు రాయిఅన్న పేరుఉన్నను ఇదిరాయికాదు, ఒక విధమైన ఇనుము. ఇది గనులలో దొరుకును.

ఇట్టి స్వభావికాయస్కాంతముతో నొక్క ఉక్కుతునుకను గాని సూదిని గాని రుద్దిన ఎడల నది యినుప ముక్కల నాకర్షించు నట్టియు దక్షిణోత్తర దిక్కులకు తిరుగునట్టియు గుణములను పొందును.

కల్పితాయస్కాంతము.

ఈ ఉక్కు తునక కిట్టి గుణములు సహజముగ లేక మనప్రయత్నమువల్ల కలుగుటచే నివి కల్పితాయస్కాంతములనఁ బడుచున్నవి. ఇవి గట్టివిగను, మనము కోరుకొను ఆకారమును బలమును కలిగియుండునట్లు చేయఁబడుటవల్లను గనులలో దొఱకు సూదంటురాళ్లకన్న చాల యుపయోగకరములుగ నున్నవి. అందు వలననే ఈ కల్పితాయస్కాంతము ఉపయోగమునకు వచ్చుటయు, స్వాభావికముగ దొరుకు సూదంటురాళ్లు విచిత్రవస్తువులవలె మాత్రము చూడఁ బడుటయు సంభవించుచున్నది. అయస్కాంతములు వానివాని యుపయోగములను బట్టి భిన్నాకారములుగ చేయఁబడును. కాంతీకరణము చేయఁబడిన సూదులు శాస్త్రీయ ప్రయోగములలో నుపయోగించును. సన్నసికోనలు, నడుమ రంధ్రమును గల్గి సూది వలెనుండు అయస్కాంతములు, జేబుగడియారపుగొలుసులలో వ్రేలాడు చిన్నబిళ్ల, నావికులదిక్సూచి, మొదలగు వానియం దుపయోగింపఁ బడును. కొన్నిపొడవు వెడల్పుదళసరి గలిగి దిమ్మలవలె చేయఁబడును. కొన్నిగుఱ్ఱపు నాడములవలెవంచఁబడి కాంతీకరింపఁబడును.

క్రీ. పూ. ౨౬౦౦ సంవత్సరముల నాటికే చీనాదేశీయులు అయస్కాంతము నెఱిగియున్నట్లును, దాని సహాయమున సముద్రమువీఁద ఓడలను నడపినట్లును అనేక నిదర్శనములు గానవచ్చుచున్నవి. యూరోపు వారికి మాత్రము దీని గుణ ధర్మములు ౧౧వ శతాబ్దము వఱకుఁ దెలిసి యుండ లేదు.

అయస్కాంతమువలన నాకర్షింపఁబడు పదార్థములు ఉక్కు, ఇనుము అని మనకు దెలిసియేయున్నది. ఇదిగాక నికెల్, కోబాల్ట్ (మణిశిల) అనులోహములుమాత్రమే అయస్కాంతాకర్షణకు లోఁబడును.

కాంతపదార్థములు

మఱియును లోహ ద్రవ్యములును, కాగితము, ద్రవరూపముననున్న ప్రాణవాయువును, కొంచెముగ కాంతాకర్షణకులోఁబడును. ఈ పదార్థముల కిట్టి గుణముండుటబట్టి వీనినికాంతపదార్థములని చెప్పవచ్చును. రాగి, వెండి, బంగారము, తగరము, కర్ర, మొదలగు నవన్నియు అకాంతపదార్థములు. చిన్నఅయస్కాంతమువలన నొకలోహము, ఇనుమయినదియు కానిదియు గనుఁగొనుటకు వీలగుచున్నది. ఇపుడు బజారులో నమ్మఁబడుచున్న తగరపు రేకులు అచ్చతగరపు రేకులుకావు; తగరము పూయబడిన యినుపరేకులు. ఇట్టిరేకు నొకదానివద్దకు, అయస్కాంతమును దెచ్చినయెడల ఇనుము కావున ఆకర్షింపఁబడును. అయస్కాంత మొకసూదిదగ్గఱకుఁ దెచ్చినయెడల నెట్లాకర్షించునో మధ్యనొక అద్దపు పలకను గాని కాగితపు అట్టనుగాని ఇత్తడిరేకును గాని

మఱే యే యితర అకాంత పదార్థమునుగాని యుంచినను, ఆసూదినట్లే యాకర్షించును. మన అఱచేతిలో నొక పాళినుంచి అడుగు వైపున నొక అయస్కాంతము తెచ్చినయెడల నది పైనున్న పాళిని ఆకర్షించుచున్నట్లుకనఁబడును! క్రింది అయస్కాంతమును ఇటుఅటు త్రిప్పిన కొలఁదిని చేతిలోని పాళి అటుఇటు తిరుగును. ఈ ఆకర్షణశక్తి మనకేమియు తెలియకయే అరచేతిలోనుండి పోవుచున్నది. కాని మధ్య ఇనుమువంటి కాంత పదార్థము నుంచిన యెడల అయస్కాంత మాసూదినాకర్షింపఁ జాలదు.

ధ్రువములు

కాంతీకరింపఁబడిన సూదిని వ్రేలాడ గట్టిన యెడల స్వభావసిద్ధమైన సూదంటు రాయివలె నదిగూడ ఒకే దిక్కునకు తిరుగును. దానిని ఇనుప పొడిలో వేసి యెత్తిన యెడల ఇనుపముక్కలు దాని రెండు కొనలను దట్టముగ నంటుకొనును. ఇట్లే దిమ్మవంటి అయస్కాంతపు చివరలందు, గుఱ్ఱపునాడమువంటి అయస్కాంతపు చివరలందును, ఇనుపముక్కలు గుబురుగనంటుకొనును. అయస్కాంతముయొక్క ఈ రెండు చివరలకును ధ్రువములనిపేరు. అయస్కాంతమును వ్రేలాడఁ గట్టినపుడు ఉత్తరదిక్కును చూపు చివర ఉత్తరధ్రువము, దక్షిణమును జూపు చివర దక్షిణధ్రువము, ఈ రెండు ధ్రువములను కలుపునట్టి కల్పితమైన గీత అయస్కాంతాక్షమనఁబడును. (Magnetic Axis)

అయస్కాంతమునందు లోహచుంబకత్వము అనఁగా ఇనుమును ఆకర్షించుశక్తి ధ్రువముల వద్ద మిక్కిలిగనుండి క్రమక్రమముగ తగ్గుచు మధ్యభాగము వద్దనేమియు లేకుండఁబోవును. కఱ్ఱయొక్క కొనమీఁద నొక అయస్కాంతమును నిలిపిన అది స్వేచ్ఛగ తిరుగుచు ఉత్తర దక్షిణములఁజూపును. 3వపటముచూడు. ఉత్తర



3వపటము

దిక్కుచూపుధ్రువమునొద్ద కింకొక . కాంతము యొక్క ఉత్తరధ్రువమును తెచ్చినయెడల నది దూర దూరముగతొలగిపోవును. దక్షిణ ధ్రువమును దెచ్చినయెడల నదిఆకర్షించును. ఇట్లే కఱ్ఱమీఁదనున్న దక్షిణధ్రువము మఱియొక కాంతముయొక్క ఉత్తరధ్రువమును ఆకర్షించును. దక్షిణధ్రువమును త్రోసివేయును. అనఁగా అయస్కాంతములయొక్క భిన్నధ్రువములకు స్నేహమును, సమానధ్రువములకు వైరమును కలదనుట. సమానధ్రువము లొకదాని నొకటి నిరాకరించును. ఇదియే కాంతనిరాకరణము. భిన్నధ్రువము లొకదాని నొకటి

అకర్షించును. ఇదియే కాంతాకర్షణము. కాంతీకరణము చేయఁబడిన కొన్ని సూదులకు చిన్న బెండ్లు గ్రుచ్చి వానిని నీటిలో నిలువుగా తేలునట్లుచేసి వాని సమానధ్రువములన్నియు నీటిపై నుండునట్లేర్పఱచినయెడల నవి ఒక దాని నొకటి నిరాకరించి దూరముగఁ బోవు చుండును. ౮వ పటముచూఁడుము. ఇట్టిమూఁడు



౮వ పటము

సూదులను వేసినయెడల నవిసమత్రిభుజము యొక్క కోణములుగ నేర్పడును. నాలుగు వేసిన చతుర్భుజముయొక్క కోణములుగనేర్పడును. అయిదు సూదులతో సమపంచభుజముయొక్క కోణము లేర్పడును.



౯వ పటము

కాంతీకరణమనఁగా అయస్కాంతములను తయారుచేయువిధము. అయస్కాంతముతో

**కాంతీకరణ పద్ధతులు.**

నొక యినుపముక్కను ఒక ఉక్కుతునకను రుద్దిన యెడల ఉక్కుతునుక ఇనుపపొడి నాకర్షింపఁగలుగును. కాని ఇనుప ముక్క ఆకర్షింపనేరదు. ఆ. ఇనుపముక్క ఒక అయస్కాంతమునకు తగిలినప్పుడు కాంత భావముఁజెంది మఱియొక ఇనుపముక్క నాక ర్షించును. అయస్కాంతమును తొలగించిన యెడల, ఆకర్షింపఁబడిన యినుపముక్క క్రిందఁ బడును. ఇందువలన నుక్కుయొక్క కాంత భావమెల్లపుడు నిలుచుననియు, ఇనుముయొక్క కాంతభావ మప్పటికప్పుడు అనఁగా అయ స్కాంతము తగిలియున్నంతవఱకు నిలుచునని యు స్పష్టమగుచున్నది. కాంతీకరణమునందు మూఁడుపద్ధతు లవలంబింపఁ బడుచున్నవి.

౧. ఒకసూది బెజ్జముమీఁద నొక అయస్కాం తపు ఉత్తరధ్రువమునుబెట్టి కొనవైపునకు నొక్కిలాగుచు చివరకు వచ్చినపుడు దానినెత్తి మరల బెజ్జముమీఁదఁబెట్టి కొన్నిసారులు ఒత్తి లాగినయెడల ఆసూది కాంతభావముఁజెందును.




౧౦వ పటము

కావున ఉక్కుముక్కను అయస్కాంతముతో నొకేవైపుగా కొన్నిసారులు రాచిన దాని ఒఱయికచే ఆ ఉక్కుగూడ అయస్కాంత మగును. ఇట్లయస్కాంతమును జేయుట ఏక స్పర్శ కాంతీకరణమనఁబడును. ఇందు మొ దట తగిలినకొన అయస్కాంతముయొక్క

సమానధ్రువముగాను, రెండవకొన భిన్నధ్రువముగాను అగును. (౨)వ పద్ధతి. ఒకఉక్కుతునుకను బల్లమీఁదఁబెట్టి రెండు అయస్కాంతముల భిన్నధ్రువములను దాని నడిమిభాగమున నుంచి, అయస్కాంతములను చివరలవఱకులాగి, అచట వానినెత్తి, మఱల ఉక్కుతునుకయొక్క మధ్యభాగముననుంచి, చివఱలవఱకిట్లనేక పర్యాయములు లాగినయెడల



౫వ పటము

అయస్కాంతమగును. అపుడు ఉత్తరధ్రువముతో రాచినచివఱ దక్షిణధ్రువముగాను,దక్షిణధ్రువముతో రాచినచివర ఉత్తర ధ్రువముగాను అగును.ఇట్లు చేయుట భేదస్పర్శన కాంతీకరణమనఁబడును.3.విద్యుత్కాంతీకరణపద్ధతి.విద్యుత్ప్రవాహమునకు లోహచుంబకశక్తి గలదు. ఈప్రవాహము ఉక్కుముక్కగుండ కొంతసేపు ప్రవహించిన నది లోహచుంబకశక్తిని బొందును. ఇవ్విధముగ తయారుచేయఁబడిన కాంతములే దిక్సూచులలో నుపయోగింపఁబడుచున్నవి. విద్యుత్ప్రవాహమును గుండ్రముగా చుట్టఁబడిన ఇనుప తీగెగుండ బ్రవహించునటుల జేసినచో నది కాంతభావముఁజెందును. దాని ఉత్తరధ్రువము వైపు జూచినయెడల అందు విద్యుత్తు ఎడమవైపునుండి కుడివైపునకు అనఁగా గడియారపుముల్లు తిరుగుమార్గమునకువ్యతిరేకముగా పోవుచుండును. ౬వ ౭వ పటములు



౬వ పటము



౭వ పటము

చూడుము. విద్యుత్ప్రవాహమాగుటతో తీఁగయొక్క కాంత భావముకూడ అగిపోవును. ఈ గుండ్రటి తీఁగలో ఉక్కుకడ్డి నయినను నుంచిన దానికి కాంత భావము ప్రాప్తించును. తీఁగలో విద్యుత్తు ఉన్నంతవఱకు ఇనుపకడ్డీలో కాంత భావముండును. ప్రవాహమాఁగినతోడనే కాంత భావము మాయమగును. కాని ఉక్కుకడ్డియొక్క కాంతభావము మాత్రము శాశ్వతముగ నిల్చును. అయినను ఇందు మఱియొక విశేషము కలదు. కాంతభావముఁజెందిన ఉక్కుకడ్డీలకన్న విద్యుత్ప్రవహించుచున్న పోతఇనుపకడ్డీలలో లోహచుంబకశక్తి యెన్నియో రెట్లధికముగ నుండును. ఒక పోతఇనుపకడ్డీని గుఱ్ఱపునాడమువలె వంచి చుట్టును నూలుచుట్టఁబడిన రాగితీఁగెనుచుట్టి ఆ తీఁగెకొనలకువిద్యుద్ఘట మాలనుండివచ్చు

కొనలను జేర్చినవది అయస్కాంత మగును. చూడుడు ౯వ పటము. ఇది మిక్కిలి బరువయిన ఇనుపగుండ్ల నాకర్షింపఁగలదు. ఇట్లు విద్యుత్ప్రవాహమువలన కాంత భావము జెందు ఇనుపకడ్డీలకు విద్యుదయస్కాంతము (Electro-magnets) లని పేరు. విద్యుత్ సహాయముచే నడుపఁబడుచున్న ప్రతియంత్రములోను ప్రస్తుత మీ విద్యుదయస్కాంతము లుపయోగింపబడుచున్నవి. అందు ముఖ్యముగా, డైనమోయంత్రము, మోటారు బండి, టెలిగ్రాము, టెలిఫోను, విద్యుద్ఘంట (Electric Bell) వైద్యులుపయోగించు కర్షణ విద్యుత్ యంత్రము మొదలగు వానిలో నివి యుపయోగింపఁబడుచున్నవి.

కాంతభావముఁ జెందుటయందు పోతఇనుమునకును, ఉక్కునకును భేదమెంతయోగలదని జదివియున్నాము. ఇను

కాంతప్రేరణ

పదిమ్మనొక పెద్ద అయస్కాంతముయొక్క ఉత్తర ధ్రువ సమీపమునకుఁ దెచ్చినయెడల నది ధ్రువానువృత్తి (Polarity) బొంది అయస్కాంత మగును. పెద్ద అయస్కాంతమును తొలంగించిన వెంటనే ఇనుపదిమ్మ ధ్రువానువృత్తిని మానును. ఇట్లు అయస్కాంతము తన స్వభావమును కాంత పదార్థములలోఁ బ్రవేశపెట్టుట కాంతప్రేరణ (Magnetic Induction) యనఁబడును. ఇనుపదిమ్మ అయస్కాంతమున కెంత దగ్గఱగానున్నఁ అంత దానికాంత ప్రేరణ ఎక్కువగును. ఉత్తర ధ్రువ సమీపముననున్న ఇనుపదిమ్మకొన దక్షిణధ్రువానువృత్తినిదాని రెండవకొన ఉత్తర ధ్రువానువృత్తినిజెందును. కావున కాంతప్రేరణ వలన భిన్నధ్రువము లేర్పడును. భిన్నధ్రువములకు స్నేహముండునుగనుక, ఇనుపదిమ్మనుఅయస్కాంతమాకర్షించుచుండును. అందుచే ముందుకాంత ప్రేరణయు, వెనుక కాంతాకర్షణయు కలుగుచుండునని మనము గ్రహింప వచ్చును. ఇందుకు దృష్టాంతములు. అయస్కాంతమును కొన్ని పాళీలలోనుంచి ఎత్తిన యెడల, మూడు నాలుగు పాళీలొక దాని నొకటి యంటుకొని, అయస్కాంతపు కొననుండి గొలుసువలె వ్రేలాడును. ఇట్లే అయస్కాంతమునకు, ఒకదాని క్రింద నొకటిగ నెన్నియో ఇనుప తాళపు చేతులను, ఇనుప ఉంగరములను అంటింపవచ్చును. అయస్కాంతములను జాగ్రత్తగ వాడనియెడలను, ఎక్కువవేడి వానికి దగిలినపుడును, ఎల్లపుడును విడివిడిగ నుంచినపుడును వాని లోహచుంబకశక్తి క్రమక్రమముగాతగ్గిపోవును. కావుననే రెండు అయస్కాంతములను రెండు ఇనుపముక్కలతోఁ గలిపి యుంచెదరు. ఇట్లే గుఱ్ఱపునాడమువలె నుండు అయస్కాంతమునకొక యినుపముక్కను తగిలించియుంతురు.

ఒకపొడుగు నయస్కాంతము, మధ్యకు విరిచిన యెడల, ఆ రెండు ముక్కలును రెండు

కాంతస్వభావము

అయస్కాంతము లగును. ప్రతి ముక్కయు ధ్రువానువృత్తిగలిగి, ఇనుపపొడి నాకర్షించును. మఱలనా

రెండు భాగములను మధ్యకు విరచిన యెడల, ఆనాలుగు ముక్కలు గూడ చిన్నచిన్న అయస్కాంతములగును. ఇట్లు మన మెన్ని ముక్కలుగ విరుచుచున్నను, అందలి ప్రతిముక్కయు రెండు ధ్రువములును, మధ్యపంక్తియుఁ గల అయస్కాంతముగ నుండును. ౧౦వ పటము చూడు. ముక్కలయొక్క సమాన ధ్రువము



౧౦వ పటము

లన్నియు నొకే వైపున నుండును. దీనిని బట్టి అయస్కాంత మందలి ప్రతి యణువును ఉత్తర దక్షిణ ధ్రువములుగల చిన్న అయస్కాంతమగుచున్నదని స్పష్టమగుచున్నది. ఇంతియఁగాక ఉక్కులోని యణువులన్నియు చిన్న అయస్కాంతములనియు, వాని నన్నిఁటిని క్రమపద్ధతినుంచుటయే కాంతీకరణమనియు శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. ఒక ఉక్కుతునుక కాంతభావము పొంద లేదనఁగా, దాని యణువుల ధ్రువపద్ధతి యుండవలసిన తీరున నుండలేదని యర్థము. ఒక్క విధముననుండు కొన్ని చిన్న అయస్కాంతములనుదెచ్చి, ఒకే ముఖముగ చేర్చినచో నది యొకపెద్ద అయస్కాంతమై కాంతగుణములను జూపును. ఇప్పుడందలిచిన్న అయస్కాంతములను తారుమారుచేసినయెడల అనఁగా సమానధ్రువములున్న వైపుకొన్ని భిన్న ధ్రువములుంచిన, అదియినుప పొడి నాకర్షింపనేరదు! అందలి కాంతభావము నాశనమైనది. ఈ విషయమునే మఱియొక విధముగ నిట్లు చెప్పవచ్చును. ఒకశోధననాళికనిండ ఇనుపపొడిపోసి బిరడాపెట్టి, పెద్దఅయస్కాంతముతో దాని మీఁద కొన్నిసారులు రాచిన యెడల, నాళికలోని ఇనుపపొడి పొడువున నిలిచి ఒక చివర ఉత్తరధ్రువముగను, రెండవ చివర దక్షిణధ్రువముగను ఏర్పడును. ౧౧వ



౧౧వ పటము

పటముచూడు. ఇప్పుడీ నాళికను పరీక్షించినచో కాంతగుణములను కలిగి యున్నట్లు తేలును. మొట్టమొదట ఇనుపపొడి అల్లకల్లోలముగ నున్నను అయస్కాంతమువల్ల ప్రేరేపింపఁబడి యందుచే సరియైన పద్ధతిలోనికికొని రాఁబడి, కాంతమయ్యెను.

**కాంతవ్యాపార ప్రదేశము**

అయస్కాంతము సమీపమందున్న ఇనుపముక్కలను ఆకర్షింపగలిగినను మిక్కిలి దూరమునందున్న వానిని ఏమియు జేయ జాలదు. సమీపమునందున్న ఇనుపముక్కలును క్రమక్రమముగ కాంతమువద్ద నుండి దూరదూరమునకు దీసికొని వెడలిన

యెడల వానిమీఁదికాంతాకర్షణముక్రమముగ తగ్గి కొంతదూరమునకు నయ్యది బొత్తిగ లేకుండం బోవును. ఇట్లు ప్రతి కాంతమును తన చుట్టునుండు కొంత ప్రదేశములోపలమాత్రము ఇనుమును అకర్షించుటగాని, నిరాకరించుట గాని సంభవించును. ఈ చుట్టు ప్రదేశమునకు కాంత వ్యాపారప్రవేశము (Magnetic field) అనిపేరు.

పొడువైన యొక అయస్కాంతమును ఒక బల్లమీఁదపెట్టి దాని మీఁద సన్నని అట్టయుంచి దానిపైనుండి ఇనుప పొట్టునురాల్చి పుల్లలతో ఆఅట్టను నెమ్మదిగ కొట్టినయెడల ఆఇనుప పొట్టంతయు ఈ క్రిందిపటమున జూపఁబడినట్లు




౧౨వ పటము

పంక్తులుపంక్తులుగ నేర్పడును. ౧౨వ పటము



౧౩వ పటము

చూఁడు. ౧౩వ పటము గుఱ్ఱపు నాడము వంటి యాకారముగల అయస్కాంతముమీఁద ఇనుపపొట్టు చల్లినయెడల నేర్పడు పంక్తుల విధముం దెల్పును. రెండు అయస్కాంతముల యొక్క సమాన ధ్రువముల ఒక దానియొద్ద నొకటినుంచి వానిమీఁద ఇనుప పొట్టురాల్చిన




౧౪వ పటము

యెడల ౧౪వ పటమునందు జూపఁబడిన పంక్తులును, భిన్న ధ్రువముల సమీపమునందుంచి




౧౫వ పటము

పొట్టురాల్చినపుడేర్పడు పంక్తులు ౧౫వ పటమునందును చూఁడవచ్చును.

ఈ పై పటములందు చూపఁబడిన లోహ చుంబకత్వశక్తియొక్క మార్గమునుజూపుపటము లన్నింటిని చక్కఁగ బరిశీలించి చూచిన యెడల సమానధ్రువమునుండి వెడలుపంక్తులు సమాన స్వభావము గలవై ఒకటి నొకటిని నిరాకరించు కొనుటయు, భిన్న ధ్రువమునుండి బయలు దేరు పంక్తులు భిన్న స్వభావము గలవియైనను ఒకటి నొకటి ఆకర్షించు కొనుటయు స్పష్టముగం దెలియును.

మనము నివసించియుండు ఈ భూగోళము ఒక గొప్ప అయస్కాంతము. దీనికి ఉత్తర దక్షిణ ధ్రువములు గలవనియు చదువరు లెరుంగుదురు. ఇట్లు భూమి యొక గొప్పకాంతమగుటచేతనే, దానిచే ప్రేరేపింపఁబడిన కాంతములన్నియు ఉత్తరదక్షిణ దిక్కులంజూపుట సంభవించును. ఈ సంగతి యీ క్రింది వివరణమువలన తేటఁబడఁగలదు.

భూమిగూడ ఒక అయస్కాంతమే!

చిన్నసూదివంటి ఒక అయస్కాంతమును పెద్ద అయస్కాంతము మీద మధ్యపంక్తిన



౧౬వ పటము

వ్రేలాడునట్లుఉంచుడు. ౧౬వపటమునుచూడుఁడు. అప్పుడు దాని ఉత్తర దక్షిణ ధ్రువములు పెద్ద పెద్ద కాంతము యొక్క దక్షిణోత్తర ధ్రువముల వైపునుండును. అనగ పెద్ద కాంతము యొక్క దక్షిణ ధ్రువము చిన్న కాంతము యొక్క ఉత్తర ధ్రువమును, పెద్దకాంతము యొక్క ఉత్తర ధ్రువము చిన్న కాంతము యొక్క దక్షిణ ధ్రువము నాకర్షించునని యర్థము. ఇందలి పెద్దకాంతమునెటు ద్రిప్పినను చిన్నకాంతమటుదిరుగును. చిన్న కాంతము నెటు ద్రిప్పినను అదితన పూర్వస్థితి కేవచ్చును. కావున చిన్న కాంతము యొక్క స్థానము క్రింద నున్న పెద్దకాంతముయొక్కస్థానము ననుసరించి యుండునని మనమునిశ్చయింపవచ్చును. కావున మన అయస్కాంతములన్నియు ఎల్లప్పుడును ఉత్తరదక్షిణములనే చూపుచుండుటకు దాని క్రింద పెద్ద అయస్కాంతమొక్కటి యుండవలయును. అది యేదియన భూగోళము.

భూగోళసంబంధమైన దక్షిణోత్తరధ్రువములకును, అయస్కాంతసంబంధమైన భూమిమీది దక్షిణోత్తరధ్రువములకును కొంత భేదము గలదు. కాంతీయోత్తరధ్రువము (Magnetic-Northpole) ఉత్తర అమెరికా కుత్తరమున భూగోళోత్తరధ్రువమునకు ౨౦° అంశముల దూరమున నున్నది. ఇయ్యది కెనడాదేశమునకు ఉత్తరమున, ౯౭° పశ్చిమ రేఖాంశము ౭౦°౩ ఉత్తర అక్షాంశము మీద నున్నది. కాంతీయదక్షిణ ధ్రువము ఆస్ట్రేలియాకు దక్షిణమున భూగోళదక్షిణధ్రువమునకు ౨౫° అంశములమీద, ౭౩° దక్షిణ అక్షాంశము, ౧౫౦° తూర్పు రేఖాంశము కలియుచోట నున్నయది. ఈ రెంటికిని మధ్యప్రదేశమున కాంతీయ భూమధ్యరేఖ (Magnetic Equator) ఉండును. ఇది భూగోళమధ్య రేఖకు కొంత ఉత్తరముననను, కొంత దక్షిణముననను ఉండును.

భూమియొక్క కాంతీయోత్తర ధ్రువము అయస్కాంతములయొక్క ఉత్తరధ్రువములను ఆకర్షించును. అట్లే దక్షిణధ్రువముల గుఱించియు నెఱుంగునది. కాని కాంతము యొక్క సమానధ్రువములకు వైరంబును, భిన్నధ్రువంబులకు స్నేహంబును కలదని మన మెఱుంగుదుము. గనుక అయస్కాంతముల

ఉత్తరధ్రువమును, భూమియొక్క ఉత్తరధ్రువమును భిన్నజాతీయధ్రువములనియు, అట్లే అయస్కాంతములయొక్క దక్షిణ ధ్రువమును భూమియొక్క దక్షిణధ్రువమును భిన్నజాతీయ ధ్రువములని స్పష్టపడఁగలదు. అందుచేతనే ఫ్రెంచిభాషయందలి శాస్త్రగ్రంథములలో కాంతముయొక్క ఉత్తరముచూపుధ్రువమును దక్షిణధ్రువమనియు, దక్షిణముం జూపుదానిని ఉత్తరధ్రువమనియు వ్యవహరింతురు. కాని అట్టి విపరీతనామములవలన వ్యవహారమున చిక్కు గలుగునని ఇంగ్లీషుశాస్త్రవేత్తలు ఉత్తరముజూపుదాని ఉత్తరధ్రువమనియు,దక్షిణముఁజూపుదానిని దక్షిణధ్రువమనియు అందురు. దాని ననుసరించియే మేము నామకరణము చేసితిమి. ఈ పరిభాషలో ఉత్తర ధ్రువమనగ ఉత్తరదిక్కుం జూపునట్టి ధ్రువమని యర్థమేగాని భూమియొక్క యుత్తర ధ్రువముతో సమానజాతిధ్రువమని కాదు. ఈ సంగతి చదువరులు మరువగూడదు.

సూదివంటి అయస్కాంతమును దీసికొని సరిగ మధ్యభాగమున త్రాడుగట్టిగాని, మఱి యన్యవిధమునగాని వ్రేలాడునట్టు జేసినయెడల అది సమానముగ వ్రేలాడక మనదేశమునందు ఉత్తరముంజూపు సగభాగము కొంచెము క్రిందికిం వంగియు, దక్షిణముంజూపు సగభాగము కొంచెము మీదికి లేచియు వ్రేలాడుచుండును. అయస్కాంతముయొక్క యీ వంపునకు కాంతవక్రిత (Magnetic Dip) అనిపేరు. ఈ వక్రిత భూమిమీఁది వేఱువేఱు స్థలములలో వేఱువేఱు విధముగ ఉండును. భూమి మధ్యరేఖా ప్రదేశమునొద్ద అయస్కాంతముయొక్క రెండుధ్రువములును సమానముగ వ్రేలాడును. అచ్చటినుండి ఉత్తర ధ్రువమునకుపోయిన కొలదిని అయస్కాంతముయొక్క ఉత్తరధ్రువము ఎక్కువ యెక్కువగ భూమి వైపుకు వంగుచు ఉత్తరాయస్కాంత ధ్రువమునొద్ద ౯౦° అంశములు వంగును. అనగ



౧౭వ పటము

సూదియంతయు నిలువుగ నిలుచుండును;దాని ఉత్తర ధ్రువముక్రిందిగా ఉండును. కాంతము అడ్డముగ వ్రేలాడుటకు బదులు నిలువుగ నిలువబడును. ఇట్లే భూమధ్యరేఖనుండి దక్షిణాయస్కాంత ధ్రువము వరకు వెళ్ళిన కొలదిని అయస్కాంతము యొక్క దక్షిణధ్రువము ఎక్కువ యెక్కువగ వంగుచు ధ్రువము నొద్ద అయస్కాంతము దక్షిణధ్రువముక్రింద నుం

డునటుల నిలువబడును. భూమిమీద నేయే భాగములందు కాంతవక్రిత యెంతంతయుం డునో ౧౮వ పటమువలన తెలియ గలదు.




౧౮వ పటము

కాంత వక్రితను కొల్చుటకొక యంత్రము నిర్మింపఁ బడినది. ౧౭వ పటముచూడుడు.

ఒకానొక స్థలమందలి సమరేఖకును, కాంతమునకును మధ్యనేర్పడిన కోణమునకే వక్రిత (వంపు)అనిపేరు.వక్రితనుకొల్చునట్టి ఈయంత్రమునకు వక్రితసూదియనిపేరు.నిలువుకొయ్యల మధ్యసూది స్వేచ్ఛగ తిరుగుచుండును. చుట్టు చక్రమువలన సూదియొక్క వక్రిత కోణము ఇన్ని అంశములు గలదియని తెలియును. ఈ వక్రిత కన్యాకుమారి యొద్ద ౪౦ అంశములు చెన్నపట్నము నొద్ద ౮౦ అం, బొంబాయిలో ౨౦ అం, కలకత్తాయొద్ద ౩౦ అంశములు లండనులో ౬౭° ౧′ అం. ఉండును.

అయస్కాంతమును వ్రేలాడగట్టిన నొక ధ్రువము ఉత్తరమును, మఱియొక ధ్రువము దక్షిణమును చూపు నని చెప్పియుంటిమి. కాని స్థలములనుబట్టి కాంతధ్రువములు సూటిగ నుత్తర దక్షిణములను జూపక కొంచెము కొంచెము పశ్చిమమునకో తూర్పునకో వంగియుండును. అందుచే అయస్కాంతధ్రువముల కలుపు రేఖకును, దక్షిణోత్తరముల గలుపు దిగ్రేఖకును ౧౯వ పటమునందుఁ జూపినట్లు కోణమేర్పడుచున్నది: ఇదియే నిజమైన ఉత్తరదిక్కునకును, అయస్కాంతము జూపు ఉత్తరదిక్కునకుగల భేదము. దీనినేకాంతచ్యుతి(Magnetic Declination) అందురు. ఈ కోణము వేఱువేఱు స్థలములయందు వేఱువేఱు విధములుగ నుండును.

కాంతచ్యుతి.




౧౯వ పటము.

లండనునుండి కలకత్తాకొక స్టీమరు బయలుదేరి వచ్చుచున్న దనుకొనుఁడు. దానిలోని నావికుఁడు లండనులోని దిక్సూచిలోని కాంతపుసూది ౧౮° పడమరగా ఉన్నట్లు చూచును. స్పెయిను తీరమునకు వచ్చునప్పటికి ౨౦° వరకు పెరిగి, మధ్యధరాసముద్రము ప్రవేశించినప్పటి నుండియు తగ్గుచుండును. మాల్టావద్ద ౧౦°ను, సూయస్ కాలువవద్ద ౫°ను ఎఱ్ఱసముద్రము దాటువఱకు ౫°ను, ఉండును. హిందూమహా

సముద్రములో సగముదూరము జొరబడునప్పటికి సూదియొక్క వక్రగతి (Declination) సున్నయగును. అనఁగా సూది ఉత్తరదక్షిణముల దిక్కున వంపులేకుండ సూటిగఁ జూపును. బంగాళామహాఖాతము దరియునప్పుడా సూది తూర్పుదిరిగి, కలకత్తాలో 3° వక్రగతిని జూపును. ఇట్టి భేదగతులను వివరముగఁ దెలిపెడిపటము లనేకము లా నావికునియొద్ద నుండును. అతఁ డా పటముల నతిసూక్ష్మ




౨౦వ పటము

బుద్ధితోఁ జూచుచు స్టీమరును నడుపుచుండును. ఒకటి రెండంశములు తప్పఁ జూచిన యెడలఁ జీకటి రాత్రులలో నాతని స్టీమ రెచ్చటనైనను గట్టుతట్టును.

సముద్రముమీద ప్రవాసముచేయు వారికి ఉత్తరదక్షిణాది దిక్కులను ఎల్లప్పుడును గనుఁ గొనుట యత్యంతావశ్యకము. కావున నావికులు

నావికులదిక్సూచి

అయస్కాంతముతో నొక యంత్రమును నిర్మించుకొని దాని సాహాయ్యమున అమావాస్యనాడును తాము పోవలసిన దిక్కులను చక్కఁగ నెఱింగి ఓడల నడుపుదురు. కావున నీయంత్రమును నావికుల దిక్సూచియందురు. ౨౧వ పటము చూడుఁడు. అందు అయస్కాంతపుసూది యుండును. దానికి నంటుకొని




౨౧వ పటము

అది తిరుగునప్పుడెల్ల దానితో తిరుగుచుండునట్టి యొక గుండ్రపు అట్ట దానిక్రిందిభాగమున అంటుకొనియుండును. ఆ యట్టమీద ఉత్తరము, దక్షిణము, తూర్పు, పడమర అను దిశలును, ఈశాన్య, ఆగ్నేయ, నైరుత్య, వాయవ్యమూలలును, ఆ మూలలకు, దిక్కులకు నడుమనుండు చిన్నమూలలును, ఈ ప్రకారముగ అతిసూక్ష్మదిగ్విభాగము చేయఁబడి వాని గుర్తులు అక్షరములతో వ్రాయఁబడియుండును. వీనియందలి ఉత్తరమును చూపునట్టి 'ఉ' అను గుర్తు అయస్కాంతపు సూదియొక్క ఉత్తరధ్రువమునకు సరిగ పైనుండునట్లు అంటిం

పఁబడి యుండును. ఈ అట్టయు, అయస్కాం
తమును ఒక పెట్టెయం దిమిడియుండును. ఆ
పెట్టె నిలువుటాధారముమీద నేదిక్కున
కైనను అడ్డముగ తిరుగుటకు వీలుగ నమర్పఁ
బడి యుండును. ఈ పెట్టెమీద అద్దపుమూత
యుండును. పెట్టెలోపల ఓడపోవుచున్న సరిగా
నున్న నల్లగీటొకటి యుండును. ఓడ యే
దిక్కునకు పోవలయునో అట్టపైగల ఆ దిక్కు
గురుతు ఈనల్లనిగీటుపైకి వచ్చునట్లు చుక్కా
నిపట్టుదురు. ఆ సూదియొక్క దిక్చ్యుతినిబట్టి
నావికులు తాము ఏప్రదేశమునం దున్నదియు
అర్ధరాత్రికూడ తెలిసికొనెదరు.

భూమిమీద సర్వేచేయువారి యుపయో
గము నిమిత్తమై ఒక దిక్సూచియంత్ర ముం
డును. దానిని ఇంగ్లీషులో ప్రిస్మేటిక్ కం
పాస్ అందురు. ఇందు కాంతపుసూది కదులు
నట్లును, గుర్తులుగల క్రిందియట్ట కదలకుండు
నట్లును ఏర్పరచఁబడును. భూమిని కొల్చు
వారు దీని సాహాయ్యమున దిగ్నిశ్చయమును
చేయుదురు. ౨౧వ పటము చూఁడు.

[కా. వీ.

౧ (ఆయుర్వేదము ననుసరించి.) ఇనుము ముం
డము (ఇనుము) తీక్ష్ణము (ఉక్కు) కాంతము
(సూదంటురాయి) అని మూఁడువిధములు. అందు

భేదములు

కాంతమునకు అయస్కాంతమను నామాం
తరము గూడ గలదు. తిరుగ నీ అయ
స్కాంతము భ్రామకము, చుంబకము, కర్ష
కము, ద్రావకము, రోమకాంతము అను
భేదములు గలదిగ పరిగణింపఁబడు చున్నది.
తిరిగి వీనిలో నొక్కొక్కటియు ఏక ము
ఖము ద్విముఖము, త్రిముఖము చతుర్ముఖ
ము, పంచముఖము సర్వతోముఖము అను
పేర్లతో వ్యవహరింప బడుచున్నది. ఏకముఖ
మన సూదంటు రాయియొక్క ఏకముఖము
నందే సూదులు ఆకర్షింపబడును. ద్విముఖమన
రెండు కోణములయందు మాత్రము సూదులు
ఆకర్షింపబడును. ఇటులనే త్రిముఖము చతు
ర్ముఖముల యందుగూడ సూదులు ఆకర్షింప
బడును. సర్వతోముఖమను రాయియొక్క
అన్ని కోణములయందును, పైభాగమున
క్రింది భాగమునగూడ సూదులు ఆకర్షింప
బడును. ఇందు ఏకద్వి త్రిచతుష్పంచసర్వతో
ముఖములతో క్రమేణానొకదానికంటె నొకటి
గుణాధిక్యముగలదై యుండును. కాంతము పీత
కృష్ణరక్తవర్ణములచే త్రివిధము. పీతము స్పర్శ
వేధి క్రియ యందు, కృష్ణ రసాయన ప్రక్రి
యలయందు, రక్తము రసబంధన క్రియలయం
దు ప్రశస్తములు. (రసరత్నసముచ్చయము.)

శోధనా విధానము లనేకమున్నను సర్వ
సామాన్యముగ నిమ్మపండ్లరసము, కలి, పులి
చల్ల అనువానిలో ప్రతి

శోధన.

దానియందు నేడేసిమార్లు
వేసి నేడేసి గడియలెండ నెండించిన శుద్ధియగు.
(బసవరాజీయము). కుందేటిరక్తముతో తడపి
ఏడుపర్యాయములు ఎండనెండించినను శుద్ధి
యగును. (ర.ర. సుధా.)

కాంతలోహచూర్ణమునకు సమముగ బెల్లమును గంధకమును కలిపి ఖల్వమున మర్దించి ఇరువది పుటంబులిడిన భస్మమగును. ఈ భస్మమును తెల్లగలిజేరుఆకు రసముతో నూరి పదిపుటంబులిడిన నెఱ్ఱగసిందూరించును. (ర. ప్ర. సుధా)

మారణవిధానము.

ఇటుల శోధన మారణ విధానము లనేకములు అనేక గ్రంథములయందు వేర్వేరుగ గన్పట్టుచున్నవి. ఇచట నొకటి రెండు మాత్రము వివరించితిని

కాంత సిందూరము.

ఇది శీతవీర్యముగలది. ప్రధానరసము మధురము. అనురసము కషాయము. ఆయుష్కరము, ధాతువివర్ధనము, త్రిదోషహరము. ఇట్టిగుణములుగలదై వ్రణ మేహకుష్ట ప్లీహ ఉదరక్రిమి రోగములను నాశనముచేయునదిగ నున్నది. మరియు పాండువును బోనడచును. క్షయరోగమును నశింప జేయును. కాస, భ్రమ, గుల్మ, శూల మొదలగురోగములను బోకడచి శరీరమునకు కాంతి నిచ్చును. (యోగరత్నాకరము)

గుణములు.

కాంత భస్మమును త్రిఫలములతో సేవించిన వలీపలితములు, త్రికటుకములు గంటుభారంగి వీనితో సేవించిన ధాతుక్షయము, శర్కరబాతుజాతకము వీనితో సేవించిన రక్తపిత్తము, గలిజేరు ఆవుపాలు వీనితో సేవించిన దౌర్బల్యము, కేవలము గలిజేరు రసముతో సేవించిన పాండువు, పసపు పిప్పలి తేనె వీనితో సేవించిన ౨౦ మేహములు, శిలాజతుతో సేవించిన మూత్రకృచ్ఛ్రము, అడ్డసరము పిప్పళ్లు ద్రాక్ష తేనె వీనితో లోహచూర్ణమును కలిపి మాత్రలుచేసి ఉదయమున సేవించిన అయిదు విధములగు కాసరోగములు, తాంబూలముతో సేవించిన అగ్ని మాంద్యము శాంతించును.

అనుపానములు.

(యోగరత్నాకరము)

ఆయుర్వేదమునందు కాంతముగలిసిన ఔషధములు సుప్రసిద్ధములు. వానిలోబసపరాజీయమునఁ జెప్పబడిన కాంతవల్లభరసము, రసేంద్రసారసంగ్రహమందలి కాలాగ్ని రుద్రరసము, చరక సంహితలోని లోహరసాయనము, నవాయసచూర్ణము, అష్టాంగ హృదయమందలి యసృతి, ముఖ్యముగ చూడనగును.

కాంతముకలిసిన యౌషధము

[గం. దూ.

**అయస్థూణుఁడు.** శాలువాయనుఁడు అధ్వర్యుఁడుగాఁగల గృహపతి. ఈతఁడు తన యధ్వర్యునకుఁ గొన్ని యజ్ఞపాత్రల ఎట్లెట్లుపయోగింపవలసినది నేర్పెను. (శతపథ బ్రాహ్మణము ౧౧-౪, ౨, ౧౭).

**అయస్యాంగిరసుఁడు.** ఋగ్వేదమునం దితని పేరు రెండుసారులు వచ్చినది. (౧౦. ౬౭, ౧; ౧౦౮, ౮). ఋగ్వేదమందలి కొన్ని ఋక్కులను ఈతఁడు రచియించినట్లు

అనుక్రమణిలోఁ జెప్పఁబడి యున్నది. ఈతడు రచించిన మంత్రములు ఋగ్వే. ౯. ౪౪-౪౬; ౧౦. ౬౭; ౬౮.

శునశ్శేపునిఁ జంపఁదలఁచిన రాజసూయ మునందు నితఁడు ఉద్గాతగా నుండెను. ఇతఁడు యజ్ఞయాగాది క్రతువిధానమును చక్కఁగ నెఱిఁగినవాఁడు (పంచవింశ. బ్రాహ్మ ణము. ౧౪. 3, ౨౨; ౧౬. ౧౨, ౪; బృహ దారణ్యకోపనిషత్ ౧. 3, ౮. ౧౯. ౨౪, కాశీతక బ్రాహ్మణము 30.౬.) ఇతఁడాభూతి త్వష్ట్రియొక్క శిష్యుఁడు.

(బృహ. ఉ. ౨౯,౬,3. ౪.౬,3;)

## అయాస్యుఁడు.

అంగిరసగోత్రో త్పన్నుఁడైన యొకఋషి. ఈయన వంశజు లను ఆయాస్యులందురు. ఇతఁడు హరిశ్చం ద్రుని యజ్ఞమునందు ఉద్గాతగానుండెను.

(భార. సభా. అ ౧౨)

## అయితేపల్లి.

చిత్తూరుజిల్లా చంద్ర గిరి తాలూకాలో నిదియొక పల్లె. జనసంఖ్య ౧౪౯౭. ఇనుము సున్నపురాయి యిచ్చట దొ రుకును. ఆ ఇనుముతో నాగళ్లు చేయుదురు.

## అయినపలి.

గోదావరిజిల్లా అమలా పురముతాలూకాలో ఒక పల్లె. జనసంఖ్య 33౬3. ఇచ్చటనుప్రసిద్ధమయిన సిద్ధివినాయక దేవాలయ మొకటికలదు. బులుసుఅచ్చయ్య పాపయ్య శాస్త్రులనఁ బరగినప్రఖ్యాత సం స్కృత విద్వాంసుల కిది జన్మస్థలము. క్షణము క్తేశ్వరమను క్షేత్రమొకటి దీనికి మజరా.

## అయుఁడు.

రెండవ స్వారోచిష మన్వంతరమునందలి ప్రజాపతి. వసిష్ఠుని పుత్రుఁడు. (చూఁడు. ౧. వసిష్ఠుఁడు.)

## అయుతజిత్తు.

యాదవుఁడు. క్రో ష్టాజ్యామఘుక్రథ వంశీయుఁడైన సాత్వతరాజు యొక్క మనుమఁడు. భజమంతునకు బాహ్యా కయను రెండవ భార్యయందుఁ బుట్టిన ముగ్గురు కుమారులలో నొక్కఁడు.

## అయుతాయువు.

౧. (సూ. వం.) ఇక్ష్వాకుకులోత్పన్నుఁడైన సింధుద్వీపుని కొ డుకు. ఋతుపర్ణుఁ డితని కుమారుఁడు.

౨. (చం. వం.) ఉపరిచరవసురాజుయొక్క వంశజుఁడగు శ్రుతశ్రవరాజుయొక్క పుత్రుఁడు. ఇతని కొడుకు నిరమిత్రుఁడు.

## అయుతుఁడు.

(చం. వం) పురు కులోత్పన్నుఁడైన అజమీఢుని శాఖలోనివాఁ డగు జహ్నువు రాజుయొక్క సంతతివాఁడైన రాధికరాజు పుత్రుఁడు. ఇతనికి అయుతాయు వనియు నామాంతరము గలదు.

## అయోషా.

అబూబక్రియొక్క కుమా రిత; మహామమ్మదు యొక్క మూఁడవ భార్య. ఏడుసంవత్సరముల ప్రాయముగలదిగ నున్న ప్పుడే ఈమెను మహామమ్మదు భార్యగగై కొ నెను. ఈమె తండ్రికి ఈమెను మహామ్మదునకు

పెండ్లిచేయుటకు ఇష్టములేదు. అయినను మహాహ్మదు దైవాజ్ఞ ఈమెను వివాహ మాడ వలసిన దనియున్నదన్నందున నొప్పుకొని పెండ్లి చేసెను. ఈమెకు మహాహ్మదు వలన సంతాన ప్రాప్తి కలిగి యుండలేదు. భర్తమరణానంతర ము ఆలీ అతని పీఠమును అధిష్టించుటకునొప్పు కొనక అతనితో అనేక ఘోరయుద్ధములు జేసెను. మిక్కిలి కోపశీల మైనప్పటికిఆమెను అందరు మిక్కలి గుణశాలినిగనుక గౌరవించు చుండిరి. ఆలీయీామెను గెలిచి ఖయిదిగ (క్రీ.శ. ౬౫౬) పట్టుకొనినను అపాయము కలి గింపక విడుదలచేసెను.

ఈమెను మహాహ్మదీయులు తల్లియనియు దేవదూతయనియు భావించెదరు. క్రీ. శ. ౬౭౮వ సంవత్సరమున ౬౭ ఏండ్లప్రాయమున మదీనాపట్టణమున మరణించెను.

**అయోడిను.** ఇది ప్రథమమున సముద్రమునందుండు నాచి మొదలగు పదార్థ ములనుండి తీసిన ఒక ఉపధాతువు. మూల పదార్థము. టించరు అయొడిను అను పేరుతో ఆంగ్లేయ వైద్యులు ఉపయోగించు మందులో అయొడినుయును సారాయియును చేరియున్నవి. పుండ్లకును, వాపులను తగ్గించుటకును చాల మంచిది. సూక్ష్మజీవులను చంపుశక్తి గలది.

పొటాసియము అయొడైడు అను మరి యొక మందులో నీ అయొడిను ముఖ్యముగ చేరియున్నది. కొరుకు సవాయి వ్యాధి యొక్క మూడవ అవస్థలోని సమస్తబాధలను తొలగించుటకును పొటాసియము అయొడైడు మిక్కిలి ఉపయోగకరము. ఆంగ్లేయవై ద్యులు ఇంకననేక వ్యాధులలో ఈ పొటాసి యము అయొడైడును ఉపయోగింతురుగాని ఎంతవరకు గుణమో నిశ్చయముగచెప్ప వీలు లేదు. పచ్చశెగచే వచ్చిన కీళ్లనొప్పులలో పొటాసియము అయొడైడు గుణకారి. మో తాదు ౫ మొ॥ ౨౦ గ్రెయినులు. మంచినీళ్ల లో కలిపి యియ్యవలెను.

**అయోధ్యానాథ్.** (౧౮౪౦ - ౧౮౯౨) ఈతఁడు పండితబిరుదాంకుఁడు దేశ భక్తుఁడు. కాంగ్రెసునకు జాయింటు జనరల్ సెక్రటరీగా నుండెను. కాశ్మీరబ్రాహ్మణుఁడు. ఆగ్రాలోఁ జన్మించెను. అచ్చటనే పారసీ అర బ్బీల నభ్యసించి యింగ్లీషు చదువుకొని హై కోర్టువకీలయ్యెను. అలహాబాదునకువచ్చి ప్లీడరు పనిలో మిక్కిలి ద్రవ్యమును సంపాదించెను. హైందవులయోగక్షేమమును అరయుటకై ఇండిన్ హెరాల్డ్ అను దైనిక పత్రికను పెట్టించెను. తరువాత ఇండియన్ యూనియన్ పత్రికకు ముఖ్యాధారముగ నుండెను. వాయవ్య ప్రాంతమండలి (N.W. Provinces) హైందవు లకు నాయకుఁడుగ నుండెను. ప్రభుత్వమువారు ఈతని వాయవ్యప్రాంతమండలి చట్టనిర్మాణసభ లో సభాసదునిగఁ జేసిరి. ౧౮౮౮వ సంవత్సర మునందు అలహాబాదులో కాంగ్రెసు జరిగినప్పు

డితఁడు స్వాగతసంఘమునకు నధ్యక్షుఁడుగ నుండెను. ఎచ్చటమాటలాడినను నిర్భయముగ మాటలాడు చుండెను. ఒకప్పుడు „దేశీయ సభకు ధనము చేరదేని నేను ఏఁబదివేల రూపా యిలిచ్చి సభనిర్వహించెదను" అని చెప్పెను. ౧౮౯౭లో కీర్తి శేషుఁడయ్యెను.

**అయోధ్యాపట్టణము.** యునైటెడ్ ప్రావింసెస్ యందలి ఫైజాబాద్ జిల్లాలోని యొకపట్టణము. ఇది గోగ్రాయనునామాంతరముగల సరయూనదీ తీరమందున్నది. ఇచ్చటికి ఔధ్ రోహిల్ ఖండ్ రయిల్వేయొక్క యొక శాఖ పోవును. జనసంఖ్య ౨౧౫౮౪.

ఈయది హిందూదేశమందలి మహాక్షేత్రములలో నొక్కటి. సూర్యవంశపు రాజులకు రాజధాని. వాల్మీకి రామాయణమును బట్టి చూడగా నియ్యది మనువుచే నిర్మింపఁబడెననియు, దశరథుని కాలమున ౧౨ యోజనములు పొడువును, ౧౦ యోజనములు వెడల్పును ఉండెననియు, పంక్తులు తీరినట్లు పట్టణమున వీధులుండెననియు, వానిపై నీళ్లుచల్లుచుండిరనియు, నానాదేశములనుండి పెక్కు వర్తకులక్కడికి వచ్చుచుండిరనియుఁ దెలియుచున్నది. (బాలకాం. ౫స.) ఇది ఉత్తరకోసలదేశమునకు రాజధాని. అప్పటి కాలమున కోసలదేశములు రెండుండినట్లు కానవచ్చుచున్నది. శ్రీరాముఁడు నిజధామమునకు వెళ్లునప్పు డీనగరమందలి జనుల నందఱను తన వెంటఁ దీసికొని వెళ్లినందున నిది పాడుపడెనఁట.

తరువాత సూర్యవంశజుఁడైన ఋషభరాజు మరల నీపట్టణమును జర్ణోద్ధారమఁ జేసెను. నలునికాలమున నిచ్చోట ఋతుపర్ణుఁడను రాజు రాజ్యమేలుచుండెను. (మహాభా. వన.) పాండవులకాలమున నిచ్చట మహాబలుఁడైన దీర్ఘయజ్ఞుఁడను రాజు రాజ్యమేలుచుండెను.

బౌద్ధయుగమునందుఁగూడ నీ పట్టణము వాసికనియే యుండెను. అప్పుడు దీనియొక్క సాకేతము అనునామము విశేషముగ వాడుకలో నుండెను. మన హిందూమతగ్రంథములలో అయోధ్య సాకేత నామములు పర్యాయపదములుగ వాడినను, బౌద్ధ గ్రంథములలో రెండును వేఱువేఱుగఁ జెప్పఁబడి నందున నవి మొదట ఒక దానికి నొకటి తగిలియున్న పెద్ద పట్టణములై యుండనోపుననియుఁ గ్రమముగ నొక్క పట్టణముగఁ గలిసి పోయియుండవచ్చుననియు నూహింపఁబడుచున్నది. బుద్ధుఁడు సాకేతపట్టణమునందు ౧౬ సంవత్సరములుండి తన మతమును బోధించెను. జైనులమహాఋషులైన తీర్థంకరులలో మొదటి వాఁడైన ఆదినాథుఁడును, రెండవ వాఁడైన అజితనాథుఁడును, నాల్గవవాఁడైన అభినందన నాథుఁడును, ఆఱవవాఁడైన సుమంతనాథుఁడును ఈపట్టణమునందు జన్మించిరి. అందుచే నీ పట్టణము హిందువులకు వలెనె జైనునకుఁగూడ పుణ్యక్షేత్రము.

బౌద్ధకాలానంతరము కొంతకాలము వఱకు మరల నీ పట్టణము పాడుపడినట్లు కానవచ్చుచున్నది. తరువాత విక్రమాజితుఁడనువాఁడు మఱల దానిని గట్టించెనఁట. అతఁడచ్చట నాగేశ్వరుఁడను శివమందిరమును కట్టించుటయేగాక మొత్తముమీఁద 3౬౦ మందిరములను నిర్మించెనఁట. కాని యితఁ డేకాలమువాఁడో, యేవంశమువాఁడో తెలియరాకున్నయది. ౪వ శతాబ్దమునందు గుప్తరాజులు కొంతకాలము వఱకు దీనిని తమరాజధానిగఁ జేసికొన్నట్లు గానవచ్చుచున్నది. సముద్రగుప్తుఁడును (క్రీ. శ. 300 - 328) అతని కుమారుఁడును ఈపట్టణమందే రాజ్యమేలినట్లు మనమూహింపవచ్చును.* ౮వ శతాబ్దమునందు ఖారూ అను అసభ్య జాతులవాండ్రు హిమాలయపర్వత ప్రాంతమునుండి వచ్చి అయోధ్యాప్రాంతము నాక్రమించుకొనిరఁట. వీరిని గుఱించియుఁ గూడ నిశ్చయమైన చరిత్ర తెలియదు. వీరు నూఱుసంవత్సరములు రాజ్యముచేసినతర్వాత వాయవ్య దిక్కునుండి సోమవంశపురాజులు వచ్చిరాజ్యమునాక్రమించుకొనిరి. ఇది పిదప కనోజ్ రాజుల స్వాధీనమయ్యెను. వీరు జైన మతమువారు. వీరి తరువాత జయచందుని శాసన మొకటి కాన్పించెను. "భడ" అను అసభ్యజాతివారు గూడ నిచ్చటగొన్నిసంవత్సరములురాజ్యము జేసిరఁట. వీరును జైనులు. కాని వీనికన్నిటికిని దంతకథలుతప్ప చరిత్రాధారములులేవు. క్రీ. శ. ౧౧౯౪ లో షహాబుద్దీన్‌గోరీ కనోజ్ పట్టణమును గెల్చిన తరువాత నయోధ్యాపట్టణమును కొల్లగొట్టుకొని పోయెను. తరువాత తురకల ప్రభుత్వమును, తదుపరి ఇంగ్లీషువారి ప్రభుత్వమును (౧౮౫౬) వచ్చెను. ఆచరిత్ర వివరము "ఔధ్" అను శబ్దముక్రింద సవిస్తరముగ వ్రాయఁబడును.

అయోధ్యాపట్టణమును, దానికి ౪ మైళ్ల దూరమునందున్న ఫైజాబాద్ పట్టణమును గలిసియొక మ్యునిసిపాలిటీగానేర్పఱుపఁబడినది. ఇప్పటి అయోధ్యయు, దానిచుట్టు పట్టునున్న జీర్ణమందిరాదుల స్థలమును కొల్చిచూడ పశ్చిమమున గుప్తారు ఘాటు మొదలుకొని తూర్పున రామఘాటు వఱకు ౬ మైళ్లు పొడవుండును. ఇచ్చట ౯౬ హిందూదేవాలయములును, 3౬ మసీదులును, ౬ జైన మందిరములును, ౭ వైష్ణవ మఠములును కలవు. హిందూదేవాలయములలో ౬3 వైష్ణవమందిరములు, 33 శైవమందిరములు. ఈ గ్రామమునందెచ్చట జూచినను, శ్రీరాముని చరిత్ర సంబంధమైన వేలువేలు ప్రసంగములం జూపు మందిరములు పెక్కు. ఇచ్చటి మందిరములలో రామ్‌కోట్ అనునది యెక్కువ పూజ్యముగ నెంచఁబడును. అది రాముని జన్మస్థలమని చెప్పెదరు. అదియుంగాక రాముఁడచ్చట పెద్దకోట కట్టించి దానికి ౨౦ బురుజులేర్పఱిచి ఒకదానిమీఁద హనుమంతుని మఱియొకదానిమీఁద సుగ్రీవుని, వేఱొకదానిమీఁద

* Smith's Early History of India.

జాంబవంతుని ఇట్లు వేలువేలు సైన్యాధి పతుల వాని మీదనుంచెనంట. ఈమందిరమునకు తగిలి ఒక పెద్దమసీదు గలదు. ఈయది క్రీ.శ.౧౫౨౦ లో బాబరుచక్రవర్తిచే నప్పుడక్కడనున్న గుళ్లుపడగొట్టింపఁబడి కట్టింపఁబడెను. అప్పటి నుండియు నిందలి కొంతస్థలము తమ దేవాలయ స్థలమేయని హిందువులును, తమ మసీదులోని స్థలమేయని మహమ్మదీయులును ఎడ తెగక పోరాడు చుండిరి. కాని యీమధ్యప్రభుత్వము వారు మసీదునకును, మందిరమునకును హద్దు లేర్పఱిచి నడుమ కంచెవేసిరి. అచ్చటి ముఖ్య మందిరములలో స్వర్గద్వార మనునది యొకటి. ఇచ్చటనుండి రాముఁడు స్వర్గమునకు వెళ్లెనంట. దాని యొద్దనే ఔరంగజేబుచేఁ గట్టింపఁబడిన జీర్ణమైనమసీదొకటి కలదు. ఇప్పుడిచ్చట కాన వచ్చు దేవాలయములన్నియు ౧౮వ శతాబ్ద ముననో ౧౯వ శతాబ్దముననో కట్టింపఁబడినవి.

బహుబేగం అనునామెయొక్క గోరీ ఈ పట్టణమునందలి చూడఁ దగిన స్థలములలో నొకటి. వారన్ హేస్టింగ్సు వలన చెఱబెట్ట బడి బాధపడిన యామెయే యీామె. ఈ గోరీ కట్టుటకు నామెసొత్తులో నుండి మూడు లక్షల రూపాయ లింగ్లీషు గౌర్నమెంటు వారి స్వాధీనము చేయఁబడినవి. ఆమె క్రీ. శ. ౧౮౧౬లో మృతినొందెను. అప్పటినుండియు గోరీకట్టుట ప్రారంభింపఁబడి క్రీ. శ. ౧౮౫౯ లో పూర్తి జేయఁబడెను.

ఇచ్చట రామనవమికి గొప్పయుత్సవము జరుగును. అప్పుడు యాత్రికులు అయిదు లక్షలకంటె నెక్కువ వచ్చెదరంట.

**అయోధ్యాప్రాంతము.** ఇప్పుడు దీనిని ఔధ్ లేక అవధ్ అనియెదరు. ఇది అయోధ్యాశబ్దభవము. అయోధ్యాప్రాంత మును గుఱించి ,,ఔధ్'' అను శబ్దము చూడ నగు.

**అయోధ్యాసంస్థానము.** యునైటెడ్ ప్రావింసెస్ (ప్రయాగప్రాంతము) లోని యొక జమీందారి. విస్తీర్ణము ౭౬౨ చ॥ మైళ్లు. ఇది ఫైజాబాద్, గోండా, సుల్తాన్ పూర్, బారాబంకీ, లక్నో అను నయిదు జిల్లాలలో వ్యాపించియున్నది. ఇది తాలూ కుదారీపద్ధతిమీాద అమరకము చేయఁబడిన జమీందారి. గౌర్నమెంటువారికి చెల్లింపవల సిన పేష్కష్ రు. ౫౯౦౦౦౦ లు; జమీాం దారునకు ఆదాయము రు. ౧౧౦౦౦౦౦. వీరు బ్రాహ్మణులు. వీరి మూలపురుషుఁడు భక్తావర్ సింగ్. ఈతఁడు ఔధ్ నవాబైన సాదత్ అలీఖాన్ (క్రీ. శ. ౧౭౯౮-౧౮౧౪) వద్ద సైన్య ములో గుఱ్ఱపురౌతుగా ప్రవేశించి ఈ జమీాం దారి సంపాదించెను. క్రీ. శ. ౧౮౫౯ లో బక్తావర్ సింగ్ చనిపోయినందున నతని తమ్ముని కుమారుఁడైన మాన్ సింగ్ అతని సొత్తునకు వారసుఁడయ్యెను. కాని ఔధ్ ప్రాంతము ఇంగ్లీ

షువారు స్వాధీనము పఱుచుకొన్నతరువాత ఈ తని జమీందారీయంతయు వారు తీసికొనిరి. క్రీ. శ. ౧౮౫౭ లో సిపాయివిప్లవము ప్రారంభ మైనప్పు డీతఁడు పైజాబాదులో ఖైదీగ నుం డెనుకాని అతనిని విడుదలజేసి ఇంగ్లీషువారు తమ భార్యాపుత్రాదులను రక్షింపవలసినదని కోరినందున నీతఁడు యూరోపియన్ స్త్రీలను, బాలురను తనకోటలో నుంచుకొని రక్షించి సురక్షితముగ గోగ్రానది దాటించెను. తరు వాతనతఁడులక్నో పట్టణములోవిప్లవకారులతోఁ జేరెను. కాని మరల నింగ్లీషువారికి సహా యుఁడై యసంఖ్య యూరోపియను స్త్రీపురు షుల ప్రాణములను, రక్షించెను. ఆ ప్రాంత మునందంతటను కల్లోలములు లేకుండ శాంతి గలుగుటకు మిగుల సహాయము జేసెను. అందుచే నింగ్లీషువారు క్రీ. శ. ౧౮౫౯ లో ఈతనికి ఆతని జమీందారి నిచ్చివేయుటయే గాక విప్లవకారులలో జేరిన గోండా రాజు యొక్క సంస్థానముగూడ నిచ్చివేసిరి. మహా రాజాయన్న బిరుదును ఒసంగిరి. తరువాత కె. సి. యస్. ఇ. అను బిరుదును ఈయ్య బడెను: క్రీ. శ. ౧౮౭౦ లో నీతఁడు కాల ధర్మమునొంద మహారాజా సర్ ప్రతాపనారా యణసింగ్, కె. సి. ఐ. ఇ. జమీందారుఁ డయ్యెను. ఆతడు క్రీ. శ. ౧౯౦౭ లో మృతు డయ్యెను.

**అయోబాహువు.** ధృతరాష్ట్రుని నూర్గురు కుమారులలో నొక్కఁడు.

**అయోముఖము.** భరతవర్షమునకు దక్షిణదిక్కుననున్న యొకసామాన్యపర్వతము. (వా. రా. కిష్కింధ)

**అయోముఖి.** దండకారణ్యము నం దుండిన యొక రాక్షసి. సీతను వెదుకుచు రామలక్ష్మణులు క్రౌంచారణ్యమునందు మా తంగాశ్రమమువైపు వెళ్లుచుండగా నిది వచ్చి తనను వివాహమాడుమని లక్ష్మణుని కోరఁగా నతఁడు దాని ముక్కు, చెవులు, స్తనములు కోసి పంపివేసెను.

(వా. రా. అరణ్యా. స. ౬౯)

**అయోముఖుఁడు.** ఒక దాన వుఁడు.

**అయఃపానము.** ఒక నరకము. సురా పానము చేయువారికి నిచ్చట కరఁగబెట్టిన యినుము త్రాగించెదరు.

**అయ్యంకెరె.** (దొడ్డనుకెక్కెరె) మైసూరుదేశమందలి ఒకచక్కని కొలను. బాబాబుడాన్ అను పర్వతమునకు తూర్పు వైపున నున్నది. దీనిచుట్టు కొండలును నడుమ లంకలును కలవు. దీని కట్ట ౧౭౦౦ అడుగుల పొడవును, ౩౦౦ అడుగుల ఎత్తును కలదు. కొల నిలోని జలము ౩౫ అడుగుల లోతుగనుం డును. సక్కరపట్టణపు రాజైన రుక్మాంగదుఁడు అనురాజు దీనిని గట్టించినాఁడని ప్రతీతిగలదు. ౧౩వ శతాబ్దమునందు హొయసల వంశపు రాజు లీ చెఱువుకట్టను బలపఱచిరి.

**అయ్యంపేట.** తంజావూరుజిల్లా తంజావూరుతాలూకాలోని గ్రామము. జనసంఖ్య ౯౪౫౪. నూలుబట్టల పట్టుల నేతవిషయమై యీయూరు ప్రఖ్యాతి. పట్టుబట్టలు, నూలుతో పట్టుతో ఊలుతో నేయఁబడిన తివాచీలు చిరుచాపలు, అద్దకపు చీటీగుడ్డలు ఇచ్చట చేయఁబడును. ఇచ్చట నేయఁబడు 'కుట్టని' అను బట్ట విశేషము పేరుగలిగినది.

**అయ్యగారివీరభద్రకవి.** ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. శైవాచారముకలవాఁడు. సోమనార్యపుత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. రాఘవయాదవపాండవీయ మను మూఁడర్థములుగల కావ్యమును వ్రాసెను.

**అయ్యదీక్షితులు.** తంజావూరు రాజ్యము నేలిన మహారాష్ట్రరాజులలో రెండవవాఁడగు శాహజిరాజేంద్రుని యాస్థానమునం దుండిన యీ ప్రశస్త విద్వాంసుని యసలు పేరు రామభద్రదీక్షితులు. వీరు కుంభఘోణమునకు సమీపమందలి కందరమాణిక్య మను నగ్రహారమునందు చతుర్వేదయజ్వ యను వారి వంశమున, నల్లాదీక్షితుల పౌత్రులును యజ్ఞరామ దీక్షితుల పుత్రులునై బహ్వృచశాఖా ఆశ్వలాయన సూత్రము కౌండిన్యగోత్రమునందు జనించిరి. వీరు అప్పయ్యదీక్షితులవారి భ్రాతృపౌత్రుఁడై శివలీలార్ణవాద్యనేక గ్రంథకర్తయైన నీలకంఠదీక్షితుల వారియొద్దను, తమకు మామగారును కండ్రమాణిక్య గ్రామవాస్తవ్యుఁడును శబ్దకౌముది ధాతురత్నావళీత్యాది గ్రంథకర్తయునగు చొక్కనాథమఖి యనువారియొద్ద శాస్త్రాభ్యాసమును చేసిరి. ఆనందరావుపేష్వా అను నామాంతరముగలిగిన ఆనందరాయమఖి, త్ర్యంబకరాయమఖి యనువారికి సోదరుఁడైన భగవంతరాయలు తాను రచియించిన రాఘవాభ్యుదయములను నాటకము నవతారికయందు వీరిని స్తోత్రము చేసియున్నారు. తంజాపురరాజు శాహభూపాలునిచే క్రీ. ౧౬౯3 అంగీరసనామ సంవత్సరమునందు శాస్త్రవిద్వాంసులకు దానము చేసిన శాహజీరాజపురమను నామాంతరము గలిగిన తిరువిశలూరు (ఇప్పటి తిరువిశనెల్లూరు) నందు వీరికి ౪ వృత్తులు దానముచేసెను. వీరికి నిష్టదైవమగు శ్రీరాములను వీరి గ్రంథములన్నిటియందును స్తోత్రము చేసియున్నారు. వీరు రచియించిన గ్రంథములలో ముఖ్యములు: ౧. పరిభాషావృత్తివ్యాఖ్యా. ౨. షడ్దర్శనీసిద్ధాంతసంగ్రహము. 3. సిద్ధాంతసారము. ౪. జానకీపరిణయ నాటకము. ౫. శృంగారతిలకభాణము. ౬. రామస్తవకర్ణరసాయనము. ౭. చాపస్తవము, ౮. తూణీరస్తవము. ౯. ప్రసాదస్తవము. ౧౦. బాణస్తవము. ౧౧. విశ్వగర్భస్తవము. ౧౨. పర్యాయోక్తినిష్పందము. ౧3. అష్టప్రాసము. ౧౪. పతంజలి చరితము. వీనియందు శృంగారతిలక భాణమునకు 'అయ్యాభాణమ'నియు

నామాంతరముగలదు. దీనికి కవి తన శిష్యుఁడగు రఘునాథుఁడను నాయనయొక్క ప్రేరణమున వ్రాసినట్లు చెప్పుకొని యున్నాఁడు. ఈ భాణమును అమ్మాల్ భాణమను నామాంతరముగల "ఘటికాశతకముఅమ్మాల్" అని వ్యవహరింపఁబడు వరదాచార్యుల వసంతతిలకభాణమునకు బదులుగా వ్రాసినట్లు వాడుకగలదు. పరిభాషావృత్తివ్యాఖ్యానమను వీరి గ్రంథమునందు ఆనందరాయమఖియొక్క యాదార్యమును గొనియాడియున్నారు,

రామభద్రదీక్షితుల శిష్యులలో ప్రధానులు ముగ్గురు. (౧.)స్వరసిద్ధాంతచంద్రికాకర్తయగు శ్రీనివాస దీక్షితుఁడు, (౨.) శాబ్దికవిద్వత్కవి ప్రమోదనిఘంటువును, పతంజలిచరిత్రమునకు లలితవ్యాఖ్యయు వ్రాసిన వేంకటేశ్వర కవి. (౩.) రఘునాథకవియు. ఈకవికి ప్రభువగు శాహరాజేంద్రుఁడు క్రీ.౧౬౮౪ మొదలు౧౭౧౧ వఱకు రాజ్యము చేసెను. కవియొక్క కాలము గూడ నదియే. గ్రం. స.

## అయ్యలరాజు అయ్యలభాస్కరులు.

వీరు జంటకవులు. క్రీ. శ. ౧౭౬౫వ సంవత్సరము గ్రంథరచన చేసినవారు. వీరి పూర్వులలో నొక్కఁడగు తిప్పనార్యుఁడు ఒంటిమిట్ట రఘువీరశతకమును వ్రాసెను. రాయలయాస్థానంబున నుండె. మఱియొకండగు రామభద్రుఁడు రామాభ్యుదయమును వ్రాసె. అయ్యలుఁడు పినయక్కయామాత్యునకును భాస్కరుఁడు నాగయామాత్యునకును బుత్రులు. ఈ జంటకవులు రెట్టమతమను కాలస్వరూపాదుల దెలుపు గ్రంథమును రచించిరి. ఇది కన్నడమున రెట్టయయనుజ్ఞాని వ్రాసినగ్రంథమునకుఁ దెనుఁగు. తెలుంగు రెట్టమతము కర్నూలు జిల్లా మెట్ట పాలెమునకుఁ బాలకుఁడును అహోబలక్షేత్ర ధర్మకర్తయు నయిన వేంకటరాజున కంకితమియ్యఁబడినది. ఇతఁడు విద్యాప్రియుఁ డయినట్టు గన్పట్టుచున్నది. కామందక మనుగ్రంథమునకుఁగూడ నితఁడు కృతిభర్త.

## అయ్యలరాజు నారాయణ కవి.

క్రీ.శ. పందొమ్మిదవశతాబ్దాది నుండినవాఁడును ప్రసిద్ధకవి వంశంబగు నయ్యలరాజు వంశమునకుఁ జేరినవాఁడు. రెట్టమత గ్రంథకర్తలగు అయ్యలరాజు అయ్యలభాస్కరులఁ బేర్కొన్నవాఁడు; సూరనార్యునకును గొండమాంబకును బుత్రుఁడు, కౌండిన్యగోత్రుఁడు, హంసవింశతి కథల నయిదాశ్వాసముల ప్రబంధముగ రచించినవాఁడు. ఇందు కథాపర్యవసానము నీతిదాయకమేమైనను తత్పర్యవసానసాధనములగు నుపకథలెల్లను నీతిబాహ్యములు. కావున గర్హణీయములు. కాని కవిత్వము అపారపటుత్వము గలది. అటనట వర్ణనలు సొంపు నింపునవి, పదసంపద ఈ కవికి మెండు. సాధారణవ్యాపారములకును, కృషులకును సంబంధించిన వ్యవహారపదము లీతని

వలె చేర్చి పట్టికల నొనర్చినకవి మఱియొకఁడు లేఁడు. అన్యదేశ్యపదము లీతఁడు పుష్కలముగ వాడియున్నాఁడు.

## అయ్యలరాజు రామభద్రుఁడు.

పోతనామాత్యుని జన్మభూమి యని పేరుగాంచి కడపమండలమందుండు ఒంటిమెట్ట గ్రామము ఈ కవి పుట్టిన నేల. ఇతఁడు ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. వైష్ణవమతాభిమాని. ఈతని తండ్రి అక్కయార్యుఁడు. గురువు ముక్కిడి వరదాచార్యులు. ఇతఁడు ఒంటిమెట్ట వీరరాఘవస్వామిపై నొక్క శతకమును, సకలకథాసారసంగ్రహమును, రామాభ్యుదయమును రచించెను. ఇందు రెండవదానిని కృష్ణదేవరాయల యంతిమదశలో ఆతని ప్రార్థనపై రచించినట్లు చెప్పుకొనియుండుటవలన నీతఁడు రాయలయాస్థానములోని అష్టదిగ్గజములలో నొక్కఁడుగఁ బరిగణింపఁబడుచున్నాఁడు. గాని నిశ్చయమునకు నీతని జీవనమునందుత్తమభాగము రాయలయనంతరమె గడపఁబడెను. అనగా నితఁడు పదునాఱవ శతాబ్దమధ్యమున నుండినవాఁడు.

ఇతఁడు బహుసంతానవంతుఁడును దరిద్రుండునయి గుత్తియప్పలరాజును, కృష్ణదేవరాయల యల్లుని మేనల్లుఁడగు గొబ్బూరి నరసరాజును ఆశ్రయించి కాలము గడపుకొనెను. దీనినిబట్టి యితఁడు గడువృద్ధగువఱకుఁ బ్రతికియుండె ననవచ్చును. రామరాజభూషణుఁడితనిని ప్రతిస్పర్ధిగ నెన్నినట్లును సరస్వతి ఈతనికి ప్రత్యక్షయయి గ్రంథము వ్రాసియిచ్చినట్లును కథలు గలవు.

**అరంగ్.** మధ్యపరగణాలలోని రాయపూరు జిల్లాయందలి ఒకగ్రామము. అచ్చటికి మహానది నాలుగుమైళ్లపై నుండును. జనసంఖ్య ౬౪౯౯. ఇది యొకప్పుడు మంచి వైభవ మనుభవించిన స్థలము. ఇచ్చట చక్కని కొలనులును, మామిడితోపులును, హిందూ జైనమతములకు సంబంధించిన కట్టడములును, దేవాలయములును గలవు. బాగేశ్వరుని దేవాలయ మొకటి గలదు. అటువైపునుండి జగన్నాథమునకు పోవువా రీదేవుని తప్పక దర్శింతురు.

**అరంటాంగి.** తంజావూరుజిల్లా బట్టుకొట్టాయితాలూకాలోని డిప్యూటీ తహసిల్దారుఁ డుండు స్థలము. జరీబట్టలు, పట్టుబట్టలు రంగుబట్టలు ఇక్కడనుండి రంగూనుకు ఎగుమతియగును. ఈపట్టణము మొదట తంజావూరురాజుల స్వాధీనమం దుండెను. కాని పదునైదవ శతాబ్దమునందు పాండ్యరాజునకు సేనానియగు రామనాథపురపురాజు దీనిని స్వాధీనపఱచుకొనెను. పదునేడవ శతాబ్దమునందు మరల తంజావూరురాజులు దానిని దీసికొనిరి. గాని ౧౬౪౬ లో రఘునాథతేవన్ అను రామనాథపురరాజు దానిని మరల దీసికొనెను. సంధిప్రకార మది మఱల తంజా

పూరురాజుస్వాధీనమైనను ౧౬౯౮ లో తిర్గి యుద్ధము ప్రారంభమై ఈపట్టణము రామనాథపురరాజు స్వాధీన మయ్యెను. ఇట్లే పట్టణము పెక్కుసారులు వీరినుండి వారికి వారినుండి వీరికి మారుచు చివరకు ౧౭౪౯ లో తంజావూరు వారికిఁ జెందెను. ఇచ్చట నొక కోట గలదు. కోటలోని దేవాలయమునందు పెక్కు శాసనములుగలవు.

**అరంతుకహ్రదము.** కురుక్షేత్రమందలి యొక కోనేరు. కురుక్షేత్రమునకు నొకవైపు సరిహద్దుగ నుండెను.

(భార. శల్య. ౫౩)

**అరగ.** మైసూరురాజ్యమందలి షిమోగాజిల్లాలో నొక పల్లె. ఇది పూర్వము మలేరాజ్యము (కొండ రాజ్యము) అను దేశమునకు రాజధానిగ నుండెను. శాంతారారాజులు చాళుక్యులకు సామంతులుగ ఈప్రదేశముపై రాజ్య మేలుచుండిరి. ౧౪వ శతాబ్దమునందు విజయనగరరాజులకు లోఁబడి ఈరాజ్యము మూడు పెద్దపట్టణములును పదునెనిమిది కంపనము లనగ జిల్లాలును కలిగియుండెను. తరువాత కేలాది రాజులు రాజ్యము జేయుచుండిరి. ౧౭౬౩ లో హైదరల్లీ వారి నంత మొందించెను.

**అరగొండ.** చిత్తూరుజిల్లా చిత్తూరు తాలూకాలోని యొకపల్లె. జనసంఖ్య ౧౯౫౯ చిత్తూరునకు ౧౪ మైళ్లు వాయవ్యమున బాగుగ నీళ్లవసతికలిగి సారవంతమయిన భూభాగమున కట్టఁబడినది. ఒకప్పుడు కడపకర్నూలు మొదలుగాగల పశ్చిమమండలముల ద్వారపు రాకపోకలకు నీ గ్రామము మధ్యస్థానముగా నుండెను. ఇచ్చట నొక శివాలయము కలదు. ఈ ఆలయమును గుఱించి అచ్చటి వా రొక కథ చెప్పెదరు. ఒక రాక్షసుఁ డీ గ్రామమును మ్రింగి విష్ణుభయమున నిచ్చటికి క్రోశెడుమీఁద నున్న రాక్షసతిప్ప వెనుక దాగుకొనెను. అప్పుడు విష్ణువు మూఁడు శివలింగములను తీసికొని వానిని కాళహస్తి నొక్కటి తిరుపతిని నొక్కటి అరగొండ నొక్కటి స్థాపించెనఁట. రాక్షసుఁ డీ మూఁడు లింగములను దాటుకొని పోలేక పట్టువడి చచ్చెనట! ఈ లింగత్రయమును బట్టి ఆంధ్రదేశమునకు త్రిలింగమనిపేరు గలిగెనట!

**అరకోణము.** చిత్తూరుజిల్లా వాలాజపేట తాలూకాలోని ఒక గ్రామము. మద్రాసు సదరన్మరాటా రైలుదారికిని దక్షిణ యిండియా రైలుదారికిని ఇది సంధిస్థానము.

**అరగో.** (డొమినిక్ ఫ్రాంకాయిస్ Dominique Francois Arago ౧౭౮౬-౧౮౫౩) ఫ్రాన్సుదేశమందలి జ్యోతిషపదార్థవిజ్ఞానశాస్త్రివేత్త. ఇతఁడు రేఖాంశము (విషువచ్ఛాయ Arc of the Meridian) కొల్చుటయందు బయొట్ (Biot) అను శాస్త్రిజ్ఞ

నకు సాయము జేసెను. ఎకోల్ పాలిటెగ్నిక్ (Ecole Polytechnique) అను విద్యామందిరమునందు ౨౦ సంవత్సరములవరకు విభాగాత్మకభూమితి (Analytical Geometry) అను శాస్త్రమునకు అధ్యాపకుఁడుగ నుండెను. భ్రమణాత్మక అయఃకాంతత్వము (Rotatary magnetism) ను నూతనముగ కనుఁగొనినందుకు క్రీ. శ. ౧౮౨౫ లో లండనులోని రాయల్ సొసయిటీవారు కాప్లెపతకమును (Copley medal) ఈతనికి బహుమతి చేసిరి. క్రీ. శ. ౧౮౩౦ లో ఈతనిని పారిస్‌పట్టణమందలి నక్షత్రశాలకు నధిపతిగ నియమించిరి. తరువాత ఫ్రాన్సుదేశములో జరిగిన రాజ్యక్రాంతి (Revolution) లో నీతఁడొక నాయకుఁడుగ నుండెను. లూయీ నెపోలియన్ అనువాఁడు ఫ్రాన్సుదేశమున కధ్యక్షుఁడగుట ఈతనికసమ్మత మగుటచే నీతఁడాతని ప్రభుత్వమునకు లోబడినట్లు రాజభక్తి శపథమును (Oath of allegiance) తీసికొనఁడయ్యె. (క్రీ. శ. ౧౮౫౧ డిశంబరు). అయినను ఆతని యోగ్యతయు, ఆతనియందు ప్రజలకుఁగల గౌరవమును పట్టి ప్రభుత్వమువా రాతనిని శిక్షించినవారు కారు. ఈతఁడు పెక్కుగ్రంథములు వ్రాసెను. వానిలో స్వీయచరిత్రమును జోతిశ్శాస్త్రమును ముఖ్యములు.

**అరజ.** భార్గవుని కన్య. ఈమె కామార్థము దండకరాజు నష్టపఱిచెను.

(చూఁడు దండకారణ్యము.)

**అరట్టము.** భారతవర్షీయ దేశము. ఇది ఉత్తరమున హిమాలయము నంటి యున్నట్టు గానవచ్చుచున్నది. ఇది యార్యులచే బహిష్కరింపంబడిన దేశము. ఇందు మంచి యశ్వములు కలవని ఖ్యాతియుండెను.

**అరఁటికుటుంబము.** వృక్షను లన్నియు శాస్త్రజ్ఞులచే వాని పోలికలనుబట్టి గొన్నికుటుంబములుగ విభజింపఁబడినవి. అందు అరఁటికుటుంబ మొకటి. అరఁటి, పసుపు, అల్లము, ఏలకులు, మెట్టతామర, కచ్చూరము, దుంపరాష్ట్రము మొదలయిన చెట్లు ఈ కుటుంబములోనివి. అరఁటి చెట్టును ఈజాతికి బ్రతినిధిగా నెంచి దీనికి 'అరఁటికుటుంబము' అని పేరు పెట్టఁబడినది. ఈకుటుంబమందుఁ గల వృక్షములకన్నిటికిని కొన్ని సమాన ధర్మములు గలవు. వానిలో ముఖ్యమైనవి; (౧) ఒక దుంపనుండి అనేకములుగ ఆకులు బైలుదేరి, ఆయాకుల తొడిమలు (Peduncles) వెడల్పుగ నుండి మట్టల ఆకారముజెంది ఒకతొడిమచుట్టు మఱియొక తొడిమ ఆవరించుకొని యుండుటచే చెట్లును నిలువబెట్టు స్తంభము ఏర్పడుట. (౨) ఆకుయొక్క పెద్దఈనెనుండి పుట్టు చిన్న యీనెలన్నియు సమాంతర రేఖలవలె నుండుట. ఈకుటుంబములోని చెట్లన్నియు గుల్మములే. ఒక్క యరఁటిమాత్రము ఎత్తుగఁ బెరుగును. సాధారణముగ వీని పరికాండములు మూలవహములు, అనగా అరఁటి, పసుపు, అల్లము

మొదలగు చెట్లకుఁ భూమిపై భాగమునఁ గానవచ్చెడి స్తంభము ఆకుల చుట్టయంతయు నిజమైన ప్రకాండముకాదు. లోపల దుంపలనఁబడునదియు దానినుండి పుట్టుదూట అనిచెప్పు మధ్యభాగమును దాని నిజమైన ప్రకాండము. నిజమైన ప్రకాండములు దుంప లోలోపల పాకుచు పిలకలను పెట్టును. ఈదుంపలనంటి క్రిందివైపున వేళ్లు ప్రత్యేకముగ నుండును. అరఁటిదుంపలు వేరులుకావు, నిజముగ వాని కొమ్మలే. వీనిపుష్పములు అంటికోశముక్రింద నుండునట్టి క్రమేతరములు (Irregular) ఒక పుష్పమునందు మూడు గదు లుండును.

ఈ కుటుంబమందలి వృక్షములయొక్క పుష్పముల కింజల్కభేదములను బట్టి యందలి వృక్షములు మూడు ఉపకుటుంబములుగా విభజింపఁబడినవి. అరఁటిజాతిలో ౫,౬ కింజల్కము లుండును. మెట్టతామర మొదలయిన వానిలో కింజల్కములన్నియు నాకర్షణపత్రములవలె మారి పుప్పొడి తిత్తియొక్క ఒకగది మాత్రము మిగులుచున్నది. అల్లము కచ్చూరము మొదలగు వానియందు రెండు గదులు గల యొక పుప్పొడితిత్తి గలదు. ఈ మూడు భేదములను బట్టి మూడు ఉపకుటుంబము లయ్యెను. ఇందునుగురించి అధికము తెలిసికొనఁ గోరువారు విజ్ఞానచంద్రికాగ్రంథమాల ౩౦, వృక్షశాస్త్రము, పుట ౪౦౦ చూడ నగును.

ఉత్పత్తి

**అరఁటిచెట్టు.** ఇది సాధారణముగా సారవంతమైనట్టియు, ఉదకసమృద్ధి గలిగినట్టియు అన్ని ప్రదేశములందును హిందూదేశమున వృద్ధి జెందగలదు. మిక్కిలి శీతల ఖండములందు అనగా ఐరోపామొదలగు ఖండములందు నిది వృద్ధికాదు. కొంచె ముష్ణప్రదేశములు దీనివృద్ధికి హితము. అరఁటి ఈ దేశమునందు ౫ లేక ౬ వేల అడుగుల ఎత్తుగల ప్రదేశములందు కూడ పెరుగుచున్నది.

సంతానవృద్ధి

మొట్టమొదట అరఁటిచెట్లకు విత్తనము లుండినందులకు నిదర్శనముగా, కొన్ని జాతుల కాయలలో విత్తనములు కానవచ్చుచుండినను, మానవుఁడు తనయుపయోగార్థమై క్రమక్రమముగ విత్తనములు లేనికాయలనే వెదకివెదకి వృద్ధి చేయుచు, విత్తనము లున్న కాయలుగల చెట్లను క్రమక్రమముగ నశింపుజేయుచు వచ్చుటచే ప్రస్తుతము విత్తనములు లేని కాయలుకాయు అరఁటిచెట్లే వృద్ధిలోనున్నవి. కాని అక్కడక్కడ కొన్నిచోట్ల వానియాకులకొరకై విత్తనములున్న కాయలుగల జాతులను కూడ పెంచుచున్నారు. ఈ జాతి చెట్ల యాకులు మిక్కిలి పెద్దవిగా నుండును. సాధారణముగా అరఁటి చెట్లు పిలకలను పాతిన ఒక సంవత్సరము లోపల కాపునకు వచ్చును. అరఁటి గెలలో మొదట కొన్ని అత్తములోని పూవులలో

పురుషభాగములు నపుంసకములు. వానిక్రింది అత్తములలో స్త్రీభాగములు గొడ్డువి. మొదటిభాగము లందలిస్త్రీభాగములు గర్భవతులగునప్పుడు ఏకకుటుంబములోని పురుషబీజములచే ఆకుటుంబములోని స్త్రీబీజములు గర్భవతులుగాకుండఁ జేయుటకై సృష్టియందీయేర్పాటు గలిగినట్లు తోఁచుచున్నది. మనము అరఁటి పూవు అని చెప్పు అరఁటి గెలలో ఒక్కొక కాయ యగుటకు ఆధారభూతమైన భాగమే నిజముగా నొక్కొక పూవు. ఆ పూవులో "దొంగాడు" అని కూరవండునపుడు తీసిపారవేయు భాగము స్త్రీభాగము. దాని చుట్టునుండు కింజల్కములు పురుషభాగములు. అరఁటి గెలలోని మొదటిఅత్తములలో కొన్నిటియందు కాయలేర్పడి పిమ్మట కాయలేర్పడక పువ్వులన్నియు రాలిపోవుచున్న యెడల మిగిలిన పువ్వులలోని స్త్రీభాగములన్నియు గొడ్డువని తెలిసికొని పూవును కొట్టివేసినయెడల చెట్టునందలి యాహారము వృథాగా గొడ్డు పూవులోనికి పోకుండ కాయలలోనికి జేరును.

మనదేశములో అరఁటిచెట్టుయొక్క ఉపయోగములను కొన్నిటిని మాత్రమే మనవారలెరుగుదురు. కొన్నిటిని గూర్చి మనవారలు వినియున్నను వానిని ఆచరణలోనికి తీసికొనివచ్చుట లేదు. అరఁటిదుంపను ముక్కలుగఁ జేసి ఆవులకుఁ బెట్టినయెడల పాలు వృద్ధియగునట. అరఁటికాయలను చక్రములుగా తరిగి ఎండబెట్టి దేశదేశములకు ఆహారపదార్థముగ రవాణాచేయుదురఁట. ఎండబెట్టిన అరఁటి కాయల పొడుమును, పండ్లపొడుమును వరి పిండివలెనే కొన్ని దేశములలో వాడుదురఁట. ఈ పొడుమును దోరదోరగా వేయించి కొన్ని చోట్ల, "కోకో" "కాఫీ" పొడుములవలె వాడుదురఁట. అరఁటిచెట్టునుండి తీసిననారతో పట్టుబట్టలవంటి వస్త్రములను నేయుదురఁట. కాగితములను చాపలను చేయుదురఁట. ఇట్టి యుపయోగములగూర్చి యెంతయో మనము వినుచున్నారము, చదువుచున్నాము. వీనిని చేయుటయందును కష్టమంతగా కనపడదు. మనదేశమునందు క్రొత్తపనిని దేనినైనను చేయుటకు తగినంత సాహసము లేకను, తగినంత మూలధనము లేకను మిక్కిలి యుపయుక్తమలగు పదార్థము లనేకములు మట్టిలో గలసిపోవుచున్నవి. ఇట్లే అరఁటిదుంపలును బొందులును ఎక్కువగా నున్నచోట్ల, కాయలు పండ్లును కూడ మన్నులోకలిసి పోవుచున్నవి. ఎప్పటికైనను ఇట్టిపరిశ్రమలు వృద్ధిలోనికి వచ్చిననేగాని దేశమభివృద్ధి చెందదు.

ఉపయోగము

**అరని.** (౧౮౧౭-౧౮౮౨) జానాస్ అరని (Janos Arany) అను నాతఁడు హంగేరీ దేశమందలి కవి. అచ్చట ఆధునికకవులలో నీతఁడు మిక్కిలి లోకప్రియుఁడు. ఇతని కావ్యములు దేశాభిమానపూరితములు. ౧౮౪౮ లో జరిగిన విప్లవమునందు నేర్పడిన జాతీయప్రభుత్వమునం దీతఁ డొక యధికారిగ

నుండెను. ఆ ప్రభుత్వమునకు పరాభవము కలిగినపిదప ౧౮౫౮ వఱకు నతఁడు కడు బీద వాఁడుగ నుండెను. తరువాత నీతనికి విద్యాపీఠములో మహోపాధ్యాయుని పనులు ఈయఁబడెను.

**అరబస్థాన్.** చూఁడు అరేబియా.

**అరబ్బిపాషా.** (౧౮౪౦-౧౯౧౧)

ఈజిప్టుదేశమునందు ౧౮౮౨వ సంవత్సరమున తిరుగుబాటు చేసినవారి నాయకుఁడు. ఈతఁడు మొదట కూలివాఁడు. తరువాత ౧౨ సంవత్సరములు ఒక బీద సిపాయిగ సైన్యములో నుండెను. ఇంగ్లీషువారును ఫ్రెంచివారును ఈజిప్టుదేశపు ప్రభుత్వములో జోక్యము కలిగించుకొనఁ గూడ దని యీతని యభిప్రాయమైనందున నతఁడు వారికి వ్యతిరేకముగ జాతీయపక్షమును దేశమునందు నిర్మించెను. ఆపక్షమునకు లొంగి ౧౮౮౧లో అప్పుడున్న మంత్రులందరు తమ పనులును మానుకొనవలసిన వారైరి. ౧౮౮౨లో నీతఁడు నూతన మంత్రిమండలమునందు యుద్ధసంబంధమైన మంత్రి యయ్యెను. తమ ప్రతిసాంవత్సరిక ఆదాయవ్యయముల లెక్కలను ఇంగ్లీషువారుగాని ఫ్రెంచివారుగాని తనిఖీచేయ నవసరము లేదని వాదించి వానిని వారికిఁ జూపుట మానెను. అందుచే నింగ్లండుతో యుద్ధము సంభవించి ౧౮౮౨వ సంవత్సరము జూలై ౧౧,౧౩ తేదుల ఇంగ్లీషు నావికదళమువారు ఈజిప్టురాజధానియైన అలెగ్జాండ్రియా మీఁద ఫిరంగివర్షమును కురిపించిరి. ౧౩వ శెప్టెంబరు దినమున టెల్ ఎల్ కెబెర్ అను స్థలమునందు అరబ్బిపాషా పూర్తిగ నోడింపఁబడెను. ఆతనిఁ బట్టుకొని సింహళమునకుఁ బంపిరి. ఆతని వెళ్లఁగొట్టిన తరువాతనే ఈజిప్టుదేశముపై ఇంగ్లీషువారి తనిఖీ చక్కఁగఁగుదిరెను. ఈతనిని ౧౯౦౧వ సంవత్సరమున విడిచిపెట్టిరి.

**అరబ్బీసముద్రము.** దీనినే మన దేశస్థులు పశ్చిమసముద్ర మందురు. ఇది హిందూదేశముయొక్క పశ్చిమతీరము నంటి యున్నది. ఇది హిందూమహాసాగరములోని యొక భాగము. ఇది అరబస్థానమునకు తూర్పునను దక్షిణమునను వ్యాపించి యుండును. ఈయది పరిషియాదేశమునకు పశ్చిమమునను, అరబస్థానమునకు తూర్పుననున్న పారసీకజలసంధితో అరబస్థానమునకు తూర్పుభాగమున గలియును. ఎఱ్ఱసముద్రముతో అరబస్థానమునకు పశ్చిమమున బాబుల్ మేండప్ జలసంధిద్వారా కలియును. అచ్చటనే ఏడన్ పట్టణముగలదు.

**అరరు.** ప్రయాగ ప్రాంతమందలి కోరాఅను సంస్థానమునకు జమీందారుఁడు. డిల్లీలో మహమ్మదుషాహ (క్రీ. శ. ౧౭౧౯) రాజ్యముచేయునప్పుడు ఆతఁడు బలహీనుఁడని యెంచి అరరు తన జిల్లాకు అధికారియైన నిసారుఖానునిఁ జంపి క్రీ. శ. ౧౭౩౧ లో

స్వతంత్రుఁడాయెను. అతనిని శిక్షించుటకు ఢిల్లీనుండి చంపఁబడినవాని కుమారుఁడైన అజముల్లాఖాన్ పంపఁబడెను. కాని అరారు ఆతనికిఁ జిక్కనందున కొన్నిదినములకు వెడలిపోయెను. అంత నరారు మరల నొకరాజప్రతినిధినిఁ జంపెను. అందుమీఁద ఔధ్‌సుబేదారుఁడైన సాదత్‌ఖానుఁడు ఈతనితో యుద్ధముఁజేసి యీతనిని జంపి యీతని తల చక్రవర్తికిం బంపెను (క్రీ. శ. ౧౭౩౫.)

**అరవక్షాట్.** నీలగిరిజిల్లా కూనూరుతాలూకాయందలి ఉబ్బుతలై గ్రామము యొక్క శివారు. ఇది కూనూరునకు మూడు మైళ్లదూరములో నున్నది. ఇండియాలోని సైన్యమున కంతకు "కార్డైట్" అనుదాని నిచ్చుటకు ఇక్కడిలోయయందు ఒక గొప్ప ఫ్యాక్టరీ కట్టఁబడినది. ఇది సమీపమందున్న వెల్లింగుటన్ సైన్యశిబిరమునకుఁ జేర్చబడినది. కార్ టేరీనదీపాతమువల్లఁ గలిగిన విద్యుత్ శక్తివల్ల ఫ్యాక్టరీమరలు నడుపఁబడును. దీనికి సమీపమున సారాభట్టీ గలదు. ఉదకమండలమునకుఁ బోవు రస్తా ఈకార్డైట్ ఫ్యాక్టరీప్రక్కగఁ బోవును.

**అఱవము.** తెలుగువారే భాషను అఱవమని యందురో దానిని ఆభాష మాటలాడువారు "తమిళ" మని వ్యవహరింతురు. సంస్కృతమునందు దానినే "ద్రవిడ" మందురు. అఱవభాషనుగుఱించియు, అఱవవారిని గుఱించియు, "తమిళ" శబ్దముక్రిందఁ జూడనగు.

**అరసిబిడి.** బొంబాయిరాజధాని బిజాపూర్ జిల్లా హంగుండ్ తాలూకాయందలి యొకపల్లె. ఇప్పు డిది పాడు పడినదని చెప్పినఁ జెప్పవచ్చును. పూర్వ మిచ్చట చాళుక్యరాజుల రాజధాని విక్రమపుర మనునది యుండెను. ఇది ౬వ విక్రమాదిత్యునిచే (క్రీ. శ. ౧౦౭౬-౧౧౨౬) స్థాపింపఁబడినది. కాలచురి రాజులు ౧౧౮౧లో చాళుక్యులను గెలుచువరకు నీపట్టణము చాళుక్యుల రాజధానిగ నుండెనని యూహింపఁబడుచున్నది. ఇందు శిథిలములైన రెండు జైనమందిరములును, రెండు చాళుక్య కాలచురిశాసనములును గలవు.

**అరసు.** (౧) మైసూరురాజుల బంధువులలోని తెగ. వీరిలో రెండు శాఖలు గలవు. వీరిని రాజబంధువు లనియెదరు. వీరిలో కొందఱు వైష్ణవులు. కొందఱు శైవులు.

(౨) అఱవ దేశమందలి పల్లెజాతిలోను పరయన్‌జాతిలోను అరసులను నొక యుపజాతి గలదని మద్రాసు సెన్‌ససు రిపోర్టు (౧౮౯౧) లోఁ జెప్పఁబడి యున్నది.

**అరసూరుగుట్టలు.** బొంబాయి రాజధానిలోని మహీకాంతా ఏజన్సీయందలి గుట్టలు. ఇవి ఆరావలి పర్వతమాలికయొక్క నైరృతిమూల నున్నవి. ఈ పర్వతములలో అంబాభవానియొక్క దేవాలయము కలదు. మిక్కిలి పురాతన కాలమునుండి యీ దేవాలయ ముండినట్లు తోఁచుచున్నది. ఇచ్చటనే

సరస్వతీనదియొక్క యుత్పత్తిస్థానము కలదు. అంబాభవాని దేవాలయమున కెప్పుడును యాత్రికులు వచ్చుచుందురు. నవరాత్రి దిన ములలో నక్కడ గొప్పయుత్సవము జరుగును. దాంతసంస్థానాధీశ్వరున కీమె కులదేవత. ఇచ్చట పదునాఱవ శతాబ్దమునందలి శాసనములు కలవు.

**అరాండా.** (క్రీ. శ. ౧౭౧౮-౯౯) స్పెయిన్ దేశమందలి రాజకార్య నిపుణుఁడు. సర్దార్ వంశమునందు జన్మించెను. ౧౭౫౯ లో పోలెండుదేశమునకు రాయబారిగ నంపఁబడెను. ౧౭౬౬ లో క్యాష్టలీకి సైనికనాయకుఁడుగ చేయఁబడెను. ఆసంవత్సరముననే ముఖ్యమంత్రియయ్యెను. ఈతఁడు ఫ్రాన్సు రాజ్యక్రాంతి (French Revolution) కారకులగు తత్వవేత్తలతో సహానుభూతి గలవాఁడు. కావున తన మంత్రిత్వకాలమున తన ప్రజాక్షేమమునే మనస్సునం దుంచుకొని రాజ్యమేలెను. మతగురువులు చేయుచున్న పెక్కు అక్రమముల నాపివేసెను. మతభేదమునకై ప్రజలను బాధపెట్టునట్టి ఇన్‌క్విజిషన్ (Inquisition) అను మతగురువులయొక్క న్యాయసభలప్రభ తగ్గించెను. జసూట్ అను వారలను స్పెయిననుండి వెడలఁగొట్టెను. ప్రజల యోగక్షేమమునకై యాతఁడు పెక్కు కార్యములు చేసెను; దేశమందలి పోలీసు సైన్యమును న్యాయస్థానములను కట్టుబాటులకు లోఁబడునట్లు చేసెను. ఇంగ్లాండున కీతఁడు మొత్తము మీఁద ప్రతికూలుఁడుగ నుండెను. ౧౭౭౩ లో నాతనిని ప్యారిస్‌పట్టణమునకు రాయబారిగఁ బంపిరి. ౧౭౯౨ లో నాతఁడు మరల ముఖ్యమంత్రి యయ్యెను. ఆతనిని పడవేయవలయునని మతగురువులు పెక్కు కుట్రలఁ బన్నిరి.

**అరాజకత.** ఏదేశంబుననైన నొక కాలంబునఁ బ్రజలు స్వతంత్రించి దేశశాసన విరుద్ధముగ నడచుకొనుట యరాజకత నాఁబడు. ఈ పదంబున నుండు 'రాజు' శబ్దముం బట్టి యిట్టి దురవస్థ రాజపరిపాలిత దేశంబుల మాత్రమే తోఁచునని సూచింపఁబడుచున్నను నిక్కువముగా నియ్యది రాజపరిపాలిత దేశంబుల నేమి ప్రజాపరిపాలిత దేశంబులనేమి యప్పుడప్పుడు గానంబడియెడి. మఱియు నియ్యది రాజుగాని వేఱుప్రభుత్వముగాని పేరునకున్నను దేశంబునందుఁ గన్పట్టెడి. పైకారణములఁబట్టి యరాజకతశబ్దంబుకంటె నశాసన శబ్దంబు బాగుగ నీదురవస్థ తెలుఁగుఁ దెలియఁజేయును.

ఈ యరాజకతకు ప్రభుత్వాభావము, ప్రభుత్వావధీరణము మూలకారణములు. ఇందు ప్రభుత్వాభావము రెండుకారణములవలన గలుగవచ్చును. ఒక రాజవంశ మంతరింప వేరే వంశస్థుఁడు రాజపద మధిష్ఠించిన దనుక నరాజకత గన్పట్టు. క్రీ. శ. ౨౫౬౭ వ సంవ

త్సరమున నాంధ్రవంశ మంతరింప నాలవశతాబ్ధంబున గుప్తవంశజులు సార్వభౌము లగుదనుక నుత్తరహిందూస్థానమంతయు నరాజకావస్థయందుండె. రుష్యాదేశము క్రీ. శ. ౧౫౯౮వ వత్సరమున రూరిక్ వంశ మంతమొంద రోమనాఫ్‌వంశజులు రాజు లగుదాఁక పదేనువత్సరము లరాజకముగా నుండె. జెర్మనీదేశంబు హొహెన్‌స్టాఫెన్ వంశము క్రీ. శ. ౧౨౫౪వ వత్సరమునందు పోపుచే నిర్మూలింపఁబడ హాప్సబర్గులు చక్రవర్తులగుదనుక పంతొమ్మిది వత్సరము లరాజకముగా నుండె. మఱియు నీ ప్రభుత్వాభావము పరరాజులు దండెత్తి రాజును ద్రుంచినయెడం గూడఁ గన్పట్టు. హర్షవర్ధననంతర మర్జునుఁడు రాజ్యమాక్రమించుకొని చీనారాయబారియగు వాంగ్‌హ్యూయెన్సేనను బరాభవించి యాతనిచే నోటొంది మృతినొంద నుత్తరహిందూస్థానమంతయుఁ బెద్దకాలమరాజకంబయ్యె. తైమూర్ దండయాత్ర (౧౩౯౮) తరువాత హిందూశదేమునందలి ఆఫ్గను రాజ్యమున కీ ధురవస్థ బట్టె. తల్లికోట (౧౫౬౫) యుద్ధానంతరము విజయనగరసామ్రాజ్య మిట్టి దుస్థితి పాలయ్యె. ఇట్లే యింగ్లాండునందు నార్తంబ్రియా రాజులగు నెడ్విన్ ఆస్వాల్డులు మర్షియా ధీశ్వరుండగు పెండాచే క్రీ. శ. ౬౩౩-౬౪౨ వత్సరములలో నోడింపఁబడి కాలమొంద నా దేశము మొదటిసారి రెండేడ్లును, రెండవమారు పదుమూడేండ్లును నరాజకంబయ్యె.

ఇట్లే ప్రభుత్వావధీరణము గూడ రెండు కారణములచేత సంభవింపవచ్చును. ప్రభుత్వ దౌర్జన్యమువలనఁ బ్రజలు దిరుగఁబడ నరాజకత సంభవించు. పూర్వము మనదేశమున వేనుని దౌర్జన్యమునకుఁ బ్రజలు కినిసి వానినిఁ బ్రమందించి యరాజకావస్థఁ బొందిరి. ఐర్లాం డాంగ్ల ప్రభుత్వముపై తిరుగఁబడి క్రీ॥ శ॥ ౧౬౪౧-౧౬౫౨ వఱకు నరాజక స్థితియం దుండె. రుష్యాసార్వభౌమునిపై రుష్యనులు తిరుగఁబడి ప్రజాప్రభుత్వ మేర్పాటుచేసికొనుటయందించుమించుగా నరాజకస్థితి జెందియున్నారు. చీనావారలు నిట్లే మొన్నమొన్నటివరకు నుండిరి. మఱియుప్రభుత్వ దౌర్బల్యముకూడ ప్రభుత్వావధీరణమునకు హేతు వగు. గౌడదేశంబు శూరరాజులక్రింద క్రీ॥ శ॥ ౭౪౫ సంవత్సరమున గోపాలుఁడు రాజగుదాఁక అరాజకముగా నుండె. వేఁగిదేశము క్రీ॥ శ॥ ౯౭౫-౯౫౪ సంవత్సరములకు మధ్య తూర్పు చళుక్యరాజుల దౌర్బల్యముచే నరాజకంబుగా నుండె. విజయనగరరాజ్యంబు ప్రౌఢదేవరాయల తదనంతరంబు సాళువనరసింహరాజు రాజగుదనుక ఇట్టి యవస్థయందే యుండెను. ఇంగ్లాండున స్టీవెన్ (క్రీ॥ శ॥ ౧౧౩౫-౧౧౫౪) ఆరవహెన్రి (౧౪౨౨-౬౧) రాజ్యమొనర్చుచో వారిదౌర్బల్యముచే రాజ్యమరాజకమయ్యె. షాజహాను జరాభారుఁడై యుండ నతని కుమారులు నలువురు కలహించుచో ౧౬౫౭ సంవత్సతమున నౌరంగజేబు

చక్రవర్తియగుదనుక హిందూదేశ మరాజక ముగా నుండె.

ఇట్లు దేశం బరాజకంబైనఁ బెద్దలు మత్స్య న్యాయ మనువర్తించు నందురు. మత్స్యము లలోఁ బెద్దవి చిన్నవాని మ్రింగుట నైజమై యున్నది గాన నట్లే యరాజకత సంభవించి నప్పుడు దండనీతి లేమింజేసి బలమే ధర్మమై బలవంతులు బలహీనుల దోచుట మున్నగు నానావిధ హింసలఁ బెట్టుదురని దీని యభి ప్రాయము. ఈ విషయమే విపులముగా రామా యణమున నయోధ్యాకాండ ౬౭వ అధ్యాయమునని ట్లు నుడువఁబడియున్నది. అరా జక జనపదంబున మేఘుఁడు వర్షింపఁడు. హాలి కులు పైరుబెట్టరు. కుమారుఁడు తండ్రిమాట వినఁడు. భార్యభర్తయాజ్ఞ నుల్లంఘించును. ధనము నిలువదు. కామినీమానరక్షణము చక్కగా నెఱవేరదు. సత్యముండదు. సభలు సమావేశముకావు. ఉద్యానవనములు గాని పుణ్యగృహములుగాని నిర్మింపఁబడవు. ద్విజులు యజ్ఞము లొనర్పరు. బ్రాహ్మణులకు దక్షిణ లియ్యరు. ఉత్సవములుగాని సమాజములు గాని నటనర్తకయుతములై వర్ధిల్లవు. వ్యవ హారములు చక్కగా జరుగవు. కథాశీలురు కథాప్రియుల రంజింపరు. హేమభూషితులై కన్య లుద్యానముల సాయంసమయమునఁ గ్రీడింపరారు. ధనవంతులు సురక్షితులు గారు. కృషిగోరక్షుజీవినులు ద్వారములఁ దెరచి నిద్రింపరు. ఉత్సాహపరులు భార్యాయుతులై వాహనములెక్కి యరణ్యము సేరరు. ఏనుఁ గులు వీధుల సంచరింపవు. శరాభ్యాస ముం డదు. దూరగామినులగు వణిగ్వరులు క్షేమ ముగా వీధులఁ దిరుగలేరు. సంయములు చక్కగ భగవద్ధ్యాస మాచరింప లేరు. జనులు తమ ఆస్తిని దాము రక్షించుకొన లేరు. వలసిన వస్తువులు సంగ్రహింప లేరు. సైని కులు శత్రువులదాడి కోర్వలేరు. నరు లశ్వ ముల రథముల నెక్కి అరుగలేరు. శాస్త్రి విశారదులు శాస్త్రిచర్చ లొనర్పలేరు. నరులు దేవతలకు మాల్యమోదకదక్షిణాదు లొసం గరు. చందనాగరు భూషితులగు రాజపుత్రులు ప్రకాశింపరు. ప్రాణరక్షణమే కష్టమగు. మత్స్య ములవలెఁ బ్రజ లొండొరులఁ బీడింతురు.

ఇట్టియుపద్రవములతో నిట్టి యరిష్టము లతోఁ గూడుకొని యుండుటఁజేసి యరాజకత యవశ్యము వారింపఁదగినదని పెద్దలుబోధిం చిరి. మఱియునీప్రపంచమున మొదట నీ యరాజకోత్పాతముల నంతమొందించుటకై విధాత రాజును సృజించె నందురు. ఈయం శము శుక్రనీతియం దిట్లు చెప్పఁబడియె. "శ్లో॥ అరాజకేహి సర్వస్మిన్ సర్వతో విద్రుతే భయాత్। రక్షార్థమస్యసర్వస్య రాజా నమసృజత్ ప్రభుః॥" ఆంగ్లేయరాజ్యనీతి శాస్త్రిజ్ఞులగు హూకల్ హాబ్సు మున్నగు వారిట్లేయభిప్రాయపడి దీనికిఁ బ్రకృత్య వస్థ యని పేరిడిరి. ఈ యరాజకత నంతమొం దింప నూతన ప్రభుత్వోద్ధారణమో పూర్వ

## అమరావతి స్తూపము.

౮-వ పటము.



లోపలి చెక్కడపుబని.

అమరావతిలో దొరికి లండనునకుఁబంపఁబడిన కొన్నిబండలను అవి పూర్వ మేస్థితిలోనుండెనో అట్లూహించి ఫర్గ్యూసన్ ఈ ప్రకారము అమర్చెను. ఇది లోపలి ప్రాకారమని ఇదివరకు ఫర్గ్యూసన్ మొదలగు వారి యభిప్రాయమై యుండెను. కాని యివి మూల దాగోబా చుట్టునున్న బండలని తజ్ఞుల యభిప్రాయము ఇప్పుడు మారినది. ఇందు లింగాకారముగఁ గానవచ్చునవి యన్నియు దాగోబాల ప్రతిరూపములు. ఇందు చక్ర స్తంభములుకూడ నున్నవి.

౧౮౫-౧౯ పుటకు నెదుట ]

ప్రభుత్వోజ్జీవనమో సమర్థము. ఇట్టి స్థితి తాత్కాలికమేగాని శాశ్వతముగాదు. కొంత కాల మరాజకముగా నుండునప్పటి కా దేశ వాసు లిడుములఁ బడలేక ప్రభుత్వ మెప్పుడు మరల లభించునా యని కాంక్షింతురు. బల వంతులును తమ శరీరబుద్ధిబలంబుల నుప యోగించి ప్రబలులై రాజపదవి నధిష్ఠింతురు. ఇట్లే ఇటలీదేశపు పట్టణములలో ౧౩,౧౪ శతాబ్దములలో జరిగెను. కాన నరాజకత వలనఁ గలుగు కష్టములే దాని యంతము నకుఁ గారణము లగుచున్నవి. అరాజకతావస్థ యుపద్రవము లిట్లున్నను దేశము పెద్దకాల మరాజకముగా నుండుట అసంభవమైనను ప్రౌధును బాకునిను మొదలగు నశాసన నీతిజ్ఞు లట్టిదానినే కోరుచున్నారు. ఇదిచింతనీయము.

[ము. సు.]

**అరాపట్టణము.** బంగాళాదేశమం దలి శాహాబాద్ జిల్లాయొక్క ముఖ్యపట్ట ణము. ఇది కలకత్తాకు ౩౬౮ మైళ్లమీద నుండును. జనసంఖ్య ౪౬,౧౭౦. ౧౮౫౭ లోని సిపాయిల తిరుగుబాటు కాలమున కువర్‌సింగ్ అనువాఁడు ౨౦౦౦ సిపాయిల తోను ౮౦౦౦ ఇతర జనులతోను ఈ గ్రామ మునకు ౨౭ వ జూలయి రోజున వచ్చి చెర సాలలోని ఖైదీల విడుదలఁ జేసి ఖజానా కొల్లఁ గొట్టెను. ఈ గ్రామము ౧౮౬౫ లో మున్ సిపాలటీగ మార్చఁబడెను.

**అరా.** (సబ్ డివిజను) బంగాళా దేశము లోని శహాబాద్ జిల్లాయందలి ఒక హెడ్ క్వార్టర్సు సబ్ డివిజను. వైశాల్యము ౯౧౩ చ॥ మైళ్లు. జనసంఖ్య ౬౯౯౫౯౬. ఇందు పట్టణములును, ౧౩౪౫ పల్లెలును కలవు. బిహియా అనునది ముఖ్యవర్తక స్థలము,

**అరారియా.** (సబ్ డివిజను) బీహార్ ప్రాంతమందలి పూర్ణియా జిల్లాలోని యొక సబ్ డివిజను. ఇది నేపాళదేశమునకు ఆని యుండును. వైశాల్యము ౧౧౭౭ చదరపు మైళ్లు. జనసంఖ్య ౪౧౫౯౮౫. ఇందు ౬౦౦ గ్రామములు కలవు. రాణీగంజ్ ఠాణా (తాలూకా)లో పుల్లిరిభూములు విస్తీర్ణముగఁ గలవు. ఇచ్చట ఎనుముజాతిని విస్తారముగఁ బెంచెదరు.

**అరాలి.** విశ్వామిత్రుని పుత్రుఁడు.

**అరి.** ఒకబ్రహ్మర్షి. (చూ. 3 అంగీ రసుఁడు.)

**అరిఓస్టో.** (Ariosto Ludovico) (౧౪౭౪-౧౫౩౩)ఇటలీదేశమందలిగొప్పకవి ఓర్‌ల్యాండో ఫ్యూరిఒసో(Orlando Furioso) అను మహాకావ్యమును రచించెను. ప్రపం చమందలి మహాకావ్యములలో దీని నొక్క టిగా పరిగణించెదరు. ఇది ౪౦ ఆశ్వాసముల గ్రంథము. ఇతఁడు రాజకీయసంబంధమైన పనులను పెక్కుల జేసెను.

**అరికేసరి.** (పాండ్యరాజు) ఈతఁడు ఎనిమిదవశతాబ్దమందు రాజ్యమేలెను. పల్ల వులనోడించెను.

**అరిఘ్నుఁడు.** రావణపక్షీయ రాక్షసుఁడు.

**అరిచ్ఛత్రము.** భారతయుద్ధముజరుగునపుడు కురుసేనలు విడిసిన యొక స్థలము.

**అరిజిత్తు.** శ్రీకృష్ణునకును భద్రకును బుట్టిన పుత్రుఁడు.

**అరిద్యోత్తు.** (చం.వం.) యాదవుఁడు. అంధకవంశజుఁడైన దుందుభిరాజు పుత్రుఁడు. ఇతని కుమారుఁడు పునర్వసువు.

**అరిమర్దనుఁడు.** (చం. వం.)యాదవుఁడు. వృష్ణిపుత్రుఁడైన శ్వఫల్కరాజుయొక్క పదుమగ్గురు పుత్రులలో నొక్కఁడు.

**అరిమేజయుఁడు.** ఒక యాదవుఁడు.

**అరియలూరు.** (పట్టణము) తిరుచునాపల్లి జిల్లా ఉదయారు పాలెయం తాలూకా అరియలూరు జమీందారీయందలి ముఖ్య పట్టణము. జనసంఖ్య ౭౩౭౦. ఈ పట్టణమున పాటునూలుకారన్ అను నేతకాండ్రచే నునుపుగా దట్టముగా పట్టుబట్టలు పెక్కు రకములుగ నేయఁబడును. అరియలూరు నాయకులు, నవాబు రాజ్యముక్రిందను కర్నాటక్ యుద్ధము లప్పుడును, అనేకములగు మార్పులుజెందిరి. ఈ జమీందారి కొంతకాలము కంపెనీవారి పాలనక్రిందనుండెను. జమీందారుఁడు వసూలు మొత్తములో ౧౦వ వంతు అనుభవించుచుండెను. [క్రీ. శ. ౧౮౭౧లో జమీందారు తాను నివసించు పట్టణమునకు మఱికొన్ని సమీపగ్రామములకును సన్నదు బొంది కంపెనీవారికి సంవత్సరమునకు రు ౧౮౦౦ లు పెష్కష్ చెల్లింపనొప్పుకొనెను. జమీందారులు వనియజాతివారు. ఈ జమీందారులకు అప్పు లధికమైనందున షాహుకారులు కోర్టుద్వారా వేలము వేయించిరి. అందుచే నిది పదునేడు తునకలుగా విభజింపఁబడెను.

**అరిష్టనేమి.** ౧. కశ్యప ఋషికి నామాంతరము. [భార. శాంతి. అ. ౨౦౮]

౨. పుష్యమాసమునందు సూర్యుని వెంటఁదిరుగు గంధర్వుఁడు. (చూఁడు సహస్యుఁడు)

3. ప్రాచేతసదక్షుని నలుగురు కన్యలకుఁ బతి.

౪. విదేహవంశజుఁడగు పురుజిజ్జనకుని పుత్రుఁడు. ఇతని పుత్రుఁడు శ్రుతాయువు.

౬. సహదేవుఁ డజ్ఞాతవాస కాలమునందు తంత్రీపాలుఁ డను నామములోఁ గూడ ఈపేరును ధరించెను.

**అరిష్టపర్వతము.** లంకలోనిది. పదియోజనముల పొడవును, ముప్పదియోజనముల యెత్తును కలది. సీతను చూచి హనుమంతుఁడు, సముద్రపు టావలి యొడ్డునకు గంతువేయవలె నని, దీనిపై నిలువఁగా నది యాతని బలమున కోర్వలేక భూమిలోనికి నణఁగిపోయెను. [వా. రా. సుం. అ ౫౬.]




అరిస్టోఫేనిస్ ౧.



అరిస్టాటల్.

౧౮౯౯ పుటకు ఎదురు.]

**అరిష్టశేణుఁడు.** భృగు కులోత్ప న్న ఋషి. ఇతనికిని యుధిష్ఠిరునకును సంవాదము జఱిగెను. ఇతని వంశజులు అరిష్ట శ్రేణులని పిలువఁబడుదురు. [భార. వన. అ. ౧౯౯]

**అరిష్టా.** కశ్యపుని భార్య.

**అరిష్టుఁడు.** ౧. బలిదైత్యుని నూర్గురు పుత్రులలో నొక్కఁడు.

౨. దనుపుత్రులలో నొక్కఁడు.

3. కంసుని యాజ్ఞవలన వృషభరూపియై వచ్చి కృష్ణునిచేఁ జంపఁబడిన యొక యసురుఁడు.

**అరిస్టైడిస్.** ౧. (క్రీ. పూ. ౫30-౪౬౮) ఇతఁడు ఏథెన్సు పట్టణవాసి, రాజకార్యకుశలుఁడు, దేశభక్తుఁడు, మహావీరుఁడు. ఈతనికి న్యాయస్వరూపుఁడు (The Just) అను బిరుదుండెను. జగత్ప్రఖ్యాతిఁ జెందిన మరథాన్ యుద్ధమునందు (క్రీ. పూ. ౪౯౦) గ్రీకుసైన్యములను నడపిన పదిమంది నాయకులలో నీతఁ డొక్కఁడు. థెమిస్టొకస్ అనువానితో నీతనికి వైరము గలిగినందున నీతనిని క్రీ. పూ. ౪౮౪ లో ౫ సంవత్సరములవఱకు దేశములోనుండి వెడలఁగొట్టిరి. కాని ౪౮౦ లో పారసీకరాజైన షురక్షుఁడు (Xerxes) గ్రీసు దేశముమీఁదికి దండెత్తివచ్చినప్పు డితనిని మరల రావించిరి. సెలామస్, ప్లెషియా అను యుద్ధములలో (౪౭౯) మిగులఁ పరాక్రమముఁ జూపి పారసీకరాజును పరాభవించెను. ఈతఁడు ౪౭౮ లో గ్రీసుదేశమందుండిన చిన్న చిన్న సంస్థానముల నొకటిగఁ జేసెను. దానిని డీలియన్ సంఘమందురు. ఇతఁడు మిక్కిలి బీదవాఁడుగ చనిపోయెను. ఈతని ఔర్ధ్వదేహక్రియలకు ప్రభుత్వమువారు సహాయముచేసిరి. ఇతని కూఁతులకును కొడుకులకును ప్రభుత్వమువా రుపకారవేతన మిచ్చిరి.

౨. (పబ్లియస్ ఈలియస్ క్రీ. శ. ౧౨౯-౧౮౯) గ్రీసుజాతివాఁడైన యొక గొప్ప యాలంకారికుఁడు, వక్త. ఇతఁడు గ్రీసు, ఇటలీ, ఈజిప్టు, ఆసియా దేశములన్నియుఁ దిరిగెను. తుదకు స్మిర్నా పట్టణమందు నివాసస్థల మేర్పఱుచుకొనెను. మార్కస్ ఆరిలియస్ అను రోమకచక్రవర్తికి నీతని మెడ ఎక్కువ గౌరవము. ఈతని వక్తృత్వసూచకము లగు ౫౫ ప్రవచనములును రెండు ఆలంకారికగ్రంథములును ఇప్పటికిని వాడుకలో నున్నవి.

**అరిస్టాటిలు.** (క్రీ. పూ. 3౮౪-3౨౨) గ్రీసుదేశమందలి సుప్రసిద్ధతత్త్వవేత్త, ఆచార్యశిరోమణి. ప్రపంచమునందు సకలవిధములైన జ్ఞానమును ప్రసరింపఁజేయుటకై బోధరూపముననను గ్రంథరూపముననను యత్నముచేసిన మహర్షులలో నొక్కఁడు. ఈతని కాలమందుఁ దెలిసిన యన్ని శాస్త్రముల మీఁదను ఈతఁడు గ్రంథములను వ్రాసెను. ఉపనిషత్తులును, షడ్దర్శనములును, వానిపై శంక

రాదిభాష్యములును ధ్వన్యాలోకమును ఒక్క యాచార్యుఁడె వ్రాసియున్న యెడల నాతనికి నెట్టి గౌరవము చేయవలయునో యట్టి గౌరవమునకు ఈ తత్త్వవేత్త తగినవాఁ డని చెప్పిన నతిశయోక్తి కానేరదు.

చరిత్రము.

ఈతఁడు 'స్టాగిరా' అనుచోట క్రీ. పూ. 3౮౪లో జన్మించెను. స్టాగిరా యనునది గ్రీసుదేశ మందలి సముద్ర తీరపుఁ బట్టణము. ఈతని పూర్వులు వైద్యముచేయువారు. ఈతనితండ్రి యైన నికొమెకసు, మెసిడోనియాకు రాజైన అమింటాసు అనురాజునకు వైద్యుఁడు, స్నేహితుఁడు. ఈతఁడు తండ్రియొద్ద వైద్యమును నేర్చియుండవచ్చును. ఈతఁడు ౧౭వ యేట (క్రీ. పూ. 3౬౭లో) సాక్రెటీసు శిష్యుఁడును మహర్షియు నగు ప్లెటోయొద్ద తత్త్వమును అభ్యసించునిమిత్తమై ఏథెన్సు నగరమునకుఁ బోయెను. కాని అప్పు డచ్చట ప్లెటో లేనందున, మూడు సంవత్సరములవఱకుఁ దనంతట తానే విద్యాభివృద్ధి చేసికొనుచు క్రీ. పూ. 3౬3లోప్లెటోరాఁగా నతనికిశిష్యుఁడాయెను. ఇతని కుశాగ్రబుద్ధిచూచి ప్లెటో ఈతనికి తన విద్యాపీఠముయొక్కమూర్తిమంతబుద్ధివైభవ మన్న బిరుదు నొసంగెను. కాని యీతఁడు గతానుగతికుఁడుగాక, గురువుచెప్పినదంతయు నేర్చుకొని, తన యభిప్రాయము లాతనికంటె భిన్నము లయినప్పుడు, గురువుతోడి కూడ వాదించుచుండువాఁడు. ప్లెటో 3౪౭లో మృతి నొందగ ఆతని మేనల్లుఁడైన స్పెసిప్పసు ఆ విద్యాపీఠమునకు నాచార్యుఁడయ్యెను. అంత అరిస్టాటలుఏథెన్సువిడిచి, అటర్నియస్ రాజైన హెర్మియసు నొద్దకుఁ బోయెను. ఈ రాజు కూడ ప్లెటోకు శిష్యుఁడు.

క్రీ. పూ. 3౪౨ లో మెసడోన్ రాజైన ఫిలప్పు తన కుమారుఁడైన అలెగ్జాండరునకు విద్యనేర్పుటకై అరిస్టాటలును పిలిపించెను. తరువాత మహామహుఁడైన అలెగ్జాండ రప్పుడు పదునాల్గు సంవత్సరములవాఁడు. అలెగ్జాండరు రాజైన తరువాత క్రీ. పూ. 33౫ లో ఈతత్త్వవేత్త ఏథెన్సునకుఁ బోయి లిసియమ్ (Lyceum) అను విద్యామందిరమును స్థాపించి పండ్రెండు సంవత్సరముల వఱకు జిజ్ఞాసు లందఱకు నవ్యాహత విద్యాదానము చేసెను. గుంపులుగానుండు చెట్ల క్రింద నిటునటు తిరుగుచు నీతఁడు శాస్త్రపాఠములఁ జెప్పుచుండెను. క్రీ. పూ. 3౨3 లో అలెగ్జాండరు మృతుఁ డయ్యెను. అంత నా పట్టణమందలి యీతని ప్రతిస్పర్ధు లీతనిని బాధపెట్ట నెంచగా, నీతఁడు చాల్సిసుకుఁ బోయెను. అచ్చటనే 3౨౨ లోఁ గీర్తిశేషుఁ డయ్యెను.

గ్రంథములు.

ఈతని గ్రంథములు పెక్కులు కలవు. కాని యీతనివి యనఁబడు గ్రంథము లన్నియు నీతనివియేనా యని సంశయము కలదు. ఈతని గ్రంథములు పెక్కులు టిప్పణిరూపమున నున్నవి. అందుచే నీతఁడు శిష్యులకు బోధచేయు నప్పు డిచ్చిన టిప్పణులే యివియై యుండుననియు, స్వతంత్రపుస్తకరూపమున వ్రాయుటకుఁ బూర్వమే యీ యాచార్యుఁడు శరీరముఁ జాలించినందున, ఆతఁడు యీ శిష్యులకు నేర్పు నిమిత్తమై వ్రాసిన టిప్పణులో, ఆతని

శిష్యులు వ్రాసికొనినవో ఆతని పేరిట వచ్చుచున్నవని కొందఱు పండితుల యభిప్రాయము. అందుచేతనే ఈతని గ్రంథములు కొన్ని పూర్తిగ నుండకపోవుటయు, చెప్పినదే యొకప్పుడు మరలఁ జెప్పఁబడుటయు, ప్రతిజ్ఞచేసిన కొన్ని విషయములను చర్చింపక పోవుటయు, తటస్థించుచున్నది. ఈతనిచే రచింపఁబడిన గ్రంథములన్నియు నీక్రింది యైదు తరగతులుగ విభజింపవచ్చును:—
౧. తర్కశాస్త్రము. (Logic); ౨. పదార్థవిజ్ఞాన శాస్త్రము. (Physics); 3. జీవశాస్త్రము. (Biology) ౪. వేదాంతశాస్త్రము. (Metaphysics); ౫. నీతి, రాజనీతి. (Ethics & Politics); ౬. సాహిత్య శాస్త్రము. (Literature).

౧. ఈతనిచే రచింపఁబడిన గ్రంథములలో తర్కశాస్త్రము ముఖ్యమైనది. పాశ్చాత్యుల యుక్తివాదమునకు మూలాధారము. న్యాయవైశేషికసూత్రములను రచించిన గౌతమ కణాదఋషులతో నీతనిని ఈ విషయమై పోల్చవచ్చును. ఇతఁడీ విషయమై వ్రాసినట్టి ౬ గ్రంథములను జేర్చి తరువాతివారు దీనికి ఆర్గనమ్ (Organum) అనఁగా "కరణము" అని పేరుబెట్టిరి. మన శాస్త్రమందలి లక్షణము చూచినను "అనుమితికరణమనుమానమ్" కావున, అనుమానమును గుఱించి ముఖ్యముగఁ బ్రతిపాదించునట్టి తర్కశాస్త్రమును "కరణ" మనుట సహజమే. ఈ ఆఱు గ్రంథములందును, పదార్థములు, తర్కవాక్యభేదములు, త్ర్యవయవ వాక్యములు, ఊహాలు, హేత్వాభాసములు మొదలయిన నిగమన (Deductive) తర్కమును గుఱించి వివరముగఁ జెప్పఁబడినది. ఈ శాస్త్రమునకు నీతఁడు జనకుఁడని చెప్పవచ్చును.

౨. పదార్థతత్త్వములను గుఱించియు జ్యోతిషమును గుఱించియు నీతఁడు నాల్గుగ్రంథములను వ్రాసెను.

3. జీవశాస్త్రసంబంధమైన యీతని గ్రంథములలో మూడు ముఖ్యమైనవి. అం దొకదానిలో పశువులను గుఱించియు, ఇంకొకదానిలో శరీరమునకును ఆత్మకును గల సంబంధమును గుఱించియు, మూడవదానిలో ఇంద్రియములు, ధారణాశక్తి, స్వప్నములు మొదలగు వానిఁగూర్చియుఁ జెప్పఁబడినది.

౪. వేదాంతమును గుఱించి యితఁడు వ్రాసిన గ్రంథ మొక్కటియె సుప్రసిద్ధము. ఇందుఁ బూర్వపు తత్త్వవేత్తల దర్శనముల చర్చించెను. తరువాత "సత్పదార్థము" (Being) యొక్క కారణములను, దాని తత్త్వములను, ధర్మములను చర్చించెను; ఈ ప్రపంచమును నడపించు ముఖ్యపాలకుఁడు ఈశ్వరుఁడగు నని నిర్ధారించెను.

౫. ఇతఁడు వ్యక్తియొక్క నీతినిగుఱించి, అనఁగా ప్రతిమానవుఁడును నడుచుకొనవలసిన నీతిప్రవర్తనను గుఱించి మూడు గ్రంథములను, కుటుంబనీతినిగుఱించి యొక గ్రంథమును, రాజనీతిని గుఱించి యొక గ్రంథమును వ్రాసెను. అన్నిటియందును ప్రతిమానవుని క్షేమమే సంఘముయొక్క క్షేమముగ నెంచుకొనవలయు నని బోధించెను. రాజప్రభుత్వముగాని సరదారుల ప్రభుత్వముగానీ, ప్రజాప్రభుత్వముగాని, ప్రజలందఱి క్షేమమును ఆలోచించు ప్రభుత్వము మంచిదనియు, ప్రభుత్వము చేతిలోఁ గలవారి క్షేమమును మాత్రము ఆలోచించు ప్రభుత్వము మంచిదికాదనియు నీతని యభిప్రాయము. రాజనీతిని గుఱించిన యీతని గ్రంథము తప్పక చదువఁ దగినది.

౬. సాహిత్యమును గుఱించి యీతఁడు రెండు గ్రంథముల వ్రాసెను. ఒకటి అలంకారశాస్త్రము (Rhetoric) నకు సంబంధించినది, మఱియొకటి కావ్యమీమాంస (Poetics). ఇందు నీతఁడు తన మార్మికత నెక్కుడుగఁ జూపించెను. ఇదియు మన సాహిత్య శాస్త్రములు చదివినవారు తెలిసికొనఁ దగినది.

కో. ల.

## అరిస్టార్కస్.

(క్రీ.పూ. ౨౫౦(౧) స్వామాన్ గ్రామనివాసి. గ్రీసుదేశపు జ్యోతిష్కుఁడు. ఇతఁడు జ్యోతిష విషయక గ్రంథములు పెక్కులు వ్రాసెను. కాని అవన్నియు నశించినవి. సూర్యచంద్రులు భూమియొద్దనుండి యెంత దూరమున నున్నదియు కనుఁగొనుటను గుఱించి వ్రాసిన చిన్నపొత్త

మొకటి గానవచ్చుచున్నది. సూర్యుఁడు తిరుగుట లేదనియు సూర్యునిచుట్టు భూమియే తిరుగుచున్నదనియు చెప్పెనఁట.

(౨) (క్రీ. పూ. ౨౭౦-౧౮౫) సెమ్బ్రాతేన్ గ్రామనివాసి. గ్రీకువాఁడు. లక్షణవేత్త. ఆలంకారికుఁడు. అలెగ్జాండ్రియాలో అరిస్టాఫేనీస్ వద్ద విద్యాభ్యాస మొనరించెను. గురువు తరువాత నీతఁడు అలెగ్జాండ్రియా పుస్తకభాండాగారమునకు అధికారి యయ్యెను. గ్రీకుకవుల కావ్యములను, ముఖ్యముగ హోమరుకవివరుని కావ్యములను విమర్శక బుద్ధితో చదివి చర్చించుటయందే ఇతని జీవితము గడచె నని చెప్పవచ్చును. ఇతఁ డొక వైయ్యాకరణ సంప్రదాయమును ప్రతిష్ఠించెను. ఆ సంప్రదాయమువారికి తరువాతి కాలమున అరిస్టార్కియన్సు అను పేరు వచ్చెను. వృద్ధుఁ డైనతరువాత నచ్చటిరాజు తిన్నగఁ జూడనందున నితఁడు సైప్రసుపట్టణమునకుఁ బోయెను.

## అరిస్టోడీమస్. (Aristodemus)

మెసినాదేశపు పౌరాణికరాజు. స్వాతంత్ర్యమునకై నతఁడు స్పార్టాదేశముతో (క్రీ. పూ. ౭౪౩-౭౨౪) నిరువది సంవత్సరములు పోరాడెను. తనదేశమునకు పారతంత్ర్యము రాకుండఁజేయుటకై దేవతకు నరబలి యీయవలసి వచ్చినప్పుడు తనకూఁతును బలియిచ్చెను. తరువాత నామెసమాధిమీఁద తాను పొడుచుకొని చచ్చెను.

## అరిస్టోమేనిస్.

మెసీనియాదేశపు సేనాధిపుఁడు. క్రీ. శ. ౬౮౫ లో రాజుగ నెన్నుకొనఁబడెను. మెసీనియావారికిని స్పార్టావారికిని జరిగిన రెండవ యుద్ధములో (౬౮౫-౬౬౮) ఈతఁడు మిక్కిలి పౌరుషమును జూపి దేశసంరక్షణము గావించెను. తుదకు ఆర్కేడియా దేశస్థుఁడైన అరిస్టోక్రాటిస్ అన్నవానిచే మోసపోయి పరాభూతుఁడై ౬౬౮ లో రోడ్సుపట్టణమునకు పాఱిపోయె.

## అరిస్టోఫేనిస్.

౧. (Aristophanes క్రీ. పూ. ౪౫౦-3౮౫) గ్రీకుదేశములందలి యొక మహాకవి. ఈతఁడు హాస్యరసపూరితము లైన నాటకములు వ్రాయుటలో మిక్కిలి పేరొందెను. తనకాలమందలి జనులను, ఆచారములను నాటకరూపముగ వెక్కిరించుటలో నీతఁడు గట్టివాఁడు. సరదారులు (Knights) అనునాటకములో డెమాస్థనీసును, మేఘములు (Clouds) అను నాటకములో సాక్రటీసును పరిహాసము చేసెను.

(౨) క్రీ. శ. ౨౬౦-౧౮౫) ఇతఁడు బైజాంటియుం నివాసి. గ్రీకు పండితుఁడు. వైయ్యాకరణి. ఇతఁడు పెక్కు గ్రంథములు రచించెను. అలెగ్జాండ్రియాలోని గ్రంథాలయమునకు అధికారిగ నుండెను.

## అరుంగుళము.

చిత్తూరుజిల్లా కార్వేటినగరము తాలూకాలోని యొక పల్లె.

జనసంఖ్య ౨౦౭౮. మిక్కిలి ప్రసిద్ధమైన జైనదేవాలయ మొకటి యిచ్చటఁ గలదు.

**అరుంధతి.** ౧. స్వాయంభువ మన్వంతరమందలి వసిష్ఠునిభార్య. కర్దమ ప్రజాపతికిని దేవహూతికిని బుట్టిన కూఁతురు. (చూఁడు. ౧. కర్దముఁడు)

౨. వైవస్వతమన్వంతరమందలి మైత్రావరుణి వసిష్ఠునిభార్య. ఈమెతండ్రిపేరు తెలియదు. ఈమెకు నారదుఁడు తోఁడఁబుట్టినవాఁడు. (చూడు. 3 నారదుఁడు) ఈమెకు వసిష్ఠునివలన శక్తి యను పుత్రుఁడు కలిగెను.

3. ప్రాచేతస దక్షునికన్య. ధర్మఋషి యొక్క స్త్రీలలో నొక్కతె. ఈమెకు కకుబ యను నామాంతరము కలదు. ఈమెకు సంకటుఁ డను పుత్రుఁడును కీకటుఁ డను పౌత్రుఁడును ఉండిరి. [భాగ. ౬ స్కం. అ. ౬.]

౪. ఒక నక్షత్రము. సప్తర్షులలోని వసిష్ఠ నక్షత్రమునకు వెనుక నుండును. కనఁబడి కనఁడన ట్లుండును. వివాహకాలమునందు దీనిని వధూవరులకుఁ జూపెదరు.

**అర.** డచ్చి ఈస్టు ఇండీస్‌లోనున్న లంకల సమూహము. వైశాల్యము 3౪౪ చదరపుమైళ్లు. జనసంఖ్య ౨౨౦౦౦. ఇచ్చటిజనులను పాపను లందురు. ఇచ్చట స్వదేశీయులైన రాజులు రాజ్యము చేయుదురు. ఇచ్చట డచ్చి ప్రభుత్వమువారి ప్రతినిధి ఉండును. అచ్చటి జనులు ఎండ్రగుల్లలు, ముత్యపుచిప్పలిచ్చి అందుకు బదులు ఆహారపదార్థములు పుచ్చుకొందురు.

**అరుజుఁడు.** రావణపక్షీయ రాక్షసుఁడు.

**అరుణ.** ౧. కౌరవపాండవుల యుద్ధభూమియైన కురుక్షేత్రమునందలి హిమప్రస్థమను స్థలమునకు సమీపమునం దున్నది. దీనికిసమీపమునందుననే సరస్వతీనదియొక్క సప్తప్రవాహములలోని ఓఘవతీప్రవాహము కలదు. [భార. శల్య. అ. ౫]

౨. ప్లక్షద్వీపమందలి యొకనది.

3. కశ్యపప్రజాపతిభార్యయైన ప్రాథకుఁ బుట్టిన యప్సరసలలో నొకతె.

**అరుణఔపవేసి గౌతముఁడు.** ఉద్దాలకారుణితండ్రి. ఉపవేసుని శిష్యుఁడు. అశ్వపతి యను రాజునొద్దను బ్రహ్మవిద్య నేర్చెను. [తైత్తి సం. ౬. ౧. ౯.]

**అరుణశిఖరము.** హిమాలయము యొక్క యొక శిఖరము. ఇది కైలాసశిఖరమునకు పశ్చిమమున నుండును.

**అరుణాచలము.** దక్షిణఆర్కాటు జిల్లాలోని యొకగుట్ట, క్షేత్రము. దీనినే అఱవవారు తిరువణ్ణామలయ్ అని యందురు. గుట్టక్రింద అరుణాచలేశ్వరుఁడను దేవునిగుడి కలదు. దీనిని తేజోలింగ మందురు. ఇచ్చట కార్తీకమాసమందు గొప్పయుత్సవము జరుగును.

**అరుణాయని.** ఒకబ్రహ్మర్షి. (చూడు 3 అంగీరసుండు.)

**అరుణాశ్వుఁడు.** (సూ.వం.) ఇక్ష్వాకువంశజుఁడు. బర్హిణాశ్వుని రెండవ కొడుకు.

**అరుణాస్పదము.** ఆర్యావర్తమున ప్రరుణానదిమీఁద నుండెడి యొక పట్టణము.

**అరుణి,** బ్రహ్మమానసపుత్త్రుఁడు.
[భాగ. చతు. అ. ౧]

**అరుణుఁడు.** ౧. అనూరుఁడు. సూర్యునిసారథి. కశ్యపునకు వినతకుఁ బుట్టిన వాఁడు. గరుడునకు నన్న. ఈతఁడున్న యండము సీతనితల్లి తొందరపడి పగులఁగొట్టినందున నీతఁడు కాళ్లు లేకయే పుట్టెను. అందుచేఁ దల్లిని 'సవతికి దాసివగు కమ్మ'ని, శపించె. ఈతనిభార్య శ్యేని. సంపాతి జటాయువులు కుమారులు.

౨. ఐదవ రైవతమనువుయొక్క పది మంది పుత్త్రులలో నొక్కఁడు.

౩. గౌతమగోత్రుఁడైన యొక ఋషి. ఇతనికి అరుణి యనియు పేరుగలదు. ఖ్యాతయశుఁడగు ఉద్దాలకారుణిఋషి యితనికుమారుఁడు.

౪. (సూ. వం.) ఇక్ష్వాకు కులోత్పన్నుఁడయిన మొదటి అనరణ్యుని పుత్త్రుఁ డగు హర్యశ్వునకు దృషద్వతి యను స్త్రీయందుఁ గలిగిన పుత్త్రుఁడు. ఇతని కుమారునకు నిబంధనుఁడు లేక త్రిబంధనుఁడు అను పేరు గలదు.

౫. విప్రచిత్తిదానవుని వంశమువాఁడు. గాయత్త్రి జపము మూఁడువేలేండ్లు చేసి మహాబలవంతుఁడై లోకపాలుర వెడలఁగొట్టి దేవతుల మిక్కిలి బాధించెను. అంత దేవగురువగు బృహస్పతి యతనియొద్దకు వెళ్లి "మేము జపించు గాయత్త్రియే నీవు జపించెద" వని చెప్ప, ఈతఁడు దేవతల గాయత్త్రి తనకుఁ బనికిరాదని భ్రమపడి దాని జపించుట వదలి నాశము నొందెను. [దేవీభా. ౧౦. ౧౩.]

౬. శ్రీకృష్ణునిచేఁ జచ్చిన యొక యసురుఁడు (చూఁడు నరకాసురుఁడు)

౭. శ్రీకృష్ణుని ప్రపౌత్త్రుఁడు. మహారథి.

౮. పదునొకండవది యగు ధర్మసావర్ణి మన్వంతరంబునందుఁ బుట్టఁబోవు సప్తర్షులలో నొకఁడు.

**అరుప్పుకోట్టాయ్.** మధురా జిల్లాలోని రామనాథసంస్థానమునందు తిరుచులీ అను తాలూకాకు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౨౩౬౩౩. ఇచ్చటి జనము ౨౦ సంవత్సరములలో రెండింతలు అభివృద్ధియయ్యెను! ఇచ్చట బట్టలనేతయు, రంగువేయుటయు చేయఁబడును.

**అరువ.** గంజాముజిల్లాలోని బరహాంపురము తాలూకాలోని సముద్రపు టొడ్డు గ్రామములలో అరువ లన్న యొక జాతి వారు కలరు. ఇది మహమ్మదీయులకును ఓఢ్రస్త్రీలకును బుట్టిన మిశ్రజాతిగాఁ గానవచ్చుచున్నది.

**అరేబియా.** "అరేబియా" యని పాశ్చాత్యుల వలన వ్యవహరింపఁబడుచున్న దేశమును, స్వదేశస్థులు "అరబ్" అనియు "జజీరతుల్ అరబ్" అనియు పిలుతురు. "జజీరతుల్ అరబ్" అనఁగా "అరబ్ ద్వీపకల్పము" అని యర్థము. "అరబ్" అను శబ్దము, హీబ్రూ భాషలో "ఎడారులు మైదానములు కల దేశము" అను నర్థము కల శబ్దమునుండి వచ్చినది. * పర్షియా (పారసీక) దేశీయులును, టర్కీ దేశీయులును దీనిని "అరబస్తాను" అని వాడెదరు. "స్తాను" అను శబ్దము ఫారసీభాషది కనుక "అరబస్తాను" అను పేరు అరేబియాకు పెట్టినవారు పారసీకులే యై యుందురు.

పేరు

"అరేబియా" ప్రపంచములోనెల్ల పెద్దదగు ద్వీపకల్పము. ఇది ఏషియాఖండము లోని పశ్చిమభాగమున వాయవ్యదిశనుండి ఆగ్నేయదిశన హిందూమహాసముద్రములోనికి ౧౨౼౩౫' 3౪౦౼ ఉ. కును, 3౨౦౼౬౦౦ తూ. కును నడుమ వ్యాపించియున్నది. దీనిపొడవు ఉత్తరము నుండి దక్షిణమునకు సుమారు ౧౮౦౦ మైళ్లు; వెడల్పు తూర్పునుండి పడమరకు సుమారు ౬౦౦ మైళ్లు; వైశాల్యము ౧౨30000 చదరపుమైళ్లు. అనఁగా మన హిందూదేశ వైశాల్యములో ⅔ వంతు. ఈ దేశమున జనపరిగణన సరిగా జరుగదు. కనుక జనసంఖ్య యింత యని చెప్పుటకు వీలు లేదు. అయినను టర్కీ దొరతనమువారు చేయుచుండు మదింపును బట్టి సుమారు ౬౦,౦౦౦౦౦ జనులుందురని చెప్పవచ్చును.

వైశాల్యము

ఈ దేశమునకు ఉత్తరమున టర్కీయును, తూర్పున పారసీక సింధుశాఖయును, దక్షిణమున అరేబియా సముద్రమును, పశ్చిమమున ఎఱ్ఱసముద్రమును కలవు.

ఎల్లలు

అరేబియామధ్యభాగము పీఠభూమి. ఉత్తరదిశయందీ పీఠభూమి సుమారు ౨౫౦౦ అడుగుల యెత్తును, దక్షిణమున ౭౦౦౦ అడుగుల యెత్తును కలదై యున్నది. పీఠభూమికి పడమర వైపునను దక్షిణమునను పర్వతపఙ్క్తులు వ్యాపించియున్నవి. వీనిలో పశ్చిమపర్వతపఙ్క్తి యెత్తు మక్కాపట్టణమునకు దక్షిణమున ౮౫౦౦ అడుగులు. "సువేజు" అఖాతమునకును, అకాబాకును నడుమ నున్న "సినాయి" పర్వతశిఖరము కూడ ప్రసిద్ధమైనది. నౌకల రాకపోకలకుఁ దగినది కాని, సంవత్సరము పొడవునను పాఱునది కాని, యొక నదియైనను లేదు. సరస్సు లంతకు మునుపే లేవు.

పర్వతములు మొ.

ఈ దేశము ప్రపంచమునందలి యత్యుష్ణప్రాంతములలో నొకటి. ముఖ్యముగా ఎడారులలోని యతి శీతలప్రదేశములందుఁ గూడ, ఉష్ణము రాత్రులందు ౧౦౯° కంటె ఎక్కువగను, ఉదయవేళలందు ౧౦౮° నారంభమై

శీతోష్ణస్థితి

* History of Arabia by Crichton Vol. I. 189

పగటివేళ ౧౧౦°కంటెను మించుచుండును.*
ఆకాశము సాధారణముగా మేఘరహితమై
యుండును. సూర్యకిరణముల మూలమున
పగలంతయు కాగియుండు ఇసుకసంగతి చెప్ప
వలసిన పనిలేదు. చలికాలమునందు కొన్ని
వేళల అతి శీతవాయువు వీచుచుండుటయు
కలదు. ఈ దేశము ఏషియాఖండమునందలి
వర్షములేని భాగములోనిదే యైనను, దీనిలో
నడిమిభాగమున చలికాలములో వర్షములు
కురియుచునే యుండును. పర్వతముల
పైనుండి క్రిందికిఁ బాఱు ప్రవాహజలము
ఉష్ణాతిశయముచే నెండియుండిన నేలపైఁ బడి
ఎక్కడిదక్కడనే యినికిపోవును. మొత్తము
మీఁద ఇచ్చటి శీతోష్ణస్థితి ఆఫ్రికాఖండపు
దానివంటిది. మన దేశమునం దెండకాల
ముండు దినములలో ఈదేశమున కొలఁది
కాలమువఱకు స్వల్పముగా వాన కురియును.
పశ్చిమ, దక్షిణములందలి పర్వతపఙ్క్తుల
కును సముద్రమునకును నడుమ నున్న సన్నని
పొడవుపాటి భూభాగములలో కొన్ని ప్రదేశ
ములు సారవంతములు. ఈ దేశమునందలి
మొత్తము భూమిలో ⅓ ఫలవంతముగను
⅔ ఎడారిగను ఉన్నది.

"సైమూము" లేక "సామియెలు" అనఁ
బడు విషవాయు వొకటి ఉత్తరప్రాంతమున
అప్పుడప్పుడు వీచుచుండును. ఈగాలి తోలు
నప్పుడు ఎడారులలోని యిసుక పైకెగసి
మేఘములవలె మింట సంచరించును. అట్టి
సమయములలో క్రిందఁబోవుచుండు మను
ష్యుల యొక్కయు పశ్వాదుల యొక్కయు
ప్రాణములు దక్కుట అసంభవము. అయి
నను, దీని దుష్పరిణామమును దప్పించు
కొనుటకు బాటసారులు గాలి యారంభము
కాఁగానే నేలమీఁద బోరగిల పరుండెదరు.
పశ్వాదులును ముఖములను యిసుకలోనికి
దూర్చుకొని కొంతసేపు అట్టె పడియుండును.
గాలి యాగిపోయిన తరువాత మెల్లఁగా లేచి
ప్రయాణము చేయవలసి యుండును.

అరేబియా దేశీయులు "అరబులు" అనఁ
బడుదురు. వీరు ఎక్కువపొడవుగగాని పొట్టి
గగాని యుండక మధ్యదశయం

జనులు

దుందురు. వీరికి మంచికండబల
ముండును. ముఖము గోధుమవర్ణము కలది.
వీరు చుఱుకుఁదనము, స్వతంత్రస్వభావము
కలవారు. ధైర్యము, మితవ్యయజీవనము,
విశ్వాసపాత్రత, అతిథిగౌరవము, వీరిసుగుణ
ములు. అయినను, వీరిపగ చాలతీవ్రమైనది.
పగవాని బాధించుట కెట్టికార్యమునైనఁ
జేయుదురు. కుటుంబములోని స్త్రీలు గృహ
కృత్యములను నెఱవేర్చుటయే కాక తమబిడ్డ
లకు చదువుచెప్పికొనుచుఁ గూడ నుండెదరు.

అరబులలో కొందఱు "హదేసీలు" (స్థిరా
వాసముకలవారు) మఱికొందఱు "బదువీలు"
(దేశద్రిమ్మరులు). ఈ రెండవ తరగతివారు
ఒక చోట నుండక ఎండకాలములోను చలి
కాలములోను, తమ మందలతో అటునిటు
తిరుగుచుందురు. మొదటఁ జెప్పఁబడిన వారి
కంటె తమ జీవనవిధానము శ్రేష్ఠతర మైన
దని వీరితలంపు. ఆస్తిని గుఱించియు, ఇతర

* History of Arabia by Crichton Vol. I.

విషయములను గుఱించియు వీరికి స్థిరనియమములు లేవు. వారిలో వారికి కలుగు వివాదములను కులపుపెద్దలు పూర్వాచారము ననుసరించి పరిష్కరించుచుందురు. వీరు మొదటి తరగతి వారిని తక్కువగాఁ జూతురు కనుక వారితో సంబంధబాంధవ్యములు చేయరు. పశువుల మందలవలనను దోపిడి మూలమునను వీరు జీవింతురు. మొదటి తరగతివారు సహజముగనే వీరికంటె నెక్కువ నాగరకత కలవారు; సంఖ్యకూడ మొదటితరగతివారిదే హెచ్చు; వర్తకవ్యాపారములం దాసక్తి కలవారు; ఉద్యోగప్రియులు.

అరబుల జాతులు రెండు: ఉత్తరార్థవాసులు "ఇష్మామెలి" లనియు, దక్షిణార్థవాసులు "కహతానీ"లనియు చెప్పఁబడుదురు. ఈ రెండవజాతి సాంకర్యములేని ఉత్తమజాతి యని అరబుల యభిప్రాయము. వీ రారంభమున ఆఫ్రికానుండి వచ్చి, అక్కాలమున అరేబియాయందెల్ల నాగరకస్థితియందుండిన "యమను" ప్రాంతమున కాపురముండిరి. చరిత్రారంభమునకు పూర్వము వారు "యమను" నుండి వెడలి "ఉమ్మాను"వైపునకును మధ్యారేబియాకును పోయి ఆయా ప్రాంతములందు వసించిరి.

అరేబియాయందు "అరబీ" భాష వాడుకయందున్నది. "హిబ్రూ" భాషవలెనే ఇదియు

భాష

సెమిటికు భాషాకుటుంబమునకుఁ జెందినది. కనుక కుడినుండి ఎడమకు వ్రాయఁబడును. అరబీలిపి పురాతన సిరియాలిపియొక్క యనుకరణమై యున్నట్లు తోచుచున్నది. ఇది యించుమించుగా మహమ్మదుకాలమున (ఏడవ శతాబ్దమున) నీదేశమున క్రైస్తవ మతాచార్యుల మూలమున ప్రవేశించియుండును. "అరబీ" లిపియొక్క అతి పురాతనస్వరూపమునకు "కూఫీ" యని పేరు. యూఫ్రటీసునదీతీరముననున్న "కూఫా"

లిపి

నగరమును బట్టి ఈపేరు వచ్చినది. మహమ్మదీయ మతగ్రంథమగు "ఖురాను" మొట్టమొదట లిఖితరూపమునకు వచ్చిన దిచ్చటనే. "కూఫీ" యక్షరములు చాల వికృతాకారము కలిగియుండును. అంతేకాక, అరబీలోని ౨౮ హల్లులలో ౧౬కి మాత్రమే ఈలిపియందు ప్రత్యేక చిహ్నములు కలవు. ఈ లిపి దాదాపు 300 సంవత్సరములవఱకు వాడుకలో నుండినది. అటుపిమ్మటకూడ కొంత కాలమువఱకు నాణెములమీఁదను, శాసనములలోను, ఈ యక్షరము లుపయోగింపఁబడుచుండెను. అయినను, పదియవ శతాబ్దమునాటికి దీని ప్రచారము తగ్గి, "ఇబ్నె మొక్లా" * యను వానిచే ప్రవేశపెట్టఁబడిన "నస్ఖీ" లిపికి దారి యొసఁగెను. ఈరెండవ లిపియే మహమ్మదీయ మత మవలంబించిన వివిధదేశములందును వాడుకయందున్నది. హల్లులధ్వనులు వానివెంటనుండు చుక్కలనుబట్టి మారుచుండును.

* "ఇబ్న్" అనగా కుమారుఁడని యర్థము. అరబులు తమ పేరుతోపాటు ఫలానివాని కొడుకనికూడ చెప్పుకొందురు. ఉదా: అహమద్ ఇబ్నమహమూదు అనఁగా మహమూదుని కొడుకైన అహమదు అని యర్థము. మనము "మాదయగారి మల్లన" యన్నట్లు.

తెలుఁగునందు "తలకట్టు", "గుడి", కొమ్ములకు మాఱుగా అరబీభాషయందు, వేఱువేఱు గుర్తు లున్నవి. ఇవి ఆయా హల్లులకు పైన నో క్రిందనో వ్రాసెదరు. ప్రపంచమున "అరబీ" భాష మాట్లాడువారి సంఖ్య ౭౦౦౦౦౦౦౦ *

అరబులమతము "ఇస్లాము". వీరు ముఖ్యముగా "సున్నీ" శాఖకు చెందినవారు. ఈ మతమును స్థాపించిన మహమ్మదు, ఈదేశములోని "మక్కా" పట్టణమున జనన మొంది, "మదీనా" పట్టణమందు సిద్ధిపొందెను. కనుకనే ఈదేశము, ముఖ్యముగా "హెజ్జాజు" అను ప్రాంతము, మహమ్మదీయ ప్రపంచమున కంతటికిని పవిత్రస్థానమై, ప్రతిసంవత్సరము సుమారు ౧౭౫౦౦౦౦౦ యాత్రికుల నాకర్షించుచున్నది. §

మతము

దేశవిభాగములు: (౧) సినాయి ద్వీపకల్పము; ఇది సువేజు అఖాతమునకును, అకాబాకును నడుమనున్నది. (౨) "హెజ్జాజు" (ఆటంకమని యర్థము); ఇది ఎఱ్ఱసముద్రమునకు, తూర్పున ఉత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించియున్న భూభాగము. (3) యమను; ఇది హెజ్జాజునకు దక్షిణమున ఎఱ్ఱసముద్రమునకు తూర్పున నున్నది. (౪) "హద్రమౌతు" అనునది దక్షిణ తీరము పొడవున వ్యాపించియున్నది. (౫) ఉమ్మాను; ఇది ఆగ్నేయమూలన నున్నది. ఇంగ్లాండు, వేల్సు రెండును కలసిన నెంతయగునో అంత వైశాల్యము కలది. (౬) "అల్హాసా; ఇది పారసీకసింధుశాఖనంటి తూర్పువైపున నున్నది. (౭) "అల్ నెజ్జ్" అనునది. ఇది అరేబియాదేశపు మధ్యప్రాంతము.

విభాగములు

ఈభాగములు కాక ఇంగ్లీషువారి రక్షణమునందున్న ఏడను ప్రాంత మొకటి కూడ కలదు. కొందఱు, పైవానిలో మొదటిదగు "సినాయి" ద్వీపకల్పమును అరేబియా భాగముగాఁ దీసికొనక, టైగ్రిసు యూఫ్రటీసునదులు కల "ఇరాఖ్" అనుభాగమును ఈదేశములోని యొకప్రాంతముగాఁ జెప్పియున్నారు.

"అల్ నెజ్జ్" లోని యుత్తరభాగమునందలి యెడారి కొన్ని తావులందు శిలలతోను మఱి కొన్నిచోట్ల భగ్గుభగ్గున మండు ఇసుకతోను నిండియున్నది. ఈ యెడారియందు జలాశయములతోఁ గూడియున్న తరుస్థానములు (Oases) విసిరివేసినట్టు అచ్చటచ్చటఁ గానఁబడును. అట్టి స్థలములందు వర్తకసంఘములును, యాత్రికుల సమూహములును మకాములు చేయుచుఁ బోవుచుండును. "జౌఫ్" అను తరుస్థానము ౭౦మైళ్లు పొడవు ౧౦మైళ్లు వెడల్పు కలది. అచ్చట ౪౦౦౦౦ స్థిరావాసము కలవా రున్నారు. అరేబియాదేశపు ముఖ్యమగు నెడారి "దహ్నా" యనునది "అల్ నెజ్జ్" కు దక్షిణ భాగమం

ఎడారులు తరుస్థానములు

* "Arabia—the cradle of Islam" by Rev. S. M. Zwemer.

§ "Arabia—the cradle of Islam" by Rev. S. M. Zwemer.

దున్నది. దీనియందు ఇసుకతప్ప మఱేమియు లేదు.

పైని జెప్పఁబడినవానిలో (౧) హెజ్జాజు (౨) యమను (3) అల్ హాసా యనునవి టర్కీ ప్రభుత్వమునకు లోఁబడినవి. సినాయి ద్వీపకల్పము ఈజిప్టు వారిది. ఏడను ఇంగ్లీషువారి దగుటచే "హాద్రమాత్" అను ప్రాంతమున వారి ప్రభావమే సాగుచున్నది. "ఉమ్మాను" ప్రాంతపు సుల్తాను స్వతంత్రుఁడు; ఇంగ్లీషువారితో మైత్రి ననుభవించుచున్నాఁడు. "అల్ నెజ్జ్" ప్రాంతము స్వతంత్రము కలది.

**ప్రభుత్వము**

ఇచ్చటి పరిపాలనాపద్ధతి కులపతి సత్తాకము (Patriarchal). కులపతులకు "అమీరు" "షైకు" "ఇమాము" అను బిరుదు లుండును. యుద్ధకాలమున సేనల నడిపించుట, పన్నులు విధించుట, న్యాయవిచారణ చేయుట వీరి కర్తవ్యములు. జనులు స్వతంత్ర స్వభావము కలవా రగుటచేత కులపతుల సర్వాధికారము అంతగా సాగదు. అయినను పూర్వకాలమున నేమి, ఇప్పుడేమి నిరంకుశ ప్రభుత్వముకూడ జరుగుచునే యున్నది.

**కృషి వాణిజ్యములు**

అరేబియా పరిశ్రమాభివృద్ధికి అనుకూలమైనదేశము కాదు. పూర్వకాలమందు వీరు వర్తకమున ప్రఖ్యాతిగాంచినవారే; కాని ఇప్పుడు వీరి వర్తక మనఁగా ఇతర దేశములనుండి సరకులను దెప్పించి వానిని వేఱు దేశములకుఁ బంపుట, వానిలో తమ దేశమునకుఁ గావలసిన సరకుల నుంచుకొనుటమై యున్నది. ఈ దేశమునుండి పరదేశములకుఁ బోవు ఎగుమతులలో కాఫీ ఖర్జూర ఫలములు, అంజూరపండ్లు ముఖ్యమైనవి. సారవంతములగు భాగములలో గోధుమలు, యవలు, ఖర్జూరములు, పొగాకు, నీలిమందు, ప్రత్తి, చెఱకు, కాఫీ, కొన్ని సువాసన ద్రవ్యములు, పండును. అరేబియాయందు పెద్దయడవులు లేవు. కాని పుంచి పచ్చిక బయళ్లు మాత్ర మున్నవి.

**జంతువులు ధాతువులు**

ఆఫ్రికాయందుండు జంతువులే ఈ దేశమందును కానవచ్చుచున్నవి. గొఱ్ఱెలు, మేకలు, ఎద్దులు, ఒంటెలు, గుఱ్ఱములు స్థిరావాసులగు వారివద్ద విస్తారముగాఁ గలవు. దేశద్రిమ్మరులవద్ద నెద్దులుండవు. తరుస్థానము లందు నిప్పుకోళ్లు, ఎడారులందు సింహములు, చిఱుతపులులు, నక్కలు కలవు. కోతులు మిడతలు ఉన్నవి. ఇచ్చటి గుఱ్ఱముల శ్రేష్ఠత సుప్రసిద్ధము. ఒంటె ఈదేశమున మిగుల సామాన్యమైన జంతువు. దీనిని "ఎడారి యోడ" యందురు. పురాతనకాలపు ఇజిప్టు దేశ చిత్రలేఖనములలో ఒంటె కానరాదు. కనుక ఇది ఆఫ్రికాజంతువు కాదనియు, దీని జన్మదేశము అరేబియాయే అయియుండు ననియు తోఁచుచున్నది. ఇనుము, రాగి, సీసము, బొగ్గు, పచ్చలుఇచ్చటి ముఖ్యధాతు పదార్థములు. పారసీక సింధు శాఖలోని "బహరను" ద్వీపసమీపమున ముత్తెములు దొరకును. కనుక ఈప్రాంతమున "అంద

ఱును ముత్యము అను ఒక యజమానునకే దాసులై యున్నారు.

యాత్రికుల సౌకర్యముకొఱకు "దమిష్కు" (Damascus) నుండి మదీనాపట్టణము వఱకు

రైలు — అయోమార్గ మొకటి నిర్మింపఁబడియున్నది. ముందిది మదీనా నుండి మక్కాకు వచ్చునని తెలియుచున్నది.

విద్య విశేషముగానింటఁ గఱపఁబడునదే. వ్రాఁత, చదువు, చరిత్ర, వ్యాకరణము, కావ్య

విద్య — ములు బాలుర కింట నేర్పుదురు. ప్రభుత్వమువారి యున్నత పాఠశాలలలో వ్రాఁత, వ్యాకరణము, ఛందస్సు మాత్రము చెప్పఁబడుచున్నది.

అతిపురాతన కాలపు అరబు వాఙ్మయమును గూర్చి సంగతులేమియు తెలియవు.

వాఙ్మయము — మహమ్మదునకు పూర్వము అరేబియాలో ప్రసిద్ధకవు లుండిరని మాత్రము తెలియుచున్నది. ఈకవులు తమ దేశపు వేర్వేరు తెగల వారికి జరిగిన కలహములను, శూరుల కథలను, స్త్రీల సౌందర్యమును, కవితారూపమున వర్ణించుచుండిరి. "మక్కా" "బఖదు" పట్టణములందు గొప్ప సమావేశము లగుచుండెను. ఆ సందర్భములందు వీరు పోటీలుపడి పద్యవృష్టిని గురిపించుచుండిరి. వానిలో శ్రేష్ఠములైనవానిని బంగారపు అక్షరములలోఁ జెక్కి మక్కా పట్టణములోని "కాబా" యనుచోట వ్రేలాడఁ గట్టుచుండిరి. వీనికి "ముల్లాకాతు" అనంగా వ్రేలాడఁగట్టఁబడినది యని పేరుం డెను. ఆకాలపు కవులలో 'నాబెఘా' * అనువాఁడు, మఱి కొందఱును గొప్ప ప్రసిద్ధిఁ గాంచి యున్నారు. "కఅబ్ బిన్ జొహారు" అను కవి మహమ్మదునకు సమకాలీనుఁడు. ఇతఁడు మహమ్మదు కీర్తిని గానము చేసి యున్నాఁడు.

మహమ్మదు తరువాతికాలమున అరబీ వాఙ్మయము వికాసము నొందసాగెను. మహమ్మదీయుల దండయాత్రలారంభమైన పిమ్మట ౮౦ సంవత్సరముల కాలములో వారిరాజ్యము ఈజిప్టునుండి హిందూదేశమువఱకును, లిస్బనునుండి సమర్కందు పర్యంతమును, వ్యాపించెను; కాని ఆ కాలమున వారు కేవల రాజ్యకాంక్షయే ప్రధానముగా గల వారగుటచేత వాఙ్మయాభివృద్ధి కవకాశము లభింపలేదు. తరువాత వారు వృద్ధిమార్గము నవలంబించిరి. అబ్బాసీవంశపు ఖలీఫాలకాలములో వాఙ్మయాభివృద్ధియు శాస్త్రాభివృద్ధియు నారంభమయ్యెను (క్రీ. శ. ౭౫౦). ఆ యభివృద్ధి ఖలీఫాల పరిపాలనము అంతమొందునప్పటికి (క్రీ. శ. ౧౨౫౮) క్షీణమార్గమును ద్రొక్క మొదలు పెట్టెను. అల్మన్సూరు (క్రీ. శ. ౭౫౦), హారూనుల్ రషీదు (క్రీ. శ. ౭౮౬—౮౦౯) అను ఖలీఫాలు వాఙ్మయమును కళలను బోషించిరి. వారు దూరదూరములనుండి విద్వాంసుల రావించి, వారిచేత గ్రీకు, సిరియను పురాతన పారసీక భాషలలోని యుద్గ్రంథములను అనువాదిం

* ఈతనిరచనలను డిసేసీ అనునాతఁడు Chrestomathic Arabe లో ప్రకటించియున్నాఁడు.

పించి వాని ప్రతు లనేకములు వ్రాయించి దేశమున వ్యాపింపఁజేసిరి. అల్మామూను అను ఖలీఫా (క్రీ. శ. ౮౧3—౮33) తనకు విజ్ఞానము గఱపుటకై "లియో" అను తత్త్వశాస్త్రజ్ఞుని కొంతకాలము తనవద్ద నుంచుటకు ప్రతిఫలముగా గ్రీసుదేశచక్రవర్తికి గిటన్నుల బంగారము నిచ్చుటయే కాక అతనితో నెల్లకాలమును స్నేహభావము కలిగి యుండుననియొక సంధిపత్ర మాతనికి వ్రాసియిచ్చెను! ఈ ఖలీఫా కాలముననే "బగ్దాదు", "బస్రా", "బొఖారా", "కూఫా" మున్నగు పట్టణములందు అత్యుత్తమము లగు విద్యాలయములు స్థాపితము లయ్యెను. అలెగ్జాండ్రా, కైరో, బగ్దాదుపట్టణములలో మంచి పుస్తకాలయము లేర్పడెను. పదవశతాబ్దమున అరబులు సాధారణముగా ఎల్లెడలను విజ్ఞానప్రసారకులుగా ప్రసిద్ధి సంపాదించిరి. ఆ కాలమున ఐరోపాయందు గాఢమగు నజ్ఞానము వ్యాపించి యుండెను. ఇటలీదేశమందు మహావిద్వాంసుఁడని ప్రసిద్ధిఁగాంచిన పోపు, రెండవ సిల్వెస్టరు (మరణము క్రీ. శ. ౧౦౦3) అనువాఁడు గడించిన విజ్ఞానము "కార్డోవా"పట్టణమందు అరబులవద్ద నార్జించినదే. ఫ్రాన్సునుండియు, ఇతర ఐరోపారాష్ట్రములనుండియు విద్యార్థులు గుంపులు గుంపులుగా స్పెయినుదేశమునకుఁ బోయి, అరబులవద్ద గణితశాస్త్రము వైద్యశాస్త్రము నభ్యసించుచుండిరి. స్పెయినుదేశపు రాజగు రెండవ హాకీము అనువాని (మరణము క్రీ. శ. ౯౭౭) గ్రంథాలయమున ౬౦౦౦౦౦ కంటె నెక్కువ సంపుటము లుండెనని చెప్పుదురు!

అరబులకు శాస్త్రాభ్యాసమున ఆసక్తి విస్తారముగా నుండెను. అరబీశబ్దము లగు "అల్కొహాలు," "ఆల్జెబ్రా," "అజీమతు," "జెనితు" మున్నగు శబ్దము లెన్నియో పాశ్చాత్య ప్రకృతిశాస్త్రములందు వాడఁబడుచు ఐరోపీయవిజ్ఞానమునకు అరబులు చేసిన సహాయమును జాటుచున్నవి. భూగోళశాస్త్రమును వారు వృద్ధిచేసిరి. పలువురు అరబుప్రవాసకులు తమ యాత్రాచరిత్రములను వ్రాసిరి.

మహమ్మదునకు పూర్వపు చరిత్రాంశములను తెలిసికొనుటకు అరబులు ప్రయత్నింపలేదు. కాని తరువాతికాలపు ప్రపంచచరిత్రను వారు శ్రద్ధతోఁ దెలిసికొనుచుండిరి. చరిత్రగ్రంథము లెన్నియో వ్రాయఁబడినవి. వానిలో ననేకములను పాశ్చాత్యులు పరిశోధించి తమభాషలలోని కనువాదించుకొని యున్నారు.

అరబుల ధర్మశాస్త్రము, వేదాంతశాస్త్రము ఆరంభమున ఖురానులోని సిద్ధాంతముల పైన నాధారపడియుండెను. అరిస్టాటిలుని తత్త్వశాస్త్రమును పఠించిన తరువాత, వారు ఖురానులోని సూత్రముల నన్వయించుటలో భిన్నాభిప్రాయ లగుటవలననే ఇస్లాములో (౧) హానఫీ (౨) షాఫఈ (3) మాలికీ (౪) హంబలీ అను నాల్గు శాఖ లేర్పడెను.

అరేబియావారిని విశేషముగా నాకర్షించిన తత్త్వశాస్త్రము అరిస్టాటలుసిది. దీనిని వారు స్పెయినుదేశమున అరబీ భాషలోని కనువాదించిరి. అటుపిమ్మట నది అరబీనుండి

లాటిను భాషలోనికి మారి ఐరోపాలోని పశ్చిమరాష్ట్రములం దంతటను వ్యాపించెను. అరబు తాత్త్వికులలో ననేకులు వైద్యులుగా కూడ నుండిరి. అందువలననే కాబోలు ఆ భాషయందు "హకీము" అనుశబ్దము వైద్యునకును తత్త్వజ్ఞునకును వర్తించుచున్నది. అతి పురాతనకాలమున హిందువులు సంగ్రహించి యుండిన వైద్యశాస్త్ర రహస్యములను మొట్టమొదట వారివలనఁ దెలిసికొనిన పరదేశీయులు అరబులే. మహమ్మదీయ సామ్రాజ్యములోని ముఖ్య నగరములలో వైద్యవిద్యాలయములు, తత్త్వశాస్త్ర పాఠశాలలు నెలకొల్పఁబడెను. ఎనిమిదవ శతాబ్దమునుండి పదునొకండవ శతాబ్దమువఱకు వారు మంచి జ్ఞానము నార్జించిరి. చనిపోయిన వాని ప్రాణములు పూర్తిగా శరీరమును వదలక ఎదురురొమ్ములో నుండును, "మున్కిరునకీరు" § లను దేవదూతలకు ఆ ప్రాణములవలననే మృతకుఁడు ప్రత్యుత్తరముల నియ్యవలసినవాఁడై యుండును. కనుక శవములను కోయఁగూడదని మహమ్మదు శాసించి యుండుటవలన ఒక అస్థిపంజరశాస్త్రము (Anatomy) ను మాత్రము వారు వదలు కొనవలసిన వారైరి.

గణితశాస్త్రమున, అరబులు, హిందువుల వద్ద, అంకెలను వ్రాయుట చదువుట మున్నగు వానిని, త్రికోణమితి, బీజగణితములోని యనేకాంశములను నేర్చుకొనిరి. "హిందువులగణితశాస్త్రము," "హిందువులు లెక్కించు పద్ధతి" యను పేళ్లుగల అరబీగ్రంథములు పై యంశమునకు సాక్ష్య మిచ్చుచున్నవి.* రసాయన, జ్యోతిశ్శాస్త్రములనుకూడ వారు వృద్ధిచేసికొనిరి. టాలమీకృతమగు జ్యోతిశ్శాస్త్రమును వారు క్రీ. శ. ౮౨౭ వ సంవత్సరముననే అరబీలోనికనువదించుకొనిరి.

కావ్యములలో నన్నివిధములైనవి అరబీలో నుత్పత్తియయ్యెను. ఫ్రాన్సు ఇటలీ దేశములలో మధ్యమయుగమునందు పొడచూపిన వాఙ్మయాభివృద్ధికి అరబులే కారకులని చెప్పవలసి యున్నది. మహమ్మదు నాటకములు వలదని విధించుటచేత వారు దృశ్యకావ్యములజోలికి మాత్రము పోలేదు.

అయినను, అప్పటి అరబుల విద్యాప్రియత్వమునకును, ఇప్పటి యజ్ఞానమునకును సంబంధమే లేదు. వాఙ్మయమునందు యోగ్యమగు నభివృద్ధి కానరాదు. ఇటీవల కొందఱు నవీన పద్ధతులపైన వాఙ్మయరచనకుఁ గడంగుచున్నారు.

అరబీభాషాశబ్దము లనేకములు ఇతరభాషలలో దూరినవి. తుర్కీభాషలోను మలేభాషలోను వాని లక్షణములు స్పష్టముగాగలవు. పారసీభాషలోని నాల్గుశబ్దములలో నొకటియు, ఉర్దూభాషలోని అయిదుశబ్దములలో నొకటియు, అరబీది.

§ మృతకళేబరములను భూస్థాపితముచేసినపిమ్మట వీరు వచ్చి, శవమును 'నీ వే దేవుని నమ్మెదవు? నీ పైగంబ రెవరు?' మున్నగు ప్రశ్నలు చేసెదరని మహమ్మదీయుల మతవిశ్వాసము.

* "Arabia—the Cradle of Islam" by Rev. S. M. Zwemer.

మహుమ్మదునకు పూర్వపు అరేబియా చరిత్ర యంతగా తెలియదు. క్రీ. పూ. ౨౪ వ సంవత్సరమున రోమను చక్రవర్తియగు అగస్టసు క్రింద ఈజిప్టును పాలించుచుండిన ఈలియసుగ్యాలసు అనువాఁడు "యమను" ప్రాంతముపై దండెత్తి యోడిపోయెను. 'ట్రాజను' అనువాఁడు (క్రీ. శ. ౧౦౬) ఈదేశపు టుత్తరభాగములలోఁ గొన్నిఁటిని వశముచేసికొనెను. కాని వాని మరణానంతర మవి మరల స్వదేశీయుల పాలయ్యెను. పారసీకు లప్పుడప్పుడు సరిహద్దు ప్రాంతములపైన నెత్తివచ్చుచుండిరి. నాల్గవ శతాబ్దమున అబిసీనియనులు "యమను" ప్రాంతమును స్వాధీనపఱచుకొని కొంతకాలము పాలించిరి. క్రీ. శ. ౫౭౫ వ సంవత్సరమున రెండవమారు గొప్ప అబిసీని యను సైన్యము 'యమను'ను జయించి ౭౬ సంవత్సరముల కాలను దానిని తమ చేతిలో నుంచుకొనెను. కాని, పారసీకులుగాని, ఈజిప్టీయులుగాని, రోమనులుగాని "హెజ్జాజు"ను చొఱఁజాలరైరి. ఈ కాలమున 'బదువీ' లనఁబడు అరబు లెట్టి స్థితియందున్నారో ఆ కాలమున అరబు లంద ఱట్టి స్థితియందుండిరి. వారు గుడారములలో నివసించుచు, మందల వెంటఁ గొని పచ్చిక బయళ్లు కల తావులకుఁ బోవుచు, ధాన్యమునకు బదులుగా గొఱ్ఱెలను విక్రయించుకొనుచు జీవించుచుండిరి. వారి యైశ్వర్యమనఁగా ఒంటెలు, గుఱ్ఱములు, గొఱ్ఱెలు, బానిసలు. సరియైన ప్రభుత్వము లేదు. ముక్కుఁ గోసిన వాని ముక్కు మరలఁ గోయుటయు, వ్రేలు నఱికినవాని వ్రేలు మరల నఱకుటయు అప్పటి శిక్షావిధానము. జూదము పానము సామాన్యములు. బహుభార్యాత్వము, భార్యలను ఇష్టమువచ్చినట్టు విసర్జించుట, ఆఁడు పిల్లలను పుట్టఁగానే ప్రాణములతో భూస్థాపనము చేయుట మున్నగు నాచారములు వారియందుండెను. "అందఱికంటెను మంచియల్లుఁడు సమాధియే" యని వారిలో నొక సామెత యుండెను. వారిలోని యంతఃకలహములకు మితమే లేదు. "మక్కా", "బఖద్" పట్టణములందు సంవత్సరమున కొకసారి వారు పోటీల మూలమున తమ దేహబలమును ప్రదర్శించుచుండిరి. అందువలన వేర్వేఱు తెగలలో తఱచుగా కలహములు వృద్ధియగుచుండినవి. ఇట్టి కలహముల నడఁపఁ దలఁచి మహుమ్మదీసమావేశములను నిషేధించెను. మక్కా పట్టణములోనున్న అతి పురాతనకాలపు "కాబా" యను నాలయమున ప్రతి తెగవారును తమ దేవతావిగ్రహములనుంచి పూజించుచుండిరి. మహుమ్మదుకాలమున నిట్టి విగ్రహము లచట ౩౬౦ యుండెను.* ఈ "కాబా" దేవాలయమునకు అయిదవ శతాబ్దమున "ఖురేషి" వంశమువారు అధిపతులైరి. "కాబా" ఆధిపత్య మాకాలములో చాల లాభప్రదముగా నుండెడిది. విగ్రహారాధనము, దయ్యములపూజలు హెచ్చి "అల్లా" ప్రభావము అడఁగిపోయెను. "జెరూసలేము"

దేశచరిత్ర

* Rise & Fall of Islam (Urdu) by Altaff Hussain కొందఱు ౩౬౫ ఉండెనందురు.

నాశన మైన పిమ్మట యూదు లనేకులు అరేబియాకు వచ్చి వసించినందున యూద మతము, నాల్గవశతాబ్దమున అబిస్సీనియనుల వెంట వచ్చిన క్రైస్తవమతము, ఈదేశమునఁ బ్రవేశించెను. పైనిచెప్పిన "ఖురేషు" వంశ మున క్రీ. శ. ౫౭౧ సంవత్సరమున మహ మ్మదు జన్మించెను. అరేబియాకు మొట్ట మొదట ఏనుఁగులు వచ్చిన సంవత్సర మగు టచే దీనిని "ఏనుఁగు సంవత్సర" మందురు. మహమ్మదు, వెనుకఁ జెప్పియున్న రెండు మతములలోని గుణములను గ్రహించి, దోష ములను త్యజించి - తన వివేకము నుపయో గించి క్రొత్తమతమును కల్పించి దాని మూల మున అరబులకు వృద్ధిమార్గమును జూపెను. క్రీ.శ. ౬౨౨ వ సంవత్సరమున మహమ్మదు మదీనాకు పాఱిపోయెను. హిజ్రీశకమున కావత్సరమే యారంభము. అది యట్లుండె. ఈ క్రొత్త మతప్రభావమువలన అరబులు ఐకమత్యమహత్త్వమును గ్రహించి ఆకాలపు ప్రపంచములోని ⅓ భాగములో, అనఁగా పాలస్తీను, మెసపొటేమియా, పారసీకము, ఈజిప్టు,ఉత్తర ఆఫ్రికా, స్పెయిను దేశములలో రాజ్యములను స్థాపించిరి. కాని పరదేశ ము లెన్ని జయించినను అసలు అరేబియా దశ యంతగా మారలేదు. అజ్ఞానము కుల పతుల దౌర్జన్యము తీవ్రముగా వ్యాపించి యుండెను. ఖలీఫాల యాధిపత్యము అంత మొందిన పిమ్మట అరేబియా యనేక స్వతం త్రరాష్ట్రములుగాఁ జీలెను. పదునాఱవ శతాబ్దమున టర్కీవారు "యమను" ప్రాంత మును వశపఱచుకొనిరి. కాని పదునేడవ శతాబ్దమున తఱిమివేయఁబడిరి. పదునాఱు, పదునేడవ శతాబ్దములలో "ఉమ్మాను" ప్రాంతము పోర్చుగీసువారి స్వాధీనమందును, తరువాత డచ్చువారివశమునందును, పిమ్మట పారసీకుల యాధిపత్యమునందును ఉండెను. ఈతుదివారిని "అహమద్ ఇబ్న సఉదు" అను స్వదేశస్థుఁడు క్రీ. శ. ౧౭౪౯ లో వెడలఁ గొట్టి "సుల్తాను" అయ్యెను. క్రీ.శ. ౧౭౬౦ ప్రాంతమున "మహమ్మదు ఇబ్న అబ్దుల్ వహాబు" అనువాఁడు పూర్వపు "ఇస్లాము" మతమును పునస్థాపితము చేయయత్నించెను. అటుపిమ్మట మక్కానుండి పారసీకసింధు శాఖవఱకు వహాబీల రాజ్యము విస్తరిల్లె. ఈరాజ్యమును ఈజిప్టుదేశపు రాజప్రతినిధి యగు మహమ్మదు అలీ అనువాఁడు లోఁబఱ చుకొనెను (క్రీ. శ. ౧౮౧౨-౧౮). కాని తరువాత కొలఁది కాలమునకే వాని యాధి పత్యము నశించెను. ఇదే సమయ మనుకొని "ఉమ్మాను" ప్రాంతపు సుల్తాను స్వతంత్రుఁ డయ్యెను. "ఉమ్మాను" ఇప్పుడు అరేబియా యంతటిలోను వృద్ధిమార్గమున నున్నది. "అల్ నెజ్డ్" ప్రాంతములోని "షామరు" అను మండలమున క్రైస్తవులు విశేషముగాఁ గలరు. ఎనిమిదవ శతాబ్దారంభమున వీరు ఖలీ ఫాల యధికారమును నిరోధించిరి. షామరు మండలము వహాబీసామ్రాజ్యము గతించిన పిమ్మట మరల స్వాతంత్ర్యమును ప్రకటిం చెను. "అల్హాసా" ప్రాంతముకూడ స్వాతం త్ర్యమును సంపాదించుకొనెను కాని మరల

జయింపఁబడెను. కొంతకాలము మహమ్మద లీక్రింద నుండిన తరువాత, "యమను," "హెజ్జాజు" ప్రాంతములు రెండున్ను, క్రీ. శ. ౧౮౪౧ వ సంవత్సరపు సంధినియమముల ననుసరించి టర్కీపాలయ్యెను.

క్రీ. శ. ౧౯౧౬ వ సంవత్సరమున మక్కాపట్టణమునకు "షరీఫు" అగు హుస్సేను అను నాతఁడు "ఉలమా" ల యొక్కయు, పుర నాయకులయొక్కయు సమ్మతి ననుసరించి టర్కీ మాండలికత్వమును తప్పించుకొని స్వతంత్రుఁడై "హెజ్జాజుసుల్తాను" నని ప్రకటించుకొనెను; "సామరు" మండలముతో స్నేహము కుదుర్చుకొనెను. ఇది ఐరోపామహా సంగ్రామమునందు టర్కీ తగుల్కొనియున్న యీకాలమున జరిగిన పని యగుటచేతను, ఈ ఘోరయుద్ధ మింకను సమాప్తము కాక పోవుటచేతను, ఈస్వాతంత్ర్యము నిలచునో లేదో చూడవలసియున్నది.

[మా. హ.

**అరోర్.** సింధుదేశమందలి సుకూర్ జిల్లాలోని యొక జీర్ణగ్రామము. ఇది పూర్వము సింధుదేశమునందు రాజ్యము చేసిన హిందూ రాజులకు రాజధానిగ నుండె నని యెదరు. దానిని మహమ్మదీయులు క్రీ. శ. ౭౧౨ లో స్వాధీనపఱచుకొనిరి. పూర్వమీపట్టణము నొద్దనుండి సింధునది పారుచుండెను. ౯౬౨ వ సంవత్సర ప్రాంతమున గొప్పభూకంపము కలిగి నదీప్రవాహము మారిపోయినది.

**అరోరూట్.** (Arrowroot) అనఁగా బాణపువేరు అని యర్థము. ఇది అమెరికా దేశములో పైరగు ఒక చెట్టుయొక్క వేరు. ఆ దేశస్థులు దీని పచ్చివేరురసమును బాణపు అలుగువలన గలిగిన గాయమునకు ఉపయోగించుచుండినందువలన ఈ వేరునకు అరోరూట్ అనుపేరు వచ్చినది. ఇది అరఁటికుటుంబములోఁ జేరినది. ఈ వేరునుండి వరిపిండి వంటి యొకవిధమైన పిండిని ఇప్పుడు తయారు చేసి అమ్ముచున్నారు. మొట్టమొదట ఈ యొక్క వేరులోనుండి చేయఁబడు పిండికే అరోరూట్ పిండి అని చెప్పఁబడుచు వచ్చినను ఇప్పుడు తత్సంబంధమైన పిండులన్నియు అరోరూట్ పిండులే యని బజారులో అమ్మకమవుచున్నవి. ఈ అరోరూట్ పిండిలో బంగాళా దుంపపిండి, వరిపిండి మొదలగునవి కల్తిచేయ వచ్చును. ఈ పిండులన్నియు రుచినిబట్టియు, సులభముగ జీర్ణమగుటను బట్టియు, ధరలలో వ్యత్యాసము గలిగి యుండుటచే చౌకరకములను విలువగల రకములలో కల్తిచేయుచుందురు. అసల్ అరోరూటుపిండిలోనే మరంటా, టులేమా, కర్కుమా, కెసావా, టక్కా, పోర్ట్లెండు మొదలగు రకముభేదములు, అవి యుత్పత్తి యగు చెట్లనుబట్టి యేర్పడియున్నవి. సూక్ష్మదర్శినిలో నీపొడినుంచి, శోధించినయెడల కల్తీలు తెలియఁగలవు గాని సామాన్యశోధనవలన తెలియుట కష్టము.

మనదేశములోకూడ తాటితేగలు మొదలగు కొన్ని వేరులనుండి యిట్టి పిండిని తయారు చేయు పద్ధతులు శోధింపఁదగియున్నవి.

**అర్కపర్ణుఁడు.** కశ్యపునకు ముని యను భార్యయందుఁ బుట్టిన దేవగంధర్వ

లలో నొక్కఁడు. ఈతనికి తృణకుఁడను నామాంతరము గలదు.

**అర్కల్‌గూడ్.** మైసూరు సంస్థానము, హాసన్ జిల్లాలోని యొక తాలూకా. వైశాల్యము ౨౬౧ చదరపుమైళ్లు. జనసంఖ్య ౭౬౭౭౫. ఇందు మూడు పట్టణములును 300 గ్రామములును గలవు. సిస్తు౧౨౫౦౦౦ రూపాయిలు. ఈ తాలూకాకు ఉత్తరపు సరిహద్దున హేమావతినది కలదు. దక్షిణపు భాగమునుండి కావేరినది ప్రవహించును. ఇట్లు నీటి యాధార మెక్కువ యుండుటచే నిచ్చటి భూములలో వరిపంట మెక్కువగను, నిశ్చయముగను పండును. పెద్ద చెఱువుల క్రింద వరి కోసినతోడనే ఉల్లిగడ్డలు పండింతురు. దక్షిణభాగమునందు కొబ్బరితోటలును పోకతోటలును విశేషముగ కలవు. ఇచ్చటి పోకలు శ్రేష్ఠమైనవి కావు.

**అర్కావతి.** కావేరీనదిలోఁ గలియు నుపనది. ఇది మైసూరు సంస్థానములోనున్నది. ౧౨౦మైళ్లు పొడవు. నందిదుర్గులోఁ బుట్టి బెంగుళూరుజిల్లాలో ఉత్తరమునుండి దక్షిణమువైపు ప్రవహించును. కుముద్వతి, వృషభావతి, అను ఉపనదు లిందుఁ గలియును. ఉత్తరమువైపున దీనివలన పెద్దపెద్ద చెఱువులు నిండును. బెంగుళూరునకు నీరిచ్చెడి పెసరఘట్టఅను చెఱువునకు నిదియే యాధారము.

**అర్కిటాస్.** (క్రీ. పూ. ౪౦౦) టెరెంటం వాఁడు. గ్రీకుసేనాని. గణితశాస్త్రవేత్త. ప్లేటోకు స్నేహితుఁడు. భూమితిని (Geometry) మొదట యంత్రశాస్త్రమునకై ఉపయోగించినవాఁడు.

**అర్కిలోకస్.** (Archilochus) క్రీ. పూ. ౭ వ శతాబ్దమువాఁడు. గ్రీకుకవి.

**అర్కుఁడు.** ౧. సూర్యునకు పేరు. ౨. (చం వం) నీలవంశజుఁడగు పురుజరాజ పుత్రుఁడు. భద్రాశ్వుఁ డితని పుత్రుఁడు. 3. రామసేనలోని యొక వానరుఁడు.

**అర్కేకన్.** ఫ్రాన్సులోని యొక గ్రామము. ఆరోగ్యముకొఱకై యిక్కడికి రోగులు వచ్చుచుండెదరు.

**అర్గాం.** (వరాడ్ Berar) ప్రాంతమందలి కోట్‌జిల్లాలోని ఒకపల్లె. ఇచ్చోట జనరల్ వెలక్సు ౧౮౦3 నవంబరు ౨౯ వ తేదీన నాగపురసైన్యములను ఓడించెను. దీని తరువాత వెంటనే గావీల్‌గడము పట్టుకొనఁబడియె.

**అర్గెన్‌సోలా.** ౧. (బార్తలోమే, లీనార్డో ౧౫౬౫–౧౬3౧) స్పెయినుదేశమందలి కవి, చరిత్రకారుఁడు. ఇతఁడును, ఇతని అన్నయైన లుపర్షియో అనువాఁడును అరగోనీస్ అనఁబడు క్రొత్త సాహిత్యసాంప్రదాయమునకు నాయకులైరి.

౨. (లుపర్షియో లియనార్డో ౧౫౬3–౧౬౧3) పైవాని సోదరుఁడు. స్పెనిషు వాఙ్మయమునందు మంచి గౌరవము గలదు. ఇతఁడు ఆస్ట్రియాదేశపు పూర్వపు చక్రవర్తినియైన

మేరియా యను నామెకు కార్యదర్శిగనుండెను. నేపల్సులోని రాజ్యప్రతినిధికి రాజ్యాంగ కార్యదర్శిగను ఉండెను.

**అర్గెలాండర్.** (ఫ్రెడ్రిచ్చి, విలెహం, ఆగస్టు ౧౭౯౯–౧౮౭౫) జర్మనుదేశజుఁడు. జ్యోతిష శాస్త్రవేత్త. ౧౮౨౩–౧౮౩౭ వఱకు ఆబోలోనున్న నక్షత్రశాలకు నీతఁడు నాయకుఁడుగ నుండెను. బాన్ విద్యా పీఠమున జ్యోతిష శాస్త్ర మహామహోపాధ్యాయుఁడుగ నుండె. ఈతఁడు ౨౨౦౦౦ నక్షత్రముల స్థానములను నిర్ణయించెను. ఆకాశనక్షత్ర పటముల సంగ్రహమును ప్రకటించెను.

**అర్గ్వెలిస్** (అగస్టిన్ Augustin ౧౭౭౮–౧౮౪౪). స్పెయినుదేశపు రాజ్య కార్య కుశలుఁడు. ౧౮౧౨లో ప్రజలకు ప్రభుత్వములోఁ గొన్ని హక్కుల నిచ్చునట్టి రాజ్యాంగ సంబంధమైన సనదు స్పెయినుదేశపు ప్రజలకు ఒసంగఁబడియె. దానికి నీతఁడు చాలవఱకుఁ గారకుఁడు. ౧౮౧౪–౨౦ లో ఈతఁడు చెరసాల నుంచఁబడియె. ౧౮౨౩–౩౨ వఱకు దేశాంతరగతుఁడు గావలసి వచ్చె. తరువాత నీతఁడు స్పెయినులోని మితవాదులకు నాయకుఁడయ్యె. ౧౮౪౧ లో నీతఁడు ఇసాబెలారాణికి సంరక్షకుఁడుగ నుండెను.

**అర్చి.** ౧. వేనరాజుదేహమును మథింపఁగాఁ బుట్టిన మిథునమందలి స్త్రీ. మిథునమందలి పురుషుఁడైన పృథురాజునకు భార్యయయ్యె.

౨. ప్రశాస్వఋషియొక్క పెద్దభార్య, ధూమ్రకేశఋషియొక్క తల్లి.

**అర్చికపర్వతము** వైడూర్య పర్వతము.

**అర్చిమాలి.** సీతను వెదకుటకుఁ బశ్చిమదిక్కునకుం బోయిన వానరులలో నొకఁడు.

**అర్చిరాదిమార్గము.** సూర్యలోకమును దాటి చంద్రలోకమును దాటి విద్యుల్లోకమును దాటి సగుణబ్రహ్మోపాసకులు బ్రహ్మలోకమునకుఁ బోవు మార్గము.

**అర్చిష్మతి.** బృహస్పతికి రెండవ భార్యయైన శుభ యనుదానికిఁ బుట్టిన యేడుగురు కన్యలలో నాల్గవది.

**అర్చిష్మంతుఁడు.** రామసేనలోని యొక వానరుఁడు.

**అర్జున్ సింగ్.** రాజామాన్ సింహుని ముగ్గురు కుమాళ్లలో నొకఁడు.

**అర్జునకుఁడు.** ఒక లుబ్ధకుఁడు. గౌతమి యను నొక వృద్ధబ్రాహ్మణీపుత్రుఁడు సర్పదంశమున మరణ మొందఁగా నితఁడా సర్పమును దెచ్చి చంపఁబోవ గౌతమి నివారించెను. (భార. అనుశాసన అ. ౧)

**అర్జునగీత.** గుజరాతిభాషలో ధనదాసకవిచే రచింపఁబడిన కావ్యము. కృష్ణార్జున సంవాదరూపము.

**అర్జునతీర్థము.** భారత వర్షీయ తీర్థము.

**అర్జునపాలుఁడు.** (చం.వం) వసుదేవుని సవతి తమ్ముఁడైన శమీకునకు సుదామినియను భార్యవలనఁ బుట్టిన యిద్దఱు పుత్రులలో నొక్కఁడు.

**అర్జునమల్లుఁడు.** సిక్కుల మతమును స్థాపించిన నానకుని సింహాసనముపైఁ గూర్చుండిన నైదవ పురుషుఁడు. ఈ మతము వారు వేదమువలెఁ బూజించు నట్టి "గ్రంథ రాజ్" అనుదాని నీతఁడు రచించెను. ఈతఁడు క్రీ. శ. ౧౫౮౧ లో సింహాసనాధీశుఁడై ౧౬౦౬ లో సిద్ధిఁ జెందెను.

**అర్జుని.** ౧. బాణాసురుని కూఁతురు. ౨. బహుదయను నామాంతరము గల యొక స్త్రీ.

**అర్జునుఁడు.** ౧. (చం. వం) యయాతిపుత్రుండగు పూరుని వంశమునందు అజమీఢ వంశాంతర్గతంబగు జహ్నురాజకులంబునఁ బుట్టిన శంతనురాజునకు మనుమఁడగు పాండురాజునకు కుంతియను పెద్దభార్య యందు ఇంద్రుని ప్రసాదంబునఁ గలిగిన కుమారుఁడు. ఇతఁడు నరుఁడను ఋషియొక్క యవతారము. యుధిష్ఠిరుఁడు భీముఁడు వీని కన్నలు. నకుల సహదేవులు తమ్ములు. ఇట్లీతఁడు పాండవులలో నడిమి వాఁడు. బాల్యమునం దీతఁడు ద్రోణాచార్యులయొద్ద నస్త్రవిద్యను నేర్చి పాండవధార్తరాష్ట్రు లందఱిలోను నధికప్రవీణుఁడని యశంపించుకొనుట యే గాక అప్పటి ధనుర్ధరులందఱిలోను శ్రేష్ఠత్వము నొందెను. ఇతఁడు ద్రోణాచార్యులకు గురుదక్షిణగా పాంచాలదేశపు రాజయిన ద్రుపదుని, ఇతరశిష్యు లెవ రతనిని ఓడింప లేకపోగా, ఓడించి తనరథమునకుఁ గట్టితెచ్చి యప్పగించెను. (చూడు ద్రోణాచార్యుఁడు). తఱువాత ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుని ప్రేరణవలన పాండవులను వారణావతికిఁబంప అర్జునుఁడు అచ్చటికిఁబోయి, లాక్షాగృహంబున నుండి సురక్షితముగా నన్నదమ్ములతో వెడలి ద్రౌపదీ స్వయంవరమునకై బ్రాహ్మణరూపమున వెళ్లుచుండెను. త్రోవలో రాత్రిపూట అంగారపర్ణుండను గంధర్వుఁ డెదిరింపఁగా నర్జునుం డతని నోడించి స్నేహితునిఁ జేసికొనెను. (చూడు అంగారపర్ణుఁడు). ద్రౌపదీస్వయంవరమునకు బ్రాహ్మణవేషమునఁ బోయి మత్స్యయంత్రమును భేదించి ద్రౌపదిని సంపాదించి తన నలుగురు భ్రాతలతోఁ గలిసి నామెను వివాహ మాడెను. ఈ సమాచారముఁ దెలిసి ధృతరాష్ట్రుఁడు పాండవులను బిలిపించి ఇంద్రప్రస్థంబను పురంబున నునిచెను. అచ్చట నొక్కనాఁడు ద్రౌపదీయుధిష్ఠిరు లేకాంతంబున నుండ తన ధనుస్సుకొఱ కర్జునుఁ డచ్చటికి పోవలసిన వాఁడాయెను. ఆదోషము పోవుటకై యర్జునుఁడు తీర్థయాత్రకు వెడలెను. తీర్థయాత్రఁ జేయుకాలమున ఉలూపియను నాగకన్యకను, మణిపుర రాజ

కన్యకయైన చిత్రాంగదను వివాహమాడి, ఉలూపియం దిరావంతుని, చిత్రాంగదయందు బభ్రువాహనుని తనయులుగాఁ బడసెను. (చూఁడు ఉలూచి, చిత్రాంగద) తరువాత నారీతీర్థమునందు మొసళ్లరూపముఁ దాల్చియున్న యైదుగురు అప్సరసలకు శాపవిమోచనము కలిగించెను. (చూఁడు నారీతీర్థము.) మాయసన్యాసి వేషము వేసికొని ద్వారకకుం బోయి బలరామునియింట నుండి కృష్ణుని యనుమతిని సుభద్ర నెత్తికొని పోయి వివాహ మాడెను. ఇట్లు పండ్రెండు సంవత్సరంబులు తీర్థయాత్ర చేసి యింద్రప్రస్థమునకు రాఁగా నగ్నిభట్టారకుఁడు వచ్చి యింద్రునిది యగు ఖాండవవనము తనకు భక్షణార్థమై యొసంగు మని వేడి యర్జునునకు గాండీవ మను ధనుస్సును, రథంబునుబొసఁగెను. కృష్ణార్జును లిరువురును అగ్నికి సహాయులై యుద్ధమునకు వచ్చిన యింద్రాదులను ఓడించి ఖాండవవనమంతయు నగ్నికి భక్షణముగా నొసఁగిరి. మయాసురుం డను దానవశిల్పిని మాత్రము రక్షించిరి. అర్జునుని శౌర్యంబునకు మెచ్చి యింద్రాదు లాతనికి వరంబు లిచ్చిరి. తనకుఁ జేసిన యుపకారంబు స్మరించి మయాసురుఁడు దివ్యమైన సభను నిర్మించి యిచ్చెను. యుధిష్ఠిరుండు రాజసూయమును చేయఁదలఁచి ధనముఁ దెచ్చుటకై తన నలువురు తమ్ములను నాల్గు దిక్కులకుఁ బంపెను. అం దర్జునుం డుత్తరదిక్కునకుఁ బోయి క్రమముగా పుళిందము, ఉత్తర ఆనర్తము, కాలకూటము, అపర ఉత్తరకుళిందము, సుమండలము, శాకలద్వీపము, ప్రాగ్జ్యోతిషపురి, అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరి, ఉలూకము, అపరోత్తర ఉలూకము, పంచగణదేశము, దేవప్రస్థము, పౌరవేశ్వరుఁడు, పర్వతవాసులయిన దస్యురాజులు, కాశ్మీరము, లోహితము, త్రిగర్తము, దారువము, కోకనదము, అభిసారదేశము, ఉరగాపురి, సింహపురము, ఉత్తరసుహ్మము, ఉత్తరచోళము, బాహ్లీకము, కాంభోజము, దరదము, ఈశాన్యదిక్కునందలి దస్యురాజులు, లోహదేశము, పరమకాంభోజము, * ఋషికదేశము, హిమవత్పర్వతముమీఁది దేశములు, మొదలగు దేశములను, రాజులను జయించి అపరిమితమైన ధనరూపకరభారముం గొనియె. అచ్చటనుండి శ్వేతపర్వతమును దాటి కింపురుషవర్షమునం జొరఁబడి ద్రుమపుత్రరాజునుం జయించి కరభారముం గొనియె. గుహ్యకరక్షిత మయిన హాటకదేశమునకుం బోయి సామోపాయముచే వారివలనం పన్నుఁ రాఁబట్టుకొని మానససరోవరమును ఋషికుల్యానదిని దర్శించి, గంధర్వరక్షితమైన దేశమును జయించి వారియొద్దనుండి తిత్తిరిపక్షినలె వేలువేలు వర్ణములుం గల మండూకములను గుఱ్ఱములను కరముగఁ దీసికొని హరివర్షమునకుం బోయెను. అచ్చట మహాకాయులును, మహాబలవంతులును అయిన ద్వారపాలకులం గనుఁగొనియె. వా రర్జునునిఁ జూచి మానవు లీ దేశమునకుఁ బోఁగూడదని చెప్పఁగా నట్లయిన యుధిష్ఠిరునకు మీరు

---

* ఈ ఋషికదేశము నే రష్యా యని కొంద ఱూహించుచున్నారు.

కరభార మిచ్చిన యెడల నే నిచ్చటనుండియే పోఁగలవాఁడ నని చెప్పి వారివలన దివ్యాభరణాది భూషణంబులం గైకొని యుత్తరదిగ్విజయంబు సమాప్తము గావించి తిరిగి యింద్రప్రస్థమునకు వచ్చె. (మహా. సభా. అ ౨౭)

రాజసూయయజ్ఞము పూర్తి యయిన తరువాత, పాండవులు ద్యూతమునం దోడిపోయి వనవాసమునకు వెడలి పోయిరి. వారు ద్వైతవనమునుండి కామ్యకవనమునకుఁ బోయిన తరువాత అర్జునుఁడు దివ్యాస్త్రముల సంపాదింపవలయునని హిమాలయపర్వతమునకుఁ బోయి ఇంద్రకీలశిఖరముపైఁ దపస్సుచేసి శివుని మెప్పించి, కిరాతరూపధారియైన శివునితోఁ బోరాడి యతని కృపకుఁ బాత్రుఁడయి, అతనివలన పాశుపతాస్త్రమును సంపాదించెను. అచ్చటినుండి యింద్రలోకమునకుఁ బోయి ఐదుసంవత్సరము లుండి, నివాతకవచులు కాలకేయు లను రాక్షసులం జంపి, యింద్రునివలన పెక్కుశస్త్రాస్త్రములను బడసెను.* అచ్చట నున్న కాలమున నతఁడు చిత్రసేనగంధర్వునియొద్ద నృత్యగానవిద్యలను నేర్చుకొనెను. ఒక్కతటి నూర్వశి యింద్రు పనుపున నితనియొద్దకు రాఁగా అప్సరసలందఱును తనకు తల్లులన్న భావము గల యర్జునుఁడు దాని నిరాకరించెను. అంత నది 'నీవు షండుఁడ వగు'మని శాపంబిచ్చెను. ఈ శాప మజ్ఞాతవాసకాలమైన యొక సంవత్సరమువఱకే చెల్లునని యింద్రుఁడు వరం బిచ్చె. పాండవులు తీర్థయాత్రఁ జేయుచు గంధమాదనపర్వతమునకు రాఁగా నర్జునుఁ డచ్చటికి వచ్చి వారినిం గలసికొనెను. పాండవులు విరాటుని గృహమం దొక సంవత్సర మజ్ఞాతవాసము సలుపునప్పుడు పేడి రూపముఁ దాల్చి బృహన్నల యను నామంబుతో రాజకూఁతురైన యుత్తరకు సంగీతంబును నాట్యంబును నేర్పుచుండె. సంవత్సరాంతంబున దుర్యోధనుఁడు తనసైన్యంబులతో వచ్చి విరాటరాజుయొక్క యుత్తరగోగ్రహణము సేయ రాజపుత్రుఁడైన యుత్తరునకు సారథియై యర్జునుఁడు యుద్ధమునకుఁ బోయెను. శత్రుసైన్యముంజూచి ఉత్తరుఁడు రథంబుడిగ్గి పాఱిపోవ నాతనిం బట్టుకొని వచ్చి ధైర్యము సెప్పి తాను రథియై నాతని సారథిం జేసి కౌరవులతోఁ బోరాడి వారి నందఱ గెల్చి గోవుల మళ్లవేసెను. అజ్ఞాతవాసానంతరమున గౌరవపాండవులకు గురుక్షేత్రమున యుద్ధము సంప్రాప్తమయినప్పుడు, కృష్ణుఁడు తనకు సారథి కా, యుద్ధసన్నద్ధుఁడై, ప్రథమదినమున ఉభయసైన్యములకు నడుమ నిల్చి వైరాగ్యము కల్గినవాఁడై మోహముచే యుద్ధము చేయనొల్లక యుండ శ్రీకృష్ణుండు భగవద్గీతాబోధవలన నా మోహముఁ దొలగించెను. ఇతఁడు భారతయుద్ధమునందు శిఖండిని పేరునకు మాత్రము తనకు ముం దుంచుకొని భీష్మునిఁ బడవైచెను. అభిమన్యునకు సహాయము పోనీయకుండ పాండవుల కడ్డపడినం దున సైంధవునిమీఁద కోపగించి సూర్యాస్తమయమునకు పూర్వము సంహరించెదనని ప్రతిజ్ఞచేసి అట్లే వానితల దునిమెను. పసు

* చూఁడు నివాతకవచులు, కాలకేయులు.

నేడవనాఁడు యుద్ధమున తనయద్భుత పరాక్రమమునఁ గర్ణుని వధించెను. అశ్వత్థామయొక్క శిరోరత్నమును హరించెను. (చూఁడు ౧ అశ్వత్థామ.) యుధిష్ఠిరుఁడు అశ్వమేధము చేయ నెంచి శ్యామకర్ణాశ్వమును విడిచి దాని సంరక్షణమునకు నర్జునుని నియమించెను. ఇతనివెంట సాత్యకి ప్రద్యుమ్నానిరుద్ధాది వీరులుండిరి. ఆ యశ్వము హస్తినాపురమునుండి దక్షిణదిక్కుగా వెళ్లి మహిష్మతీ నగరమునకుఁ బోఁగా అచ్చట నీలరాజు దానిని బట్టుకొనెను. అర్జునుఁడు దానిని గెల్చి వానిని వెంటఁ దీసికొనెను. (జైమినీ. అశ్వ. అ. ౧౫) అచ్చటనుండి ఉద్దాలకఋషియొక్క యాశ్రమముమీఁదుగా చంపానగరమునకుఁ బోయి అచ్చటిరాజైన హంసధ్వజుని గెలువ, వాఁడర్జునుని వెంట వచ్చెను. (చూఁడు హంసధ్వజుఁడు) అంత నశ్వము స్త్రీరాజ్యమునందుఁ బ్రవేశింప నచ్చటి రాణియైన ప్రమిల దానిం బట్టెను. అర్జునుఁడు ఆమెను గెలిచి వివాహమాడి హస్తినాపురమునకుఁ బంపెను. కర్ణప్రావర్ణమను జనుల దేశముల నుల్లంఘించి భీషణరాక్షసుని నగరముమీఁదుగా గుఱ్ఱము మణిపురముఁ జేరె. అచ్చట కుమారుఁడైన బభ్రువాహనునితోఁ బోరాడి అర్జునుఁడు మడిసి మఱల బ్రతికె. (చూఁడు బభ్రువాహనుఁడు) అచ్చటినుండి మయూరధ్వజుఁడు, వీరవర్మ, చంద్రహాసుఁడు మొదలైన రాజుల దేశములమీఁదుగా గుఱ్ఱము ఉత్తరదిక్కునకుఁ దిరిగె. అచ్చట నర్జునుఁడు బకదాల్భ్యుఁడనుఋషిని సందర్శించెను. సంవత్సరముగావచ్చినందున నర్జునుఁడు గుఱ్ఱమును సింధుదేశము మీఁదుగా దీసికొనిపోయి అచ్చటనున్న దుశ్శలను, ఆమెపుత్రుని వెంటరమ్మని హస్తినాపురముఁ జేరి యుధిష్ఠిరునిచే నశ్వమేధముఁ జేయించెను.

శ్రీకృష్ణుని నిధనానంతరము, అర్జునుఁడు ద్వారకకుఁబోయి బ్రదికియున్న కృష్ణస్త్రీలను కృష్ణుని ప్రపౌత్రుఁడైన వజ్రుని హస్తినాపురమునకుఁ దీసికొని వచ్చెను. యుధిష్ఠిరుఁడు ముప్పదియాఱు సంవత్సరములు రాజ్యము చేసినతరువాత నర్జునుని మనుమఁడగు పరీక్షిన్నరేంద్రుని సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి, పాండవులును ద్రౌపదియును తపస్సునకుం బయలుదేరి హిమాలయపర్వతమునకుం బోయిరి. అచ్చట ద్రౌపదియు సహదేవుఁడును నకులుఁడుఁ బడిపోయినతరువాత అర్జునుఁడు కూడ దేహము చాలించెను.

అర్జునుఁడు వర్ణమునందు చామనచాయగలవాఁడు; దీర్ఘబాహుఁడు; విశాలవక్షుఁడు. ఇతనిరథమునకు విజయ మనియు ఇతనిశంఖమునకు దేవదత్తమనియు, ధనుస్సునకు గాండీవ మనియు పేళ్లు. రథమునకు నాలుగు తెల్లని గుఱ్ఱములు, కపిధ్వజమును ఉండెను. ఆకాలమునందలి ధనుర్ధరులలో నితఁడు శ్రేష్ఠుఁడని చెప్పవచ్చును. అభిమన్యుఁడు, సాత్యకి, ప్రద్యుమ్నుఁడు ధనుర్వేదమునం దితనికి శిష్యులు. ఇతనికి ద్రౌపదివలన శ్రుతకీర్తియు, సుభద్రవలన అభిమన్యుఁడును, ఉలూపివలన ఇరావంతుఁడును, చిత్రాంగదవలన బభ్రువాహనుఁడును అను నాల్గురు కుమారు లుండిరి.

౨. కృష్ణ బలరాములయొక్క సఖుండగు యొక గోపుఁడు.

3. ఐదవ రైవతమనువుయొక్క పుత్రు లలో నొకఁడు.

౪. (చం. వం). (చూఁడు కార్తవీర్యార్జు నుఁడు).

**అర్థము.** అలంకారశాస్త్ర మతప్రకారము శబ్దమునకు మూఁడువిధములైన అర్థము లుండును (౧) వాచ్యము. (౨) లక్ష్యము (3) వ్యంగ్యము. వాచ్యార్థము అభిధవలనను (చూఁడు అభిధ), లక్ష్యార్థము లక్షణవలనను, వ్యంగ్యార్థము వ్యంజనవలనను తెలియును. ఈమూఁటిని శబ్దశక్తులందురు. (సా. ద.) "గంగమీఁది పల్లె" యన్న వాక్యము నందలి 'గంగా' శబ్దమునకు నదీవిశేషమని వాచ్యార్థము. కాని జలప్రవాహముమీఁదఁ బల్లె యుండుట యసంభవము గాన నిచ్చటి గంగా పదమునకు గంగయొడ్డని లక్ష్యార్థము. గంగానదియొడ్డున నున్నందున నాపల్లె పావనత్వ, శీతలత్వములను గలది యని వక్త యొక్క భావమేని యది గంగాపదమునకు వ్యంగ్యార్థము. ఇందునగురించి యధికము "ధ్వని" శబ్దముక్రిందఁజూడనగును.

**అర్థశాస్త్రము.** ఇంగ్లీషులో పొలిటికల్ ఎకానమి (Political Economy) ఎకనమిక్స్ (Economics) అనఁబడు శాస్త్రమునకు మన దేశపు భాషలల్లో "అర్థశాస్త్రము" అన్న పేరు పెట్టఁబడినది. అర్థమనగా ధనము, సంపద, సొత్తు, ఆస్తి. మన పూర్వులయభిప్రాయప్రకారము పురుషుఁడు సాధింపవలసిన పురుషార్థములు నాలుగు: ధర్మము, అర్థము, కామము, మోక్షము. అప్రత్యక్షమును, పారలౌకిక విషయమును అగు మోక్షము నటు నుంచిన, మనవారి మతమున మనుజుఁడు ఈ లోకమునందు సాధింపవలసిన విషయములు మూఁడు. అందు ధర్మము అర్థమునకు సాధనము, అర్థము కామమునకు సాధనము అని చెప్పఁబడినది. పాశ్చాత్యార్థశాస్త్ర మతము నను ఈ సాధనపరంపర నిజమేయని చదువరులు చూడఁగలరు. ఇచ్చట ధర్మ మనగా ధర్మప్రవర్తన యనియు, కామ మనగా వాంఛలు, కోర్కెలు అనియు నెఱుంగునది. సంఘమునందు ధర్మాచరణము లేనిది, అర్థము కూడదు. అర్థము లేనిది కామము (కోర్కెలు) తీర నేరవు.

అర్థ మనర్థావహమని కొందఱు చెప్పినను సర్వసంగపరిత్యాగియైన సన్యాసికిఁగూడ నాకలితీర్చుకొనుటకై భోజనరూపమైన యర్థము కావలసియే యున్నది. ఇట్లు లోకవ్యవహారమునకు నర్థము లత్యంతావశ్యకములు. కావున నర్థమునకును మనుజులకును గల సంబంధమును తెలిసికొనుట ముఖ్య మయ్యె.

ఈ శాస్త్రమునకు వేఱువేఱు అర్థముల యొక్క వర్ణనములతోఁబని లేదు. అర్థమునకును మనుష్యవ్యవహారములకును గల సంబంధము ఈశాస్త్రమునందుఁ జర్చింపఁబడును. ఒక వ్యాపారి ఒక చెట్టుఁ బడఁగొట్టి బాజారు

లక్షణము: స్వరూపము

నకు నమ్ముటకుఁ దీసికొని పోవును. ఇది యతఁడు క్రొత్తగ సంపాదించిన యర్థమే. కాని యీ చెట్టుయొక్క గుణధర్మములను వర్ణించుటగాని, చెట్టు కొట్టుటకు నెట్టి గొడ్డలిని ఉపయోగింపవలసినది చర్చించుటగాని అర్థశాస్త్రవిషయము గాదు. అయ్యవి ఆయా కళాకౌశల్యములకు సంబంధించిన శాస్త్రముల విషయములు. ఈకట్టెకు బాజారులో ధర హెచ్చుగా వచ్చుటకుఁ గారణము లెవ్వి? తక్కువగా వచ్చుటకుఁ గారణము లెవ్వి? దానికి వచ్చిన ఖరీదు సంఘములో నెవ్వరెవ్వరికి నెట్లెట్లు చెందును? మొదలయిన వ్యాపారవిషయము లీ శాస్త్రమునందుఁ జర్చింపఁబడును.

మానవునిఁబట్టియే యర్థమునకు (సంపదకు) అర్థత్వము (ధనత్వము) కలుగును. పదార్థము లెన్ని యున్న నేమి? ఎంత యున్న నేమి? మానవునకు వాని యోగ్యత తెలిసి, యాతఁడు వానిని ఉపయోగింపఁ బ్రారంభించినఁ గాని వానికి నర్థ మన్న పేరు రానేరదు. ఒక యరణ్యమునందు నొక గుట్ట యున్న దనుకొనుఁడు. దానిని అర్థమని (ఆస్తియని) యెవరందురు? కాని యీ యరణ్యసమీపమునఁ బెద్ద గ్రామ మేర్పడి, యిండ్లు కట్టుకొనుటకు రాయి కావలసి వచ్చినప్పు డా గుట్టయే యర్థమగును; ఆస్తి యగును. దానికి యజమానుఁ డెవఁడైన నున్న యెడల నాతఁ డపరిమితధనమును సంపాదించును. ఇట్లే కాఫీ త్రాగుట జనులకు నలవాటు లేనప్పుడు కాఫీ విత్తులకు అర్థత్వము లేదు. ఈలాగుననే ప్రతి ద్రవ్యమును-గుఱించియు నెఱుఁగనది. కావున పదార్థమునకు నర్థత్వము వచ్చుటకు మానవునకును దానికిని సంబంధము కలుగవలయును. ఇట్లు అర్థశాస్త్రమునకు మూలము మానవుఁడు, మానవసంఘము అన్నమాట మఱవఁగూడదు.

అర్థశాస్త్రలక్షణము లనేకపండితు లనేక విధముల వ్రాసియున్నారు. ఆలక్షణము లార్థికశాస్త్రస్వరూపమును గుఱించి వారికిఁ గల యూహలను తెలుపును. "వినిమయమును (Exchange) గుఱించి చర్చించు శాస్త్ర మర్థశాస్త్రము"అని యొకఁడు వ్రాసియున్నాఁడు. కాని దీనిఁబట్టి శాస్త్రస్వరూపముయొక్క యథార్థబోధ కల్గుటలేదు. ఇందు నవ్యాప్తిదోషముఁ గలదు. అర్థశాస్త్రమునందు వినిమయము (వర్తకము) అను విషయమును గుఱించి చర్చ యున్నను, మఱి యితర విషయములు కూడఁ జర్చింపఁబడును. ఈ లక్షణమునందు నవి విడిచిపెట్టఁబడెను. కావున లక్షణము దోషయుక్తము.

"మానవుని యైహికాభివృద్ధికిఁ గావలసిన యాదిభౌతిక (Physical) సాధనములను సేకరించుటకై మానవులును, సంఘములును చేయవలసిన పనులను చర్చించుశాస్త్ర మర్థశాస్త్రము" అని మఱియొకలక్షణముఁ జెప్పిరి. కాని యిది యతివ్యాప్తి దోషదూషితము. ఈలక్షణము ఆరోగ్యశాస్త్రము (Hygiene) నీతిశాస్త్రము (Ethics) ధర్మశాస్త్రము (Jurisprudence & Law) మొదలయినవానికిఁ గూడ జెల్లును.

"అర్థముయొక్క యుత్పత్తి, విభజనము, వినియోగములను గుఱించి మీమాంసించు శాస్త్ర మర్థశాస్త్రము" అని యింకొక లక్షణము కలదు. ఇందు నర్థశాస్త్రమందుఁ జర్చింపఁబడు విషయముల పట్టిక యీయఁ బడినది. ఇట్టి లక్షణ మాత్రగ విషయస్వరూపమును బోధచేయఁజాలదు. ఇది విషయ విభాగము, కాని లక్షణము కాదు.

లక్షణ మెప్పుడును మన తార్కికులు చెప్పునట్టి అవచ్ఛేదకధర్మమూలముగఁ జెప్ప వలయును. ఒకపదార్థమును సజాతీయము లయిన యన్యపదార్థములనుండి వేఱు చేయుటకు వీలయినధర్మము అందేది కలదో దానిని అవచ్ఛేదక మందురు.

అన్ని లక్షణములను విచారింపగా ఆడమ్ స్మిత్తను శాస్త్రజ్ఞునిచే నీయఁబడిన యీక్రింది లక్షణ మొప్పుకొనుటకుఁ దగినదిగాఁ గానవచ్చుచున్నది :—

"దేశమందలి యర్థముయొక్క వాస్తవ స్వరూపమును, దాని యుత్పత్తి కారణములను చర్చించునట్టి శాస్త్ర మర్థశాస్త్రము."

పై లక్షణముఁజెప్పిన ఆడంస్మిత్తింగ్లండు దేశమున నర్థశాస్త్రమునకు నియమితస్వరూపముఁ గల్పించెను. ఈతని లక్షణమువలన నీ శాస్త్రస్వరూపము కొంతవఱకు బోధపడఁగలదు. దేశమందలి ధనము యొక్క యథార్థ స్వరూప జ్ఞానమును, తత్కారణ మీమాంసయు నీ శాస్త్రముయొక్క విశేష ధర్మములు. అనగా నవచ్ఛేదకములు.

ఈ శాస్త్రముయొక్క విషయ మర్థము. కనుక తొల్త దాని సర్వూపమువిచారింతము:

అర్థమనగా నేమి?

అర్థము, ధనము, సంపద, ఐశ్వర్యము, ఆస్తి, సొత్తు మొదలయిన పదములు కొంచెము హెచ్చుతక్కువగా సమానార్థకములు.* కావున నీపదము లికముందు సమానార్థకములుగ వాడంబడును. ద్రవ్యము అను పదము సాధారణముగ వెండి, బంగారము, రత్నములు, నాణెములు, అను నర్థమున తెనుఁగున వాడెదరు. మనము ఆ అర్థమునే

---

* సంస్కృతమునందును తెలుఁగులోను సంపదకు సమానార్థకము లయిన పదములు పెక్కులున్నను, ఆర్థిక శాస్త్రమునందు నీక్రింది పదములను ఆయాయర్థము నందే వాడుట శాస్త్రసౌకర్య మని నాయభిప్రాయము. 'వెల్త్' (Wealth) అను అర్థమునందు, అర్థము, ధనము, సంపద, సంపత్తి, సంపత్తు అను పదములును, 'ఎకన మిక్ గూడ్సు' (Economic goods) అను అర్థమందు ఆస్తి, సొత్తు అను పదములును, 'మనీ' (Money) అను అర్థమునందు ద్రవ్యము, డబ్బు అను పదములును, 'కాయిన్' (Coin) అను అర్థమందు టంకము, నాణె ము అను పదములును, 'రిచెస్' అను అర్థమందు ఐశ్వ ర్యము, భాగ్యము అను పదములును నియమించుట మం చిది. "ధనము" అను పదమును శ్రీయుత, క. రామ లింగారెడ్డిగారు 'మనీ' (Money) అన్న యర్థమునఁ దమ అర్థశాస్త్రమునందు వాడినారు. కాని సంస్కృ తమున "ధన" పదము 'వెల్తు' (Wealth) కు సమానార్థకము. శుక్రనీతిలో "సపశు ధాన్య వస్త్రాది తృణాంతం ధనసంజ్ఞికం" [౨. ౩౯౭] అని స్పష్టముగ, పశువులు ధాన్యము వస్త్రాదికములు తృణము కూడ ధనములే యని చెప్పఁబడినది. కావున "ధన" పదము 'వెల్తు' అను అర్థము నందే యాధి చేయుట మంచిది.

వాడుదము. పొలము, ఇల్లు, మంచము, కంచము, బియ్యము, బట్టలు, ఎడ్లు, వెండి, బంగారము, గొడ్డలి, కత్తి మొదలయిన వన్నియు సంపదలె, ఆస్తులె. ఇవన్నియు సంపదయొక్కయుదాహరణములు; ఆస్తియొక్కయుదాహరణములు. కాని వీనికి సంపదయని గాని, ఆస్తి యని గాని ధనమని గాని పేరు వచ్చుటకు వీనికన్నిటికిని సమానధర్మము లుండవలయును. అవి యెవ్వి?

వెలగల ప్రతివస్తువును అర్థమె. కావున అర్థముయొక్క విశేషధర్మము వెల (మూల్యము). వెల (ఖరీదు) లేని వస్తువు నెవ్వఁడును సంగ్రహించి, ఆస్తి యనుకొనఁడు. వెలకుఁ గారణము వినిమయసాధ్యత (Exchangeability). ఇతరులు ప్రతిఫలముగ మఱియొక యర్థము నిచ్చి తీసికొనుటకుఁ దగిన పదార్థమునందు వినిమయసాధ్యతయను గుణ మున్నదని చెప్పవచ్చును. అనఁగా మఱియొకఁడు కొనునట్టి వస్తువు, ధరగలవస్తువు, గిరాకిగల వస్తువు అని చెప్పవచ్చును. కావున వస్తువునకు వినిమయసాధ్యత యను ధర్మము కల్గుటకు, ననగా నది "అర్థము" అని యనిపించుకొనుటకు దానియందు నేయే ధర్మము లుండవలయునో చూతము:—

౧. ఏవస్తువైనను అర్థము, ఆస్తి అని యనిపించుకొనుటకై యందు "ఉపయోగము" (Utility) అను ధర్మ ముండవలెను. మానవునియొక్క వాంఛలను (కోర్కెలను) పూర్తిచేయునట్టి సామర్థ్యమే "ఉపయోగము" లేక "ఉపయుక్తత". మానవుని యేవాంఛలను ఏవాసనలను, ఏకోర్కెలను, ఏయిబ్బందులను తీర్పలేని వస్తువు అర్థము (ఆస్తి) కానేరదు. అర్థము మానవునకు నేవిధముచేతనైననేమి యుపయోగపడవలయును. కావున నుపయుక్తత అర్థముయొక్క మొదటిధర్మము.

౨. అర్థములన్నియు నుపయోగకరములయిన వస్తువులె యైనను ఉపయోగకరములైన వస్తువులన్నియు అర్థములు కావు. గాలి, సూర్యరశ్మి, వెన్నెల మొదలయినవి మానవునకు మిక్కిలి యుపయోగకరములయినను వానిని ఆస్తి యని యెవ్వఁడును చెప్పఁడు. కారణ మేమి? అవి విపులముగ నుండుటయే. కావున నేవిధమైన శ్రమ లేకయే ప్రతివానికిని కావలసినంత దొరకునట్టి వస్తువు అర్థము కాదు. కావున నొకానొక వస్తు వుపయోగకరముగ నుండుటయేగాక, యది మానవుడు కొంతకష్టపడినఁగాని లభ్యముకానిదిగ నుండవలయును. అది పరిమితముగ దొరకునదిగ నుండవలెను. గాలివలెనే నీళ్లకుఁ గూడ సామాన్యముగ వెల లేదు. అరణ్యము విశేషముగ నున్నచోటఁ గట్టెలకు గడ్డికి వెల యుండదు. వానిని ఆస్తిగ నెవ్వఁడు నెంచఁడు. కాని పట్టణవాసమందు జనబాహుళ్యముచే నిండ్లు దట్టమై క్రిందిగదులలో గాలి యుండ నందున ఎక్కుడుగ నద్దె యిచ్చి మేడమీది గదులు తీసికొనుటయు స్వచ్ఛమైన చల్లని గాలికొఱకు నుదకమండలాదులకుఁ బోవుటయు గాలిని కొనుటయె. అప్పుడు మంచి గాలి యరుదగుట చేతను కష్టసాధ్యమగుట చేతను దానికి వెల పుట్టినది. అప్పు డది

ధనమే. వస్త్రమును సంపాదించుటకు నెంత పరిశ్రమ యధికమగునో దాని వెలయు నంత హెచ్చును. ఏటియొడ్డుననున్న గ్రామము వారు నీటి కేమియు ఖరీ దీయరు. గ్రామము నకు నేరు క్రోసెడు దూరమువీద నున్న యెడల బిందెకుఁ గాణి యిచ్చి పుచ్చుకొం దురు. నీరు మిక్కిలి యరుదైనప్పుడు బిందెకు రూపాయియైనను ఇచ్చెదరు. అరణ్యము తెగిన కొలదిని వంటకట్టెలకును, పశువుల గడ్డికిని వెల పుట్టి, హెచ్చుఁ దొడఁగును. కావున అర్థముయొక్క రెండవ ధర్మము 'పరిమితి' (Scarcity). "కష్టసాధ్యత" అను నది దీని యంతర్గతమే.

3. ఒకానొక వస్తువు ఉపయోగకర ముగ నుండవచ్చును; పరిమితముగ నుండ వచ్చును. కాని దానియెడ నొకనికి స్వత్వము (Ownership) లేనియెడల నయ్యది వినిమయసాధ్యము కాదు. ఇందు కుదా హరణము చంద్రుఁడు. చంద్రునివలన నుప యోగమున్నది. చంద్రుఁడును అరుదే. ప్రపం చమునందు నొక్కఁడే యున్నాఁడు. వానిని తెచ్చి మన పెట్టెలో దాచిపెట్టుకొని యిష్టము వచ్చినప్పుడు వెలుపలికిఁ దీసి లోకులకు నిచ్చుటకు వీలున్నయెడల నెంత బాగుం డును? ఎంత ధనము సంపాదింప వచ్చును? కిట్‌సన్ దీపములును, విద్యుద్దీపములును ధన ముగ నెంచఁబడును. వీని నన్నింటికంటెఁ గోటిమడుంగులు వెలుతురుగల చంద్రుఁ డేల ధనము కాదు? ఈ దీపములపై మన స్వత్వ ముండుటకు వీలు కలదు; చంద్రునిపై స్వత్వ ముండుటకు వీలు లేదు. ఇట్లే మేఘములు వర్షము మొదలగువాని గుఱించియుఁ దెలిసి కొనవలయును. మానవుఁ డొకానొక వస్తు వును 'నాది' 'నాసొత్తు' 'ఇతరులది కాదు' అని యనుకొనినఁగాని దానిని మఱియొకనికి నమ్మఁజాలఁడు. కొనువాఁ డీ వస్తువు నాకు దక్కును అని నమ్మినఁగాని కొనఁజాలఁడు. కావున వస్తువునకు వినిమయసాధ్యత కల్గుటకు దానియందు నొకానొక మానవునకు ననన్య సామాన్యస్వామ్యత కలిగియుండవలయును. అప్పుడుగాని దానిని ఆతఁ డన్యాక్రాంతము చేయలేఁడు. ఈ స్వత్వ మొక్కమానవునకే యుండవలెనని నిర్బంధము లేదు. ఒక కుటుం బముగాని, సంఘముగాని, దేశముగాని యిట్టి స్వత్వము (హక్కు) కలిగియుండవచ్చును. ఈ ధర్మమును వ్యక్తిస్వామ్యత (Individual ownership) అందము.

ఇట్లొకానొక వస్తువు అర్థ మనిపించు కొనుటకు (వినిమయయోగ్య మగుటకు;దాని కివెల గలుగుటకు) దానియందు ఉపయుక్తత, కష్టసాధ్యత, స్వామ్యత అను మూఁడుధర్మము లుండవలెను. ఇందునుగుఱించి యందఱు శాస్త్రజ్ఞుల యభిప్రాయ మొక్కటియే.

౪. కాని కొందఱిమతమున అర్థమునకు నాల్గవ లక్షణ మొకటి యుండవలయును. వస్తువు ఉపయోగకరముగ నుండవచ్చును. కష్టపడినఁగాని దొరకక పోవచ్చును. ఒకని హక్కుగ నుండవచ్చును. ఇన్ని యున్నను ఆవస్తువు మూర్తస్వరూపము కలది కాదేని, గుణస్వరూపము గాని క్రియా స్వరూపము

మాత్రముగాని కలది యగునేని, మానవుని నుండి విడిగా నుండదేని (external to man) ధనము కానేరదు. * ఆస్తిని ముట్టుకొనుటకు పట్టుకొనుటకు, తూచుటకు, కొల్చుటకు సంగ్రహముచేసి యుంచుటకు వీలుండవలెను. ఇట్టి వీలు లేనందున పండితుని పాండిత్యమును, కవియొక్క కవిత్వస్ఫూర్తియు, చిత్రకారుని యొక్క కళానైపుణ్యమును, సంగీతపాఠకునియొక్క సంగీతమును ధనములు కానేరవు. ఇవన్నియు మానవులకు నుపయోగకరములే; కష్టసాధ్యములే; ఒకని స్వాధీనమునందుండునవియే. కావున వినిమయయోగ్యములే. ఈ విద్యలవలన నానావిద్వాంసులు ధనార్జనమును, కొందఱధికధనార్జనమును చేయుట మనము చూచుచునే యున్నాము. కావున వీనిని అర్థమని, ధనమని, ఆస్తియని యేల చెప్పఁగూడదని మఱికొందఱు శాస్త్రజ్ఞుల పూర్వపక్షమై యున్నది. † బానిసతనము వ్యవహారమునందున్నప్పుడు జనులు కూడ ధనమగుదురు. అపుడు తెలివిగల బానిస తెలివితక్కువ బానిసకంటెను, బలముగలబానిస బలహీనుఁడగు బానిసకంటెను ఎక్కువవెల గల ఆస్తులుగ నెంచఁబడుదురు గదా? రాజసూయ యజ్ఞమునందు శ్రీకృష్ణుఁడు ధర్మజునకు దాసదాసీజనంబుల నిచ్చె నని యున్నది. వారందఱును ధర్మరాజునకు ధనమే గదా? కావున నిప్పుడు బానిసతనము లేకపోయిన నేమి? ధనోత్పాధనము చేయునట్టి మానవ క్రియలన్నియు ధనములె. అని యీపక్షమువారు చెప్పెదరు.

కొందఱు పండితులు వీరి యుభయులకు రాజీచేయ యత్నించిరి. ఇది పారిభాషికపదమునకై పోరాటము కావున మన మెట్లు అర్థమును ఏర్పరుచుకొనినఁ గానవచ్చును. మానవుని క్రియలను ధన మనుటకుఁ దగిన కారణము లున్నను, ఇతర ధనములకును, వీనికిని భేదము కలదు. కావున నా భేదము స్పష్టముగఁ గానవచ్చునట్లు ఈ రెంటికిని వేఱు వేఱు పారిభాషికపదములను ఉపయోగించుట మంచిది. ఉపయోగకరములును వినిమయసాధ్యములును అనగా వెలగలవియు నగు మానవక్రియలకు ఆత్మసంపద (Personal wealth), అంతస్సంపద (Inner wealth), లేక ఉద్యోగములు (Services) అని పేరు పెట్టమని వీరు నుడివిరి. *

ఎట్లయిన నేమి? మానవుని విద్యాసామర్థ్యములకును, ఇతర భౌతికధనమునకును గల వ్యక్త్యైక్యము, వ్యక్త్యేతరత్వము అను ధర్మములను జ్ఞాపకముంచుకొనవలెను. మానవుని క్రియారూపమైన సంపద ఆమానవుని విడిచి వేఱుగ నుండదు; ఆతనియందే యిమిడి యుండును. ఇతర సంపదలు యజమానునికంటె భిన్నములుగ నుండును. ఇదియే యీ రెండు విధములయిన సంపదలకుఁ గల భేదము.

* Seligman.

† Roscher, Hadley,

* Flux Gide.

కొందఱు సంపద యనగనే వెండి బంగారము లనియు, లేక వెండిబంగారునాణెము లనియు నెంచెదరు. వారి మతమున నీ ధాతువులును, నాణెములును మాత్రము అర్థములు, ధనములు. ఇతరవస్తువులు ధనములు కావు. ఇట్టి యభిప్రాయములు నిజమైనవి కావు. వెండిబంగారములు లోకవిధమైన అర్థమని చెప్పవచ్చునే కాని యవియే నిజమైనసంపద యని కాని, యితరధనములకంటె వీనియం దధిక మున్నదని కాని తలంప నక్కర లేదు. అర్థమనిపించుకొనుటకు నితరద్రవ్యములకు ఉపయుక్తత, మితత్వము మొదలయిన యేధర్మములుండుట యావశ్యకమో యాధర్మము లుండినఁ గాని వెండిబంగారములకుఁగూడ అర్థత్వము ప్రాప్తి గానేరదు. ఒకప్పుడీ లోహములుగాని, నాణెములుగాని సంపద గాకపోవచ్చును. ఒక యుదాహరణముఁ దీసికొందము. ఒక యరణ్యములో రెండే కుటుంబము లున్న వనుకొందము. ఒక కుటుంబమునొద్ద వలయు నంత ధాన్య మున్నది. ఇంకొక కుటుంబమునొద్ద నెక్కువగ బంగార మున్నది; ధాన్య మెంతమాత్రమును లేదు. బంగార మున్న వానికి ధాన్యము కావలెను. ధాన్యమున్న వానికి బంగార మక్కర లేదు. కావున ధాన్యము గలవాఁడు బంగారము తీసికొని ధాన్య మిచ్చుటకు నంగీకరింపఁడనుకొనుఁడు. అప్పుడు ధనవంతుఁ డెవఁడు? ధాన్యముగలవాఁడా? బంగారము కలవాఁడా? కూటికిఁ గుడ్డకుఁ గాని బంగార మదియెట్టిధనము? ఎట్టిసంపద? కావున నచ్చోట బంగారమునకు నుపయుక్తత లేదు. అందుచే నది అర్థము (సంపద, ధనము) కాదు. మట్టిపెల్ల కెంత వెలయో దాని కంతయే వెల. తరువాత ధాన్యము గల కుటుంబములోని స్త్రీలకు నగలమీఁద మనసు పుట్టిన దనుకొనుఁడు. వారు తమయొద్ది ధాన్యము కొంత యిచ్చి రెండవ కుటుంబమువారియొద్ద నున్న బంగారము కొందురు. అప్పుడు బంగారమునకు వెల కలిగి యది ధన మగును.

*వెండిబంగారములందు విశేషము లేదు.*

దేశమునందు వెండి బంగారముల మొత్తము లెక్కువైన కొలఁదిని వానివెల తగ్గును. మొత్తము తగ్గినకొలదినివానివెల హెచ్చును. ఒక దేశమునందు పదికోట్లరూపాయి లున్న వనుకొనుఁడు. ఆదేశమునకు నింకొక పదికోట్ల రూపాయిలు వచ్చినయెడల, నితరపరిస్థితిలో (circumstances) భేదము లేని పక్షమున రూపాయిలవెల సగము తగ్గును. అనగా పూర్వము రూపాయికి పదిసేర్ల బియ్యము వచ్చుచుండినయెడల నికమీఁద నైదు సేర్లే వచ్చును. స్త్రీలు విస్తారముగ నగలు పెట్టుకొను నాచారముగల దేశములలో బంగారము వెల హెచ్చును. అట్టి యాచారము లేని దేశములలో దాని వెల తగ్గును. కావున వెండి బంగారము లితరపదార్థముల వంటివే.

అయినను, జనులు సామాన్యముగ వెండి బంగారు నాణెములయందు నధికప్రీతి గలవారై వానిని నెక్కువగ సంపాదింపవలయునని యత్నించుటకును, వెండిబంగారు లోహములతోఁ జేసిన నాణెములకు నధికవ్యాప్తి

కలిగియుండుటకును గల కారణములు "నాణెము"లను గుఱించిన వ్యాసమునందుఁ జర్చింపఁబడును.

దేశమునందలి యొక్కొకమానవుని యాస్తులన్నియు లెక్కవేసి వానిని కూడినయెడల దేశమందలి యాస్తియొక్క మొత్తము తెలియుననియు, నిదియే జాతీయసంపదపరిమాణమును తెలిసికొను విధమనియుఁ గొందఱు తలంచెదరు. కాని యీపద్ధతి సరియైనది కాదు. వ్యక్తిసంపదయు దేశసంపదయు సాధారణముగఁ బరస్పరాశ్రయములయినను, కొన్ని సమయములందు పరస్పరవిరుద్ధములు కావచ్చును.

వ్యక్తిసంపద, జాతీయసంపద

౧. ఒకప్పుడు దేశసంపద హెచ్చి వ్యక్తిసంపద తగ్గవచ్చును. ఒకానొక పట్టణమునందు నీళ్లకఱవు కలదనుకొనుఁడు. పట్టణమునం దొకని యింట మాత్రము మంచినీళ్ల బావియున్నది. వానికి నా బావిలోని నీళ్లు ఒక అర్థము, సంపద. ఇష్టమువచ్చినట్లు వాఁడమ్ముకొనును. వేఱు విధి లేదు గనుక జను లధికధన మిచ్చి దానిని కొందురు. కాని యా పట్టణము మ్యునిసిపాలిటీ వారు, ఆర్టీసియన్ అనఁబడు గొట్టపుబావులను త్రవ్వించి రనుకొనుఁడు. అంత బావిగలవాని నీళ్లెవ్వఁడును ధనమిచ్చి కొనఁడు; వాని సంపద తగ్గెను. కాని దేశముసంపద హెచ్చెను.

౨. ఒకప్పుడు దేశమందలి సంపద తగ్గి యందలి కొందఱు ప్రజల సంపద హెచ్చవచ్చును. అతివృష్టిచే దేశమందలి పంటలు పాడైన వనుకొనుఁడి. జాతీయసంపద తగ్గినదని యర్థము. అంత ధాన్యముధర హెచ్చును. కావున ధాన్యసంగ్రహ మున్నవాని సంపద హెచ్చగును.

3. వ్యక్తిసంపదకానివి కొన్ని దేశసంపదగ నుండవచ్చును. రైతు లాక్రమించుకొనని భూములు, అరణ్యములు నదులు మొదలయినవి, జనులందఱకు సమానాధికారములు గల భూములు మొదలయినవి, ప్రభుత్వము వారికి స్వత్వము గల రైళ్లు మొదలయినవి—ఇవియన్నియు నే వ్యక్తియొక్క సొత్తులోను చేరవు. కనుక నివి యన్నియుఁ జేరినఁ గాని దేశీయసంపద తేలనేరదు.

౪. దేశధనము తెలిసికొనుటకై వ్యక్తుల యర్థముల లెక్కవేయునప్పుడు పొరపాటున నొక్క యాస్తినే రెండు సారులు లెక్కవేయకుండఁ జూడవలయును. రాముఁడు సోమునకు వేయి రూపాయలుగాని రెండు వందలపుట్ల ధాన్యము గాని అప్పిచ్చినాఁ డనుకొనుఁడు. రావలసిన యప్పులుకూడ నాస్తిగనే యెంచఁబడును. కాన రాముని ఆస్తి లెక్కవేయునప్పుడు ఈ వేయిరూపాయిలు, నూరుపుట్లు జాబితాలో చేర్చి, ఈ సొత్తు సోముని యింట్లో నిలువయున్నది గాన వాని సొత్తు లెక్కవేయుటలోఁగూడఁ జేర్చితిమేని యది తప్పు లెక్క యగును. దేశమునందు వాడుకలోనున్న గవర్నమెంటు కరన్సీనోట్లనన్నిఁటిని ప్రజలసొత్తుగ లెక్కవేసికొని, వీని క్రింద ప్రభుత్వమువారికి ముట్టి వారి ఖజానాలోఁ గలిసియున్న పైకమును గూడ ఖజా

నాలెక్కలోఁ జేర్చి యీరెండు లెక్కలఁ గూడిక జాతీయసంపద యని చెప్పినయెడల ఈ పొరపా టగును.

ఆస్తికొల్చు పద్ధతులు రెండు. అంతయు మొత్తముచేసి చెప్పుట యొకటి. ఒక భూస్వామియాస్తి యెంత యని యడిగినయెడల, ఆతని భూమి యంతయు లక్షరూపాయలు ఖరీదు చేయును అని చెప్పుట యొక పద్ధతి. ఆభూమివలన నాతనికి సంవత్సరమునకు నూఱుపుట్లు వచ్చును అని చెప్పుట మఱి యొకపద్ధతి. లక్షరూపాయిల విలువగల భూమి పదివేల విలువగల భూమికంటె నెట్లు ఎక్కువదో, యట్లే నూఱుపుట్లిచ్చు భూమి పదిపుట్లిచ్చు భూమికంటె నెక్కువదనియె యర్థము. మొత్తమువెల యనగ బాజారులో నా వస్తువును అమ్మినయెడల వచ్చు ధర. ఆదాయమును పట్టియే సాధారణముగ మొత్తమువెల హెచ్చుటయును తగ్గుటయుఁ గలదు. కాని కొన్ని సమయములందు నితర పరిస్థితినిఁబట్టి యీ నియమమునకు భంగము కలుగును. కృష్ణా గోదావరి జల్లాలలోని భూము లెకరమునకు పుట్టెడు పండును; నైజాము రాజ్యమందలి భూములుకూడ నెకరమునకుఁ బుట్టెడు పండును. కాని యిచ్చటి భూమికి నెకరమునకు వేయిరూపాయిలువచ్చును, అచ్చట భూములకు నెకరమునకు మూడువందలు వచ్చుట దుర్లభము. ఇట్లేల యగునో "విలువ, వెల" అను ప్రకరణమునఁ జర్చింపఁ బడును. ఇట్లు

సంపదను కొల్చువిధములు

ధనముయొక్క నిజమైనస్వరూపమును తెలిసికొనవలయు నన్న ఆదాయపు కొల్తమె ముఖ్యము గాని, మొత్తపుఁ గొల్త యంత ముఖ్యమైనది కాదు. ఆదాయము డబ్బురూపముగనె యుండ నక్కరలేదు. ఉపయుక్తతరూపముగ నుండవచ్చును. నే నొకయిల్లు కట్టి నెల కేబదిరూపాయలకు నద్దె కిచ్చిన, దానిని ఆదాయ మందురు. కాని యాయింటిలో నేనే యుండినందువలన నాకుఁ గల్గు సౌఖ్యము మాత్ర మాదాయము కాదా? వ్యవహారమునందు దీనిని ఆదాయ మనరు, సౌఖ్య మందురు. కాని శాస్త్రజ్ఞునకు నీ రెంటి యార్థికస్వరూప మొక్కటియే. ప్రపంచమునందు నన్ని వస్తువుల వెలలును ద్రవ్యరూపముతోఁ జెప్పెదరు. కావున వలయునప్పు డీ యనుభవమును రూపాయిలు అణాలుగాను మార్చుకొనవచ్చును.

వ్యక్తి ధనమును కొల్చునప్పుడు పైనిఁ దాహరింపఁబడిన రెండు మార్గములలో దేనిని అవలంబించినను అంతగాఁ జింత లేదు. కాని జాతీయధనముఁ గొల్చునప్పు డాదాయపుఁ గొల్తయే చేయవలెను. మొత్తము కొల్త తేలుట యసంభవము. హిందూదేశపు సంపదను లెక్కించునపుడు హిమాలయపర్వతము గంగ సింధు మొదలయిన నదులు, బంగారు గనులు మొదలగువాని మొత్తము వెలకట్టుట యెట్లు? ఎవరు కట్టఁగలరు? కావున నాదాయపుఁ గొల్తయే వేయవలయును. అనఁగా హిమాలయము మీఁది యరణ్యముల వలనఁ బ్రతిసంవత్సరము మనకు వచ్చు కల్ప మెంత?

చందనము లక్క మొదలయిన వెలగల ద్రవ్యము లెన్ని? ఏనుఁగులు మొదలయిన ఖరీదుగల మృగము లెన్ని? గంగాదినదులవలన నెన్ని లక్షల యెకరములు సేవ్య మగుచున్నవి? ఏ నదీప్రవాహపాతముల వలన నెంత విద్యుచ్ఛక్తి యుత్పన్న మగుచున్నది? గనులలో నుండి సంవత్సరమునకు సరాసరి యెంత బంగారము వచ్చును? అని విచారించి తెలిసికొనిన, వీని యన్నిటివలన దేశమునకు వచ్చు నాదాయము సహజముగఁ దెలిసికొనవచ్చును. వలయుచేని వాని వాని వెలలను బట్టి వీని నన్నిటిసి రూపాయిలలోనికి మార్చుకొనవచ్చును. ఇట్లు వచ్చినట్టి యాదాయమును ఆ దేశమందలి ప్రజలసంఖ్యతో భాగింపగా నా దేశమం దున్న ప్రతి మనుజుని యాదాయము రమారమిగఁ దేలును. ఇట్లు లెక్కవేయగా నీ క్రిందఁ జూపఁబడిన దేశములలోని యొక్కొక మానవునకుఁ బ్రతిసంవత్సరమును క్రిందఁ జూపఁబడిన యాదాయము వచ్చుచున్నట్లు తేలినది.

| దేశము. | | మొత్తముమీద ఒక్కొక మనుజుని సంవత్సరపు ఆదాయము. |
|---|---|---|
| 1. ఇంగ్లండు * | ... | ౪౮ పౌనులు. |
| 2. స్కాట్లండు | ... | ౩౬ ,, |
| 3. ఐర్లండు | ... | ౨౩ ,, |
| 4. క్యానడా | ... | ౩౬ ,, |
| 5. ఆస్ట్రేలియా | ... | ౩౬ ,, |
| 6. న్యూజీలండు | ... | ౪౦ పౌనులు. |
| 7. సౌథ్ఆఫ్రికా | ... | ౧౨ ,, |
| 8. హిందూదేశము | ... | ౨ ,, |
| 9. ఫ్రాన్సు | ... | ౨౭.౮ ,, |
| 10. జర్మనీ | ... | ౨౨.౨ ,, |
| 11. రషియా | ... | ౧౧.౫ ,, |
| 12. ఆస్ట్రియా | ... | ౧౫.౫ ,, |
| 13. బెల్జియమ్ | ... | ౨౨.౧ ,, |
| 14. హాలండు | ... | ౨౬ ,, |
| 15. డెన్మార్క | ... | ౨౩.౨ ,, |
| 16. యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా | ... | ౩౯ ,, |

* పైని ఈయఁబడిన ఆదాయములు పౌనులలో నీయఁబడినవి. వీనిని ౧౫ చే హెచ్చించిన రూపాయిలు వచ్చును. పైని ఇయ్యఁబడిన యంకెలలో 1 మొదలు 8 వఱకు నున్న దేశములు బ్రిటిషు సామ్రాజ్యములోనివి. ఈయంకెలు "నైంటీంత్ సెంచురీ"యను ఇంగ్లండులోని గొప్ప పత్రికయొక్క ౧౯౧౨ వ సంవత్సరపు ఆగష్టు నెల సంచికలో మిస్టర్ క్రామండ్ అను అంకెల శాస్త్రజ్ఞుని లేఖనుండి గ్రహింపఁబడినవి. మిగిలినవి ముల్హాలు యొక్క "డిక్షనరీ ఆఫ్ స్ట్యాటిస్టిక్స్" అను గ్రంథము నుండి గ్రహింపఁబడినవి. ఇవి మాత్రము కొంత పురాతనపు లెక్కలు. ఇవన్నియు నిప్పుడు జరుగుచున్న యూరోపులోని మహాయుద్ధమునకుఁ బూర్వపువి. ఈ యుద్ధము పూర్తియైన తరువాత నేదేశపుస్థితి యెట్లుండునో చూడవలయును. పై లెక్కలలో హిందూదేశమందలి ప్రతి మానవుని సాంవత్సరి కాదాయము ౨ పౌనులనగా రు ౩౦-౦-౦ లు అని చెప్పఁబడినది. ఇది అధికారులు చేసినట్టి లెక్క. కాని హిందూదేశార్థిక స్థితిని గురించి విచారించుటలో జన్మమంతయు గడిపిన మహర్షి దాదాభాయినౌరోజీ, డిగ్బి మొదలయిన వారు హిందూదేశమందలి ప్రతిమానవుని యాదాయమును సంవత్సరమునకు ౧ పౌను ౨ షిల్లింగుల ౧౦ పెన్సులు, అనగా రు ౧౭-౨-౦ అని సిద్ధాంతరీకరించి యున్నారు. చూడుడు డిగ్బీరచిత "ప్రాస్పరస్ బ్రిటిష్ ఇండియా"

అర్థశాస్త్రము ధనమును గుఱించి మీమాంసించు నంటిరి. కాని యది యేధనమును గుఱించి మీమాంసించును? వ్యక్తిధనమును గుఱించియా, దేశధనమును గుఱించియా, లేక ప్రపంచమందలి ధనమును గుఱించియా? యని కొందఱు అడుగ వచ్చును. ఇందునుగుఱించి శాస్త్రజ్ఞులలో భిన్నాభిప్రాయములు కలవు. కాని మొత్తముమీఁద నియ్యది దేశమందలి యార్థిక వ్యాపారములఁ జర్చించునదియు, జాతీయార్థిక జీవనమునకు (Economic national life) సంబంధించినది యగు శాస్త్ర మని శాస్త్రజ్ఞుల మతము. దేశమందలి వ్యక్తిసంపదను గుఱించిగాని, ప్రపంచసంపదను గుఱించిగాని యీ శాస్త్రమునందు ప్రాముఖ్యముగఁ జర్చ యుండదు. కాని దేశమందలి వ్యక్తిసంపదకును దేశసంపదకును కొంత సంబంధబాంధవ్యముకలదు. కావున దేశసంపదను చర్చించుటలో, దానితో సంబంధించినంతవఱకు వ్యక్తి సంపదను గుఱించియు నీ శాస్త్రము విచారించును. అట్లే ప్రపంచమందలి ధనమునకును దేశమందలి ధనమునకును కొంత సంబంధ ముండును. ఆసంబంధము మట్టుకు నీ శాస్త్రము విచారించును. మానవకోటి కంతయుఁ జెల్లునట్టి యార్థిక సిద్ధాంతములను దీసికొని తమ దేశముయొక్క పరిస్థితి ననుసరించి యీ సిద్ధాంతముల* నెట్లుపయోగపఱుపవలయునో యీ శాస్త్రము చెప్పును.

శాస్త్ర వ్యాప్తి

దేశమందలి మానవుల ధన మభివృద్ధి మైన కొలఁదిని జాతీయసంపద యభివృద్ధిఁ జెందును. దేశము లభివృద్ధి జెందినకొలఁది ప్రపంచమందలి సంపద యభివృద్ధి యగును. కావున దేశమందలి ప్రజలను ఇష్టము వచ్చినట్టు ధనాభివృద్ధి చేసికొన నిచ్చిన ప్రపంచధనమంతయు నభివృద్ధిఁ జెందు నన్న మత మొకటి కలదు. ఇందుఁ గొంతవఱకు (చాలభాగము వఱకు) సత్యము లేక పోలేదు. కాని యీ నియమమునకును అపవాదములు (exceptions) ఉన్నవి. రాజకీయ విషయమునందు వలెనే యార్థికవ్యవహారములందును దేశాభివృద్ధికై దేశమందలి వ్యక్తులు పెక్కుసారులు స్వలాభమును విడుచుటయే గాక నష్టముకూడ పెట్టుకొనవలసి వచ్చును. కావున దేశధనాభివృద్ధియే ముఖ్యము. ఇట్లే ప్రపంచధనాభివృద్ధికిని దేశధనాభివృద్ధికిని పోటి పడవచ్చును. అప్పుడు తమతమ దేశములధనాభివృద్ధికే ప్రాధాన్య మొసంగవలయును.

ఆర్థికవిషయమై యొకప్పుడు వ్యక్తి, దేశ, ప్రపంచములకుఁ గల్గు పోటిని చూపించుటకును, ఆవివాదమునందు దేశక్షేమమె ప్రధానాంశ మని తెలిసికొనుటకును స్వేచ్ఛావ్యాపారము (Free-trade) వ్యాపారసంరక్షణము (Protection) లకు సంబంధించిన వివాదయే యొక గొప్ప నిదర్శనము. స్వేచ్ఛావ్యాపారవాదులు చెప్పునది యేమనగా రెండు దేశముల మధ్య జరుగు వ్యాపారము (వర్తకము) ఏవిధమైన యడ్డు లేకుండ జరుగవలయును. ఈ దేశమునుండి యా దేశమునకుఁ బోవు సరకులమీఁద వర్తకమునకు భంగము కలుగు

నట్టి (సాయరు) పన్ను లా దేశపు ప్రభుత్వమువారు పుచ్చుకొనఁగూడదు. అట్లే యా దేశమునుండి యీ దేశమునకు వచ్చు వర్తక పుసరకులను గురించియు జరుగవలెను. ఇట్లయిన నా దేశమందు నేసరకులు బాగుగను చౌకగను అగునో యవి యీ దేశమువారికి చౌకగ దొరకును; ఈ దేశమునందు నే సరకులు బాగుగను చౌకగను అగునో యవి యా దేశమువారికి చౌకగ దొరకును. ఇట్లుభయదేశములవారికిని వస్తువులు చౌకగను విపులములుగను దొరికినందున రెండు దేశములును అధికధనవంతము లగును. ప్రపంచ ధనమును హెచ్చును. ఇట్లు స్వేచ్ఛావ్యాపారము లేక, పన్నులవలన వర్తకమునకు భంగము కలిగెనేని, వస్తువు లరుదై వానివెల హెచ్చి ప్రజలు నష్టపడుదురు. వీరు చెప్పునట్టి యీ సిద్ధాంతములో సత్యము లేకపోలేదు. ప్రపంచమంతయు నొక్క కుటుంబమువలె నైక్యభావ మొంది, అన్ని దేశములందును అన్ని కళాకౌశల్యములును సమానముగ నభివృద్ధిఁ జెందినప్పుడు స్వేచ్ఛా వ్యాపార మని మెడి యీ విశ్వజనీన సిద్ధాంతము తప్పక చెల్లఁగలదు. కాని వర్తకవిషయమై ప్రపంచమందలి మిగిలిన యన్ని దేశములను ఎప్పుడెట్లు మ్రింగుదునా యని ప్రతి దేశమును ఎదురు చూచుచున్న యీ కాలమునఁ గళాకౌశల్యములు మిక్కిలి బాల్యావస్థలో నున్న బీదదేశము లీ స్వేచ్ఛావ్యాపార తత్త్వమును అవలంబించినయెడల మూఁడు గడియలలో మృత్యుముఖమునఁ బడుటకు సందేహము లేదు. కావున బాగుపడఁ దలఁచిన దేశము బాల్యావస్థయం దున్న కళాకౌశల్యము లన్నిటికిని సంరక్షణ మొసంగ వలయును. సంరక్షణమువలన సంరక్షింపఁబడిన సరకు వెల హెచ్చును. కావున నా సరకును కొనువారికి నష్టము కలుగును. ఇందు కొక యుదాహరణము. ఇప్పుడు మల్లుబట్టలు పరదేశము నుండి వచ్చుచున్నవి. వీనిని స్వేచ్ఛగా దేశములోనికి రానిచ్చిన మనదేశమునందు మల్లుబట్ట లెన్నటికిని చేయుట సంభవింపదు. ఎందుకు? పరదేశీయు లిదివఱకు నీవిద్యయందు నారితేరి యున్నారు. వా రిచ్చు వెలకుఁ గ్రొత్తగ మనదేశమందుఁ జేయువారీయ లేరు. అందువలన నేమి చేయవలయును? పరదేశీయములైన మల్లులపై మిక్కుటముగ సాయరు పన్ను వేయవలయును. అందుచే నామల్లులు మనదేశమునకువచ్చుటమానును. లేదా వచ్చినయెడల వానిని ఎక్కువ వెలకు నమ్మవలసి వచ్చును. ఎక్కువవెల వచ్చుచున్నది కావున మనదేశమువారు మల్లులు చేయఁ దొడఁగెదరు. కొన్ని దినములలో నీవిద్యను చక్కగ నేర్చుకొని పరదేశీయు లంతటివా రగుదురు. కాని యిట్లు పరదేశపు మల్లులమీఁద పన్ను వేసినందున మల్లుల ఖరీదు హెచ్చి మల్లులు వాడువారికి నష్టము కలిగిన దనుటకు సందేహము లేదు. వారి ధనము తగ్గినది. ఇట్లు వ్యక్తిధనము తగ్గినను, అందువలన మల్లులును మల్లులకై వెచ్చింపఁబడిన ధనమును ఈదేశమునందె యుండును గనుకను, పరదేశమువారి దయకై మొగురు

చూచు నావశ్యకత లేక స్వయముగ మల్లులు తయారుచేయు సామర్థ్యము మనకుఁ గల్గును గనుకను ఈ సంరక్షణ పద్ధతి దేశ క్షేమ కరమని చెప్పవలెను. ఇట్లీ సంరక్షణపద్ధతి యొకవైపు ప్రపంచధనాభివృద్ధికిని వ్యక్తి ధనాభివృద్ధికిని విరుద్ధమైనను, దేశధనాభి వృద్ధికిఁ గారణం బగుటచే నంగీకరింపఁ దగి నది యయ్యె. కావుననే, అమెరికా, జర్మనీ, ఫ్రాన్సు, క్యానడా, ఆస్ట్రేలియా, జపాన్ మొదలయిన పాశ్చాత్య పౌరస్త్య ప్రముఖ దేశము లన్నియు నీసంరక్షణపద్ధతినే యవ లంబించి కొలదికాలములోనే వైభవదశను జెందినవి. మొదట సంరక్షణపద్ధతి నవలంబించి కళాకౌశల్యవ్యాపారములందు నందఱిని మించినతరువాత నింగ్లండు దేశము మాత్రము స్వేచ్ఛావ్యాపారతత్త్వమును నలువది యేబది యేండ్లనుండి అవలంబించి యున్నది. ఇప్పుడు హిందూదేశమునందలి పెక్కు కళాకౌశల్య ములకు సంరక్షణ యత్యంతావశ్యకము. సంరక్షణలేనిది హిందూదేశమందలి కళా కౌశల్యములు పైకి వెన్నటికిని రానేరవు. యుద్ధము ప్రారంభమై మూడు సంవత్సర ము లయి పరదేశములనుండి వచ్చు సరకులు విశేషముగ వచ్చుట ఆగిపోయినను, హిందూ దేశమందుఁ గళాకౌశల్యము లేవియు నభి వృద్ధిఁ జెందకుండుటకును, జపానువా రన్ని సరకులును చేసి హిందూదేశమును నింపఁ గల్గుటకును ఏమి కారణము? జపానులోని కళాకౌశల్యములకు సంరక్షణ మను ప్రబల మైన కోటయొక్క సాయముండి మన కళా కౌశల్యముల కట్టి దుర్గసాహాయ్యము లేక పోవుటయే యీ భేదమునకుఁ గారణము.

ఇట్లు దేశమందలి వ్యక్తులకు నష్టము వచ్చినను, ప్రపంచమందలి యితరదేశములకు నష్టము వచ్చినను దేశమునకు నేయేయార్థిక వ్యవహారములవలన లాభము కల్గునో వానినే యీశాస్త్ర మవలంబించును, బోధించును. వేఱు సంగతులను బోధించినను వానిని లక్ష్యపెట్టువా రెవ రుండరు.

అర్థలక్షణములలో "ఉపయుక్తత" (ఉప యోగము, ప్రయోజనము) అనునది మొద టిది యని మనము చూచి నారము. ఉపయుక్తత యన నేమి? మానవునకుఁ గల వాంఛలలో నెద్దానినైనఁ బూర్తిచేయు సా మర్థ్యము. కావున వాంఛాస్వభావమును కొంత కనుఁగొందము.

**వాంఛలు, కోరికలు**

లేమియు, దాని ననుసరించి యిది కావల యును అది కావలయును అన్న వాంఛలు, కోరికలు, సకలసంపదల యుత్పత్తికి ప్రథమ కారణములు. మానవుల సౌఖ్యాభివృద్ధికిఁ గారణము వాసనాచ్ఛేదమా లేక వాసనాభి వృద్ధియా యన్న ప్రశ్నకుఁ బ్రత్యుత్తరము పలువురు పలువిధములఁ జెప్పినను, వాసనా చ్ఛేదముల జేయఁ బూనుకొన్న సన్యాసికిఁ గూడ భిక్షా రూపమైన యర్థము కావలసి యున్నందునను, అట్టి యర్థమును సంపాదించి పెట్టు గృహస్థుఁ డుండుట సంసారమునకు నత్యంతావశ్యకం బనుటకు సందేహము లేదు. కోరిక లేనిది మానవుఁ డేపనియుఁ జేయఁడు,

ఏ సంపత్తిని పుట్టింపఁడు. కావున మానవ సౌఖ్యమును అభివృద్ధి చేయునట్టి యర్థములు (ద్రవ్యములు, పదార్థము) పుట్టవలయు నన్న దేశమందలి మానవుల వాంఛ లభివృద్ధిమై వారందఱును సోమరితనమును విడిచి పరిశ్రమలఁ జేయువారు కావలయును. మొదటి వాంఛలు సాధారణముగ శరీరసంబంధ మైనవి. ఆకలి పుట్టినప్పు డాహారము కానలయు నన్న వాంఛ పుట్టును. అందుపై మానవుఁ డరణ్యంబునఁ దిరిగి ఫలములఁ బోగుచేసికొని తినును. క్రమక్రమముగ కృషివిద్య యభివృద్ధి యగుటకు నీ వాంఛయే కారణ మైనది. ఇట్టి శరీరసౌఖ్యమునకు సంబంధించిన వాంఛల ప్రభావముచేతనె వస్త్రనిర్మాణము, గృహనిర్మాణము, శస్త్రాదినిర్మాణము, మృగయ మొదలయిన కళలన్నియు నభివృద్ధిఁ జెందినవి. కోరికలును వానిని దీర్చు సాధనములును అభివృద్ధిఁ జెందిన కొలఁదిని దేశము యొక్క నాగరికత, వైభవము హెచ్చును. జనుల వాంఛ లభివృద్ధిగాక యాదిమావస్థలోనే యున్న యెడల నా దేశము కూడ నట్టి యవస్థలోనే యుండును. పూర్వము ఢాకా (Deccan) పట్టణములో గాలికంటె సన్నముగ నుండు మల్లులు నేయుచుండిరి. హిందూదేశముయొక్క నాగరికత, సంపద హెచ్చి దానిఖ్యాతి ప్రపంచమంతయు వ్యాపించెను. అట్లు గాక హిందువు లాదిమనివాసులవలె నాకులు కట్టుకొనియు, తోళ్లఁ దొడుగుకొనియు సంతృప్తులై యుందురేని దేశ మట్టి యభ్యున్నతికి వచ్చియుండునా? ఇట్లే యితర ధనాభివృద్ధిని గుఱించి యెఱుంగునది. ఇప్పుడు పాశ్చాత్యదేశము లన్నియు నభివృద్ధిఁ జెంది పౌరస్త్యదేశములను మ్రింగివేయు సామర్థ్యము కలిగియుండుటకు నీవాంఛాభివృద్ధియే ముఖ్యకారణము. ఇప్పుడు జరుగుచున్న ప్రళయకరమైన యుద్ధమును చూచి మనుష్యప్రాణవిఘాతకారి యైన యీ నాగరకత మనకు వలదని కొంద ఱందురేమో. కాని స్వసంరక్షణమునకైనను మనము పాశ్చాత్యనాగరకవిద్యల నన్నిటిని నేర్చుకొన వలసినదే. లేనియెడల జీవనార్థకలహమునందు (Struggle for existence) పౌరస్త్య దేశము లన్నియు రూపుమాసి పోవలసినవె.

వాంఛలస్వభావమును గుఱించి యీ క్రింది విషయములను గమనింప వలెను:—

౧. వాంఛ లసంఖ్యములు. ఐహిక విషయము లసంఖ్యములు. కావున వానిని గూర్చిన కోరిక లసంఖ్యములు. ఒక కోరిక తీఱిన మఱియొకటి యుద్భవించును. అందుచే వానినితీర్చునట్టి వస్తువులు, పరిశ్రమలు, కళలు, విద్యలు అసంఖ్యములై, సంఘమునందు వ్యాపించుచుండును. మానవునివలెనే మానవ సంఘపు వాంఛలు కూడఁ గ్రమముగ నభివృద్ధిఁ జెందును, మారును. పసితనమునఁ బిల్లవానికి ఆకలి యైనప్పుడు పాలిచ్చినఁ జాలును. వాఁడు పెద్దవాఁ డైనకొలఁదిని వానికిఁ గావలసిన వస్తుసముదాయమును సౌఖ్యసముదాయమును హెచ్చును. అట్లే సంఘము బాల్యావస్థయం దున్నప్పుడు దానికిఁ గావలసిన సౌఖ్యసాధనము లత్యల్పములు. సంఘ

మభివృద్ధి మైనకొలదిని దానికిఁ గావలసిన సౌఖ్యసాధనము లధిక మగుచుండును. "అనాగరిక సంఘము" అను వ్యాసముఁ జూడుఁడు.

అభివృద్ధిఁ జెందుచున్న దేశమునందుఁ బూర్వపుతరమువారికంటెఁ దరువాతి తరము వారి వాంఛలు, కళలు అధికముగ నుండును. ఆరోగ్యము, ప్రవాసము స్వచ్ఛత, విద్య మొదలగు వానిని గుఱించిన కల్పనలు, వాంఛలు, కళలు దినదినాభివృద్ధిం జెందుచుండును. పందులును పొర్లాడుటకుఁ దగని మెఱుకల గుడిసె లెక్కడ? ఇరువది యంతస్తులు గల యమెరికాలోని మేడ లెక్కడ? గంట కరమైలయినను సాగని రాతిచక్రముల దున్న పోతుల బండి యెక్కడ? గంటకు వందలమైళ్లు పోయి దిక్కాలములను దిగ్భ్రమింగెడు రైలుబండ్లు మోటారుబండ్లెక్కడ? ఇట్లే యితర విషయముల నెఱుంగునది.

౨. వాంఛలకు మితి కలదు. వాంఛలసంఖ్యము లయినను అం దొక్కొక్కటి యనంతము, అపరిమితము కాదు. వాంఛ తీరినతోడనె యది నశించును. మానవుఁడు విషయమును కొంతవఱకు ననుభవించిన తోడనే వాంఛ తగ్గును. అది చివరకు లోపించును. ఆకలిమైనవాఁడు తనకు వలయునంత యన్నము తినగనే వానికి నన్నము మీఁది వాంఛ పోవును. వానికి నెక్కువ యన్నము పెట్టినయెడల నది సౌఖ్యకారి యగుటకు బదులు దుఃఖకారి యగును. శరీర సౌఖ్యములకు సంబంధించిన వాంఛలు త్వరగ శమించును. కాని సాంఘిక (Social) మానసిక, (Mental) బౌద్ధిక (Intellectual) వాంఛలంత త్వరగను, సులభముగను నశింపవు. ఇన్ని గుఱ్ఱములు గాని, ఇన్ని యేనుఁగులు గాని ఒకానొక జమీందారునకు సంతృప్తి కలుగఁ జేయుననియు, ఇన్ని నగలు ధరించిన యెడల హిందూస్త్రీ యికఁ జాలునని చెప్పుననియు నెవఁడు చెప్పఁగలఁడు? అయినను ఇట్టివాంఛలలోఁ గూడఁ గ్రమముగ సౌఖ్యము తగ్గు ననుటకు సందేహము లేదు. ఆపూట కన్నము లేనివానికిఁ బది మానికెలు వడ్లు దొరికిన నపరిమితానందము కలుగును. ఆ పదిమానికెల వడ్లె వందలపుట్లు నిలవయున్న వాని కబ్బెనేని యేమియు నానందమును కలుగఁ జేయ నేరవు.

ఎంత సంగ్రహము చేసినను తృప్తి కలిగింప నేరని వస్తువు నాణెములు. ఇందుకుఁ గారణ మేమనగా నన్ని వాంఛలను తృప్తి చేయునట్టి సాధనము నాణెమని మనుజుల నమ్మక మగుటచే దానిని నధికముగా సంగ్రహింపఁ గోరెదరు. (చూఁడు "నాణెము.")

3. వాంఛలు పరస్పరవిరుద్ధములు. అనగా నొక వాంఛ మఱియొక వాంఛను వెడలఁ గొట్టును. ఏకకాలమునందు రెండు వాంఛలు పని చేయ నేరవు. పెక్కు పర్యాయములొక వాంఛకు బదులు మఱియొక వాంఛను మార్చ వచ్చును. దీనినే "మాఱువాంఛలవిధానము" (Law of substitution) అని యందురు. దీని ననుసరించియే బైసికిళ్లు యమ్మక మధికము కాగానే గుఱ్ఱపు బండ్ల యమ్మకము

తగ్గును. వడ్ల ధర హెచ్చుగనే జొన్న లధికముగ నమ్ముడు పోవును. ఇంతియ గాదు. ఒకప్పుడు సంబంధము లేనివిగఁ గానవచ్చు పదార్థములకు సంబంధము కానవచ్చును. బైసికిల్లు, మోటరుబండ్లు ఎక్కుడుగ నమ్మకము పోదొడఁగి నప్పటినుండియు నింగ్లండుదేశమందు 'పియానో'లన్న వాయిద్యముల యమ్మకము తగ్గిన దఁట!

ఈ విధానము ననుసరించి నీతిజ్ఞులు కొందఱు మానవుల వ్యసనములఁ బోఁగొట్ట యత్నింతురు. త్రాగుబోతుతనమును మాన్పుటకు కాఫీ తేయాకుల యలవాటు చేయుదురు. వ్యభిచారాదులను మాన్పుటకు నాటకములకుఁ దీసికొని పోవుదురు. చీట్లు, క్రికెటు మొదలయిన యాటల నేర్పుదురు.

4. కొన్ని వాంఛలు పరస్పరాశ్రయములు (Complimentary). అవన్ని యుఁ గలిగినఁగాని ఉపయోగకరములు కావు. వేఱు వేఱుగఁ బ్రయోజనకారులు కాఁజాలవు. గుఱ్ఱము, బండి కలిపినఁగాని సముద్రపు గాలి ననుభవించు సౌఖ్య మబ్బనేరదు. గొప్పవారికి భోజనసౌఖ్య మబ్బవలయునన్న, వంటబ్రాహ్మణుఁడు, పెద్దపీటలు, వెండి పళ్లెరములు కావలయును!

౫. సహజముగఁ బ్రారంభింపఁ బడినవైనను వాంఛ లలవాటుచే దృఢమైన యాచారస్వరూపమును చెందును. వాడుకవలన వాంఛలు దృఢములయి ఆవశ్యకములుగఁ దోఁచును. కాఫీత్రాగుట జీవించి యుండుటకు నావశ్యకముగాక పోయినను, అలవాటుచే నది విడువఁజాలని యభ్యాస మగును. చెన్నపట్టణమునుండి తెలుఁగు దేశమంతటను క్రమముగ వ్యాపించుచున్న యీ దురభ్యాసము పరిత్యాజ్యము గదా! ఇట్లే సదభ్యాసములు కూడ నలవడ వచ్చును. స్వచ్ఛముగ నుండు నలవాటు పడిన యెడల తక్కువ జాతివారు తమ మురికియలవాటులను పరిత్యజించెదరు. సోమరిపోతులుగ నుండెడివారికిఁ గొన్ని పనులు నేర్పినయెడల వారి సోమరితనము పోవును.

ఈ శాస్త్రము సాధారణముగ మూడు విభాగములుగ వర్ణింపఁబడుట యాచారమై యున్నది. అర్థము యొక్క (౧) ఉత్పత్తి (Production) (౨) విభజనము (పంపిణి) (Distribution or Division) (3) వినిమయము (Circulation or Exchange). ఉత్పత్తికాండమునందు సంపదపుట్టి యది యభివృద్ధియగు విధమును, విభజనకాండమునందు సంపద దేశమందలి వేఱువేఱుజనులలోఁ బంచఁబడు క్రమమును, వినిమయకాండమునందు నొకవిధమైన సంపద మఱియొకవిధమైన సంపదలకు బదులుగా నొకరియొద్దనుండి మఱియొకరి యొద్దకు మార్పు ప్రకారమును వివరింపఁబడును. 'ధాన్యము'అను అర్థముఁ (సంపదఁ) దీసికొనుఁడు. ఒకానొక రైతు భూమిదున్ని వ్యవసాయము చేయుటవలన ధాన్యము పుట్టును. ఇది యుత్పత్తివిధము. ఉత్పన్నమైన ధాన్యములోఁ గొంతభాగము శిస్తుక్రిందను, కొంత కూలివాండ్లకును పోయి

శాస్త్రవిభాగములు

కొంత రైతునకు మిగులును. ఇది విభజన విధము. ఆ రైతు తనకు భోజనమునకుఁ గావలసిన ధాన్యమును ఉంచుకొని మిగిలినదానిని సంతకుఁగొనిపోయి యమ్మి, తనకుఁ గావలసిన దుస్తులు, పశువులు, గృహోపకరణములు మొదలైనవానిఁ దెచ్చును. ఇది వినిమయవిధము. ప్రతియర్థమునకును ఇట్టి అవస్థాత్రయమును మన మూహింప వచ్చును. కాని యీ మూడు అవస్థలు స్వతంత్రము లని గాని, సాపేక్షములు (Relative) కావని గాని, పరస్పరావలంబకములు కావనిగాని తలఁపఁ గూడదు. ఈ మూటికిని ఎల్లప్పుడును పరస్పర సంబంధము కలిగియుండును. విభాగమును వినిమయమును అనుసరించి ఉత్పత్తి హెచ్చుచుండును. వెట్టి వాండ్రచేఁ జేయించిన వ్యవసాయమువలని ఫలసాయమునకును, స్వంతముగఁ జేసికొనిన వ్యవసాయము వలని ఫలసాయమునకును భేదముండుట యందఱకుఁ దెలిసిన విషయము గదా! ఏల? ఫలసాయములో నుండి వెట్టివానికి వచ్చు భాగ మత్యల్పము. యజమానునకు వచ్చు భాగ మధికము. కావున వెట్టివాఁ డేడ్చుచుఁ బని చేయును. యజమానుఁడు సంతోషముతోఁ బని చేయును. ఇట్లే యుత్పత్త్యాదులు పరస్పరావలంబములు.

ఇట్లు పూర్వగ్రంథకారు లర్థమునుమూడు రూపములుగ వర్ణించినను ఇటీవల శాస్త్రజ్ఞులు "వినియోగము" (Consumption) అని మఱియొక స్వరూపమును కూడఁ జెప్పఁ దొడఁగిరి. "వినియోగము" అనగా నేప్రయోజనముకొఱకు అర్థము పుట్టినదో ఆప్రయోజనముకొఱకు దానిని ఉపయోగించుట. ధాన్యమును వండి భక్షించుట, దుస్తులను ధరించుట, గృహములలోఁ గాపుర ముండుట ఆయా యర్థముల వినియోగములని తెలిసికొనవలెను.

ఇటీవల "దేశీయార్థశాస్త్రము" అనునొక శాస్త్ర మభివృద్ధిఁ జెందినది. ఇదియే "దేశసంబంధమైన జమాఖర్చు" (National Budget) అనియు స్వతంత్రశాస్త్రముగ నభివృద్ధిఁ జెందుచున్నది. ఇందు ప్రభుత్వమువారి యాదాయవ్యయములను గుఱించి మీమాంసింపం బడును.

అర్థశాస్త్ర మీ "సర్వస్వము" నందు "ఉత్పత్తి" "విభజనము" "వినిమయము" "వినియోగము" "దేశీయాదాయ వ్యయములు" "వర్తకము" "నాణెములు" అను వ్యాసములలో వివరింపఁ బడును. కావున నాయావ్యాసములఁ జూడ నగును. ఇచ్చట నీ శాస్త్రముయొక్క చరిత్ర సంగ్రహముగ నిచ్చెదము.

### అర్థశాస్త్ర చరిత్రము.

అర్థశాస్త్రమనునది పాశ్చాత్య దేశమందు నిటీవల నభివృద్ధిమైన శాస్త్రము. గ్రీకుతత్వవేత్తయయిన ప్లేటో తన "ప్రజాప్రభుత్వము" (Republic) అను గ్రంథమునందును, అరిస్టాటలు "రాజనీతి" (Politics) అను గ్రంథము నందును ధనమునకు సంబంధించిన కొన్ని విషయములను చర్చించిరి. కాని మన యర్థశాస్త్రములందువలెనే, వారును ధనసంబంధ

మైన విషయములు రాజనీతిశాస్త్రము (Politics) యొక్కయు, నీతిశాస్త్రము (Ethics) యొక్కయు చిన్న భాగములుగ వర్ణించిరి. వారి కాలమందు "దేశసంపద" యను విషయమునకు స్వతంత్ర శాస్త్రాధికారము రాలేదు. అమెరికాఖండము క్రొత్తగ దొరకిన తరువాతను, హిందూదేశాదికములకుఁ బోయి వర్తకముచేయుటకై జలమార్గము తెలిసిన తరువాతను, యూరోపుదేశ మంతయుఁ గళాకౌశల్యాదికములందును, వర్తకమునందును అభివృద్ధిఁజెంది ధనార్జన మధికముగఁ జేయఁ బ్రారంభించిన కొలఁదిని, అందలి వేఱువేఱుదేశముల వారికి నితరులకంటె దా మధికధనవంతులము కావలయు నన్న కోర్కె పొడమెను. ఆ కోర్కెయే యీ శాస్త్రము పుట్టుటకును, అభివృద్ధిఁ జెందుటకును కారణము. ఇట్లీ శాస్త్ర మభివృద్ధియై భిన్న భిన్న శాస్త్రజ్ఞుల యభిప్రాయములనుబట్టి యిందు పెక్కు సంప్రదాయములు (Schools of thought) కలిగినవి. వానిలో ముఖ్యమైన వానిని ఇచ్చట సంగ్రహముగ వివరించెదము.

వ్యాపారసంప్రదాయము

పాశ్చాత్యార్థశాస్త్రము తలయెత్తిన తరువాత మొట్టమొదటఁ బేరుగన్న సంప్రదాయమును వ్యాపారసంప్రదాయ (Mercantile system) మందురు. వీరి మతమున సంపదయనగా ద్రవ్యము, బంగారము, వెండి, రూపాయిలు, నవరసులు మొదలయినవి. ఒకనియొద్ద వేలకొలది రూపాయిలు, నవరసులు ఉన్నయెడల వాఁ డెట్లు ధనవంతుఁ డనిపించుకొనునో యట్లే యేదేశమునందు డబ్బు అధికముగ నుండునో యది ధనవంతమైన దేశము. కావున దేశక్షేమముఁ గోరువారు దేశమందున్న వెండి బంగారమును పరదేశమునకుఁ బోనియఁ గూడదు; వీ లగునంతవఱకుఁ బరదేశమందలి వెండి బంగారము తమ దేశమునకు వచ్చునట్లు చేయవలెను. తెలివిగల మానవుఁ డెట్లు తన ఆదాయము హెచ్చుగను, వ్యయము తక్కువగను ఉండునట్లు చేసికొని ధనమును వృద్ధి చేసికొనునో, యట్లే దేశంబును ఎక్కువ డబ్బు సంపాదింపవలెను. తక్కువ డబ్బు కర్చు చేయువలెను. అదెట్లు? పరదేశమునకుఁ బంపు సరుకు లెక్కువగాఁ బంపినయెడల వాని వెలక్రింద దేశములోనికి నెక్కువ ధనము (డబ్బు, నాణెములు) వచ్చును. పరదేశమునుండి మన దేశమునకు వచ్చు సరుకులు తక్కువగ నున్నయెడల వాని ఖరీదు క్రింద మనము పరదేశమునకుఁ దక్కువ డబ్బు పంపవలసివచ్చును. ఇట్లు దేశమునుండి యెగుమతి యగు సరుకులు దేశముయొక్క యాదాయము; దేశములోనికి దిగుమతియగు సరుకులు దేశముయొక్క వ్యయము. కావున నేదేశమున నెగుమతులకంటె దిగుమతులు తక్కువగ నుండునో యాదేశమునకు లాభము కలుగుచున్న దనియు, అందలి సంపద వృద్ధి యగుచున్న దనియుఁ దాత్పర్యము. ఇట్లగుటకుఁ బరదేశవస్తువులు మన దేశమునకు రాకుండ వానికి నిర్బంధము కలిగింప వలయును. మనదేశపు సరుకులు పరదేశము

లకు నధికముగఁ బోవునట్లు చేయవలెను. వ్యవసాయమునకన్న వర్తకమే యెక్కువగ దేశసంపదను అభివృద్ధిచేయును.

ఈ సంప్రదాయ గ్రంథకారు లంతగఁ బ్రఖ్యాతులు కారు. కాని యీ సంప్రదాయ సిద్ధాంతములను ఇంగ్లండునందు క్రామ్‌వెల్, ఫ్రాన్సులో కొల్బర్టు అను మంత్రి అవలంబించి, ఈ రాజ్యకార్యకుశలు లిద్దరును తమ దేశమందలి కళాకౌశల్యములను అభివృద్ధి చేసి, పరదేశమునుండి వచ్చు దిగుమతుల మీద నెక్కుడు పన్నులు విధించి, స్వదేశజ కళలను పరదేశీయకళల స్పర్ధనుండి తప్పించి, దేశముయొక్క యార్థికస్థితిని, అందు మూలకముగ తమ దేశముయొక్క వైభవమును సామర్థ్యమును హెచ్చించిరి. క్రామ్‌వెల్ కాలమున వర్తకమునందు వళందులు (హాలండువారు) ఇంగ్లండుదేశమునకు ప్రతిస్పర్థులుగ నుండిరి. వారి వర్తకమును తగ్గించి యింగ్లండు వర్తకమును హెచ్చించుటకై, ఇంగ్లండుకువచ్చు దిగుమతులుగాని, అచ్చటి నుండిపోవు ఎగుమతులు గాని ఇంగ్లండులో చేయఁబడినట్టియు, ఇంగ్లీషువారి హక్కయినట్టియు, నింగ్లీషునావికులచే నడుపఁబడుచున్నట్టియు ఓడలలోనే తీసికొనిపోఁబడవలయునన్న నియమము చేసెను. ఇట్టి నియమ మిప్పుడు మనదేశమును గురించి ఇండియా ప్రభుత్వము వారు చేయుదురు గాక!

పై సంప్రదాయమువారికి వ్యతిరేకముగ ఫ్రాన్సు దేశమందు నిసర్గ సంప్రదాయము

నిసర్గ సంప్రదాయము

(Phyciocrats) ఒకటి పుట్టెను. దీని ప్రథమ ప్రవక్త (expounder) క్వెస్నే యనువాఁడు. ఈతఁడు ఫ్రెంచిరాజయిన ౧౫వ లూయీకి వైద్యుఁడు. ౧౭౫౮ లో నర్థశాస్త్రగ్రంథ మొకటి ప్రకటించెను. త్వరలోనే యీతనికిఁ బెక్కుపండితులు శిష్యులైరి. వీరి ముఖ్యసిద్ధాంతములు రెండు:—

(౧) వెండి బంగారములను బట్టి దేశముయొక్క సంపదను కొల్చుటకు వీలులేదు. దేశమందుఁ గల యాహారాది పదార్థములను బట్టియే కొల్వవలెను. ఒక దేశమునందు బంగారము చాల తక్కువగ నుండవచ్చును. ధాన్యాదికములు సమృద్ధిగ నుండి యది సంపత్సమృద్ధిగ నుండవచ్చును. వ్యవసాయమే నిజమైన ధనోత్పాదకము. కళలవలనను వర్తకమువలనను ధనముయొక్క రూపము మారునేగాని అవి నూతనధనమును పుట్టింపనేరవు. కావున నివి ధనోత్పాదనవిషయమై గొడ్డుబోతులని చెప్పవలెను.

(౨) రాజకీయ విషయములలో వ్యక్తులకు స్వాతంత్ర్య ముండుట యెటు లావశ్యకమో యట్లే యార్థిక విషయములందు జనుల కందఱకును స్వాతంత్ర్య ముండవలెను. ఎవని మేలు వానికిఁ జక్కఁగఁ దెలియును. కావున వర్తకాదులయిన యార్థిక వ్యవహారములలోఁ బ్రభుత్వమువారు జోక్యము కలుగఁజేసికొనఁ గూడదు. జనుల యిష్టప్రకారము పోనిచ్చిన యెడల మొత్తముమీద దేశమునకు నేది మేలో యదియే జరుగును. నైస

గ్గికముగ లోకమునందు జరుగు ఆర్థికవ్యాపారములను ఏవిధమునను అడ్డగింపఁ గూడదని వీరు చెప్పుటచే వీరికి నిసర్గసంప్రదాయమని పేరువచ్చెను. వీరి మతమున దేశీయవ్యాపారమునకు నడ్డు ఉండఁగూడదు. ఎగుమతి దిగుమతు లే విధమైన యడ్డును లేకుండ జరుగవలయును. ఈ సంప్రదాయ సిద్ధాంతములను కొంతవఱకు నమలులోఁ బెట్టినవాఁడు ఫ్రెంచి మంత్రి టర్గాట్ (౧౭౨౭–౮౧).

ఉదారసంప్రదాయము

ఇంగ్లండు దేశమునందును, అర్థశాస్త్రమునందును రమారమి నూఱుసంవత్సరముల వఱకును అధిక లోకప్రియమైన సంప్రదాయమునకు ఉదార సంప్రదాయము (Liberal school) * అనిపేరు. దీని మొదటి ప్రవక్త ఆడమ్‌స్మిత్ అనువాఁడు. ఈతనికి "అర్థశాస్త్రముయొక్క జనకుఁడు" అని పేరు వచ్చెను. ఈతఁడు స్కాచ్ దేశజుఁడు. ౧౭౭౬ లో నీతఁడు "దేశముల సంపద" (Wealth of Nations) అనుగ్రంథముఁ బ్రకటించెను. ఇయ్యది యర్థశాస్త్రగ్రంథములలో మిగులఁ బ్రఖ్యాతిఁ జెందెను. ఈ గ్రంథమునందు స్మిత్ తనకుఁ బూర్వులయిన యర్థశాస్త్రజ్ఞుల గ్రంథములనుండి వలసిన విషయములను దీసికొని తన బుద్ధివిశేషమువలనను బహుశ్రుతత్వమువలనను ప్రపంచవ్యవహార నిరీక్షణమువలనను సంపాదించిన విశేషజ్ఞాన మందులోఁ జేర్చి యర్థశాస్త్రమునకు నొక వ్యవస్థిత స్వరూపము నొసంగెను. ఈతఁ డీ శాస్త్రలక్షణమును సశాస్త్రీయముగ నిర్వచించి శాస్త్రమర్యాదల నేర్పఱిచెను. ఈగ్రంథ మైదు విభాగములు కలది. ఇందు వ్యాపారసంప్రదాయ సిద్ధాంతములు ఖండింపఁ బడినవి. నిసర్గసంప్రదాయమువారి సిద్ధాంతములలోని గొన్ని అంగీకరింపఁబడెను. కొన్నిటిని ఖండించెను. భూమియే ధనోత్పాదకము, కళాకౌశల్యములు ధనోత్పాదకములు కావు అన్న సిద్ధాంత మపసిద్ధాంతమని యీతఁడు ప్రతిపాదించెను. కాని యార్థికవ్యాపారములు కొన్ని నిసర్గనియమములను అనుసరించి జరుగుననియు, వానిని ప్రభుత్వమువా రడ్డగింపఁ గూడదనియు నన్న సిద్ధాంతమును అంగీకరించి యీతఁడు స్వేచ్ఛావ్యాపారమును (Free-trade) గట్టిగ సిద్ధాంతీకరించెను. శ్రమ విభాగతత్త్వమును (Division of labour) విశేషముగ వివరించెను. శ్రమ (Labour) యనునదియుఁ గూడ భూమితోఁ బాటు ధనోత్పాదనమునకుఁ గారణమని నూతనముగఁ బ్రతిపాదించినది యీతఁడే.

ఈ సంప్రదాయమునందు ఆడమ్‌స్మిత్తు తరువాత బ్రఖ్యాతి చెందినవాఁడు మాల్‌తస్ (౧౭౬౬–౧౮౩౪). ఈతఁడు ప్రజాభివృద్ధిని గుఱించి యొక యూహను ప్రతిపాదించి దానికి నర్థశాస్త్రముతో సంబంధము కలిపెను. దేశమునందుఁ బ్రజలు తొందరగ నభివృద్ధి యగుదురు. వారి జీవనమునకుఁ గావలసిన యాహార మంత తొందరగ నభివృద్ధి-

* దీనినే, ఆర్థడాక్సుస్కూలు, మ్యాంచెస్టరుస్కూలు, క్లాసికల్ స్కూలు అందురు.

కాదు. ప్రజలు భూమితిశ్రేఢి (Geo-metrical progression) ప్రకారము, అనగా ౧, ౨, ౪, ౧౬, ౩౨ అను క్రమమున నభివృద్ధి యగుదురు. కాని యాహారద్రవ్యము మాత్రము గణితశ్రేఢి (Arithmetical progression) ప్రకారము, అనగా ౧, ౩, ౫, ౭, ౯, అను క్రమమున హెచ్చును. ఇట్లు ప్రజలసంఖ్య విచ్చలవిడిగఁ బెరుగనిచ్చినయెడల దేశమునందు నన్నములేక ప్రజలు మలమల మాడవలయును. కావున దేశమందలి జనులు సంతానమును రక్షించు శక్తివచ్చినఁగాని వివాహము చేసికొనకయుండియు, నింద్రియదమనము చేసియుఁ బ్రజాభివృద్ధి మితిమీఱకుండఁ జేయవలయును అని యాతని ముఖ్యసిద్ధాంతము.

ఈ సంప్రదాయమందలి మూడవ ప్రవక్త రికార్డో (౧౭౭౨-౧౮౨౩). ఈతఁడు భూమియద్దెను (Rent) గుఱించి క్రొత్త యూహలను మీమాంసించెను. అట్లే దేశ దేశములకు జరుగు వర్తకముయొక్క తత్వమును చర్చించెను. రేఖాగణితమువలె నర్థశాస్త్రము తర్క ప్రధానమనియు, దీనికి నవలోకనము, ప్రపంచానుభవముతోఁ బనిలేదనియుఁ బ్రతిపాదించెను. సంఖ్యా (Numbers) పరిమాణము (Magnitude) లకుఁ గల స్వయంసిద్ధ ధర్మములను బట్టి యేప్రకారముగ గణితశాస్త్రమన్ని సిద్ధాంతములను సాధించునో, యట్లే మానవ స్వభావమందుఁ గల స్వయంసిద్ధతత్వములను అనుసరించి అర్థశాస్త్రమందలి యన్ని సిద్ధాంతముల సాధింపవచ్చును. గణిత సిద్ధాంతముల వలెనే యీ శాస్త్రమందలి సిద్ధాంతములు కూడ సర్వకాల సర్వావస్థల యందును చెల్లును. ఈ శాస్త్రజ్ఞుని కాలమునుండి యర్థశాస్త్రమున కిట్టి తార్కిక రూపము ప్రాప్తించుటవలన నా శాస్త్రమునకు నష్టము కలిగినది. ఇట్టి తార్కికపద్ధతి నవలంబించి సాధింపఁ బడిన సిద్ధాంతములకును లోకానుభవమునకును ఐక్యము లేకుండగనై యీ శాస్త్రముయొక్క యోగ్యతను గుఱించి జనులకు సంశయము కలుగ నారంభించెను.

పై ముగ్గురును ఉదారమతమునకు మునిత్రయమువంటివారు. వీరి తరువాత నీ మతమునఁ బేరును బ్రఖ్యాతియుఁ జెందినవాఁడు జాన్‌స్టుఅర్టుమిల్లు (౧౮౦౬-౧౮౭౩). ఈతఁడు పందొమ్మిదవ శతాబ్దమధ్యమునందు నింగ్లండులో నుండిన గొప్ప తత్వవేత్త. ఈతని భాషాశైలియు, విషయ వివేచనపద్ధతులును నత్యద్భుతము లయినందున ఈతని యర్థశాస్త్రగ్రంథ మేబది యేండ్లవఱకును ప్రమాణగ్రంథమై విలసిల్లెను. ఈతఁడు సాధారణముగఁ బురాణ మతప్రియుఁ డైనను కొంతవఱకు సాంఘికసంప్రదాయాభిమానియు నైయున్నందున వారి సిద్ధాంతములును కొంతవఱకు గ్రహించెను. ఇట్లీతఁడు అర్థశాస్త్ర విషయమై నూతన నవీనమతములకు సంధికాలమువాఁడు.

మిల్లుతరువాత నింగ్లండునందు జవన్సు, కె, అర్నన్, ఫాసెట్, సిజ్‌విక్, నికల్సన్,

మొదలయినవారును, ఈ సంప్రదాయమునే చాలవఱకు ననుసరించిరి.

ఉదార సంప్రదాయపు సిద్ధాంతములు త్రికాలాబాధితములు కావనియు, రాజకీయ పారిశ్రామిక విషయముల లో వెనుకఁబడ్డ జర్మనీ మొదలయిన దేశముల లోని వస్తుస్థితి వానిని పూర్వపక్షము చేయు చున్నదనియుఁ గానవచ్చినందున జర్మనీదేశ మునందు చారిత్రక సంప్రదాయ మొకటి పుట్టెను. దానికి మొదట త్రోవచేసినవారు ఆదమ్‌మ్యుల్లర్, ఫ్రెడరిక్‌లిస్ట్ అనువారు. ఈ సంప్రదాయమును స్థాపించి దానికిఁ బ్రచా రము కలుగఁజేసినవారు రోషర్, హ్యాల్డీ బ్రాండ్, నాయిస్ అనువారు.

చారిత్రక సంప్రదాయము

ఆదమ్‌మ్యుల్లరు ఆదాముస్మిత్తు గ్రంథ మును ఖండించెను. స్మిత్తు అర్థశాస్త్రము వ్యక్తిసంపదను గుఱించినది గాని దేశసంప దను గుఱించినది కాదు. అందు దేశీయదృష్టి లేకపోఁగా, ధనముకంటె వేఱు విషయము లందు నెచ్చటఁ జర్చింపఁ బడలేదు. దేశము యొక్క బౌద్ధిక, నైతిక, పారిశ్రామిక విష యములను గూడ నర్థశాస్త్రము చర్చింప వలెను. శ్రమవిభాగము మూలధనాభివృద్ధి ననుసరించి యుండుననియు శ్రమవిభాగము తోఁబాటు శ్రమసంయోగముకూడ నావశ్య కము లనియు స్మిత్తు ఎఱుంగఁడు. స్మిత్తు యొక్క యర్థశాస్త్రము సముద్రవేష్టితమగు నింగ్లండునకుఁ జెల్లునే కాని యితర దేశము లకుఁ జెల్లదని యాతఁడు స్మిత్తు గ్రంథమును ఆక్షేపించెను.

లిస్టు అనుగ్రంథకారుఁడు పై గ్రంథకారుని దేశీయ సిద్ధాంతములను విపులీకరించి తన గ్రంథమునకు దేశీయార్థశాస్త్రము (National Economy) అని పేరుపెట్టెను. మానవ స్వభావమును పరీక్షించినను, ఇప్పుడు ప్రపం చమందుఁ గానవచ్చెడి మానవవ్యాపారము లను నిరీక్షించినను, ప్రతిదేశమును, ప్రపంచ క్షేమముతో లంకెపెట్టుకొనక, తన క్షేమ మును సాధించుకొనవలయును. అట్లు ప్రతి దేశమును చేసినయెడల మానవకోటి యంత యు బాగుపడుదురు. ప్రతిదేశమును ఇతర దేశ సాహాయ్యము నపేక్షింపక అన్నియర్థము లను పుట్టించునట్టిశక్తిని సంపాదింప వలెను. అందుకై వ్యవసాయము, కళాకౌశల్యములు కార్ఖానాలు, వర్తకము మొదలయిన యన్ని యార్థిక వ్యాపారములను అభివృద్ధి చేయ వలెను. ఇందుకు సంరక్షక మార్గమునే (Protection) అవలంబింపవలెను అని యతని తాత్పర్యము.

ఇట్లీ యిద్దరు శాస్త్రజ్ఞులు చరిత్రసంప్ర దాయమునకు మార్గము కల్పింపగా నా సంప్రదాయము రోషర్ మొదలయినవారిచేఁ బ్రతిపాదింపఁబడియె. వీరిముఖ్యాభిప్రాయము లేవియనగా,

అర్థశాస్త్రము తర్కపద్ధతిని (Deductive) అవలంబింపఁగూడదు. అది యనుభవశా స్త్రము. కావునఁ బ్రతిదేశముయొక్కయు నార్థికచరిత్రమును బట్టి యర్థశాస్త్రసిద్ధాంత

ముల సాధింపవలయునే గాని అన్ని కాలము లకును, అన్ని దేశములకును పనికివచ్చు శాస్త్ర ముండఁ జాలదు. కావున మొదటఁ బ్రతిదేశము యొక్కయు నార్థికచరిత్రములు తయారు కావలయును.

ఈ సంప్రదాయమువారి ప్రయత్నము వలనఁ బాశ్చాత్యదేశములయొక్క వేలు వేలు ఆర్థికచరిత్రములు సిద్ధమయినవి. వాని ననుసరించి ఉదారసంప్రదాయమందలి పెక్కు లోపములు చూపఁబడినవి. జర్మనీలో నీ మతమువా రెక్కువగాఁ గలరు. ఇంగ్లండు దేశమునందును ఇటీవల నీ సంప్రదాయము వారి శిష్యు లధిక మగుచున్నారు.

సాంఘిక సంప్రదాయము

దేశమునందుఁ గొందఱియొద్ద మాత్రము ధన మెక్కువగఁ జేరుటయు, చాలమంది దరిద్రులుగ నుండుటయు, ఏమియుఁ బనిచేయనివాఁడు ధనవంతుఁడుగ నుండుటయు, రాత్రింబగలు కష్టపడువారికి జీవనమైనను జరుగకుండుటయు మనము చూచుచున్నారము. "ఇది నిసర్గమనియు, స్వభావమనియు, దీనికి నెవ్వరేమియుఁ జేయలేరనియుఁ జెప్పుట నిజముకాదు. ఈ భేదములకు సంఘమందలి యాచారములు, చట్టములు కారణములు. బలవంతులు బలహీనులను అణగఁద్రొక్కి భూమియు నితరసొత్తులును ఆక్రమించి తాము శ్రీమంతులై యితరులను బీదలను చేసిరి. చట్టములును తమకు అనుకూలముగఁ జేసికొనిరి. ఆస్తి మీఁద వ్యక్తులకు స్వామ్యము (Individual ownership) కలిగి యుండుటవలన నీ యన్యాయములు కలుగుచున్నవి. సొత్తుపై సంఘమునకు స్వామ్య ముండవలయునే గాని వ్యక్తికి స్వామ్య ముండఁగూడదు?" అని వాదించు సంప్రదాయ మొకటి కలదు. దీనికి సాంఘికసంప్రదాయము (Socialism) అని పేరు. సెంట్‌సిమన్, ఫోరియర్, కర్ల్‌మ్యాక్స్, ల్యాస్సాలె మొదలయిన వారీ సంప్రదాయప్రవర్తకులు. ఈ సంప్రదాయమును గుఱించి స్వతంత్రవ్యాసము వ్రాయుచున్నాము. కావున నిచ్చట విస్తరింపలేదు.

కొందఱు నీతిశాస్త్రదృష్టితో నర్థశాస్త్రమును మీమాంసించి యిది మానవజాతికి హానికరమైన శాస్త్రమని చెప్ప యత్నించిరి. కార్లయిల్ రస్కిన్ మొదలయిన వాఙ్మయప్రణేత లిట్టివారు. కాని వారి వ్రాతలు వాఙ్మయమును అభ్యసించువారికి వినోదముగ నుపయోగకరములే గాని తత్వజిజ్ఞాసులకుఁ బనికిరావు. మేధావులు లెట్టి మంచి విషయమునైనను చెడ్డవిషయముగ నెట్లు చూపఁగలరో యందుకు నీ మహా గ్రంథకర్తలే యుదాహరణములు.

హిందూదేశమందలి అర్థశాస్త్రముల చరిత్రకై "అర్థశాస్త్రములు" అన్న వ్యాసముఁ జూడనగును. ఈ శాస్త్ర సంబంధమైన పారిభాషిక పదములకై "ఉత్పత్తి" అను వ్యాసముఁ జూడనగును.

గ్రంథ సంగ్రహము.— ఈ శాస్త్ర విషయమైన గ్రంథము లింగ్లీషున నసంఖ్యాము లున్నను తెలుగున శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారి "అర్థశాస్త్రము"

తప్ప వేఱు గ్రంథము లేదు." ఈ భాగము లిదివఱకు విజ్ఞాన చంద్రికలోఁ బ్రకటింపఁబడినవి.

[కొ. ల.

**అర్థశాస్త్రములు.** (హిందూ దేశ మందలివి) హిందూదేశమునందు వేదాంత మెక్కువ గనుక జనులకు నర్థములయందు నాసక్తిలేక వారు అర్థములనుగుఱించి విశేష ప్రయత్నములను చేయ లేదనియు, అందువలన నర్థశాస్త్రములు హిందూదేశమునందుఁ బుట్ట లేదనియుఁ గొందఱు చెప్పెదరు. ఇట్లను వారిలోఁ గొందఱు హిందూదేశ భక్తులు, కొందఱు హిందూదేశ నిందకులు. భక్తు లిట్లుల చెప్పెద రనగా, హిందూదేశమందు వేదాంతవైరాగ్యము లెక్కువ యని చెప్పిన యెడల నది పాశ్చాత్య దేశములకంటె పారమార్థిక విషయ విచారమున నత్యధిక మైన దిగాఁ దేలునని వీరి భావము. నిందకులును ఇట్లు చెప్పుటకుఁ గారణము హిందూదేశము కళాకౌశల్యముల యభివృద్ధికిఁ దగిన దేశము కాదు; ఇతర దేశములవారి సరకులు కొను చుండుటయే వీరి పని యని సూచించుటయె. కాని వీరిద్దఱుఁ జెప్పునది నిజమైన విషయము కాదు.

ఏ దేశమునందును ఏకాలమునందును పరమార్థవిచారముఁ జేయువారు బహుస్వల్ప సంఖ్యాకులు. ఐహికార్థములను గుఱించి విచారించు వా రసంఖ్యులు. ఈ నియమమునకు, హిందూదేశము మాత్ర మపవాదము కాదు. సంస్కృతమునందు వేదాంత గ్రంథములు పెక్కు లున్న వనువారు శృంగార రసమును వర్ణించు అలంకార గ్రంథముల సంఖ్యయు, నాయికానాయకుల యపరిమిత శృంగార చేష్టలను వర్ణించు కావ్యముల సంఖ్యయు, కామశాస్త్రములను మఱవఁ గూడదు. శిల్పాదిశాస్త్రంబులును పెక్కులు కలవు. ఇంగ్లీషు ప్రభుత్వము ప్రారంభమగు వఱకును, హిందూదేశమందలి కళాకౌశల్యముల ఖ్యాతి జగమంతయు వ్యాపించియుం డెను. మనవా రైహికవిషయములను లక్ష్యపెట్టనివారు గాని, చేతకానివారు గాని, అయినయెడల మనదేశ మిట్టి వైభవమునకు నెట్లు వచ్చి యుండును? కావున గ్రీసురోము మొదలయిన దేశజులతోఁ బాటు హిందువులలోఁ గొందఱు మాత్రము అధ్యాత్మవిద్య నభ్యసించిరి. మిగిలిన వారందఱును సంసారమునకు నుపయుక్తమైన పనులఁ జేసిరి. అందుచే మనదేశమందును కొన్ని అర్థశాస్త్రములు పుట్టెను.

పురుషార్థములను బట్టి మనవారు శాస్త్రము లన్నిటిని నాల్గు విధములుగ విభజించిరి. ధర్మశాస్త్రములు, అర్థశాస్త్రములు, కామశాస్త్రములు, మోక్షశాస్త్రములు. మన్వాది స్మృతులు ధర్మశాస్త్రములు, శుక్రనీతిమొదలయినవి అర్థ శాస్త్రములు, వాత్స్యాయన సూత్రాదులు కామశాస్త్రములు, బ్రహ్మసూత్రాదికములు మోక్షశాస్త్రములు. ఈ నల్గురు శాస్త్రకారులలోఁ బరస్పర విరోధములు వచ్చినప్పు డేశాస్త్రము ప్రమాణ మన్న విషయమున అభిప్రాయ భేదములు

కలవు. * ప్రస్తుతము మనకు నితర శాస్త్రములతోఁ బని లేదు. అర్థశాస్త్రముతోఁ బని కలదు. కావున నందును గుఱించియే విచారింతము.

"ఎందు శ్రుతిస్మృతివిరోధము లేకుండ రాజధర్మములును, మంచి కౌశలముచే ధనార్జనముచేయు నుపాయములును ఉపదేశింపఁబడి యుండునో యది అర్థశాస్త్రము" అని శుక్రనీతియందున్ ఈశాస్త్రలక్షణము చెప్పఁబడి యున్నది. ఇందువలన నీశాస్త్రమునందు రాజధర్మములును, ధనార్జనచర్చయు నను రెండు విషయములును ఉండును అనుట స్పష్టము. కావుననే యీ శాస్త్రమునకు "నీతిశాస్త్రము" "రాజనీతిశాస్త్రము" "దండనీతిశాస్త్రము" ‡ అన్న నామాంతరములు కూడఁ గలవు. అర్థశాస్త్ర మను పేరుకంటె "నీతిశాస్త్ర" మనుపేరే యెక్కువగా సంస్కృత భాషయందు వాడుకలో నున్నది. ఇందుకుఁ గారణము లేకపోలేదు. ఈ గ్రంథములలో నర్థ (ధన) విచారముకంటె, రాజధర్మములనుగుఱించియే యెక్కుడుచర్చయుండును. గ్రీకుతత్త్వవేత్తలు వ్రాసిన రాజకీయవిషయక గ్రంథములయందుఁ గూడ నిట్లే, యర్థవిచారము తక్కువ, రాజ్యవిచార మెక్కువగ నుండును. ఆకాలమునందు అర్థవిచార మొక స్వతంత్రశాస్త్రముగఁ బరిణమింపలేదు. కనుక దానిని రాజ్యవిచారమునకుసంబంధించిన యొకశాఖగా నెంచిరి. ఇప్పటివారును అర్థికశాస్త్రమునకు పొలిటికల్ ఎకానమి (Political Economy) అనగా రాజకీయార్థశాస్త్ర మని పేరు పెట్టుటయు, మొదట అర్థశాస్త్రము రాజ్యతంత్రశాస్త్రమునకు శాఖగా నభివృద్ధిఁ జెందె నని సూచించుచున్నది.

ఇదియుఁగాక రాజు అభ్యసింపవలసిన శాస్త్రములలో ఆన్వీక్షికీ, త్రయీ, వార్తా, దండనీతి అను నాల్గుశాస్త్రములు చెప్పఁబడినవి. [శుక్ర. ౧ అ. ౧౫౨ శ్లో.] వీనిలో ఆన్వీక్షికియందుఁ దర్క-వేదాంతములును, త్రయియందు ధర్మాధర్మ కామాకామములును, వార్తయందు అర్థానర్థములును, దండనీతియందు న్యాయాన్యాయములును ఉండును [శ్లో. ౧౫3-౪]. వార్తాశాస్త్రమును గుఱించియు నింకను విచారింపఁగా నందు వడ్డీవ్యాపారము, వ్యవసాయము, వాణిజ్యము, గోరక్షయను విషయములు వర్ణింపఁబడును

---

* "అర్థశాస్త్రాత్తు బలవత్ ధర్మశాస్త్ర మితి స్థితిః" [యాజ్ఞ. స్మృ.]; "అర్థ ఏవ ప్రధాన ఇతి కౌటిల్యః" "అర్థమూలౌ హిధర్మకామావితి" [కౌటిల్య. అర్థశాస్త్రము.]

† శ్రుతిస్మృత్యవిరోధేన రాజవృత్తాదిశాసనమ్‌। సుయుక్త్యార్థార్జనం యత్ర హ్యర్థశాస్త్రం తదుచ్యతే॥" [౪ అ. 3 ప్ర. శ్లో ౫౫.]

‡ అర్థశాస్త్రము, నీతి శాస్త్రము, రాజనీతి శాస్త్రము, దండనీతిశాస్త్రము అనుపదములు మన పూర్వగ్రంథములలో సమానార్థకములుగ వాడఁబడినను, ఇప్పటి శాస్త్రాభివృద్ధి ననుసరించి, యావశ్యకతఁ జూచి,పొలిటికల్ ఎకానమి(Political Economy) కి "అర్థశాస్త్ర"మన్న మాటయు, ఎథిక్సు (Ethics) అన్నవానికి "నీతిశాస్త్ర"మును, పాలిటిక్సు (Politics) కు "రాజనీతిశాస్త్రము"ను, క్రిమినల్ లా (Criminal Law) కు "దండనీతి" యన్న మాటయు రూఢి చేయుట మంచిది.

అని తెలియుచున్నది [శ్లో. ౧౧౯]. ఇది వృత్తులకు సంబంధించిన శాస్త్రము. అందుచే వార్త యనఁబడియె. ఇట్లు "వార్తా" శాస్త్రము * యొక్క పేరే గాని, యా నామము గల గ్రంథము లెచ్చటను గానరావు.

అర్థశాస్త్రముల మీఁది గ్రంథములను శోధింపఁగా బృహస్పతిసూత్రము లనియు శుక్రసూత్రము లనియు రెండు సూత్రగ్రంథములు చిన్నవి కనఁబడుచున్నవి. § వీనిలో ధనమును గుఱించి కొద్దిసూత్రములె కలవు. బృహస్పతి సూత్రములలో, అర్థ మనియు అర్థాభాస మనియు ధనము రెండు విధములని చెప్పఁబడినది. న్యాయమార్గమున సంపాదించినది అర్థము. అన్యాయమార్గమున గడించినది అర్థాభాసము. ‖ సుఖమునకు మూలము ధర్మము, ధర్మమునకు మూల మర్థము అని చెప్పఁబడి యున్నది. † శుక్రసూత్రములందు, దండమువలన వృత్తులు నిలుచును, వృత్తులవలననే అర్థము లభించును, అర్థమే ధర్మకామములకు మూలము, అర్థమే అన్ని కార్యములకు మూలము, అర్థవంతుని సర్వలోకము సత్కరించును, అర్థము లేనిమెడల నింద్రు నైనను లోకము అగౌరవించును, అజరామరుని వలె నర్థము సంపాదింపవలె నని చెప్పఁబడి యున్నది. * ఇందు "నహి ధాన్యసమానో ऽర్థః" అనగా ధాన్యముతో సమానమైన అర్థము లేదు అని ప్రతిపాదింపబడి యున్నది. పాశ్చాత్యార్థశాస్త్రజ్ఞులలోని "నిసర్గసంప్రదాయము" (Physiocrats) అను వారు గూడ నిట్టి యభిప్రాయమే చెప్పుదురు. వ్యవసాయమువలనఁబుట్టునదే నిజమైన ధనము, కళాకౌశల్యములవలనఁ బదార్థమునందు మార్పు గల్గునేకాని, క్రొత్త ధనము పుట్టదని వారి సిద్ధాంతము. అదియే శుక్రాచార్యుని యభిప్రాయముగఁ గానవచ్చుచున్నది.

పై సూత్రగ్రంథము గాక "శుక్రనీతి"యని యొక శ్లోకాత్మకగ్రంథము కలదు. § ఇతర నీతిశాస్త్రములవలెనె యిందును రాజనీతియే

* ఎకనమిక్సు, పొలిటికల్ ఎకానమి అను మాటలకు పై లక్షణముఁ జెప్పఁబడిన "వార్తా" శాస్త్రము చాలవఱకు సమానము గాన, ఎకనమిక్సునకు "వార్తాశాస్త్ర"మని పేరు మార్చవలెనని కొందఱి యభిప్రాయము. కాని "వార్తా" శబ్ద మిప్పుడు సమాచారపరముగ రూఢమై యుండుటచే, ఈ శబ్దమును ఇప్పుడు పెకలించి మఱియొక యర్థమును రూఢిచేయఁబోవుట చిక్కునకు గారణమగును. "అర్థశాస్త్ర" మను పదము "ధనశాస్త్రము" అను అర్థమందు యోగముగను, రూఢముగను ఉన్నందున దానిని మార్చవలసిన ఆవశ్యకత లేదు.

§ ఇవి అచ్చుపడ లేదు. చెన్నపట్టణము, ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునం దున్నవి.

‖ న్యాయగతార్థాత్ విపరీతో ऽర్థాభాసః

† సుఖస్య మూలం ధర్మః, ధర్మస్యమూలమర్థః.

* దండేన ప్రణీయతే వృత్తిః వృత్తిమూల మర్థలాభః । అర్థమూలౌ ధర్మకామౌ । అర్థమూలాని కార్యాణి । అర్థవాన్ సర్వలోక బహుమతః । మహేంద్ర మప్యర్థహీన మవమన్యతే లోకః । అజరామరవదర్థ మర్జయేత్॥

§ దీనిని చెన్నపట్టమునందు గస్టేవ్ ఆపర్ట్ అచ్చువేసెను. బ్ర॥ పురాణపండ మల్లయశాస్త్రిగారు దీనిని తెనుఁగులోనికి భాషాంతరీకరించి సరస్వతీపత్రికయందుఁ బ్రకటించిరి.

మెక్కువ కలదు. ధనమునుగుఱించి స్వల్ప విషయము లక్కడక్కడఁ జెప్పఁబడినవి. పశుధాన్యవస్త్రాదికములు గడ్డిపరకవఱకును ధనములనియు [౨-౩౫,౭] వ్యవహారమునకై ముద్రవేయఁబడిన వెండి బంగారము రాగి ధాతువులకును, గవ్వలు మొదలుకొని రత్నముల వఱకును అన్నిటికి ద్రవ్యమను పేరు గలదనియు [౨-౩౫,౬] దేశమును బట్టియు, కాలమునుబట్టియు వస్తువుల వెలలు కట్టవలయును, గుణహీనమైనట్టియు (Not useful) వ్యవహారాక్షమ మైనట్టియు(Not exchangable) వస్తువునకు వెలయుండదు [౪-౨-౧౦౪-౫];వస్తువుల సులభాసులభత్వములనుబట్టియు అగుణగణసంశ్రయమును బట్టియు వస్తువుల వెలలు హెచ్చుచుఁ దగ్గుచు నుండును [౨-౩౫] అను కొన్ని మూల సిద్ధాంతములు సూత్రరూపమునఁ జెప్పఁబడియున్నవి. రాజులు ప్రజలయొద్దనుండి తీసికొనవలసిన పన్నులను గుఱించియు, రాజుయొక్క ఖజానాను ఖర్చును గుఱించియు నెక్కువగఁ జెప్పఁబడి యున్నది. చాణక్యుని యర్థశాస్త్రమను * గ్రంథమునకు నర్థశాస్త్రములలో మిక్కిలి గౌరవము కలదు. ఇది కొంతవఱకుఁ బద్యమయముగను, కొంతవఱకు గద్యమయముగను ఉండును. ఇయ్యది క్రీ. పూ. ౪ వ శతాబ్దమునం దుండినవాఁడును, చంద్రగుప్త చక్రవర్తికి మంత్రియునగు చాణక్యునిచే * రచింపఁబడినదని పండితుల యభిప్రాయము. ఆకాలమున హిందూ దేశమునం దుండిన, యాచార వ్యవహారములను, కళాకౌశల్యములను, రాజ్య విధానములను, యుద్ధాదిక్రమములను, మఱియు నెన్నియో విషయములను తెలిసికొనుటకు ఈ గ్రంథము సముద్రమువంటిది. స్వదేశభాషల నన్నిటిలోనికి భాషాంతరీకరింపఁదగినది. పృథివిని సంపాదించుటయుఁ బాలించుటయు దీని విషయములు. రాజు భూమి నెట్లు సంపాదింపవలసినది, మంత్రు లెందఱుండవలసినది, వారేమేమి పనులు చేయవలసినది, కోట లెట్లు కట్టవలసినది, గుఱ్ఱములు, ఏనుఁగులు, పశువులు మొదలయిన వానిని ఎట్లు పెంచవలసినది, ఖజానాలోని ధనవివరము, పన్నులు పుచ్చుకొను విధము మొదలయిన విషయము లెన్నియో వివరముగఁ జెప్పబడియున్నవి.

కామందకీ నీతిసార మను గ్రంథ మొకటి గలదు. ఇది కౌటిలీయార్థశాస్త్రమును అనుసరించి, దానికి సంగ్రహముగ వ్రాయఁబడినది. ఇది ౧౦-వ శతాబ్దమునాఁటి గ్రంథమై యుండును.

నీతివాక్యామృతమ్ అను నొక చిన్న గ్రంథము కలదు. ఇది ౧౨-వ శతాబ్దమునం దుండిన జైనపండితునిచే వ్రాయఁబడినది. ఇతరనీతి గ్రంథములవలెనే యిందును రాజనీతియే

* మొన్న మొన్నటివఱకు నీ గ్రంథము ప్రతి పండితులకు లభింపలేదు. ఇటీవల బ్ర॥ శ్యామశాస్త్రి గారు దానిని సంపాదించి మైసూరులో దొరతనము వారి గ్రంథములలోఁ బ్రకటించి యున్నారు.

* చాణక్యునిగుఱించి యధికము తెలిసికొనఁ గోరువారు విజ్ఞానచంద్రికా గ్రంథమాలలోని చంద్రగుప్త చక్రవర్తి చరిత్రము చూడనగు.

యెక్కువగఁ జెప్పఁబడినను, వార్తా సముద్దేశమను చిన్న ప్రకరణమునందుఁ గృషిపశుపాలనము వాణిజ్యము అనునవి "వార్త"యనియు, వార్తాసమృద్ధియం దే రాజు యొక్క యన్ని సమృద్ధులును కలవనియు, వృద్ధ బాలవ్యాధితక్షీణ పశువులను బంధువులను పోషించినట్లు పోషింపవలె ననియుఁ జెప్పఁబడి యున్నది. * దేశాంతరముల నుండి వచ్చెడి సరకులను గుఱించి యిందు నొక చిత్రమైన వాక్యము కలదు. "శుల్కవృద్ధియు, బలవంతముగఁ బణ్యమును (అమ్మఁగల వస్తువులను) తీసికొనుటయు దేశాంతరమునుండి మన దేశమునకు సరకులు రాకుండుటకుఁ గారణము" † అని చెప్పఁబడినది. ఇది యిప్పటి స్వేచ్ఛా వ్యాపార (Free-trade) తత్త్వముయొక్క బీజరూపమైన సూత్రముగఁ గానవచ్చుచున్నది.

బద్దెనసీతి సుమతిశతకముఁ దప్ప తెలుఁగున నర్థశాస్త్రము లున్నట్టు తెలియదు. భారతాదులయందు రాజనీతి కొంతవఱకు భాషాంతరీకరింపఁబడినది. తెలుఁగు భారతమందలి సభాపర్వము, ౧వ ఆశ్వాసము, శాంతిపర్వము 3 వ ఆశ్వాసము చూడనగు. అఱవమున తిరువళ్లువర్ అను మహాత్మునిచే రచింపఁబడినకురళ్ అను మహాకావ్యము కలదు. దానిని తెనుఁగులోనికిఁ "త్రివర్గ ప్రదీపిక" యన్న పేరుతో కనుపర్తి శ్రీవిద్యానందనాథులవారు భాషాంతరీకరించి యున్నారు. అందు ధర్మము, అర్థము, కామము అను మూడు ప్రకరణములు కలవు. అందలి రెండవ ప్రకరణమునందు అర్థమును గుఱించిన నీతి సవిస్తరముగఁ జెప్పఁబడియున్నది. [కొ. ల.

* కృషిపశుపాలనం వాణిజ్యంచేతి వార్తా. వార్తా సమృద్ధౌహి సర్వాస్సమృద్ధయో రాజ్ఞామ్......వృద్ధ బాలవ్యాధితక్షీణాన్ పశూన్బాంధవానివ పోషయేత్.

† శుల్కవృద్ధి బలాత్పణ్యగ్రహణంచ దేశాంతర భాండానా మప్రవేశే హేతుః.

**అర్థసిద్ధి.** సాధ్యనామక దేవతల పుత్రుఁడు.

**అర్థసాధకుఁడు.** నామాంతరము రాష్ట్రవర్ధనుఁడు. దశరథమహారాజు సప్త మంత్రులలో నొక్కఁడు.

**అర్థస్వనుఁడు.** అత్రికులోత్పన్న బ్రహ్మర్షి.

**అర్థాపత్తి.** వేదాంతులచే నంగీకరింపఁబడిన ప్రమాణము. దీనిని నైయ్యాయికు లంగీకరింపరు. సాధారణముగా నర్థాపత్తి యుదాహరణ మిట్లిచ్చెదరు. బలిసిన దేవదత్తుఁడు పగలు భోజనము చేయఁడు: కావున రాత్రి భోజనము చేయును. బలసియుండుటయు, పగలు భోజనము చేయకపోవుటయుఁ జూడ రాత్రి భోజనము చేయుచుండవలె నని యూహింప వలసి యున్నది. కాని యిది 'కేవలవ్యతిరేకి' యనఁబడు అనుమానము యొక్క యుదాహరణము. అందుచే నిది వేఱు ప్రమాణమని తలంపరాదని న్యాయమతము. కాని కేవల వ్యతిరేకానుమానమును వేదాంతు లొప్పరు. వీరి మతమున అర్థాపత్తి ద్వివిధమై యున్నది:

(౧) దృష్టార్థాపత్తి. (౨) శ్రుతార్థాపత్తి. ఎచ్చట దృష్టమగు (చూడఁబడిన) ఉపపాద్యముయొక్క అనుపపత్తిజ్ఞానముచేత ఉపపాదకము యొక్క కల్పన మగుచున్నదో అచ్చట దృష్టార్థాపత్తి యనఁబడును. ఉదాహరణము; పగలు భోజనము చేయనివాని బలుపునందు రాత్రిభోజనజ్ఞానము దృష్టార్థాపత్తి. స్థూలత్వము ఉపపాద్యము. అదిదృష్టము (కనఁబడు చున్నది.) శ్రుతమగు (వినఁబడిన) ఉపపాద్యముయొక్క అనుపపత్తిజ్ఞానముచేత ఉపపాదకకల్పన మెచటనగుచున్నదో అచ్చట శ్రుతార్థాపత్తి యనఁబడును. 'ఇంట్లో లేని దేవత్తుఁడు బ్రతికియున్నాఁడు' అనువాక్యము విని, యింటికంటె నన్యప్రదేశమందు దేవదత్తునకు నునికి లేకయే ఇంటలేని దేవదత్తునకు జీవనము సంభవింపదు గనుక నింటియందు లేని దేవదత్తుని జీవనము యొక్క అనుపపత్తిచేత దేవదత్తునకు గృహముకంటె బాహ్యదేశమునందు సత్త (ఉనికి) కల్పింపఁబడుచున్నది. శ్రుతార్థాపత్తి ద్వివిధము: అభిధానానుపపత్తి, అభిహితానుపపత్తి. వాక్యములోని యొక పదమును పట్టి అధ్యాహృతములగు నన్యపదముల నూహించుట మొదటిది. 'తలుపు' అన్న మాట విని 'తీయుము' అని యూహించుట. ఎచ్చట వాక్యముయొక్క యర్థము అన్యార్థకల్పనము లేక సిద్ధింపకుండునో యచ్చట అభిహితానుపపత్తి రూప శ్రుతార్థాపత్తి యగును. ఉదాహరణము, స్వర్గ కాముఁడు యజ్ఞము చేయవలెను. అన్నవాక్యము వినఁగనె మనకుఁ గాన్పించు యజ్ఞము కాన్పింపని స్వర్గము నిచ్చుట యసంభవమని తోఁచి, యీ యజ్ఞము వలన నొక యపూర్వము పుట్టుననియు, నది స్వర్గ మిచ్చుననియు మీమాంసకులు ఊహించెదరు.

**అర్థుఁడు.** స్వాయంభువు మన్వంతరమునం దుండిన ధర్మఋషికి బుద్ధియను భార్యవలనఁ బుట్టిన కొడుకు.

**అర్ధకీలము.** ఒక సరోవరము. దధీచి మహాఋషి యాజ్ఞవలన సప్తసముద్రములు గలిసి ఈ సరోవరమును నిర్మించెను. ఈ తీర్థమునందు స్నానము జేసిన సప్త సముద్రములలో స్నానముజేసిన పుణ్యము లభించును. (భార. అరణ్య. అ ౮3).

**అర్ధనారీశ్వరి.** శివుని సగము శరీరమును సంపాదించిన పార్వతీదేవి. భృంగియను గణనాథుఁడు పార్వతిని భజింపక కేవలము శివునే, సేవించుచున్నందులకుఁ బార్వతి భృంగిని నిలువలేనంత బలహీనుం జేసెను. శివుఁ డది యెఱింగి వానికిఁ దన దండాయుధము నూతకోలగా నిచ్చి నిలిపెను. తన మీఁదికన్న భక్తునిమీఁద నే, యెక్కుడు ప్రేమ కలదని, చూచి, పార్వతీదేవి గౌతముని యాశ్రమమునొద్ద తప స్సొనరించి, శివుని యర్థాంగముఁ గైకొనెను.

**అర్ధనారీశ్వరుఁడు.** సగము శరీరము శివాకారమును, సగము శరీరము పా

ర్వత్వ్యాకారమును గల సాంబశివుని స్వరూప విశేషము.

**అర్ధపణ్యుఁడు.** అత్రికులోత్పన్న బ్రహ్మర్షి.

**అర్బుదపర్వతము.** ఇది ఆబూ పర్వతమునకు పూర్వనామము. చూడు "ఆబూ"

**అర్జుమందు బానో బేగం** ఈమె నే ముంతాజ్ మహాల్ అనియెదరు. ఢిల్లీ చక్రవర్తియైన షాహజహన్ (౧౬౨౭-౧౬౫౧) అను వానికి ప్రియమైనభార్య. నూర్జహాన్ బేగంయొక్క సోదరుఁడైన అసఫ్ ఖాన్ వజీరుని బిడ్డ. ఈమె ౧౫౯౨ లో జన్మించెను. ౧౬౧౨ లో ఈమెవివాహ మయ్యెను. ఈమె ౧౬౩౧ వ యేట జూలై ౭ వ తేదీన దక్షిణమందలి బర్హాన్‌పుర ములో మరణము నొందెను. మొదట నామె శరీర మచ్చటనే సమాధి చేయఁబడెను. కాని తరువాత నా శరీరము నచ్చటినుండి తీసికొని పోఁబడి ఆగ్రాపట్టణమున పాతిబెట్టఁబడెను. ఆమె గోరీమీద ప్రపంచమం దెచ్చటను లేనట్టి యతిసుందరమైన మందిర మొకటి కట్టింపఁబడెను. దానినే తాజ్ మహాలందురు. (చూడు తాజ్ మహాల్)

**అర్బుదము** తీర్థవిశేషము.

**అర్బుదుఁడు.** ఒక యాదవుఁడు. అతని వంశ మర్బుదవంశమనఁబడు.

౨. ఒక ఆచార్యుఁడు [పంచవింశబ్రాహ్మణము]

**అర్మూర్ తాలూకా.** నైజాం హైద్రాబాద్ సంస్థానమునందు నిజామాబాద్ జిల్లాలోని యొక తాలూకా. వైశాల్యము ౧౦౩౮ చ॥ మైళ్లు. జనసంఖ్య జాగీర్లతోఁ గలసి ౧౨౨౮౫౫. ఇందు అర్మూర్, బాల్కొండా అను రెండు పట్టణములును ౧౬౦ పల్లెలును, కలవు. దీనికి ఉత్తరముగ గోదావరినది ప్రవహించును. అర్మూర్ పట్టణములో పట్టుగుడ్డలు, చీరెలు విస్తారముగ నేయుదురు.

**అర్యమ.** ౧. ద్వాదశాదిత్యులలో నొక్కఁడు. వైశాఖమాసమందలిసూర్యుఁడు. ఒక్కొకతఱి యముని యధికారమును నిర్వహించుచుండును.

౨. పితృసముదాయములలో నొక ప్రముఖుఁడు. కల్పారంభమునందు, యముఁడు పుట్టకపూర్వ మితఁడె దక్షిణ దిక్పాలకుఁడుగా నుండెను.

3. ౨-వ అత్రిపుత్రుఁడు.

**అర్యముఁడు.** వైశాఖ మాసమునందు సూర్యుని రథమువెంట నుండు ఆదిత్య విశేషుఁడు. పితృదేవతా విశేషుఁడు.

**అర్యలూరు** చూడు అరియలూరు.

**అ ్ౖరియేన.** (క్రీ. శ. ౧౦౦-౧౭౦) ఇతనిని అర్రియన్ అనిగూడఁ బిలు

తురు. గ్రీకు చరిత్రకారుఁడు. ఎపిక్ టేటస్ యొక్క శిష్యుఁడు, మిత్రుఁడు. ౧౩౭ లో నితఁడు కెపడోషియాయను పట్టణమునకు అధికారిగ (Prefect) నుండెను. అప్పుడు ఎలానీ అను గుంపులు ఆ పట్టణముపై నెత్తి రాఁగా వారితోఁ బోరాడి యోడించెను. ఇతఁడు కాన్సల్ అన్న గొప్ప యధికార మును వడసెను. ఇతఁడు స్టాయిక్ తత్వమును గుఱించిన యొక గ్రంథమును, వేటను గుఱించి యొక గ్రంథమును అలెగ్జాండరుదండ యాత్రమును గుఱించి యొక యుద్ధగ్రంథమును వ్రాసెను.

**అర్వావసువు.** రైభ్య ఋషి యిద్దఱు పుత్రులలో పెద్దవాఁడు. ఇతఁడు తపస్సు చేసి తమ్ముఁడైన పరావసు యొక్క పితృహత్యనుఁబాపి దేవతలను సంతసింపఁజేసి తన తండ్రిని భరద్వాజుని, యవక్రీతుని మఱలఁ బ్రదికించుకొనియె. (చూఁడు అవక్రీతుఁడు భరద్వాజుఁడు)

**అర్వితహాస్సీల్.** మధ్యపరగణాల లోని వర్ధాజిల్లాయందలి యొక తాలూకా. వైశాల్యము ౯౫౦ చ॥ మైళ్లు. జనసంఖ్య ౧౩౭౭౩౭. సిస్తు రు ౯౮౦౦౦. శస్సులు ౯౦౦౦. ఇందు అర్వీ, ఆష్టీ అను పట్టణములును ౭౯౯ పల్లెలును కలవు. ఇందు ప్రత్తి పంట విశేషముగ పండును. ఇచ్చటి పశువులు మంచివి యని ప్రఖ్యాతి గలదు. గొర్నమెంటువారి అరణ్యముచే వ్యాపింపఁ బడిన ౧౮౦ చ॥ మైళ్లు తప్ప మిగిలిన భూమిలో నూటికి ఎబ్బది చొప్పున సాగుమై యున్నది.

**అర్షి.** శ్రేనా ఋషి యొక్క యిద్దఱు పుత్రులలో జ్యేష్ఠుఁడు.

**ఆర్ష్టిషేణుఁడు** భృగు కులోత్పన్నుఁడైన యొక ఋషి. (భార-శల్య. అ. ४०.) ఇతనికిని యుధిష్ఠిరునకును సంవాదము జరిగెను. (భార. వన. అ. ౧౫౯)

**అర్సిలానుషా.** ఇతఁడు గజనీసుల్తాను అగు మూఁడవ మసావూద్ అనువాని కుమారుఁడు. ఈతఁడు ౧౧౧౫ లో తన సోదరుఁడైన షేరిజాద్ అనువానిని జంపి రాజ్యము నెక్కి తన సోదరు లందఱిని చెఱసాలలోఁ బెట్టెను. బహరామ్‌షా అనువాఁడు మాత్రము తప్పించుకొని ఖురాసానుకు పోయి అచ్చటి సుల్తానైన సంజార్ అనువానిని సాహాయ్యముగఁ దెచ్చుకొని ౧౧౧౮ లో అర్సిలానుషాను ఓడించెను. వాఁడు లాహోరునకు పారిపోయెను గాని వానిని తరువాత చెఱబట్టి చంపిరి. బహరామ్‌షా సింహాసన మెక్కెను.

**అర్సికెరె.** మైసూరు సంస్థానము నందు హాస్సన్ జిల్లాలోని ఉత్తరపు వైపు తాలూకా. వైశాల్యము ४८౬ చ॥ మైళ్లు. జన సంఖ్య ७౯౫౮౭. ఇందు 3 గ్రామములును, 3౫४ పల్లెలును కలవు. వసూలు రు. ౧,౬౨,౦౦౦. ఇచ్చటి భూములు హెచ్చు

తగ్గుగ నుండును. పడమటివైపు పెక్కు గుట్టలు గలవు. దక్షిణపువైపు అమృతమహాల్ పశువులమేతబీళ్లు కలవు. ఇచ్చటి పశువులు పేరుబడ్డవి. కొబ్బరికుడకలు ఇక్కడినుండి బెంగుళూరు, బళ్లారి పట్టణముల కెగుమతి యగును.

**అర్హద్దాసుఁడు.** ఇతనికి రెట్టకవి యనియు నామాంతరము కలదు. అయిననిదియు మొదటి పేరుగ కానఁబడదు. దానిని కనుఁగొనుట గష్టముగానే యున్నది. తెలుఁగునందు అయ్యలరాజు అయ్యలభాస్కరకవులు క్రీ॥ శ॥ ౧౭౬౯-వ సం॥ము నందు రచించిన రెట్టమతగ్రంథమునకు మూలమగు గ్రంథమును కన్నడమున వ్రాసిన కవి ఈ అర్హద్దాసకవి. ఈతఁడు జైనబ్రాహ్మణుఁడు. ఇతఁడు ఏదో యొక నగరమునకు అధిపతిగా నున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈతఁడు మారసింహుని చమూపతియైన కాడమరసు వంశమునఁ బుట్టినవాఁడు. ఈతనికాలము నిర్ణయించుటకు సాధనములు లేవు. వంశావళిని బట్టి ఈతఁ డొకవేళ పదునాల్గవ శతాబ్దాదియందుండెనేమోయని యూహింపవలసియున్నది.

**అర్హనుఁడు.** కోకబక లేక కొంకవెంక దేశమునకు రాజు. ఈతఁడు రాజర్షియైన ఋషభదేవుని సర్వసంగపరిత్యాగముం జూచి తన కట్టి వైరాగ్యము లేకపోయినను బాహ్యకర్మల నన్నిటిని త్యజించి సంచరింపఁ గలిగెను. అప్పటినుండియే నాస్తికమతము పుట్టెను.

(భాగ. స్కం ౫. అ ౬. గద్య ౧౦.)

**అళవనులు.** మధురా తిరునల్వేలి జిల్లాలలోను, తిరువాన్కూరు సంస్థానమునందును ఉన్న యొక కనిష్ఠజాతివాండ్రు. వీరు పన్నయన్, ముప్పన్ అను బిరుదములను వహించెదరు. వీరిని గుళ్లలోనికి రానియ్యరు. ఈ జాతివారు ఏడుకుటుంబములవారు కలసి మూడు, నాల్గు శతాబ్దములక్రింద ఉప్పుమళ్లలో పనిచేయుటకై తిరువాన్కూరు సంస్థానమునకు పాండ్యదేశమునుండి పోయిరి. ఉప్పుమళ్లలో పనిచేయు జాతులలో వీరిని మించినవారు లేరు. వీరిని "ఉప్పుఅళవనులు" అని కూడ అందురు.

**అళియలు.** ఓఢ్రదేశమందలి వ్యవసాయము జేయునట్టి యొక జాతివారు. వీరి నివాసస్థానము ముఖ్యముగ గంజాము మండలమందలి గుంసూరు తాలూకా. ఖోండారీలు, ఒడియలు అనువారికంటె వీరు తక్కువ జాతివారుగ నెంచఁబడుదురు. వీరికి గోత్రములు గలవు. వీరి మతము చైతన్యవైష్ణవము. ఠాకురాణి లనుపేరిట వీరు గ్రామదేవతలనుగూడఁ గొలిచెదరు. వీరిలో బాల్యవివాహమె ఆచారముగ నెంచఁబడును. కాని యొకప్పుడు వివాహమునకు పూర్వము కన్య రజస్వల అయ్యెనేని దానికి నొక ఇత్తడిపాత్రతోనో లేక యొక అంబుతోనో వివాహసంస్కారమొనర్చి తరువాత వరున కిచ్చెదరు.

**అలంకారకౌస్తుభము.** ఇయ్యది సంస్కృతమున రచింపఁబడిన అలంకార గ్రంథము. లక్ష్మీధరుని కుమారుఁడైన విశ్వేశ్వర

పండితునిచే రచింపఁబడినది. ఇందు ౬౧ అర్థాలంకారముల గుఱించి మాత్రము సవిస్తరముగా వివరింపఁబడినది. సాహిత్యశాస్త్రమును గుఱించిన యితరవిషయము లందు లేవు. ఈతఁడు పండితరాయుని రసగంగాధరమును గూడ ఉదాహరించినాఁడు గనుక ౧౮-వ శతాబ్దము వాఁడై యుండనోపు. ఇది బొంబాయిలోని కావ్యమాలలోఁ బ్రకటింపంబడినది..

**అలంకారచూడామణి.** హేమచంద్రునిచే రచింపంబడిన కావ్యానుశాసనము గ్రంథముమీఁద నాతనిచేతనే వ్రాయఁబడినవృత్తి.

**అలంకార తిలకము.** వాగ్భటునిచే సంస్కృతమునందు వ్రాయఁబడిన అలంకార గ్రంథము.

**అలంకారము.** చూఁడు "నగలు".

**అలంకారముక్తావళి.** విశ్వేశ్వరకృతము.

**అలంకారములు.** అలంకారములు భాషకు నగలవంటివి. నగలు శరీరశోభ నెట్లు హెచ్చించునో యట్లే యలంకారములు కావ్యశోభను హెచ్చించును. అలంకారముల స్వరూపమును గుఱించియు, యోగ్యతను గుఱించియు నాలంకారికులలో వేఱువేఱు అభిప్రాయములు కలవు.

*ఆలంకారికుల వేఱువేఱు సంప్రదాయములు.*

"విశిష్టము లయిన (ఒక విధము లయిన) శబ్దార్థములు కావ్యము." అనిన కావ్యలక్షణ మందఱు నొప్పుకొనినదే. కాని ఈ వైశిష్ట్య మెట్టిదియన్న ప్రశ్నమునకు నుత్తర మిచ్చునపు డాలంకారికులలో మూఁడు తెగలుపుట్టెను. ఆ వైశిష్ట్యము కొందఱు ధర్మరూపమనియు, కొందఱు వ్యాపారరూప మనియు, కొందఱు వ్యంగ్యరూపమనియుఁ జెప్పిరి. ధర్మరూపమనువారిలో ౧ నొక తెగవారు అలంకారములె ముఖ్యము లనియు, ౨ మఱియొక తెగ గుణములే ముఖ్యములనియు, వ్యాపారరూపమగు వారిలో ౩ నొక తెగవారు ఉక్తి వైచిత్ర్యమే (మాటసొంపే) ప్రధానమనియు, ౪ రెండవ తెగవారు భోగకృత్యమే (రస విషయమైన వ్యంజన వ్యాపారము) ముఖ్యమనియు నిర్వచించిరి. ఇట్లు ౫ వ్యంగ్య (ధ్వని) వాదులతోఁ గూడి ప్రాచీనాలంకారికు లైదు తెగలుగ నున్నారని చెప్పవచ్చును. ఇందు మొదటి తెగవారు భామహోద్భటాదులు, రెండవ తెగవారు వామనాదులు, మూఁడవ తెగవారు వక్రోక్తిజీవితకారాదులు, నాల్గవ తెగవారు భట్టనాయకాదులు, అయిదవ తెగవారు ఆనందవర్ధనాదులు* ఆలంకారికుల చరిత్రము వ్రాయునపుడు ఈ భిన్న మతములకుఁ గల భేదములు సవిస్తరముగ వర్ణింపఁబడును. అలంకార స్వరూపమునకు సంబంధించినంతవఱ కిచ్చటఁ జెప్పఁబడును. పై నైదింటిలోను ౧ వ దానిని ౩ వ దానిని

*అలంకారసర్వస్వము-అనంతశయన సంస్కృత గ్రంథావళి, సముద్రబంధకృతవ్యాఖ్య ౪ వ పుట.

కలిపి (I) అలంకారసంప్రదాయ మనియు, ౨ వ దానిని (II) రససంప్రదాయ మనియు, ౩ వ దానిని (III) రీతిసంప్రదాయ మనియు, ౪ వ దానిని (IV) ధ్వని సంప్రదాయ మనియు మఱియొక వర్గీకరణముఁ జేసి చెప్ప వచ్చును.

అలంకార సంప్రదాయమువారు

అలంకార సంప్రదాయమువారు కావ్యమునకు నలంకారములే ప్రధానములని చెప్పుదురు. మిక్కిలి ప్రాచీనాలంకారికు లీ మతమువారే.[1] ఇంతియ కాదు. రసమును ధ్వనియుఁగూడ నలంకారాంతర్గతములె యని వీరి తాత్పర్యము. దండి తన కావ్యాదర్శమునందు రసములను అలంకారములలోఁ జేర్చెను.[2] భామహుఁడు గుణములకును అలంకారములకును భేదము చేసినట్టు కనఁబడదు. ఎందుకనఁగా "భావిక" మను అలంకారమును ఆతఁడు గుణ మనియుఁ గూడఁ జెప్పెను.[3] భామహాలంకారముమీఁద వివరణము వ్రాయుచు నుద్భటుఁడు "మానవుని శౌర్యాది గుణములకును, కేయూరాది భూషణములకును భేద మున్నట్టు కావ్యమునందలి యోజస్సు మొదలయిన గుణములకును, ఉపమాద్యలంకారములకును భేదముఁ కలదని పరపక్షమువారు చెప్పఁగా, నట్లనుటకు వీలు లేదు, మానవుని శరీరమందు శౌర్యాదిగుణములు సమవాయసంబంధముచేతను,[4] కేయూరాది భూషణములు సంయోగ సంబంధము చేతను నివసించును, కావున వానికి భేదము చెప్పినఁ జెప్పవచ్చును గాని, కావ్యమునందు నొక్క సమవాయసంబంధముచేతనే నివసించునట్టి గుణాలంకారములకు భేదము చెప్పుట గడరికాప్రవాహము.[5] (అంధపరంపర) గాని వేఱుగాదు" అని చెప్పియున్నాఁడు.[6] ఇట్లు వీరి మతమున ఓజాది కావ్యగుణములును, శృంగారాది రసములును అలంకారముల విభేదములే.

ఇంతియ కాదు. ధ్వనియు నలంకారాంతర్గతమే. వీరి మతమున ప్రతీయమానార్థము (వ్యంగ్యార్థము) వాచ్యార్థమునకునుపస్కారకమగుట చే నది అలంకారపక్షమునందుఁ జేరవలసినదే.[7] క్రీ. శ. ౯-వ శతాబ్ద మధ్యము

1. తదేవమలంకారా ఏవ కావ్యే ప్రధాన మితి ప్రాచ్యానాం మతం. [అ. స.]

2. కావ్యాదర్శము ii. 275; ii. 280-292.

3. భామహాలంకారము : బొంబాయి సంస్కృత గ్రంథములలోఁ బ్రకటింపఁబడిన ప్రతాపరుద్ర యశోభూషణమునకు 2-వ యనుబంధముగఁ బ్రకటింపఁబడినది. తృతీయపరిచ్ఛేదము, ౫౩ శ్లోకము చూఁడు.

4. తర్కశాస్త్రము నందు పదార్థముల "సంబంధము" రెండు విధములు, సమవాయ సంబంధము, సంయోగసంబంధము. పువ్వునకు వర్ణమునకు, వాసనకుఁ గల సంబంధము "సమవాయసంబంధము;" ఒక చెట్టుమీఁదఁ గోతి కూర్చుండినప్పుడు దానికిని చెట్టునకును గల సంబంధము "సంయోగసంబంధము."

5. ముందు నడుచునట్టి మేక వెళ్లి బావిలో దుమికినయెడల వెనుకఁబోవు మేక లన్నియు నందే దుముకును. దీనిని గడరికాప్రవాహ మందురు.

6. హేమచంద్రకృత "కావ్యానుశాసనము" మీఁది స్వవృత్తిలో ఉద్భటుని వాక్య ముదాహరింపఁబడినది. కావ్యమాలాప్రతి-పుట ౧౭.

7. ఇహహి తావద్ భామహోద్భటప్రభృతయశ్చిరంతనాలంకారకారాః ప్రతీయమానమర్థం వాచ్యోపస్కారకతయాలంకారపక్షం నిక్షిప్తమన్యన్తే-[అ. స.]

వాఁడగు రుద్రటుఁడు వస్త్వలంకార రసరూపము లయిన మూడువిధము లగు ప్రతీయమానార్థములను (వ్యంగ్యములను) గూడ నలంకారములనియే వర్ణించియున్నాఁడు. [1]"ధ్వని" యన్న యొక యలంకారమును గూడఁ గల్పించిరి.

కాని తరువాతికాలపు ఆలంకారికు లీమతమును అంగీకరింపలేదు. అన్ని మతములను సమన్వయించు కొని యాధుని కాలంకారికులు అలంకారముల నుగురించి యీ విధముగఁ జెప్పియున్నారు. ధ్వని యుత్తమకావ్యమునకుఁ బ్రాణమువంటిది; అది లేనిది ఉత్తమ కావ్యమే కానేరదు. కావ్యమునకు నాత్మ రసము, శబ్దార్థములు శరీరము, ఓజోమాధుర్యాది గుణములు శౌర్యాదికముల వంటివి; అలంకారములు హారములవంటివి. రసము అంగి; శబ్దార్థము లంగములు. మాధుర్యాది గుణము లెప్పుడును రసమును విడుచునవి కావు. అనఁగా రసమున్నచోట నవియుండును; అవి యున్నచోట రసము పుట్టును. అలంకారము లట్టివి కావు. ఇవి యంగద్వారమున మాత్ర మొకప్పుడు రసమును అభివృద్ధిచేయును; ఒకప్పుడు చేయక పోవచ్చును. రసమును ఉత్కర్షింపఁ జేయనపుడు అలంకారములు కేవలము ఉక్తివైచిత్ర్యపర్యవసాయిగ నుండును. ఇది కావ్యప్రకాశ కర్తయైన మమ్మటుని (౧౨వ శతాబ్దము) మతము. [౮ వ ఉల్లాసము ౧-౨ శ్లోకములు.] దీనినే ఏకావలీకారుఁడు (౧౩ వ శ.) ప్రతాప రుద్రీయకారుఁడు (౧౪ వ శ.), అప్పయ్య దీక్షితులు (౧౬ వ శ.) పండితరాజ జగన్నాథుఁడు (౧౭ వ శ.) మొదలైన వారందఱును ఒప్పుకొనిరి. ఇదియే యాధుని కాలంకారికుల మత మని చెప్పవలసి యున్నది.

అలంకారములను గురించి ధ్వనిసంప్రదాయము వారి యభిప్రాయము

వీరి మతప్రకారము గుణాలంకారములకు నీ క్రింది విధమయిన భేదము కలదు:—

౧ గుణములు రసముయొక్క ధర్మములు అలంకారములు రసముయొక్క ధర్మములు కావు. ౨ గుణములు రసము లేనిచోటనుండవు. అలంకారములు రసము లేక రసమును పుట్టింపక యుండ వచ్చును. 3 గుణములు తప్పక రసమును పుట్టించును. అలంకారము లవశ్యకముగ రసమును పుట్టించునని లేదు. ౪ గుణములు రసమునకు సాక్షా దుపకారకములు. అలంకారములు అంగద్వారమున (శబ్దార్థములగుండ) రసమునకు నుపకారకములు.

గుణములకు నలంకారములకుఁ గల భేదము.

ఇట్లు ప్రాచీనాలంకారికులచే నలంకారములకు నీయఁబడిన గౌరమంతయు నాధునికులచే దగ్గింపఁబడినది. వీరి మతమున అలంకారము లుండియు రసముపుట్టక పోవచ్చును. అలంకారములు లేక పోయినను రసము పుట్ట వచ్చును. రస మిదివఱకే యున్న యెడల నొకప్పు డలంకారములు దానిని అభివృద్ధిపఱుపవచ్చును. చక్కఁదనము లేని

1 తదిత్థం త్రివిధమపి ప్రతీయమానమలంకారతయా ప్రఖ్యాపితమేవ [అ. స.]

స్త్రీ నగలు పెట్టుకొనినఁ బ్రయోజనము లేదు. చక్కని స్త్రీకి సాధారణముగ నగ లక్కరలేదు. కాని ఒకప్పుడు నగలవలన నామె స్వాభావిక సౌందర్యము హెచ్చు కావచ్చును.

రస మనునది కావ్యమునకుఁ బ్రాణముగఁ దీసికొన్న యెడల ధ్వనిని కావ్యమునకు నాత్మగఁ దీసికొన వలయును. ఉత్తమకావ్యము ధ్వనిప్రధానము. ఎందు వాచ్యార్థమునకంటె వ్యంగ్యార్థము ఎక్కుడు రమణీయముగ నుండునో యది యుత్తమ కావ్యము. ఎందు వ్యంగ్యార్థము వాచ్యార్థమునకంటె నధిక రమణీయముగ నుండదో యది మధ్యమకావ్యము. దీనినే గుణీభూత వ్యంగ్య మందురు. ఎందు వ్యంగ్యార్థ ముండదో, ఉండినను స్పష్టముగ నుండదో యది అధమకావ్యము. శబ్దార్థచిత్రాదు లిట్టివి. కావున నలంకారములలోఁ జేరిన చిత్రకావ్యము వీరి మతమున నధమము. ఎందుకు? అందు ధ్వని లేదు గనుక. ఇది యిట్లుండఁ గొన్ని యలంకారములలో ధ్వని కనఁబడుచున్నది. కొన్ని ధ్వనిభేదములలో నలంకారములు కానవచ్చుచున్నవి. కావున రెండుకక్షుల వారికిని వాదవివాదములు జరిగి తేలినదేమనగా వాచ్యార్థమును కొంతవఱకు పరిత్యజించుటయే "ధ్వని" యొక్క విశేషము; అది వస్తురసాలంకారధ్వనులు అని మూడు విధములు. ఈ మూడు విధముల ధ్వనికిని వాచ్యముతోఁ బనిలేదు. వాచ్యార్థమువలన నలంకారము సిద్ధించెనా యది "అలంకార" కోటిలోఁ జేరును. అనగా నది "అలంకారధ్వని" కాదు, అలంకారమె; వ్యంగ్యార్థమున అలంకారము సిద్ధించెనా అది "ధ్వని" గాని అలంకారము కాదు. వలయునెడ దానిని "అలంకారధ్వని" అనుఁడి, గాని అలంకార మనవలదు! ఉపమాది యలంకారములన్నియు వాచ్యార్థమువలన సిద్ధింపవచ్చును, వ్యంగ్యార్థమువలన సిద్ధింపవచ్చును. కాని ధ్వనివాదుల మతమున మొదటిదానిని మాత్రము అలంకార మనవలెను, రెండవదానిని "ధ్వని"* అనవలెను. ధ్వనిని గుఱించి యధికము తెలిసికొనఁ గోరువారు "ధ్వని" శబ్దముఁ జూడుఁడు.

అలంకారముల చరిత్రము.

భాషతోఁగూడ నలంకారము పుట్టిన దన వచ్చును. వినువానికి రమ్యముగ నుండు నిమిత్తమును, చక్కగ బోధయగు నిమిత్తమును అలంకారయుక్తమైన భాష మాటలాడుట మానవస్వభావము. నిండు వెన్నెల కాయుచున్న దని చెప్పుటకు మాఱుగ పిండి యాఱఁబోసినట్లు వెన్నెల కాయుచున్నది, యనియు; ఆమె మిక్కిలి చక్కనిది యనుటకు 'ఆమె రంభ'యనియు, వాఁడు శూరుఁ డనుటకు 'వాఁడు సింహపుఁబిల్ల' యనియు,

* "ధ్వని" శబ్దము "ధ్వన్యాలోకము"నందును ఏతన్మత ప్రవర్తకగ్రంథములలోను రెండర్థముల వాడఁబడియున్నది. ఒకటి సామాన్యము, రెండవది విశేషము. "ధ్వని" అనగా "వ్యంగ్య" మని సామాన్యార్థము. "ధ్వని" అనగా "వాచ్యము" కంటె "వ్యంగ్యము" ప్రధానమైన కావ్య మని విశేషార్థము.

కార్యము సకాలమునందుఁ జేయక ప్రయోజనము పోయిన తరువాతఁ జేసె ననుటకు 'దొంగలుపడిన ఆఱునెలలకుఁ గుక్కలు మొఱిఁగెను' అనియు నిత్యవ్యవహారమునందుఁ జెప్పెదము. మనసులోని భావ మత్యధికమై నప్పుడును ఆలంకారికభాష వెలువడును. ఇందుకు మన భాషలోని కొన్ని తిట్లు నిదర్శనములు. 'నీ కడుపు కాల' 'నీ దుంప తెగ' ఇత్యాదులు వక్తయొక్క కోపోద్రేకమును చూపును. కావున వ్యాకరణశాస్త్రము పుట్టక పూర్వ మెట్లు భాషాప్రపంచ మభివృద్ధి చెందునో, యట్లే అలంకారశాస్త్రము పుట్టుటకుఁ బూర్వమే-చాలకాలము పూర్వమే-భాషలో పామరజనవ్యవహార ముందును అలంకారము లేర్పడును.

ఇఁక సంస్కృత వాఙ్మయముఁ జూచిన ఋగ్వేదమునందుఁ బెక్కలంకారములు గల వర్ణనములు కలవు. [1] మహాభారత రామాయణములు కావ్యములే గనుక వానియందుఁ బెక్కు శబ్దార్థాలంకారములు కలవని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. పాణినీయమునందు 'ఉపమేయ' 'ఉపమాన' 'సామాన్య' పదములు ప్రయోగింపఁ బడుటచేతను, [2] వ్యాసరచిత బ్రహ్మసూత్రములలో ఉపమారూపకాలంకారముల పెల్లు స్పష్టముగఁ గాన వచ్చుటచేతను[1] ఆకాలములవఱకు నలంకారశాస్త్రము బీజరూపముగఁ బ్రారంభమైన ట్లూహింపవచ్చును. నిరుక్తమునందు యాస్కాచార్యుఁడు ఉపమాలంకారముయొక్క లక్షణము కూడఁ జెప్పినాఁడు.[2] అశ్వినీదేవతాదులను దొంగతోఁ బోల్చినందులకు నీచోపమ యని కొంచెము చింతించెను. అగ్నిపురాణమునందు 3౪3-౪ వ అధ్యాయములందు శబ్దార్థాలంకారములు ఉదాహరణపూర్వకముగ వివరింపఁ బడినవి. సాహిత్య ఛందశ్శాస్త్రాదులకు సంబంధించిన విషయములు కూడ నీ పురాణంబునఁ గలవు. కాని వీని రచనాకాలము నిశ్చయముగఁ దెలిసికొనుటకు వీలు లేదు. అందు ధ్వనివిషయమైనేమియు లేనందున నది ధ్వనికారునకుఁ (౧౦-వ శతాబ్దమునకుఁ)బూర్వము వ్రాయఁబడెనని యూహింపఁబడుచున్నది. భరతుని నాట్యశాస్త్రము క్రీ. శ. ౧-వ శతాబ్దములోనిది యని కొందఱి మతము. అందు (౧౬-౪౧) నాలు గలంకారములు చెప్పఁబడినవి. తరువాతివారు భామహాదులు. వారి విషయమై "ఆలంకారికులు" అను వ్యాసమునందు వివరింపఁబడును. కావున నిచ్చట నింతటితో విరమించెదను.

అలంకారముల సంఖ్య క్రమముగ హెచ్చుచు వచ్చెను. శబ్దాలంకారముల సంఖ్య

1. ఋగ్వే ౧.౧౬౪-౭ ఇందు నాల్గు ఉపమలు కలవు. ౧-౧౬౪-౨౦ ఇందు రూపకము గలదు. ౪-౫౮ 3 లో నతిశయోక్తి గలదు.

2. ఉపమానాని సామాన్యవచనైః (౨-౧-౫౫); ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యా ప్రయోగే (౨-౧-౫౬)

1. ఆనుమానిక మప్యేకేషాం । శారీరరూపక విన్యస్త గ్రహీతే ర్దర్శయతిచ (౧. ౪. ౧); అత ఏవ చోపమా సూర్యకాదివత్ (3. ౨. ౧౮). 2. 3. 3.

అలంకారముల సంఖ్య

మాత్రము విశేషము పెరుగ లేదు. భరతుఁడు* (౫-వశతాబ్దము) నాట్యశాస్త్రమునందు (౧౬-౮౧) 'యమక'మను ఒక్క శబ్దాలంకారమునే చెప్పెను. వామనుఁడు (౯-వ శ.) రెండు శబ్దాలంకారములను, మమ్మటుఁడు (౧౨-వ శ.) ఆఱు శబ్దాలంకారములను చెప్పినాఁడు.

అర్థాలంకారముల వృద్ధి యత్యద్భుతము. భరతునిచే (౫ వ శ.) ఉపమారూపకదీపకము లను మూఁడు అర్థాలంకారములు మాత్రము చెప్పఁబడినవి (౧౬-౮౧). ఆచార్య దండి "సంకీర్ణము" గాక ౩౮ అర్థాలంకారములఁ జెప్పెను. కావ్యప్రకాశికాకారుఁడైన మమ్మటుఁడు (౧౨-వ శ.) సంకర సంసృష్టులు గాక, ౬౯ వఱకు వీనిని బెంచెను. ప్రతాపరుద్రీయకారుఁడైన విద్యానాథుఁడు (౧౮-వ శ.) ౬౫ అనియు, చంద్రాలోకకర్తయైన జయదేవుఁడు (౧౫-వ శ.) ౧౦౦ అనియు, కువలయానందకారుఁడైన అప్పయదీక్షితుఁడు (౧౭-వ. శ.) ౧౧౫ అనియు నర్థాలంకారములసంఖ్య హెచ్చించిరి. ఇట్లీసంఖ్య మొత్తముమీఁదఁ బెరుగుచుఁ బోయినను నడుమ నడుమఁ గొందఱు వానిసంఖ్య తగ్గించుటకు యత్నించిరి. ౯-వ శతాబ్దము వాఁడగు వామనుఁడును, ౧౨-వ శతాబ్దము వాఁడైన హేమచంద్రుఁడును అర్థాలంకారములు ౨౯ అనియే చెప్పిరి.

ఇట్లు అలంకారముల సంఖ్య పెరుగుచుఁ బోయినందున, వాఙ్మయమునందుఁ గవులచేఁ బూర్వకవి ప్రయుక్తము లయిన యలంకారములకంటె భిన్నములు ప్రయోగింపఁబడె నని తలపఁ గూడదు. పూర్వకవు లుపయోగించిన వానినె ఉత్తరకవు లుపయోగించిరి. ఇఁక నలంకారములసంఖ్య యెట్లు పెరిగె నని చదువరు లడుగవచ్చును. పూర్వలాక్షణికు లొక్క యలంకారముయొక్క శాఖలుగ నెంచిన వానిని ఉత్తరలాక్షణికులు స్వతంత్రాలంకారములుగ నెన్నుటవలన నీ సంఖ్య పెరుగుచుఁ బోయెను. దండి చెప్పినట్టి యుపమాలంకార భేదములలోఁ బ్రతీపము, ఉపమేయోపమ, అతిశయోక్తి, భ్రాంతిమంతము, సందేహము, అనన్వయము, ఉత్ప్రేక్ష, ప్రతివస్తూపమ అని యిటీవలివారిచేఁ బేర్కొనఁబడిన యలంకారము లన్నియు నిమిడియున్నవి. ఇవన్నియు నిప్పుడు ఉపమకంటె భిన్నములును స్వతంత్రములును అగు నలంకారములై యున్నవి.*

* ఇప్పుడు ప్రకటింపఁబడిన భరతకృత నాట్యశాస్త్రము (కావ్యమాలా గ్రంథమాలలోనిది) క్రీ. శ. ౧-వ శతాబ్దమునాటిది యని కొందఱును, ౫-వ శతాబ్దమునాటిది యని మఱికొందఱును చెప్పెదరు.

* ఒక్క యుపమాలంకారమే నటునివలె వేఱు వేఱు వేషముల వేసికొని భిన్నాలంకారములవలెఁ గానవచ్చును అని చెప్పి యప్పయ్యదీక్షితులు చిత్రమీమాంసలో నీ క్రింది యుదాహరణముల నిచ్చెను:—

1 ఉపమ - చంద్రునివంటి ముఖము. 2 ఉపమేయోపమ - చంద్రునివంటి ముఖము, ముఖమువంటిచంద్రుఁడు. 3 అనన్వయము - ముఖమువంటి ముఖము. 4 ప్రతీపము- ముఖమువంటి చంద్రుఁడు. 5 స్మరణము - చంద్రునిఁ జూడ ముఖము జ్ఞప్తికి వచ్చెను. 6 రూపకము - ముఖ

అలంకారముల సంఖ్యవలెనే, అలంకారములను ఏతత్త్వముపై విభజింప వలసినది యన్న విషయమునఁ గూడఁ బెక్కు మతభేదములు కలవు. ఒక యలంకారమునకును మఱియొక యలంకారమునకును గల భేదము వాని చమత్కారబీజములయిన ధర్మములకుఁ గల భేదములను చక్కఁగఁ దెలిసికొన్న బోధపడఁగలదే గాని, అలంకారముల జాబితాలును, ఉదాహరణములును ఇచ్చినందునఁ గాదు. చమత్కారబీజనిర్ణయమువలన లక్షణసిద్ధియుఁ జక్కఁగ నేర్పడును.

అలంకార విభజన.

మొట్టమొదట స్ఫురించు విభజన శబ్దాలంకారములు అర్థాలంకారములు అనునది. ఈ భేద మందఱును ఒప్పుకొనినదె. అయినను, భోజుఁడు తన సరస్వతీకంఠాభరణము నందు శబ్ద, అర్థ, ఉభయాలంకారము లని విభాగము కల్పించి, యొక్కొక్క తెగలో ౨౪ అలంకారములను చేర్చినాఁడు. *ఉభయాలంకారములలో నుపమాదు లీయఁబడినవి! కాని యీవిభాగమును మఱి యే లాక్షణికులును ఒప్పుకొనలేదు. అన్ని యలంకారములును ఉభయాలంకారము లని చెప్పవచ్చును. శబ్దార్థములు రెండును లేనిది యే యలంకార మగును? కావున విభాగముచేయు నప్పుడు చూడవలసినది, యొకానొక వాక్యమునకుఁ జక్కఁదనము కల్గినది శబ్దమూల

మను చంద్రుఁడు. 7 పరిణామము - ముఖ చంద్రునిచేఁ దాపము శమించును. 8 సందేహము - ముఖమా! చంద్రుఁడా! 9 భ్రాంతిమంతము - చంద్రుఁడని చకోరములు నీ ముఖము వంకఁ జూచుచున్నవి. 10 ఉల్లేఖము - చంద్రుఁడని చకోరములు, కమల మనిభృంగములు నీ ముఖము నాశించుచున్నవి. 11 అపహ్నుతి - చంద్రుఁడే! ఇది ముఖముగాదు. 12 ఉత్ప్రేక్ష - తప్పక చంద్రుఁడే. 13 అతిశయోక్తి - ఇతఁడు చంద్రుఁడే. 14 తుల్యయోగిత - ముఖముచే చంద్రకమలములు నిర్జింపఁ బడెను. 15 దీపకము - రాత్రి చంద్రుఁడును, నీ ముఖమును ప్రకాశించును. 16 ప్రతివస్తూపమ - నీ ముఖమునందు నేను రమించెదను, చంద్రునియందు చకోరము రమించును. 17 దృష్టాంతము - ఆకాశమునందు చంద్రుఁడు, భూమిమీద నీ ముఖము. 18 నిదర్శనము - ముఖము చంద్రకాంతి వహించును. 19 వ్యతిరేకము - నీ నిష్కళంక ముఖము చంద్రుని మించెను. 20 సహోక్తి - నీ ముఖముతోఁ గూడఁ గలిసి చంద్రుఁడు రాత్రి వికసించును. 21 సమాసోక్తి - ముఖము నేత్రాంబురరుచిరము, స్మితజ్యోత్స్నాశోభితము. 22 శ్లేష - హరిణాహితసక్తి యగు కమలముతో ముఖము సమానము. 23 అప్రస్తుతప్రశంస - ముఖముసెదుట చంద్రుఁడు వెల వెల బారుచున్నాఁడు.

* భోజరాజకృత "సరస్వతీ కంఠాభరణ" మందలి యలంకార విభాగము : శబ్దాలంకారములు ౨౪: జాతి, గతి, రీతి, వృత్తి, ఛాయ, ముద్ర, ఉక్తి, యుక్తి, భణితి, గుమ్ఫన, శయ్య, పఠితి, యమక, శ్లేష, అనుప్రాస, చిత్ర, వాకోవాక్యము, ప్రహేళిక, గూఢము, ప్రశ్నోత్తరము, అధ్యేయము, శ్రవ్యము, ప్రేక్ష్యము, అభినీతి. అర్థాలంకారములు ౨౪: జాతి, విభావన, హేతువు, అహేతువు, సూక్ష్మము, ఉత్తరము, విరోధము, సంభవము, అన్యోన్యము, పరివృత్తి, నిదర్శనము, భేదము, సమాహితము, భ్రాంతి, వితర్కము, మీలితము, స్మృతి, భావము, ప్రత్యక్షము, అనుమానము, ఆగమము, ఉపమానము, అర్థాపత్తి, అభావము. ఉభయాలంకారములు ౨౪: ఉపమ, రూపకము, సామ్యము, సంశయోక్తి, అపహ్నుతి, సమాధ్యుక్తి, సమాసోక్తి, ఉత్ప్రేక్ష, అప్రస్తుతస్తుతి, తుల్యయోగిత, లేశము, సహోక్తి, సముచ్చయము, ఆక్షేపము, అర్థాన్తరన్యాసము, విశేషము, పరిష్కృతి, దీపకము, క్రమము, పర్యాయము, అతిశయము, శ్లేష, భావికము, సంసృష్టి.

ముననా అర్థమూలముననా యని. శబ్దములవలనఁ గల్గినది శబ్దాలంకారము. అర్థమువలనఁ గల్గినది యర్థాలంకారము.

ఇది శబ్దాలంకారము, ఇది యర్థాలంకారము, అని యలంకారములను విడఁదీయుటకు నెద్ది గుర్తు అన్న విషయమై లాక్షికులలో భిన్నాభిప్రాయములు కలవు. అలంకారసర్వస్వకారుని మతంబున "ఏది దేని నాశ్రయించి యుండునో యది ఆ యలంకారము" (యో ఽలంకారో య దాశ్రితః స తదలంకారః). అనగా నలంకారము శబ్దమును ఆశ్రయించి యున్న యెడల శబ్దాలంకారము, అది అర్థమును ఆశ్రయించి యున్న యెడల అర్థాలంకారము. కావ్యప్రకాశకారుని మతమున శబ్దముయొక్క అన్వయ వ్యతిరేకమును అనుసరించునది శబ్దాలంకారము. అనగా ఒకానొకశబ్ద మున్న యెడల నుండునదియు, ఆ శబ్దమును తీసివేసిన యెడలఁ దానును లోపించునదియు నగు అలంకారము శబ్దాలంకారము. అట్లే అర్థముయొక్క యన్వయ వ్యతిరేకముల ననుసరించునది యర్థాలంకారము. దీనికి తాత్పర్య మేమనగా, శబ్దపరివృత్తిని సహించు నెడల ననగా ఒకపదమునుతీసి సమానార్థకమైన మాఱుపదమును పెట్టినను అలంకారము మాఱనియెడల నది అర్థాలంకారము. శబ్దపరివృత్తిని సహింపనియెడల శబ్దాలంకారము. ఇట్టి యుభయమతములవారి యభిప్రాయభేద మితరాలంకారములందు బాగుగఁ గానరాకున్నను శ్లేషాలంకారములందుఁ గానవచ్చును. వసుచరిత్రము నందలి యీక్రింది పద్యముఁ దీసికొందము:

మ. మహి మున్వాగనుశాసనుండు. సృజియిం
పం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీ
నాథుండు ప్రోవ న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయిం
పన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ ద
త్ప్రాగల్భ్య మూహించెదన్.

ఇందు శ్లేషాలంకారము గలదు. ఇది శబ్దశ్లేషయా యర్థశ్లేషయా యని నిర్ణయింపవలెను. ఇందు "వాగనుశాసనుండు" (నన్నయభట్టు, బ్రహ్మదేవుఁడు), "కుండలీంద్రుఁడు" (సోమయాజి, శేషుఁడు,) "శ్రీనాథుఁడు" (శ్రీనాథకవి, విష్ణువు); "సోముఁడు" (నాచన సోముఁడు, చంద్రుఁడు), "భాస్కరుండు" (భాస్కరకవి, సూర్యుఁడు,) అను పదములకు రెండు రెండు అర్థములున్నందున శ్లేష సంభవించినది. ఈ రెండర్థములలో నొక యర్థము లేక పోయినను ఈశ్లేష కాదు. ఈ శ్లేష సభంగముకాదు. అనగా పదమును విరిచినందున వచ్చినది కాదు గనుక నిది యర్థగతము, ఇదియర్థశ్లేష, అర్థాలంకారము అని అలంకారసర్వస్వపక్షమువారి మతము. అట్లుకాదు. ఇందలి "వాగనుశాసన" పదమునకు బదులుగ "వాణీశ" మొదలయిన మఱియేపదము గాని, "శ్రీనాథ" పదమునకు మాఱుగ "లక్ష్మీపతి" మొదలయిన పదములు గాని, ఇట్లే యితర పదములకుఁ బర్యాయపదములుగాని పెట్టిన యెడల నిందలి "శ్లేష" యెగిరిపోవును. కావున నిది శబ్దశ్లేష, అర్థశ్లేష కాదు అని కావ్యప్రకాశికాపక్షమువారి మతము.

ఇటీవలి యాలంకారికుల మతమున నర్థా లంకారముల యోగ్యత శబ్దాలంకారముల కంటె నధికమని యున్నను పూర్వలాక్షణికులుమాత్ర మీ రెంటిని సమానముగ నెంచిరి. వారిలోఁ గొందఱి మతమున శబ్దా లంకారములే యర్థాలంకారములకంటె నధిక మైనవి. ఏలయన మాట వినినతోడనే చిత్త మును ఆకర్షించునవి శబ్దాలంకారములు, అర్థ ప్రతీతితరువాతఁ గాని అర్థాలంకారములు చిత్తమును ఆకర్షింపవు * కావ్యప్రకాశకారుఁ డీ రెంటిని నేక కక్ష్యయందె చేర్చెను. కావ్య మును ఉత్తమ, మధ్యమ, అధమము లన్న మూడువిభాగములుగ వర్ణించి, అర్థచిత్ర శబ్ద చిత్రములు గలది యధమ మని చెప్పెను [౧. ౫.]. శబ్దచిత్రమునకు “స్వచ్ఛందోచ్ఛల దచ్ఛకచ్ఛ కుహర చ్ఛాతేతరాంబు చ్ఛటా” యను అనుప్రాస పద్యమును, అర్థచిత్రము నకు “వినిర్గతం మానదమాత్మ మందిరాత్” అన్న ఉత్ప్రేక్షాలంకారము గల పద్యమును ఉదాహరణముగ నిచ్చియున్నాఁడు. కాని శబ్దార్థాలంకారములను ఒక్క జతగాఁ జేయుట క్రమము గాదని తలఁచి జగన్నాథపండితుఁడు రసగంగాధరమునందుఁ గావ్యమును ఉత్తమో త్తమ, ఉత్తమ, మధ్యమ, అధమములను

శబ్దార్థాలంకార ముల యోగ్యత

నాల్గు తెగలుగ విభజించి, మమ్మటుఁడు ఉత్తమమన్న వ్యంగ్య ప్రధానకావ్యమును ఉత్తమోత్తమ మనియు, మమ్మటుని మధ్యమ మగు గుణీభూతవ్యంగ్యమును ఉత్తమ మని యు, వ్యంగ్యమునకంటె వాచ్యచమత్కార మధికము కలది మధ్యమమనియు, ఎందు అర్థ చమత్కారమును అనుసరించిన శబ్దచమ త్కారము ప్రధానమోయది అధమమనియుఁ జెప్పెను. “ఉత్తమ” “మధ్యమ” కావ్యము లందు “అర్థాలంకారములును” అధమ కావ్యమందు “శబ్దాలంకారములును” వచ్చు నని ఈతని తాత్పర్యము. ఈతఁడు మమ్మ టుని నిట్లాక్షేపించెను. “కొందఱీ నాలుగు భేదములను పాటింపక, ఉత్తమ మధ్యమా ధమములను భేదములు మూడేయని చెప్పె దరు. కాని అర్థచిత్ర శబ్దచిత్రములకు భేదము చేయక వానిని రెంటిని అధమకావ్యముగ నెంచుట అయుక్తము. ‘వినిర్గతం మానద మాత్మమందిరాత్’ అను పద్యములును, కేవల పామరజన శ్లాఘనీయమైన ‘స్వచ్ఛం దోచ్ఛలద్’ మొదలయిన పద్యములును, సమానములేయని యే సహృదయుఁడు చెప్పఁ గలఁడు?...ఒకచో శబ్దార్థ చమత్కారములు రెండును కలిగియుండెనేని యందు వాని గుణ ప్రాధాన్యమును పట్టి లక్షణము ననుసరించి తగినకక్షలోఁ జేర్చవలెను. శబ్దార్థములు రెం డును సమప్రాధాన్యము కలవియైనయెడల నది మధ్యమకావ్యమే.” అర్థచమత్కారము లేని కేవల శబ్దచమత్కారమును గుఱించి యిట్లు వ్రాసెను. “ఎందు సామాన్యముగా

---

* భామహాలంకారము ౧. ౧౪. సరస్వతీ కంఠాభర ణకారుఁడైన భోజరాజుకూడ నర్థాలంకారములకంటె శబ్దాలంకారములె యధికమన్న మతముపాడు. “ఉపమా దివియుక్తాపిరాజతే కావ్యపద్ధతిః । యదనుప్రాసలేశోఽపి హాంతత్రనివేశ్యతే” [౭ పరి.] అని చెప్పియున్నాఁడు.

నర్థచమత్కారము శూన్యమై కేవలము శబ్ద చమత్కృతి యుండునో, దానిని అధమాధమ కావ్యమని చెప్పుట యుచితము. ఏకాక్షర పద్యములు, అర్థావృత్తియమకము, పద్మబంధాదికము లిట్టివి. కాని ప్రాచీనపరంపర ననుసరించి కొందఱు మహాకవులు వీనిని తమ కావ్యములలో నచ్చ టచ్చటఁ బ్రయోగించినను కావ్యలక్షణమైన 'రమణీయార్థ ప్రతిపాదకత్వ'ము వీనియందు లేనందున, వీనిని మేము కావ్యముగ నెంచనే లేదు."* కావున శబ్దార్థాలంకారములలో అర్థాలంకారములే శ్రేష్ఠములు, అర్థచమత్కారము లేని కేవల శబ్దాలంకారములు కావ్యమన్న పేరునకుఁ గూడఁ దగవని యీ యాలంకారిక సంప్రదాయము వారియభిప్రాయము. ఇది సరియైన యభిప్రాయము కాదని యెవరు చెప్పఁగలరు?

ఇఁక నర్థాలంకారములను గుఱించి విచారింతము. ఒక్క యుపమాలంకారమే యన్ని యలంకారములకు మూల మనియు, మిగిలిన వన్నియు దాని భేదములే యనియుఁ గొందఱందురు. కావ్యాలంకార సూత్రకారుఁడైన వామనుఁడు మొదట ఉపమాలంకారమును చర్చించి యింకను ౨౮ అలంకారములను "ఉపమా ప్రపంచాధికార" మను విభాగమునం దిచ్చి యిట్లనెను :—

ఏభిర్నిదర్శనైః స్వీయైః పరకీయైశ్చ పుష్కలైః।
శబ్దవైచిత్ర్యగర్భేయముపమైవ ప్రపంచితా॥ †

భామహుఁడును (౬ వ శ.) వక్రోక్తి జీవితకారుఁడును* (౧౧-వ శ.) అలంకారములకన్నిటికిని వక్రోక్తియే మూలమనియు, నది లేనిది అలంకారమే లేదనియుఁ జెప్పియున్నారు. భామహాలంకారమున నిట్లున్నది :—

వాచాం వక్రార్థశబ్దోక్తిరలంకారాయ కల్పతే ౨. ౩౬
సైషా సర్వత్ర వక్రోక్తిరనయార్థో విభావ్యతే।
యత్నోఽస్యాం కవినా కార్యః కోఽలంకారోఽ
[నయావినా॥ ౨. ౮౫

అర్థము. వక్రోక్తి వాక్కునకు అలంకారత్వము కల్పించును. ఈ వక్రోక్తివలననే అంతటను అర్థము శోభివంత మగును. కవులు యత్నించి దీనిని సాధింపవలెను. ఇది లేనిది యేయలంకారము సిద్ధించును?

ఇతరులచే నలంకారములుగా స్వీకరింపఁబడిన హేతు, సూక్ష్మ, లేశములన్న అలంకారములలో వక్రోక్తి లేనందున నవి యలంకారములు కావని భామహుఁడు చెప్పెను. (౨. ౮౬)

వక్రోక్తియు నతిశయోక్తియు వీరి మతంబున సమానార్థకములు. ఇచ్చట వేఱు వేఱు ఆలంకారికులచే వేఱు వేఱు విధముగ లక్షణము చెప్పఁబడిన "అతిశయోక్తి" "వక్రోక్తి" యను రూఢిశబ్దార్థముల గ్రహింపఁ గూడదు. యౌగికార్థమును గ్రహింపవలెను. ఉన్నదానికంటె నెక్కువగఁ జెప్పుట యతిశయోక్తి; ఉన్నది యున్నట్టు చెప్పక మాఱువిధముగ వంకర టింకరగా చెప్పుట వక్రోక్తి. ఇట్లతిశయో

* రసగంగాధరము. కావ్యమాలకూర్పు ౨౦-వ పుట.

† నాచే రచింపఁబడినట్టియు, నితరుల వైనట్టియుఁ బెక్కు ఉదాహరణములచే శబ్దచమత్కారములో నిండియున్న ఉపమాలంకారమే విస్తరముగఁ జెప్పఁబడినది.

* లాక్షణికు లందఱును ఈతని పేరుచెప్పక ఈపేరటనే వాఁడెదరు. ఈతని పేరు కుంతకుఁడైనట్టు కానవచ్చుచున్నది. [వ్యక్తివివేక విచారము. పుటలు ౧౬; ౩౨.]

క్తియే సర్వాలంకారమూలమని హేమచంద్రుఁడును[1] మమ్మటుఁడును[2] ఒప్పుకొని యున్నారు. ఈ సంప్రదాయమువారి మతమున ఉపమాలంకారమునందుఁ గూడ అతిశయోక్తి గలదు. వస్తుస్థితిని మించుటయె యతిశయోక్తి. ముఖము చంద్రునివలె నున్నది యన్న వస్తుస్థితియా? కాదు. కావున నందు అతిశయోక్తియు (వక్రోక్తియు) నున్నది.

రుద్రటుఁడను మహాలాక్షణికుఁడు (౯-వ శ.) అర్థాలంకారములు వాస్తవము (వస్తువిషయము), ఔపమ్యము, అతిశయము, శ్లేషము అనునవి నాలుగే యనియు నలంకారములన్నియు ఈనాల్గింటి భేదములే యనియుఁ జెప్పినాడు. ఆనాల్గింటి లక్షణము లిట్లు చెప్పెను.

ఎయ్యది యర్థమును బలపఱిచి వస్తుస్వరూపమును ఉన్నది యున్నట్లు చెప్పునో యది వాస్తవము (స్వభావోక్తి). ఇందు విపరీతవర్ణనముగాని, పోలికగాని, అతిశయవర్ణనముగాని శ్లేషగాని యుండఁగు.

ఎందు వస్తుస్వరూపమును చక్కఁగఁ దెల్పు నిమిత్తమై దానితో సమానమైన మఱియొక వస్తువును వక్త చెప్పునో యది ఔపమ్యము (ఉపమ).

ఎందు నర్థము లోకములోని వాడుకకు (ప్రసిద్ధికి) తలక్రిందుగను, లోకాతీతముగను వర్ణింపఁబడునో యది అతిశయము (అతిశయోక్తి.)

ఎందు నేకార్థములు గల పదములచే నొక్క వాక్యమునకు నిశ్చయములయిన రెండర్థములు కలుగునో నయ్యది శ్లేష.

ఇట్లు నాలుగు ముఖ్యాలంకారములఁ జెప్పి మొదటిదానిలో ౨3 భేదములను, రెండవదానిలో ౨౧ భేదములును, మూడవదానిలో ౧౨ భేదములును, నాల్గవదానిలో ౧౦ భేదములును చెప్పియున్నాఁడు. ఇట్లు మొత్తము మీఁద నీతఁడు ౬౫ అలంకారములను ఈ నాలుగు తెగలలో నమర్చెను. స్వభావోక్తి, అతిశయోక్తి, ఉపమ, శ్లేష ఈ నాలిగింటిలో నొక్కటియైనను, వాచ్యముగాఁ గాని వ్యంగ్యముగాఁ గాని లేనట్టి యలంకార మొక్కటియైనను ఉండదు గనుక, రుద్రటుని ఈ చాతుర్కక్ష్యావిభాగము మిక్కిలి సరసమైనదియు, స్వాభావికమైనదియు నై యున్నది.

కాని యీ విభాగమును పాటింపక తరువాతి లాక్షణికులు వేఱు విధములయిన విభాగములను కల్పించిరి. అందు "అలంకారసర్వస్వ" కారునిచేఁ జేయఁబడిన, విభాగము పెక్కాలంకారికులచే నంగీకరింపఁ బడినది. అలంకార సర్వస్వకారుఁ డలంకారములను ౧౦ తెగలుగా విభాగించెను. ౧ సాదృశ్య గర్భములు, ౨ విరోధగర్భములు, 3 శృంఖలా

1. ఏవంవిధేచ సర్వత్ర విషయేఽతిశయోక్తిరేవ ప్రాణత్వేనావతిష్ఠతే, తాంవినా ప్రాయేణాలంకరణత్వాయోగాదితి న సామాన్యమీలితైకావలీనిదర్శనావిశేషాద్యలంకారోపన్యాసః శ్రేయాన్. [కావ్యాను ౬ అ.]

2. సర్వత్ర ఏవం విధవిషయేఽతిశయోక్తిరేవ ప్రాణత్వేనావతిష్ఠతే, తాం వినా ప్రాయేణాలంకారత్వాయోగాత్. [కావ్యప్రకాశము ౧౦-వ ఉల్లాసము]

బంధములు, ౪ తర్క-న్యాయమూలములు, ౫ వాక్య (కావ్య) న్యాయమూలములు, ౬ లోకన్యాయమూలములు, ౭ గూఢార్థప్రతీతిమూలములు, ౮ రసవదాదికములు, ౯ పృథగలంకారములు, ౧౦ సంకరములు. వీని నన్నింటికి మరలఁ బెక్కు నుపశాఖలఁ జెప్పి యీ గ్రంథకర్త ౭౫ అలంకారములను ఈ ౧౦ తెగలలోఁ జేర్చెను. ఆ వివర మీ ప్రక్కపుటలలో నీయఁబడినది. ఏకావలికారుఁడైన విద్యాధరుఁడును, ప్రతాపరుద్రీయ కారుఁడైన విద్యానాథుఁడును, * రసగంగాధర కారుఁడైన జగన్నాథుఁడు, స్వల్ప భేదములతో, నీ యలంకారకక్ష్యా విభాగమునే ఒప్పుకొని యున్నారు. కావున నేనును ఈ వ్యాసాంతమున అలంకారములను విడివిడిగా వర్ణించుచో మొదటి ౭౫ అర్థాలంకారముల వఱకు అలంకార సర్వస్వకారుని కక్ష్యావిభాగము ననుసరించియే వర్ణించినాఁడను. కువలయానందములో నధికముగా నున్న వానిఁ దరువాత కక్ష్యావిభాగము లేకుండ వర్ణించినాఁడను.

---

* ప్రతాపరుద్రీయకారుఁ డీక్రింది విభాగ మొకటి చెప్పినాఁడు :—

1. ప్రతీయమానవస్తువు లగు నలంకారములు : సమాసోక్తి, పర్యాయోక్తి, ఆక్షేప, వ్యాజస్తుతి, ఉపమేయోపమ, అనన్వయ, అతిశయోక్తి, పరికర, అప్రస్తుత ప్రశంస, అనుక్తనిమిత్తవిశేషోక్తులు. 2. ప్రతీయమానౌపమ్యములగు నలంకారములు : రూపక, పరిణామ, సందేహ, భ్రాంతిమత్, ఉల్లేఖ, అపహ్నవ, ఉత్ప్రేక్ష, స్మరణ, తుల్యయోగిత, దీపక, ప్రతివస్తూపమా, దృష్టాంత, సహోక్తి, వ్యతిరేక, నిదర్శనా, శ్లేషలు. 3. ప్రతీయమాన రసభావా ద్యలంకారములు : రసవత్, ప్రేయస్, ఊర్జస్వి, సమాహిత, భావోదయ, భావసంధి, భావశబలములు. 4. అస్ఫుటప్రతీయమానములు : ఉపమాది మిగిలిన యలంకారము లన్నియు నిందులోనివి.

## గ్రంథసంగ్రహము

**(Bibliography.)**

అలంకారశాస్త్రము సంస్కృతమునందు నెక్కువగ నభివృద్ధి నొందినది. ఆ భాషయందు వందలకొలఁది సాహిత్య శాస్త్రగ్రంథములు కలవు. ఆంధ్రమున రెండుమూడు చిన్నగ్రంథములుమాత్ర మున్నవి. కావున సాహిత్యమీమాంసకు సంస్కృతగ్రంథములే గతి. ప్రతి సాహిత్యగ్రంథమునందును చివర అలంకారముల లక్షణోదాహరణము లీయఁబడును. అందును మమ్మట కృతకావ్యప్రకాశికయు, విద్యాధర రచిత ఏకావలియు, విద్యానాథ నిర్మిత ప్రతాపరుద్రీయమును, పండితరాయ ప్రణీత రసగంగాధరమును విశేషప్రమాణిక గ్రంథములుగ నెంచఁబడును. “ఆలంకారికులు” అన్న వ్యాసమునందు సంస్కృతమున సాహిత్యగ్రంథములు వ్రాసిన ముఖ్య గ్రంథకర్తల చరిత్రలును వారి గ్రంథవివరమును వ్రాయఁబడును. కావున నిచ్చట వ్రాయుట లేదు.

సాహిత్యశాస్త్రమందలి యితర విషయములను ఎత్తుకొనక కేవల నలంకారముల మీమాంస కొఱకే పుట్టిన గ్రంథములలో రాజానకరుయ్యకకృతమైన “అలంకారసర్వస్వము” మిగుల ప్రామాణికముగ నెంచఁబడును. ఈ గ్రంథము ౧౦-వ శతాబ్దమునాటిదై యుండనోపు. ఇందు సూత్రములు వృత్తియుఁ గలవు. సూత్రములు మాత్రము రుయ్యకుఁడు వ్రాసెననియు, అతని శిష్యుఁడైన మంఖకునిచే వృత్తి వ్రాయఁబడెననియుఁ

## అలంకారములు

- 1. సాదృశ్యగర్భ
- 2. విరోధగర్భ
- 3. శృంఖలాబంధ
- 4. తర్కన్యాయమూల
- 5. వాక్య(కావ్య) న్యాయమూల
- 6. లోకన్యాయమూల
- 7. గూఢార్థప్రతీతిమూల
- 8. రసాది
- 9. పృథక్
- 10 సంకరములు

## 1. సాదృశ్యగర్భాలంకారములు

- భేదాభేదప్రధాన
  - 1. ఉపమ
  - ౨. అనన్వయము
  - 3. ఉపమేయోపమ
  - ౪. స్మరణము
- అభేదప్రధాన
  - ఆరోపగర్భ
    - ౫. రూపకము
    - ౬. పరిణామము
    - ౭ సందేహము
    - ౮. భ్రాంతిమంతము
    - ౯. ఉల్లేఖము
    - ౧౦. అపహ్నుతి
  - అధ్యవసాయగర్భ
    - ౧౧. ఉత్ప్రేక్ష
    - ౧౨. అతిశయోక్తి
- గమ్యౌపమ్యాశ్రయములు
  - పదార్థగత
    - ౧3. తుల్యయోగిత
    - ౧౪. దీపకము
  - వాక్యార్థగత
    - ౧౫. ప్రతివస్తూపమ
    - ౧౬. దృష్టాంతము
    - ౧౭. నిదర్శన
  - భేదప్రధాన
    - ౧౮. వ్యతిరేకము
    - ౧౯. సహోక్తి
  - ౨౦. వినోక్తి
  - విశేషణవిచ్ఛిత్యాశ్రయ
    - ౨౧. సమాసోక్తి
    - ౨౨. పరికరము
  - విశేషణవిశేష్యవిచ్ఛిత్యాశ్రయములు
    - ౨3. శ్లేష
  - ౨౪. అప్రస్తుతప్రశంస
  - ౨౫. అర్థాంతరన్యాసము
  - ౨౬. పర్యాయోక్తి
  - ౨౭. వ్యాజస్తుతి
  - ౨౮. ఆక్షేప

## ౨. విరోధగర్భాలంకారములు

- ౨౯. విరోధము
- 3౦. విభావన
- 3౧. విశేషోక్తి
- ౧౨. అతిశయోక్తి *
- 3౨. అసంగతి
- 33. విషమము
- 3౪. సమము
- 3౫. విచిత్రము
- 3౬. అధికము
- 3౭. అన్యోన్యము
- 3౮. విశేషము
- 3౯. వ్యాఘాతము

* ఇది రెండుసార్లు చెప్పబడినది.

లక్ష. ఒకప్రస్తుతమువలన మఱియొక ప్రస్తుతము

౭౮. ప్రస్తుతాంకురము — ద్యోతించెనేని "ప్రస్తుతాంకురము"

ఉదా. ఓతుమ్మెదా! మాలతియుండగా ముండ్లతో నిండియున్న కేతకి (మొగలిపువ్వును) ఏల కాంక్షించెదవు? [కువ.

మాలతినివిడిచి కేతకిమీఁద వ్రాలుచున్న తుమ్మెదనుజూచి ప్రియునితోఁగూడ నుద్యానవనములోఁదిరుగుచున్న యొక స్త్రీ పైమాట చెప్పెను. నావంటిచక్కని స్త్రీనివిడిచి అసౌఖ్యకరమైన పరవనితాసంగతి నీకేల యని పతితోఁజెప్పుట యీమెయుద్దేశము. ప్రత్యక్షముగాఁ జూచుచున్న తుమ్మెదవృత్తాంతమును ప్రస్తుతమే యెనిమిటియుండగ నాతనికి నర్థము కావలెనని చెప్పెను. గాన నదియు ప్రకృతమే యని భావము.

ఇది అప్రస్తుతప్రశంసాలంకారమే గాని స్వతంత్రము కాదని ప్రాచీనలాక్షణికుల మతము. [ఉద్యోత.

లక్ష. అప్రస్తుతవిషయపు నిందవలన ప్రస్తుతవిషయపు నింద స్ఫురించెనేని

౭౯. వ్యాజనిందాలంకారము

"వ్యాజనింద."

ఉదా. ఒక్క తలద్రుంచిన శివుని నసవలయుఁగాని బ్రహ్మ నని యేమి ప్రయోజనము? [కువ.

ఇచ్చట లోకమునందు దుఃఖమును సృజించిన బ్రహ్మదేవుని నిందించుట ప్రస్తుతము. కాని ఆతని యన్ని తలలును తెగగొట్టక ఒక్కతలనే తెగగొట్టినందుకు నప్రస్తుతుఁడైన శివుని నిందించి యిది సాధింపఁబడినది.

లక్ష. అర్థ నిష్పత్తికి నసంభావ్యము చెప్పుట

౮౦ అసంభవాలంకారము "అసంభవము".

ఉదా. గొల్లపిల్లవాఁడు కొండ నెత్తు-నని యెవ రెఱుఁగుదురు?

ఇది స్వతంత్రాలంకారము కాదనియు, "విరోధాలంకా" రాంతర్గతమనియుఁ బూర్వలాక్షణికుల మతము.

[దూఁడు ప్రదీపోద్యోతములు.

లక్ష. ఎందు సూక్ష్మమైన యాధేయముకంటె నధికమైన సూక్ష్మత యాధారమునకుఁ జెప్పఁబడునో యది "అల్పము."

౮౧. అల్పాలంకారము

ఉదా. కృశాంగి! ఉంగరము నీచేతియందు జపమాలవలెనున్నది. [కువ.

చేయి యాధారము. ఉంగర మాధేయము. విరహముచేఁ జిక్కినందున, సూక్ష్మమైన యుంగరముకంటె నామెచేయి కడుసన్నముగా నున్నదని భావము. ఇది స్వతంత్రాలంకారము కాదు; అధికాలంకార విభేదమె యని ఉద్యోతకారుఁడు.

లక్ష. ఒక విశేషమును జెప్పి, సామాన్యముతో దానిని సమర్థించి, అంతఁ దృప్తినొందక మఱియొకవిశేషమును, ఉపమానమూలమునఁ గాని యర్థాంతరన్యాస మూలమునఁ గాని, చెప్పుట "వికస్వరము."

౮౨. వికస్వరాలంకారము

ఉదా. అనంత రత్నములకుఁ బుట్టినిల్లయిన హిమాలయమునకు మంచు చక్కఁదనమును బోఁగొట్టునది కాలేదు. పెక్కు గుణముల సమూహములో నొక్క దోషము, చంద్రుని కిరణములలో మచ్చవలెఁ గప్పఁబడును. [కు. సం

ఇది యర్థాంతరన్యాసాలంకారమే కాని వేఱు కాదు. [ఉద్యోతము.

లక్ష. ఒకయర్థము సిద్ధించుట 'కిది యిట్లయిన యెడ' నని వితర్కించిన "సంభావన."

౮౩. సంభావనాలంకారము

ఉదా. ఓ రాజా! శేషుఁడు వక్తయైనయెడల నీగుణము లెన్నఁబడును.

ఇది అతిశయోక్తిలోనిదేగాని స్వతంత్రాలంకారము కాదని కొందఱి యభిప్రాయము.

లక్ష. ఒకదానియొక్క మిథ్యాత్వమును నిరూపించుటకై మఱియొక్క మిథ్యార్థమును కల్పించుట "మిథ్యాధ్యవసతి"

౮౪. మిథ్యాధ్యవసత్యలంకారము

ఉదా. ఆకాశపుష్పమాలను ధరించి వేశ్యను వశీకరింపుము.

ఇది స్వతంత్రాలంకారము కాదనియు, అతిశయోక్తిలోనిదియేయనియుఁ గొందఱి మతము. [ఝుల్‌కీకరు.*

లక్ష. ప్రకృతార్థపరము లయిన పదములచే ప్రకృతమునకు సంబంధము లేని మఱియొక సూచ్యార్థమును సూచించుట "ముద్ర."

**౯౫. ముద్రాలంకారము**

ఉదా.

తే. మిత్రుఁ డొక్కఁడు వీణియ * మీటుచుండ
విబుధవరు లిద్ద అర్థంబు * విప్పిచెప్ప
నినులు నిద్దఱు వినుచుండ * నేకగతిని
దేటగీతంబు మాఁటను * వాటమయ్యె. [అప్ప.

ఇందు తేటగీతము (తేటపాట) ప్రకృతము. దానిని వర్ణించు పదములతోడనె తేటగీతిలక్షణము పేరును సూచింపఁబడినది. ఇది "శ్లేష" కాదు. ఎందుకన 'వీణియమీటు' మొదలయిన క్రియలు గీతిలక్షణమున నన్వయింపవు.

ఇట్లే "నవరత్నమాల" యను పేరుతోఁ బద్యములను వ్రాయుచు మాటర్థమందు వేఱువేఱురత్నముల పేళ్లు చెప్పుటయు, సంగీతకృతులందు రాగముల పేళ్లు సూచించుటకుఁ గృతులలో రెండవయర్థమునందు "శంకరాభరణము" మొదలయిన పదములను వాడుటయు, ఈ యలంకారమే యగును.

ఇది యలంకారమే కాదు. ఇందుఁ బ్రస్తుతోపస్కారక మేమియు లేదు. అని కొందఱి యభిప్రాయము.
[ఝుల్. ౯౦౩ పుట.]

లక్ష. ప్రకృతార్థములను వరుసగఁ జెప్పినచో "రత్నావళి" అను అలంకారమగును.

**౯౬. రత్నావళ్యలంకారము**

ఉదా. రాజా! నీవు చతురాస్యుఁడవు, లక్ష్మీపతివి, సర్వజ్ఞుఁడవు.

నీవు "బ్రహ్మ విష్ణు మహేశ్వరుఁడ"వని భావము. ఇచ్చట వాక్యకలోనున్న బ్రహ్మ విష్ణు రుద్రులన్న క్రమముఁదప్పక చెప్పఁబడినందున నీయలంకారము.

ఇది యలంకారమే కాదు. ఇచ్చట రూపకమే చమత్కారమును కలుగఁజేయుచున్నది గాని, క్రమముచేఁ గాదు. [ఉద్యోతము]

లక్ష. స్వగుణమును విడిచి మరల స్వగుణమును గ్రహించినట్లు వర్ణించినచోఁ "బూర్వరూపము."

**౯౭. పూర్వరూపాలంకారము**

ఉదా. ఓరాజా! శివునికంఠమును చుట్టుకొన్నవాఁడయ్యును శేషుఁడు నీకీర్తిచేఁ దెల్లవాఁడయ్యెను.

మొదట శేషుఁడు తెల్లవాఁడు, శివునినల్లనికంఠముయొక్క స్పర్శచే నల్లపడెను. మరల రాజుయొక్క కీర్తిచేఁ దెల్లపడెను!

ఇది "సమాధి" లోనిదిగాని స్వతంత్రాలంకారము కాదు. [ఉద్యోత.

లక్ష. ఒక్కవస్తువు పూర్వము తనకు సిద్ధముగానున్న గుణమునే పరసన్నిధివలన నెక్కువగాఁ బొందినట్లు చెప్పుట "అనుగుణము"

**౯౮. అనుగుణాలంకారము**

ఉదా. నీలోత్పలములు కామినియొక్క కటాక్షములచే నధికనీలిమఁ బొందెను.

ఇది "తద్గుణమే; స్వతంత్రాలంకారము కాదు." [ఉద్యోత.

**౯౯. ఉన్మీలితాలంకారము**

లక్ష. భేదస్ఫూర్తి చెప్పఁబడెనేని "ఉన్మీలితము."

ఉదా. ఓరాజా! సురలు నీయొక్క యశస్సున మునిగిన హిమవత్పర్వతమును చలిచేఁ దెలిసికొందురు.

ఇది మీలితమునకు వ్యతిరేకము. ఇది స్వతంత్రాలంకారము కాదనియు, మీలితాంతర్గతమనియు నుద్యోతకారుని మతము.

**౧౦౦. విశేషకాలంకారము**

లక్ష. విశేషము కన్పట్టుచుండెనేని "విశేషకము."

* భట్టవామనాచార్య ఝళకీకర్ అను పండితుఁడు కా. ప్ర. పై నుంచి టీకవ్రాసినాఁడు. దాని రెండవకూర్పు బొంబాయి నిర్ణయసాగర ప్రెసులో అచ్చు పడినది. దానిఁజూడనగు.

ఉదా. చంద్రుఁ డుదయింపఁగాఁ గమలములును ముఖములును కనుఁగొనఁబడెను. (వేఱువేఱుగ గుర్తింపఁ బడెను.)

ఇది "సామాన్యము" నకు వ్యతిరేకము. ఇది స్వతంత్రము కాదు. "సామాన్య"ములోనిదే. [ఉద్యో.

లక్ష. పరవృత్తాంత మెఱిఁగిన వానియొక్క సాభి ప్రాయ చేష్టనము "పిహితము."

**౧౦౧ పిహితాలంకారము**

ఉదా. ప్రియుఁడు ప్రాతఃకాలమున నిల్లు చేరఁగనే భార్య ప్రక్క వేసెను.

రాత్రియంతయు సపత్నితోఁ గూడి జాగరణచేసితివి గాన నిఁక నిద్రింపుము అని భావము.

ఇది "సూక్ష్మా" లంకారాంతర్గతము. [ఉద్యోత.

లక్ష. ఒకవిషయ మొకరికిఁ జెప్పఁదలఁచి యది దగ్గఱగాని చుట్టుపట్టున గాని ఉండువారికిఁ దెలియకుండులాగున నన్యుని సంబోధించి గూఢముగాఁ జెప్పుట "గూఢోక్తి."

**౧౦౨. గూఢోక్త్య లంకారము**

ఉదా. చక్రవాకకాంతా! రాత్రి సమీపించుచున్నది. ప్రియుని వీడ్కొలుపుము. [అభి.

శకుంతలయు, దుష్యంతుఁడును లతాకుంజమునఁ గలిసియుండ శకుంతలఁ జూడ గౌతమియను నామె వచ్చెను. కానియీసమాచారము శకుంతలకు, గౌతమికిఁ దెలియకుండఁదెల్పి యామె దుష్యంతుని దాఁచునట్లు చేయవలెనని, సఖి యిట్లామెను హెచ్చరించెను.

ఇది యొకప్పుడు ధ్వనిరూపముగను, ఒకప్పుడు గుణీభూతవ్యంగ్యముగను నుండును. [ఝుల్కీకరు.

లక్ష. కవి యిది గూఢోక్తి యని తెల్పు పదముల నుపయోగించి గూఢోక్తి చెప్పినయెడల నది "వివృతోక్తి".

**౧౦౩ వివృతోక్త్యలంకారము**

ఉదా. పై గూఢోక్తి యుదాహరణము నందు కవి 'ఇట్లు ప్రియంవద శకుంతలను హెచ్చరించెను' అని చెప్పి యున్నయెడల నది వివృతోక్తికి నుదాహరణమగును. ఇది అలంకారము కానేకాదు. [ఝుల్.

లక్ష. లోకవ్యవహారమందలి సామెతలఁ జక్కఁగఁ జెప్పిన చో "లోకోక్తి."

**౧౦౪ లోకోక్త్యలంకారము**

ఉదా. కొన్ని దినములు కన్ను మూసికొని యుండుము.

ఇది అలంకారము కాదు. [ఝుల్.

లక్ష. లోకోక్తి యర్థాంతరగర్భితమేని "ఛేకోక్తి" యనఁ బడు.

**౧౦౫ ఛేకోక్త్యలంకారము**

ఉదా. పాముకాళ్లు పామే యెఱుఁగు.

ఇదియు నలంకారము కాదు. [ఝుల్.

లక్ష. రహస్యమును దాఁచుటకై యేదో యొక యుక్తిచే నితరుల వంచించుట "యుక్తి."

**౧౦౬. యుక్త్యలంకారము**

ఉదా. ఒక స్త్రీ తన ప్రియుని పటము చిత్రించుచుండఁగ నన్యస్త్రీ వచ్చుటచే నాప్రతిమయొక్క హస్తమున పూవింటిని చిత్రించెను.

తాను వ్రాయుచున్నది మదనునిపట మని యన్యస్త్రీ భావింపవలె నని తాత్పర్యము.

ఇది స్వతంత్రాలంకారము కాదు. "వ్యాజోక్తి" లోనిదియే. [ఝుల్కీకరు.]

లక్ష. ఆశ్చర్యకరములును అసత్యములును అయిన శౌర్యాదులను వర్ణించుట "అత్యుక్తి".

**౧౦౭. అత్యుక్త్య లంకారము**

ఉదా. రాజా! నీప్రతాపాగ్నిచేత నెండిపోయిన సప్తసాగరములును నీదుశత్రురాజుల స్త్రీల కన్నీళ్లచేత నిండినవి. [కు. ఆ.

సంపద సంబంధమైన అత్యుక్తిని "ఉదాత్త" మందురు. శౌర్యాదిసంబంధమైన అత్యుక్తిని "అత్యుక్తి" యందురు. ఇది వీనికిఁ గలభేదము. "అతిశయోక్తి"యందు సదుక్తి (నిజము) ఉండును. "అత్యుక్తి" యందు అసదుక్తి (అసత్యము) ఉండును. ఇదియే వీనికి భేదమని అప్పయ దీక్షితులవారి మతము.

ఇది "ఉదాత్త"ము లోనిదే యని కొందఱును "అతిశయోక్తి" లోనిదే యని మఱికొందఱును చెప్పెదరు. [ఉద్యోత.

## ౧౦౮. నిరుక్త్యలంకారము

లక్ష. వ్యుత్పత్తివలన నామములకు నన్యార్థము కల్పించితి మేని "నిరుక్తి."

ఉదా. పూర్వము కవులను లెక్కవేయ నారంభించి, కనిష్టిక (చిటికెన) వ్రేలిమీద ఒకఁడు అని కాళిదాసుని పేరు చెప్పి బొటిమనవ్రేలు ఉంచఁబడెను. కాని యిప్పటివఱకును కాళిదాసునితో సమానుఁడైన కవి పుట్టనందున రెండవవ్రేలయిన "అనామిక" కు అనామిక (పేరులేనిది)యన్న నామము సార్థకమాయెను.

ఇచ్చట 'అనామిక' యను వ్రేలునకు కాళిదాసునితో సమానమైనవాఁడు పుట్టనందునఁ బేరులేనిది యన్న మాఱర్థము చెప్పఁబడినది.

ఇది "శ్లేష" లోనిది, వేఱుకాదు. [ఉద్యోత.

## ౧౦౯. ప్రతిషేధాలంకారము

లక్ష. ప్రసిద్ధమైననిషేధమునే క్రొత్తగాఁ జెప్పుట "ప్రతిషేధము."

ఉదా. ఓ జూదరి ఇది జూదముకాదు, ఘోరమైన యుద్ధము.

యుద్ధము జూదముకాదన్న సంగతి సుప్రసిద్ధమే. కాని నీకు జూదముమాత్రము చేతనగు, యుద్ధము చేతగాదని జూదరినిఅధిక్షేపించుటకై మరలఁ జెప్పఁబడినది.

ఇది యలంకారమే కాదు. "విధి"వలెనే ధ్వన్యంతర్గతము. [ఉద్యోత.

## ౧౧౦. విధ్యలంకారము

లక్ష. సిద్ధమైనదానినేక్రొత్తగావిధించుట"విధి."

ఉదా. ఓ హస్తమా! బ్రాహ్మణశిశువును బ్రతికించుటకై యీ శూద్రమునిమీదఁ గత్తి వేయుము; మోయలేని చూలుతో బాధపడుచున్న సీతను వెడలఁగొట్టిన రాముని అవయవమైన నీకు దయయెక్కడిది? [ఉత్తర రామచరితము.]

రామునిచేయి రామునియవయ వన్న మాటయిది వఱకే సిద్ధము. ఇప్పుడు మరల నామాటఁ జెప్పుటవలన "విధి" యయ్యె.

ఇది అలంకారము కాదు. ఇట్టిచోట నొకప్పుడు ధ్వనివలనను, ఒకప్పుడు గుణీభూతవ్యంగ్యమువలనను, గతార్థ మగుటచే వీనిని స్వతంత్రాలంకారము లనుటకు వీలులేదు. గోష్పదమంతటి యలంకారమునందు గుణీభూతవ్యంగ్యప్రపంచ మంతయు నిముడ్చుట బ్రహ్మతరమైనను కాదు. [ఉద్యోత.

## ౧౧౧. హేత్వలంకారము

లక్ష. హేతుమంతముతో(కార్యముతోఁ)బాటు హేతువును (కారణమును) వర్ణించుటయు, హేతుహేతుమంతములకు నైక్యము వర్ణించుటయు "హేతు" వనంబడును.

హేతుమంత మనఁగా హేతువువలన నగుపని.

ఉదా. ౧. చంద్రుఁడు స్త్రీలమానమును భేదించుటకై ఉదయించుచున్నాఁడు.

ఉదా. ౨. ఈ ప్రభువు కటాక్షములు విద్వాంసులకు లక్ష్మీవిలాసములు.

ఇది అతిశయోక్త్యంతర్గతము; భిన్నాలంకారము కాదు. [ఉద్యోతము]

### ప్రమాణాలంకారములు.

లక్ష. నైయ్యాయికులకు నాల్గు ప్రమాణములు, వేదాంతులకాఱు, మీమాంసకులకు నెనిమిది. మీమాంసకులయొక్క యెనిమిదిప్రమాణములను దీసికొని అవి యే యలంకారమునందుఁ గానవచ్చునో వానిని అప్రమాణము పేరిటియలంకార మనవలె నని కొందఱు లాక్షణికుల యభిప్రాయము. అవి యేవ్వి యనిన ౧ ప్రత్యక్షము ౨ అనుమానము, 3 ఉపమానము, ౪ శబ్దము, ౫ ఐతిహ్యము, ౬ అర్థాపత్తి, ౭ అనుపలబ్ధి, ౮ సంభవము. వీనిలో 'అనుమానము'ను అందఱును (కావ్యప్రకాశకారుఁడుకూడ) ఒప్పుకొనిరి. ప్రత్యక్ష మనునది"భావిక" ము లోనిది, "ఉపమానము" "ఉపమ"యే. మిగిలిన ప్రమాణాలంకారములు అలంకారములే కావనియు,

ఆయా ప్రమాణములవలన నర్థమునకుఁ గల్గు చమత్కారము లేదనియు ఆరూపమున స్వతంత్రాలంకారమునకు నుపస్కారకత్వము లేదనియు ఉద్యోతకారునిమతంబు.

లక్ష. ఇంద్రియజన్యజ్ఞానము ప్రత్యక్షము. అట్టి జ్ఞానమును అలంకారముగ వర్ణించిన "ప్రత్యక్షాలంకారము" అనఁబడును.

౧౧౨ ప్రత్యక్షాలంకారము

ఉదా. దేనిని విని, కనులఁ జూచి, తాఁకి, వాసన రుచిచూచి జనులు సంతోషించెదరో, నేతిలో వండిన యట్టి చక్కిలము నీకు నర్పించుకొనుచున్నాఁడను.

ఇట్లు పంచేంద్రియములకుఁ బ్రత్యక్షమైన జ్ఞానము చక్కిలము యోగ్యతను హెచ్చించినది. ఇంద్రియము లైదు, మనస్సు ఒకటి కావున నిది యాఱువిధములు. "అనుమాన" మిదివఱకే చెప్పఁబడినది.

౧౧౩. ఉపమానాలంకారము

లక్ష. సాదృశ్యమువలన వస్తుజ్ఞానము కల్గుట "ఉపమానాలంకారము"

ఉదా. ఈ నక్షత్రమండలమునందు నెయ్యది బండివలె నుండునో యది రోహిణీనక్షత్ర మని యెఱుఁగుము. [ఇది ఉపమాంతర్గతమే. ఉద్యో.]

లక్ష. శ్రుత్యాది వాక్యోపన్యాసముచే నర్థము నిశ్చయింపఁ బడెనేని యది "శబ్దాలంకార మగును."

౧౧౪. శబ్దాలంకారము

ఉదా. నిందించు నుద్దేశముతోఁ జెప్పినను నీవు శివుని విషయమై ఆతని పుట్టుక తెలియదని యొక్క మంచిమాట చెప్పినావు. బ్రహ్మకుఁగూడ నెవ్వఁడు జన్మస్థల మని వేదములు ఘోషించునో వాని జన్మ మెవరు కనుఁగొనఁగలరు? [కు. సం.

ఈ విధముగనే స్మృతిపురాణాగమలౌకికవాక్య రూపములయిన శబ్దప్రమాణములకు నుదాహరణములఁ జూపవచ్చును. ఆచారాత్మతుష్టులు కూడ శబ్దప్రమాణములోనివే. ఆత్మతుష్టి యను ప్రమాణమునకు నీ క్రింది యుదాహరణము:—

నాకు నీమెపై మనస్సు పోయెను గాన నీమె క్షత్రియులచేఁ బరిగ్రహింపఁదగిన దనుటకు సందేహము లేదు. సజ్జనులకు సంశయము కలిగినప్పుడు అంతఃకరణ ప్రవృత్తియే ప్రమాణము. [అభి. శా.

లక్ష. జనశ్రుతి (కింవదంతి) ప్రమాణముగాఁ జెప్పినయెడల 'ఐతిహ్యము'.

౧౧౫ ఐతిహ్యాలంకారము

ఉదా. మంగళగిరిలో దేవుఁడు పానకము త్రాగు నని లోకవార్త గలదు. [అలంకారము కాదు. ఉద్యోత.]

లక్ష. తర్కమందలి యర్థాపత్తిన్యాయమున నొక యర్థ మూహింపఁబడెనేని యది "కావ్యార్థాపత్తి"

౧౧౬. కావ్యార్థాపత్తి అలంకారము

ఉదా. నితంబిని! నీకు నడు మున్నది యని నిశ్చయించుటకు వీలున్నది. లేనియెడలఁ బయోధరముల యునికియెట్లు?

ఇదివఱకు ౯౦-వ అలంకారముగ ౧౫౬-౭-వ పుటలో "అర్థాపత్తి" చెప్పఁబడినది. అదియే యిది. కువలయానందకారుఁడు దానికి "కావ్యార్థాపత్తి" యని పేరు పెట్టి యిది విడియలంకారమైనట్లు వ్రాసెను. కాని యిది వేఱు కాదు.

లక్ష. ప్రమాణముగ నొప్పుకొనిన అనుపలబ్ధి (అప్రాప్తి) అలంకారముగఁ జెప్పఁబడిన "అనుపలబ్ధి."

౧౧౭ అనుపలబ్ధ్యలంకారము

ఉదా. రాజా! నీకు అయశస్సు లేనేలేదు. ఎక్కడ వినలేదు. ఉండిన వినఁబడదా యని భావము. అలంకారము కానే కాదు. [ఉద్యోత.

లక్ష. ప్రమాణత్వమును జెందిన "సంభవము" అలంకారత్వమును జెందెనేని యది "సంభవా"లంకార మగు.

౧౧౮ సంభవాలంకారము

ఉదా. నాకృతిఁ జూచి పరిహసించువారీ ప్రయత్నము వారికొఱకుఁ గాదని తెలిసికొనవచ్చును. నా వ్రాఁతలఁ జూచి సంతసించు నా సమానధర్ముఁ డీ లోకమందున్నాఁడు, లేదా పుట్టఁగలఁడు. కాల మనంతము, భూమి విశాలము. [భవభూతి]

---

## అలంకారవ్యాసమునకు అకారాదిసూచి.

### ౧. ఉపోద్ఘాత సూచి


అలంకారముల చరిత్రము ... ౧౫౫౮
అలంకారములను గుఱించి ధ్వనిసంప్రదాయమువారి యభిప్రాయము ... ౧౫౫౬
అలంకారముల పట్టిక (అలంకారసర్వస్వము ననుసరించి) ... ౧౫౬౬
అలంకారముల విభజన ... ౧౫౬౦
అలంకారముల సంఖ్య ... ౧౫౫౯
అలంకార సంప్రదాయమువారు ... ౧౫౫౫
ఆలంకారికుల వేఱువేఱు సంప్రదాయములు ... ౧౫౫౪
గుణములకు నలంకారములకుఁ గల భేదము ... ౧౫౫౬
గ్రంథసంగ్రహము ... ౧౫౬౫
ధ్వని యెద్ది? అలంకార మెద్ది? ... ౧౫౫౮
వేఱువేఱు అలంకారముల లక్షణోదాహరణములు ... ౧౫౬౯
శబ్దార్థాలంకారముల యోగ్యత ... ౧౫౬౨


### ౨. అలంకారముల సూచి


≀ § ♦ అతద్గుణము ... ౧౬౦౦
* ≀ § ♦ అతిశయోక్తి ... ౧౫౭౬
అత్యుక్తి ... ౧౬౧౦
≀ § ♦ అధికము ... ౧౫౯౪
≀ § ♦ అనన్వయము ... ౧౫౮౯
అనుగుణము ... ౧౬౦౯
♦ అనుజ్ఞ ... ౧౬౦౮
అనుపలబ్ధి ... ౧౬౧౨
≀ § అనుప్రాసము ... ౧౫౮౦
≀ § ♦ అనుమానము ... ౧౫౯౬
≀ § ♦ అన్యోన్యము ... ౧౫౯౪
* ≀ § ♦ అపహ్నుతి ... ౧౫౭౩
* ≀ § ♦ అప్రస్తుతప్రశంస ... ౧౫౯౧
§ ♦ అర్థాపత్తి ... ౧౫౯౮
* ≀ § ♦ అర్థాంతరన్యాసము ... ౧౫౯౨
అర్థాలంకారములు ... ౧౫౮౪
అల్పము ... ౧౬౦౭
♦ అవజ్ఞ ... ౧౬౦౮
≀ § ♦ అసంగతి ... ౧౫౯౩
అసంభవము ... ౧౬౦౭
♦ అసమము ... ౧౬౦౫
* ఆశీర్వచనము ...
* ≀ § ♦ ఆక్షేపము ... ౧౫౯౨
≀ § ♦ ఉత్తరము ... ౧౬౦౦
* ≀ § ♦ ఉత్ప్రేక్ష ... ౧౫౭౩
* § ఉదాత్తము ... ౧౬౦౨
♦ ఉదాహరణము ... ౧౬౦౫
ఉన్మీలితము ... ౧౬౦౯
* ≀ § ♦ ఉపమ ... ౧౫౮౪
ఉపమానము ... ౧౬౧౨
≀ § ♦ ఉపమేయోపమ ... ౧౫౮౯
♦ ఉల్లాసము ... ౧౬౦౮
§ ♦ ఉల్లేఖము ... ౧౫౭౩
* ఊర్జస్వి ... ౧౬౦౩
≀ § ♦ ఏకావలి ... ౧౫౯౫


---

* ఈ గుర్తు వేయఁబడిన యలంకారములు 'దండి' యొక్క కావ్యాదర్శమునందుఁ గలవు.
≀ ఈ గుర్తు వేయఁబడిన యలంకారములు 'మమ్మటుని' కావ్యప్రకాశమునందుఁ గలవు.
§ ఈ గుర్తు వేయఁబడిన యలంకారములు 'విద్యానాథుని' ప్రతాపరుద్రీయమునందుఁ గలవు.
♦ ఈ గుర్తుగల అలంకారములు 'రసగంగాధరము' నందు ఈయఁబడినవి. ర. గం. అసంపూర్ణమైన గ్రంథముగనుక ఇతరాలంకారములు జగన్నాథునకు నసమ్మతములని చెప్పుటకు వీలు లేదు.

ఐతిహ్యము ... ౧౬౧౨
* | § క్రమము (యథాసంఖ్యము) ... ౧౫౯౬
కారకదీపకము ... ౧౫౮౭
| § ◆ కారణమాల ... ౧౫౯౫
| § ◆ కావ్యలింగము ... ౧౫౯౬
కావ్యార్థాపత్తి ... ౧౬౧౨
గూఢోక్తి ... ౧౬౧౦
| § చిత్రము ... ౧౫౭౪
| § ఛేకానుప్రాసము ... ౧౫౭౦
ఛేకోక్తి ... ౧౬౧౦
| § ◆ తద్గుణము ... ౧౬౦౦
◆ తిరస్కారము ... ౧౬౦౭
* | § ◆ తుల్యయోగిత ... ౧౫౮౬
| § ◆ దీపకము ... ౧౫౮౭
| § ◆ దృష్టాంతము ... ౧౫౮౭
* | § ◆ నిదర్శనము ... ౧౫౮౮
నిరుక్తి ... ౧౬౧౧
| § ◆ పరికరము ... ౧౫౯౯
పరికరాంకురము ... ౧౬౦౭
§ ◆ పరిణామము ... ౧౫౮౨
* | § ◆ పరివృత్తి ... ౧౫౯౬
| § ◆ పరిసంఖ్య ... ౧౫౯౭
| § ◆ పర్యాయము ... ౧౫౯౬
* | ◆ పర్యాయోక్తము ... ౧౫౯౨
పిహితము ... ౧౬౧౦
| § పునరుక్తవదాభాసము ... ౧౫౭౦
పూర్వరూపము ... ౧౬౦౯
| § ◆ ప్రతివస్తూపమ ... ౧౫౮౭
ప్రతిషేధము ... ౧౬౧౧
| § ◆ ప్రతీపము ... ౧౫౯౯
ప్రత్యక్షము ... ౧౬౧౨
| § ◆ ప్రత్యనీకము ... ౧౫౯౯
ప్రమాణాలంకారములు ... ౧౬౧౧
ప్రస్తుతాంకురము ... ౧౬౦౮
◆ ప్రహర్షణము ... ౧౬౦౬
* ప్రేయోలంకారము ... ౧౬౦౩
◆ ప్రౌఢోక్తి ... ౧౬౦౬
భావశబలత ... ౧౬౦౪
భావసంధి ... ౧౬౦౩
* | § భావికము ... ౧౬౦౨
భావోదయము ... ౧౬౦౩
| § ◆ భ్రాంతిమదలంకారము ... ౧౫౮౩
| § మాలాదీపకము ... ౧౫౯౫
మిథ్యాధ్యవసితి ... ౧౬౦౮
| § ◆ మీలితము ... ౧౬౦౦
ముద్రాలంకారము ... ౧౬౦౯
* | § యమకము ... ౧౫౭౨
| § ◆ యథాసంఖ్యము (క్రమము) ... ౧౫౯౬
యుక్తి ... ౧౬౧౦
రత్నావలి ... ౧౬౦౯
* రసవదలంకారము ... ౧౬౦౨
* | § ◆ రూపకము ... ౧౫౮౦
◆ లలితలవము ... ౧౬౦౬
| § లాటానుప్రాసము ... ౧౫౭౧
* ◆ శ్లేషము ... ౧౬౦౭
లోకోక్తి ... ౧౬౧౦
| § ◆ వక్రోక్తి ... ౧౬౦౧
§ వికల్పము ... ౧౫౯౮
వికస్వరము ... ౧౬౦౮
§ ◆ విచిత్రము ... ౧౫౯౪
విధి ... ౧౬౧౧
* § ◆ వినోక్తి ... ౧౫౮౯
* | § ◆ విభావన ... ౧౫౯౩
* | § ◆ విరోధము ... ౧౫౯౩
వివృతోక్తి ... ౧౬౧౦
విశేషకము ... ౧౬౦౯
| § ◆ విశేషము ... ౧౫౯౪
* | § ◆ విశేషోక్తి ... ౧౫౯౩
| § ◆ విషమము ... ౧౫౯౩
◆ విషాదము ... ౧౬౦౬
| § వృత్త్యనుప్రాసము ... ౧౫౭౧
* | § ◆ వ్యతిరేకము ... ౧౫౮[illegible]

≀ § ◆ వ్యాఘాతము ... ౧౫౯౪
వ్యాజనింద ... ౧౬౦౮
* ≀ § ◆ వ్యాజస్తుతి ... ౧౫౯౨
≀ § వ్యాజోక్తి ... ౧౬౦౧
శబ్దము ... ౧౬౧౨
శబ్దాలంకారములు ... ౧౫౬౯
శృంఖలా ... ౧౫౯౫
* ≀ § ◆ శ్లేషము ... ౧౫౮౯
≀ § సంకరము ... ౧౬౦౪
≀ § ◆ సందేహము ... ౧౫౮౨
సంభవము ... ౧౬౧౨
సంభావన ... ౧౬౦౮
* ≀ § సంసృష్టి ... ౧౬౦౪
≀ § ◆ సమము ... ౧౫౯౪
≀ § ◆ సమాధి ... ౧౫౯౮
* ≀ § ◆ సమాసోక్తి ... ౧౫౮౯
* సమాహితము ... ౧౬౦3
≀ § ◆ సముచ్చయము ... ౧౫౯౮
* ≀ § ◆ సహోక్తి ... ౧౫౮౯
≀ § ◆ సామాన్యము ... ౧౬౦౦
≀ § ◆ సారము ... ౧౫౯౫
* ≀ § సూక్ష్మము ... ౧౬౦౦
!? § ◆ స్మరణము (స్మృతి) ... ౧౫౮౦
* ≀ § స్వభావోక్తి!(జాతి) ... ౧౬౦౧
* హేతు ... ౧౬౧౧


సూచన:—ఈ సూచిలో నీయఁబడిన అర్థాలంకారము లన్నియు, 'అసమము' 'ఉదాహరణము' 'తిరస్కారము' అనునవితప్ప, "కువలయానందము" నందుఁగలవు.

[కో. ల.

---

**అలంకారములు.** (సంగీతశాస్త్రము) గానక్రియాత్మకమైన వర్ణసందర్భవిశేషము. ఇవి అయిదు విధములు. ౧. స్థాయివర్ణగతము, ౨. ఆరోహివర్ణగతము, 3. అవరోహివర్ణగతము, ౪. సంచారివర్ణగతము, ౫. అలంకారాంతరము. ౧. ఏకస్వరమాత్ర ఘటితము స్థాయివర్ణగతము. స్వరమొక్కటియైనను దానియొక్క తార మాంద్రభేద భిన్నముల విన్యాస విశేషముచే నది విలక్షణముగఁ గానవచ్చును. ఉదా. సాసాసా-సాసా సా. ఇత్యాది. దీనికి ౭ భేదములు కలవు. ౨. క్రమముగ స్వరముల ఆరోహణము కలది ఆరోహివర్ణగతము. ఉదా. సారీగామాపాదానీ, సస రిరి గగ మమ ధధ నిని ఇత్యాది. దీనికి ౧౨ భేదములు కలవు. 3. క్రమముగ స్వరముల అవరోహణము కలది అవరోహిత వర్ణగతము. ఉదా. నీధాపామాగారీసా - నిని ధధ పప మమ గగ రిరి సస. దీనికి ౧౨ భేదములు కలవు. ౪. ఆరోహణావరోహణముల మిశ్రణము గలది ఆరోహణావరోహణ గతము. ఉదా. సగరీ రిమగా గపమా మధపా పని ధా. దీనికి ౨౫ భేదములు కలవు. ౫. పైని చెప్పిన భేదములకు భిన్నమైనది అలంకారాంతరము. ఉదా. సరిగ మపధనిససా. దీనికి ౭ భేదములు కలవు. ఇట్లు అలంకారముల ప్రసిద్ధ భేదంబులు ౬3. కాని యితరభేదములు గణించిన అసంఖ్యంబులు. రక్తిలాభము, స్వరజ్ఞానము, వర్ణాంగవివేకము అనునవి అలంకార ప్రయోజనములు.

**అలంకారశాస్త్రము.** కావ్యగుణదోషములను మీమాంసించు శాస్త్రమునకు అలంకారశాస్త్రమని పేరు. ఈ శాస్త్రము సంస్కృతమునందును పాశ్చాత్యభాషలలోను విశేషముగ నభివృద్ధిఁ జెంది యున్నది. దీనిని ఈ విజ్ఞానసర్వస్వమునందు నీ క్రింది ౧౦ వ్యాసములలోఁ జర్చించెదము. ౧ అలంకారములు (వ్యాస మిదివఱకే ప్రకటింపఁబడినది), ౨ ఆలంకారికులు (శాస్త్రచరిత్రము, వేఱువేఱు సంప్రదాయముల వర్ణనము), 3 కావ్యము (లక్షణవిభాగ గుణదోషాదికములు), ౪ చిత్రకవిత్వము, ౫ ధ్వని, ౬ నాటకములు, ౭ నవలలు, ౮ పద్యకావ్యములు, ౯ పాటలు ౧౦ గద్యకావ్యములు. కావునఁ జదువరు లాయా శీర్షికక్రిందఁ జూడ నగును.

**అలంకార సర్వస్వము** రాజానక రుయ్యకకవిచే అలంకారములను గుఱించి మాత్రము

వ్రాయఁబడిన గ్రంథము. ఇందు సూత్రములును, వృత్తియు కలవు. సూత్రములు మాత్రము రుయ్యకునిచే వ్రాయఁబడెననియు, అతని శిష్యుఁడైన మంఖకునిచే వృత్తి వ్రాయఁబడెననియు కొందఱి యభిప్రాయము. ఈ రుయ్యకుఁడు క్రీ. శ. ౧౨ వ శతాబ్దమునం దుండినట్లు ఊహింపఁబడుచున్నది. అలంకారికులలో నీతనికి గొప్ప గౌరవము కలదు. ఇయ్యది కావ్యమాలలోను, అనంతశయన సంస్కృత గ్రంథావళిలోను ప్రచురింపంబడియె.

**అలంకారుఁడు.** శా. శ. ౧౧వ శతాబ్దముయొక్క ఉత్తరార్థమునందు కాశ్మీరదేశమును పాలించిన సుశలరాజుయొక్క మంత్రి. ఇతని తమ్ముఁడు మంఖకవి శ్రీకంఠచరిత్ర మను కావ్యమును రచింపగా దానిని పరీక్షించు నిమిత్తమై యీతఁడు 30 పండితుల సభఁ జేయించెను. [ఆర్వాచీనకోశము]

**అలంగిరు గుట్ట.** కటక్ జిల్లాయందలి జయపురము సబ్ డివిజన్‌లోని యొకపర్వతము. ౨౯౦౦ అడుగులయెత్తున ఈ పర్వతముమీద తఖ్తు-ఈ-సులేమాన్ అను మసీదొకటి కలదు.

**అలంద్.** నైజామ్ హైద్రాబాద్ సంస్థానములోని గుల్‌బర్గాజిల్లాయందలి ఈ పేరుగల పాయగా తాలూకాకు ముఖ్యస్థలము. గుల్‌బర్గాపట్టణమునకు వాయవ్యమున ౨౦ మైళ్లదూరమున నుండును. ఇది వర్తకస్థలము.

**అలంపురము** ( ఇందూర్. ) ఇందూరు సంస్థానమువారి యొకపరగణా. ఇది ఇందూరు సంస్థానమునకు విడిగా మధ్య హిందూస్థానమందలి బుందేలుఖండ్ ఏజన్సీలోఁ జేరియున్నది. విస్తీర్ణము 3౭ చ॥ మైళ్లు. గ్రామములు ౨౬. జనసంఖ్య ౧౬౭౧౧. వసూలు రు. ౯౦౦౦. ఇందూరు సంస్థానాధిపతుల మూలపురుషుఁడైన మల్‌హర్‌రావు ౧౭౬౬ లో అలంపురమునందు కీర్తిశేషుఁ డాయెను. అచ్చట నాతనికి సమాధి కట్టఁ బడియె. దాని సంరక్షణనిమిత్తమై గ్వాలియర్, దతియా, జాలన్, ఝాన్‌సీ అను సంస్థానములవారి యొద్దనుండి ౨౭ గ్రామములు బలవంతముగఁ దీసికొని ఈ పరగిణా యేర్పరచఁబడినది. మల్‌హర్‌రావు జ్ఞాపకచిహ్నముగ నొక గద్దె కట్టింపగ, తమయొద్దినుండి గ్రామములు దీసికొనిరన్న కోపముచే రాజపుత్ర రాజులు పలుమాఱు దానిని పాడుజేసిరి.

**అలంపురము** (హైద్రాబాద్) నైజామ్ హైద్రాబాద్ రాజ్యమునందలి ఆగ్నేయపు వైపు తాలూకా జాగీరులతో కలసి వైశాల్యము ౧౮౪ చ॥ మైళ్లు. జనసంఖ్య 3౦౨౨౯. గ్రామములు ౪3. కృష్ణానది ఈ తాలూకాకును, మహబూబ్ నగర్ జిల్లాకును సరిహద్దున నుండును. తుంగభద్రానది దీనికిని కర్నూలునకును హద్దుగ నుండును. ఈ రెండు నదులును ఈ తాలూకాకు తూర్పుదిక్కున కలియును. వసూలు రు. ౧౨౦౦౦౦౦.

**అలంపురము** (సంస్థానము) బొంబయి రాజధానియందలి కాఠియవాడ్ (కాథేవార్) లోని యొక చిన్న సంస్థానము.

**అలంబస.** ఇక్ష్వాకు వంశస్థుఁడైన తృణబిందుని భార్య. కుమారుఁడు విశాలుఁడు.

**అలంబుధక్షేత్రము.** భారతవర్షీయ క్షేత్రము.

**అలంబుష.** ప్రాధకు పుట్టిన యప్సరసలలో నొక్కతె.

**అలంబుషుఁడు** ౧. బకాసురుని తమ్ముఁడు. భారతయుద్ధమునందు దుర్యోధనపక్షమునఁ బోరాడి, ఘటోత్కచునిచేఁ జచ్చె.

౨. జటాసురుని పుత్రుఁడు. భారతయుద్ధమునందు, వీఁడు దుర్యోధనపక్షమునఁ బోరాడి రాత్రియుద్ధమునందు ఘటోత్కచునిచేఁ జచ్చెను.

3. దుర్యోధనపక్షీయుఁ డగు రాజు. భారతయుద్ధమునందు సాత్యకిచేఁ జచ్చె.

**అలకనంద.** గంగయొక్క నాల్గుశాఖలలో నొక్కటి. కుబేరునియొక్క అలకానగరికి వెలుపల నీ నది ప్రవహించును.

**అలకాపురి.** కుబేరుని రాజధాని. మేరు శిఖరమునీఁద నుండును. నూఱుయోజనముల పొడవును, డెబ్బదియోజనముల వెడల్పును కలిగి యున్నది.

**అలచంద.** చూఁడు బొబ్బర్లు.

**అలపులై.** ట్రావన్కూరు సంస్థానమందలి ముఖ్యమైన రేవుపట్టణము. దీనినే అలప్పే అందురు. డచ్చివారు (వళందులు) తన రాజ్యమందలి వర్తకము స్వాధీనపఱచుకొనుట చూచి దానిని అపుటకై ౧౮-వ శతాబ్దమున రామవర్మయను రాజు ఈ రేవును నిర్మించెను. ఇచ్చటఁ దిరుగుచుండెడి వెలుతురు గల దీపగృహము(Light House)కలదు. ఈరేవున నెగుమతి దిగుమతులు విశేషముగ నుండును. ట్రావన్కూరు దొరతనము వారికి నీ రేవువలన సంవత్సరమునకు దిగుమతిమీద రు ౧౦౦౦౦ లును, ఎగుమతి మీద రు. ౧౯౦౦౦౦ లును సుంకము వచ్చును.

**అలప్తగీన్** బుఖారాలోని సరదారుఁడు. అచ్చట సామాన్ వంశజులు రాజ్యము చేయుచుండగ నీతఁడు ఖురాసాణకు గొర్నరుగ నుండెను. క్రీ. శ. ౯౬౨ లో బుఖారా రాజులతోఁ బోరాడి గజినీపట్టణమునకుం బోయి చిన్న స్వతంత్రరాజ్యమును స్థాపించెను. ౯౭౬ లో మరణించెను. ఈతని తరువాత నీతని కుమారుఁడైన అబూ - ఇస్ - హాక్ అను కుఱ్ఱవాఁడు రాజ్యమునకు వచ్చెను గాని అతఁడు బలహీనుఁడగుటచే అలప్తగీన్ వద్ద సరదారుఁడైన సబక్తగీన్ రాజయ్యె.

**అలప్పే:**—చూ. అలపులై.

**అలబామా ౧.** అమెరికాలోని సంయుక్తరాష్ట్రమునకుఁ జేరిన యొక మండలము.

౨. ఆ మండలములోని ముఖ్యనదులలో నొక్కటి. పొడవు ౪౫౦ మైళ్లు. సంవత్సరమంతయు పడవలు నడుచుట కనుకూలమైనది. ప్రత్తి మున్నగు సరుకు లీ నదీ మార్గముగ నిర్ణీతస్థలములఁ జేరుచున్నవి.

**అలబ్ధుఁడు** ఒక బ్రహ్మర్షి (చూఁడు వసిష్ఠుఁడు.)

**అలమన్** (లూకస్ ౧౭౩౫–౧౮౫౫) మెక్సికో దేశజుఁడు, రాజకార్య కుశలుఁడు, చరిత్రకారుఁడు. ఈతనిచే వ్రాయఁబడిన మెక్సికో దేశపు చరిత్ర ప్రమాణముగ నెంచఁబడును. ఇతఁడు మెక్సికో తరపున స్పేనిషుసభలో ప్రతినిధిగ నుండెను. మెక్సికోలో పరదేశసంబంధ మంత్రిపదవిని వహించెను.

**అలయ్యుఁడు.** ఒకరాజర్షి.

**అలరిక్ ౧.** (క్రీ శ. 3౭౫-౪౧౦)విసిగాథ్ అనువారి రాజు. వీని బాల్యమున విసిగాథులు రోమువారికి లోఁబడి యుండిరి. 3౯౫ లో ఈతఁడు రోమకప్రభుత్వమునకుఁ దిరుగఁబడి గాథులకు రాజాయెను. 3౯౬ లో గ్రీసుమీదికి దండెత్తెను. 3౯౭ లో ఇతఁడు ఎపిరస్‌కు తరుమఁబడెను. ఆయేటనే ఈతఁడు ఇలిరకమునకు గొర్నరాయెను. క్రీ. శ. ౪౦౦ లో ఇటలీపై దాడిబోయెను. కాని పరాభూతుఁ డయ్యె. రోమకచక్రవర్తి యగు హెనోరియస్‌తో ఈతఁడు సంధిచేసికొనెను. కాని చక్రవర్తి సంధిలోని షరతులను పాటింపనందున నీతఁడు రోముపట్టణమును ముట్టడించి ౪౧౦ లో దానిని దోచుకొనెను.

౨. (౪౮౪-౫౦౭) విసిగాథుల ఎనిమిదవరాజు. స్పెయిను దేశమంతయు, ఫ్రాన్సుదేశములోని మధ్యభాగమును, దక్షిణభాగము చాలవఱకును ఈతని రాజ్యములో చేరియుండెను. ఇతఁడు తెలివిగలవాఁడు, సహనశీలుఁడు. ఫ్రాంకుల రాజైన క్లోవిస్ అనువాఁ డీతనిం జంపి ఈతని రాజ్యముం దీసికొనెను.

**అలర్కుఁడు.** ౧ (చం. వం.) ఆయు కులోత్పన్న కాశ్యవంశీయ దివోదాసుని ప్రతర్దనుఁ డను నామాంతరముగల పౌత్రుఁడు. కువలయాశ్వుని పెద్ద కుమారుఁడు.

౨. ఒక రాజు. వంశము తెలియదు. తన మనస్సును వళపఱచుకొను నిమిత్తము దానిపై బాణములు వేయ, నది ప్రత్యక్షమై "ఈ బాణములు వేసిన నేను చావను. ఇందువలన నీకు నష్టమేగాని నాకు నష్టములేదు; కావున నేను చావవలయునన్న వేఱు బాణములు వేయుము" అని చెప్పెను. ఇతఁడు మదాలసయను బ్రహ్మనిష్ఠయొక్క కుమారుఁడై యుండ నోపు.

౩. ఒక రాజర్షి. ఇతఁ డంధబ్రాహ్మణునకు తన నేత్రము నిచ్చి గ్రుడ్డితనమును పోఁగొట్టిన యొక మహానుభావుఁడు. [వారా. అయోధ్యా. స ౧౨]

**అలహాబాద్.** దీని నిజమైన యుచ్చారణ ఇలహాబాద్. ఇంగ్లీషువారు దీనిని అలహాబాద్ అని వ్రాయుదురు. తురుష్కులు దీనిని ఇలహాబాద్ అందురు. మనవారు దీనిని "ప్రయాగ" యందురు. దీని సవిస్తర వర్ణనమునకై "ఇలహాబాద్" "ప్రయాగ" శబ్దములు చూడుడు.

**అలహాబాద్.** (భావల్ పూర్) పంజాబులో భావల్ పూర్ సంస్థానమునందు ఈ పేరుగల తాలూకాకు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౨౮౬౮. భావల్ పూర్ నవాబైన సాదిక్ మహమ్మద్ ఖాన్ అనువానిచే నీయది ౧౭౩౦ లో నిర్మింపఁబడెను. ఇచ్చట మున్సిపాలిటీ కలదు.

**అలాపురము.** యునైటెడ్ ప్రావిన్సులోని బుడాన్ జిల్లాయందలి యొక గ్రామము. ఇది అల్లాఉద్దీన్, ఆలంషాహ అనువానిచేఁ గట్టింపఁబడియె నందురు. ఇచ్చట ఔరంగజేబ్ యొక మసీదు గట్టించెను. ఇచ్చట వారమునకు రెండుసారులు సంత జరుగును.

**అలాయుధుఁడు.** ఒక రాక్షసుఁడు. ఇతని రథమునకు నూఱశ్వము లుండెను. భారతయుద్ధమునందు, నితఁడు, ఘటోత్కచునిచే, రాత్రియుద్ధమునఁ జచ్చె.

**అలార్కాస్.** (పెడ్రో అంటోనియోడి ౧౮౩౩-౯౧) స్పెయిన్ దేశజుఁడు. నవలకారుఁడు. రాజకార్యనిపుణుఁడు. ప్రజాప్రతినిధిసభలో కేడిస్‌కు ప్రతినిధిగ నుండెను. రాయబారి మొదలైన పెక్కు ఉద్యోగములఁ జేసెను.

**అలార్కాన్.** (వై మెండోజా ౧౫౮౧-౧౬౩౯) స్పానిషుభాషలో ఖ్యాతిఁ జెందినట్టి నాటకములను వ్రాసిన కవి. ఇతని నాటకములలో లావార్ డాట్ సోస్పెచోసా (Laverdod Sospechosa) అనునది మిక్కిలి ప్రసిద్ధము.

**అలార్కాన్** (హెర్ నేండోడె) స్పెయిన్ దేశజుఁడైన సముద్రనావికుఁడు. ఇతఁడు క్యాలిఫోర్నియాచుట్టు తిరిగి వచ్చి అది దీవి కాదని రుజువు చేసెను (౧౫౪౦).

**అలావర్ పురము** పంజాబు నందలి జాలందర్ జిల్లాలోని యొక గ్రామము. జనసంఖ్య ౪౪౨౩. ఇచ్చట సూసీ, గబ్రూన్ అను బట్టల వర్తకము యెక్కువ. ఇది ౧౮౬౭ లో మ్యునిసిపాల్టీ చేయఁబడెను.

**అలాస్కా.** ఉత్తర అమెరికాఖండమున వాయవ్యదిగ్భాగమం దుండు దేశము. ఇది అమెరికా సంయుక్తరాష్ట్రమునకు (యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికాకు)ఁ జేరినది. విస్తీర్ణము ౫౯౦౦౦౦ల చ॥పు మైళ్లు. విశేషభాగము అమెరికాదేశపు ముఖ్యభూమియే యైనను ఇందు ఆ ఖండపు వాయవ్యదిగ్భాగమందలి దీవులెల్లను జేరియున్నవి. తీరభూమి మిక్కిలి విస్తీర్ణము గలది. యూకాను అను మహానది ఈ దేశమున కలంకారము. సముద్రమునుండి ౬౦౦ మైళ్ల దూరమున నున్నపుడే ఈ నది వెడల్పు ఒక మైలునకంటె ఎక్కుడు కలదు. ఇది సముద్రమున చేరినదాది ౧౦ మైళ్లవఱకును దీని జలములు తీపిగనే యుండును. భూప్రదేశ మంతయు అగ్నిపర్వతములచే నిండి యుండుటవలన సారవంతముగాదు. ఒకటి రెండు పర్వతపంక్తులును కొన్ని మంచి యడవులును గలవు. ఆగ్నేయభాగమందలి యడవులు మిక్కిలి ఫలవంతములు. ఇచ్చటి ముఖ్యోత్పత్తి బంగారము. ఇదికాక వెండియు సీసమును రాగియు దొరకుచున్నవి. ప్లాటినము అచ్చటచ్చట కనుగొనఁబడి

నది. బంగారముకని పెట్టఁబడుటకు ముందు ఈదేశమునుండి ఎగుమతి విశేషముగ నగుచుండినది సీలులనఁబడు దట్టమును అతిమృదులమును నగు బొచ్చుగల సముద్రజంతువుల తోళ్లు. ఇవ్వివి ఇంగ్లాండునను చీనాయందును నూర్లకొలఁది రూపాయలకు విక్రయమగుచుండెను ఇప్పటికిని అగుచున్నవి. అయిన వీనియందు వ్యాపారము అలాస్కా దేశమునఁ దగ్గుచు వచ్చుచున్నది. 'చేపనూనె' యని మనదేశములో నిప్పుడు సర్వసాధారణముగ వాడుకలోనుండు మందున కాధారభూతములగు 'కాడ్' అనుజాతి చేపలును ఇతరజాతుల చేపలును ఈ దేశపు తీరములఁ బుష్కలముగ దొరకును.

ఈదేశమున ముఖ్యజాతులు మూఁడు. ఎస్కిమోలును ఇందియనులు ననఁబడు మూలనివాసజాతులు రెండు. మూఁడవజాతి యిరోపియనులు. మొత్తము జనసంఖ్య ౬౩౫౯౨; అందు యిరోపియనులసంఖ్య ౩౧౦౦౦. ఇట్లు అలాస్కా దినదినంబును యిరోపియనులచే వృద్ధియగుచున్నది.

ఈ యలాస్కా ప్రాంతభూభాగమును ౧౭౪౦-వ సంవత్సరప్రాంతమున 'బేరింగు' అను రుష్యాదేశస్థుఁడు మొట్టమొదట కనిపెట్టెను. ౧౭౮౪-వ సం॥రము మొదలు రుష్యావారటకుఁ గాపురము వెళ్ల నారంభించిరి. ౧౮౬౩-వ సంవత్సరమువఱకును అమెరికనులును రుష్యావారును చేరి యేర్పఱచిన ఒక కంపెనీవారీ దేశమును స్వాధీనపఱచుకొని వ్యాపారాదుల నడుపుచుండిరి. ౧౮౬౭ లో రుష్యావారు అమెరికాలో తమకుంగల స్వస్వామ్యమును రు ౨౧౬౦౦౦౦౦ లకు అమెరికా సంయుక్తరాష్ట్రప్రభుత్వము వారి కమ్మిరి. నాటినుండి ఆ ప్రభుత్వమువారిచే నంపఁబడిన ప్రతినిధులు జునియా రాజధానిగ నీ దేశము నేలుచున్నారు.

## అలీఇబ్రహీంఖాఁ నవాబ్:

పాట్నానివాసి. వారన్ హేస్టింగ్సు కాలమునందు కాశీ న్యాయస్థానమునందు ముఖ్యన్యాయాధీశుఁడుగ నుండెను. ఇతఁడు హిందూస్థానీకవుల చరిత్రమును గుల్జార్-ఇ-ఇబ్రాహిం అను పేరిట వ్రాసెను. మఱి పెక్కు గ్రంథముల రచించెను. ౧౭౯౩ ప్రాంతమున మరణించెను.

## అలీగడ్ (జిల్లా)

**అలీగడ్** (జిల్లా) యునైటెడ్ ప్రావిన్సెసులోని యొక జిల్లా. దీనికి వాయవ్యమున యమున ఈశాన్యమున గంగ కలవు. వైశాల్యము ౧౯౪౬ మైళ్లు. జనసంఖ్య ౧౨౦౦౮౨౨; వసూలు రు. ౨౨౫౦౦౦౦ లు; ఇందున్న ౩౩౩౪ మహళ్లలో ౨౧౭౯ జమీందారీ, ౪౮౬ ఖాయిచారా, ౬౬౯ పట్టీదారీ అపరకపుపద్ధతి మీద నీయఁబడినవి. ఇందుఁ గొన్ని తాలూకుదారీ యెస్టేటులును కలవు. ఇందు నదులు విశేషముగ నున్నందున పంటలు సమృద్ధి.

మొదట నీ జిల్లాకు అలీగడ్ శివారైన కోయిల్ అను గ్రామము రాజధానిగ నుండెను. ఈ జిల్లాలోని చాలభాగము రాజపుత్రుల స్వాధీనమందుండెను.

**పూర్వచరిత్ర**

క్రీ. శ. ౧౧౯౪ లో దీనిని కుతుబుద్దిన్ పట్టుకొనెను. ఇచ్చటి పెక్కు ప్రజలఁ దురకలఁ జేసెను. ౧౭౫౭ లో సురజమల్ జాటు వశపఱచుకొనెను. ఇచ్చటినుండి మధురా, ఆగ్రా, ఢిల్లీ, రోహిల్‌ఖండ్ అను స్థలములకు బాటలుండుటచే దీనికి యుద్ధసంబంధమైన ఘనతవచ్చెను. ౧౭౫౯ లో అఫ్గానులు జాటులను వెడలఁగొట్టిరి. తరువాత ౨౦ సంవత్సరములవఱకు నీ జిల్లా ఒకరిచేతినుండి మఱియొకరిచేతికిఁ బోవుచు ౧౭౮౪ లో సింధియాకు వశమయ్యెను. అచ్చట మరాఠావారు గొప్ప సైన్యములఁ బోగుచేసి ౨౦ సంవత్సరములవఱకు ఫ్రెంచి సేనానులచే తరఫీయతు చేయించిరి. ౧౮౦౩ లో నిది యింగ్లీషువారి స్వాధీనమయ్యెను. ౧౮౦౫, ౧౮౦౬, ౧౮౧౬ సంవత్సరములలో నిచ్చట జమీందార్లు తిరుగఁబడగా వారిని జయించి ప్రభుత్వమువారు వారి కోటలను పడఁగొట్టించిరి. ౧౮౫౭ లో నీ జిల్లా సిపాయిల తిరుగుఁబాటు నాయకులకు వశమయ్యెను. జాట్‌వారు రాజపుత్రులు, తురకలు ఒకరితో నొకరు పోరాడి ప్రజల మిక్కిలి బాధపఱచిరి.

## అలీగడ్ (పట్టణము)

**అలీగడ్** (పట్టణము) యునైటెడ్ ప్రావిన్సెసులోని అలీగడ్ జిల్లాకు ముఖ్యపట్టణము. దీనికి పూర్వపు పేరు కోయిల్. జనసంఖ్య ౭౦౪౩౪. వీరిలో హిందువులు ౪౧౦౭౬, తురకలు ౨౭౫౮.

మహమ్మదీయ ప్రభుత్వకాలమున నిది ఆగ్రాసూబాలో చేరిన ఒక సర్కారునకు ముఖ్యస్థలముగ నుండె. లోదీల ప్రభుత్వకాలమున నిచ్చట మహమ్మదీయుఁడైన అధికారి యుండి, దీనికి మహమ్మద్‌గడ్ అని పేరుబెట్టెను. ఇట్లే ౧౭౧౭ లో దీనికి సాబిత్‌గడమను నామము వచ్చెను. ౧౭౫౭ లో జాట్‌వారు దీనికి రామగడమన్న పేరిడిరి. ఈ స్థలమును జాట్‌వారియొద్దనుంచి తీసికొన్న నాసఫ్‌ఖాన్ దీనికి అలీగడ్ అన్న పేరు పెట్టెను. దీని నప్పుడప్పుడు స్వాధీనపఱుచుకొన్న వారందఱును ఇచ్చటి దుర్గమును క్రమముగ బలపఱుచుచు వచ్చిరి. ఇది మరాఠావారి స్వాధీనమున నున్నప్పుడు, డిబాయిన్ (De Boigne) పెరాన్ (Perron) అను ఫ్రెంచిసేనానులు ఈ దుర్గమును మరాఠావారి నిమిత్తమై మిక్కిలి బలపఱిచి దుర్భేద్యము గావించిరి. ఇచ్చట మిక్కిలి పురాతనములైన హిందూ, బౌద్ధదేవాలయముల అవశేషములు భూమిలో దొరుకును. ఇచ్చట ౧వ శతాబ్దమునందుఁ గట్టిన గొప్పమసీదొకటి గలదు. అలీగడమును, దాని సివారైన కోయిల్‌ను గలసి ౧౮౬౬ లో నొక మున్సిపాలిటీగ నేర్పఱిచిరి. ఈ పట్టణము కళాశాలల్యముల విషయమై అభివృద్ధిఁ జెందుచున్నది. ఇచ్చట పోస్టల్‌డిపార్టుమెంటువారి కర్మాలయ మొకటి గలదు; మూడు తాళములు చేయు కరులును మూడు ప్రత్తిమరలును కలవు. ఈపట్టణము ముఖ్యముగ మహమ్మదీయుల కొఱకై స్థాపింపఁబడిన ఉన్నత కళాశాలను గుఱించి ప్రఖ్యాతిఁజెంది యున్నది. దీనిని సర్ సయ్యద్ అహమ్మదు అనువాఁడు మహమ్మదీయుల విద్యాభివృద్ధికై స్థాపించెను. హిందూదేశమంతటినుండియు మహమ్మదీయ విద్యార్థు లిక్కడికి వచ్చెదరు.

**అలీగడ్** (టోంకు) రాజపుత్ర స్థానములోనిదగు టోంకుసంస్థానమందలి యొక పరగణా. వైశాల్యము ౧౫౭ చ॥ మైళ్లు. జనసంఖ్య ౧౭౦౬౩. గ్రామములు ౫౬. వసూలు రు ౩౬,౦౦౦. ౧౬౮౮–౧౭౪౮వఱకు బుంధీసంస్థానమువారగు 'హార' శాఖ రాజపుత్రులు దీని నేలిరి. అప్పటినుండియు ౧౮ శతాబ్దాంతమువఱకు నిది ఒకప్పుడు హోల్కార్‌చేతిలోను ఒకప్పుడు జయపురమువారి చేతిలోను ఉండెను. ౧౮౦౪ లో దీని నింగ్లీషువారు పట్టుకొనిరి. ౧౮౦౯ లో హోల్కారునకు ఇచ్చివేసిరి. ౧౮౧౮ లో హోల్కారు నోడించి బ్రిటిషుప్రభుత్వమువారు దీనిని స్వాధీనఁబఱుచుకొనిరి. ౧౮౧౯ లో అమీర్‌ఖానునకు దానపూర్వకముగ నిచ్చివేసిరి. ఇందలి సగభాగముకంటె నెక్కువ జాగీరుదారుల క్రింద నున్నది. ఇందు ౩౭ చ॥ మైళ్లు సాగు. ౩ చ॥ మైళ్లు పల్లము.

**అలీపుర గ్రామము.** బంగాళా దేశము, జల్పయిగురిజిల్లాలోని అలీపురపు సబ్‌డివిజనుకు ముఖ్యస్థలము. ఇది కుచ్‌బిహార్ స్టేట్‌రైల్వేమీద నున్న మంచి వర్తకస్థలము. ఇచ్చట ప్రతిసంవత్సరమును ఫిబ్రవరినెల ప్రాంతమున గొప్ప సంత జరుగును. అది ఒక నెలవఱ కుండును. అది వ్యవసాయసంబంధమైన గొప్ప ప్రదర్శన మని చెప్పవచ్చును. మంచి సరకులు తెచ్చిన వారికి బహుమతులు ముట్టును. నార్తరన్ బెంగాల్ హోంగార్డ్ రైఫల్సుకు ఇది ముఖ్యస్థలము.

**అలీపుర పట్టణము.** బంగాళా దేశమందలి ౨౪ పరగణా లను జిల్లాకు ముఖ్యస్థలము. ఇది కలకత్తాపట్టణమునకు దక్షిణము వైపు శివారు; కలకత్తా మ్యునిసిపాల్టీలో చేరియున్నది. పూర్వ మిచ్చట బంగాళాదేశపు లెఫ్టినంటు గొవర్నర్ ఉండెడివాఁడు. హైందవపటాలమున కిది యొక శిబిరము.

**అలీపుర** (సంస్థానము) బుందేల్‌ఖండ్ ఏజెన్సీలోని చిన్నసనదీ సంస్థానము. వైశాల్యము ౭౩ చ॥ మైళ్లు. జనసంఖ్య ౧౪౫౯౨. వసూలు రు ౩౦,౦౦౦. ఇచ్చట సంస్థానాధిపతికి దండనాధికారము (criminal power) కలదు. ఇచ్చటి రాజు అగ్నికుల రాజపుత్రులలోని పరిహార్ శాఖవాఁడు. వీరి మూలపురుషుఁడైన అచలసింగునకు అప్పటి పన్నా రాజైన రాజా హిందూపత్ అనువాఁడు ౧౭౫౭ లో నీరాజ్య మొసంగెను. బుందేల్‌ఖండమునకు బాందా నవాబైన అలీబహద్దర్ అనువాఁడు ప్రభువైనప్పుడాతఁడు ఈజాగీరుదారునకు సన్న దొసంగెను. అప్పు

డీ సంస్థానపు రాజు దివాన్ ప్రతాపసింహుఁడనువాఁడు. అలీబహాదుర్ పేరిటనే ఈతఁడు తన రాజధానికి అలీపురమని పేరు పెట్టెను. ౧౮౧౮ లో ఈస్టిండియా కంపెనీ వారితని హక్కు నొప్పుకొని సన్నదొసంగిరి. ప్రతాపసింగునకు నలుగురు పుత్రు లుండిరి. వారిలోఁ బెద్దవాఁడగు రావుపంచమ్ ౧౮౩౯ లో ప్రభుత్వమునకు వచ్చి రాజ్యమును నాలుగు భాగములు జేసెను. కాని ఈ విభాగములను కంపెనీవా రొప్పుకొనలేదు. ౧౮౫౭ లో దివాన్ హిందూపత్ అనువాఁడు రాజుగ నుండెను. ఆతఁడు సీపాయీల తిరుగుబాటుకాలమున బ్రిటీషువారికి సహాయ మొనర్చినందున వారాతనికి రు ౯౦౦౦ ఖిల్లత్ బహుమతి చేసిరి. ఈ సంస్థానాధీశ్వరు లిష్టమువచ్చిన పిల్లవానిని దత్తతఁ చేసికొనవచ్చునని ౧౮౬౨ లో వీరికి సన్నదు లొసంగఁబడెను. ఇప్పటి సంస్థానాధీశ్వరుని పేరు ఛత్రపతిసింగ్. ఈతనికి ౧౮౮౭ లో రావుబహాద్దర్, ౧౮౮౭ లో సి. యస్. ఇ, ౧౯౦౩ లో రాజా అను బిరుదు లొసంగఁబడియె. వీరికి వంశపరంపరగ "రావు" అన్న బిరుదు గలదు.

ఈ సంస్థానమునకు ముఖ్యస్థలము అలీపురమను గ్రామము. అచ్చటి జనసంఖ్య ౨౪౯౩.

**అలీపుర** (సబ్ డివిజన్) ౧. బంగాళాదేశమందలి ౨౪ పరగణా లనఁబడు జిల్లాలోని యొక హెడ్ క్వార్టర్ సబ్ డివిజన్, విస్తీర్ణము ౧౧౬౪ చ॥ మైళ్లు. ఇందు ౪౯౦ చ॥ మైళ్ల సుందరబన్ (సుందరవనము) అను అరణ్యము కలదు. జనసంఖ్య ౬౭౧౨౬౯ ఇందు ౧౬౬౩ పల్లెలును, ౬ పట్టణములును కలవు.

౨. బంగాళాదేశమందలి జల్పైగుడి అను జిల్లాలోని తూర్పు వైపుది. వైశాల్యము ౧౧౪౨ చ॥ మైళ్లు. జనసంఖ్య ౧౧౯౩౫౩. ఇందు ౧౭౮ పల్లెలును, ౧ మిలిటరీ శిబిరము (Contonment) ను కలవు. ఇది భూతాన్ దేశపు రాజునొద్ద నుండి తీసికొనఁబడియె. ఇటీవల నిచ్చట తేయాకుతోటలు విస్తారముగ నభివృద్ధిఁ జెందుచున్నవి.

**అలీబహాదుర్.** బాందాసంస్థానమునకు నవాబు. పూనా పేష్వాయైన మొదటి బాజీరావునకు మహమ్మదీయ కుమారుఁడైన ౧-వ షంషేర్ బహాదురునకుఁ బెద్ద కుమారుఁడు. ౧౮౦౦ లో నానాఫడనవీస్ ఈతనికి బుందేల్ ఖండ్ రాజ్యము పట్టము కట్టెను. ఈతఁడు తన తమ్ముఁడైన గాజీబహాదురును గొప్ప సైన్యమును వెంటఁదీసికొని బుందేల్ ఖండముపై దాడి వెడలెను. నానాఅర్జున్ అనువానిని జంపి రాజాబఖ్తసింగ్ అనువానిని చెఱబట్టి బాందారాజ్యమును పన్నారాజ్యమును వశపఱచుకొనెను. ౧౨ సంవత్సరములు రాజ్యముజేసి ౧౮౦౨ వ ప్రాంతమున మరణించెను.

**అలీబహాదుర్ ఖాన్.** బాందాసంస్థానమునకు చివరనవాబు. జుల్ఫికర్ అలీఖాన్ బహదుర్ అనువాని కుమారుఁడు. ౧౮౫౭ లో నీతఁడు రాజద్రోహులతోఁ గలసెనన్న నెపముమీద బ్రిటిషు ప్రభుత్వమువారు వీనిని రాజ్యభ్రష్టునిఁజేసి రాజ్యము తీసికొనిరి.

**అలీబాగ్** (పట్టణము) బొంబయి రాజధానియందలి కొలాబాజిల్లాకును, అలీబాగ్ తాలూకాకును ముఖ్యస్థలము, రేవుస్థలము. బొంబాయికి దక్షిణమున ౧౯ మైళ్లమీద నుండును. జనసంఖ్య ౬౦౧౫౯. సముద్రపు టొడ్డునుండి ఫర్లాంగుదూరమున సముద్రములో ఒక చిన్న రాతిదీవియు దానిమీద కోటయుఁ గెలవు. అది పూర్వము ఆంగ్రే (Angria) అనఁబడు మరాఠాసరదారుని కోట. ఈతఁడు మహారాష్ట్రుల నావికాసైన్యమునకు అధిపతిగ నుండె. ఈ రేవున ఎగుమతులు షుమారు రు ౬౨౭౦౦౦ విలువగలవియు, దిగుమతులు రు ౬౬౧౦౦౦ ల విలువగలవియు ప్రతిసంవత్సరము జరుగును. ఇచ్చట ౧౮౬౪ లో మున్సిపాల్టీ యేర్పడినది.

**అలీమస్జిద్.** వాయవ్యపు పొలిమేర పరగణా. (North West Frontier Province) లోని ఖైబర్ కనుమలో నున్న ఒకపల్లె. ఇచ్చట కోట గలదు.

**అలీరాజ్ పూర్** (సంస్థానము) మధ్య హిందూదేశమందలి ఒక గ్యారంటీడ్ ప్రభుత్వము

(Chiefship). ఇది భోపావర్ ఏజెన్సీలో చేరినది. విస్తీర్ణము ౮౩౬ చ॥ మైళ్లు; గ్రామముల సంఖ్య ౩౦౭. జనసంఖ్య ౭౦,౮౮౭. వీరిలో భిల్లులు భిలాలులు అను ఆరణ్యక జాతివారు ౪౧,౮౭౦. ఈ సంస్థానము ౫ పరగణాలుగ విభజింపఁబడినది. ఈ సంస్థానాధీశ్వరునకు శిక్షావిధానమునందు మొదటితరగతి మేజిస్ట్రీటు అధికారము గలదు. వసూలు రు ౧,౦౦,౦౦౦. వీరు ధార్ సంస్థానాధీశ్వరునకు సంవత్సరమునకు రు ౮౬౦౦ కప్పము కట్టవలయును. మాళవా భిల్లసైన్యము (Malwa Bhil corps) నకై బ్రిటిషుప్రభుత్వమువారికి రు౧౨౭౧ ఇచ్చెదరు. సంస్థానమువారు ౭ ప్రాథమిక హిందీపాఠశాలల నేర్పఱిచిరి.

జోధపురము రాజుల రాఠొడ్ వంశమందలి ఉదయదేవ్ లేక ఆనందదేవ్ అనునాత డొకఁడు తన దేశము వెడలి యిచ్చోట ౧౪౩౭ లో కోటఁగట్టెనఁట. ఉదయపురమువారు వీరి సంబంధము నొప్పుకొనరు. ఆనందదేవునకు బుగల్ దేవ్, కేసర్ దేవ్ అను మునిమనుమ లిద్ద ఱుండిరి. వారిలో మొదటివాఁడు అలీరాజ్ పురమునకును రెండవవాఁడు జోబత్ సంస్థానమునకును అధిపతులైరి. ౧౮౧౮ లో రాణాప్రతాపసింగ్ అనువాఁ డిక్కడ రాజ్యము చేయుచుండె. ఈతనికి ముసాఫీర్ మక్రాని అను తురక మంత్రిగ నుండెను. రాజు చనిపోయినప్పు డాతనిభార్య గర్భిణిగ నుండెను. ఆమెకు బస్ మత్ సింగను కుమారుఁడు గలిగెను. వాఁడు ౧౮౬౨ లో చనిపోవుచు తన యిద్దఱు కుమారులకు రాజ్యము పంచిపెట్టమని మృత్యుపత్రముల వ్రాసెను. కాని బ్రిటీషు ప్రభుత్వమువారు దాని నొప్పుకొనక పెద్ద కుమారుఁడైన గాంగుదేవునకు రాజ్య మిచ్చిరి. వాఁ డయోగ్యుఁడని ౧౮౭౧ లో వానిని పదచ్యుతునిఁ జేసి వాని తమ్ముఁడైన రూపదేవునకు రాజ్య మిచ్చిరి. వాఁ డపుత్రికుఁడై ౧౮౮౨ లో మరణము నొందెను. గౌర్నమెంటువారు రాజ్యము స్వాధీనపఱచుకొనక సోండ్వా ఠాకూర్ వంశమునుండి విజయసింహుఁ డనువానిని దెచ్చి గద్దె ఎక్కించిరి. ఠాకూర్ జిత్ సింగ్ అనువాఁడు తాను రాజ్యమునకు దగ్గిర వారసుడనని కొందఱు భిల్లులను ప్రోగుజేసికొని అల్లరి చేయసాగెను. కాని మాల్వా భిల్లుల సైన్యముల సహాయమునను మధ్యహిందూస్థాన గుఱ్ఱపుదళముల (Central India Horse) సహాయమునను వాఁ డోడింపఁబడెను. విజయసింగ్ ౧౮౯౦లో మృతుఁడయ్యె. వాని జ్ఞాతియైన ప్రతాపసింగ్ అనువాఁ డిప్పుడు రాజ్యము జేయుచున్నవాఁడు. ఈ రాజులకు రాణా అన్న పదివియు ౯ గుండ్ల గౌరవమును గలదు.

## అలీవర్ధిఖాన్.

(౧౬౭౬-౧౭౫౬) ఇతఁడు బెంగాల్, బీహార్, ఒరిస్సాలకు నవాబ్ నజీము. తండ్రిపేరు మీర్జామహమద్. ఈతఁడు ఒరిస్సా గౌర్నరైన నవాబ్ షూజుద్దీన్ యొక్క సేనానిగఁ బ్రవేశించెను. క్రీ. శ. ౧౭౨౬ లో జఫారాఖాన్ చనిపోగ షూజుద్దీన్ నవాబ్ నజీ మాయెను. అప్పుడు అలీవర్దీఖాన్ సామ్రాజ్యసైన్యమునకు జనరల్ గ నియమింపఁబడెను. ౧౭౩౩ లో బీహారునకు గౌర్నరుగ జేయఁబడెను. ౧౭౩౯ లో షుజుద్దీన్ చనిపోగ నాతని కుమారుఁడైన సరఫారజ్ ఖాన్ రాజాయెను. ౧౭౪౦ లో అలీవర్దీఖాన్ సరఫాగజ్ ఖాన్ తోఁ బోరాడి అతనిని జంపి నిజామతును స్వాధీనఁబఱచుకొనెను. ఈతనిని బెంగాలులో ముహాబత్ జంగ్ అని బిలచెదరు. ౧౭౪౧ లో బెంగాలుపైకి మరాఠావారు దండెత్తి రాగ వారి సేనానియైన భాస్కర్ పండితుని అలీవర్దీఖాన్ క్రూరముగఁ జంపెను. తుదకు మరాఠాదాడికిఁ దాళఁజాలక ౧౭౫౧ లో అలీవర్దీఖాన్ మరాటావారికి, ఒరిస్సా యిచ్చుటకును సంవత్సరమునకు ౧౨ లక్షల రూపాయిలు కప్పముకట్టుటకును ఒడంబడి, వారితో సంధి చేసికొనెను. ౧౭౪౨ లో మరాఠావారినుండి సంరక్షించుకొనుటకు కందకము త్రవ్వుకొనునిమిత్తము ఇంగ్లీషువారికి అలీవర్దీఖాన్ ఉత్తరు విచ్చెను. ౧౭౫౩ లో అలీవర్దీఖాన్ తన మనుమని పెంచుకొని రాజ్య మిచ్చి, ౧౭౫౬ సంవత్సరము ఏప్రియల్ నెల ౯వ తేదీని మరణించెను.

## అలుకీ.

ఒకఋషి. (చూఁడు భృగువు)

## అలేక్సీ మెకెలోవిచ్.

(౧౬౨౯-౧౬౭౬) రష్యాదేశమునకు రాజు. ౧౬౪౫ లో రాజ్యము

నకు వచ్చెను. పోలండును గెలిచెను (౧౬౫౪-౬౭). స్వీడనుతో పోరాడి సైబీరియాకు తూర్పుదిక్కువఱకు రాజ్యవిస్తారము గావించెను. డాన్ కొసాక్సు అనువారు తిరుగఁబడిన వారిని నణఁచెను (౧౬౭౧). చట్టములన్నిటి నొక్కచోటికిం దెచ్చి స్మృతులుగ నేర్పఱిచెను పశ్చిమ యూరోపుఖండమునకు రాకపోకల నేర్పఱిచెను.

## అలెక్సీ పెట్రోవిచ్. (౧౬౯౦-౧౭౧౮)

పీటర్-ది-గ్రేట్ యొక్క పెద్ద కుమారుఁడు. తండ్రి సంస్కరణములకు వ్యతిరేకుఁడగుటచే నీతనికి రాజ్యార్హత లేదనిరి. ఇతఁడు దేశాంతరములకుం బోయి తిరిగివచ్చి చెఱసాలలో చనిపోయెను. ఇతని కుమారుఁడు రెండవ పీటరను పేర రాజయ్యెను.

## ఆలెక్సియస్. (కాంమ్నెనస్ ౧౦౪౮-౧౧౧౮)

బైజాంటియమ్ చక్రవర్తులలో మిక్కిలి సామర్థ్యముగలవాఁడు. ౧౦౮౧ లో సింహాసన మెక్కెను. ఇతని రాజ్యమునకు పెక్కు దిక్కులనుండి పెక్కు శత్రువులు బాధకలిగించుచున్నను, ౩౭ సంవత్సరముల ప్రభుత్వకాలమం దీతఁడు తన ఆదాయమును చక్కబఱచుకొని సైన్యములను బాగుబఱిచి తన సామ్రాజ్యమును అభివృద్ధి చేసికొనెను.

## అలెగ్జాండర్ (ఆఫ్రడీసియస్)

ఈతఁడు క్రీ. శ. ౨ వ శతాబ్దమువాఁడు. ఈతనిని ౨వ అరిస్టాటల్ అనియెదరు. ఈతఁడు ఏథెన్సు పట్టణమునందలి లీసియమ్ అను విద్యాపీఠమునకు క్రీ. శ ౨౦౦ లో మహామహోపాధ్యాయుఁడుగ నుండెను. అరిస్టాటిలు గ్రంథములపై భాష్యముల వ్రాసెను. తత్వజ్ఞానమును గుఱించి స్వతంత్ర గ్రంథములనుగూడ రచించెను.

## అలెగ్జాండర్. (జాన్ ౧౮౨౦-౧౮౭౩)

రొమేనియా దేశపు రాజపుత్రుఁడు. ౧౮౪౮ లో టర్కీకి వ్యతిరిక్తముగ జాతీయవాదులతోఁ గలిసెను. ౧౮౫౯ లో మాల్డేవియా, వలాఖియా ప్రాంతములకు ప్రొస్పదారుగ నెన్నుకొనఁబడియె. కాని టర్కీవారతనిని ౧౮౬౧ వఱకు అధికారిగ నొప్పుకొనలేదు. చాలకాలమువఱకు లోకప్రియుఁడుగ నున్నను చివర కన్ని కక్షలవారును ఆతనికి వ్యతిరేకముకాగ ౧౮౬౬ లో ఆతఁడు తన అధికారమును వదలుకొనెను.

## అలెగ్జాండర్ (ది గ్రేటు క్రీ. పూ. ౩౫౬-౩౨౩)

ఈతనికి మహామహుఁడు (ది గ్రేటు) అన్న బిరుదు కలదు. గ్రీసు దేశమునందలి యొక చిన్న సంస్థానమైన మెసెడోనియా రాజయిన రెండవ ఫిలిప్పు యొక్క కుమారుఁడు, జగజ్జేత. అప్పుడు తెలిసినంత ప్రపంచమునంతయుఁ గెలిచినవాఁడు. కొన్ని యేండ్ల వఱకుఁ (౩౪౩-౩౬) తత్వవేత్తయైన అరిస్టాటిలునొద్ద విద్యాభ్యాసము చేసెను. ఇరువది సంవత్సరముల వయస్సు వచ్చినప్పుడు (౩౩౬) తండ్రిపోఁగా రాజయ్యెను. గ్రీసు దేశమందలి యితర రాజ్యముల నన్నిఁటిని వశపఱచుకొనెను. పారసీక దేశముమీఁదికి దండెత్తిపోయి యచ్చట పెక్కు శత్రుపుల నోడించెను (౩౩౫ పే.). ఫోనిషియా, టైర్, గాజాపట్టణములను, ఈజిప్టును వశపఱచుకొనెను (౩౩౨). పారసీకచక్రవర్తియైన దారా (డేరియస్)ను ౩౩౧ సంవత్సరము సెప్టెంబరు నెలలోఁ బూర్తిగఁ బరాభవించెను. అంత బ్యాబిలోన్ సూసా దేశములు వశమయ్యె. పారసీక దేశమునకుఁ బురాతన రాజధానియైన పెర్సపొలస్ పట్టణమును దోచుకొని ౪౫ కోట్లధనమును సంగ్రహించెను. పారసీకచక్రవర్తి మోసగానిచేఁ జంపఁబడ (౩౩౦ పే.) అలెగ్జాండరు పారసీకమున కంత రాజయ్యె. అప్ గానిస్థాన్ బలుచిస్థానములను ఆక్రమించెను (౩౨౯). హిందూకుశ పర్వతములఁ దాటి బ్యాక్ట్రియాలోనికిఁ బోయెను.

ఖైబర్ కనుమలోనుండి హిందూదేశమునకు వచ్చి ౩౨౬ లో సింధునది దాటి హైడాస్పస్ (సత్ లజ్) నది యొడ్డున శూరుఁడగు పోరసురాజు నోడించెను. అచ్చట నుండి హిఫాసిస్ (బియాస్) నది యొడ్డువఱకు వెళ్లెను. అచ్చట నతని సైన్యములు ముందుకు వెళ్లమని తిరుగఁబాటు చేసినందున అతఁడు మరలి సింధు నదీముఖము వద్ద పడవలలో సముద్రముం జేరెను. ఆమార్గముగ బెలూచి

స్థానమునకుఁ బోయి 3౨౪ మేలో సూసా జేరెను. అతఁడు హిందూదేశమునందు రమారమి 3 సంవత్సరము లుండెనని చెప్పవచ్చును. అతఁడు హిందూకుష్‌పర్వత మును దాటినది 3౨౭ వ సంవత్సరమున. ౧౯ నెల లాతఁడు సింధునదికి తూర్పుభాగమందుండెను. సూసాలో నాతఁ డిద్దరు పారసీకకన్యలను వివాహమాడెను. గ్రీకు వారికిని పారసీకులకును సమ్మేళనము చేయవలయునను తలంపుతో నాతఁ డిట్లొనరించెను. 3౨౪ లో నాతని యొద్దకు ప్రపంచమందలి గొప్పగొప్ప చక్రవర్తులుగూడ తమ రాయబారుల నంపిరి. అరబ్బీదేశమును జయింప వలయునని యూహించుచుండ నీ జగజ్జేత 3౨3 లో గీర్తిశేషుఁడాయెను. ఈతఁడు రాజ్యము చేసినది ౧౨ సంవత్సరము లయినను, మరణసమయమున నీతనికి 3౨ సంవత్సరముల వయసుమాత్ర ముండినను, ఈతనిదిగ్విజయ యాత్రలు యత్యద్భుత మైనవి. మానవునకుఁ దెలిసినట్టి ప్రపంచమంతయు నొకమూలనుండి మఱియొక మూల వఱకు జయించిన వాఁ డీతఁ డొక్కఁడే కానవచ్చు చున్నాఁడు. దిగ్విజయము చేయుటయే గాక గ్రీకు దేశపు నాగరికత ప్రపంచమునం దంతటను వ్యాపింపఁ జేసెను.

"అలెగ్జాండరు" శబ్దము అశోకుని శాసనమున "అలకసుందర" రూపముగను, అరబ్బీపారసీకాది భాష లలో "సికందర్" "ఇస్కందర్" అను రూపముగను కానవచ్చుచున్నది. మహారాష్ట్రాదిభాషలలో సికందర్ రూపమే వాడెదరు.

**అలెగ్జాండర్.** (నేవ్‌స్కీ ౧౨౧౯-౧౨౬3) రష్యారాజవంశములోని వాఁడు. టార్టర్ వాండ్రు రష్యాదేశముమీదికి దక్షిణమునుండియు, స్వీడన్, డెన్మార్కు లోవీనియా దేశమువాండ్రు ఉత్తరము నుండియు దండెత్తి రాగా ఈతఁడు వారిని నేవాయొద్ద ౧౨౪౦ లో చెల్లాచెదరు జేసెను. అందువలన నితనికి నెవ్‌స్కీ అన్న బిరుదు వచ్చెను. ౪ వ ఇన్నొసెంట్ అనుపోపు పూర్వపశ్చిమ క్రైస్తవమత సంప్రదాయము లను కలపవలయునని ప్రయత్నము చేయగ నీతఁ డా ప్రయత్నము నెదిరించెను. ఈతఁడు జీవించియుండగ ప్రజ లీతనిని మిక్కిలి గౌరవించుచుండిరి; చనిపోయిన తరువాత దేవునిగ భావించిరి. ఈతని గౌరవార్థమై ౧౭౧౦ లో పీటర్-దీ-గ్రేట్ అను రష్యాచక్రవర్తి ఈతని దిగ్విజయ స్థలమైన నేవాయొద్ద గొప్ప మఠమును కట్టించెను. అందు ౧౨ దేవాలయములు గలవు. రష్యా దేశమున కంతకును మతాచార్యుఁడైన గురువు ఇచ్చట నివసించియుండును. ఇచ్చట మతసంబంధమైన విద్యా పీఠమును పెక్కుసహామహుల సమాధులును కలవు.

**అలెగ్జాండర్.** (పోపులు) రోములో మతగురువులుగ నున్న పోపుల పీఠము నధిష్ఠించినవారి లో ౮ మంది అలెగ్జాండర్ నామధేయులు గలరు. వారిలో నీ క్రింది నల్గురు పేర్కొనఁదగినవారు:—

౧. (౧౦౬౧-౭3) ౨ వ అలెగ్జాండర్ మిలన్ నివాసి. రోమన్ క్యాథలిక్ సంప్రదాయమును సంస్కరించుటకు కొంత ప్రయత్నించెను. విలియం-ది-కాన్కరర్ అనువానికి ఇంగ్లండుమీదికి దండెత్తుటకు సెల విచ్చెను.

౨. (౧౧౫౯-౮౧) ౪ వ అలెగ్జాండర్. యూరోపుఖండచరిత్రయందలి మధ్యయుగము (Middle ages) నందు ఈస్థానము నలంకరించిన పోపులలో ఘనతఁ జెం దినవాఁడు. ౧౧౫౯ లో పోపు పదవి వహించెను. ఈతఁడు ఫ్రెడరిక్ బార్బరోసా అను చక్రవర్తితోఁ బోరాడి గెలిచి ౧౧౭౭ లో అతనిచే వేనిస్‌సంధిమీద సంతకము చేయించెను. అందువలన ఇటలీదేశపు "స్వాతంత్ర్యరక్షకుఁ" డన్న బిరుదము వహించెను. థామస్-అ-బెకెట్ అను మతాచార్యుని చంపినందునకై ఇంగ్లండుదేశపు రాజైన రెండవహెన్రీకి పశ్చాత్తాపము గలుగు నట్లు చేసెను. ౧౧౭౯ లో మతాచార్యుల సంఘమును గూర్చి పోపును ఎన్నుకొనునట్టి విధానముల నేర్పఱిచెను. వాని ననుసరించియే ఇప్పటికిని పోపు లెన్ను కొనఁబడెదరు. చివరకు రోమునుండి వెళ్లగొట్టఁబడి నందున దేశాంతరమునందు కాలము గడపవలసినవాఁ డాయెను.

3. (౧౪౯౨-౧౫౦3) ౬ వ అలెగ్జాండరు. ఈతని పూర్వాశ్రమనామము రోడ్రిగోబోర్గియా. ఇతఁడు

మిక్కిలి విషయాసక్తుఁడు. ౧౪౯౨ లో పోపయ్యెను. తనకొక యుంపుడు కత్తెవలన పుట్టిన పుత్రపుత్రికలకు రాజ్యాదుల సంపాదింపవలె నని యెన్నియో కుట్రలఁ జేసెను. తన కడ్డము వచ్చినవారిని రహస్యముగ పొడి పించియు, విషము పెట్టించియు చంపించెను. ఇతఁడు వ్యవహార చతురుఁడు; రాజకార్యకుశలుఁడు; కళాకౌశల్య ప్రియుఁడు; శాస్త్రజ్ఞులపోషకుఁడు; లోకబాంధవుఁడు. ఇట్టి సద్గుణ దుర్గుణము లీతనియం దుండెను.

౮. (౧౬౫౫-౬౭) ౭ వ అలెగ్జాండరు. ఈతఁడు ౧౫౯౯ లో జన్మించెను. ౧౬౫౫ లో పోపాయె ను. ఇతఁడు పండితుల నాదరించెను. ల్యాటిన్ భాషలో కొన్ని కావ్యముల వ్రాసెను. ఈతఁడు రోము పట్టణ మును అభివృద్ధిఁ జేసెను. ఈతనికిని, ఫ్రాన్సు దేశపు రాజైన ౧౪ వ లూయీ అనువానికిని పోరాటము గలిగి నందున అంతవఱకు పోపుప్రభుత్వములోనుండిన అవిగ్నాన్ అను పట్టణము ఫ్రాన్సు రాజు స్వాధీనమాయెను. (౧౬౬౨)

## అలెగ్జాండర్ (రష్యా)

ఈ పేరుగల రాజులు రష్యాదేశమునందు ముగ్గురు రాజ్యముఁ జేసిరి.

౧ వ అలెగ్జాండర్ (క్రీ. శ ౧౭౭౭-౧౮౨౫) ఇతని స్వంత పేరు పాలొవిచ్. ౧ వ పాల్ అనువాని పెద్దకుమారుఁడు. ఇతఁడు లాహార్ అను మహామహుని వద్ద విద్య నభ్యసించెను. ౧౮౦౧ లో అలెగ్జాండర్ తండ్రియైన పాలు చంపఁబడినందున నీతఁడు రాజయ్యె. ఈతఁడు ఫ్రాన్సుకు వ్యతిరేకముగ ప్రష్యాదేశముతో టిల్ సిట్ సంధి (Tilcit treaty) ౧౮౦౭ లో చేసి కొనెను. ౧౮౧౨ లో నెపోలియన్ బ్రహ్మాండమైన సైన్యము దీసికొని రష్యాదేశముపైకి దండు వెడలెను. కాని అచ్చటి చలివలన సైన్యమును కోలుపోయి నిరాశుఁడై తిరిగి రావలసినవాఁడయ్యె. పవిత్రసంధి (Holy Alliance) అను దానిని సమకూర్చుటలో నీతఁ డొకఁడు. జార్జియా, ఫిన్‌లెండ్ అను దేశములను రష్యాలోఁ గలుపుకొనెను (౧౮౦౯). పోలెండ్‌పై రష్యా వారి అధికారమును దృఢపఱిచెను. ఈతఁడు పెక్కు పాఠశాలలను, విశ్వవిద్యాలయములను స్థాపించెను. వర్తకమును ఉన్నతావస్థకుం దెచ్చె. ఒప్పుదలకై ఖైదీలను క్షోభ పెట్టుట మాన్పెను. రహస్యముగ విచారించు న్యాయసభలను చాలించెను. కుమారులు తల్లిదండ్రుల సరకులవలె అన్యాక్రాంతము చేయు నాచారము మాన్పెను. మతాధికారులకును ప్రజలకును గల ద్వేషము మాన్పి వారికి స్నేహము కుదిర్చెను. మొద లిట్టి మహత్కార్యములఁ జేసినను చివరకుఁ గొంత సంస్కరణ ద్వేష్టయయ్యె.

౨ వ అలెగ్జాండర్ (నికోలావిచ్ క్రీ.శ.౧౮౧౮-౮౧) ఈతఁడు ౧౮౫౫ లో రాజ్యమునకువచ్చెను. ఇతని కాలములో క్రిమియన్ యుద్ధమును టర్కీతో యుద్ధ మును (౧౮౭౭) జరిగెను. క్రిమియన్ యుద్ధము ఇతఁడు రాజ్యమునకు వచ్చువఱకే జరుగుచుండెను. మధ్యఆసియాలోనున్న తురుష్కగుంపులతో అప్పుడప్పుడు పోరాడి(౧౮౬౬-౮౧)ఈతఁడురష్యాసామ్రాజ్యముయొక్క ఆగ్నేయదిక్కున నుండు సరిహద్దు చాలదూరము జరిపెను. కకేషస్ ప్రాంతమునందలి జనుల నందఱిని స్వాధీనఁబఱచుకొనెను. ౧౮౬3 లో పోలెండు దేశస్థులు తిరుగఁబాటుజేయగా మిక్కిలి క్రూరుఁడై ఆ తిరుగఁబాటును అణఁచివేసెను. ౧౮౬౧లో బానిసలను విముక్తులచేయుటలో నీతఁడు ప్రాముఖ్యము వహించెను. రష్యాదేశమందలి సైన్యమును, న్యాయసభలను బాగుపఱచుటకై యత్నించెను. ౧౮౭౨ లో ఈతఁడు ఆస్ట్రియా, జర్మనీలతో త్రిదేశసంధి (Triple Alliance) గావించెను. ఈతని రాజ్యమునందు శూన్యవాదులు ( Nihilists ) అను అరాజకులు ప్రబలి ఇతనిని జంపుటకై ప్రయత్నించుటచే వారిని నడంచుటకు మిక్కిలి క్రూరమార్గముల నవలంబింప వలసినవాఁ డాయెను. ౧౮౮౧ మార్చి ౧3 వ తేదీన తన రాజధానియైన సెంటుపీటర్సుబర్గులో. రథముమీదఁ బోవుచుండ నరాజకులు ఈతనిమీద బాంబువేసి నీతనిం జంపిరి.

3 వ అలెగ్జాండర్ (౧౮౪౫-౧౮౯౪) రెండవ అలెగ్జాండరునకుఁ గుమారుఁడు. మిక్కిలిబలశాలి. ప్రవర్తనమునందు నిష్కపటి. మోటు వాఁడు. రష్యాదేశ మింతను నితరరాజ్యముల గెలువవలెనన్న తలంపు గల వాఁడు. భూ, జల సైన్యముల హెచ్చుచేసెను.

**అలెగ్జాండర్** (సర్వియా) ఇతనిని ౧-వ అలెక్జాండర్ అనియెదరు. ఇతఁడు ౧౮౭౬ లోఁ బుట్టి ౧౯౦౩ లో మరణము నొందె. ౧౮౮౯ లో రాజ్యమునకు వచ్చెను. ౧౯౦౦ లో డ్రగామైచ్చిన్ అను నామెను వివాహ మాడెను. ప్రజ లీ వివాహమునకు ఇష్టపడలేదు. అందుచే ౧౯౦౩లో రాజధానియైన బెల్ గ్రేడ్ పట్టణమునందు రాజును, రాణియుఁ జంపఁబడిరి.

**అలెగ్జాండర్,** (సెవెరస్)(౨౦౮-౨౩౫) రోమకచక్రవర్తి. ౨౨౨ లో ప్రిటోరియన్సు అనువారితనిని చక్రవర్తిగ నెన్నుకొనిరి. ఇతఁడు ధీశాలి. విద్యాసక్తియు, న్యాయదృష్టియుఁ గలవాఁడు. తిరుగఁబడిన ప్రిటోరియన్సు వీనిని జంపిరి.

**అలెగ్జాండర్** (స్కాట్లండ్) స్కాట్లెండ్ దేశమునందు ఈ పేరుగల్ల రాజులు ముగ్గురు రాజ్యము చేసిరి.

౧-వ అలెక్జాండర్ (? క్రీ.శ. ౧౦౭౭-౧౧౨౪). ఈతఁడు ౧౧౦౭ లో రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు ఉత్తరదేశమునకు మాత్రము రాజుగ నుండెను. ఇతని తమ్ముఁడైన ౧-వ డేవిడ్ దక్షిణ దేశమునకు రాజుగ నుండెను. ఇతఁడు మతసంబంధమైన పెక్కు సంస్కారములం జేసెను. రోమక సంప్రదాయము వంటి మత గురువుల సంప్రదాయమును 'Episcopacy) స్థాపించెను. పెక్కు మఠములను నెలకొల్పెను.

౨-వ అలెక్జాండర్ (క్రీ. శ. ౧౧౯౮-౧౨౪౯) విలియం-ది-లైన్ అనువాని కుమారుఁడు; ౧౨౧౪ లో రాజ్యమునకు వచ్చెను. ఇంగ్లండు రాజైన 3-వ హెన్రీతో నార్తంబ్రియా, కంబ్రియా ప్రాంతములను గుఱించి ౧౨౩౭ లో సంధి చేసికొనియె. ఇంగ్లీషు రాజు సోదరి యగు జోన్ కుమారిని వివాహమాడె. తనకు సామంతుని గమ్మని హెన్రీ నీతని బలవంతఁ బెట్టెను గాని ౧౨౪౪ లో న్యూకేసిల్ సంధితో నా తగాదా అణఁగిపోయె. ఈతఁడు మతమును (Church) రక్షించెను. చట్టముల బాగుపఱిచె. తన ధీసాహసములచే స్కాంట్లండ్ దేశమునకు సంపదఁ గలుగఁ జేసెను.

3-వ అలెక్జాండర్ (క్రీ. శ. ౧౨౪౧-౧౨౮౫) ౨-వ అలెక్జాండరు కుమారుఁడు. ఎనిమిదేండ్ల వయస్సు కాలమున రాజ్యమునకు వచ్చె. పెక్కుమంది ఇంగ్లీషు స్కాచ్చి సరదారులీతనికి పాలకప్రతినిధులు (Regents) గ నుండిరి. ఈతఁడు శిల్పనిపుణతఁ దెలుపు మందిరములఁ గట్టించె; కల్మషములేని మంచిలోహములతో నాణెములం బోయించె. న్యాయముచేయుటలో మిగుల పేరు వడసె. నార్వేవాఁడైన హేకో అను వానిని లార్గసు అనుచోట ౧౨౬3 లో నోడించె. అందుచే హెబ్రయిట్స్ అను దీవులు స్కాట్లెండ్ రాజ్యములోఁ జేర్చుకొనఁబడియె.

**అలెగ్జాండ్రియా.** తురకదేశజులు వీనిని ఇస్కందరియా యందురు. ఈజిప్టుదేశమందలి యొక సముద్రపు రేవుపట్టణము. ఇయ్యది క్రీ. పూ. ౩౩౨వ యేట అలెక్జాండరు ది గ్రేటు అనువాని యాజ్ఞ వలన, మెరియోటిస్ అను కొలనునకును మెడిటరేనియన్ సముద్రమునకును నడుమ నుండు సన్నని భూభాగముపైఁ గట్టఁబడియె. అప్పటినుండియు రమారమి వేయిసంవత్సరముల వఱకును ఈజిప్టుదేశపు రాజధానిగను ప్రపంచవర్తకమునకు ముఖ్యరేవుగను విద్యాపీఠముగను ప్రఖ్యాతిచెందెను. టాలమీయను గృహనామము గల రాజులకాలమునందు (క్రీ. పూ. ౩౨౩-క్రీ. శ. ౩౦) నియ్యది మిగుల నున్నతావస్థఁ గాంచెను. ఈపట్టణమందలి ముఖ్యవిశేషము భూమిక్రింది జలాశయములు. ఇందుఁ బట్టణవాసులకు నొక సంవత్సరమువఱకుఁ జాలునంత జలము ఇండ్లక్రింద సంగ్రహముచేసి యుంచుటకు వీలుండెనఁట ! ఇది మంచివైభవదశయం దున్నప్పుడిందు నేడులక్షుల జను లుండిరి. వీరిలో ఈజిప్టువారు గ్రీకువారు జ్యూలు (యహుదీలు) రోమనులు ఉండిరి. యూరోపుఖండమునకును ఆశియాఖండమునకును మధ్య నుండుటచేఁ దూర్పు సరుకులు పశ్చిమమునకును పడమటి సరుకులు తూర్పునకును పంపుటవలన ఈరేవు మిక్కిలి ప్రాముఖ్యమును పొందెను. క్రీ. పూ. ౪౭-౪౮ లో రోమకసేనానియైన జూలియస్ సీజరు ఈ పట్టణమును పట్టుకొనెను. అచ్చటి రాణియైన క్లియోపాత్రా

క్రీ. పూ. 3౦ లో మరణమొందగ నియ్యది రోము వారికిఁ బూర్తిగ స్వాధీన మయ్యెను. క్రీ. శ. ౬౪౧లో దీనిని అరబుల నాయకుఁడగు అమ్రూ అనువాఁడు పట్టుకొనెను. అరబుఖలీఫు లిచ్చటినుండి కైరోకు రాజధానిని మార్చినందునను, మఱివేఱు కారణములవలనను. దీని ప్రభ క్రమముగ తగ్గి ౧౮వ శతాబ్దమున నిందు ఆఱువేలకంటెఁ దక్కువ ప్రజ లుండుట తటస్థించెను. ౧౭౯౮ లో దీనిని నెపోలియను పట్టుకొనెను. ౧౮౦౧ లో నింగ్లీషువారు తీసికొనిరి. ౧౮౦౬ లో మహమ్మదల్లి యనువాని ప్రభుత్వకాలమున నీపట్టణము మరల నభివృద్ధి కాఁజొచ్చెను. ౧౮౮౨ లో నింగ్లీషువా రీ రేవును ఫిరంగులతోఁ గాల్చిరి. ఆ వివరము "ఈజిప్టు" శబ్దము క్రిందఁ జూడుము.

ఇప్పు డిచ్చట జనసంఖ్య నాల్గులక్షలు. రేవు వర్తకమును విశేషముగ నుండును. ఈ పట్టణ మిప్పుడు ఫిరంగీవారి పేట, అరబుల పేట, మహమ్మదీయుల పేట యని మూఁడు విభాగములుగ నుండును.

## అలెగ్జాండ్రియా గ్రంథాలయము.

అలెగ్జాండ్రియాపట్టణమందుఁ బ్రఖ్యాతిఁ జెందిన గొప్పగ్రంథాలయ మొకటి యుండెను. అచ్చట రాజ్యముచేసిన టాలమీ లన్న రాజులు (క్రీ. పూ. 3౦౪-3౦) విద్యాప్రియులు. టాలమస్ ఫిలాడెల్ఫస్ (క్రీ. పూ, 3౦౯-౨౪౬) అనురాజు డెమిట్రియస్ అను విద్వాంసుని సలహా ననుసరించి క్రీ. పూ. ౨౮౪ లో, నీ గ్రంథాలయమును స్థాపించెను. అరిస్టాటలు మహాతత్వవేత్తయొక్క గ్రంథసంగ్రహమును కొని మొదటదానిని ప్రారంభించిరి. తరువాత డెమిట్రియస్, జూడ్యా, గ్రీసు, ఇజిప్టు, చెల్దియా, పారసీకము మొదలయిన దేశముల వాఙ్మయమందలి గ్రంథముల సంగ్రహించి రాజు మరణమువఱకు ఒక లక్ష గ్రంథములను కూర్చెను! తరువాతి రాజులును క్రొత్తగ్రంథములను సంపాదించుచు గ్రంథముల సంఖ్య ఏడు లక్షలవఱకుఁ జేసిరి. ముద్రణమునకుఁ బూర్వ మంత గ్రంథసంగ్రహముగల గ్రంథాలయము మఱియొకటి లేదు. జూలిఅస్ సీజరు వచ్చి యీ గ్రామమును ముట్టడి వేసినపుడు (క్రీ. పూ. ౪౮) ఈ గ్రంథాలయముయొక్క విశేషభాగము కాలిపోయెను. తరువాత మరల మార్కస్ ఆంటొని క్లియోపాత్రాద్వార కొన్ని గ్రంథముల నీయగా నీ గ్రంథాలయము నాలుగు శతాబ్దములవఱకు నభివృద్ధిఁ జెందెను. ఈపుస్తకాలయ ముంచిన "సిరాపెం" అను మందిరమును, క్రీ. శ. 3౯౦ లో క్రైస్తవమతగురువైన థియోఫిలస్ అనువాఁడు నాశము చేయఁగా నందలి గ్రంథములు చెల్లాచెదరై పెక్కుతావులకుఁ దీసికొనిపోఁబడియెను. మరలను గ్రంథాలయము స్థాపింపఁబడె. అది క్రీ శ. ౬౪౦ లో అరబు లీ పట్టణమును పట్టుకొన్నప్పుడు పూర్తిగ దగ్ధము చేయఁబడెను. ఈ గ్రంథాలయము మరల స్థాపింపఁబడలేదనియు, దానిని అరబులు కాల్చియుండ రనియుఁ గొందఱు చరిత్రకారుల యభిప్రాయము.

## అలెగ్జాండ్రియా వాఙ్మయము.

గ్రీసు దేశమునకు స్వాతంత్ర్యముపోయి, యచ్చట విద్వాంసులకు నాశ్రయము లేక పోఁగా వారు అలెగ్జాండ్రియా రాజుల యాశ్రయమునఁ జేరిరి. అచ్చటి టాలమీలనఁబడు రాజులు కడు విద్యాప్రియులు గాన విద్వాంసుల నందఱిని ఆదరించి, మ్యూసిఅమ్ అను విద్యాపీఠమును నిర్మించిరి. ఇచ్చట వేయియేండ్ల వఱకును (క్రీ, పూ, 3౨3-క్రీ. శ, ౬౪౦) విద్వాంసుల సహవాసంబున సరస్వతీదేవి యథేచ్ఛగా విహరించుచుండెను. ఈ వేయి సంవత్సరముల కాలమును రెండు విభాగములుగ (యుగములుగ) నెంచవచ్చును. ౧. క్రీ. పూ. 3౨3 మొదలు క్రి, పూ. 3౦వఱకు; ౨. క్రీ. పూ. 3౦ మొదలు క్రీ. శ. ౬౪౦ వఱకు. మొదటి యుగమందు వాఙ్మయము (సాహిత్యము)ను, భౌతికశాస్త్రములును అభివృద్ధిఁ జెందెను. రెండవ యుగమునందుఁ దత్త్వజ్ఞానము (వేదాంతము) ఎక్కువగ నభ్యసింపఁబడెను.

పూర్వయుగమునందు సాహిత్యచర్చ, విమర్శనము, వ్యాకరణము, ఛందస్సు, పురాణములు, జ్యోతిషము, గణితము, వైద్యము అను విషయములపై అలెగ్జాండ్రియా విద్యాలయములోని పండితు లనేకు లనేక గ్రంథముల నిర్మించిరి. ముఖ్యముగ వారు చేసిన పని

గ్రీసుమహాకవుల కావ్యములపైని చర్చాత్మకమైన టీకలు వ్రాయుట. కొందఱు కొన్ని కావ్యములు కూడ వ్రాసిరి. కాని గ్రీసు దేశపుఁ గవుల కావ్యములందుఁ గానవచ్చు స్వతంత్రకల్పనావిహార మిందుఁ గానరాదు. గణితశాస్త్రముల నభివృద్ధి పఱిచిన వారిలో, రేఖాగణిత కర్తయైన యూక్లిడ్, ఆతని శిష్యులు అయిన, పదార్థ శాస్త్రసంబంధమైన పెక్కు సిద్ధాంతముల గనుఁగొనిన అర్కిమిడిస్, కోణరేఖాగణితమను శాస్త్రమును వ్రాసిన పెర్గావాఁడగు అపాలోనియస్, విఖ్యాతజ్యోతిష్కుఁడు హిప్పార్కస్, గణితము, జ్యోతిషము, భూగోళము, తత్వజ్ఞానము, చరిత్ర విషయములను గుఱించి గ్రంథములను వ్రాసిన ఎరటాస్థనీస్ అను వాఁడును ముఖ్యులు.

అలెగ్జాండ్రియాలో జ్యూవారును గ్రీకులును కలియుటచేఁ బాశ్చాత్య పౌరస్త్య తత్త్వశాస్త్రముల సమ్మేళన మిచ్చట జరిగెను. నియోప్లేటోనిజమ్ అను నూతనప్లేటోసంప్రదాయ మిచ్చటనే పుట్టెను. ఇచ్చటఁ గ్రైస్తవమతము బాగుగ వ్యాపించెను. ఇప్పటికి నిచ్చట క్రైస్తవ మతాచార్యుని పీఠము గలదు. ప్లేటోతత్త్వములకును, క్రైస్తవ మత తత్త్వములకును లంకె పెట్టి కొందఱు క్రొత్త సంప్రదాయమును సృష్టించిరి. గ్నాస్టికులను క్రైస్తవ వేదాంత సంప్రదాయ మిచ్చటనే యభివృద్ధి చెందెను.

**అలెగ్జాండ్రా** (నైలు) దీనికి మఱియొక పేరు కాగిరా. ఇది నైలునదియొక్క పోషకఝరములలో ముఖ్యమయినది. విక్టోరియా నయాంజా సరస్సు ద్వారా ప్రవహించి నైలునదికి నీరముల నొసంగుచున్నది.

**అలెప్పో.** సిరియా దేశములో నుత్తరభాగమున నుండు పురాతనపట్టణములలో నొకటి. ఆఫ్రికా ఖండపు దక్షిణాగ్రమార్గము కనిపెట్టఁబడక మున్ను యూరోపా ఆసియా ఖండముల వ్యాపారమునకీ పట్టణమే పట్టు. ఇటలీ దేశములోని వెనీసు నగరమునకును ఈ పట్టణమునకు సంబంధము కడుంగడు నెక్కువ. పదునైదవ శతాబ్దాంతమున నవీనమార్గ మేర్పడినతో డనె ఈ పట్టణపుఁ బ్రాముఖ్యము తగ్గెను. ఇప్పటికిని ఇచ్చట తుర్కీలు, ఆర్మీనియనులు, గ్రీకులు, యూదులు, మున్నగు ననేకజాతులవారు నివాసము లేర్పఱచికొని యున్నారు. వీరిలో నైదింట నాలుగువంతులు మహమ్మదీయులు.

ఈ పట్టణము చరిత్రమున పెక్కు పోకడలం బోయినది. క్రీ. శ. ౬౩౬. సారసనులు దీనిం గొనిరి. క్రీ. శ. ౧౪౦౦లో తైమూరు దీనిం గొల్లగొట్టె. క్రీ. శ. ౧౫౧౭లో నియ్యది తుర్కీవారి స్వాధీన మయ్యెను. క్రీ. శ. ౧౧౭౦ లోను ౧౮౨౨ లోను భూకంపము లీ నగరమును నాశ మొనర్చె. క్రీ. శ. ౧౮౨౭ లో బొబ్బల జాడ్యమును, ౧౮౩౨ లో కలరాయును దీనిం గలంచె. జనసంఖ్య ౨౦౦,౦౦౦. ఇప్పటికిని వ్యాపారము బాగుగ జరుగుచున్నది.

**అలెస్సాండియా.** ఇటలీ దేశములో నిదే పేరుగల మండలమునకు రాజధాని. ఇచ్చట నొక గొప్ప దుర్గమును గలదు. ఇప్పటికిని నిది బలవంతమయినదియే. ఇందు సైన్యములును గలవు. ఈ పట్టణము రైలుమార్గముపయి చక్కనిపట్టున నుండి ప్రముఖతఁ గాంచి యుండుటచేత వ్యాపారము నానాఁటికి వృద్ధియగుచున్నది. జనసంఖ్య ౭౫,౦౦౦.

**అలేఖియా.** శైవులయిన బైరాగుల సంప్రదాయము. గిర్నార్ పర్వతము, ఘానా వీరి ముఖ్యస్థలములు. వీరు బిచ్చ మెత్తుకొని జీవయాత్ర గడపెదరు. గణేశభక్తులు, భైరవభక్తులు, కాళీభక్తులు, అని వీరిలో మూఁడు తెగలు గలవు. మొదటి వారు ఉదయమునను, రెండవవారు సాయంత్రమునను, మూఁడవవారు అర్ధరాత్రియు భిక్షాటనఁ జేయుదురు. మొదటి తెగవారు మాత్రము భిక్షాటనమునకు నిండ్లలోనికిఁ బోదురు, మిగిలిన రెండు తెగలవారు ఇండ్లలోనికిఁ బోక వీథులలోనుండియే భిక్షాటనఁ జేయవలయు. వీరికి 'అలఖ్ నామి' లన్న మాఱుపేరు గూడఁ గలదు. వీరు తిరుగుచున్నపుడు 'అలఖ్', 'అలఖ్' అని అరచుచు తిరుగుచుందురు. కాన వీరికీ పేర్లు వచ్చెను.

**అలోపుఁడు** ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొక్కఁడు.

**అల్కింది.** (అబూయూసుఫ్) తత్వవేత్త. గణితశాస్త్రజ్ఞుఁడు. ౯ వ శతాబ్దపువాఁడు. అరబ్బీవారీతనిని అందరికంటె గొప్ప తత్త్వజ్ఞునిగ నెంచుదురు. అతని కాలమునం దుండిన యన్ని శాస్త్రములం గూర్చియు గ్రంథములఁ వ్రాసెను. ముఖ్యముగ తర్కగణితశాస్త్రములగుఱించి వ్రాసెను. అరిస్టాటిల్ గ్రంథముల భాషాంతరీకరించెను. వానిపై భాష్యము వ్రాసెను.

**అల్ ఖ్వారస్మి.** ౯ వ శతాబ్దమునందుండిన అరబ్బీగణితశాస్త్రవేత్త. ఖురాసాన్ పట్టణమున జన్మించెను. బగ్దాద్ పట్టణములోని అల్ మమున్ అను ఖలీఫునొద్ద గ్రంథాలయాధ్యక్షుఁడుగ నుండెను. 'సింద్ హింద్' అను పేరిట జ్యోతిషగణితస్కంధసంబంధమైన రెండు పథకములను వ్రాసెను. ఇది హిందూదేశమందలి సిద్ధాంతముల ననుసరించి గుణింపంబడియె. ఈతఁడు బ్రహ్మగుప్తుని గ్రంథము ననుసరించి బీజగణిత (Algebra) మొకదానిని రచించెను. యూరోపుఖండమందు తరువాత వ్రాయఁబడిన బీజగణితసంబంధమైన గ్రంథముల కన్నిటికిని నిదియె ఆధారము. హిందూపద్ధతి ననుసరించి యంకెలు వ్రాయునట్టి దశాంశవిధమును తెలుపుచు నీతఁ డొక గణితగ్రంథము వ్రాసెను.

**అల్గర్ కోవిల.** మధురజిల్లాయందలి మేలూరుతాలూకాలోని యొక గుడి. ఇది మధురపట్టణమునకు ఈశాన్యమున ౧౨ మైళ్లదూరమునం దుండును. ఇది అల్గర్ గుట్టలమీఁద నున్నది. దేవునిపేరు అల్గర్. ఈ దేవాలయము మిక్కిలి పురాతనమైనది. కళ్లరులను దొంగ జాతివారీ దేవు నారాధింతురు. గుడిచుట్టు కోటమాదిరి గోడ గలదు. ఆడినెల పౌర్ణమినాఁడు ఇక్కడ పెద్ద యుత్సవము జరుగును.

**అల్జీయర్సు.** అల్జీరియాదేశమునకు ముఖ్యపట్టణము. దీనికీ పేరు అలెజెజార్ (Al-gezair) అనఁగ దీపములు అను అరబ్బీపదమునుండి వచ్చినది. ఇది సుందరమైన పట్టణము. ఇక్కడ చాలమంది ఐరోపీయను లుందురు. ఇక్కడ ఎస్పార్టోగడ్డితో కాగితములు చేయుదురు. ఇది సమశీతోష్ణపట్టణము. ఈ పట్టణముయొక్క నూతనభాగమును బుల్కింజీరి అనునతఁడు కట్టించెను. జనసంఖ్య ౧౫౪,౦౪౯.

**అల్జీరియా.** ఆఫ్రికాఖండమునందు నుత్తరభాగమున నున్న యొక దేశము. ఇది యిప్పుడు ఫ్రెంచివారి ప్రభుత్వము క్రింద నున్నది. దీని విస్తీర్ణము 3౪3౫౦౦ చదరపు మైళ్లు. జనసంఖ్య ౫౭3౧౭౫౦. అల్జియర్సె అనునది రాజధాని. ఈ దేశమునకు నుత్తరమున గమారమి ౬౦౦ మైళ్ల వఱకును మధ్యధరాసముద్రమును (మెడిటరేనియన్ సీ) దక్షిణమున సహారా యెడారియుఁ గలవు. ఇచ్చటి మూలనివాసులు బర్బరులనువారు. వీరు బహుపత్నీత్వము లేని మహమ్మదీయులు. ఈ దేశమందు పెక్కువందల యేండ్లనుండి యున్న అరబువారును, జ్యూలును పెక్కురు కలరు. యూరోపీయనుల సంఖ్య 230000. ఈ దేశము ముఖ్యముగ వ్యవసాయజీవనము గలది. ఇచ్చట ద్రాక్షపంట విశేషము. 300000 యెకరములకంటె నెక్కుడు భూమి ద్రాక్షపంటఁ బండించును. కావున నిచ్చటనుండి ద్రాక్షాసవ మెక్కువగ నెగుమతి యగును.

బర్బరు లనువా రిచ్చటి మూలనివాసులు గఁ గానవచ్చుచున్నారు. పూర్వకాలము దీనిని న్యూమిడియా అనుచుండిరి. దీనిని పూర్వకాలమందు ఫొనిషియనులు, రోమనులు, వ్యాండాలులు గెల్చుచు వచ్చిరి. క్రీ. శ. ౯3౫ లో అరబ్బీరాజపుత్త్రుఁడైన జేరి యను వాఁడు అల్ జియర్సె పట్టణముఁ గట్టెను. ఆవంశము ౧౧౪౮ వఱకు రాజ్యము చేసెను. ౧౨౬౯ లో నిది చిన్నచిన్న సంస్థానము లయ్యెను. స్పెన్ దేశము నుండి వెడలఁ గొట్టఁబడిన మూరులు, జ్యూలు (యహూదీలు) ౧౪౯౨ లో నీరాజ్యమునందుఁ గాఁపుర మేర్పర్చుకొనిరి. వారు సముద్రపు దొంగతనముఁ బ్రారంభించి, యూరోపీయ వర్తకమునకు నపరిమితమైన నష్టము కలిగించుచుండిరి. స్పేనురాజయిన ఫర్డినందు ౧౫౦౯ లో అల్ జయర్సె

పట్టుకొని వీరిని శిక్షించెను. తరువాత తుర్కీసరదారుఁ డొకఁడు అల్జీరియావారి సాయమునకు వచ్చి వాఁడీ దేశ మాక్రమించుకొనెను. స్పేన్‌వారిని వెడలఁగొట్టెను. కాని తరువాత వానివంశజులు సముద్రముమీఁద గొప్ప దొంగలైరి. వారన్న యూరోపువారికి నడలుగ నుండెను. అల్జీరియా వారిని శిక్షింపవలె నని ఇంగ్లీషువారు, డచ్చివారు (వలందులు) ఫ్రెంచివారు, స్పెనువారు, అమెరికావారు, పెక్కు మారులు ప్రయత్నించిరి. చివరకు ౧౮౩౦ లో ఫ్రెంచివారు రాజధానియైన అల్జియర్సును పట్టుకొనిరి. కాని యచ్చటివారు సాధారణముగ వశులు కాలేదు. వారును వారి నాయకుఁడైన అబ్దల్ కాదర్ అనువాఁడును ఫ్రెంచివారికి మిక్కిలి తొందర కలిగించిరి. ౧౮౪౭ లో అబ్దుల్ కాదర్ వశుఁ డయ్యెను. ౧౮౭౩ నుండి యచ్చట శాంతత కలదు. ఈదేశమునకు సంబంధించిన చట్టములు ప్యారిస్ పట్టణములోఁ జేయఁబడును.

**అల్లా.** బొంబాయి, కొల్హాపూర్ సంస్థానమందలి యొక గ్రామము. వారణానదిమీఁద నున్నది. జనసంఖ్య ౪౯౬౭. ఇచ్చట రంజాన్‌దర్గా అను మహమ్మదీయుల మసీదును, సిదోబా, ఢులాబా, అల్లమప్రభువు, రామలింగ దేవాలయములును కలవు. అల్లమప్రభువు దేవాలయమునకు ఔరంగజేబ్ మెట్లు కట్టించెనట. దీనియెదుట ౧౮౦౫ వఱకు భక్తులు కొందఱు ప్రాణముతోనే సమాధిం జెందు చుండిరఁట. రామలింగదేవాలయము కొండలో తొలవఁబడినది.

**అల్టెన్‌స్టెన్.** (కారల్ బేరన్ వాన్ ౧౭౭౦-౧౮౪౦) ప్రష్యాదేశపు రాజనీతిజ్ఞుఁడు. ఇతఁడు మొదట రాజ్యమందలి అర్థిక శాఖకు మంత్రిగను, తరువాత మత విద్యా శాఖలకు మంత్రిగను ఉండెను. విద్యాపీఠములకు గొప్పయుపకార మొనరించెను. ఈతఁడు ౧౮౧౯ లో నొక విద్యావిధానము నేర్పఱిచెను. దాని ననుసరించియే ప్రష్యాలో నిప్పటికిని విద్య చెప్పఁబడుచున్నది. యూరపు దేశమునందలి పెక్కు దేశములు దాని నవలంబించెను.

**అల్పగ్రహములు.** అంగారకగ్రహమునకును బృహస్పతి గ్రహమునకును నడుమ చిన్నిచిన్ని గ్రహము లసంఖ్యములు కలవు. వానికి నల్పగ్రహము లని పేరు. వీనిని ఇంగ్లీషులో మైనర్ ప్లానెట్సు (Minor Planets) అని యెదరు. నేఁటివఱకు శాస్త్రజ్ఞులు రమారమి ౭౦౦ అల్పగ్రహములఁ గనుఁగొనిరి. మన నవగ్రహములతోఁ బోల్చిచూచిన యెడల నివి మిక్కిలి చిన్నవి. గ్రహములన్నింటిలో బుధుఁడు చిన్నవాఁడు. ఈ గ్రహము యొక్క వ్యాసము (diameter) ౩౦౭౬ మైళ్లు పొడవు. అల్పగ్రహములలోఁ పెద్దదాని వ్యాసము ౪౮౫ మైళ్లు. ౨,౪ మైళ్లు వ్యాసము గలవి పెక్కులు కలవు. ౧౯౦౦ వ సంవత్సరమున డాక్టరు కలరు అని జ్యోతిష్కునిచేఁ గనిపెట్టఁబడిన యల్పగ్రహముయొక్క వ్యాసము ౫౫౦ గజములు పొడవు! ఇదివఱకుఁ గనిపించిన యేడువందల యల్పగ్రహముల నన్నింటినిఁ గల్పి యొక ముద్ద చేసినయెడల నా ముద్ద మన భూగోళమునకన్న నిరువదిరెట్లు చిన్నదిగ నుండును!

ఆకారము

పందొమ్మిదవ శతాబ్దారంభమువఱకును ఈ యల్పగ్రహము లున్న సమాచారము శాస్త్రజ్ఞు లెఱుఁగనే యెఱుఁగరు. కాని అంగారకునకును బృహస్పతికిని నడుమ ముప్పదినాల్గు కోట్ల పదునేను లక్షల మైళ్ల యంతరమున్నదున, నీ మహదంతరములో నొక గ్రహము తప్పకయుండవచ్చునని జ్యోతిష్కులాకాశమున వెదకఁజొచ్చిరి. ఇటలీదేశజుఁడయిన 'పియజ్జి' యను జ్యోతిష్కునకు ౧౯ వ శతాబ్ద ప్రారంభదినమున (౧ వ జనెవరి ౧౮౦౧) ఒక యల్పగ్రహము కానవచ్చెను. దీనికి సెరిస్ (Ceres) అని నామకరణము చేసిరి. ఇట్లే నేఁటివఱకు రమారమి ౭౦౦ అల్పగ్రహములు కానవచ్చినవి. ఇవన్నియు పెద్ద గ్రహములవలెనే సూర్యునిచుట్టును తిరుగుచుండును. అన్నియు నంగారక బృహస్పతులకు నడుమ నుండు ఆకాశమునందు నున్నవి. ప్రతిసంవత్సరమునను క్రొత్తవి కానవచ్చుచున్నవి.

కనుఁగొనినవిధము

ఇట్లు వందలకొలఁది యత్యల్పగ్రహములు కుజ బృహస్పతులమధ్య నెట్లు పుట్టినవి? అన్న ప్రశ్నకుఁ బలువురు పలువిధముల జవాబు చెప్పి దరు. పూర్వ మొకప్పు డివియన్నియుఁ గలిసి యొక పెద్దగ్రహముగ నుండెననియు, దానిపై మఱియొక గోళము పడుటవలననో మఱి యేహేతువు చేతనో యది పగిలి శకలములై యిన్ని అల్పగ్రహములై యుండునని కొందఱు శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

వీని యుత్పత్తి.

చదువరులు అల్పగ్రహములకును లఘుగ్రహముల కును, ఉపగ్రహములకును గల భేదముఁ దెలిసికొన వలెను. తొమ్మిది అసలు గ్రహములలో బుధశుక్రభూ కుజులకు లఘుగ్రహములనియు, నితరగ్రహములకు గురు గ్రహము లనియుఁ బేళ్లు. ఆకారమునందుఁ గొంచెము చిన్నవి, కొంచెము పెద్దవి యని యర్థము. ఒకగ్రహము చుట్టు తిరుగు మఱియొక గ్రహమునకు నుపగ్రహ మని పేరు.

**అల్ఫరాబీ** (క్రీ. శ. ౯౫౦) అరబ్బీ తత్త్వవేత్త. తనకాలమందలి శాస్త్రము లన్నిటిని జేర్చి ఇతఁ డొక విజ్ఞానసర్వస్వమును రచించెను. ఇతఁడు బగ్దాద్, డెమాస్కస్ పట్టణములందు నివసించుచుం డెను. ఈతఁడు అరిస్టాటిల్ గ్రంథములను అరబ్బీవారికి నేర్పెను.

**అల్ఫాన్సో.** (౧౮౭౫-౮౫) ఇతనిని ౧౨ వ అల్ఫాన్సో అందురు. ఇతఁడు స్పెయిన్ దేశపురాజు. ఇతఁడు ౧౮౫౭ లో జన్మించెను. తల్లి ఇసాబెల్లా. ఆమెను దేశమునుండి వెడలఁగొట్టిరి. అప్పుడు చిన్నవాఁడైన అల్ఫాన్సో గూడ ఆమెవెంట వెళ్లెను. ౧౮౭౪ లో ఈతనిని రాజుగ నెన్నుకొనిరి. ఈతఁడు మిక్కిలి తెలివిగ రాజ్యపరిపాలనము చేసెను.

**అల్ఫాన్సో.** (ఆరగాన్) స్పెయిన్ దేశమునందు పూర్వము విడిప్రభుత్వముగా నుండిన ఆరగాన్ అను రాజ్యమును అల్ఫాన్సో అను అయిదుగురు రాజులు పాలించిరి. వారిలో నిద్దఱు ముఖ్యులు :—

౧. ఈ పేరుగలవారిలో మొదటి వాఁడు (క్రీ. శ. ౧౧౦౪ - ౧౧౩౪) ఇతనికి "విజయుఁడను" (The Victorious) బిరుద ముండెను. ఇతఁడు స్పెయిన్ దేశజులైన మూర్సు అనంబడు మహమ్మదీయులతోఁ బోరాడి వారిని పెక్కుపర్యాయములు పరాభవించి శారగోసా, టెరాగోసా అను వానిని స్వాధీనపఱచుకొనెను. ఈతఁడు ౨౯ యుద్ధములలో విజయుఁ డయ్యె.

౨. (౧౪౧౬-౫౮) ఈతఁడు ఈపేరుగల ౫-వ వాఁడు. క్రీ. శ. ౧౩౮౫ లో జన్మించెను. ఈతనికి "ఉదారుఁడు" అన్న బిరుదాంకితము గలదు. ఇతని తండ్రి ఫర్డినెంకు. ౧౪౧౬ లో రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు ఆరగాన్, సిసిలీ, నేపుల్సు లన్న మూఁడురాజ్యములపై ప్రభుత్వము చేసెను. ఇతఁడు విజ్ఞానవంతుఁడు, విద్యాప్రియుఁడు, విద్వత్పక్షపాతి విజ్ఞానపునరుత్థానము (Rennaisance) యూరోపుదేశపుచరిత్రలో ప్రఖ్యాతి జెందిన యుగమునందును విద్యాభివృద్ధిఁ జేసిన రాజులలో నితఁడొక్కఁడు. ఇస్తంబూల్ (కాన్స్టాంటినోపల్) పట్టణమును తురుష్కులు పట్టుకొనిన తరువాత నచ్చటినుండి పాఱిపోయిన పండితవర్యుల కితఁ డాశ్రయ మిచ్చెను.

**అల్ఫాన్సో.** (పోర్చుగల్) పోర్చుగల్ దేశమున నీ పేరుగల రాజులు ఆఱుగురు రాజ్య మేలిరి.

౧ (౧౧౧౦-౮౫) అంతవఱకు లియన్ రాజ్యమునకు లోఁబడియున్న పోర్చుగల్‌ను స్వతంత్రముగఁ జేసెను. గొప్పయోద్ధ. ఆజానుబాహుశరీరము గల వాఁడు. పెక్కుయుద్ధములలో మూరులతోఁ బోరాడి ఖ్యాతివడసెను.

౨ (౧౨౧౧-౨౩) మతగురువుల అధికారమును తగ్గించుటకు ప్రయత్నించెను. అందుచే నతనిని వెలి వేసిరి.

3 (౧౨౪౮-౭౯) ఇతని కాలము చాలవఱకు మూరులతో యుద్ధముచేయుటలో గడచెను.

౪. (౧౩౨౫-౫౭) కేస్టిలేరాజులతోను, మూరులతోను పోరాడుటయందు ఇతనికాలము చాలవఱకు గడచెను. ఇతని కుమారుఁడైన పీటరునకును, ఇతనికిని గృహకలహము సంభవించెను.

౫ (౧౪౩౮-౮౧) ఈతఁడు ఆఫ్రికాలోని మూరుల రాజ్యముమీఁదికి దండెత్తి వెడలినందున నీతనికి "ఆఫ్రికేనో" అన్న బిరుదు వచ్చెను.

౬ (౧౬౫౬-౬౭) దుర్మార్గుఁడగుటచే ౧౬౬౭ లో రాజ్యపదభ్రష్టుఁడు కావలసివచ్చెను. తరువాత టర్సిరా పట్టణములో కాలము గడపి ౧౬౭౫ లో మరణించెను.

**అల్ఫాన్సో.** (లియాన్) స్పెయిన్ దేశమునందు పూర్వము స్వతంత్రములుగ నుండిన లియాన్, కేస్టిలే అనురాజ్యములపై అల్ఫాన్సో అను పేరు గల రాజులు ౧౧ మంది రాజ్యము చేసిరి. మొదటి యిద్దరిని గుఱించి విశేషమేమియు తెలియదు. వారి ప్రభుత్వకాలము క్రీ. శ. ౭౪౦-౮౪౦ వఱకు జరిగిన శతాబ్దము దుండెనని మాత్రము తెలియుచున్నది. తరువాత ముగ్గురు అల్ఫాన్సోలు ౮౬౬-౧౦౨౮ కాలము నందు పాలనముఁ జేసిరి. దేశముమీఁదికి ఎత్తివచ్చిన మూరు లనుమహమ్మదీయులతో వీరి కాలముననే పోరాట మారంభమయ్యె.

౬ (౧౦౬౫-౧౧౦౯) మూరుల నెదురించుటలో నాయకుఁడుగ నుండె. స్పెయిన్ దేశజులు పోపుకు పూర్తిగ లోఁబడునటులఁ జేసె. స్పెయిన్ వారికి ఫ్రాన్సు వారి నాగరకత నేర్పె.

౭ (౧౧౨౬-౫౭) ఇతనికి ఉభయమతముల ప్రజల రాజన్న బిరుదుండె. క్రైస్తవులతోపాటు మూరు లనుమహమ్మదీయులను గూడ న్యాయముగఁ బరిపాలించె. మూరుల తిరుగఁబాటును అణఁగఁగొట్టఁ బ్రయత్నించుచుండఁగఁ జంపఁబడిరి.

౮ (౧౧౫౮-౧౨౧౪) ఈతఁడు ఇంగ్లాండు రాజైన ౨ వ హెన్రీకుమార్తెను వివాహమాడెను. మూరులపై దండెత్తుటకు నేకమైన క్రైస్తవరాజుల కూటము (Coaliton) నకు నాయకుఁడుగ నుండి మూరులఁ బూర్తిగ బరాభవించెను.

౯. (౧౧౮౮-౧౨౩౦) ఈతని వివాహమును గుఱించి పోపునకును ఇతనికిని వివాదము గలిగెను.

౧౦. (౧౨౫౨-౮౪) ఇతఁడు విద్యావంతుఁడు. బృహస్పతి(The wise)అన్న బిరుదుగాంచెను. జ్యోతిష శాస్త్రమందలి గణితస్కంధము నభివృద్ధి జేయుటకు సహాయము చేసెను. తనసరదారులతో పెక్కు తగాదాలు పెట్టుకొనెను. జర్మనుసామ్రాజ్యము సంపాదింపవలయు నని యత్నించుటకు ధనము గావలసివచ్చి ప్రజలపై నెక్కువగ పన్నులు విధించెను. అందుచే లోకద్వేషము సంపాదించెను.

౧౧. (౧౩౧౨-౫౦) తిరుగఁబాటు చేసిన సరదారులను కఠినముగ శిక్షించెను. ఆఫ్రికాదేశము నుండి వచ్చినమూరుల చివరదాడి నోడించెను.

**అల్బతాని.** (౮౫౦-౯౩౦) ఇతని పూర్ణమైన నామము మహమ్మద్ బిన్ జబిర్ బిన్ సినామ్, అబూ అబ్దల్లా. అగబ్బీదేశజుఁడు. జ్యోతిషశాస్త్రవేత్త. మెసపొటేమియా దేశమునందలి రాక్కా యను స్థలమున నీతఁడు నక్షత్రాదుల వేధ కనుఁగొని జ్యోతిషశాస్త్రమునందు క్రొత్తపరిశోధనలను జేసెను. టాలెమిచే రచింపఁబడిన గ్రహపథకములు దృక్ప్రత్యయమునకు వచ్చుట లేదని ఈతఁడు తన వేధల ననుసరించి క్రొత్త పథకము లేర్పఱిచెను. ఈతని మతమున అయనమునకు ౬౬ సంవత్సరములలో ఒక్క అంశము గతి కలదు; పరమక్రాంతి ౨౩° ౩౫', సాయన సూర్యోచ్చము ౮౨° ౧౭', ఈతఁడు సాయనసంవత్సరపు మితి ౩౬౫ దినములు ౫ గంటలు ౪౬ నిమిషములు ౨౪ సెకనులు అని నిశ్చయించెను. ఇది నిజమైన మితికంటె ౨ నిమిషములు ౨౬ సెకనులు మాత్రము తక్కువగ నున్నది. ఇతఁడు గొప్ప గణితజ్ఞుఁడు. త్రికోణమితి (Trigonometry) లో నూతనాంశములను గనుఁగొనెను. జ్యోతిషవిషయమై పెక్కుగ్రంథములను వ్రాసెను. వానిని ౧౨ వ శతాబ్దపువాఁడైన ప్లేటో టైబర్టినస్ అనువాఁడు ల్యాటిన్ భాషలోనికి భాషాంతరీకరించెను.

## అల్బిరూని. (క్రీ. శ. ౯౭౧-౧౦౩౯)

ఇతని సంపూర్ణనామము అబూరైహాన్ మహమ్మద్ బిన్ అహమ్మద్ అల్ బిరూని. గజ్నీమహమ్మదు నాస్థానవిద్వాంసుఁడు. జాతక స్కంధమందు మిక్కిలి ప్రజ్ఞకలవాఁడఁట. రేఖాగణితము, తర్కము, అను శాస్త్రములందును మిక్కిలి ఖ్యాతి చెందెను. ఇతఁడు పెక్కు దేశములు చూచుటయేగాక హిందూదేశమునకు వచ్చి ఎన్నియో వత్సరముల వఱకు నిచ్చటనుండి యనేకశాస్త్రములను అభ్యసించెను. "తారిఖ్-ఉల్-హింద్" అను హిందూదేశచరిత్ర గ్రంథము వ్రాసెను. పెక్కు గ్రీకు గ్రంథములను భాషాంతరీకరించెను.

## అల్బుమజార్. (౮౦౫-౮౫)

విఖ్యాతిచెందిన అరబ్బిజ్యోతిర్విదుఁడు. ఇతని గ్రంథములు ల్యాటిన్‌లోనికి భాషాంతరీకరింపఁబడెను (౧౪౮౯.)

## ఆల్మ్క్విస్ట్. (కారల్ జోనస్ లవ్ విక్ ౧౭౯౩-౧౮౬౬)

స్వీడన్ దేశజుఁడు. గ్రంథకర్త. ఇతఁడు నవలలు, నాటకములు, వైణికకావ్యములు, తత్వనీతి, భావ, విద్యాప్రతిపాదకము లయిన పెక్కు గ్రంథములను వ్రాసెను.

## ఆల్మ్‌గ్రో. (౧౪౭౫ - ౧౫౩౮)

స్పెయిను దేశజుఁడు. అమెరికాలోని పేరూ, చిల్లీ, మొదలయిన దేశములను సాధించుటలో పిజారో అనువానికి సహాయపడెను. కాని తుదకాతనితోఁ బోరాడి యోడి ఉరితీయఁబడెను.

## అల్మేడా. (గ్యారెట్ ౧౭౯౯-౧౮౫౪)

పోర్చుగల్ దేశజుఁడు. కవి. నాటకకర్త. రాజతంత్రజ్ఞుఁడు. ఈతనిచే రచింపఁబడిన నాటకములోఁ గొన్ని ఆధునిక పోర్చుగీస్ నాటకవాఙ్మయము నందు నుత్తమోత్తమములని యెంచఁబడుచున్నవి. జిల్ విసెంటే అనునది పోర్చుగల్ దేశమునందలి జాతీయ నాటకములలో శ్రేష్ఠమైనదిగ పరిగణింపఁబడు చున్నది. దేశమందలి రాజకీయాందోళనములలోఁ గూడ నీతఁడు శ్రద్ధ వహించెను.

## అల్యూమినియము.

బంగారము, వెండి, రాగివలె మూలధాతువు. అనఁగా నిందు మఱియేధాతువును కలిసియుండదు. ఇత్తడి కంచువలె నది మిశ్రధాతువుకాదు. ఈ ధాతువునకు నింగ్లీషులో Al అనియు, తెలుఁగులో "అల" అనియు గుర్తు పెట్టఁబడినది. ఇది తగరమువలెఁ గొంచెము మలినముగ నుండు తెల్లరంగు గలది. దీని పరమాణుభారము (Atomic weight) ౨౭; విశిష్టగురుత్వము (Specific Gravity) ౨.౬; ౬౫౭° అంశములవఱకు వెచ్చ చేసినఁగాని కరఁగదు.

ఇది ప్రపంచమునందు విశేషముగ నున్నను స్వతంత్రరూపములోఁ గాన్పింపదు. ఇతర ద్రవ్యములలోఁ గలిసియుండును. ఇసుక రాళ్లు, తెల్లనిరాళ్లు (Silica) నల్లశిలలు (Granite), అభ్రకము, పటికరాళ్ళు, బలపపురాళ్లు, కెంపులు నీలములు మున్నగు విలువగల రాళ్లు, మొదలయినవానిలో వేఱువేఱు ద్రవ్యములలోఁ గలిసిన అల్యూమినియము ఉండును. ఇట్టి ధాతువొకటి యున్నదని మొన్న మొన్నటివఱకుఁ బ్రపంచమునకుఁ దెలియనే తెలియదు. పటికారము (ఆలం) ఈ లోహసంబంధమైనయొక ఉప్పు అని ౧౭౭౭ సంవత్సరమున హాఫ్‌మెన్ ననునతఁడు కనిపెట్టెను. ఆలమునకు సంబంధపడిన దగుటచే దాని ఫ్రెంచిపేరగు అల్యూమినె యను పేరు తొలుదొల్త ఈలోహమునకియ్యఁబడెను. పిమ్మట అల్యూమినమనియు అల్యూమినియమనియు పేర్లు క్రమేణ వచ్చినవి. ౧౭౭౭ వ సంవత్సరమున నీ లోహమున్నట్లు కనిపెట్టఁబడినను దానిని ప్రత్యేకించి లోహముగా ౧౮౪౫ వ సంవత్సరమువరకు విడతీయు మార్గము కనిపెట్టఁబడలేదు. ఊహ్లార్ అనునతఁడు ఈలోహము ముక్కలను విడతీయు పద్ధతి కనిపెట్టెను. అయితే సులభమైన వెలకుగాని సామాన్యోపయోగమునకుగాని లభించుపద్ధతి అప్పుడు దొరకకపోయెను. దేవిల్లే యనునతఁడు ౧౮౫౪-౧౮౫౯ సంవత్సరములమధ్య అనేకపద్ధతులను పరిశోధించి ఊహ్లారుపద్ధతిప్రకారము పౌండు ౧౨ నవరసులు వెలగల పోటాసియం మూలమునగాక సోడియము మూలమున అల్యూమినియమును ప్రత్యేక

పరచుపద్ధతి కనిపెట్టి సోడియమును ౧ పౌండునకు ౪ షిల్లింగులకు తయారుచేయు మార్గమునుకూడ కనిపెట్టెను. ౧౮౮౬ సంవత్సరమున కాస్ట్నరను నతడు సోడియమును ౧ పౌండు ఒకషిలింగునకే తయారు చేయు మార్గమును కనిపెట్టి అల్యూమినియమును ఇంకను చవుకగా నుత్పత్తిచేయకలిగెను. అయినను అప్పటికి అల్యూమినియపు ధర పౌండు ౧కి ౨౦ షిల్లింగులు. ౧౬ షిల్లింగులకు తక్కువగా అమ్ముటకు సాధ్యపడక పోయినది. ౧౮౮౧ వ సంవత్సరమున విద్యుచ్ఛక్తి (Electricity) మూలమున పౌండు ౧కి ౪ షిల్లింగుల వెలకు అమ్మనటుల సాధ్య మాయెను. ఈ విద్యుచ్ఛక్తి మార్గమున అల్యూమినియమును ఉత్పత్తిచేయు పద్ధతికి ౧౮౮౬-౮౭ సంవత్సరముల అమెరికాలో హాలు అను నతడును, ఇంగ్లాండు ఫ్రాంసుదేశములలో హేరోల్టు అనునతడును పేటెంటు పొందిరి. అల్యూమినియము బహు తేలికయైన లోహము. బలములో ఇతరలోహములకు వెనుకతీయునది కాదు. .౦౦౦౦౨౫ అంగుళపు పలచని రేకులుగను, .౦౦౪ అంగుళపు సన్నని తీగెలుగను చేయతగినంత బలమును, మృదుత్వమును కలది యగుటచే లోహపు తేలిక రేకుల నుపయోగపరచవలసిన ముఖ్యమైన పనులలో ఈ లోహమును ఎరివిగా నుపయోగించెదరు. ఓడలను కట్టుట యందును మోటారు బండ్లు చేయుటయందును అల్యూమినియపు రేకులు చాల ఉపయోగములో నున్నవి. యుద్ధము ప్రారంభ మయినప్పటి నుండియు, విమానములకును, టార్పిడో బోట్లకును ఈ ధాతువును ఉపయోగించుచున్నారు. విద్యుచ్ఛక్తిని వ్యాపింపఁ జేయుటయందును దీని ఉపయోగ మెక్కువగా నున్నది. ఏలయన ౦.౧౨౬ అంగుళపు సన్నని అల్యూమినియముతీగె ౦.౧౦౦ అంగుళపు సన్నని రాగితీగె చేయు పనిని చేయుటయేగాక రాగితీగె ౧౬౨ పౌండ్లు భారము కాగా, అల్యూమినియము తీగె ౭౫ పౌండ్లభారము కలది యగుటచే ఎక్కువధరకల రాగికన్నను అల్యూమినియము లాభకారి యయినది. కర్మాగారములయందును యంత్రములు చేయుచోట్లను ఇనుమును ఉక్కును శుద్ధిచేయుటయందు అల్యూమినియము ఎక్కువగా వాడఁబడుచున్నది. సామాన్యముగా సర్వజనోపయోగకరమగు గృహోపకరణములగు పాత్ర సామగ్రుల చేయుటయందు ఎక్కువగా ఉపయోగ పడుచున్నది. కళాయిచేయని రాగి, ఇత్తడిపాత్రలు చిలుమూరుటచే అనారోగ్యమైన వైనందునను తగరము త్వరగా త్రుప్పుపట్టును దగుటచేతను అల్యూమినియమున కీ లోపము లేవియు లేని కారణముచేతను తేలికగుణ మొకటి అధికమయినందువల్లను ఎక్కువగా వాడుక లోనికి రాఁగలిగినది. మనదేశములో నింతమించుగ ౧౫ సంవత్సరముల కిటీవల అల్యూమినియము పాత్రలు ధారాళముగా వాడఁబడుచున్నవి. అయితే ప్రకృతము ఐరోపా దేశములో జరుగుచుండు మహా సంగ్రామవశమున అల్యూమినియమును ఉత్పత్తిచేయు కర్మాగారము లితరవ్యాపారములయందు ఉపయోగ పెట్టబడియుండుటచే ఈ దేశమునకు తత్కాల మీ లోహము దిగుమతికాకుండ నున్నది. అందువలన ఈ లోహపుపాత్ర లిప్పుడు చేయుట లేదు. ధరలు మిక్కిలి ఎక్కువ అయియున్నది. ఈ లోహమును విశేషముగా కలిగియుండు క్రయొలైటి కియోలి నను బంకమన్ను బాక్సైటను మతియొక విధమైన వస్తువు ఈ యిండియా దేశములో విశేషముగా దొరకుచున్నది. వీని నుండి అల్యూమినియమును విడతీయుపద్ధతిని స్వదేశస్థులు నేర్చుకొని పాటుపడినయెడల ఈ దేశమునకు మహోపకారము చేసినవారగుదురు.

[నే. ప.

## అల్యూషియనుదీవులు.

అమెరికాఖండపు వాయవ్యమూలనుండు అలాస్కాకును ఆసియాఖండపు నీశాన్యమున నుండు కామశ్చాట్కాకును మధ్యగల సముద్రమున ౧౫౦౦ మైళ్లు విస్తీర్ణమున వెదఁజల్లఁబడియుండు చిన్న దీవుల గుంపు. ఇవి సంఖ్యకు రమారమి ౧౫౦ కలవు. వీనిలో నొక్కటైనను సారవంత మయినది కాదు. అన్నియు గుట్టలతోను తిప్పలతోను నిండియున్నవి. వీనిలోఁ గొన్ని అగ్నిపర్వతముల ముఖములు. ఈ దీవులలో శైత్యము విపరీతము. ఎస్కిమోజాతికిఁ జేరిన అల్యూటులను తెగవారు ఈ దీవుల ప్రజలు. వా రిప్పుడు క్రైస్తవమత పుచ్చుకొని నారు. జనసంఖ్య ౨౦౦౦. తిమింగలములను చేపలను బట్టుట ఈ దీవులలో ముఖ్యవృత్తి.

**అల్లన్మియో.** (గ్రామము) బర్మా, తేయట్ మియో జిల్లాలోని మైయుడ్ సబ్ డివిజన్‌కు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౧౦౨౦౭. ఇది వర్తక స్థలము. ఇది ఆదేశమందలి ప్రత్తివర్తకమునకు ముఖ్య స్థలము.

**అల్లమ ప్రభువు.** లింగాయత మతమును స్థాపించిన బసవేశ్వరునకు సమకాలికుఁడైన జంగమ గురువు. ఇతనికి వీరశైవసంప్రదాయమునందు మిక్కిలి గౌరవము కలదు. బసవేశ్వరుఁడుగూడ నతనిని గురువుగ నెంచుచుండెను. ఈతఁడు శివుని యవతార మనియు, మహాయోగియనియు, ఈతని జయించుటకై మాయ ఎన్నియో యుపాయములఁ జేసెను గాని గెలువలేక పోయెననియు, చివరకు భక్తిచే గెలిచెననియు, ఈతఁ డెన్నియో మాహాత్మ్యంబులఁ జూపెననియుఁ జెప్పుదురు. ప్రభులింగలీలయను గ్రంథమునందు నతని లీలలు వర్ణింపఁబడినవి.

**అల్లమ ప్రభు శతకము.** దెందులూరి పద్మనాభకృతము. అల్లమప్రభు స్తోత్రము. ఇందు భక్తిరసము కడుంగడు. భాషాలోపములు మెండు. భావ అటనట గ్రామ్యము.

**అల్లమరాజు బాపయ.** ఇతఁ డల్లమరాజు కవుల కందఱకుఁ బూర్వుఁడు. ఆరామ ద్రావిడ బ్రాహ్మణుఁడు. ఈతనిది హారితసగోత్రము; ఆపస్తంబసూత్రము. ఈతఁడు "గౌతమీమాహాత్మ్యము" అను ౨౯ ఆశ్వాసముల కావ్యము నొకదానిని రచించెను. వెంకటేశ్వరుల కంకితము చేసెను. ఈతని మునిమనుమఁడైన రామకృష్ణకవి క్రీ. శ. ౧౫౩౯ లో నుండెఁ గావున, నీతఁడు క్రీ. శ. ౧౬౩౯ ప్రాంతమున నుండెనని మన మూహింపవచ్చును. ఈయన కావ్యము నిర్దుష్టము కాదు. ఈ క్రింది వంశవృక్షము వలన ఈ వంశ మందలి కవులకుఁ గల సంబంధము తెలియఁగలదు.

బాపన్న
(గౌతమీమాహాత్మ్య కర్త)
|
ఎల్లన్న
|
రంగధాముఁడు
(నారాయణాచలమాహాత్మ్య కర్త)
|
├── రామకృష్ణ కవి (ఈ శబ్దము చూఁడు)
└── సుబ్రహ్మణ్యకవి (చూఁడు) (౧౫౭౨ లో మరణించె)
    |
    రంగశాయి కవి (జీవించియున్నాఁడు) *

**అల్లమరాజు రంగధాముఁడు.** నారాయణాచలమాహాత్మ్యమును వ్రాసెను. తన పోషకుఁ డగు చినబాప భూపాలునకుఁ గృతియిచ్చెను. ఇది మూఁడాశ్వాసముల గ్రంథము.

ఇతఁడు విజయనగర ప్రభువగు నారాయణ గజపతిగారిపై ౮ అర్థముల చాటుపద్యము వ్రాసెనఁట! ద్రోణాచార్యుల వలె సాము గరడీలు స్వయముగఁ జేయుచు వింజరములోఁ గొందఱు క్షత్రియుల కా విద్యలు కొంతకాల ముపదేశించుచు గురువుగా నుండెను. ఇతఁ డరువది సంవత్సరముల ప్రాయమున నిప్పటి కరువది డెబ్బది సంవత్సరముల క్రితము మరణించెనని తద్వంశకులు చెప్పుచున్నారు.

**అల్లమ రాజు రామకృష్ణ, సుబ్రహ్మణ్య కవులు.** వీ రిరువురును అన్నదమ్ములు. పందొమ్మిదవ శతాబ్దమున నున్నవారు. గోదావరీ మండలమున పిఠాపుర సమీపమున నుండు చేబ్రోలు గ్రామవాస్తవ్యులు; ఆరామ ద్రావిడ బ్రాహ్మణులు; హారితసగోత్రులు; రంగధామార్యపుత్రులు. ఇరువురును అనేకగ్రంథముల రచించినవారు. పెద్దవాఁ డగు రామకృష్ణకవి మాడ్గుల కృష్ణభూపతిని

* అల్లమరాజు కవులను గురించిన విశేషములు చూచి మా మిత్రులగు శ్రీ వంగూరి సుబ్బారావుగారి వలనఁ దెలిసినవి. వారికిఁ గృతజ్ఞులము.

దర్శించెను. కవిచకోరచంద్రోదయము, వైనతేయ విజయము, సత్యభామావిలాసము, గౌతమీమాహాత్మ్యము, ద్రౌపదీపరిణయము, సుశోభావివాహము, హనుమదాఖ్యానము, సుకవిజనమనోరంజనము, మదాలసాపరిణయము, శంతనువిలాసము, అధ్యాత్మరామాయణము, అచ్చతెలుఁగు భాగవతము, రామకృష్ణీయ మను ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానమును రచించెను. కవిచకోరచంద్రోదయమును దాక్షారామ భీమేశ్వరునకు క్రీ. శ. ౧౮౩౧ వ సంవత్సరమునఁ గృతియిచ్చెను. రామకృష్ణీయమును క్రీ. శ. ౧౮౪౧ వ సంవత్సరమున ముగించెను.

రెండవవాఁడగు సుబ్రహ్మణ్యకవి మాడ్గుల కృష్ణభూపతి కంకితముగ ప్రత్యక్షరశ్లేషపద్యాలిని, యెనుముల రామనదొరను మెప్పింప మణిధ్వజచరిత్రమును, భద్రాపరిణయమును, ఆత్మబోధమును, శేషధర్మేతిహాసమును, శ్రీ కృష్ణకల్యాణమును రచించెను. భద్రాపరిణయము అను కావ్యము ప్రస్తుతపుఁ బిఠాపురాధీశుల తండ్రియైన శ్రీగంగాధర రామారావుగారికి నంకితము చేసెను. ముకుందవిలాసము అను కావ్యమును దొంగిలించి ఈకవి దానికి ఈ పేరు పెట్టెను. స్వతంత్రకావ్యము కాదు. శ్రీకృష్ణకల్యాణ మను గ్రంథము బచ్చు రామేశ మనం బడు వైశ్యున కంకితము సేయఁబడినది. ఇవిగాక 'సుబ్రహ్మణ్య ఫక్కి' యను సంస్కృత వ్యాకరణమును, సింహాద్రిరామాధిప, పాపయమంత్రి, కృష్ణభూపాల శతకములు వ్రాసెను.

ఈ సుబ్రహ్మణ్యకవి కవిత్వమును ఈతని యన్న రామకృష్ణకవికవిత్వమును రెండును గతానుగతికముగను, నిస్సారముగను, కష్టపడి వ్రాసినట్టును ఉండును. గ్రంథచౌర్యమును కొంత కలదు అని తద్‌జ్ఞుల అభిప్రాయము. సుబ్రహ్మణ్యకవి ౧౮౫౨ లో మరణించెను. రామకృష్ణకవి యంతకుఁ బూర్వమే గతించెను.

**అల్లము.** ఇది అరటి కుటుంబములోనిది. భూమిలోపల దుంపవలె పెరుగు భాగమే దీని ప్రకాండము. నిజమైన వేళ్లు ఆప్రకాండమునుండి క్రిందికి దిగును. అరటిచెట్టునందువలెనే దాని యాకులు తొడిమలన్నియు దట్టముగ చేరి మ్రానుగా నేర్పడుచున్నది. దీనిని హిందూదేశము నంతటను సాగుచేయుచున్నారు. ఎఱ్ఱమట్టి నేలలో నేపుగా పెరుగును. వర్షాకాలమునందు దున్నిన పొలములో చిన్నచిన్న గోతులు తీసి ఎరువు వేసి అల్లము ముక్కలు నాటెదరు. మొక్కలు పెద్దవి కాకపూర్వమే విస్తారముగ వర్షము కురిసి నీళ్లు నిలిచినయెడల అల్లము కుళ్లిపోవును. ఏడు ఎనిమిది నెలల నాటికి దుంపలు త్రవ్వుటకు వీలుండును. అల్లమునుండియే సొంటిని చేయుదురు. అల్లము ముక్కలను నీళ్లలో నానపెట్టి మట్టిని కడిగివేసి గోనెగుడ్డమీద పెట్టి పొట్టును రాసివేసి ఎండలో నెండ నిచ్చిన సొంటి యగును.

సువాసన నిమిత్తమై కూరలలో వేయుదురు.

**ఉపయోగములు** మందులకు అనుపానముగను సువాసన యిచ్చుటకును ఉపయోగింతురు. ఒకవిధమైన సారాయియు వస్తువును దీని నుండి చేయుదురు. "అగ్నిదీపనమును చేయును. శుక్రవృద్ధికారి. మలమును బంధించును. హృదయమునకు హితకరమైనది. కడుపునొప్పి తగ్గించును. రుచిగా, లఘువుగా, మధురపాకము కలదిగా, స్నిగ్ధముగ, ఉష్ణముగా నుండును. కఫవాతములను హరించును." (వాగ్భటసూత్ర ౬ అ ౧౬౧-౧౬౨) కడుపునొప్పి తగ్గించుటకై విరేచనకరము లగు మందులయందును మలమును బంధించు శక్తిగల దగుటచేత అతిసారము నందును దీనిని ఉపయోగింతురు.

మనదేశమునుండి అల్లము సొంటి ఇతరదేశములకు నెగుమతి యగుచున్నది. మనము ఎగుమతిచేసిన అల్లము పంచదారపాకముతోను తేనెతోను కలిసి అల్లముమురబ్బాగా మనదేశమునకు దిగుమతి యగుచున్నది.

**అల్లసాని పెద్దన.** ఆంధ్ర మహాకవి. "మనుచరిత్రము" అనఁబడు తెనుఁగు ప్రబంధమునకుఁ గర్త. కృష్ణదేవరాయల యాస్థానకవీశ్వరుఁడు. మనుచరిత్రమందలి గద్యవలన నీతఁడు నందవరీకనియోగి యనియు, అల్లసాని చొక్కయ పుత్త్రుఁడనియు, శఠకోప తాపసుని వలనఁ జతుర్విధ కవిత్వము

చేర్చిన వా డనియు, ఆంధ్రకవితా పితామహుఁ
డన్న బిరుదు కలవాఁడనియుఁ దెలియు చున్నది.
ఈతఁడు ఋగ్వేది, ఆశ్వలాయన సూత్రుఁడు, వశిష్ఠగో
త్రుఁడు అని యీతనిచే స్థాపింపఁబడిన అన్నూరి శాసన
మువలనఁ దెలియుచున్నది.[1] హనుమచ్చరిత్రగద్యలో ఈ కవి
పేరు 'పెద్దనార్య' యనియు, ఈతనితండ్రిపేరు 'చొక్క
యామాత్యుఁ' డనియు నున్నది. పైని ఉదాహరించిన
శాసనమునందు "చొక్కరాజుగారి పుత్రులయిన......
పెద్దిరాజుగారు" అని యున్నది. ఇంకొక శాసనమునందు
"ఆళసాని చొక్కరాజుగారి కొమారుఁడు పెద్దయ్యం
గారు" అని యున్నది.[2]

బళ్లారిప్రాంతమందలి దూపాడుపరగణాలోని దో
రాలయను గ్రామ మీకవి యొక్క
వేశము జన్మస్థలమని పరంపరగ వచ్చుచున్నది.[3]
కడపజిల్లాలోనున్న కోకటమను గ్రామ
ముకృష్ణరాయ లీకవికి సగ్రహారముగ నిచ్చెనని, పెద్దన
యాగ్రామమందలి సకలేశ్వరలింగమునకు నిచ్చిన భూ
దానశాసనము వలనఁ దెలియుచున్నది.[2] "కృష్ణదేవ
మహారాయరు మాకున్న ఘండికోట సీమలోను వుంబ
లికిన్ని పాలించినవధరించిన కోకటగ్రామమందును..:"
అని శాసనమందు నున్నది. "ఉంబలి" అనగా పన్నులే
కుండ నిచ్చిన గ్రామమని యర్థము. "కోకటగ్రామాద్య
నేకాగ్రహారము లడిగిన సీమలయందు నిచ్చె"నన్న పెద్ద
న చాటువును ఈ విషయమునే ధృవపఱుచు చున్నది.
కోకటముకైఫీయతులో నిట్లున్నది: "అల్లసాని పెద్దయ్య
గారు బ్రాహ్మణుడు, నందవరీకుడు, చొక్కరాజు
గారి కొమారుడు. కోకటగ్రామము శ్రీ కృష్ణదేవరాయ
లవా రీ కవీశ్వరుని కియ్యగా అతడు వైష్ణవము పుచ్చు
కొని ఈగ్రామము శ్రీవైష్ణవులకగ్రహారముచేసియిచ్చెను.
అప్పుడు దానికి బెట్టిన కొత్తపేరు శఠగోపపురము"
శాసనములఁబట్టి చూడ నీ యగ్రహారములోఁ గొంత
భూమి శివకేశవదేవాలయములకుఁ బెద్దన దాన మిచ్చి
నట్లు కానవచ్చుచున్నదే గాని గ్రామమంతయు దాన
ముచేసినట్లు కానరాదు. ఈ శాసనము వేయించినతరు
వాత గ్రామమంతయు దానముచేసినఁ జేసి యుండ
నోపు. కాని అట్టిశాసన మింకను కానరాలేదు. ఈ
గ్రామమునకు పినాకినీనదినుండి యొక కాలువ తేఁబడి
నది. "ఈకాలువ పూర్వం అల్లసాని పెద్దన కవీశ్వరుడు
బ్రాహ్మణులకు అగ్రహారంచేసి యిచ్చినప్పుడు త్రవ్వం
చినాడు."[1] దక్షిణఆర్కాట్ జిల్లా విల్లిపురం తాలూ
కాలోని అన్నియూర్ అను పల్లెలో నీ కవియొక్క
శాసన మొకటి యిటీవల దొరికినది. అందుఁ బెద్దన
అన్నూరిగ్రామములో వరదరాజపెరుమాళ్ల దేవాలయము
కట్టించి దానికి భూదాన మిచ్చినట్లు చెప్పఁబడుటయే
గాక "అన్నూరు" కఠవాచిసీమలోనిది అయినట్టును
చెప్పఁబడినది. "ఆంధ్ర కవితాపితామహు లయిన పెద్ది
రాజుగారు శ్రీకృష్ణదేవమహారాయలు తమకు నా
యంకరానకు పాలించిన కఠివాచిసీమలోని అఁన్నూరి
గ్రామమునందు..." అని శాసనమందలి పదములు.
నాయఁకుఁడు = అధిపతి. నాయఁకరము = నాయ
కత్వము అని శబ్దరత్నాకరము. దీనిబట్టి చూడఁ బెద్దన
కఠివాచిసీమకు నధికారిగ, నాయఁకుఁడుగ నుండె నని
తెలియుచున్నది. ఒకసీమ కధికారియన్న నిప్పటి కలె
క్టరు అధికారముతోఁ బోల్పఁదగిన యధికారమని చెప్ప
వచ్చును. ఇట్లు పెద్దనపుట్టినది బళ్లారిజిల్లాలో, అగ్ర
హారము సంపాదించుకొనినది కడపజిల్లాలో, ఉద్యో
గము చేసినది దక్షిణఆర్కాటుజిల్లాలో.

పెద్దన కృష్ణదేవరాయలతో సమకాలీనుఁడు.
రాయలు క్రి. శ. ౧౫౦౯ మొదలు
కాలము ౧౫౩౦ వఱకు రాజ్యము చేసినట్లు
శాసనములవలన స్థిరపడినది. కావున
నీ కవియు నాకాలమున నుండెనని చెప్పవలెను. అయి
నను ఈతని కాల మింతకు సూక్ష్మముగను స్వతంత్రము
గను నిర్ణయించుటకు వీలు కలదేమో చూతము. పెద్ద
నచే స్వయముగఁ జెక్కింపఁబడిన భూదానశాసనము
లిదివఱకు మూడు దొరకినవి. రెండు కోకటగ్రామము
లోనివి; ఒకటి అన్నూరుగ్రామములోనిది. కోకట

1. Epigrapical Reports, Southern Circle No 623 of 1915. 2. Local Records Vol X p 100 కోకటగ్రామ కైఫీయతు. 3. Kavali Ramaswamy's Deccan Poets.

1 Local Records కోకటమ కైఫీయతు p 108.

గ్రామములోనిది యొకటి సకలనాథలింగమున కిచ్చినది శా. శ. ౧౪౭౦ బహుధాన్యసంవత్సర వైశాఖ శు ౧౫ ల (౨౫ వ ఏప్రిల్ ౧౫౧౮) నాటిది; రెండవది చెన్న కేశవునకు నిచ్చినది శా. శ ౧౪౭౦ కార్తీక బ. ౧౨ (౩౧-వ అక్టోబరు ౧౫౧౮) నాటిది. అన్నూరు గ్రామములోని శాసనము శా. శ. ౧౪౪౨ ప్రమాది సం॥ కార్తీక శు॥ ౧౫ (౬ వ నవెంబరు ౧౫౧౯) నాటిది. కావున నీకవి క్రీ. శ. ౧౫౧౮ నాటికే కోకటమును అగ్రహారముగ వడసినట్లు నిశ్చయింపవచ్చును. కోకటము మొదటిశాసనములో నింకొక విశేషము గలదు. అది కోకటము దేవాలయమునందుఁ జెక్కఁబడినను అందలి దానము మాత్రము బెజవాడలోఁ గృష్ణాతీరమున మల్లిఖార్జునస్వామి సన్నిధిని ఈయఁబడినది. అనగా శా. శ. ౧౪౪౦ వైశాఖ శు॥ ౧౫ చంద్రగ్రహణ కాలమున పెద్దన బెజవాడలో నుండెను. కృష్ణదేవరాయుఁడు కూడ నా కాలమున నచ్చట నుండెననియు; అతనితో

నాతని సేనానులు కూడ బెజవాడ వెళ్లియుండిరనియు మన మూహింపవచ్చును. దీనికి ననుగుణముగ నిదె తేదిన గృష్ణరాయని మఱియొక సేనానియైన శ్రీమన్మహామండలేశ్వర సింగయ్య యను నాతఁడు కనకదుర్గ కు నిచ్చిన భూదానశాసన మొకటి బెజవాడకనకదుర్గగుడిలోఁ గలదు.* కావున నీ వీరులందఱును గృష్ణరాయునితో నచ్చటఁ గూడియుండిరని యూహించు

(౧) కోకటము ౧-వ శాసనము :—"శుభమస్తు. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వరుషంబులు ౧౪౪౦ అగు నేటి బహుధాన్యనామ సంవత్సర వైశాఖ శు॥ ౧౫ లు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ కృష్ణదేవ మహారాయరు పృథివి రాజ్యంచేయుచుండగాను అళసాని చొక్కరాజుగారి కొమారుడు పెద్దయ్యంగారు కోకటం సకలనాథుని లింగానకు ఇచ్చిన భూదాన ధర్మశాసనము. శ్రీ కృష్ణదేవరాయ మహారాయరు మాకున్ను ఘండికోట శీమలోనువుంబలికిన్ని పాలించి నవధరించినకోకటగ్రామమందును సకలేశ్వరదేవుని నైవేద్యానకున్ను దీపారాధనకున్ను గాను ముమ్మడ్డాజుకుంటకు దక్షిణం కాంచి మట్టస్తళానకు నైరుతిమూలను, వాంగుకు వుత్తరాన ఖ ౧॥౦ న్ను ఆ దక్షిణం చాకంవారి ఖుంటకు వుత్తరం ఖు॥న్ను వుభయం చేను ఖ ౨-కి నైవేద్యానకు సమర్పించిన చేను ఖ ౧ దేవుని సన్నిధిని నం ౨-దీపాలు ౨-కిన్ని సమర్పించినచేను ఖ ౧ వుభయం చేను ఖ ౨ యీ యిరుపుట్టి చేనున్ను సర్వమాన్యంగాను కృష్ణాతీరమందునను బెజవాడ మల్లిఖార్జునదేవుని సన్నిధిని సోమగ్రహణ పుణ్యకాలమందున సహిరణ్యోదక దానధారా పూర్వకం గాను ధారవోసి యిస్తిమి. ఆచంద్రార్కస్థాయిగాను అనుభవించేది. యీ ధర్మానకు యెవ్వరు రెండు

* కోకటమునందలి శిలాశాసనముల నకళ్లు చెన్నపురి, గవర్న మెంటు మ్యాన్యుస్క్రిప్టు లైబ్రరీలోని లోకల్ రికార్డ్సు, ౧౦ వ వాల్యూంలో కోకటము కైఫీయతు అనుదానిలో నీయఁబడినవి. ఈ కైఫీయతులన్నియు ౧౮౦౨ వ ప్రాంతమున ననగా నేటికి నూఱేండ్ల కుఁ బూర్వము కర్నల్ మెకంజీచేతను, ఆతనికి సహాయుఁడు (Assistant) గా నున్న కావలి వెంకటబొర్రయ్యచేతను ఆయాగ్రామాదుల కరణములవద్దనుండి సంపాదింపఁబడినవి. ఇవి శాసనములు చూచి అప్పుడు వ్రాసికొనిన నకళ్లు. ఇప్పటి ఎపిగ్రాఫికల్ డిపార్టుమెంటువారికి నీ శాసనము లింకను దొరకలేదు. రాబర్టు సూయల్ ౧౮౭౨ లో కోకటము శాసనములను గుఱించి విచారించినపు డచ్చటి శాసనములు చదువుటకు వీలులేనిస్థితిలో నుండెను (Sewell's Antiquities Vol. 1 p. 123). కావున వీనిని చరిత్రకు నాధారముగఁ దీసికొనఁగూడ దని శ్రీకృష్ణశాస్త్రి (అసిస్టెంటు ఎపిగ్రాఫిస్టు) గారి యభిప్రాయము. కాని యిట్టి యసత్యపు శాసనముఁ బుట్టించుటలో నెవ్వరికిని ప్రయోజనము లేనందున, నిది నిజమైన నకలే యని మన మూహింపవచ్చును. అన్నూరుశాసనము ఎపిగ్రాఫిస్టు డిపార్టుమెంటువారు సంపాదించినది. దీనికి No. 623 of appendix B, Stone inscriptions Copied in 1915 అని వారిగుర్తు. ఇది యింకను అచ్చుపడ లేదు. దీని నకలు నా కిచ్చినందులకు శ్రీకృష్ణశాస్త్రిగారికి వందనములు. పెద్దన చరిత్రమునకును, ఆకాలపుఁ జరిత్రమునకును ఈ శాసనము లుపయోగకరములు గనుక వీని లోని గావలసినంతభాగ మీ క్రిందనిచ్చెదను:—

టకు వీలు గలదు. రాయలు కళింగముమీదికి రెండుసారులు దండయాత్ర వెళ్లినట్లు కానవచ్చుచున్నది. సింహాచలమునందు కృష్ణరాయఁడు శా. శ. ౧౪౩౭ (క్రీ. శ. ౧౫౧౬) ధాత చైత్ర బ ॥ ౧౨ దినమున నొక శాసనమును,[1] శా. శ. ౧౪౪౧ ప్రమాది శ్రావణ శు॥౧౩ (క్రీ. శ, ౧౫౧౯) నా శ్లోకశాసనమును[2] వేయించెను. అందువలన మొదట సింహాద్రివఱకు దిగ్విజయము చేసి వచ్చినట్లును, రెండవసారి కటకమువఱకు వెళ్లివచ్చినట్లును కానవచ్చుచున్నది. ఈరెండు కలింగదిగ్విజయములకు

నడుమ నున్న కాలమునఁ గృష్ణరాయఁడు బెజవాడ మకాములోఁ దన సైన్యశిబిరము కొంత నిల్వ యుంచినట్లును, తానును తన నాయకులును అటునుండి యిటు, ఇటునుండి అటు వచ్చి వెళ్లుచున్నట్టును కానవచ్చెడిని. కళింగ దిగ్విజయయాత్రలోఁ బెద్దనాదికవులు రాయల వెంట నుండి రని కుమారధూర్జటికావ్యమునందుఁ జెప్పఁబడినది. కటక దిగ్విజయమునకుఁ బూర్వము పారిజాతాపహరణమును, ద్వితీయ కళింగదిగ్విజయానంతరమున మనుచరిత్రమును వ్రాయఁబడినట్లు కానవచ్చుచున్నది. ఈరెండు కావ్యములలోని యీ క్రిందిపద్యములఁ జూడ నగును:—

తే. గీ. బలనికాయము కాలిమ*ట్టుల నడంచుఁ
 గటకమును నింక ననుచు ను*త్కలమహీశుఁ
 డనుదినమ్మును వెఱచు నె*వ్వనికి నతఁడు
 రాజమాత్రుండె శ్రీకృష్ణ*రాయవిభుఁడు.
 [పారి. ౧. ౨౩.

మాడెములు వ్రేల్చె నొడ్డాది * మసి యొనర్చెఁ
 గటకపురి కాల్చె గజరాజు * గలఁగి పఱవఁ
 [మను. ౧. ౩౭.

అస్తోకోత్కల రాట్పురీ హరణ
 [మను. ౨. ౭౯.

కావున "మనుచరిత్రము" శా. శ. ౧౪౪౧ (క్రీ. శ. ౧౫౧౯) తరువాత వ్రాయఁబడియుండును. శా.

తలంచినారు తమ తల్లి తండ్రులను గో బ్రాహ్మణులను గంగాతీరమందున వధించినపాపాన బోవువారు."

(౨) కోకటము ౨-వ శాసనము. దీని పూర్తియైన నకలు లేదు. ఈ క్రిందివిధముగ నున్నది. "ఈ శక సంవత్సరములో యీ కవీశ్వరుఁడే కార్తీక బ॥ ౧౨ లు కోకటను చెన్న కేశవ పెరుమాళ్లకు అల్లసాని చొక్కయ్యంగారి పుత్రుండు పెద్దయ్యంగారు యిచ్చిన భూదాన ధర్మశాసనక్రమ మెట్లన్నను- 'కృష్ణదేవరాయలు ఘుండికోట సీమలోను, మాకు వుంబలిగా నీయ నవధరించిన కోకటా నను దేవుని నైవేద్యమునకును, దీపారాధనకును మేము ఉత్థానద్వాదశి పుణ్యకాలమందు సమర్పించిన చొచర్మంచేను ఖర' అని వ్రాసియున్నది."

(3) అన్నూరుశాసనము. "స్వస్తి శ్రీమన్ రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ కృష్ణదేవరాయ మహారాయలు పృథ్వీసామ్రాజ్యము నేయుచుండగాను స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వ ౧౪౪౨ అగు నేటి ప్రమాదిసంవత్సర కార్తీక శు ౧౫ భా సోమోపరాగ పుణ్యకాలమందు శ్రీమ [తు] వసిష్ఠ గోత్రం ఆశ్వలాయ [న] సూత్రం ఋక్ శాఖాధ్యాయులయిన అల్లసాని చొక్కరాజుగారి పుత్రులయిన ఆంధ్రకవితాపితామహు లయిన పెద్దిరాజుగారు శ్రీ కృష్ణ మహాదేవరాయలు తమకు నాయంకరానకు పాలించిన కఱివాచి సీమలోని అన్నూరి గ్రామమందు [కృ] త [ం] నాగరాజువారు కటించి నిలువవద్ద వరదరాజ పెరుమాళ్లు నగరు కడుమాను కట్టించి వరదరాజ పెరుమా [ళ్లు] ను సాచి [మా] ర్లను ప్రతిష్ఠ చేయించి ఆ పెరుమాళ్లకు అంగరంగ వైభవాలకును అమృతపడి

ద్యాలకును దీపారాధనకును గాను సమర్పించిన భూదాన ధర్మశాసనక్రమ మెట్లన్నను మాకు నాయింకరానకు చెల్లే కఱివాచిసీమలోని అన్నూరి గ్రామమందు ..........................వరదరాజ పురమున్ను అష్టభోగ. తేజస్వామ్య సహితముగాను సహిరణ్యోదక దాన పూర్వకముగాను ఈ సోమోపరాగ పుణ్యకాల మందు త్రివాచకముగాను సమర్పిస్తిమి............"

* Epigraphical Reports, S. Circle 329 of 1892.

1 Epi. R. No. 244 & 245 of 1899. ఈరెండుశాసనముల నకళ్లను గురుఁగాడ శ్రీరామమూర్తి గారి కవిజీవితములో నీయఁబడినవి.

2 Epi. R. 244 of 1899.

శ. ౧౪౪౦ లో నిచ్చిన కోకటముశాసనమునందు 'ఆంధ్రకవితాపితామహ' అను బిరుదులేదు. శా. శ. ౧౪౪౨ లో నిచ్చిన అన్నూరి శాసనమందు నీ బిరుద ముదాహరింపఁబడినది. ఇట్టి గొప్పబిరుదు అదివఱకే యున్న యెడల పెద్దన దానిని కోకటము శాసనమునందుఁ దప్పక ఉదాహరించి యుండును. అందుచేఁ గృష్ణరాయఁడు కళింగదిగ్విజయయాత్ర పూర్తిచేసికొని వచ్చిన తరువాత ననగా శా. శ. ౧౪౪౧ ప్రాంతమున 'ఆంధ్రభాషాపితామహ' యను బిరుదు పెద్దన కిచ్చియుండును.

ఇఁకఁ బెద్దన కృష్ణరాయని నిధనకాలమువఱకు నలువది సంవత్సరముల కాలమువాఁడనియుఁ, దరువాతను ఆతఁడు, కొంతకాలము బ్రతికియుండెననియు నైతిహ్యము కలదు.[1] ఈ వార్తయే నిజమగు నేని, కృష్ణరాయఁడు క్రీ. శ. ౧౫౩౦ లో మృతినొందె నని యిప్పుడు సిద్ధాంతమగుటచేఁ బెద్దన క్రీ. శ. ౧౪౭౦ లో జన్మించి యుండవలెను. కావున కోకటము శాసనమువఱకు నాతనికి ౪౮ సంవత్సరములును, అన్నూరి శాసనమువఱకు ౫౦ సంవత్సరములును వయస్సుండును. మనుచరిత్రము రచించు కాలమున నాతఁడు ౫౦ సంవత్సరములవాఁడైనను అయియుండును. పెద్దన మొదట నరసింహరాయల యాస్థానమునందుఁ గవిగాఁ జేరెననియు, తరువాతఁ గృష్ణరాయనిచే గౌరవింపఁబడెననియు కావలి వెంకటరామస్వామి వ్రాసినాఁడు.

ఈ కవిచే రచింపఁబడినది "స్వారోచిష మనుచరిత్ర" మను కావ్య మొక్కటి మాత్ర మిప్పుడు కానవచ్చుచున్నది. ఈ కావ్యమును

కావ్యములు

గుఱించిన విమర్శనము "మను చరిత్ర" మను శీర్షికక్రింద సవిస్తరముగ వ్రాయఁబడును. ఆంధ్రమునందుఁ బ్రబంధశైలికి నిది మార్గదర్శి యైనదని చెప్పఁబడును. పారిజాతాపహరణ మింతకంటెఁ బూర్వము తిమ్మనచే వ్రాయఁబడెనని నా తాత్పర్యము. పెద్దనవంటి మహాకవి ఒక్కకావ్యము (౬౬౪ పద్యములు మాత్రము కలది) వ్రాసి యితరకావ్యము లేవియు

వ్రాయకుండ నుండునా యని సంశయము కలుగుచున్నది. లక్షణగ్రంథములలో "హరికథా సారము" అనునది యీతనిచే రచింపఁబడినట్లు చెప్పఁబడినది.[1] ఈతఁడు "రామస్తవరాజము", "అద్వైతసిద్ధాంతము" అను గ్రంథముల వ్రాసె ననియు, ఈ రెండవగ్రంథము వ్రాయునపు డాతనికి ౫౫ సంవత్సరముల వయస్సనియు కావలి వేంకటరామస్వామి వ్రాసియున్నాఁడు. కాని యీ గ్రంథము లేవియు నిప్పుడు కానవచ్చుట లేదు. కవిత్వ ముండవలసిన విధమును తెల్పుచు నీతనిచే రచింపఁబడినది యనఁబడు ఉత్పలమాలిక యొకటి 'పూఁతమెఱుంగులున్......." అనునది పరంపరగ వచ్చుచున్నది. కృష్ణరాయఁడు పోయినతరువాత నీతఁడు చెప్పిన "ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి" యను సీసపద్యమును పరంపరగ వచ్చుచున్నది. ఇవియు నింకఁ గొన్ని చాటువులును ఆంధ్రకవుల చరిత్రమునందును కవిజీవితములందును ఈయఁబడినవి.

ఇఁక నాముక్తమాల్యద యొక్క కర్తృత్వమును గుఱించి విచారింపవలసి యున్నది. ఇయ్యది కృష్ణరాయ రచితము కాదనియు, పెద్దనయే దానిని రచించె ననియు నొక ప్రవాదము కొంతకాలమునుండియు వచ్చుచున్నది. రాయల తరువాత ౧౨౫ సంవత్సరములకు నున్న అప్పకవి, కొంచెము తరువాతవాఁడయిన అహోబలపతియు నీ ప్రవాదమును నమ్మినవారు.[2] ఈ ప్రవాదము తప్ప ఆముక్తమాల్యద పెద్దనకృత మనుటకు మఱి యే యాధారమును లేదు. మనుచరిత్ర శైలికిని దీని శైలికిని ఏవిధమైన సంబంధమును కానరాదు. ఈ రెండు కావ్యములను ఒక్కఁడు వ్రాసెనని చెప్పుటకు నెంత మాత్రమును వీలు లేదు. ఇందును గుఱించి అధికము "ఆముక్తమాల్యద" శబ్దము క్రిందఁ జూడనగును.

పెద్దనకు శఠకోపయతి యను వైష్ణవుఁడు గురువుగా నుండినట్లు మనుచరిత్రవలనఁ దెలియుచున్నది. (౧. ౬.) ఇతఁ డుపదేశగురువా? విద్యాగురువా? గురువును వర్ణించిన పద్యమందు 'విద్యానిలయున్',

.1 Kavali Venkata Ramaswamy's Deccan Poets.

1. రంగరాట్ఛందస్సు చూఁడుము.

2. అప్పకవీయము ౧ ఆ. ౨౩౧-౩. అహోబలపండితీయముచూఁడుము.

అనియు, ఆశ్వాసాంత గద్యము నందుఁ దనను గుఱించి చెప్పుకొనుచు కవి 'శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధ కవితాప తల్లిక' అనియుఁ జెప్పెను. కావున శఠకోపయతి పెద్దనకు విద్యాగురువు అయినట్లు తోఁచుచున్నది. పెద్దన వైష్ణవము పుచ్చుకొని వీరవైష్ణవుం డయ్యెననియు, కోకటమునకు శఠకోప పుర మన్న పేరు పెట్టె ననియు దానిని వైష్ణవుల కిచ్చివేసె ననియు, కోకటము కైఫీయతులో వ్రాయఁబడి యున్నది. కాని పెద్దన శివకేశవులయెడ సమానభావము గల స్మార్తుఁడుగఁ గానవచ్చుచున్నాఁడు శివద్వేష్టయగు వీరవైష్ణవుఁడుగఁ గాన్పింపఁడు. కోకటమునందు నాతఁడు శివునకు భూదానముచేసెను, కేశవునకుఁ జేసెను. మనుచరిత్రపీఠికలో శివుని (౧. ౨.) విఘ్నేశ్వరుని (౧. ౪.) ప్రార్థించినాఁడు. ఇది వీరవైష్ణవులు చేయుపని కాదు. కావున నాఁటి వేల నియోగులలోఁ గొందఱు వైష్ణవులుగురువులుగాఁ గలిగి, నిలుగుబొట్టు పెట్టినను స్మార్తాచారమునే అన్నికర్మలయందును ఎట్లు ఆచరించెదరో అట్లెనిలుగుబొట్టు పెట్టు స్మార్తుఁడె పెద్దన యని తోఁచెడిని, [కొ. ల.

**అల్లా.** మహమ్మదీయుల దేవునికిఁ బేరు. ఇది అరబ్బీమాట. దీనికిఁ బూజింపఁదగినవాఁ డని యర్థము. మహమ్మదీపదము నిజమైనయీశ్వరుని సూచించునని నిర్ణయించినందున మహమ్మదీయులు దీనినే ఈశ్వరపరముగ నెక్కుడుభక్తితో వాడెదరు. వీరి ముఖ్యమంత్రములలో 'లా ఇలాహ ఇల్ అల్లాహ్' అనునది యొకటి. దీనికి 'అల్లా తప్ప మఱి వేఱు దైవము లేఁడు' అని యర్థము. 'నారాయణునికన్న వేఱు దైవము లేఁడు' అని మన వైష్ణవులు చెప్పుదురు గదా? అట్లె యిది. సంస్కృతమునందు "అల్లా" శబ్ద మొకటి, ఆకారాంతస్త్రీలింగము, కలదు. దానికి తల్లి యనియు, సర్వజ్ఞసర్వభక్షకరైన పరమాత్మదేవత యనియు రెం డర్థము లిచ్చి, ఆమె 'అల్లేల్లాత్యాద్యథర్వసూక్తమునందుఁ బ్రసిద్ధ' యని వాచస్పత్యమునందుఁ జెప్పఁబడినది. ఈసూక్తము బహుశః 'అల్లోపనిషత్తు' అనునదియే నై యుండును. ([illegible])

**అల్లాఉద్దీన్.** (ఖిల్జీ ౧౨౯౬ - ౧౩౧౬) ఢిల్లీచక్రవర్తి. ఈతఁడు "సికందర్ ఈసాని" అను బిరుదువహించెను. దీనికి ౨ వ అలెగ్జాండర్ అని అర్థము. ఈతఁడు ఖిల్జీవంశస్థాపకుఁ డైన జలాలుద్దీన్ ఫీరూజుషాహాఖిల్జీ అను బాదుషాకు తమ్ముని కుమారుఁడు; అల్లుఁడు. ఆతనిం జంపి రాజ్యమునకు వచ్చెను. ఈతఁడు రాజ్యమునకు రాకపూర్వ మీతఁడు ౧౨౯౩ లో దక్షిణమందలి దేవగిరికి మహారాష్ట్రరాజైన రామదేవరాజును జయించెను. ఈతఁడు జయపురరాజ్యములోని రతనభోర్ అను బలిష్ఠమైన దుర్గమును ౧౨౯౯ లోను, చితోడ్‌గడమును ౧౩౦౪ లోను జయించెను. తన సేనానియైన మాలిక్కాఫర్ అను వానిని దక్షిణదేశముపైకి దండు పంపెను. ౧౩౦౩ లో వానిని ఓరుగంటి ప్రతాపరుద్రుఁ డోడించెను. కాని వాఁడు మరల ౧౩౦౯ లో ఓరుగంటికిం బోయి ప్రతాపరుద్రు నోడించి యాతఁడు ఢిల్లీశ్వరునకుఁ గప్పము గట్టునట్లు చేసెను. ౧౩౧౦ లో ద్వారసముద్రపు బల్లాలరాజులను అంత . మొందించెను. అచ్చటినుండి కాఫరు రామేశ్వరమునకుం బోయెను. అచ్చట నతఁ డొక మసీదుం గట్టించెను. వాని నెదిరించువాఁడు లేఁడయ్యె! కాఫర్ ౧౩౧౨ లో దేవగిరిరాజును జంపి ఆ రాజ్యమంతయు ఢిల్లీరాజ్యములోఁ గలిపెను. కాశీక్షేత్రమునందు వేయి దేవాలయములకన్న నెక్కుడు పడఁగొట్టితి నని యాతఁడు గర్వముగఁ జెప్పుకొనెడివాఁడు. ఈతని కాలమున పెక్కు రాజమందిరములును, మసీదులును, విద్యాపీఠములును, కోటలును, స్నానగృహములును విశేషముగఁ గట్టింపంబడియె. అమీర్ ఖుస్రూష్వాజాహసన్ అను కవిపుంగవు లీతని ఆస్థానము నలంకరించిరి.

**అల్లాఉద్దీన్.** (గాంగో బహుమని ౨. ౧౪౩౫-౧౪౫౭) బహమనిసుల్తాను. అహమ్మదాబాద్ బీదర్‌లో పట్టాభిషిక్తుఁ డయ్యె. ఈతని తరువాత ఈతని కుమారుఁడైన హుమాయూన్ అను నాతఁడు [illegible]

## అల్లా ఉద్దీన్ మస్ ఉద్.

(౧౨౪౨-౧౨౪౬) ఢిల్లీసుల్తాను. ఆల్ తమష్‌యొక్క మనుమఁడు. సుల్తానారజియా తమ్ముఁడైన బహరామ్ అనువాని తరువాత నీతఁడు రాజ్యమునకువచ్చెను. ఈతని రాజ్యకాలమందు మొగలులు రెండు సారులు హిందూదేశముమీదికి దండెత్తివచ్చిరి. టిబ్బెతులోనుండి బంగాళాదేశమున కొక బందిపోటును, పశ్చిమపక్కన నుండి పంజాబున కొక బందిపోటును వచ్చియుండెను. ఈ రాజును పదచ్యుతిని జేసి నీతని పినతండ్రి యగు నాసిరుద్దీన్ మహామూద్ అను వాఁడు సుల్తానయ్యెను.

## అల్లాఉద్దీన్ సుల్తాను. (౧౪౪౬-౧౪౭౮)

ఢిల్లీసుల్తాను. సయ్యదువంశమునందలి చివరవాఁడు. ౧౪౫౧లో నీతఁడు ఢిల్లీలో లేనప్పుడు బహలోల్ లోదీ అనువాఁడు ఢిల్లీని స్వాధీనపఱుచుకొనెను. తర్వాత నీతఁడు ౧౪౭౮ వఱకు బదాన్ అనుచోట నుండెను. ఢిల్లీలో ౬ సంవత్సరముల వఱకు మాత్రము ప్రభుత్వము చేసెను. బదాన్‌లో చుట్టుపట్టు ప్రదేశముమీద ౨౭ సంవత్సరములవఱకు అధికారము చెల్లించుకొనెను.

## అల్లాఉద్దీన్ హాసన్. (౧౧౫౨-౧౧౫౬)

ఘూర్ దేశపు సుల్తాను. ఇతనికి జహాంసొస్ అన్న బిరుదుకలదు. ఈ పదమునకు ప్రపంచమును కాల్చువాఁడని యర్థము. ఈతని బావమఱఁది యైన బహరాంషాహా అనువాఁ డీతని యిద్దరు సోదరులను జంపి గజినీరాజ్యము నాక్రమించుకొనగ నీతఁ డాతని మీదికి దండెత్తి పోయి ఆతని నోడించి రాజ్య మాక్రమించుకొనెను (౧౧౫౨). ఆ గ్రామమందలి గొప్ప మందిరములను, శాసనములను ధ్వంసముచేసెను.

## అల్లాఉద్దీన్. (హాసన్‌గాఁగో బహమని ౧. ౧౩౪౭-౧౩౫౮)

దక్షిణ హిందూదేశమందలి బహమనిరాజ్యమును స్థాపించినవాఁడు. ఈతఁడు మొదట ఢిల్లీపట్టణములో గాంగో యను నొక బ్రాహ్మణునియొద్ద నొక సేవకుఁడుగ నుండెను. క్రమముగ ఢిల్లీశ్వరునియొక్క గొప్ప యధికారములను వడసెను. జాఫర్ ఖాన్ అనుపదవియు, దక్షిణమునం దొక జాగీరును సంపాదించెను. దౌలతాబాదులో నున్న ఢిల్లీశ్వరుని ప్రతినిధియు, పతి యితర రాజులును తిరగఁబడి స్వతంత్రులై అల్లాఉద్దీనునకు గుల్బర్గా (కలుబరిగి) పట్టణమున ౧౩౪౭ లో రాజ్యాభిషేకము చేసిరి. "ఈతఁడు మొదటఁ గపటముచే దక్షిణదేశములోని హిందూరాజులందఱును తనకు సహాయులగునట్లుచేసి వారి స్నేహము సాధించెను. ఇతఁడు హిందూమతద్వేషకాఁడు. కలబరిగి (గుల్బర్గా) పట్టణమును హాసనాబాదను పేరు బెట్టి తనరాజధానిగఁ జేసికొనెను. పదునొకొండు సంవత్సరములు రాజ్యము చేసి యితఁడు కాలధర్మము నొందెను. ఈ క్రొత్త రాజ్యము ముఖ్యముగ మహారాష్ట్రదేశములో వ్యాపించెను. దక్షిణమున కృష్ణానదియు, తూర్పున తెలుంగుదేశమును గోండువనమును, హద్దులుగా నుండెను." [మహమ్మదీయ మహాయుగము.]

## అల్లాఉద్దీన్ హిమాద్ షాహా.

(౧౫౧౩-౧౫౩౨) బహమనీ రాజ్యములోనుండి చీలిన హిమాద్‌షాహి అను రాజ్యమునకు ౨వ సుల్తాను. హిమాద్‌షాహి రాజులు బేరారులో రాజ్యముచేసిరి. ఇతఁడు గావిల్ గడమను గ్రామమును తన రాజధానిం జేసికొనెను. ఈ రాజులకును, నిజామ్‌షాహి రాజునకును వైరమువచ్చి ఇతఁడు ఖాన్‌దేశ్, గుజరాత్ దేశముల రాజుల సాయము వడసెను. అందుకు వారి కీతఁడు తన రాజ్యములోని కొన్ని గ్రామముల నిచ్చెను.

## అల్లాఉద్దీన్. (హుస్సేన్ షాహా ౧౪౯౩-౧౫౨౧)

బంగాళాదేశపు సుల్తాను ముజఫర్ షాహా అను వానిని గౌడ్ అను చోటనోడించి రాజ్యము నెక్కెను. ఈతని తరువాత నీతని కుమారుఁడైన నస్‌రత్ షాహా రాజయ్యె.

**అల్లారభూపతి సింహావిలాసము.** సౌందరి అమ్మ యను క్షత్రియనారీమణిచే రచింపఁబడిన అయిదాశ్వాసముల ప్రబంధము. ఇందు ముత్యాలసింహుని కూఁతురు కమలముఖికిని విజయసింహునకును జరిగిన వివాహము వర్ణింపఁబడినది. పెండ్లి ఎక్కువగా వర్ణింపఁబడినది.

**అల్లార్డిస్.** (అలెగ్జాండర్ ౧౮౪౬-౯౬) స్కాట్‌లండ్ దేశజుఁడు. ౧౮౭౮-౭౯ వఱకు కలకత్తాలోని "ఫ్రెండ్ ఆఫ్ ఇండియా" అను పత్రికకు ఉపసంపాదకుఁడుగ నుండెను. తరువాత కొంత కాలము సిలోన్‌టైమ్సు పత్రికకు సంపాదకుఁడుగ నుండెను. ఇతఁడు పెక్కునవలలు వ్రాసెను. మఱియు పెక్కుగ్రంథములు వ్రాసెను.

**అల్లికపని.** ఇది రెండు విధములు: ఊలు అల్లిక, క్రోషాఅల్లిక (crocheting). ఈ రెండు విధములైన అల్లికలును ఆ యా శబ్దములక్రింద వివరింపఁబడును.

**అల్లెఘనిపట్టణము.** యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికాలోని పెన్‌సిల్‌వేనియా సంస్థానమందలి యొక పట్టణము. జనసంఖ్య ౧౫౬,౭౮౫. అల్లెఘని నదియొడ్డున నున్నది. కళాకౌశల్య కర్మశాలలకు ప్రఖ్యాతిఁ జెందినది. ఇచ్చట ఇనుము, ఉక్కు కార్‌ఖానాలును, మోటారుబండ్లు, రైలుబండ్లు ఇతర యంత్రములు చేయు యంత్రశాలలును, పోతబోయు కర్మాగారములును ఊలుబట్టలు నేయు యంత్రశాలలును, పిండి మరలును మొదలైనవి పెక్కులు కలవు. ఇచ్చట విద్యావిషయకములును పరోపకార సంబంధమైనవియు నగు సంస్థాపనములు కూడ గలవు.

**అల్లెయిన్‌వాల్.** (౧౭౦౦-౫౩) ఫ్రాన్సు దేశజుఁడు. ప్రఖ్యాతుఁడైన

**అల్లోపనిషత్తు.** సంస్కృతమునందు అల్లోపనిషత్తొక్కటి కలదు. ఇందు అల్లాయొక్క మాహాత్మ్యము వర్ణింపఁబడినది. ఇది అక్బరు చక్రవర్తి కాలమున రచింపఁబడెనని కొందఱిమతము. ఇది అథర్వవేదాంతర్గత మనియుఁ జెప్పఁబడినది. అష్టోత్తర శతోపనిషత్తుల జాబితాలో నిది లేదు. కావున నిది మిక్కిలి యిటీవలదై యుండనోపు. ఈ చిత్రమైన ఉపనిషత్తునుండి కొన్ని వాక్యముల నుదాహరించెదను:—

ఓం అమ్మల్లాం ఇల్లే మిత్రావరుణోదివ్యానిధత్తే
ఇల్లల్లే వరుణో రాజా పునర్దదుః
హలూమిమితో ఇల్లాం ఇల్లల్లేతి

* * *

అల్లో జ్యేష్ఠం శ్రేష్ఠం పరమం పూర్ణం బ్రహ్మాణ మల్లాః
అల్లోరసుర మహామదరకం వరస్య అల్లో

* * *

ఇల్లాకబర ఇల్లాకబర ఇల్లల్లేతి
ఇల్లాలాః ఇల్లా ఇల్లాల్లా అనాది
స్వరూపా అథర్వణీ శాఖాం హ్రాం హ్రీం

ఇది యక్బరుచక్రవర్తి కాలమున సంస్కృత మెఱింగిన మహమ్మదీయునిచే రచింపఁబడియుండు ననుటకు నీ క్రిందిగాథ సహకారిగ నున్నది. అక్బరు కాలమున నాతనిసభలో అబ్దుల్‌కాదిర్‌బదౌని అను మహమ్మదీయ పండితుఁ డుండెను. ఈతఁడు సంస్కృతమునం గూడఁ బండితుఁడు. రామాయణ భారతాది గ్రంథముల ఫారసీలోనికి భాషాంతరీకరించెను. ఈతఁడు "ముంతకబ్ ఉత్‌తవారిఖ్" అను చరిత్రగ్రంథము వ్రాసెను. అందు నొకచోట నిట్లు వ్రాసియున్నాఁడు:—

"ఈయేఁట (౯౮౩ హిజ్రా; క్రీ. శ. ౧౫౭౫) దక్షిణదేశమునుండి శేఖ్‌భావన్ అను పేరు గల విద్వాంసుఁడైన బ్రాహ్మణుఁ డొకఁడు వచ్చియుండెను. వాఁడు మహమ్మదీయ మతమును గూడ బాగుగ నభ్యసించియుండెను. ఆ సమయమందె చక్రవర్తి నాకు అథర్వవేదమును భాషాంతరీకరింప మని యాజ్ఞాపించెను. మహమ్మదీయ ధర్మశాస్త్రమందలి కొన్ని యుపదేశ

ములకును, అథర్వవేదమందలి కొన్ని యుపదేశములకును సామ్యము కలదు. భాషాంతరముచేయునపుడు, పెక్కు తావులందు నిట్టి వాక్యములు రాగా శేఖ్ భావన్ వాని భావమును చక్కఁగఁ జెప్పలేకపోయెను. నేను ఈ సంగతి చక్రవర్తికిఁ దెల్పితిని. అతఁడు అథర్వవేదము నకు అనువాదము చేయు మని ఫైజీతోడను, హాజీ ఇబ్రాహింతోడను[1] చెప్పెను. ఈ వేదమునందు నొక్క చోట మన [ఖురానులోని] "లా ఇల్లాహ్ ఇల్లల్లాహ్" అన్నమాట యుండెను. ఈ వాక్యమును పుచ్చుకొని శేఖ్ భావన్ అనువాఁడు పెక్కు బ్రాహ్మణులతో వాదించి వారిని నోడించెను. ఈమంత్రబలముచే నెందరో హిందువులు మహమ్మదీయమతమును అవలంబించిరి.[2] "

దీనినిబట్టి చూడగా నాకాలమందు, బదోనియో, ఇస్మాయలో, లేక బ్రాహ్మణబ్రువుఁడైన శేఖ్ భావ నుఁడో అల్లోపనిషత్తును రచించియుందు రని మన మూహింపవచ్చును. ఫైజీమాత్ర మీపనిచేసియుండఁడు. అతనికి నే మతమునందును దురభిమానము లేకయుం డెను. అన్ని మతములును అతనికి సమానములు.

**అల్లోరి క్రిస్తోఫానో.** (౧౫౭౭-౧౬౨౧) ఫ్లారెన్సు పట్టణమునఁ బుట్టిన విఖ్యాత చిత్ర కారుఁడు. ఈతనిచే చిత్రింపఁబడి మిక్కిలి ప్రఖ్యాతిఁ జెందిన ఫ్లారెన్సు నారీమణి పటము (Portrait of a Florentine) అనునది లండన్‌పురమందలి నేషనల్ గేలరీలో (జాతీయచిత్రపట సంగ్రహమునందు) ఉన్నది.

**అల్వరెజ్.** (లూయి ౧౮౪౧-౧౯౦౧) స్పెయిన్‌దేశజుఁడు. చిత్రకారుఁడు. ఈత నిచే చిత్రింపఁబడిన పెక్కు పటములు మాడ్రిడ్ రాజ మందిరమును అలంకరించుచున్నవి.

**అల్వరేడో.** ౧. (జాన్ బాటిష్టా) కైలిఫోర్నియా దేశజుఁడు. మెక్సికో ప్రభుత్వమువారి మీఁద ౧౮౩౬ లో తిరుగఁబడి మెక్సికనుల నోడిం చెను. ౧౮౩౬-౪౨ వఱకు కైలిఫోర్నియాకు అధ్య క్షుఁడుగ నుండెను. అప్పుడు ఆ పనినుండి తొలగింపఁ బడెను.

౨. (పెడ్రో ౧౪౯౫-౧౫౪౧) స్పెయిన్ దేశజుఁడు. మెక్సికో గెలుచుటలో కార్టెస్‌కు సహా యుఁడుగ నుండెను. ఈతఁడు మెక్సికోలోని స్వదేశపు సరదారులను పెక్కుమందిని చంపించెను. అందువలన నాదేశమునందు యూరోపియనులకు పెక్కు బాధలు కలిగెను. ఈతఁడు ౧౮౨౩ లో గాటెమాలాను జయిం చెను. దానికి గౌర్నరుగ నియమింపఁబడెను.

**అల్వరేస్.** (ఫెర్నామ్ ౧౫౪౦-౧౯) పోర్చుగీస్ జాతివాఁడు. హిందూదేశమందలి గోవాలో జన్మించెను. కవి. పశ్చిమసముద్రతీరమునకు పోర్చుగల్ నుండి రెండుతడవలు వచ్చిన నావికసైన్యము లకు నాయకుఁడుగ నుండెను.

**అల్వా.** బొంబాయి, రేవాకాంతలోని యొక చిన్న సంస్థానము.

**అల్వాయే.** తిరువాన్కూర్ సంస్థానము నందు అలెంగాడ్ తాలూకాకు ముఖ్యస్థలము. ఇది అల్వాయె అను నామాంతరము గల పెరియార్ అను నేటియొడ్డున నున్నది. ఈయేటియొడ్డుననే శంకరా చార్యులవారు పుట్టిరఁట. జనసంఖ్య ౩౬౪౫. పోర్చు గీస్‌వారు ఈస్థలమును సముద్రస్థానమునకు యోగ్యమైన దిగ నెంచి యుండిరి. ఇప్పటికిని ఆరోగ్యస్థల మని యెంచి పెక్కుజనులు ఎండకాల మచ్చటికిఁ బోదురు. తాలూకాకంతకును నిచ్చట వారమునకు రెండు సారులు సంత జరుగును.

౧. సర్‌హింద్ నివాసియైన హాజిఇబ్రాహీం, అథర్వవేదమును పారసీలోనికి భాషాంతరీకరించెను.

౨. బదోని గ్రంథముయొక్క యింగ్లీషుభాషాంతరము నాకు చిక్క లేదు. బంగాలి విశ్వకోశమందలి భాషాంతరమునకు నిది తెలుఁగు.

ఈతని నే 'చిన్నన్న' అని పిలుచుచున్నట్టు కానవచ్చుచున్నది. ౧వ ఆశ్వాసమునందు నీయఁబడిన వంశావళిఁ జూడ నితఁడు నందవరీకుఁడు, ఆశ్వలాయనసూత్రుఁడు (అనగా ఋగ్వేది), భారద్వాజగోత్రుఁడు. ఈతని కూటస్థుఁడు అన్నయాచార్యుఁడు. ఇతఁడు 'పంచమాగమ సార్వభౌముఁడనఁ బ్రసిద్ధికి నెక్కెను. ఈతనికి తిమ్మాంబ అక్కాంబ లను భార్య లిద్ద ఱుండిరి. తిమ్మాంబ కుమారుఁడు నరసింహగురుఁడు. ఇతఁడు సంగీతమునందు గట్టివాఁడు. అక్కాంబ కుమారుఁడు తిరుమలాచార్యుఁడు.

........ఆ తిరుమలాచార్యవర్యుండు
వేదాంతవిద్యా ప్రవీణుఁడైయాంధ్ర
వేదాంత మొనరించె ద్విపదరూపమున
హరివంశ కావ్యమాయత రసస్ఫూర్తి
హరివంశ మిగురొత్త ననువొందఁజేసి
చక్రవాళములోన సరిలేదనంగఁ
జక్రవాళముగ మంజరి రచియించి
శ్రుతుల చిక్కులుదీర్చు శుకతాతవోలె
సతత రేఫఱకార సరణులేర్పఱిచి
సంగీత సాహిత్య సార్వజ్ఞికత్వ
మంగళ సామ్రాజ్య మహితుఁడైయలరె.

[౧. ఆ.

తిరుమలాచార్యునకు నైదుగురు కుమాళ్లు:చినతిమ్మ, అన్నయ, తిరువెంగళ, తిరువెంగళనాథుఁడు, కోనేటి వెంకటనాథుఁడు. వీరిలో తిరువెంగళనాథుఁడు మన గ్రంథకర్త. వీరివంశ వృక్షమీ రీతిగ నేర్పడును:—




ఈకవి సదాశివ దేవరాయల కాలము వాఁడు. సదాశివ దేవరాయఁ డీకవికి శా. శ ౧౪౬౭ విశ్వావసు సంవత్సర ఆషాఢ శుద్ధ ౧౨, (౨౧ జూన్ ౧౫౪౫)నాఁడు కొండవీటి రాజ్యమందు అద్దంకి సీమలోని మల్లవరం గ్రామము అగ్రహారముగ నిచ్చిన ట్లొక శాసనముకలదు.[1] ఇందు 'తాళపాక తిరుమలయ్యంగారి కుమారుఁడు చినంన తిరువెంగళ నాథునికి,' అని యున్నది. అందువలన నితనికి చిన్నన్న యన్న మాఱు పేరుండెనని మన మూహింపవచ్చును. ఈతని తమ్ముఁడైన కోనేటి తిరువెంగళ నాథయ్యంగారికి అద్దంకి సీమలోని వలపర్లి అను గ్రామము శా. శ ౧౪౬౬ లో (క్రి. శ. ౧౫౪౪) నిచ్చినట్టును, బొల్లాపల్లి గ్రామము శా. శ. ౧౪౬౭ (క్రి. శ. ౧౫౪౫)లో నిచ్చినట్టును శాసనములు కలవు.[2] ఈతని పేరు అష్టమహిషీ కల్యాణములో 'కోనేటి వెంకటనాథుఁ' డనియున్నది. శాసనములో 'కోనేటి తిరువెంకటనాథుఁ'డనియున్నది.

అప్పకవీయములో నీ క్రిందిపద్య మొక్కటికలదు. ఇది తెనాలి రామలింగనిదియఁట.

క. చిన్నన్న ద్విపద కెఱఁగును
బన్నుగఁ బెదతిరుమలయ్య పదమున కెఱఁగున్
మిన్నంది మెఱసె నరసిం
గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్.

పైని ఇచ్చిన వంశవృక్షము శాసనముఁ జూడఁగా నిందలి 'చిన్నన్న'యనగా 'తిరువేంగళనాథుఁ' డనియు, 'పెదతిరుమలయ్య' అనగా మనకవికిఁ దండ్రియైన 'తిరుమలయ్య' యనియు, 'సింగన్న' యనగా మన కవికిఁ బెత్తండ్రియైన 'నరసింహ గురుఁడు' అనియు మనము సులభముగఁ దెలిసికొనవచ్చును.

ఈ కవి తనను గుఱించి యిట్లు వ్రాసికొనియున్నాఁడు:—

1. ఆంధ్రకవుల చరిత్రము. ౨ వ భాగము, తాళ్లపాక తిరువెంగళనాథుఁడు.
* 'తిరుమల' శబ్దమునకు 'తిమ్మ' అనునది ప్రాకృతరూపము.

1. Butterworth & Venugopal Chetty's Nellore Insciptions, O. 21.
2. Do. O. 141 & 15.

...వారలలోనఁ గావ్యంబుఁ జెప్పి
యొనలేని శ్రీవెంకటేశు మెప్పించి
సకలంబు నెఱుఁగ నసాధారణాంక
మకరకుండలము లిమ్మహిఁ గొన్నవాఁడ
దినములోనవేయి ద్విపద లింపొంద
వినుతవర్ణనలతో విరచించువాఁడఁ
గవిశిరఃకంప యోగ్యప్రతి ద్విపద
నవబిరుదాంకుండ.............. [౧వ ఆ.

తనకు "శ్రీవెంకటేశుఁడు" మెచ్చి మకరకుండలము లిచ్చెనని యీతఁడు అష్టమహిషీ కల్యాణమునందును, "శ్రీ వేంకటాద్రీశుఁడు" ఇచ్చెనని పరమయోగి విలాసమునందును * చెప్పుకొని యున్నాఁడు. ఈ 'శ్రీ వెంకటాద్రీశుఁడు' వసుచరిత్రము కృతినొందిన తిరుమల దేవరాయని తమ్ముఁడని వీరేశలింగముగారు వ్రాసినారు. కాని సందర్భము చూడగ తిరుపతి వేంకటేశ్వరులన్న దేవుఁడు తనకు మకరకుండలము లిచ్చెనని చెప్పుట కవి యొక్క యుద్దేశమైనటులు కానవచ్చుచున్నది. దేవుఁడిచ్చెననగా నచ్చటి యధికారు లిచ్చిరని యర్థము చేసికొనవలెను. మకరకుండలము లిచ్చినది దేవుఁడే కాని రాజు కాదనుటకు నితని మేనత్త కుమారుఁడో మేనల్లుఁడో యైన రేవూరి వెంకటాచార్యుని శకుంతలా పరిణయ కావ్యపీఠికలో నిట్లు వ్రాయఁబడినది:—

"అమ్మహా దేవదేవుండు మదీయ మాతామహవంశ శిఖారత్నంబగు నన్నయాచార్యునకు జామాతరుండనిపించుకొని భవదీయసంకీర్తనంబు లాలించిన కర్ణంబుల నితరసంకీర్తనంబు లాలించనని ప్రతిజ్ఞఁ గావించె దత్తనూజుండగు పెద్దతిరుమలాచార్య బిడౌజునకున్ ద్రిపురుష పర్యంతంబుగా మోక్షంబు నొసంగెదనని వరమిచ్చె; సచ్చరిత్రు లగు తదీయపౌత్రులకుఁ జినతిరుమల దీక్షితాన్నయాచార్య తిరువెంగళనాథ కోనేటి తిరువెంగళనాథ వెంగళార్యులకు విచిత్రముక్తాతపత్రరత్నకవాట ముద్రికాపపాదుకాది బహూకరణంబులం గరుణించె; విశేషించియు నత్తిరువెంగళనాథుండు సంకీర్తనంబుఁ బాడిన నాడెందోడంగ నే తత్ప్రీకారంబున

నమ్మహామహులకుఁ బాండవ సహాయుండైన శ్రీకృష్ణ దేవునింబలె సహాయుండై......"

ఇతఁడు అష్టమహిషీకల్యాణమునందు ద్విపద వ్రాయువారు గమనింపవలసిన నియమములను చక్కఁగఁ జెప్పెను. కవిత్వముండవలసిన రీతిని ఇట్లు చెప్పినాఁడు:

...............అలఘుశబ్దార్థ
సారసరీతి రసప్రభావముగఁ
గులికి కస్తురి వీణె గోసినకరణి
దెలికప్పురపుఁగ్రోవి దెఱచినసరణి
విరవాదిపొట్లంబు విడిచినమాడ్కిఁ
బరిమళించుచుఁ గవుల్ బళిబళియనఁగఁ
గవిత చెప్పినయట్టి కవినిఁగవీంద్రుఁ
డవునందు రే నేర్చినట్లు చెప్పెదను.

పెద తిరుమలాచార్యునకు తిరువేంగళనామధేయ పుత్రులు ముగ్గురు: తిరువెంగళ, తిరువెంగళనాథ, కోనేటి (తిర్వ) వెంకటనాథ (వేంకట శబ్దమే 'వేంగళ' గ వాడఁబడు చున్నది.) కావున నేగ్రంథ మెవ్వరు చెప్పిరో కనుఁగొనుటకుఁ గొంచెము ఇబ్బంది కలుగుచున్నది. అమరముమీఁద 'గురుబాలప్రబోధిక' యను టీక, అన్నయ్య మనుమఁడును, తిరుమలార్య కుమారుఁడును అగు తిరువెంకటాఖ్యుఁడు వ్రాసెను. * ఇతఁడు అష్టమహిషీ కళ్యాణకర్తయో, యాతని యన్నయో, తమ్ముఁడో చెప్పుటకు వీలులేదు.

ఈవంశమువా రందఱును పండితులు కవులు. వీరిమూలపురుషునకు సంకీర్తనాచార్యులన్న బిరుదుండెను. వీరందఱును దేవస్తుతి పరములైన సంగీతపదములను రచించి తిరుపతి వెంకటేశ్వరులయెదుటఁ బాడుచుండిరి. అవన్నియు రాగిరేకులమీఁద వ్రాయఁబడి తిరుపతి దేవా

---

* "అనుపమ శ్రీ వేంకటాద్రీశ దత్త । మకరకుండల యుగ్మమం డితకర్ణ"

* A Triennial Catalogue of Mss. in G.O.Ms. Library 1913-16. P. 449.

* "తాళ్లపాకాన్నయాచార్యో వెంకటేశ పదాంచితః ॥ తతోఽథ తిరుమలగురుః......॥ తదాత్మజః శ్రీ తిరువెంకటాఖ్యో...... । టీకా మమరసింహస్య రచయత్యాంధ్రభాషయా॥" [గురుబాలప్రబోధిక: పుదూరు అల్లాడి ... శాస్త్రిగారి కూర్పు]

లయమునందు నొకగదిలో నుంచఁబడినవి. ఇప్పటిధర ప్రకార మా రాగిరేకులకు వెలగట్టినయెడల రెండులక్షలగునఁట. వీని నన్నిటిని నెవరైనను సంగ్రహించి ప్రకటింతురుగాక. తాళ్లపాకవారికి సంకీర్తనమునకై కొన్ని కంద్రికలు చంద్రగిరియొద్దఁ గలవనియు, తిరుపతిలోఁ గొన్ని మర్యాదలు కలవనియు, వారి వంశీకు లిప్పటికిని వానిని అనుభవించుచున్నారనియుఁ దెలియుచున్నది.

అష్టమహిషీ కల్యాణము ద్విపదలో వ్రాయఁబడినను, ఇతర ద్విపదకావ్యములవలె సులభ శైలిని

**కావ్యశైలి ఇత్యాదులు.** వ్రాయఁబడలేదు. పద్యకావ్యములవలె నే శబ్దార్థాలంకారములు విశేషముగ నుండి ప్రౌఢముగ నుండవలయునని కవి ప్రయత్నించినట్లు కనఁబడుచున్నది. సోమనాథుని సహజ ప్రవాహమును, సులభ సరసశబ్దప్రయోగమును, సహజవర్ణనమును, భావోద్రేకమును ఇందుఁ గానరావు. రంగనాథరామాయణము, ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానముతోడను దీనిని పోల్చుటకు వీలులేదు. ఇట్లు ఆంధ్రవాఙ్మయంబునందుఁ జేరొందిన ద్విపద కావ్యములకు సరివచ్చునని చెప్పుటకు వీలులేకపోయినను, ఈ కావ్యముమాత్ర మాంధ్రు లాదరింపఁదగినది.

[కో. ల.

**అష్ట(సంఖ్యలు.)** అష్ట సంఖ్యలుగఁ జెప్పఁబడు విషయములు మనశాస్త్రములందుఁ బెక్కులు కలవు. వానిని అకారాదిగ నీక్రింద వివరించుచున్నాము:—

**అంగములు.** (వేదాంతము) ఈశ్వరస్థూల సూక్ష్మకారణ మహాకారణములు, జీవస్థూల సూక్ష్మకారణ మహాకారణములు అను నవి ప్రణవార్థమును ప్రతిపాదించుటకు అష్టాంగ చతుష్పాద మని మాండూక్యోపనిషత్తు నందుఁ జెప్పఁబడినవి. (శరీరము) చేతులు, పాదములు, రొమ్ము, లలాటము, బుజములు ఈ యెనిమిది అంగములు భూమికి సోకులాగునఁ బడిన నది సాష్టాంగ మనిపించుకొనును. (వైద్యము) ఆయుర్వేదము కాయచికిత్స, బాలచికిత్స, గ్రహచికిత్స, ఊర్ధ్వాంగచికిత్స, శల్యచికిత్స, విషచికిత్స, రసాయనచికిత్స, వాజీకరణచికిత్స అనుఎనిమిది అంగములు కలది.

**అర్చనలు.** రంగవల్లి, చందనము, అక్షతలు, పుష్పములు, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము.

**అవధానములు.** చూఁడు 'అవధాన' శబ్దము.

**ఆనందములు.** బ్రహ్మానందము, వాసనానందము, విషయానందము, ఆత్మానందము, అద్వైతానందము, యోగానందము, సహజానందము, విద్యానందము.

**ఆయములు.** ఆయమనఁగా గొల్త. గృహాదికములుకట్టుటకు నెనిమిదివిధములయిన ఆయములు ఏర్పఱుపఁబడినవి. ధ్వజ, ధూమ, సింహ, శ్వాన, వృషభ, ఖర, గజ, కాకాయములు. గృహదేవాలయాదులు కట్టఁదలఁచిన స్థలముయొక్క నిడివిఅడుగులను, వెడల్పు అడుగులతోఁ బెంచి లబ్ధమును ౮ తో భాగింపగా ౧ మిగిలిన ధ్వజాయము, ౨ మిగిలిన ధూమాయము, ఇట్లే మిగిలిన వానిగుఱించి యెఱుంగునది.

**ఉపద్వీపములు.** జంబూద్వీపమునకుఁ జుట్టుసముద్రములో నెనిమిది ఉపద్వీపములు గలవు. స్వర్ణప్రస్థము, చంద్రశుక్రము (లేకశుక్లము), ఆవర్తనము, రమణకము, మందరహారిణము, పాంచజన్యము, సింహళము, లంక. [భాగవ. ౫-౧౯-౩౦; దేవీభాగవ. ౮-౧౧-౩౦-౩౭]

**ఉపపర్వతములు.** భారతవర్షమునందలి భరతఖండమునందు ఎనిమిది ఉపపర్వతములు గలవు : ఉపగిరి హిమాలయము, కార్త్యాత్రము, ఋష్యవంతము (లేకఋక్షవంతము) వింధ్యాద్రి, సహ్యాద్రి, మలయము, మహేంద్రాచలము, శుక్తవంతము.

(1) అణిమ, (2) మహిమ, (3) లఘిమ(4) గరిమ, (5) ఈశిత్వము (6) వశిత్వము (7) ప్రాప్తి, (8) ప్రా

**ఐశ్వర్యములు.** శావ్యము. వీనికి క్రమము గానర్థములు (1) అణువు కంటెఁ జిన్నవాఁడగు శక్తి, (2) బ్రహ్మాండముకంటె గొప్పవాఁడగు శక్తి, (3) మిక్కిలి తేలికయగుశక్తి, (4) మేరువుకంటెను బరువు గలవాఁడగు శక్తి (5) అందఱికిఁ గర్తయగుట, (6) అందఱు వశులైయుండుట, (7) కోరినవస్తువు ప్రాప్తించుట (8) ఇచ్ఛకు నెదురులేకుండుట. ఇవి యీశ్వరుని గుణములు గనుక వీనిని ఐశ్వర్యములందురు. వీనిని యోగాదుల సహాయమున మానవుఁడుకూడ సంపాదించును. కావున వీనిని "అష్టసిద్ధులు" అని కూడనందురు,

**కర్మలు.** స్నానము, సంధ్య, జపము, హోమము, స్వాధ్యాయము, దేవపూజనము, ఆతిథ్యము, వైశ్వదేవము.

**కష్టములు.** దాస్యము, దారిద్ర్యము, భార్య లేకుండుట, స్వయంకృషి, యాచన, తనను యాచించిన వానికి లేదనుట, ప్రవాసము, అప్పు.

**గంధములు.** పచ్చకర్పూరము, కస్తూరి, పునుఁగు, జవ్వాజి, అగరు, పన్నీరు, అత్తరు, శ్రీగంధము,

**దిక్పాలకులు.** ఎనిమిది దిక్కులకును ఎనిమిది మంది దేవత లధిపతులుగనున్నారు. వారినామములు, భార్యాది వివరములును ఈక్రింద నీయబడినవి:—

| దిక్కు | పాలకులు | భార్యలు | పట్టణములు | వాహనములు | ఆయుధములు |
|---|---|---|---|---|---|
| తూర్పు | ఇంద్రుఁడు | శచి | అమరావతి | ఐరావతము | వజ్రము |
| ఆగ్నేయ | అగ్ని | స్వాహా | తేజోవతి | తగరు | శక్తి |
| దక్షిణ | యముఁడు | శ్యామలా | సంయమిని | మహిషము | దండము |
| నైఋతి | నిఋతి | దీర్ఘా | కృష్ణా | నరుఁడు | కుంతము |
| పడమర | వరుణుఁడు | కాళికా | శ్రద్ధా | మకరము | పాశము |
| వాయవ్య | వాయువు | అంజనా | గంధవతి | జింక | ధ్వజము |
| ఉత్తర | కుబేరుఁడు | చిత్రరేకా | అలకా | అశ్వము | ఖడ్గము |
| ఈశాన్య | ఈశానుఁడు | పార్వతి | కైలాసము | వృషభము | త్రిశూలము |

**దిగ్గజములు.** ఎనిమిది దిక్కులయందును ఎనిమిదిగజములు భూమిని మోయుచున్నవి. వాని పేళ్లు: ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము. తూర్పుదిక్కునుండి పైని దిక్పాలకుల జాబితాలో నీయఁబడిన దిశలందు నొక్కొక్కదిక్కున నివి యొక్కొక్కటి క్రమేణ యుండును.

**దిగ్గజములభార్యలు.** అభ్రము, కపిల, పింగళ, అనుపమ, తామ్రపర్ణి, శుభ్రదంతి, అంజన, అంజనావతి.

**ధాతువులు** బంగారము, వెండి, రాగి, వంగము, యశదము (తగరము,) సీసము, ఇనుము, రసము. అష్టధాతు ప్రతిమ చేయవలసి వచ్చినప్పుడు రసమునకు బదులు ఇత్తడి పెట్టెదరు.

**నాగములు** వాసుకి, అనంతుఁడు, దక్షుఁడు, శంకపాలుఁడు, కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు.

**నాయికలు** స్వాధీనపతిక, వాసకసజ్జ, విరహోత్కంఠ, విప్రలబ్ధ, ఖండిత, ప్రోషితభర్తృక, కలహాంతరిత, అభిసారిక.

**పరీక్షాస్థానములు.** నాడి, స్పర్శము, రూపము, నేత్రము, శబ్దము, పురీషము, మూత్రము జిహ్వ.

**పాశములు.** పశుపాశము, భావపాశము, బంధపాశము, మోహపాశము, ఆశాపాశము, కర్మపాశము, కేశపాశము, దుఃఖపాశము.

**ప్రకృతులు.** భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము.

**ప్రమాణములు.** ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, ఆగమము, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవము, ఐతిహ్యము.

**భైరవులు.** అసితాంగుఁడు, రురుఁడు, చండుఁడు, క్రోధుఁడు, ఉన్మత్తుఁడు, కపితుఁడు (కపాలి), భీషణుఁడు, సంహారుఁడు.

**మహాసిద్ధులు.** చూడుఁడు 'అష్ట - ఐశ్వర్యములు.'

**మూర్తులు.** పంచభూతములు, సూర్యుఁడు, చంద్రుఁడు సోమయాజి— ఈయెనిమిది శివుని యొక్క యష్టమూర్తులు.

**యోగాంగములు.** యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి. యమ మనగా అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము. నియమమనగా శౌచ సంతోష తపస్స్వాధ్యాయ ప్రణిధానములు. ఆసనములు పద్మాసన వీరాసన భద్రాసనాదికములు. ప్రాణాయామ మనగా శ్వాస ప్రశ్వాసముల గతి విచ్ఛేదము. ప్రత్యాహారమనగా నింద్రియములు స్వస్వవిషయ సంబంధము లేకుండ చిత్తస్వరూపమును (మనఃప్రవృత్తిని) అనుసరించుట. ధారణయనగ చిత్తమును (చిత్తవృత్తిని) ఏకదేశమున బంధించుట (నిలిపియుంచుట). ధ్యానమనగా, చిత్తవృత్తిని ప్రత్యయాంతరమునకుఁ బోనీయకుండ ధారణవిషయమైన చోటికే యెడతెగకుండఁ బ్రవహింపఁజేయుట. ధ్యానమునందుఁ జిత్తము స్వస్వరూప శూన్యమై ధ్యేయాకారముగ మాత్ర మెప్పుడు భాసించునో యప్పుడు 'సమాధి,' యనంబడును.*

**లక్ష్ములు** ధన, ధాన్య, సంపత్, జయ, ధైర్య, ఆయుధ, రాజ్య, మోక్షలక్ష్ములు.

**వసువులు.** ఇప్పుడు జరుగుచున్న వైవస్వత మన్వంతర మందలి ధర్మఋషికి ప్రాచేతస దక్షుకన్యయైన వసువునందుఁ బుట్టిన దేవతలు. వీరు సప్తవిధ దేవతలలో నైదవతరగతివారు. వీరి పేళ్లు ధరుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, అహస్సుఁడు, అనిలుఁడు, అనలుఁడు, ప్రత్యూషుఁడు, ప్రభాసుఁడు [మహాభారత ఆది ౬౬] 1వేరు పురాణములందు నీపేళ్లు కొంచెము తారుమారుగాఁ గానవచ్చుచున్నవి. కాని అష్టసంఖ్యకు మాత్రము భేదము లేదు.

**వివాహములు** బ్రాహ్మ, దైవ, ప్రాజాపత్య, ఆర్ష, గాంధర్వ, ఆసుర రాక్షస, పైశాచ,

* యమనియమాదుల లక్షణములు పాతంజల యోగ సూత్రములను [2 వ పాదము], వానిపై వ్యాస భాష్యమును అనుసరించి యీయఁబడినవి.

## అష్టాంగహృదయము.

వైద్యగ్రంథము, వాగ్భటప్రణీతము. వైద్యసంబంధమైన అష్టాంగములను గుఱించి యిందుఁ జర్చింపఁబడుటచేతను, శరీరమునకు హృదయ మెట్లు ప్రధానమో యట్లే వైద్యగ్రంథములలో నిదియున్న యుద్దేశముచేతను వాగ్భటుఁడు దీని కీపేరు పెట్టెను. గ్రంథమంతయు సూత్ర, శారీర, నిదాన, చికిత్స, కల్పసిద్ధి, ఉత్తరతంత్రములను ఆఱు స్థానములుగా విభజించి, ౧౨౦ అధ్యాయములలో గ్రంథము పూర్తి చేయఁబడినది. 'సూత్రస్థానేతు వాగ్భటః' అను సామెతవలన నిందలి 'సూత్రస్థానము' వైద్యులకుఁ జాల యుపయోగకరము.

వాగ్భటుఁడు సింధుదేశమువాఁడు. క్రీ. పూ. ౨వ శతాబ్దమువాఁడై యుండనోపు! ఈగ్రంథమునకు అరుణదత్తునిచే సర్వాంగసుందర మని టీకయు, గంగాధరీయము, హేమాద్రి నాగోజీభట్టీయము అను వ్యాఖ్యానములు గలవు. కాంచీపురము విద్వాన్ ఈచంబాడి శ్రీనివాసాచార్యులవారి సహాయమువలన శ్రీపువ్వాడ వేంకటరావు పంతులువారిచే చికిత్స, కల్పస్థానములకును, ఉత్తరతంత్రమునకును, పువ్వాడ నారాయణరావుగారిచే సూత్రస్థానమునకును తెలుఁగు తాత్పర్యములు ప్రకటింపఁబడినవి.

## అష్టాదశపురాణములు.

'పురాణములు' అనఁబడు పుస్తకములసంఖ్య పదునెనిమిది యని ప్రఖ్యాతికలదు. పదునెనిమిదిపురాణము లెవ్వి యన్న విషయమై మాత్రము అభిప్రాయభేదము లున్నవి. ప్రతి పురాణమునందును, ఇతరగ్రంథములందును ౧౮ పురాణ

1. Astangahridaya, A. M. Kunte's edition preface.

ముల పేళ్లు చెప్పఁబడియున్నవి. శ్రీమద్భాగవతమతమున [౧౨. స్కం] ఈక్రింది పదునెనిమిదియుఁ బురాణములు:— ౧ బ్రహ్మ, ౨ పద్మ, 3 విష్ణు, ౪ శివ, ౫ భాగవత, ౬ నారద, ౭ మార్కండేయ, ౮ అగ్ని, ౯ భవిష్య, ౧౦ బ్రహ్మవైవర్త, ౧౧ లింగ, ౧౨ వరాహ, ౧3 స్కంధ, ౧౪ వామన, ౧౫ కూర్మ, ౧౬ మత్స్య, ౧౭ గరుడ, ౧౮ బ్రహ్మాండ. కూర్మపురాణమునందలి జాబితాలో "౮ అగ్ని" పురాణమునకు బదులు "వాయు" పురాణ మున్నది. "వరాహ" పురాణమునందు "౧౭ గరుడ" "౧౮ బ్రహ్మాండ" పురాణములకు బదులు "వాయు" "నరసింహ" పురాణములు చెప్పఁబడినవి.* విష్ణు, పద్మ, స్కాంద, బ్రహ్మవైవర్త, భాగవత, మార్కండేయ, కూర్మ, వరాహ, లింగపురాణములలో "శివ" పురాణము చెప్పఁబడినది గాని "వాయు" పురాణము చెప్పఁబడలేదు. అగ్ని మత్స్య నారద దేవీభాగవతపురాణములలో "వాయు" పురాణము చెప్పఁబడినదిగాని "శివ" పురాణము చెప్పఁబడియుండలేదు.† కూర్మపురాణమునందు "శివ" "వాయు" పురాణములు రెండును చెప్పఁబడినవి. మార్కండేయపురాణమునందు "౧౧ లింగ" పురాణమునకు మాఱుగ "నృసింహ" పురాణము చెప్పఁబడినది.[1] కొన్ని పురాణములలోఁ బురాణగ్రంథసంఖ్యయు నీయఁబడియున్నది. ఏయేపురాణప్రకార మెయ్యది పురాణమైనదియు గ్రంథసంఖ్యయుఁ జూపుపట్టిక ఈవ్యాసమునకుఁ జివర ఈయఁబడును.

అన్ని జాబితాలలోను "భాగవతము" కలదు. కాని "అష్టాదశపురాణము"ల లోని "భాగవత" మెద్ది యన్న విషయమై పూర్వకాలమునుండియు పెక్కు వాద వివాదములు జరుగుచున్నవి. విష్ణుమాహాత్మ్యము కలది శ్రీమద్భాగవతము. దేవీమాహాత్మ్యము గలది దేవీభాగవతము. అష్టాదశపురాణములలోనిది శ్రీమద్భాగవతమేయని వైష్ణవులును, దేవీభాగవతమే అష్టాదశపురాణములోనిది యని శాక్తేయులును ప్రబలవాదములను జరిపిరి.* ఇప్పటికిని ఈవాదము తెగినదని చెప్పుటకు వీలులేదు. మొదట నే భాగవతము పుట్టినను వైష్ణవభాగవతమున కున్న ప్రచారము దేవీభాగవతమునకు లేదు. వైష్ణవభాగవతము పేరు వినని హిందువు సాధారణముగ నుండఁడు. దేవీభాగవత మొకటి యున్నదని తెలియనివా రసంఖ్యులున్నారు.

నిర్వచనము మొదలయినవి.

పురాతనకాలపుఁ జరిత్రములను చెప్పునవి పురాణములు. పద్మపురాణమునందు నిట్లున్నది:—

పురాపరంపరాం వక్తి పురాణం తేన వై స్మృతమ్;
నిరుక్తమస్యయో వేద సర్వపాపైః ప్రముచ్యతే.

[పద్మ. ౧-౨-౫3]

పూర్వపరంపరను చెప్పును గావున పురాణ మనఁబడును.

శుక్రనీతిలో నిట్లు చెప్పఁబడినది:—

ప్రాగ్వృత్తకథనం చైక రాజకృత్యమిషాదితః,
యస్మిన్ స ఇతిహాసః స్యాత్పురావృత్తః సఏవహి.
సర్గశ్చప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ,
వంశానుచరితం యస్మిన్ పురాణం తత్ప్రకీర్తితమ్.

[౪. 3. ౫౧-౫౨]

---

* ఇట్లు విల్సన్ చూచిన 'వరాహపురాణము' నం దుండెను. కొన్ని వ్రాతప్రతులందు నిట్లు లేదు.

† వాయుపురాణములో శివుని గుఱించియే యధికముగఁ జెప్పియుండుటవలన, "శివ" "వాయు" పురాణము లొక్కటియే యని కొందఱందురు. [బాలంభట్టు]

1 చెన్నపట్టణమునందు పువ్వాడవారిచేఁ బ్రకటింపఁబడిన మార్కండేయపురాణమునందు నృసింహపురాణము లేదు. లింగపురాణమే చెప్పఁబడినది.

* ఇందునుగుఱించి సంస్కృతమునఁ బెక్కుగ్రంథములు కలవు. వీనిలోనివి ముఖ్యమైనవి:— (౧) రామాశ్రముని దుర్జనముఖచపేటిక. ఇది వైష్ణవభాగవత పక్షపుది. (౨) కాశీనాథభట్టరచిత 'దుర్జనముఖ మహాచపేటికా' ఇది దేవీభాగవతపక్షమున వాదించును. (3) దుర్జనముఖపద్మపాదుక- ౧ వ గ్రంథమునకుఁ బ్రత్యుత్తరము. (౪) పురుషోత్తమకృత భాగవత స్వరూపవిషయ శంకానిరాస త్రయోదశ. వైష్ణవగ్రంథము. (౫) మితాక్షరపై టీక వ్రాసిన బాలంభట్టు దేవీభాగవతమే ౧౮ పురాణములలోనిది యని వ్రాసెను.

ఒకానొకరాజు చేసినపని యన్న నెపమునఁ బూర్వకాలపువార్త యెందుఁ జెప్పఁబడునో యది యితిహాసము. ఇదియే పురావృత్తము. సర్గము (ప్రపంచోత్పత్తి), ప్రతిసర్గము (బ్రహ్మాదులు చేసెడియుత్పత్తి), వంశము (దేవాసురాది విభేదోత్పత్తి), మన్వంతరములు (వేఱు వేఱు మనువులకాలము), వంశానుచరితము (సూర్యచంద్రాదుల వంశములు) ఎందు వర్ణింపఁబడునో దానిని పురాణ మందురు.

ఇతర పురాణములందును, అమరకోశము నంగును [౧. వాగ్వర్గము]* పురాణముయొక్క లక్షణము ఇట్లె చెప్పఁబడి యున్నది. దీనిఁబట్టి చూడ ఇతిహాసము యొక్క వ్యాప్తి చిన్నదిగను పురాణముయొక్క వ్యాప్తి యెక్కువగఁ గానిపించుచున్నది. ఇతిహాసపురాణ శబ్దములు సాధారణముగఁ గలిపి చెప్పఁబడును. ఆశ్వలాయనగృహ్యసూత్రమునందు నిట్లు చెప్పఁబడినది.

“ఆయుష్మతాం కథాః కీర్తయంతో మాంగల్యా నీతిహాసపురాణా నీత్యాఖ్యాపయమానాః” [౪. ౬

ఆయుష్మంతులకథలు గల మంగళప్రదములైన ఇతిహాసపురాణములను చదువుదురు.

పురాణముల కాలము కాని, ఏపురాణము మొదట వ్రాయఁబడినది యేపురాణము తరువాత వ్రాయఁబడినది యన్నవిషయము గాని నిశ్చయముగఁ జెప్పుట దుర్లభము. ప్రతిపురాణమునందును ఇతర యన్ని పురాణముల నామములుండును. కావున నొక్కొక్క పురాణము సిద్ధమైన కొలఁదిని దాని పేరితర పురాణములలోఁ జేరుచువచ్చె నని తోఁచుచున్నది.

**పురాణముల కాలము.**

‘పురాణ’ శబ్దముయొక్క చరిత్రము వెతకఁగా పురాణశబ్దము తైత్తిరీయారణ్యకమందును,1 అథర్వవేదమునందును,2 శతపథ బ్రాహ్మణమునఁదును,3 ఛాం

* ఇట్లు కోశములందును, పురాణములందును పంచలక్షణములు చెప్పఁబడినను శ్రీమద్భాగవతమునందు [౧-వ స్కం.] మాత్రము పురాణములకుఁ బదిలక్షణములును ఉపపురాణములకు నైదులక్షణములును చెప్పఁబడినవి. అందలి శ్లోకముల తాత్పర్యమిందు నుదాహరించుచున్నాను:—

“వేదశాస్త్రానుసారముగ బ్రహ్మర్షులు నిరూపించిన పురాణలక్షణంబు వినుము. ఈ ప్రపంచము సృష్టి విసర్గము వృత్తిరక్షణము మన్వంతరములు వంశము వంశానుచరితము నిరోధము హేతు అపాశ్రయము నను లక్షణంబులు పది చొప్పడినం బురాణంబని పురాణవిదులు చెప్పుదురు. సర్గ విసర్గ వంశ మన్వంతర వంశానుచరితంబులైదు గల్గినను బురాణంబగుఁగాని యది మహాపురాణంబుగాదు. ప్రధానగుణక్షోభమునం జేసి మహత్తత్త్వంబు వలన నహంకారంబునకు దానం దన్మాత్రేంద్రియార్థముల కును సంభవంబు సర్గంబు. బీజమునుండి బీజాంతరోత్పత్తిరీతి నీశ్వరానుగృహీతము లైన మహదాదులకుఁ గార్యభూతంబై పూర్వకర్మవాసనాప్రధానంబైన సత్త్వా చరప్రాణిరూపప్రవాహము విసర్గము. సామాన్యముగ జరములకచరంబులుగా దత్తత్స్వభావకామచోదనానుగుణంబుగా జీవనకల్పనంబు వృత్తి. వేదవిరోధివదార్థంబు దేవర్షి నర తిర్యగవతారములం బ్రతియుగమున హరి గ్రహించుట రక్షణంబు. మను మను పుత్ర దేవ దేవేంద్ర సప్తర్షి హర్యంశావతార కథనంబు మన్వంతరంబు. బ్రహ్మప్రభవులై త్రికాలవంశధరులైన రాజులచరిత్రంబు వివరించుట వంశానుచరితంబు. నిత్య నైమిత్తిక ప్రాకృతి కాత్యంతిక ప్రళయ నిరూపణము నిరోధము. అవిద్యచేఁ గర్మకర్తయై నిమిత్తమై యవ్యాకృతుఁడై సర్గాదులకు నిమిత్తంబైన జీవుఁడు హేతువు. మాయామయము లైన జాగరాద్యవస్థలందు విశ్వతైజసప్రాజ్ఞసంజ్ఞలం బరగి సాక్షిరూపమున నన్వితుండై సమాధ్యాదులందు వ్యతిరిక్తుండైన పరమాత్ముఁడపాశ్రయంబు. అప్పరమాత్మ స్వరూపంబు ఘటాది పదార్థములందు మృదాది ద్రవ్యం బెట్లట్లు రూపనామములందు సత్తామాత్రంబై గర్భాధానాది మరణాంతములైన యవస్థలం దన్వితానన్వితంబై యొప్పు. చిత్తము దనంతన కాలో నుష్ఠితయోగమునం గాని వృత్తిత్రయముఁ బరిహరించి విరతినొందునప్పుడు సంసారప్రవృత్తినివృత్తుండై యాతం డాత్మవేదనంబు గాంచు.” [శేషగంటమువారి భాషాంతరము]

1. తేనాథర్వాఙ్గిరసో బ్రాహ్మణా నీతిహాసా న్పురాణాని కల్పాన్గాథా నారాశంగ్ సీః ప్రీణాది [తై. ఆ. ౨. ౧౧] 2. ఋచః సామాని ఛందాంసి పురాణం యజుషాసహ, [అథ. ౧౧. ౭. ౨౪.] 3. ఉపదిశతి

దోగ్య బృహదారణ్యకోపనిషత్తులందును,[4] ఆశ్వలాయన గృహ్యసూత్రమునందును,[5] మనుస్మృతియందును[6] మతగ్రంథార్థమునందుఁ గానవచ్చుచున్నది. ఆపస్తంబ ధర్మసూత్రము లందు 'అథ పురాణే శ్లోకా వుదాహరంతి' [౧. ౯. ౧౩-౧౫] 'ఇతిపురాణే' [౧. ౯. ౭] 'ఇతిభవిష్యత్పురాణే' [౨. ౨౪. ౫-౬] అని పురాణములలోనిశ్లోకములు ఉదాహరింపఁబడినవి. కావున నాయా కాలమునఁ బురాణనామముగల గ్రంథ మొక్కటియో, పెక్కులోయుండెనని మన మూహింప వచ్చును. కాని యివి యిప్పుడు పురాణముల పేరిటఁ బరఁగుచున్న గ్రంథములే యని అనుకొన నక్కరలేదు. ఇప్పుడు బ్రాహ్మణములనఁబడు గ్రంథములలోని కొన్ని భాగములకు బ్రాహ్మణములనియు, పూర్వచరిత్రమఁ దెల్పు కొన్ని భాగములకు ఇతిహాసము లనియు, కొన్ని భాగములకుఁ బురాణములనియుఁ బేళ్లుండినట్లు తోఁచుచున్నది. శంకరాచార్యులవారు బృహదారణ్యకోపనిషత్తు భాష్యమున నిట్లు వ్రాసియున్నారు:—

"ఇతిహాస ఇత్యూర్వశీపురూరవసోః సంవాదాదిరుర్వశీ హాప్సరా ఇత్యాది బ్రాహ్మణమేవ పురాణ మసద్వా ఇదమగ్రఆసీ దిత్యాది." [౨. ౪. ౧౦

అర్థము : ఇతిహాస మనఁగా నూర్వశీ పురూరవుల సంవాదము మొదలైనవి. 'ఉర్వశీహాప్సరా' మొదలయిన బ్రాహ్మణమే. పురాణమనఁగా 'అసద్వా ఇద మగ్ర ఆసీత్' అనునది మొదలయిన (బ్రాహ్మణవాక్యములు.)

విద్యారణ్యులవారు ఐతరేయ బ్రాహ్మణభాష్యోపోద్ఘాతమునం దిట్లు వ్రాసియున్నారు:—

"దేవాసురాః సంయత్తాఆస" న్నిత్యాదయ ఇతిహాసాః। 'ఇదంవా అగ్రేనైవ కించి దాసీ' దిత్యాదికం జగతః ప్రాగవస్థా నుపక్రమ్య సర్గప్రతిపాదకం వాక్యజాతం పురాణమ్."

అర్థము: 'దేవాసరాసంయత్తా ఆసన్' (దేవాసురులు పోరాడఁజొచ్చిరి) ఇత్యాదులు ఇతిహాసములు. 'ఇదంవా అగ్రేనైవ కించి దాసీత్' (మొదట నిది యేదియు లేకయుండెను) అనునవి, పూర్వస్థితిని నెత్తుకొని యుత్పత్తిని ప్రతిపాదించు (బ్రాహ్మణ) వాక్య సమూహము పురాణము.

ఇట్లు మొదటి యితిహాసములును, పురాణములును బ్రాహ్మణములలో మనకుఁ గాన్పించు, పూర్వరాజుల చరిత్రములు, సృష్ట్యుత్పత్తి కథనములు. ఇవియే తరువాతి కాలపు (అనఁగా నేఁటి) శ్లోకాత్మక పురాణములుగ మాఱినవని మన మూహింపవచ్చును.

బ్రాహ్మణములలోని పురాణేతిహాస వాక్యములఁ దీసికొని మొదట నొక్క శ్లోకాత్మకమైన పురాణము రచింపఁబడె ననియుఁ, దరువాతఁ గ్రమముగ నందుండి అష్టాదశ పురాణములును, ఉపపురాణములును పుట్టె ననియుఁ దోఁచుచున్నది. మొదట పురాణ మొక్కటియే యున్నట్టును, అది క్రమముగఁ జెరిఁగినట్టును, వాని గ్రంథ సంఖ్య మొదటఁ గొద్దిగానుండి, పిదపఁ బెరుగుచు, వేలు వేలు కాలములలో వేలు వేలు పెరిఁగినకూర్పులు (enlarged editions) బయలుదేఱినట్టును పురాణములోనే కొన్నికొన్ని సూచనలు కలవు. మత్స్యపురాణమునం దిట్లున్నది:—

పురాణ మేకమేవాసీ త్పురాకల్పాంతరేఽనఘ.౪. [౫౩ అధ్యా

స్కందపురాణాంతర్గతమైన రేవామాహాత్మ్యమునందు:-

పురాణ మేకమేవాసీ దస్మిన్ కల్పాంతరేనృప!

* * *

కాలే నాగ్రహణం దృష్ట్వా పురాణస్య తతో నృప!

* * *

తదష్టదశధా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రభాష తే॥ [౧. ౨౩. ౩౦.

విష్ణుపురాణమందలి యీ క్రింది వచనము వలన నాపురాణము జనమేజయుని కాలమున రచింపఁబడిన ట్లున్నది:—

---

పురాణం। వేదః సోఽయమితి। కించిత్ పురాణ మాచక్షీత. [శత. ౧౩. ౪౩. ౧౩] ; ఏవం విద్వాన్ వాకోవాక్య మితిహాసః పురాణ మిత్యహరహః స్వాధ్యాయ మధీతే [శత. ౧౧. ౫. ౭. ౯] 4. సహోవాచ ఋగ్వేదం భగవోఽ ధ్యామి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థ మితిహాసపురాణం పంచమ వేదానాం వేదః [ఛాందోగ్య. ౩. ౧. ౧]; ఏవంవాఽ రేఽస్య మహతో భూతస్య నిశ్వసితం ఏతద్యత్ ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః. [బృహ. ౨. ౪. ౧౧]. 6. ఆయుష్మతాం కథా కీర్తయన్తో మాంగల్యానీతిహాస పురాణా నీత్యాఖ్యాపమానాః [ఆశ్వ. గృ. ౪. ౬] 6 స్వాధ్యాయం శ్రావయేత్ పిత్రే ధర్మశాస్త్రాణి చైవహి। ఆఖ్యానా నీతిహాసాంశ్చ పురాణాని ఖిలానిచ॥ [మను. ౩. ౨౩౨.]

"పరిక్షిత్ జజ్ఞే. యో౽యా సాంప్రతమేత ద్భూమండలమ ఖండితాయతిధర్మేణ పాలయతి"

[శ. ౨౦. ౧౭.

మత్స్యపురాణమందలి యీక్రింది శ్లోకములవలన ఆపురాణము పరిక్షిత్తుమునిమనుమఁడైన అధిసీమకృష్ణుని కాలమున వ్రాయఁబడినట్లు కనఁబడును:—

అథాశ్వమేధేన తతః శతానీకస్య వీర్యవాన్,
జజ్ఞే౽ధి సీమకృష్ణాఖ్యః సాంప్రతం యోమహాయశాః॥
తస్మిన్ శాసతి రాష్ట్రేతు యుష్మాభిరిదమాహృతం॥

[౫౦. ౫౫. ౬.*

భవిష్యత్పురాణమునందలి యీ క్రింది శ్లోకమువలన నాకాలమున నవంతిలో 'శంఖ' రాజు రాజ్యము చేయుచున్నట్టున్నది:—

అవంతే శంఖనామాసౌ సాంప్రతం వర్తతే నృపః

[ప్రతి సర్గ. అ. ౫.

ఇతఁడు విక్రముని తండ్రియని యీ పురాణమువలననే తెలియుచున్నది.

భవిష్యత్పురాణమునందలి యీ శ్లోకములవలనఁ బురాణములన్నియుఁ గలిసి మొదట ౧౨౦౦౦ శ్లోకములుండెననియు, నా గ్రంథసంఖ్య క్రమముగఁ బెరిగెనని యుఁ గానవచ్చుచున్నది:—

సర్వాణ్యేవపురాణాని సంజ్ఞేయాని నరర్షభ,
ద్వాదశైవ సహస్రాణి ప్రోక్తానీహ మనీషిభిః.
పునర్వృద్ధింగతానీహ ఆఖ్యానై ర్వివిధైర్నృప,
యథాస్కాందం తథా చేదం భవిష్యత్కురునందన.
స్కాందం శతసహస్రంతు లోకానాం జ్ఞాతమేవహి
భవిష్యమేతదృషిణా లక్షార్థం సంఖ్యయా కృతం.

[బ్రహ్మపర్వ. ౧ అ. ౧౦౪-౬.

ఇప్పటి యన్ని పురాణముల గ్రంథసంఖ్య శ్రీమద్భాగవత ప్రకారము చూచిన నాలుగులక్షలను మించినది. పండ్రెండువే లెక్కడ! నాలుగులక్ష లెక్కడ!! భాగవతప్రకారము చూచినను భవిష్యత్ పురాణములో ౧౪౫౦౦ శ్లోకములు మాత్రముండవలెను. అవి ౫౦౦౦౦ అయ్యెనఁట!

విష్ణుపురాణమందలి యీక్రింది శ్లోకములలో వ్యాసుఁ డొక్క పురాణసంహితయే రచించెననియు, తరువాత నాతని నల్గురు శిష్యులు నాల్గు పురాణసంహితల రచించిరనియు ఆనాల్గింటిలోనుండి యితరపురాణములు పుట్టెనని చెప్పఁబడినది.

ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానైర్గాథాభిః కల్పశుద్ధిభిః,*
పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః.
ప్రఖ్యాతో వ్యాసశిష్యో౽భూత్ సూతో వై రోమహర్షణః,
పురాణసంహితాం తస్మై దదౌ వ్యాసో మహామునిః.
సుమతిశ్చాగ్నివర్చాశ్చ మిత్రయూః శాంశపాయనః,
అకృతవ్రణో౽థ సావర్ణిః షట్ శిష్యాస్తస్యచాభవన్.
కాశ్యపః సంహితాకర్తా సావర్ణిః శాంశపాయనః,
రోమహర్షణికాశ్చాన్యా తిసౄణాం మూలసంహితా.
చతుష్టయేనాప్యేతేన సంహితానామిదం మునే,
ఆద్యం సర్వపురాణానాం పురాణం బ్రాహ్మముచ్యతే.
అష్టాదశపురాణాని పురాణజ్ఞాః ప్రచక్షతే.

[విష్ణు. 3. ౫. ౧౫-౨౧.

ఒక్క పురాణములోనుండి పెక్కు పురాణములు పుట్టిననుటకు విష్ణుపురాణమే యొక దృష్టాంతము. పురాణములనుగుఱించి విచారించిన తజ్ఞులందఱును విష్ణుపురాణము ఆదర్శపురాణమనియు, పురాణములలోఁ బురాతనమనియుఁ జెప్పిరి. కాని యీ పురాణముకూడ స్వతంత్రము కాదనియు, నొకప్పు డిది ఆదిబ్రహ్మాండపురాణముయొక్క భాగముగ నుండెననియు, తరువాతఁ జీలి స్వతంత్రపురాణ మయ్యెననియుఁ గానవచ్చుచున్నది. ఇందునగుఱించి యిదివఱ కెవ్వరును. విచారించియుండ లేదు. తెలుఁగు విష్ణుపురాణముఁ జదువునప్పు డీ విషయము నాకుఁ గానవచ్చెను. ౧౬-వ శతాబ్దారంభమునందుండిన వెన్నెలకంటి సూరన విష్ణుపురాణమును తెనుఁ

* ఈ శ్లోకములే బ్రహ్మాండపురాణము యొక్క ఉపసంహార పాదమునఁ గలవు.

* విష్ణుపురాణటీకాకారుఁడైన శ్రీధరస్వామి ఆఖ్యానాదులనగా నేమియో యిట్లు చెప్పియున్నాఁడు: "స్వయం దృష్టార్థకథనం ప్రాహురాఖ్యానకంబుధాః, శ్రుతస్యార్థస్య కథనముపాఖ్యానం ప్రచక్షతే. గాథాస్తు పితృపృథ్వీప్రభృతి గీతయః, కల్పశిద్ధిః శ్రాద్ధకల్పాదినిర్ణయః."

గించియున్నాఁడు. ఆతఁడు వర్థ్యంతములైన తరువాత నిట్లు వ్రాసెను: "అభ్యుదయపరంపరాభివృద్ధిగ నా యొనర్పంబూనిన యాదిమహాపురాణంబగు బ్రహ్మాండ పురాణంబునందలి పరాశరసంహితయైన శ్రీవిష్ణుపురాణంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన" [౧ ఆ.] ప్రతి ఆశ్వాసము చివరను అంత్యగద్యమం దిట్లె వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి చూడ ౧౬-వ శతాబ్దమందలి సంస్కృత విష్ణుపురాణ ప్రతియందు నది బ్రహ్మాండపురాణమందలి పరాశరసంహిత యనఁబడు భాగమని వ్రాయఁబడి యుండెననుట స్పష్టము. విష్ణుపురాణము స్వతంత్ర గ్రంథమనక మఱియొక పురాణభాగ మన్నయెడల దాని గౌరవము తగ్గునని కాఁబోలును, ఇటీవలివారు సంస్కృత ప్రతులనుండి యీభాగము నెత్తివేసినారు కావున నది కానరాదు. కొన్నిటియందు మాత్రము 'పరాశరసంహితయు' అని యున్నది.[1]

ఇట్లు ఒకపురాణమున్న కాలము, ౧౨౦౦౦ శ్లోకములుమాత్ర మున్న కాలము, ౪ పురాణములయిన కాలముఁ జూచితిమి. తరువాతఁ బురాణములసంఖ్య హెచ్చుచుఁబోయెను. ఈసంఖ్య ౧౮ అని యెప్పుడు నిశ్చయమైనదియు, తరువాతఁ బుట్టిన పురాణములకు నుపపురాణములన్న పేరెప్పటినుండి పెట్టవలసివచ్చెనో నిశ్చయముగఁ జెప్పలేము. కాని ౧౧ వ శతాబ్దమువఱకు ౧౮ పురాణములును, కొన్ని ఉపపురాణములును ఉండెననుట స్పష్టము. ౧౧-వ శతాబ్దమునందుండిన అల్ బెరునీ యను మహమ్మదీయపండితుఁడు హిందూదేశమందుండి సంస్కృతము నేర్చుకొని, హిందువుల విద్యలనుగుఱించి గ్రంథము వ్రాసినాఁడు. అందు విష్ణుపురాణములోని పదునెనిమిది పురాణముల జాబితా ఆపురాణములోనిది యని చెప్పుటయేగాక, కొందఱు బ్రాహ్మణులు తనకు నీక్రిందివి పదునెనిమిది పురాణములని చెప్పిరని వ్రాసెను: ఆది, మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, వాయు, నంద(ది?), స్కంద, ఆదిత్య, సోమ, శంభు, బ్రహ్మాండ, మార్కండేయ, తార్క్ష్య, విష్ణు, బ్రహ్మ, భవిష్యపురాణములు. * దీనినిబట్టి చూడ నాకాలమువఱకుఁ బదునెనిమిదికంటె నెక్కుడు పురాణము లుండెననియు అందుఁ గొన్ని అష్టాదశములోనివియని కొందఱు మఱికొన్ని యని మఱికొందఱును చెప్పుచుండిరనియు మన మూహింపవచ్చును. ఇది అష్టాదశపురాణములయొక్క చివరకాలమితి. అంతమాత్రముచే నప్పుడున్నట్టులనే యిప్పుడును అన్నిపురాణములును ఉన్నవి; వానిలోఁ గ్రొత్తవిషయములు చేరలేదని గాని, ప్రాఁతవిషయములు తగ్గలేదనిగాని భావముకాదు. ౧౮ పురాణములు ముఖ్యమైనవనియు, మిగిలినవి వానికంటెఁ దక్కువయోగ్యమైనవనియు నొక నమ్మకము జనులకు నప్పటివఱకుఁ గల్గినది. 'అష్టాదశ' అను సంఖ్యకు గౌరవమేర్పడినది.

శంకరాచార్యులకాలము (౮-వ శతాబ్దము) వఱకుఁ గొన్ని పురాణములు విఖ్యాతిచెందినవి; గాని పదునెనిమిది పురాణములు స్థిరపడినట్లు కానరాదు. శంకరాచార్యులవారు ఇతిహాసపురాణములఁ జెప్పునపుడు ఏకవచనము ప్రయోగించెదరే గాని బహువచనము ప్రయోగింపలేదు. మార్కండేయపురాణమునుండి యొక శ్లోకమును ఉద్ధరించిరి గాని పురాణముపేరు చెప్పలేదు. 'స్మృతిరపి' అని మాత్రము చెప్పినారు.[1] శారీరకసూత్రభాష్యమందు వేదములతోఁబాటు ఇతిహాసపురాణములు కూడ నమ్మఁదగినవని యొక్కచోట సాధించినారు.[2] అచ్చటఁ గూడ నేకవచనప్రయోగమే కలదు. ఇందువలన నప్పటికి ౧౮ సంఖ్య యేర్పడలేదనియు, కొన్ని

1 నేను అచ్చుపడిన గ్రంథములను మాత్రము చూచితిని. వేఱువేఱు దేశములందలి వ్రాతప్రతులను చూచి యింకను శోధింపవలెను.

* Trubner's Oriental Series. Alberuni's India chap XII, translated by E, C. Sachan.

1. శారీరకభాష్యము ౧. ౨. ౨౩; 3. 3. ౧౬ ఈ స్థానమం దుదాహరింపఁబడిన "సవై శరీరీ ప్రథమః సవై పురుష ఉచ్యతే, ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత" అను శ్లోక మిప్పటి మార్కండేయపురాణమునందు ౪౫-వ అధ్యాయమున ౬౪-వ శ్లోకముగఁ గలదు. 2 'తస్మాత్ సమూలమితిహాసపురాణమ్.' [౧. ౩. ౩౩] ఈవాదమంతయు శ్లోకాత్మకపురాణమును గుఱించి గాదనియు, బ్రాహ్మణములోని 'ఇతిహాసపురాణము' అనఁబడు భాగమును గుఱించినదనియుఁ గొందఱిమతము.

పురాణములు వేలువేలుగ నున్నను అవియన్నియు నొక్క పురాణముగనే యెంచఁబడుచుండెననియు నూహింపఁబడుచున్నది.[1]

౭-వ శతాబ్దమువాఁడైన బాణభట్టు వాయుపురాణముల నెఱుంగును.[2] క్రీ. శ. ౫-వ శతాబ్దమున హిందువులు కొందఱు వెడలి బలిద్వీపమునకు వెళ్లిరి. వారు వెళ్ళునప్పుడు వెంట బ్రహ్మాండపురాణమును తీసికొని వెళ్ళిరి.[3] కావున నప్పటికే యీపురాణ ముండవలెను. అచ్చటి పురాణమునందు నిప్పుడు మనదేశమునందుఁ గానవచ్చెడి బ్రహ్మాండపురాణములోని భవిష్యత్ రాజ కథనము కానరాదు.

నేపాళదేశమందు హరిప్రసాదశాస్త్రిగారికి క్రీ. శ ౯౯౮ లో వ్రాయఁబడిన దేవీమాహాత్మ్యము దొరికినది. ఇది యిప్పుడు మార్కండేయపురాణమునం దున్నది అట్లె స్కాందపురాణమందలి కొంతభాగము ౬-వ శతాబ్దమునందో ౭-వ శతాబ్దమునందో వ్రాసినది దొరికినది.[4] అట్లె జైనపద్మపురాణ మొకటి కలదు. అందులో నీయఁబడిన కాలమువలన నది క్రీ. శ. ౬౭౮ లో వ్రాయఁబడినట్లు కానవచ్చుచున్నది. అందు హిందువుల యన్ని పురాణముల పేళ్లు చెప్పఁబడియున్నవఁట.[1] ఇట్లు క్రీ. శ. ౫-వ శతాబ్దమువఱకు నొక్క పురాణము గాని, మూడునాల్గు పురాణములుగాని ఉండెననియు, తరువాత ౧౧-వ శతాబ్దమువఱకు నవి ౧౮ గను, ఇంక నెక్కువగను అభివృద్ధియయ్యెననియు మన మొకవిధముగఁ గాలనిర్ణయము చేసికొనవచ్చును.

పురాణములలోని భవిష్యకథనముఁ గూడ వాని కాలముఁ దెలిసికొనుటకుఁ గొంత తోడ్పడుచున్నవి.

**పురాణములలోని భవిష్యకథనములు**

మత్స్య, వాయు, బ్రహ్మాండ విష్ణు, భాగవత, గరుడ, భవిష్య. పురాణములలో ముందు రాఁబోవు రాజుల చరిత్రములు చెప్పెదమనివార్య, శుంగ, ఆంధ్రాదిరాజుల రాజ్యకాలములు చెప్పఁబడినవి.[2] ఇప్పుడు శాసనాదికములవలన నీరాజుల కాలములు నిర్ణయింపఁబడినవి. వాయు, బ్రహ్మాండ, విష్ణు, భాగవతపురాణములలో గుప్తవంశోదయమువఱకుఁ జెప్పఁబడినది. గుప్తవంశములోని మొదటి రాజయిన చంద్రగుప్తుఁడు క్రీ. శ. ౩౧౯-౨౦ లో రాజ్యమును స్థాపించెను. గుప్తవంశములు రెండు కలవు. ౧-వ గుప్తవంశము ౨-వ కుమారగుప్తునితో క్రీ. శ. ౫౩౦ ప్రాంతమున ముగిసెను. చివర

---

[1] 'విష్ణుసహస్రనామభాష్యం' 'సనత్సుజాతీయభాష్యం' అను రెండు గ్రంథములు శ్రీశంకరాచార్యుని పేరఁ గానవచ్చుచున్నవి. వానిలో విష్ణుపురాణము, విష్ణుధర్మోత్తరము అను పురాణములయందలినుండి శ్లోకములు గ్రహింపఁబడినవి. కాని యీభాష్యములు ఆదిశంకరరచితములగునా యన్న సంశయము కలదు. [2] గమక్రైగ్మనుశైరాత్రి పవమానంసిశ్రోత్రాణాం గీత్వా పవమానప్రోక్తం పురాణం పపాఠ [హర్షచరిత్ర నిర్ణయసాగరప్రతి. పుట ౮౫-౮౬]; యత్రచ మహాభారతే శకునివధః పురాణే వాయుప్రలపితమ్. [కాదంబరి Peterson's Edition P. 4.] 3. Trubner's Oriental Series Vol II P. 74 R. Triederich's Essays relating to Cochin china.

4. Bibliotheca Indica: The *Markandeya Purano*, English translation by Pargiter, Introduction P. XIII.

1. Ditto ఈ జైనపురాణ మింకను చక్కగ శోధింపఁబడవలెను. పర్గిటర్ గూడ దీనిని చూడలేదు. ఎవరో చెప్పగ విని వ్రాసెను.

2. ఏయే పురాణమునందు నెచ్చటెచ్చట నీ భవిష్యద్రాజ వంశ వర్ణనమున్నది యిచ్చటఁ జూపుచున్నారము:— మత్స్యపురాణము (ఆనందాశ్రమప్రతి) ౫౦. అ. ౫౭-౯౯; ౨౭౧-౨౭౩ అధ్యా "బ్రహ్మాండపురాణము (వెంకటేశ్వర ఛాపఖానాప్రతి, ౭౪ అధ్యా. ౧౦౪-౨౪౮. శ్రీమద్భాగవతము (బృందావనమూర్తి) ౧౨ స్కం. ౧ అ. ౨. వ శ్లో. మొదలు ౨ అ. ౪౦ శ్లో. వఱకు. వాయుపురాణము (ఆనందాశ్రమప్రతి) ౯౯ అ. ౨౬౩-౪౬౪ శ్లో. గరుడపురాణము (వెంకటేశ్వర ఛాపఖానాప్రతి.) ఆచారకాండము ౧౪౧ అ. శ్లో. ౧-౧౨. విష్ణుపురాణము. (బొంబాయి ఓరియంటల్ ముద్రాయంత్రాలయముమూర్తి) ౪-వ అంశము.

గుప్తవంశము మగధమున ౨౨౦ వఱకు నుండెను. కావున నీ పురాణములు ఈకాలముతరువాత వ్రాయఁబడిన వని మనము తలఁపవచ్చును. లేదా యందలి భవిష్యద్భాగ మైనను గుప్తకాలమునకుఁ దరువాత వ్రాయఁబడిన దనుటకు సందేహము లేదు. ఏటు చూచినను పురాణములకుఁ గొంతవఱకు నిప్పటి స్వరూపము ౬-వ శతాబ్దము తరువాతను ౧౧ వ శతాబ్దమునకుఁ బూర్వమును ప్రాప్తించినదనుటకు సందేహము లేదు.

పూర్వము ప్రాకృతభాషలో శ్లోకరూపముగఁ బూర్వరాజుల చరితము లుండెననియు, వానికే సంస్కృతరూపము కలుగఁజేసి పురాణకారులు తమ గ్రంథములలోఁ జేర్చుకొనిరనియుఁ గొందఱు పండితుల యభిప్రాయము. ఇందుకుఁ గొన్ని దృష్టాంతములు కలవు. ఇప్పుడు భవిష్యత్తుగాఁ జెప్పఁబడిన కొన్ని శ్లోకములలో ఛందోభాగములు గలవు. వానికిఁ బ్రాకృతరూప మొసంగినయెడల నాదోషము పోవును.3

ఈ పురాణములలోని భవిష్యద్రాజచరితంబు లన్నియు నొక్కసారి వ్రాయఁబడినట్టు కానరాదు. కాలము పోయినకొలఁదిని క్రొత్త క్రొత్త రాజచరిత్రములు చేర్చుచుఁ బోయిరి. ౬-వ శతాబ్దమునందు బలిద్వీపమునకుఁ గొంపోఁబడిన బ్రహ్మాండపురాణమునందు అసీమకృష్ణుని పర్యంతమే భవిష్యత్తు కలదు.4 గరుడపురాణము నందు ఐక్ష్వాక బార్హద్రదులకు మాత్రమే భవిష్యత్తు కలదు. [అ. ౧౪౧ శ్లో. ౧-౧౨] మత్స్యపురాణమునందు నితర పురాణములకంటెఁ దక్కువ భవిష్యరాజులు కలరు.5

భవిష్యపురాణముయొక్క వేలు వేలు ప్రతులలో వేలు వేలు విధముల భవిష్యరాజుల పేళ్లుండుటయే గాక, బొంబాయిప్రతిలో, చంద్రగుప్తుఁడు సెల్యూకస్‌కూతురు ను వివాహమాడుటయు, భర్తృహరి, విక్రమ, పాణిని, జీసస్ క్రైస్టు, పృథ్వీరాజు, తిమిరలింగ (తైమూరు), శంకరాచార్య, మధ్వాచార్య, రామానంద, కబీరాదులును, అక్బరు, ఔరంగజేబు, శివాజి, నాదిర్‌షాహ మొదలయినవారు వర్ణింపఁబడినారు! ఇంతతో నాగలేదు. ఇంగ్లీషువారు వర్తకమునకై యీ దేశమునకు వచ్చుటయు, కలకత్తానగరముఁ గట్టుటయు, మొదలయిన చరితమును, చివరకు 'వికటావతి' యను పేరిట విక్టోరియా ప్రభుత్వమును చేర్పఁబడి పురాణ మిప్పటి కాలమువఱకును (Up to date) తేఁబడినది.6 విక్టోరియా కనఁబడిన ఋషియొక్క దివ్యదృష్టికి నేలకో ఎడ్వర్డు, పంచమజార్జి కనఁబడలేదు! ఇప్పు డీపురాణ మచ్చయ్యెఁ గానసేక నాపే ళ్లిందుఁ జేరుట దుర్లభము7!

కొన్ని దినములవఱకు నష్టాదశపురాణము లెవ్వియన్న విషయమై వేలు వేలుమతస్థులు వేలు వేలు విధముగఁ జెప్పుచుండ మత్స్యపురాణకారుఁ

**పురాణముల సూచి**

డు ౧౮ పురాణముల పేళ్లును, అందలి విషయముల సూచియుఁ గొద్దిలోఁ దయారుచేసి పురాణమునందుఁ జేర్చెను. (౫౩వ అధ్యా.) ఇది లఘుసూచి. ఇది చాలదని కొంతకాలమునకుఁ దరువాత నారదపురాణకారుఁడు ౧౮ పురాణములందలి విషయములకుఁ బెద్ద సూచితయారు చేసెను (౯౨-వ అధ్యాయము). ఈపురాణసూచివలన నప్పు డీ పురాణముల స్వరూప మెట్టులుండెనో తెలియఁగలదు.

---

౨౧-౨౪ అధ్యా. భవిష్యత్పురాణము. (వెంకటేశ్వర ఛాపఖానాప్రతి.) ప్రతిసర్గ పర్వము ౧-వ ఖండము, 4-7 అధ్యా; ౨-వ ఖండము, 30 అధ్యా. ౪-వ ఖండము ౧-౨౬ అధ్యా. 2. Smith's Early History of India chap. II.

3 ఇందున గుఱించి యధికము తెలిసికొనఁ గోరువారు The Purana Text of the Dynasties of the Kali age by F. F. Pargiter అను గ్రంథము చూడనగును.

4. పురాణ నిరీక్షణము. ౧౬3-వ పుట. 5. ఆనందాశ్రమకూర్పు. అధ్యా ౨౭౧-౭3 చూడుఁడు. 6. వెంకటేశ్వరఛాపఖానాకూర్పు. ప్రతిసర్గ పర్వమందలి ౧-౪ ఖండములఁ జూడుఁడు.

7 ఈభాగము పురాణములోఁ జేర్చినవానికి నింగ్లీషు భాషకూడఁ గొంత వచ్చినట్లు కానవచ్చుచున్నది. ఆతఁడు ఇంగ్లీషువారిని గరుండులని చెప్పి ఆభాషాపదములను ఇట్లుదాహరించెను:—"రవివారే చ సండేచ ఫాల్గునే చైవ ఫర్వరీ, షష్టిశ్చ సిక్స్టీ జ్ఞేయా తదుదాహారణ మీదృశమ్." [ప్రతిసర్గ. ౧. ౬. 3౭]

నారదపురాణమందలి యీ సూచి ౯-వ శతాబ్దము తరువాత వ్రాయఁబడినదనుటకు నొక ప్రమాణము కాన వచ్చుచున్నది. బలిద్వీపమునకు ౯-వ శతాబ్దమునందుఁ గొందఱు హిందువులు వెళ్లుచు బ్రహ్మాండపురాణమును తీసికొనివెళ్లిరి. అందు భవిష్యద్రాజవంశావళి లేదు. కాని నారదపురాణములోని బ్రహ్మాండపురాణసూచికయందు భవిష్యద్రాజవర్ణన మున్నట్టు వ్రాయఁబడినది. కావున నీవర్ణనము (ఈ పురాణమని చెప్పినఁ జెప్పవచ్చును.) ౯-వ శతాబ్దాంతమున. ఈ పురాణసూచి శంకరాచార్యులకుఁ (౮ వ శతాబ్దమునకు) బూర్వపుది యని చెప్పుటకు నొక కారణము చెప్పెదరు. ఆచార్యులవారు విష్ణుసహస్రనామభాష్యములో విష్ణుపురాణము వేఱుగను, విష్ణుధర్మోత్తరము వేఱుగను భిన్నగ్రంథములైనట్టు ఉదాహరించినారు.[1] కాని నారదపురాణమునందు నీ రెండును విష్ణుపురాణమైనట్టు సూచి యీయఁబడెను. కావున నీడట ననగా నారద పురాణకాలమున విష్ణుధర్మోత్తరము విష్ణుపురాణభాగముగ నుండెననియు' తరువాత నాచార్యులకాలమున నవి రెండును వేఱువేఱు గ్రంథములుగా నెంచఁబడుచుండెననియు నూహింపవలెననియు కొందఱిమతము.[2] కాని విష్ణుసహస్రనామభాష్యము ఆదిశంకరులది అగునో కాదో యని సంశయము కలదు. కావున ఈ కాలమితి నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేదు.

నారదపురాణోక్తసూచి ననుసరించి చూచినయెడల నిప్పటి కొన్ని పురాణములలోఁ బెక్కు భాగములు క్రొత్తవి యని స్పష్టముగఁ జెప్పవచ్చును. ఇప్పటి బ్రహ్మాండ పురాణమునందు నారదోక్తలక్షణము లేవియు లేవనియు అప్పటి బ్రహ్మాండపురాణము, వాయుపురాణములో, గలిసిపోయినదనియుఁ గొందఱిమతము.[3] కొందఱిమతమున అసలు బ్రహ్మాండపురాణము పూర్తిగ లోపించినది.[4]

క్రీ. శ. ౧-వ శతాబ్దమువాఁడగు నమరసింహుఁడు 'పురాణము' నకుఁ బంచ లక్షణములు చెప్పినాఁడు.

## పురాణములందలి మొదటి భాగము లెవ్వి? తరువాతఁ గలుపఁబడిన వెవ్వి?

కావున నప్పటి పురాణమందుఁగాని, పురాణములందుఁగాని, ఈ అయిదు విషయములే యుండె ననుటయు, నితరవిషయములు లేవనుటయు స్పష్టము. సర్గము, ప్రతిసర్గము, వంశము, వంశానువర్ణనము, మన్వంతరము- అను అయిదులక్షణములవలన ఆకాలపుఁ బురాణమున సృష్ట్యుత్పత్తిక్రమము, బ్రహ్మాదులచేఁ జేయఁబడిన ప్రతిసృష్టియు మనువుల చరిత్రములును దేవదానవవంశవర్ణనములును, సూర్యచంద్రాది వంశచరిత్రలును ఉండె ననుట స్పష్టము. ఈవర్ణనములకు మించిన విషయములన్నియుఁ దరువాతఁ గల్పఁబడినవని మనము తెలిసికొనవచ్చును. శివవిష్ణుదేవీ గణపతి మొదలయినవారి మాహాత్మ్యములు, అవతార వర్ణనములు, శివకేశవాదిదేవతల నిందలు, మతద్వేషజన్య వాక్యములు, ముద్రాధారణ లింగధారణములవంటి వీర శైవ వైష్ణవవాదములు, సోమవారాదివ్రతములు, క్షేత్ర తీర్థ పుణ్యాదిన మాహాత్మ్యంబులును,భవిష్యకథనంబులును అలంకారాది శాస్త్రములవంటి శాస్త్రప్రశంసయు నిట్టి వన్నియు నూతనములని యెఱుంగవచ్చును. అన్ని పురాణములును పైని చెప్పిన పంచలక్షణములే చెప్పుచుండ, పురాణములలోని విషయములు పెరిగి, అవతారవర్ణనమే వాని ముఖ్యవిషయము కాగాఁ బూర్వపు లక్షణము పనికి రాదని తెలిసికొని, భాగవతమునందు, బ్రహ్మాండపురాణమునందుఁ బురాణమునకు నూతనముగఁ దశలక్షణములు కల్పింపఁబడినది.[1] పది లక్షణములు గలది మహాపురాణమనియు, అయిదు లక్షణములు కలది యల్పపురాణ మనియుఁ జెప్పఁబడినది. కావున నవతారములు గల వాక్యము లన్నియు క్రీ. శ. ప్రారంభమైన తరువాతను, భవిష్యాదు లన్నియు ౯-వ శతాబ్దము తరువాతను మిగిలిన మాహాత్మ్యాదు లన్నియు నీ మధ్యకాలమునను

1 "విష్ణుపురాణాంతే శ్రీపరాశరేణోపసంహృతం 'యస్మిన్నశేషమతిః' ఇత్యాది" [విష్ణుసహస్రనామ భాష్యము.]

2 శ్రీ త్ర్యంబక గురునాథ కాలేరచిత 'పురాణనిరీక్షణ' మను మరాఠీగ్రంథము. పుట౬౧. 3 అష్టాదశ పురాణదర్పణము. పుట౪౦౯.4 పురాణనిరీక్షణ్. పుట ౧౯౭.

1. ఈ వ్యాసమునందు ౧౭౦3-వ పుటలో క్రింది భాగమున నీయఁబడిన భాగవత వాక్యములు చూడ నగును. [భాగ. ౧౨. ౭ అ.]

చేర్చఁబడిన దని యొక యూహ చేయవచ్చును. ఇట్లు మనము ప్రక్షిప్తము లని యెంచిన భాగము లన్నియుఁ బురాణములలోనుండి తీసివేసినయెడల, ప్రతి పురాణము నందును, సృష్ట్యుత్పత్తి, దేవదానవోత్పత్తి, సూర్యచంద్ర మన్వాదుల వంశవర్ణనము మాత్రము నిలుచును. ఈ నిల్చిన దంతయు బహుస్వల్పముగను, ఒక పురాణము మఱియొక పురాణమునకుఁ బ్రతిగనో, కొంచెము రూపాంతరముగనో ఉండును. ఇట్లు మొదట ఒక్కటిగను ౧౨౦౦౦ మాత్రముగను ఉన్నదని మనము విన్న మూల పురాణము మనకు లభించును! సృష్టి, దేవదానవులు, మనువుల సంతానము, సూర్యచంద్రాది వంశములు మొదలగు కథానకములు సాధారణముగా నన్ని పురాణము లందును ఉండును. ఇవియే భారతమునందును గాన వచ్చును. అట్టి సామాన్యభాగములే మనము మూలపురాణమని తెలిసికొనవచ్చును.

మన మొక్కపురాణమును తీసికొని పైఁజెప్పిన పద్ధతి ప్రకార మందలి ప్రక్షిప్తము లెవ్వియో ఇతరపురాణములనుండి తీసికొనిన భాగము లెవ్వియో, మూలగ్రంథ మెద్దియై యుండునో విచారించిన యెడల మేము చెప్పిన విషయము కొంత వఱకు స్పష్టపడఁగలదు.

**బ్రహ్మపురాణ శోధన.**

మొదటిదియైన బ్రహ్మపురాణముఁ దీసికొందము. ఆనందాశ్రమగ్రంథావళిలోని బ్రహ్మపురాణమును గుఱించి విచారింతము. ఇందు ౨౪౬ అధ్యాయములును, ౧౩౭౮౩ శ్లోకములును కలవు. ఇందు నిప్పటి నారదపురాణప్రకారము (౪.౨.)౧౦౦౦౦ శ్లోకములును, ఇప్పటి మత్స్యపురాణప్రకారము ౯౩.౧౩.) ౧౩౦౦౦ శ్లోకములును ఉండవలెను. కావునఁ బైపైఁ జూచినను ఇందు నారదపురాణప్రకారము ౩౭౮౩ శ్లోకములును, మత్స్యపురాణప్రకారము ౭౮౩ శ్లోకములును ఎక్కువ యున్నమాట స్పష్టము. అనిశ్చితమైన యీసంఖ్యలను విడిచి గ్రంథములోని విషయములను విచారించితిమేని ప్రక్షిప్తమని మనకు వెంటనే తోఁచునది "గోదావరి మాహాత్మ్య"మను భాగము. ఇది ౭౦-వ అధ్యాయము మొదలు ౧౭౬ వ అధ్యాయమువఱకు నున్నది. ఇందలి, అధ్యాయసంఖ్య ౧౦౭, శ్లోకసంఖ్య ౪౬౦౦. ఇట్టీమాహాత్మ్యమే పురాణములో మూడవవంతుకంటె నధికముగ నున్నది. కాని యిది స్వతంత్రగ్రంథము. నాగరాక్షరములతో ఆంధ్రాక్షరములతోను విడిగ అచ్చుపడియున్నది. బ్రహ్మపురాణమునందు దీనిని నడుమ నిరికించినవారు, మాహాత్మ్యప్రారంభమునుండి అధ్యాయసంఖ్య, పురాణమందలి క్రమాగతమైన అధ్యాయసంఖ్య తోటిపాటు ఇచ్చినారు. అనగా నీ.మాహాత్మ్యముయొక్క ౧-వ అధ్యాయము చివర 'ఇతి మహాపురాణే ఆదిబ్రాహ్మే ......తీర్థ భేదవర్ణనం నామ సప్తతి తమోఽధ్యాయః" అనియు, "గౌతమీమాహాత్మ్యే ప్రథమోఽధ్యాయః ౧." అనియు నిచ్చియున్నారు. వెంకటేశ్వరముద్రలయప్రతిలో ఈమాహాత్మ్యము పురాణముయొక్క నుత్తరభాగమునందు నీయఁబడినది. ఆనందాశ్రమ వారికి దొరికిన కొన్నిప్రతులలో నీభాగము లేనేలేదు. కావున గోదావరియొడ్డున నుండెడి వారిచే వ్రాయఁబడిన యీ మాహాత్మ్యము వెనుకనుండి బ్రహ్మపురాణమునందుఁ జేర్చఁబడిన దనుటకు సందేహము లేదు. ఈ యూహనే స్థిరపఱుచుటకు నింకొక ప్రబలప్రమాణము కలదు. నారదపురాణమునందు నన్నిపురాణములలోని విషయములిచ్చుతరి బ్రాహ్మపురాణసూచిలో గోదావరీమాహాత్మ్యము చెప్పఁబడలేదు. [౪.౨] కొద్ది శ్లోకములలో వర్ణింపఁబడిన నరకవర్ణన, పార్వతివివాహము మొదలైనవానిఁ జేర్చుకొనిన వాఁడు పురాణములో మూడవ వంతు నాక్రమించుకొనిన గోదావరీమాహాత్మ్యము చెప్పక పోవునా? కావున నారదసూచి తయారు చేయఁబడిన కాలమునందు బ్రహ్మపురాణమున గోదావరీమాహాత్మ్యము లేదనుట సుస్పష్టము. ఇట్లు మన మొక్క దెబ్బన ఈ పురాణమునుండి ౪౬౦౦ శ్లోకములను మినహాయింపవచ్చును.

గోదావరీ మాహాత్మ్యము తరువాత నిందుఁ గానవచ్చెడి పెద్దప్రక్షిప్తము కృష్ణచరిత్రము. ఇయ్యది ౧౮౦వ అధ్యాయమునుండి ౨౧౨ వఱకు, 33 అధ్యాయములలోను, ౧౩౬౪ శ్లోకములతో వర్ణింపఁబడినది. ఇది యంతయుఁ బ్రక్షిప్తమనుటకు మనము వేఱు ప్రమాణము వెదుక నక్కరలేదు. విష్ణుపురాణముఁ జూచినఁ జాలును. బ్రహ్మపురాణమందలి యీ 33 అధ్యాయ

ములును విష్ణుపురాణమందలి ౫-వ అంశమునఁగల 3౮ అధ్యాయములకుఁ బ్రతి. అసలుకు సరియైన నకలు. కొన్ని చోట్లఁ గొన్ని ప్రకరణములు వెనుక ముందు నుండును. కొన్ని శ్లోకములపాఠము కొద్దిగమారియుండును. ఇంతియ. రెండును ఒక్కటియే యని చెప్పవచ్చును. కావున ఈభాగమంతయు, నీ పురాణమునందు విష్ణుపురాణములోనుండి కల్పఁబడెననుట స్పష్టము. కావున ఈ౧3౬౮ శ్లోకములును ఇందుండి తొలఁగింపవలసినదే.

విష్ణుపురాణమే బ్రహ్మపురాణములోనుండి యీ శ్లోకములను గ్రహించి యుండవచ్చును, అని కొందఱు చెప్పవచ్చును. అదియు మాకు నిష్టాపత్తియే. అప్పు డా శ్లోకములు విష్ణుపురాణమునుండి తొలఁగింప వలసి వచ్చును. రెండుపురాణములలోను ఒకే విషయమున్న దని చూపుట మాయుద్దేశము.

ఇఁక విష్ణుపురాణమునుండి శ్లోకమును సంగ్రహించుట నారదసూచికిఁ బూర్వముజరిగెనా, తరువాత జరిగెనా, యని విచారింపవలెను. నారదపురాణ కాలమునఁ గూడ నీభాగ మిందు లేదనియే నా తాత్పర్యము. నారదసూచిలో 'కృష్ణస్య జగదీశస్యఃచరితం కల్మషాపహ' మ్మని యున్న మాట వాస్తవము. కాని అది యెచ్చటనుండెనని యున్నది? పూర్వభాగమందును, పురుషోత్తమవర్ణనమునకు, పార్వతీ వివాహమునకుఁ బూర్వమును, యాదవవంశ కీర్తనముచేయునప్పుడును చెప్పఁబడినట్లున్నది. అట్లె యిప్పటి పురాణమునందును ౧3-౧౭-వ అధ్యాయములలో చంద్రవంశ, వసుదేవ జన్మాది, శ్యమంతకోపాఖ్యానాదికములు వర్ణింపఁబడియున్నవి. నారదసూచిలోని కృష్ణచరిత మిదియేగాని పురుషోత్తమవర్ణనము తరువాత వచ్చునట్టిదియు; విష్ణుపురాణమునుండి గైకొనినదియు నగు పెద్ద కృష్ణచరిత్ర కాదు. విష్ణుపురాణమునుండి తెచ్చిన కృష్ణచరిత్ర పురుషోత్తమవర్ణనమునకుఁ దరువాతను యోగవర్ణనమునకుఁ బూర్వమును ఉన్నది. అనగా నారద సూచిప్రకారము పూర్వభాగమునకును ఉత్తరభాగమునకును నడుమనున్నది. కావుఁ గ్రొత్తగఁ జూర్చినవాఁడు దానిని పూర్వభాగమునకుఁ జివర తెచ్చి పెట్టెను అని భావము!

బ్రహ్మపురాణకారుఁడు విష్ణుపురాణమందలి ౫-వ అంశము నంతయుఁ దీసికొనుటయే గాక, యితర భాగముల నుండియుఁ గొన్ని శ్లోకములను తీసికొని యున్నాఁడు. బ్రహ్మపురాణ మందలి ౧ అధ్యా. ౨౧-౨౭ శ్లోకములును విష్ణుపురాణ ౧ అం. ౨ అధ్యా. ౧-౭ శ్లోకములును, బ్రహ్మపురాణమందలి ౧౮-౨3 అధ్యాయములలోని 3౧౦ శ్లోకములును విష్ణుపురాణమందలి ౨ అం. ౨-౭ అధ్యాయములలోని శ్లోకములును, బ్రహ్మపురాణమందలి ౨౨౨ అధ్యాయమందలి ౫౬ శ్లోకములును విష్ణు. 3 అం. ౮-౯ అధ్యాయమందలి కొన్ని శ్లోకములును, బ్రహ్మపురాణ మందలి ౨౨౯-౨33 అధ్యాయములలోని ౨౮౫ శ్లోకములును విష్ణు. ౬ అం. ౧-౫-వ అధ్యాయమందలి శ్లోకములును సమానములు. ఒక పురాణమును చూచి మఱియొక పురాణమునందు వ్రాయఁబడినవి. ఇట్లీపురాణమునుండి యింకను ౬౫౮ శ్లోకములు తగ్గింపవలెను.

విష్ణుపురాణమును బ్రహ్మపురాణమును ఇంకను శ్రద్ధతో పోల్చి చూచినయెడల నింకను పెక్కు సమాన శ్లోకములు కానరావచ్చును. బ్రహ్మపురాణమును అభివృద్ధి చేసి వ్రాసినవాఁడు విష్ణుపురాణమును అనుసరించి పెంచినట్లు కానవచ్చుచున్నది. మొదట బ్రహ్మపురాణము బ్రహ్మపరము, బ్రహ్మయొక్క యాధిక్యతను

---

1. అయినప్పటికి నే పురాణమునుండి యేపురాణము సంగ్రహించెనని విచారింప వలసిన యెడల విష్ణుపురాణమునుండియే బ్రహ్మపురాణము గ్రహించియుండ వచ్చునని,యిప్పుడు మనకుఁ గల సాధనములనుబట్టి చెప్ప వలెనని నాతాత్పర్యము. విష్ణుపురాణమును వెన్నెల కంటి సూరన్న తెనిఁగించియున్నాఁడు. అందు ఈ కృష్ణ చరితమంతయుఁ గలదు. [చూఁడు ౭ వ అ.] ఈ కవి ౧౬-వ శతాబ్ద ప్రారంభము వాఁడు. (ఆంధ్ర కవుల చరిత్రము. ౨. భా) కావున ౪౦౦ సంవత్సరముల క్రిందనే ఈభాగము విష్ణుపురాణమునం దుండెననుట నిశ్చయము. అప్పుడు బ్రహ్మపురాణములోఁగూడ నీ భాగ ముండెననుటకుఁ దగిన ప్రమాణములు దొరుకు వఱకు విష్ణుపురాణ శ్లోకములే మూలములని అనుకొన వచ్చును.

ప్రతిపాదించునదిగను నుండెననుటకుఁ బైని చూపఁబడిన శివరహస్యఖండమందలి వాక్యములే ప్రమాణము. ఇది మొదట విష్ణుమహిమఁ జెప్పునది కాదనుటయు స్పష్టము. ఏలయన వైష్ణవులు పురాణములను సాత్త్విక, రాజస, తామసములుగ విభజించి విష్ణుప్రతిపాదికములను సాత్త్వికములుగను, మిగిలినవానిని రాజస తామసములుగను చెప్పిరి. వారి గణనప్రకారము 'బ్రహ్మ' పురాణము తామసపురాణము [గరుడపురాణము ననుసరించిన జాబితా చూడుఁడు. ఉత్తరఖండము. బ్రహ్మకాండము ౧-వ అధ్యా.] అనగా నితర దేవతలను ద్వేషించునట్టి పట్టుదల గల రామానుజాది సంప్రదాయములు పుట్టిన తరువాతఁగూడ నీ పురాణము బ్రహ్మపరముగ నుండెనే కాని, విష్ణుపరముగ లేదు. ఇప్పు డచ్చుపడిన పురాణమో మొదటినుండియుఁ జివరవఱకు విష్ణుమహిమతో నిండియున్నది. ఇంతియకాదు.— తనను ఎవరైన వైష్ణవపురాణమందురో లేదో యని భయము గలిగి 'నేను వైష్ణవపురాణమును' అనికూడ చెప్పుకొనినది! 'పురాణం వైష్ణవం త్వే తత్సర్వ కిల్మిషనాశనమ్' [౨౭౫-౨౦] అని యున్నది. కావున ౧౨-వ శతాబ్దము తరువాత వైష్ణవసంప్రదాయమువారు, అంతకుఁ బూర్వము బ్రహ్మపరముగా నున్న వానిని విష్ణుపరముగఁ జెంచిరి; ఇతరవైష్ణవపురాణములలో నుండి ప్రకరణములకుఁ బ్రకరణములే తెచ్చి యిందు దూర్చిరి అని యూహింపవచ్చును.

ఇది మూలబ్రహ్మపురాణము కాదేమో యని సంశయించుటకు నింకొక హేతువుకూడఁ గలదు. మత్స్యపురాణమునందు ఈ పురాణమును గురించి యిట్లు చెప్పఁబడినది:—

బ్రహ్మణాభి హితంపూర్వం యావన్మాత్రం మరీచయే,
బ్రాహ్మంత్రిదశసాహస్రంపురాణంపరికీర్త్యతే.౫౩-౧౩

దీనిని బట్టి మాత్స్యపురాణ కాలమందలి బ్రహ్మపురాణము మరీచిఋషికిఁ బ్రహ్మచేఁ జెప్పఁబడెను, కాని యిప్పు డచ్చుపడిన బ్రహ్మపురాణమునందు నది దక్షాదిమునులకు బ్రహ్మచెప్పినట్లున్నది[1] [౧-౩౦] మరీచిఋషి పేరేలేదు! కావున నిదియె మత్స్యపురాణ వర్ణిత బ్రహ్మ పురాణమని చెప్పుట యెట్లు?

మొదటి బ్రహ్మపురాణమందు బ్రహ్మమహిమయే యెక్కుడుగ నుండెననియు, విష్ణుమహిమ లేకుండెననియుఁ జూపుటకు నీ పురాణమునందె అచ్చటచ్చటఁ గొన్ని సూచనలు కానవచ్చును. ధ్రువునిసంగతి వ్రాయుచు నీపురాణకారుఁ డిట్లు వ్రాసియున్నాఁడు:—

"ఓద్విజులారా! ధ్రువుఁడు గొప్పయశస్సును కోరి మూడువేల దివ్యవర్షములు తపస్సు చేసెను. వానికిఁ బ్రీతుఁడైన బ్రహ్మ, తన స్థానములో సమానమైన యచలస్థానమును సప్తర్షులకుఁ బైన నిచ్చెను. అతని అభిమానవృద్ధియు, మహిమయుఁ జూచి, దేవాసురుల గురువైన బృహస్పతి ఒకశ్లోకము రచించెను. (అది యేదియన) ఇతనిని ముందిడుకొని సప్తర్షులు ఉన్నారే! అహా! ఏమి యీతని తపస్సు శక్తి! అద్భుతము! అద్భుతము!" [౨-౧౦-౧౩]

1 ఈ సంగతి మొదటఁ జూపినవాఁడు విల్సన్. అతనిని ఎవరును సరిగ ఖండించినవారు కారు. బంగాలీ విశ్వకోశకారుఁడు ఖండించుటకు యుక్తి చూపినాఁడు. బ్రహ్మపురాణము [౧-౩౦] లో దక్షాదులకుఁ జెప్పినట్లు ఉన్నను [౨౬-౩౫] లో 'మరీచ్యాద్యాస్తదా దేవం ప్రణిపత్య పితామహం, ఇదమర్థమృషివరాః పప్రచ్ఛుః పితరం ద్విజాః' అని యున్నది; కావున 'మరీచి'కి బ్రహ్మ చెప్పెననియు నన మనుకొనవచ్చును అని బం. వి. కారుని మతము. దీనినే మతికొందఱు అనువాదించిరి. కాని అనేకప్రతులను చూచి పాఠాంతరములను జూపుచు మిక్కిలి శ్రద్ధతో బ్రహ్మపురాణమును ప్రకటించిన ఆనందాశ్రమప్రతిలో 'భృగ్వాద్యాః' అనిన పాఠమున్నదే గాని 'మరీచ్యాద్యా' అన్న పాఠము లేదు. ఒకవేళ నెక్కడనో 'మరీచ్యాద్యాః' అనుపాఠ మున్నదనుకొనినను 'మరీచయే' 'ఒక్క మరీచికి' అని మత్స్యపురాణములో నుండగా దానికి మరీచి మొదలయిన అసంఖ్యఋషులకుఁ జెప్పినట్లున్న యీశ్లోక మెట్లు అన్వయించునో తెలియకున్నది. అట్లన్వయించు నన్నను ౨౬-వ అధ్యాయమునుండియే బ్రహ్మపురాణ మగును. మొదటి ౨౬ అధ్యాయములును ప్రక్షిప్తము లనవలసివచ్చును. ఇట్లే విష్ణుపురాణము మరీచి కొక్కనికే చెప్పఁబడినది. కావున నొక్కొక్కనికిఁ గూడఁ బురాణము చెప్పబడియుండవచ్చును.

విష్ణు, భాగవత పురాణములందు ధ్రువుఁడు విష్ణువును గుఱించి తపస్సు చేసినట్లు చెప్పఁబడినది. సాధారణముగ ధ్రువుఁడు విష్ణుభక్తులలో నొకఁడుగఁ జెప్పఁబడును. అందుకు వ్యతిరేకముగ నిచ్చట ధ్రువుఁడు బ్రహ్మను గుఱించి తపస్సుచేసి ఉన్నతస్థానమును వడసెనని చెప్పుట వింత! కావున బ్రహ్మపురాణము ఒకప్పుడు బ్రహ్మమహిమఁ బొగడుటకు వ్రాయఁబడె నని తోఁచుచున్నది.

ఈపురాణమునందొక్క విష్ణుపురాణము నుండియే గాక, యింకను అన్యపురాణములనుండియు, భారతాదుల నుండియుఁ గథానకములును, శ్లోకములును గ్రహింపఁబడినవి. ఇందు ౪౩-౬౯ అ. వఱకు జగన్నాథమాహాత్మ్యము వర్ణింపఁబడినది. అందలి సగముకంటె నెక్కుడు శ్లోకములు, రమారమి ౨౦౦ లు, నారదపురాణము యొక్క ఉత్తరభాగమందలి ౯౭-౬౧ అధ్యాయములో నున్నవి. బ్రహ్మపురాణమందలి ౨౨౩-౨౭౬ అధ్యాయములోని ౨౩౦ శ్లోకములు మహాభారత, అనుశాసన పర్వము ౧౪౩-౧౪౬ అధ్యాయములం దున్నవి. అట్లే బ్రహ్మపురాణమందలి ౧-౯ అధ్యాయములలోని రమారమి ౪౦౦ శ్లోకములు హరివంశమునందు ౧-౭ అధ్యాయములలోఁ గానవచ్చును.

ఇట్లు ప్రక్షిప్తభాగములక్రింద నేమి యితరపురాణములతో సమానముగనున్న భాగములక్రింద నేమి రమారమి ౮౦౦౦ శ్లోకములను ఈ పురాణమునుండి తగ్గింపవలసి వచ్చుచున్నది. పురాణముల కన్నిఁటికిని తగిన సూచి లేర్పడి యింకను పెక్కుపురాణములను వెదకిన యెడల నిందలి మఱికొన్ని భాగములును తగ్గిపోవునని నాతాత్పర్యము. ఇట్లు ౮౦౦౦ శ్లోకములు పోగా మిగిలిన ౯౭౦౦ శ్లోకములలోని కథాభాగ మేది యని విచారింపగాఁ దేలునట్టి విషయములు: సూర్యచంద్ర వంశవర్ణనములు, పార్వతీవివాహకథానకము, శ్రాద్ధవిషయము, యోగవిషయము. చివర రెండువిషయములు పురాణలక్షణములలో లేనివి. కావున నివియుఁ బ్రక్షిప్తములే అయియుండనోపునని మన మూహింపవచ్చును. మొదటి రెండు విషయములు సర్వపురాణ సామాన్యములు. కావున మొదటి పురాణమునందు సూర్యచంద్రాది వంశవర్ణనమును దేవదానవచరిత్రమును మాత్రముండెనని మన మూహింపవచ్చును.

"అష్టాదశపురాణానాం కర్తాసత్యవతీ సుతః" అని సాధారణముగఁ జెప్పెదరు. కొన్ని పురాణములలోను చెప్పఁబడినది. [స్కాందపురాణాంతర్గత సూత సంహిత అ ౧. శ్లో: ౧౧.] కాని యిదివఱకుఁ జెప్పఁబడిన పురాణచరిత్రమునుబట్టి చూడఁగా నొక్కఁడే పురాణములను వ్రాసియుండఁడనియు, పెక్కుకాలములందుఁ బెక్కు పురుషులు వేలువేలు పురాణములు వ్రాయుటయేగాక, ఒక్కొక్క పురాణమందలి భిన్నభిన్న భాగములు, భిన్నభిన్న కాలములందు వేలువేలు పురుషులచే వ్రాయఁబడెననుటయు స్పష్టము. కొన్ని పురాణములలోని శైలి కొన్ని పురాణములందలి శైలిని పోలియుండదు.

**పురాణకర్త యొక్కఁడా? పెక్కుమందియా?**

ఇతరపురాణముల శైలికంటె శ్రీమద్భాగవతము శైలి కఠినపాకమున నుండును. ఇది కావ్యశైలి. కాళిదాస భవభూత్యాదుల కావ్యానంతరమున నిది యొకానొక పండితునిచే వ్రాయఁబడినట్లు కానవచ్చుచున్నది. ౧౨-వ శతాబ్దమువాఁడైన బోపదేవుఁడు దీనికర్తయన్న ప్రవాదము చాలకాలమునుండి కలదు. దీనినే దయానందసరస్వతియు, విల్సనుగూడ నమ్మిరి. కాని బోపదేవుఁడు భాగవతమును గుఱించి సారాంశరూపమైన గ్రంథములు మూడువ్రాసెను. వానిలో "హరిలీలా" గ్రంథము అచ్చుపడినది. అది శ్రీమద్ భాగవతముయొక్క అనుక్రమణికారూపము. కావున నాతఁడు మూలభాగవతమును వ్రాసియుండఁడు. బోపదేవుఁడు శా. శ. ౧౧౮౨ (క్రీ. శ. ౧౨౬౦)లో జన్మించెను. 'హరిలీల' పై హేమాద్రిటీక వ్రాసినాఁడు. వీరిద్దఱు సమకాలికులు. ఇతఁడు టీకలో శ్రీధరుని భాగవతటీక నుదాహరించినాఁడు. కావున భాగవతము అంతకుఁ బూర్వముండవలయును. [1]శ్రీమద్

1. ఈ విషయములను నేను 'పురాణనిరీక్షణము' నుండి గ్రహించినాఁడను. బోపదేవుని గ్రంథములు నేను స్వయముగఁ జూడలేదు. ఉత్తరగీతపై గాడపాదాచా

భాగవతము బోపదేవకృతము గాకపోయినను ౧౮ పురాణములలో నిది మిక్కిలి యర్వాచీనమని యందలి యుపోద్ఘాతమువలనను, కావ్యశైలివలనను చెప్పవచ్చును. ఈపురాణము కేవలము విష్ణువుయొక్క యవతారవర్ణనమునకై పుట్టుట కూడ దీనియర్వాచీనత్వముఁ జూపును. పూర్వపుఁ బురాణలక్షణములో నవతారకథనము లేదు. గనుక నిందు బురాణమునకుఁ గ్రొత్తలక్షణము కల్పించి 'రక్షణము' అనునది అవతార వర్ణనమని ప్రతిపాదించిన ట్లిదివఱకే చెప్పినాము.

ఈశ్వర చంద్రవిద్యాసాగరులవారు పురాణములను రచించినవారిని గుఱించి యిట్లు చెప్పియున్నారు:— "అన్ని పురాణములకంటె విష్ణుపురాణరచన ప్రాచీనమని తోఁచుచున్నది. పురాణములన్నియు వేదవ్యాస రచితములని ప్రసిద్ధి. కాని పురాణముల రచన యింత పరస్పర విభిన్నముగదా యవియన్నియు నొక్కనిచేతనే రచింపఁబడెనని చెప్పుటకు వీలులేదు. విష్ణు, భాగవత, బ్రహ్మవైవర్తపురాణముల యొక్కొక్కయంశమును చదివిచూడ నీ మూడు గ్రంథములను ఒక్కకలములోడనే వ్రాయఁబడినవని తోఁచుట దుర్లభము. విష్ణుపురాణము మొదలైనవాని రచనకును మహాభారతరచనకును ఇంత విభిన్నతకలదుగదా దానిని విష్ణుపురాణము గాని భాగవతము గాని, బ్రహ్మవైవర్తపురాణము గాని రచించినవాఁడె రచించెనని తోఁచదు."*

**పురాణములన్నియు బ్రాహ్మణేతరులచేఁ జెప్పఁబడినవి**

పురాణము చెప్పువాఁ డెప్పుడును సూతుఁడు. 'సూత ఉవాచ' అననిది పురాణమునకుఁ బురాణత్వము రాఁజాలదని మనవారి నమ్మకము. ఈసూతుఁ డెవఁడు? బ్రాహ్మణస్త్రీకి క్షత్రియ పురుషునివలనఁ బుట్టిన ప్రతిలోమజాతికి సూతులని పేరు. రథముతోలుట యిట్టి సూతజాతివారు చేయు పనులలో నొక్కటి. పురాణములను అనగాఁ బూర్వరాజవృత్తాంతములను చెప్పుటయు వీరు చేయుపనియే. "దేవతులయొక్కయు ఋషులయొక్కయు నమితతేజసులయిన రాజులయొక్కయు వంశచరిత్రములును, మహాత్ములస్తుతులను జ్ఞాపకముంచుకొనుట సూతులధర్మము" అని పద్మపురాణమునందుఁ[2] జెప్పఁబడినది. దీనినిబట్టి చూడ సూతులు వందిమాగధులవంటివారుగఁ గానవచ్చుచున్నారు. వీరికిఁగల భేదము జైమిని అశ్వమేధమునందు (అ. ౫౫. శ్లో. ౪౦-౪౧) నిట్లు చెప్పఁబడినది. "పురాణకాలమందలి రాజులను వర్ణించువారు సూతులు; ఇటీవలఁ జచ్చినవారలను వర్ణించువారు మాగధులు; యుద్ధముచేయు నిప్పటి రాజులను పొగడువారు వందులు."

పైవర్ణనముఁ జూడ సూతులనగా నిప్పటి బొబ్బిలి కథలు చెప్పు జంగమువారివంటి వారుగఁ గానవచ్చుచున్నారు. ఇప్పటి భట్రాజులును ఇట్టివారే. పూర్వ

---

ర్యులవారు వ్యాఖ్యవ్రాసిరి. అందు 'హన్యాన్మష్టిభిరాకాశం' (౨-౪౯) అను శ్లోకముపై వ్యాఖ్య వ్రాయుచు 'తదుక్తం భాగవతే' యని 'శ్రేయః స్రుతింభక్తిముదస్యతే విభో' అను శ్లోకమును ఉదాహరించియున్నారు. ఈ గౌడపాదాచార్యులు శంకరాచార్యులవారి గురువునకుఁ గురువు అయినయెడల శ్రీమద్భాగవతము ౬-వ, ౭-వ శతాబ్దముదాకఁ బోవును. కాని మాండూక్యోపనిషత్తుపై టీకవ్రాసిన గౌడపాదాచార్యులే యీ ఉత్తరగీతా వ్యాఖ్యవ్రాసెనని చెప్పుటకు వీలులేదు. అసలు ఉత్తరగీత యెప్పుడు పుట్టినది నిశ్చయములేదు. కావున నీ విషయమింకను చర్చనీయము. శ్రీమద్భాగవతముయొక్క పురాణత్వమును గుఱించి 'పురాణనిరీక్షణము' నందు నధికముగఁ జర్చింపఁబడినది.

* బంగాలీ విశ్వకోశమునందు నుద్ధృతము చేయఁబడినదానికి ననువాదము.

1. మను. ౧౦ అ; అమర ౨. ౯౭. 2. గౌడీయప్రతి సృష్టిఖండము ౧. ౨౮. ఈ ప్రతినాకు దొరకలేదు. ఈ శ్లోకములను 'పురాణనిరీక్షణము'నుండి తీసికొనఁబడెను. ఆనందాశ్రమప్రతిలో సృష్టిఖండము లేదు. ఈ శ్లోకములే వాయుపురాణమునందు నాకుఁ దరవాతఁ గాన వచ్చినవి. బిబ్లిఓథికాప్రతి. ౧-వ. అధ్యా.

రాజచరిత్రములను రచించియు, నితరులచే రచింపఁబడిన వానిని పాఠముచేసియు, ఉత్సవసమయములందు జనులు గుంపులుగూడఁగాఁ జదివి వినిపించుచుండిరి. ఇట్టి సూతులచేతఁ జెప్పఁబడినవే పురాణములు. పూర్వకాలమునందు రోమహర్షణుఁడును ఆతనికుమారుఁడైన ఉగ్రశ్రవుఁడును మిక్కిలి ప్రఖ్యాతి చెందిన సూతులుగ నున్నారు. పెక్కుపురాణములు వారు చెప్పినట్లె యున్నవి. కొన్ని పురాణములలో కేవలము 'సూతఉవాచ' అని ఉండును. 'సూతుఁ'డనునది జాతివాచకము కావున, అనేకసూతు లనేకతావులఁ బాడినవి యన్నియు వేలువేలుగఁ బురాణములుగఁ బరిణమించినవని తోఁచుచున్నది. సూతులు బ్రాహ్మణేతరులైనను ఋషులు మునులు వారిని మిక్కిలి గౌరవించి, అర్ఘ్యపాద్యము లొసఁగి వారివలనఁ బురాణములు వినుచుండుటచూడ నిటీవలి కొందఱు భట్రాజులవలెను, సాతానులవలెను వీరు మిక్కిలి విద్వాంసులుగను, కవులుగను ఉండి బ్రాహ్మణుల గౌరవమునకుఁ బాత్రులైరనుట స్పష్టము. ఇట్లు మూలపురాణకర్తలు బ్రాహ్మణేతరులైనను, తరువాత బ్రాహ్మణు లందుఁ బెక్కు విషయములఁ జేర్చిరనుటకు సందేహము లేదు. పురాణములు స్త్రీశూద్రులకొఱకుఁ బుట్టినవని పురాణములలో వ్రాయఁబడుటయు సూతుఁడు వక్తయగుటకుఁ గారణముగఁ గానవచ్చుచున్నది.

**పురాణమందలి విషయములు**

మొట్టమొదటఁ బురాణమునం దెట్టివిషయము లుండెనో మనమిదివఱకు నూహించియున్నారము. శైవవైష్ణవసంప్రదాయములు ప్రబలినతరువాతఁ గొన్ని శివుని బొగడునవిగను కొన్ని విష్ణువును పొగడునవిగను, కొన్ని యితర దేవతలను పొగడునవిగను ఏర్పడెను. ఒకకాలమందుఁ బురాణములలో ౧౦ శివుని, ౪ విష్ణుని, ౨ బ్రహ్మను, ౧ అగ్నిని, ౧ సూర్యుని మహిమఁ జెప్పునవిగా నుండెను. కాశీఖండమునందు శ్రీనాథుఁ డిట్లు వ్రాసినాఁడు:— "గీ. వరుస నెనిమిది యన్యదేవతలఁ జెప్పుఁ, బది పురాణంబులీశ్వరుఁ బ్రస్తుతించుఁ, జంద్రమౌళి ప్రభావంబు సమధికముగ, శ్రుతుయట్లపురాణ సంహితలు నొడువు." [౧. ౭3] స్కంధపురాణాంతర్గత శివరహస్యఖండమున సంభవకాండమునందు నిట్లు చెప్పఁబడి యున్నది. [౨. 3౦. 3౮] శివపరములు:—శివ, భవిష్యత్తు, మార్కండేయ, లింగ, వరాహ, స్కాంద, మత్స్య, కూర్మ, వామన, బ్రహ్మాండ పురాణములు. విష్ణుపరములు:—విష్ణు, భాగవత, నారద, గరుడ పురాణములు. బ్రహ్మపరములు:—బ్రహ్మ, పద్మ పురాణములు. అగ్నిపరము:— అగ్నిపురాణము. సూర్యపరము:—బ్రహ్మవైవర్తము.

శివరహస్యఖండము వ్రాయఁబడినప్పుడు పురాణ విషయములు పైవిధముగ నుండితీరవలెను. కాని యిప్పటి పురాణములఁ జూచిన పైవానితో సరిపోవు. బ్రహ్మవైవర్తమునందు సూర్యప్రశంసకు బదులు కృష్ణప్రశంస యే యెక్కుడుగ నున్నది. అగ్నిపురాణమునందు నగ్నిప్రశంస యత్యల్పము. విష్ణుప్రశంస యధికము. పద్మపురాణమునందు బ్రహ్మప్రశంసకుమాఱుగా విష్ణుప్రశంస యెక్కుడుండుటయే గాక, శైవపురాణములు తామసపురాణములనియు వానిని చదివినఁ బాపము వచ్చుననియు, శంకరాచార్యుని అద్వైతమాయావాదము ప్రచ్ఛన్నబౌద్ధ మనియు, జగత్తును మోహింపఁజేయుటకు నేనే యీమతమును లోకులకు బ్రాహ్మణరూపమున ఉపదేశించితి ననియు శివునిచేఁ జెప్పింపఁబడినది. [ఉత్తర. అ. ౨3౫. ౨. ౧౮.] కావునఁ బద్మపురాణము మిక్కిలి మారినదనుట స్పష్టము. ఈపురాణముపై అప్పుడప్పుడు ౫ సంస్కారములు జరిగిన వని తజ్ఞుల యభిప్రాయము.[1] రామానుజమధ్వాది వైష్ణవాదిసంప్రదాయములవా రీపురాణమును తమ మతవ్యాప్తికై యెక్కువగ నుపయోగించుకొనిన ట్లగుపడుచున్నది. ఇట్లే యితర పురాణములను గుఱించి యెఱుంగునది.

---

1. బంగాలీ విశ్వకోశము 'పురాణ' శబ్దము; అష్టాదశపురాణ దర్పణము (హిందీ); పురాణనిరీక్షణము (మరాఠీ). ఈ ముగ్గురును ఇట్టి యభిప్రాయము గలవారే. ఈ ముగ్గురును పురాణములందు భక్తియు విశ్వాసమును గలవారు.

| పద్మ పురాణ మతమున 1 | విష్ణు పురాణ మతమున 2 | శివ పురాణమునందలి రేవా మాహాత్మ్య మతమున 3 | వాయు పురాణ మతమున 4 | శ్రీమద్భాగవత మతమున 5 | దేవీ భాగవత మతమున 6 | భవిష్య పురాణ మతమున 7 | నారద పురాణ మతమున 8 | మార్కండేయ పురాణ మతమున 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ ౧౦౦౦౦ | మత్స్య ౧౪౦౦౦ | బ్రహ్మ ౧౦౦౦౦ | మత్స్య ౧౪౦౦౦ | బ్రహ్మ | బ్రహ్మ ౧౦౦౦౦ | బ్రహ్మ |
| 2 పద్మ | పద్మ | పద్మ ౫౫౦౦౦ | భవిష్య ౧౪౫౦౦ | పద్మ ౫౫౦౦౦ | మార్కండే ౯౦౦౦ | పద్మ | పద్మ ౫౫౦౦౦ | పద్మ |
| 3 విష్ణు | విష్ణు | విష్ణు ౨౩౦౦౦ | మార్కండే ౯౦౦౦ | విష్ణు ౨౩౦౦౦ | భవిష్య ౧౪౫౦౦ | విష్ణు | విష్ణు ౨౩౦౦౦ | విష్ణు |
| 4 శివ | శివ | శివ ౨౪౦౦౦ | బ్రహ్మవై ౧౮౦౦౦ | శివ ౨౪౦౦౦ | భాగవత ౧౮౦౦౦ | శివ | వాయు ౨౪౦౦౦ | శివ |
| 5 భాగవత | భాగవత | భవిష్య ౧౪౫౦౦ | బ్రహ్మాండ ౧౨౧౦౦ | భాగవత ౧౮౦౦౦ | బ్రహ్మ ౧౦౦౦౦ | భాగవత | భాగవత ౧౮౦౦౦ | భాగవత |
| 6 భవిష్య | నారద | మార్కండే ౯౦౦౦ | భాగవత ౧౮౦౦౦ | నారద ౨౫౦౦౦ | బ్రహ్మాండ ౧౨౧౦౦ | నారద | నారద ౨౫౦౦౦ | నారద |
| 7 నారద | మార్కండే | అగ్ని ౧౫౦౦౦ | బ్రహ్మ ౧౦౦౦౦ | మార్కండే ౯౦౦౦ | బ్రహ్మవై ౧౮౦౦౦ | మార్కండే | మార్కండే ౯౦౦౦ | మార్కండే |
| 8 మార్కండేయ | అగ్ని | నారద ౨౫౦౦౦ | వామన ౧౦౦౦౦ | అగ్ని ౧౫౪౦౦ | వామన ౧౦౦౦౦ | అగ్ని | అగ్ని ౧౫౦౦౦ | అగ్ని |
| 9 అగ్ని | భవిష్య | భాగవత ౧౮౦౦౦ | ఆది ౧౦౬౦౦ | భవిష్య ౧౪౫౦౦ | వాయు ౨౪౬౦౦ | భవిష్య | భవిష్య ౧౪౦౦౦ | భవిష్య |
| 10 బ్రహ్మవైవర్త | బ్రహ్మవై | బ్రహ్మవై ౧౮౦౦౦ | వాయు ౨౩౦౦౦ | బ్రహ్మవై ౧౮౦౦౦ | విష్ణు ౨౩౦౦౦ | బ్రహ్మవై | బ్రహ్మవై ౧౮౦౦౦ | బ్రహ్మవై |
| 11 లింగ | లింగ | లింగ ౧౧౦౦౦ | నారద ౨౩౦౦౦ | లింగ ౧౧౦౦౦ | వరాహ ౨౪౦౦౦ | లింగ | లింగ ౧౧౦౦౦ | లింగ |

1. ఆనందాశ్రమప్రతి-పాతాళఖండము: ౧౧౨ అధ్యాయము. బంగాళీ విశ్వకోశకారుని ప్రతిలోని పద్మపురాణమందలి జాబితాక్రమము రెండవకాలమ్‌లోని విష్ణుపురాణము జాబితాతో సరిపోవుచున్నది. 2. విల్సను ప్రతి అం. 3. అ. ౬. 3. ఇది బం. వి. నుండి తీసికొనఁబడినది. 4 ఏషియాటిక్ సొసైటీవారి బిబ్లియోథికా ప్రతి. అ. ౪౨; ఆనందాశ్రమప్రతి అ. ౧౦౪ అధ్యాయము. ఈరెండు ప్రతులలోను ౧౬ పురాణములే పేర్కొనఁబడినవి. ప్రతిజ్ఞలోమాత్రము అష్టాదశ పురాణములు చెప్పెదనని యున్నది. పొరపాటున ౨ పురాణములు విడిచిపెట్టఁబడినవో, లేక ఆకాలమందు ౧౬ పురాణములే ప్రఖ్యాతిగనుండెనో తెలియదు. ఇందు విష్ణు, లింగ, అగ్ని పురాణములు గానరావు. ఆదిపురాణమను నొక్కటి క్రొత్తది గలదు. 5. వేంకటేశ్వరప్రతి. స్కం. ౧౨ అ. 2. బం. వి. ప్రతిలో నారద పు. సంఖ్య ౧౫౦౦౦ మాత్రమే యున్నది. 6. వేంకటేశ్వరప్రతి. స్కం. ౧. అ. 3. బం.

| అగ్ని పురాణ మతమున 10 | బ్రహ్మవైవర్తపురాణ మతమున 11 | లింగ పురాణ మతమున 12 | స్కాంద పురాణ మతమున 13 | మత్స్య పురాణ మతమున 14 | కూర్మ పురాణ మతమున 15 | వరాహ పురాణ మతమున 16 | గరుడ పురాణ మతమున 17 | ఇప్పు డచ్చుపడిన పురాణముల గ్రంథ సంఖ్య 18 |
|---|---|---|---|---|---|---|---|---|
| బ్రహ్మ<br>౨౫౦౦౦ | బ్రహ్మ<br>౧౦౦౦౦ | బ్రహ్మ | బ్రహ్మ | బ్రహ్మ<br>౧౩౦౦౦ | బ్రహ్మ | బ్రహ్మ | భాగవత | బ్రహ్మ<br>(ఆ) ౧౩౭౮౩ |
| పద్మ<br>౧౨౦౦౦ | పద్మ<br>౫౫౦౦౦ | పద్మ | విష్ణు | పద్మ<br>౫౫౦౦౦ | పద్మ | పద్మ | విష్ణు | పద్మ<br>(ఆ) ౪౮౪౫౨ |
| విష్ణు<br>౨౩౦౦౦ | విష్ణు<br>౨౩౦౦౦ | విష్ణు | శివ | విష్ణు<br>౨౩౦౦౦ | విష్ణు | విష్ణు | గరుడ | విష్ణు<br>(జీ) ౭౦౦౦ |
| వాయు<br>౧౪౦౦౦ | శివ<br>౨౪౦౦౦ | శివ | భాగవత | వాయు<br>౨౪౦౦౦ | శివ | శివ | మత్స్య | శివ<br>(వేం) ౨౪౦౦౦ |
| భాగవత<br>౧౮౦౦౦ | భాగవత<br>౧౮౦౦౦ | భాగవత | భవిష్య | భాగవత<br>౧౮౦౦౦ | భాగవత | భాగవత | కూర్మ | భాగవత<br>౧౮౦౦౦ |
| నారద<br>౨౫౦౦౦ | నారద<br>౨౫౦౦౦ | భవిష్య | నారద | నారద<br>౨౫౦౦౦ | భవిష్య | నారద | వాయు | భవిష్య<br>(వేం) ౨౭౦౦౦ |
| మార్కం<br>౯౦౦౦ | మార్కం<br>౯౦౦౦ | నారద | మార్కం | మార్కం<br>౯౦౦౦ | నారద | మార్కం | స్కాంద | నారద<br>(వేం) ౧౭౭౦౦ |
| అగ్ని<br>౧౨౦౦౦ | అగ్ని<br>౧౫౪౦౦ | మార్కం | అగ్ని | అగ్ని<br>౧౬౦౦౦ | మార్కం | అగ్ని | పద్మ | మార్కండేయ<br>(పు) ౭౮౦౦<br>(జీ) ౭౩౦౦ |
| భవిష్య<br>౧౪౦౦౦ | భవిష్య<br>౧౪౫౦౦ | అగ్ని | బ్రహ్మవై | భవిష్య<br>౧౪౫౦౦ | అగ్ని | భవిష్య | వామన | అగ్ని<br>(ఆ) ౧౧౪౫౭<br>(జీ) ౧౨౪౦౦ |
| బ్రహ్మవై<br>౧౮౦౦౦ | బ్రహ్మవై<br>౧౮౦౦౦ | బ్రహ్మవై | లింగ | బ్రహ్మవై<br>౧౮౦౦౦ | బ్రహ్మవై | బ్రహ్మవై | వరాహ | బ్రహ్మవై<br>(జీ) ౨౩౨౦౦ |
| లింగ<br>౧౧౦౦౦ | లింగ<br>౧౧౦౦౦ | లింగ | వరాహ | లింగ<br>౧౧౦౦౦ | లింగ | లింగ | అగ్ని | లింగ<br>(పు) ౯౭౦౦<br>(జీ) ౧౦౨౦౦ |

వి. ప్రతిలో వాయు. ౧౦౫౦౦. 7. వేంకటేశ్వరప్రతి. అ. ౧. 8. వేంకటేశ్వరప్రతి. అ. ౯౨. 9. పువ్వాడ వారిప్రతి. అ ౧. ౩౯. బం. వి. ప్రతిలో ౧౧ వది యగు లింగపురాణమునకు బదులు నృసింహపురాణము గలదు. 10. ఆనందాశ్రమప్రతి. అ. ౨౭౨. 11. వేంకటేశ్వరప్రతి. కృష్ణజన్మ ఖండము అ. ౧౩౩. బం. వి.ప్రతి. పద్మ. ౫౯౦౦౦. 12. వేంకటేశ్వరప్రతి అ. ౩౯. 13. వేంకటేశ్వరప్రతి-ప్రభాసఖం. అ. ౨. ఇందు పద్మపురాణము విడువఁబడినది. శివ, వాయుపురాణములు రెండును చెప్పఁబడినవి. ఇట్లు పురాణముల పేళ్లును, వరుసయుఁ జెప్పి కొన్ని శ్లోకములకుఁ దరువాత మరల ౧౮ పురాణముల పేళ్లును శ్లోకసంఖ్యయు నీయఁబడినవి. అందు పద్మపురాణము కలదు. శివపురాణములేదు. కావున నీరెండుజాబితాలును వేరువేరుకాలములందు వ్రాయబడినవనుటకు సందేహములేదు. ఇందు రెండవసారి చెప్పఁబడిన పురాణక్రమమును, శ్లోకసంఖ్యయు మత్స్యపురాణముతో సరి

| పద్మ పురాణ మతమున [1] | విష్ణు పురాణ మతమున [2] | శివ పురాణమునందలి రేవా మాహాత్మ్య మతమున [3] | వాయు పురాణ మతమున [4] | శ్రీమద్భాగవత మతమున [5] | దేవీ భాగవత మతమున [6] | భవిష్య పురాణ మతమున [7] | నారద పురాణ మతమున [8] | మార్కండేయ పురాణ మతమున [9] |
|---|---|---|---|---|---|---|---|---|
| 12 వామన | వరాహ | వరాహ ౨౪౦౦౦ | గరుడ ౧౯౦౦౦ | వరాహ ౨౪౦౦౦ | అగ్ని ౧౬౦౦౦ | వరాహ | వరాహ ౨౪౦౦౦ | వరాహ |
| 13 స్కాంద | స్కాంద | స్కాంద ౮౪౦౦౦ | పద్మ ౫౫౦౦౦ | స్కాంద ౮౧౧౦౦ | నారద ౨౫౦౦౦ | స్కాంద | స్కాంద ౮౧౦౦౦ | స్కాంద |
| 14 మత్స్య | వామన | వామన ౧౦౦౦౦ | కూర్మ ౧౭౦౦౦ | వామన ౧౦౦౦౦ | పద్మ ౫౫౦౦౦ | వామన | వామన ౧౦౦౦౦ | వామన |
| 15 కూర్మ | కూర్మ | కూర్మ ౧౭౦౦౦ | వరాహ ౨౪౦౦౦ | కూర్మ ౧౭౦౦౦ | లింగ ౧౧౦౦౦ | కూర్మ | కూర్మ ౧౭౦౦౦ | కూర్మ |
| 16 వరాహ | మత్స్య | మత్స్య ౧౪౦౦౦ | స్కాంద ౮౧౦౦౦ | మత్స్య ౧౪౦౦౦ | గరుడ ౧౯౦౦౦ | మత్స్య | మత్స్య ౧౪౦౦౦ | మత్స్య |
| 17 గరుడ | గరుడ | గరుడ ౧౯౦౦౦ | | గరుడ ౧౯౦౦౦ | కూర్మ ౧౭౦౦౦ | గరుడ | గరుడ ౧౯౦౦౦ | గరుడ |
| 18 బ్రహ్మాండ | బ్రహ్మాండ | బ్రహ్మాండ ౧౨౨౦౦ | | బ్రహ్మాండ ౧౨౦౦౦ | స్కాంద ౮౧౦౦౦ | బ్రహ్మాండ | బ్రహ్మాండ ౧౨౦౦౦ | బ్రహ్మాండ |

పోవుచున్నది. బ్రహ్మ, కూర్మపురాణముల సంఖ్య మాత్రము భేదించినది. బ్రహ్మ ౧౦౦౦౦, కూర్మ ౧౭౦౦౦ అని యున్నది. 14. ఆనందాశ్రమప్రతి. అ. ౫3. బం. వి. ప్రతిలో అగ్ని ౧౫౦౦౦. 15. బిబ్లియోథికాప్రతి అ. ౧ ఇందు ౧౯ పురాణముల పేర్లు కలవు. 16. బిబ్లియోథికాప్రతి అ. ౧౧౨. విల్సన్‌ప్రతిలో గరుడ, బ్రహ్మాండ పురాణముల స్థానమందు వాయు, నరసింహపురాణముల పేర్లుండెను. 17. వేంకటేశ్వరప్రతి. ఉత్తరఖం. బ్రహ్మకాండము అ. ౧. ఇందు నారదపురాణము లేదు. ఆదిత్యపురాణమనునది క్రొత్తగా చేరినది. ఇందు ౧౮ పురాణములు

| అగ్ని పురాణ మతమున 10 | బ్రహ్మవైవర్తపురాణ మతమున 11 | లింగ పురాణ మతమున 12 | స్కాంద పురాణ మతమున 13 | మత్స్య పురాణ మతమున 14 | కూర్మ పురాణ మతమున 15 | వరాహ పురాణ మతమున 16 | గరుడ పురాణ మతమున 17 | ఇప్పు డచ్చుపడిన పురాణముల గ్రంథ సంఖ్య 18 |
|---|---|---|---|---|---|---|---|---|
| వరాహ ౨౪౦౦౦ | వరాహ ౨౪౦౦౦ | వరాహ | స్కాంద | వరాహ ౨౪౦౦౦ | వరాహ | వరాహ | భవిష్య | వామన (జ) ౬౦౦౦ |
| స్కాంద ౮౪౦౦౦ | స్కాంద ౮౧౦౦౦ | వామన | వామన | స్కాంద ౮౧౧౦౦ | స్కాంద | స్కాంద | బ్రహ్మాండ | స్కాంద (వేం) ౮౦౦౦౦ |
| వామన ౧౦౦౦౦ | వామన ౧౦౦౦౦ | కూర్మ | కూర్మ | వామన ౧౦౦౦౦ | వామన | వామన | లింగ | మత్స్య (ఆ) ౧౪౦౬౨ (పు) ౧౪౯౦౦ |
| కూర్మ ౮౦౦౦ | కూర్మ ౧౭౦౦౦ | మత్స్య | మత్స్య | కూర్మ ౧౮౦౦౦ | కూర్మ ౧౬౦౦౦ | కూర్మ | బ్రహ్మవై | కూర్మ (బి) ౬౪౦౦ (పు) ౬౫౦౦ |
| మత్స్య ౧౩౦౦౦ | మత్స్య ౧౪౦౦౦ | గరుడ | గరుడ | మత్స్య ౧౪౦౦౦ | మత్స్య | మత్స్య | మార్కం | వరాహ (బి) ౧౦౫౦౦ |
| గరుడ ౮౦౦౦ | గరుడ ౧౯౦౦౦ | స్కాంద | వాయు | గరుడ ౧౮౦౦౦ | గరుడ | గరుడ | బ్రహ్మ | గరుడ (వేం) ౧౨౪౦౦ (జీ) ౮౬౦౦ |
| బ్రహ్మాండ ౧౨౦౦౦ | బ్రహ్మాండ ౧౨౦౦౦ | బ్రహ్మాండ | బ్రహ్మాండ | బ్రహ్మాండ ౧౨౦౦౦ | వాయు బ్రహ్మాండ | బ్రహ్మాండ | ఆదిత్య | బ్రహ్మాండ (వే) ౧౦౫౦౦ వాయు (ఆ) ౧౦౯౯౧ (బి) ౧౦౭౧౪ |

వరుసగ జెప్పఁబడిలేవు. పైని చెప్పఁబడినవానిలో మొదటి ౬ సాత్వికములనియు, రెండవ ౬ రాజసములనియు, చివర ౬ తామసములనియు విభాగముచేసి చెప్పఁబడినది. బ్రహ్మ, వామన, బ్రహ్మాండపురాణములలో ౧౮ పురాణములజాబితా కనఁబడలేదు. 18. ఆ.=ఆనందాశ్రమప్రతి; జీ.=జీవానందప్రతి; వేం.=వేంకటేశ్వరప్రతి; పు=పువ్వాడవారి ప్రతి. జ.=జగద్ధితేచ్ఛుప్రతి. బి.=బిబ్లియోథికా యిండికాప్రతి.

ప్రతిపురాణముయొక్క విషయములును, విశేషములును ఆయాపురాణనామము క్రింద వ్రాయఁబడును.

**ఇప్పటిపురాణముల స్వరూపము**

ఇచ్చట నిప్పటి పురాణముల సామాన్యస్వరూపముఁ దెల్పుటకై కొంచెము వ్రాసెదము. ఇప్పటి పురాణములనగా నిప్పుడు దొరికెడి సంస్కృతపురాణముల ప్రతులని యర్థము. నారదసూచిప్రకారము చూచినను ఇప్పటిపురాణము లెవ్వియు నందలి సంఖ్యతోడను, విషయక్రమముతోడను పూర్తిగ సరిపోవు. ఇంతియ కాదు. కొన్ని పురాణముల ప్రతులు రెండుమూడు విధములైనవి. దొరకుచున్నవి. వీనిలో నేది మూలపురాణమైనది, యేది తరువాత వ్రాయఁబడినదియుఁ గనుఁగొనుట యసాధ్యము. ఇట్టివానిలోఁ గొన్ని సామాన్యశ్లోకము లున్నను పెక్కులు భేదముగ నుండును. బ్రహ్మపురాణములు రెండు దొరకుచున్నవి. ఒకటి పూనా ఆనందాశ్రమ గ్రంథమాలలోను, ఇంకొకటి 'ఆదిబ్రహ్మపురాణ' మను నది లఖ్ నౌలోను ప్రకటింపఁబడినవి. అగ్ని పద్మపురాణములయొక్క గౌడప్రతులు వేఱు, దాక్షిణాత్యప్రతులు వేఱు, ఒకదానిలో నున్న భాగములు పెక్కులు మఱియొకదానిలో లేవు. మూఁడు విధములైన వాయుపురాణములును రెండువిధములైన శివపురాణములును అచ్చుపడినవి. భవిష్యపురాణమును గుఱించి యున్న గంద్రగోళము మఱి దేనినిగుఱించియు లేదు. విశ్వకోశకారునకు ౪ విధములయిన భవిష్యపురాణములు దొరికినవి. ఇది గాక భవిష్యోత్తరము వేఱు! స్కాందపురాణము సముద్రమువంటిది. ఇది ఎనుబదివేలు అని కొందఱును లక్ష యని కొందఱును వ్రాసినారు. 'స్కాందపురాణ' మని యొక గ్రంథ మెచ్చటను కానవచ్చుటలేదు. సూతసంహిత, కాశీఖండము, మొదలయినభాగము లా పురాణములోనివి యని విడివిడిగాఁ గానఁబడుటయే గాని సంపూర్ణస్కాంద మెచ్చటను లేదు. అందుచే నిటీవలఁ బుట్టినఁ బుట్టుచున్న స్థలమాహాత్మ్యాదులుగూడ 'ఇతి స్కాందే' అని వ్రాసికొనుట తటస్థించుచున్నది.

పురాణములనుగుఱించి యధికము తెలిసికొనఁగోరువారు 'ఉపపురాణములు' 'పురాణములు' అను శబ్దములఁ జూడుఁడు.

**పురాణసంఖ్య**

వేఱువేఱు పురాణములను శోధించి, ఆయాపురాణముల మతమునఁ బురాణముల సంఖ్యయుఁ గ్రమమును, గ్రంథసంఖ్యయుఁ దొరికినంతవఱకు నీ ప్రక్కపుటలలో పట్టికారూపమున నిచ్చుచున్నారము. ఏయేపురాణముల గ్రంథసంఖ్య యెంతెంతయైనదియుఁ గొన్నిపురాణములలో నీయఁబడినది. కాని యవి యెల్లప్పుడును ఒకవిధముగనే యున్నట్టు కాన్పింపదు. ఒకపురాణమునుజూచి మఱియొకపురాణము తనసంఖ్యలను అప్పుడప్పుడు దిద్దుకొనినట్లు కానవచ్చుచున్నది.

## గ్రంథసంగ్రహము.

సంస్కృత భాషలోని పురాణములను ఈ క్రింది వారు ప్రకటించిరి:—చెన్నపట్టణమున పువ్వాడవారు

**సంస్కృత. పురాణములు**

ఆంధ్రాక్షరములతో నీపురాణముల నచ్చువేసిరి:—లింగ, కూర్మ, మత్స్య, మార్కండేయ, దేవీభాగవత పురాణంబులు. వీరు ప్రకటించిన, కూర్మ, మత్స్య, మార్కండేయపురాణములకుఁ జివర తెనుఁగులో వచనమున వాని తాత్పర్యము వ్రాయఁబడినది. ఆంధ్రాక్షరములతో శ్రీమద్భాగవతమును, పురాణము హయగ్రీవశాస్త్రిగారు అచ్చువేయించిరి. తరువాత నెన్నియో ప్రతులు ప్రకటింపఁబడినవి. వాని నన్నిటి నిచ్చటఁ బేర్కొనుట అనావశ్యకము. ఆంధ్రాక్షరములతో విష్ణుపురాణము, ఇయ్యాణి జగన్నాథాచార్యులు ఒకప్రతియు, వావిళ్ల అనంతనారాయణశాస్త్రి రామస్వామి శాస్త్రిగార్లు కలిసి, వ్యాఖ్యతో నొక ప్రతియుఁ, బ్రకటించిరి.

ఇఁకమీఁదఁ జెప్పఁబడునవియన్నియు నాగరాక్షరములతో నచ్చువేయఁబడెనని తెలిసికొనవలయును.

పూనా ఆనందాశ్రమ గ్రంథమాలలోఁ బ్రకటింపఁబడినవి: అగ్ని, వాయు, మత్స్య, బ్రహ్మపురాణములు, స్కాందాంతర్గతమైన సూతసంహిత. ఇవి వేఱువేఱు ప్రతులనుజూచి, పాఠాంతరములతోఁ గూడ, మిక్కిలి శ్రద్ధతోఁ బ్రకటింపఁబడినవి. వీరు అన్నిపురా

ణములను ఈ లాగుననే వేసియుండిన బాగుండును. కలకత్తా, ఏషియాటిక్ సొసైటీవారు, బిబ్లిఓథికా ఇండికా, అను పేరిటఁ బ్రకటించినవి: కూర్మ, వరాహ, వాయు, మార్కండేయపురాణములు. కలకత్తాలో జీబానంద విద్యాసాగరునిచే ముద్రింపఁబడినవి: అగ్ని, మత్స్య, లింగ, విష్ణు, గరుడ, బ్రహ్మవైవర్తములు. బొంబాయి వేంకటేశ్వర ముద్రాలయము వారిచే ౧౮ పురాణములును ప్రకటింపఁబడినవి. వీరు ఏప్రతిలో నేపాఠమున్నదియు, ఆనందాశ్రమ ప్రతులలో వలెఁ జూపియుండిన యెడల నివి, వీనిని పురాణములుగఁ జదువువారికే కాక, చారిత్రకదృష్టితోఁ జదువువారికిని ఎక్కుడుపయోగకరముగ నుండియుండును. వీరిట్టిదృష్టి యుంచక దొరకిన శ్లోకములన్నియుఁ బురాణములలోఁ జేర్చి సంఖ్య హెచ్చించుటయే పరమ ప్రయోజనముగ నెంచుటచేఁ జరిత్రకారులు వీనిని నుపయోగించువారుమిక్కిలి జాగ్రత్తతో నుపయోగింపవలెను.

నాలుగుపురాణములకుఁ దప్ప మిగిలినవాని కన్నిఁటికిని తెలుఁగున భాషాంతరములు కలవు. కొన్నింటికిఁ బెక్కు భాషాంతరములు కలవు. వానివివర మిచ్చుట

### అష్టాదశ పురాణములకుఁ దెలుఁగు భాషాంతరములు

నిచ్చుచున్నాను. (1) బ్రహ్మ. తెనుఁగులోలేదు; (2) పద్మ. కమలనాభామాత్యుఁడు.* (౧౩ వ శతాబ్దము); ఉత్తర ఖం. మడికి సింగన్న. (౧౪ శ) (3) విష్ణు. వెన్నెలకంటి సూరన (౧౬ శ); దాసకవి తుపాకుల అనంతభూపాలుఁడు (వచనము). (4) వాయు. ఒద్దెపూడి పెద్దయ్య (౧౭ శ). (5) (అ) శ్రీమద్భాగవతము బమ్మెర పోతన (౧౪ శ); కోనేరునాథకవి (ద్విపద. ౧౫౪౬); హరిభట్టు (౧౧, ౧౨ స్కం. ౧౭ శ); తరిగొండ వెంకమాంబ (ద్విపద. ౧౯ శ); శలఘంటము వేంకటరంగశాస్త్రి (యథామూలము. వచనము. ౧౯-౨౦ శ). (ఆ) దేవీభాగవతము—త్రిపురాన తమ్మనదొర; ములుగు పాపయ్య (౧౯ శ); దాసు శ్రీరాములు (౧౯ శ) తిరుపతి వేంకటేశ్వరకవులు (౧౯-౨౦. శ). (6) నారద. అల్లాడి నరసింహకవి (7) మార్కండేయ. మారన (౧౩ శ); తిప్మరాజు లక్ష్మణరాయనివారు (వచనము. ౧౯ శ) (8) అగ్ని. తెనుఁగులోలేదు (9) భవిష్య. (ఉత్తరభాగ) తిరుమలరాయకవి (10) బ్రహ్మవైవర్త. చిలకపాటి వేంకటరామానుజ శర్మ (వచనము. ౨౦ శ). (11) లింగ. తెనుఁగులో లేదు. (12) వరాహ. నందిమల్లన ఘంటసింగన. (౧౫ శ); హరిభట్టు (౧౫ శ) (13) స్కాంద. (అ) కాశీ ఖండము శ్రీనాథుఁడు (౧౪ శ) (ఆ) ధర్మ ఖం. భవానీశుఁడు, అనుమంచి జగన్నాథకవి (ఇ) భీమ ఖం. శ్రీనాథుఁడు. (ఈ) సూతసంహిత పట్టమట్ట సోమనాథుఁడు (౧౮ శ); (ఉ) శివరహస్య ఖం. కోడూరి వేంకటాచలకవి (౧౭౦౦); వీరభద్ర కవి; రేవూరి అనంతయజ్వ; ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యులు. (ఊ) బ్రహ్మోత్తర ఖం. ప్రాత కోటపుల్లయ్య; ముత్తరాజు వేంకటకృష్ణకవి; శ్రీధరమల్లి వెంకటస్వామి (౧౮౧౫). (ఋ) శ్రీశైల ఖం. అత్తలూరి పాపకవి (౧౮ శ); శివనారాధ్యుఁడు (ౠ) సేతు ఖం. పాపనామాత్యుఁడు హాలాస్యమాహాత్మ్యము. తిరుమలశెట్టి జగన్నాథ దాసుఁడు; భూజనంజరాజు; వేంకటనారాయణకవి. (14) వామన లింగమగుంట రామకవి * (౧౭ శ) (15) కూర్మ. రాజలింగకవి (౧౭ శ); మండచిట్టికామ శాస్త్రి (౧౯ శ) (16) మత్స్య. లింగమగుంట రామకవి *; హరిభట్టు (౧౭ శ) (17) గరుడ. పింగళి సూరన* (౧౭ శ); వరదరాజకవి (18) బ్రహ్మాండ. కావూరి ఎల్లయ్య; జనమంచి శేషాద్రిశర్మ (౨౦ శ) ఉత్తర ఖం. సోమనాథ సోమయాజి.

---

* ఈ గుర్తులు గల కావ్యములు నామమాత్రావశిష్టములు. ఇప్పుడు కానవచ్చుట లేదు. బ్రహ్మపురాణమునకుఁ దెనుఁగున అధ్యాయసూచి యొకటి యిటీవల, క. మార్కండేయశర్మగారు ప్రకటించిరి.

పురాణములనుగుఱించి చర్చించు గ్రంథములు తెలుఁగున నేమియు లేవు. పురాణమందలి పురుషాదులను గుఱించి అకారాదిగ వ్రాయఁబడినది 'పురాణనామ చంద్రిక' అనునది యొకటి కలదు. కర్త యెనమండ్ర వేంకటరామయ్య. ఇంగ్లీషులో నిందునుగుఱించి మొట్టమొదట వ్రాసినవాఁడు విల్సన్. ఆతఁడు విష్ణుపురాణమునకు వ్రాసిన పీఠిక చూడనగును. తరువాతఁ బురాణములను గుఱించి మిక్కిలి పరిశ్రమ పూర్వకముగఁ వ్రాసినవాఁడు బంగాలీ విశ్వకోశకారుఁడు. ఈతఁడు 'పురాణ' శబ్దముక్రింద ౧౮ పురాణములలోని విషయములను వ్రాయుటయే గాక, వాని కాల నిర్ణయములను గుఱించియు జైనపురాణములను గుఱించియు నెంతయో శోధనచేసి ౨౦౦ పుటల వ్యాసము వ్రాసెను. అది నాకు మిక్కిలి సహకారియైనది. ఈ బంగాలీ వ్యాసము ననుసరించి హిందీభాషలో 'అష్టాదశపురాణదర్పణ' మను దానిని పండితజ్వాలాప్రసాద్ అను నతఁడు రచించెను. ఇయ్యది బంగాలీవ్యాసమునకు భాషాంతరరూపమైనను ఆసంగతి గ్రంథకర్త చెప్పకపోవుట, యాశ్చర్యము. మరాటీభాషలో త్ర్యంబకగురు నాథకాళే యనువారు 'పురాణనిరీక్షణ' మను గ్రంథము రచించిరి. ఇదియుఁ గొంతవఱకు శోధనపూర్వకముగ వ్రాయఁబడినదియె. F. E. Pargiter's The Purana Text of the Dynasties of the Kali age అను గ్రంథము పురాణములందుఁ జెప్పఁబడిన కలియుగ భవిష్యద్రాజులను గుఱించిన వచనముల నన్నిఁటిని ఒక్కచోటికిఁ దెచ్చి చర్చచేయును. [కొ. ల.

పురాణములనుగుఱించి చర్చించు పొత్తములు

**అష్టాధ్యాయి.** పాణిని అను ఆచార్యునిచే రచింపఁబడిన వ్యాకరణశాస్త్రము. ఇది సూత్రాత్మకము. ఇందు నెనిమిది అధ్యాయములు కలవు. ఒక్కొక్క యధ్యాయమునందు నాల్గుపాదము లుండును. ఇట్లీగ్రంథమునందు ౩౨ పాదములును, రమారమి ౪౦౦౦ సూత్రములును కలవు.*

ఇందు మొదటి ౭ అధ్యాయములును చివర యధ్యాయమందలి ౧ వ పాదమును గలిసినభాగమునకు 'సపాద సప్తాధ్యాయీ' యని పేరు. చివర మూఁడుపాదముల గ్రంథమునకు 'త్రిపాది' అని పేరు. సపాద సప్తాధ్యాయినిగుఱించి త్రిపాది అసిద్ధము, అనఁగాఁ జెల్లఁదగినది కాదు. త్రిపాదిలోను పూర్వసూత్రములనుగుఱించి పరసూత్రము సిద్ధములు.

పాణిని కృతమైన అష్టాధ్యాయికిఁ బ్రపంచమందలి యన్నిభాషలలోని వ్యాకరణములలోఁ బ్రథమస్థానమీయఁబడినది. భాషలోని శబ్దముల నన్నిఁటిని నియమమునకు లోఁబడునట్లుచేసిన శబ్దానుశాసనము మఱియొకటి లేదు. "భాషలోని శబ్దములన్నిఁటిని శాసించి, వాని వ్యుత్పత్తిని దెలుపుచు నింత విపులముగను, ఇంత నియమబద్ధముగను ఉన్న మఱియొకవ్యాకరణ మేభాషయందును నేఁటివఱకు వ్రాయఁబడలేదని చెప్పిన నీపాణినీయ వ్యాకరణముయొక్క ఘనత చదువరులకుఁ దెలియఁగలదు. ప్రతిభాషలోని పదములన్నియుఁ గ్రియార్థసూచకములగు ధాతువుల (Roots) లో నుండి పుట్టినవని యూరోపులోని వ్యుత్పత్తి శాస్త్రవేత్తలు (Phi-

యోగ్యత

* సరియైన సూత్రసంఖ్య. అధ్యా ౧. పాదము ౧. సూత్రసంఖ్య ౭౫, పా. ౨. సూ ౭౩, పా. ౩. సూ ౯౩, పా. ౪. సూ ౧౧౦; అధ్యా ౨. పా ౧. సూ ౭౨, పా ౨. సూ ౩౮; పా ౩ సూ ౭౩, పా. ౪. సూ ౮౫; అధ్యా ౩. పా ౧. సూ ౧౫౦, పా ౨. సూ ౧౮౮, పా. ౩. సూ ౧౭౬, పా ౪. సూ ౧౧౭; అధ్యా. ౪. పా ౧. సూ ౧౭౮, పా ౨. సూ ౧౪౫, పా. ౩. సూ ౧౬౮, పా. ౪. సూ ౧౪౪; అధ్యా ౫. పా ౧. సూ ౧౩౬. పా. ౨. సూ ౧౪౦, పా. ౩: సూ ౧౧౯. పా. ౪. సూ ౧౬౦; అధ్యా ౬. పా. ౧. సూ ౨౨౩, పా. ౨. సూ ౧౯౯, పా. ౩. సూ ౧౩౯. పా. ౪. సూ ౧౭౫; అధ్యా ౭. పా. ౧. సూ ౧౦౩, పా. ౨. సూ ౧౧౮, పా. ౩. సూ ౧౨౦, పా. ౪. సూ ౯౭; అధ్యా ౮. పా. ౧. సూ ౭౪, పా. ౨. సూ ౧౦౮, పా. ౩. సూ ౧౧౯, పా. ౪. సూ ౬౮. మొత్తము సూత్రములు ౩౯౮౩. శివసూత్రములు ౧౪ తో కలిసి ౩౯౯౭. ఈ సంఖ్య అష్టాధ్యాయమీఁది ఖ్యాతిఁజెందిన వ్యాఖ్యయగు కాశికననుసరించి ఈయఁబడినది.

lologists) నేటికిఁ గనుగొనిరి. కాని యీ యంశమే మూడువేల యేండ్లక్రిందఁ బాణిన్యాచార్యులవారు తన యష్టాధ్యాయిలో సోదాహరణపూర్వకముగా సిద్ధాంతీకరించిరి.[1] "భారతీయ లక్షణవేత్తలచేఁ బ్రతిపాదింపఁబడిన వ్యాకరణపద్ధతి పరిపూర్ణతం జెందినది పాణిని వ్యాకరణమును జూచినవారు అష్టాధ్యాయిలోని అద్భుతమైన లక్షణప్రణాళికతోఁ బోల్పఁదగిన వ్యాకరణశాస్త్రము మఱియొకటిలేదని వెంటనే యొప్పుకొందురు." అని భట్టమోక్షమూలరుగారు చెప్పిరి.[2]

**పాణిని కాలము**

ఇతర గ్రంథకారుల కాలమువలెనే యీ మహర్షి యొక్క కాలమును అనిశ్చితము. అనేకు లనేకవిధముల వ్రాసియున్నారు. పాణినికాలము క్రి. శ. ౧౦౦, అని పీటర్ సన్,[3] క్రి. శ. ౧౫౦ అని వెబరు[4], క్రి. పూ. 3౫౦ అని మ్యాక్స్ముల్లరు[5], క్రి. పూ. ౬౦౦ అని గోల్డ్ స్టకర్,[6] భాండార్ కర్,[7] క్రి. పూ. ౭౦౦అని బెల్ వెల్ కర్,[8] క్రి. పూ. ౮౦౦ అని వుంటె,[9] క్రి. పూ. ౧౪౦౦ అని తారానాథ్ తర్కవాచస్పతి,[10] క్రి. పూ. ౨౪౦౦ అని సత్యవ్రతసామశ్రమి[11] అనువారు ప్రతిపాదించియున్నారు. సామశ్రమి మతమునను బంగాలి విశ్వకోశకారుని మతమునను పాణిని నిరుక్తకారుఁడైన యాస్కునికంటెఁ బూర్వుఁడు. మిగిలినవారి యందఱిమతమున యాస్కునికంటెఁ దరువాతి వాఁడు. ఈ యభిప్రాయములన్నియుఁ జూడ బెల్వెల్ కర్, వుంటేల మతము ననుసరించి పాణిని క్రి. పూ. ౭౦౦-౮౦౦ కాలమునకంటె నర్వాచీనుఁడు కాఁడని స్పష్టముగఁ జెప్పవచ్చును. ఇంతకంటె నిశ్చయముగ నిదమిత్థమని చెప్పుటకు వీలులేదు. పాణిని బుద్ధునకంటెఁ బూర్వుఁడనుటకు సందేహములేదు.

**పాణినివృత్తాంతము**

ఈ యాచార్యునిచరితము మన కంతగాఁదెలియదు. అష్టాధ్యాయియందుఁ బంజాబుదేశము, దానికిఁబశ్చిమమున నున్న దేశములు అందలినదులుపట్టణములు మొదలయినవానిఁ గుఱించియే యెక్కువగఁ జెప్పఁబడుటచేత నీతఁ డాప్రాంతమువాఁడై యుండనోపునని పండితుల యభిప్రాయము. తరువాతివా రీతనిని 'శాలాతురీయుఁ'డని[1] యన్నందునఁ బూర్వము పంజాబులోను, ఇప్పుడు వాయవ్యపుఁ బొలిమేర పర్గణా (నార్థవెస్టుఫ్రాంటియర్ ప్రావిన్సు) లో అటక్ సమీపమునందున్న శాలాతురగ్రామ మీతని జన్మస్థలమని నమ్ముచున్నారు. మహాభాష్యమునందుఁ బాతంజలి పాణినిని దాక్షీపుత్రుఁడనెను.[2] అందువలన నీతని తల్లిపేరు దాక్షియని మన మూహింపవలసియున్నది. కథాసరిత్సాగరమునందు[3] పాణిని, కాత్యాయనుఁడు, వ్యాడి అనువారు ఉపవర్షుఁడను గురువునొద్ద విద్యనేర్చుకొనుట కుండినట్లును, పాణిని జడమతియైనందున నాతనికి విద్యరానట్టును, అతఁడు తపస్సుచే శివుని మెప్పింపనా దేవుఁడు మాహేశ్వరసూత్రము లనఁబడు ౧౪ ప్రత్యాహారసూత్రము లీతని కిచ్చినట్టును, వాని ననుసరించి యీతఁడు వ్యాకరణము రచించినట్టును చెప్పఁబడియున్నది. కాత్యాయనుఁడు అష్టాధ్యాయిపై వార్తికముల వ్రాసెను. కథా సరిత్సాగరమునం దిట్లుపాణిని

1. హిందూమహాయుగము. ౫౭-వ కూర్పు. ౬౫-వ పుట. 2. Max Muller's Grammar for the beginners, preface.

3. Report on the search of Sk. Miss for 1882-3 p. 39 ff. 4. Indian Literature p. 223. 5. Ancient Sanskrit Literature p. 220, 6. Literary Remans p. 127. 7. writings in I. A. 8. System's of sanskrit Grammer p. 15, 18. 9. Vicissitudes of Aryan Civilization p. 316. 10. సిద్ధాంతకౌముదిపై వ్రాసిన సరళ యను టీకయొక్క యుపోద్ఘాతమునందు పాణిని కలియుగాబ్దములు ౧౮౦౦లో నుండెనని చెప్పెను. 11. Bibliotheca India లోని యాస్కనిరుక్తమునకు వ్రాయఁబడిన ఉపోద్ఘాతము చూడనగు.

1 గణరత్నమహోదధి. 'శాలాతురీయ శకటాంగజ చంద్రగోమి' (౨-వ శ్లో). ఇయ్యది ౧౨వ శతాబ్దమందలి గ్రంథము. 2 సర్వేసర్వపదాదేశా దాక్షీపుత్రస్య పాణినేః. [Kielhorn's ed. Vol i. P. 75.] 3 నాల్గవ తరంగము.

కాత్యాయనులు సమకాలికులని చెప్పఁబడినను పాణిని తరువాత నెన్నియోవందల సంవత్సరములకుఁ గాని కాత్యాయనుఁడు పుట్టలేదని పెక్కు పండితుల యభిప్రాయము.[1] వ్యాడి పాణిని వ్యాకరణముపై సంగ్రహము వ్రాసెను. ఈతఁడు పాణినికిని కాత్యాయనునకును మధ్యకాలము వాఁడు.[2] పాణినిని ఒక పెద్దపులిచంపె నని పంచతంత్రమునందుఁ[3] జెప్పఁబడియున్నది. ఇట్లు పాణిని పోయినతరువాత వేలకొలఁది యేండ్లకు వ్రాయఁబడిన గ్రంథములలోని కింవదంతులు కొన్ని తప్ప యీతనిని గుఱించి నిశ్చయమైన సంగతులేవియుఁ దెలియవు.

౭ వ శతాబ్దమువాఁడయిన హుయన్ త్స్యాంగు గ్రంథములలోఁ బాణినిగుఱించి కొన్ని సంగతులు గలవు. ఈతఁడు క్రీ. శ. ౬౨౯ మొదలు ౬౪౫ వఱకు హిందూదేశమునందుండి సంస్కృతప్రాకృతములను బౌద్ధశాస్త్రములను నేర్చికొని, తానుచూచిన వృత్తాంతములన్నియు వ్రాసియుంచెను. అందు పాణిని గాంధారదేశమందలి శాలాతురనివాసి యని చెప్పఁబడినది.[4]

“మేము పొలొటులో (శలాతుర) పట్టణమునకుఁ బోయితిమి. వ్యాకరణమును రచించిన పాణిని ఋషి యిచ్చట జన్మించెను. పూర్వము బ్రహ్మేంద్రాదులు వ్యాకరణమును రచించిరి............కాని పాణిని ఋషి పుట్టినప్పుడు మానవుల జీవితకాలము తగ్గి నూఱేండ్లేఅయెను. ఆతఁడు పుట్టినప్పటినుండియు బహుశ్రుతుఁడైయుండె. ఆకాలమందలి జనులు జడమతులును శ్రద్ధావిహీనులును అగుటచే నాతఁడు శబ్దశాస్త్రమును సంస్కరింపఁ దెంచెను. ఎట్లు సంస్కరింపవలయునో నేర్చుకొనుటకుఁ దిరుగుచుండ నీశ్వరుఁ డాతనికిఁ గాన్పించి జ్ఞానమొసంగెను. ఆతఁడందుపై శబ్దములనన్నిటిని సంగ్రహించి ౧౦౦౦ శ్లోకముల శబ్దశాస్త్రము రచించెను. ఒకశ్లోకమన ౩౨ అక్షరములు. ఆశాస్త్రమునందు నక్షరములనుగుఱించియు, శబ్దములను గుఱించియు నన్నివిషయములును ఉండెను. ఆతఁడు దానిని రాజునొద్దకుఁ బంపెను. ఆగ్రంథమె అందఱు నేర్చుకొనవలయునని రాజు శాసించెను. దానిని మొదటినుండియుఁ జివరవఱకు నేర్చినవానికి ౧౦౦౦ బంగారు నాణెము లిచ్చెదనని చాటించెను. అప్పటినుండియు నీపట్టణమున లోకోపకారమునకై యాశాస్త్రము శిష్యపరంపరగఁ బఠింపఁబడుచున్నది. అందుచే నిచ్చటి బ్రాహ్మణులు తమభాషా పరిజ్ఞానమునకును, బుద్ధిప్రతిభకును, బహుశ్రుతత్వమునకును, ప్రబలధారణాశక్తికిని ఖ్యాతిఁ జెందిరి.[1]”

బుద్ధుఁడుపుట్టిన ౫౦౦ ఏండ్లవఱకు నీగ్రామస్థులు పాణిని వ్యాకరణమును అభ్యసించుచుండిరనియు, నచ్చట పాణినిప్రతిమ (Statue) ఉండె ననియు, తరువాత నొక అర్హతుఁడువచ్చి వారినందఱను బౌద్ధులచేసెననియుఁ గూడ నీగ్రంథమందే చెప్పఁబడియున్నది. బుద్ధుని తరువాత ౫౦౦ ఏండ్లకనగా క్రీ. శ. ౧ వ శతాబ్దమంద ని భావము.

ఇట్లు పాణినికిఁ దరువాత వేయియేండ్లకుఁ బుట్టిన చీనాపరివ్రాజకుఁడు వ్రాసెను. కావున నిది కేవలము నిజమని మనము నమ్మకపోయినను, ఆతనికాలమందుఁ బాణిని గుఱించి యిట్టి యూహాలుండెననియు, పాణిని అప్పటికె మిక్కిలి పురాతనఋషిగ నెంచఁబడుచుండెననియుఁ దెలిసికొన వచ్చును.

సాధారణముగా మనవైపు వాడుకలోనున్న వ్యాకరణము ‘సిద్ధాంతకౌముది.’ ఇందు మొదట సంజ్ఞాప్రకరణమును, తరువాత సంధి, సుబంత, సమాస, తద్ధిత, తిఙంత కృదన్తాదిప్రకరణములు గలవు. కాని యీక్రమము

**వ్యాకరణ రచనాక్రమము**

1. Goldstrucker's Panini: his place in Sanskrit Literature pp. 89-140. (Old Edition); Kunte's Vicissitudes of Aryan Civilization in India p. 330. 2. Belvalkar's Systems of Sanskrit Grammer p. 27. 3. ౨. తం. 33. శ్లో.

4. Trubner's Oriental series: the Life of Hiuen Tsiang Translatedby S. Beal. Book III p. 122.

1. Trubner's Oriental Series, Budhist records of Western world, Hiuen Tsiang, translated by S. Beal Vol I pp. 114-5.

౧౭వ శతాబ్దము నాటిదియగు ప్రక్రియాకౌముది* కాల మునుండి వచ్చినదే గాని అంతకుఁబూర్వ మున్నది కాదు. పాణినియొక్క అష్టాధ్యాయి యీ క్రమమును అవలంబింపలేదు. అష్టాధ్యాయిలో సంజ్ఞలన్నియు నొక్క చోట నుండవు. ఎచ్చటెచ్చట వేనితో ప్రయోజనమో అచ్చటచ్చట నవి యీయఁబడును. సంధిప్రకరణ మంతయు నొక్కచోట లేదు. రెండుతావులయందుఁ జెప్పఁబడినది.1 వైదికప్రక్రియ యొక్కచోట లేదు. అచ్చటచ్చట నితరనియమములతోఁబాటు చెప్పఁబడినది. పాణిని వ్యాకరణమునకును ఇటీవలి వ్యాకరణములకును విషయవివేచనములందుఁ గలభేదము తెల్పుటకై అష్టాధ్యాయియొక్క సంగ్రహవిషయసూచిక నిచ్చుచున్నాను.

౧ వ అధ్యా. పాద. ౧–౨ కొన్ని సంజ్ఞలు, పరిభాషలు, అతివ్యాప్తివిషయము (తాను చెప్పఁదలఁచని విషయములు); పా. 3. పరస్మైపదాత్మనేపద ప్రక్రియ; పా. ౪. కారకములకు నర్థము, ఉపసర్గలు, అవ్యయములు, కొన్ని సంజ్ఞలు. ౨ వ అధ్యా. పా ౧–౨ సమాసములు; పా. 3. కారకములు. పా. ౪. ఏకవద్భావము, లింగవిశేషములు, ధాతువిశేషముల ఆదేశములు, కొన్ని సంజ్ఞలు. 3 వ అధ్యా. కృదంతములు, తిఙంతములు (క్రియాపరిచ్ఛేదము); ౪ వ అధ్యా. పా ౧–౪ స్త్రీప్రత్యయములు, తద్ధితప్రత్యయములు. ౫ వ అధ్యా. ౧–౪ తద్ధితప్రత్యయములు. ౬ వ అధ్యా. పా ౧. సంధి. పా. ౨. స్వరప్రకరణము. పా. 3. పరతఃకార్యములు. పా. ౪. సుబంతములు (నామములు), ౭ వ అధ్యా. పా. ౧–౪ సుబంతప్రకరణము. ౮ వ అధ్యా. పా ౧. ద్విత్వసర్వానుదాత్తప్రకరణము. పా ౨. అనుదాత్తస్వరితైకదేశస్వరములు, సకారలోపాది నియమములు. పా. 3–౪. రుప్రకరణము, ణత్వప్రకరణము మొదలయిన సంధినియమములు.

పై సంగ్రహసూచివలనఁ బాణినీయమునకును ఇప్పటి కౌముద్యాదులకును గల భేదము స్పష్టపడఁగలదు. విద్యార్థుల సౌకర్యార్థమై కౌముదీకారాదులు పాణినీయమందలి వేఱువేఱుసూత్రములను ఒక్కచోటికిఁ దెచ్చి సంధి సుబంతాదిప్రకరణముల నేర్పఱిచిరి. సిద్ధాంత కౌముదియందు నొక్క సంధిప్రకరణములో అష్టాధ్యాయియొక్క ౧. ౧; ౧. 3; ౬. ౧; ౮. ౨; ౮. 3; ౮. ౪ పాదములలోనుండి సూత్రములు గ్రహింపఁబడినవి.

అష్టాధ్యాయియంతయు సూత్రరూపమున నున్నది. అల్పాక్షరత్వము సూత్రముయొక్క ప్రథమలక్షణము.

**సూత్రపద్ధతి, ప్రత్యాహారాది పద్ధతులు**

చెప్పఁదలఁచిన విషయము మిక్కిలి తక్కువ యక్షరములలోఁ జెప్పుటసూత్రము. సూత్రపద్ధతి పాణిన్యాచార్యులవారికిఁ బూర్వమే యున్నదనుట "సంఖ్యాయాః సంజ్ఞాసఙ్ఘ సూత్రాధ్యయనేషు" [౫-౧-౫౮] అను సూత్రమువలన స్పష్టము. గృహ్యసూత్రములు పుట్టినను పుట్టకపోయినను శ్రౌతసూత్రములు పాణినికిఁ బూర్వముండెను. కాని పూర్వమున్న సూత్రపద్ధతిని వ్యాకరణశాస్త్రబోధకై యొక్కువగ నుపయోగించుకొని, ఆపద్ధతిని పూర్ణావస్థకుఁ దీసికొని వచ్చినవాఁడు పాణిని అని చెప్పుటకు సందేహము లేదు.

కొలఁది శబ్దములలో బహ్వర్థము నిముడ్చుటకు నష్టాధ్యాయియందుఁ బెక్కు పన్నుగడలు పన్నఁబడినవి. అందుఁ బ్రత్యాహారపద్ధతి యనునది యొకటి. అక్షరములనుగాని ప్రత్యయములనుగాని ఒకవరుసగ నేర్పాటుచేసి, అందు మొదటిఅక్షరము చివరఅక్షరము చెప్పినచో మధ్యాక్షరములని అర్థము కల్పించుట ప్రత్యాహార మనఁబడును. పాణిని అష్టాధ్యాయికి మొదట అక్షరములను ఈ క్రిందివిధముగ జతలుగ నేర్పఱిచెను. దీనినే అక్షర సమామ్నాయమందురు.

౧ అ. ఇ. ఉణ్; ౨ ఋ ఌక్; 3 ఏఓఙ్; ౪ ఐఔచ్; ౫ హయవరట్; ౬ లణ్; ౭ ఞమఙణ

*ఆంధ్రశబ్దచింతామణికిఁగూడఁ బ్రక్రియాకౌముది యన్న పేరుండుటయు, రెండింటియందలి విషయచర్చాక్రమము చాలవఱకు నొక్కవిధముగ నుండుటయుఁ జూడ నయ్యది సంస్కృతప్రక్రియాకౌముదిఁ జూచి వ్రాయఁబడినదని తోఁచుచున్నది.

1. ౬ వ అధ్యాయము ౧ వ పాదము; ౮ వ అధ్యాయము ౨, 3, ౪ పాదములు.

నమ్; ౮ ఝభఞ్; ౯ ఘఢధష్; ౧౦ జబగడ దశ్; ౧౧ ఖఫఛఠథచటతవ్; ౧౨ కపయ్; ౧౩ శషసర్; ౧౪ హల్.

ఈ పదునాల్గింటికిని మాహేశ్వర సూత్రము లని పేరు. ఇందు ౧వ సూత్రమందలి మొదటి అక్షరమైన అకారమును ౪ వ సూత్రమందలి చివరదియైన చ్ కారమును కలిపి 'అచ్' అన్నయెడల, అకారము మొదలు చ్ కారమువఱకు నుండు అక్షరము లని యర్థము. ఒక్కొకసూత్రము చివరనున్న ణ్, క్, వంటి పొల్లుహల్లులకు 'ఇత్' అని సంజ్ఞ. ఇట్టి 'ఇత్తు' లు గుర్తులుగ నెంచఁబడునే గాని అక్షరములలోనివిగ నెంచఁబడవు. కావున 'అచ్' అనగా అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ, ఐ, ఔ, అను అక్షరములని అర్థమగును. ఇట్లే హ కారము మొదలు 'ల్' కారమువఱ కున్న అక్షరములు హల్లు' లగును. ఇట్లే 'అణ్' అనగా అ ఇ ఉ అనునవి, జశ్ అనగా జ బ గ డ ద అనునవి.

ఇట్లే ప్రత్యయములను గుఱించియు నెఱుఁగవలెను. విభక్తిప్రత్యయముల వరుస పాణిని ఈ విధముగ నేర్పఱిచెను. ౧ సు, ఔ, జస్; ౨ అమ్, ఔట్, శస్; 3 టా, భ్యామ్, భిస్; ౪ ఙే, భ్యామ్, భ్యస్; ౫ ఙసి, భ్యామ్, భ్యస్, ౬ ఙస్, ఓస్, ఆమ్; ౭ ఙి, ఓస్, సుప్. 'సు' వద్దనుండి 'ప్' వఱకు నున్నందున వీనికన్నిటికిని 'సుప్' అని పేరు వచ్చినది. సుబంతము లనగా విశేష్యములు, విశేషణములు, సర్వనామములు అని యర్థము. ఇట్లే 'తిఙ్' అనగా క్రియాపదప్రత్యయములు. ఈ ప్రకారము వ్యాకరణమునందు గుర్తు లేర్పఱుచుకొన్నందున సూత్రములు చిన్నచిన్నవిగ జేయుటకు మిక్కిలి వీలు కలిగినది.

సూత్రముల యక్షరములు తగ్గించుటకు పాణిని పన్ను నుపాయములలో అధికారసూత్ర మొకటి. ఆ సూత్రము దాని తరువాత వచ్చునట్టి పెక్కు సూత్రములకు సంబంధించి యుండును. ప్రతిసూత్రముతోను దానిని కలిపి అర్థముచేయవలెను. ఇది యిప్పటి శీర్షిక (హెడ్డింగు) వంటిది.

గణపాఠ మనునది మూడవ యుపాయము. శాసింపఁబడు శబ్దములనన్నిటిని సూత్రమునందుఁ జెప్పక అట్టి శబ్దముల పట్టికయొకటి సిద్ధముచేసి, సూత్రములో దాని మొదటిశబ్దమును మాత్ర ముదాహరించును. ఇట్టి గణములన్నియు గణపాఠ మనఁబడును. ఇట్లే ధాతు పాఠమును గలదు. ఇప్పుడు అష్టాధ్యాయికి ననుబంధముగ నున్న ధాతుపాఠ గణపాఠములలోని శబ్దములన్నియుఁ బాణిని కాలమప్పటినుండియు నందు నున్నవి యేవి, వెనుకనుండి కలుపఁబడినవి యేవి నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేదు. ఉణాది సూత్రములను గుఱించియు నిట్లే యెఱుంగునది.

పాణినికిఁ బూర్వము పెక్కు వైయాకరణు లుండిరి. అష్టాధ్యాయియందు ఆపిశలి, కాశ్యప, గార్గ్య, గాలవ, చాక్రవర్మణ, భారద్వాజ, శాకటాయన, శాకల్య, సేనక, స్ఫోటాయనులన్న పది పూర్వశబ్దశాసనుల పేర్లను, ఉదీచ్య ప్రాచ్య వైయాకరణ సంప్రదాయములును

**పాణినికిఁ బూర్వపు వైయాకరణులు**

పేర్కొనఁబడి ౧.1 ఈ వ్యాకరణముల నన్నిఁటినిఁ జూచి వానిని సంస్కరించి మెఱుగుపెట్టి అభివృద్ధిపఱిచి పాణిని ఈ యష్టాధ్యాయిని నిర్మించియుండును. వాని నన్నిటికంటెను ఇయ్యది యతిశ్రేష్ఠతఁ జెందుటచే సూర్యుని యెదుట నక్షత్రములవలె నా పూర్వవ్యాకరణములు లోపించినవి. శాకటాయనవ్యాకరణము మాత్రము కానవచ్చుచున్నది. ప్రాతిశాఖ్యములన్న వేదసంబంధములైన వ్యాకరణములు పెక్కులు గలవు. అవి పాణినికిఁ బూర్వములా పరములా యన్న విషయమై పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. ఇంద్రవ్యాకరణ మొకటి యుండెననియు, ఈ ప్రాతిశాఖ్యములన్నియు నాసాంప్రదాయపువియనియు, పాణినికిఁ బూర్వకాలపువియనియు బర్నెల్ అభిప్రాయము.2 దానికి వ్యతిరేకముగ నవి యిటీవలివి యని గోల్డ్‌స్టకరు అభిప్రాయము.3

1. ౬. ౧. ౯౨; ౮. 3. ౨౦; ౬. 3. ౬౧; ౬. ౧. ౧3౦; ౭. ౨. ౬3; ౮. ४. ౫౦; ౬. ౧. ౧౨౭; ౬. ౧. ౧౨3; ४. ౧. ४3; ౭. 3. ४౯.

2. Dr. Burnell's, Aindra School of Grammarians.

3. Goldstucker's Panini, His place Sanskrit Literature.

అష్టాధ్యాయి పుట్టినకాలమున హిందువులు కాబూల్, పంజాబు, కచ్ఛదేశములను విశేషముగ నాక్రమించుకొనినట్లు కాన

**పాణినినాటి దేశము**

వచ్చుచున్నది. అనగా నిప్పుడు హిందూదేశమనకు వాయువ్యపు వైపుననున్న భాగము మాత్ర మార్య నివాసభూమిరైయుండెను. తద్ధితప్రకరణమునందును (౪-వ ౫-వ అధ్యా.) ఇతరస్థలములందును దేశములను గ్రామములను బట్టి సిద్ధించురూపములను జెప్పుచు నధికముగ, ఉత్తరదేశమందలి పంజాబులోని గ్రామములను కాబూలులోని గ్రామములను చెప్పెను.[1] "ఇప్పటి పంజాబు 'బాహీక' మను పేరఁ జెప్పఁబడినది, [౪. ౨. ౧౧౭, ౫. 3. ౧౧౪] ఇదియె తరువాత బాహ్లీక దేశమని పురాణములలోఁ బ్రఖ్యాతిచెందెను.[2] పై సూత్రములలో బాహీకదేశమందలి గ్రామములను గురించి చెప్పఁబడినది. ఉదాహరణములలో కాస్తీర శాకలిక, మాధవిక, మొదలయిన పేళ్లు చెప్పఁబడినవి. శలాతుర (౪. 3. ౯౪), సంకల (౪. ౨. ౭౫) తక్షశిల (౪. ౩. ౯3), కాపిశి (౪. ౨. ౯౯), వరణ (౪. ౨. ౮౨) ఉషీనర (౨. ౪. ౨౦), కాంభోజ (౪. ౧. ౧౭౫), సౌవీర (౪. ౧. ౧౪౮), మొదలయిన దేశములయొక్కయు గ్రామములయొక్కయు విపశ (౪. ౨. ౭౪) సువాస్తు (౪. ౨. ౭౭) అను నదులయొక్కయుఁ బేళ్లు చెప్పఁబడినవి. ఇందు శిలాతురము అటక్‌నదిమీదనున్న గ్రామము. పాణినినివాసస్థల మందురు. "సంకల" పంజాబులోనిది. అలెగ్జాండరు వచ్చినప్పు డిచ్చటి వారతనిని ధైర్యముతో నెదిరించినందున నాతఁడీ పట్టణమును రూపుమాపెను.[1] తక్షశిలా పంజాబులోనిది. 'కాపిశి' యనునది అఫ్‌గానిస్థానముయొక్క ఉత్తరము వైపురాజ్యము. దీనిని గ్రీకులు మొదలయినవారు "కాపిశెని" అని యనుచుండిరి. "కాపిశ్యాః ష్పక్" [౪. ౨. ౯౯] అనిన సూత్రమునకు "కాపిశాయనం మధు" "కాపిశాయినీ ద్రాక్షా" యన్నవి యుదాహరణముగ నిత్తురు. ఇప్పటికిని ఆటువైపు ద్రాక్షలును, ద్రాక్షమద్యమును పేరొందినవియే. 'వరణ' అనునది యిప్పటికిని బరణ అను పేరిట సింధునదియొడ్డున అటక్ గ్రామమునకు నెదురుగనున్నది. "ఉషీనర" దేశ మనగా గాంధార దేశము - ఇప్పటి కందహారదేశము. ఉశీనరదేశమందుఁ బుట్టిన 'కంథలు' గొంగళ్లు ఈసూత్రమునందుఁ[1] జేర్కొనఁబడినవి ఇంతియకాదు. వానిని జేయువారి పేరిట నవి పిలువఁబడుచున్నట్లును కానవచ్చెడిని. సౌశమయుని కంథకు సౌశమికంథ యనిపేరు. ఇప్పటికిని కాబూల్ కందహారదేశములనుండి వేడివస్త్రములు మనదేశమునకు వచ్చుచునేయున్నవి. కాంభోజము,కాంపిల్య (కాబూలుకు) ఉత్తరముననను, సువీరదేశము కచ్ఛకు నుత్తరమునను ఉండెను.[2] విపాశ యనగా నిప్పటి బియాస్‌నది. సువాస్తు అనగా నిప్పుడు స్వాత్ అని పిలువఁబడునది. ఇది యిప్పుడు నార్థవెష్టుఫ్రాంటియర్ ప్రావిన్సులో నున్నది.[3] ఇట్లు చెప్పిన పట్టణములన్నియు, గ్రామములన్నియు, సింధునదికి దాని యుపనదులకుఁ జుట్టును ఉత్తరమునను ఉన్నవి. ఈప్రదేశమునకుఁ దగిలియే దక్షిణముననున్న కచ్ఛసింధుదేశములుకూడ నార్యు లాక్రమించుకొన్నట్టు గానవచ్చుచున్నవి. "కచ్ఛాదిభ్యశ్చ" అను సూత్రమునందు "కచ్ఛ" దేశము చెప్పఁబడినది. ఇంతియ కాదు.

---

1. ౪. ౨. ౭౫, ౯౯, ౧౦౮, ౧౧౭. 2. పాణిని వాహీక దేశమందలి చిన్నచిన్న జిల్లాల విషయమై కూడఁ జెప్పెను; 3. 3. ౭౮వ సూత్రమునందు "అంతర్ఘనదేశము" చెప్పఁబడినది. దీనివిషయమై కైయటవృత్తియందు "అంతర్ఘన సంజ్ఞభూతో వాహీకేషు దేశ విశేష ఉచ్యతే" అని చెప్పఁబడినది. అనగా అంతర్ఘన మనునది వాహీకమందలి యొకదేశము అని అర్థము.

2. Smith's Early History 3rd ed. p. 75.

1. సంజ్ఞాయాం కన్థోశీనరేషు [౨. ౪. ౨౦] కన్థాన్త స్తత్పురుషః క్లీబంస్యాత్సాచే దుశీనర దేశోత్పన్నా యాః కంథాయాఃసంజ్ఞా। సుశమస్య అపత్యాని సౌశమయః। తేషాంకంథా సౌశమికన్థమ్। సంజ్ఞాయాం కిం। వీరణకంథా। ఉశీనరేషుకిం। దాక్షికంథా॥ [సిం. కౌ. తత్పురుషసమాస ప్రకరణము]

2. Vicissitendes of Aryan Civilization, Map given at p. 376 & Dr. Bhandarkar in Indian Antiqurey Vol. I p. 21. Panini and the Geography of Afgauistan and the Punjab.

కచ్ఛాదిగణమునందుఁ జెప్పఁబడిన 'కచ్ఛ, సింధు, వర్ణు' గంధార, మధుమత్, కంభోజ, కశ్మీర, సాల్వ, కురు, దేశముల పేళ్లు కూడ నాకాలపు భూగోళమును కొంత వఱకుఁ దెల్పఁగలవు. కురు, భరత జనదేశ నామములను [౪.౧. ౧౭౨, ౧౭౬] చెప్పుటవలన కురుక్షేత్రాది స్థానముఁగూడ ననగా డిల్లీప్రాంతముగూడ నార్యనివాస స్థానముగ నుండెననవచ్చును. పాణిని తనసూత్రములలో తూర్పు వైయ్యాకరణులను, ఉత్తరపు వైయాకరణులను చాలసారులు పేర్కొని వారి యభిప్రాయములను తెలిపియున్నాఁడు [౩. ౪. ౧౮. ౧౯]. కాని దాక్షిణాత్య పాశ్చాత్య శాబ్దికులను పేర్కొని యుండలేదు. ఈ దిక్కల్పనము పాణిని నివాసస్థలమైన శలాతురమునకు సాపేక్షము. పాంచాల మద్ర కురుదేశాదులు తూర్పు.[1] కాంపిల్య కాంభోజాదులు ఉత్తరము. పశ్చిమమునఁ బారసీకాదు లుండుటను, దక్షిణమున నింకను ఆర్యవ్యాప్తికాకుండుటను ఆయాదిక్కుల సంస్కృతవైయాకరణులు లేకుండుటకుఁ గారణము.

ఇట్లు పంజాబు దేశమందలి గ్రామాదులను చక్కఁగఁ బేర్కొని వానినుండి పుట్టు తద్ధితాదిరూపములను వివరము గనిచ్చినట్లు ఇతర దేశములనుగుఱించి యీయలేదు. పాణిని కోసల (౪-౧-౧౭౧) అవంతి కుంతి కురు (౪-౧-౧౭౬) మగధ కలింగ సూరమస (౪-౧-౧౭౦) దేశములను పేర్కొనియున్నాఁడు. కాని వీనిలోఁ బెక్కు దేశములలో నార్యులు ప్రసరింపనందునను, ఆదేశములలోని గ్రామాదులతో వారికి సంబంధముకల్గి తద్ధితరూపము లింకను పుట్టనందునను ఈ దేశములలోని గ్రామాదులను గుఱించి పాణిని ఏమియుఁ జెప్పలేదు. దక్షిణమందలిది యని చెప్పఁదగినది యొక్క 'కలింగ'ము మాత్ర మాతఁడు పేర్కొనెను. అప్పటి కింకను మగధకలింగములు ఆర్యబహిష్కృత దేశములుగ నుండవచ్చును.

పాణిని నాఁటికి ఋగ్వేదము, కృష్ణయజుర్వేదము అనగా తైత్తిరీయశాఖ, సామవేదము ఉండెను. ౪.౩.౧౩౩ వ సూత్రమునందు అథర్వవేదము పేరున్నది.

## పాణిని కాలమునాఁటి వాఙ్మయము.

కానియయ్యది కాత్యాయను నివార్తికము గాని పాణినిసూత్రము కాదని తద్జ్ఞుల యభిప్రాయము.[2] కావున నప్పటి కింకను అథర్వవేదము పుట్టలేదని గాని వేదాధికారమును పొందలేదని గాని మన మనుకొనవచ్చును. సామములలోఁ గొన్ని మంచిసామములనియుఁ గొన్ని చెడ్డసామములనియుఁ దలంచుచుండిరి.[3] ఇందుచేఁ గొన్ని సామములకు నింకను వేదత్వము సంభవింపలేదనుట స్పష్టము. శుక్ల యజుర్వేదము పాణిని కాలమందుండెననుటకు నాధారము లేదు. పాణిని సంహితను ఛందస్సనియు, మంత్రమనియు వ్యవహరించును.[4] ఛందస్సన్నప్పు డందలి పద్యభాగ మనియు, మంత్ర మన్నప్పుడు గద్యపద్యవివక్షత లేక సంహిత యనియు నాతని యభిప్రాయమైనట్లు తోఁచుచున్నది. ఋగ్వేదాది సంహితలలో నదివఱకె సూక్త, అధ్యాయ, అనువాకాది విభాగములై యుండెను.[5] సంహితలుగాక కొన్ని బ్రాహ్మణము లుండెను. కాని కొన్ని బ్రాహ్మణములు పురాతనకాలమందుఁ జెప్పఁబడినవనియుఁ, గొన్ని అర్వాచీనకాలమందుఁ జెప్పఁబడినవనియు వానిలో భేదము చేయఁబడెను.[6] కావున సంహితలవలె బ్రాహ్మణములు అపౌరుషేయములు కావని పాణిని కాలమువారి నమ్మకము. అట్లే పురాణార్వాచీన కల్పగ్రంథములు కూడ నుండెను. ఈకాలమందు 'గాథలు' అను వాఙ్మయము కూడఁ గొంత యుండెను. [౩. ౨. ౨౩] ఈకాలమందు అనుబ్రాహ్మణము లన్న గ్రంథములు కొన్ని కలవు.[7] అనుబ్రాహ్మణ మనఁగా బ్రాహ్మణసదృశ గ్రంథము. కావున ఆరణ్యకము లన్న గ్రంథము లప్పుడు లేవు.[8]

---

1 క్రమముగ దేశము లభివృద్ధియైన కొలఁదిని తూర్పు దేశములనగా పాంచాల, విదేహ, అంగ, వంగ, మగధదేశము లని అర్థ మేర్పడినది. [చూఁడు మహాభాష్య కయ్యటములు] ఇందుఁ బాంచాలదేశముండుట మన కుపయోగము. పాణిని నివాసస్థలమైన శలాతురమునకు పంజాబుదేశము తూర్పనుట స్పష్టము.

1. ౬. ౩. ౧౩౩; ౮. ౩. ౧౦౪; ౪. ౨. ౭. ౪. ౩. ౧౦౨. 2. Vasu's Astadhyayi. 3. ౨. ౪. ౪. 4. ౨. ౪. ౭౬. ౨. ౪. ౮౦. 5. ౫. ౨. ౫౯. ౬౦. 6. ౪. ౩. ౧౦౫. 7. ౪. ౨. ౬౨. 8. ౪. ౨. ౧౨౯.

ఆరణ్యకభాగము లయిన ఉపనిషత్తులును లేవని చెప్ప వలెను. ఆరణ్యకములు కాత్యాయనుని కాలమువఱకుఁ బుట్టినవి. ఇందున గుఱించి 'కాత్యాయన' శబ్దముక్రింద సవిస్తరముగ వ్రాయఁబడును. పాణిని కాలమువఱకుఁ బెక్కు సూత్రగ్రంథములు కలవు.1 వ్యాకరణసూత్రము లుండెనని వేఱుగఁ జెప్ప నక్కఱలేదు. పారాశరుని చేతను, కర్మందుని చేతను చెప్పఁబడిన భిక్షుసూత్రము లును, శిలాలి కృశాశ్వులచేఁ జెప్పఁబడిన నటసూత్రము లును ఉండెను. వాని నభ్యసించు పారాశరి భిక్షువు లును, కార్మందిభిక్షువులును, శైలాలినటులును, కృశా శ్వినటులును ఉండిరి.2 పారాశర్యభిక్షుసూత్ర మనఁగా వ్యాసకృతవేదాంతసూత్రము లని కొంద ఱూహచేసిరి. కాని వ్యాససూత్రములకును భిక్షు నియమములకును సంబం ధము లేదు. వేదాంతసూత్రములలో సన్న్యాసులాచరింప వలసిన నియమములు లేవు. పాణిని కాలమందు వ్యా ఖ్యానగ్రంథంబు లనేకము లుండెను. ౪. 3. ౬౬. మొదలు ౭3 వ సూత్రము వఱకును ఏయే వ్యాఖ్యాన ములకు నెట్టెట్టి ప్రత్యయములు వచ్చునో చెప్పఁబడినది. వానిని బట్టి చూడ నప్పుడు క్రతువులను గుఱించియు, యజ్ఞములను గుఱించియు, ఋషుల గ్రంథములమీఁదను, పురోడాశమును గుఱించియు, ఛందంబుల గుఱించియు, బ్రాహ్మ, ఋక్, అధ్వర, పురశ్చరణములను గూర్చియు వ్యాఖ్యాన గ్రంథంబు లుండెను.1 'యాస్క' శబ్దమును పాణిని సాధించెను. [యస్కాదిభ్యో గోత్రే ౨.౪.౬3] కావున యాస్కుని వేదవ్యాఖ్యారూపమైన నిరుక్త మప్పటివఱకే యున్నదని మనము తలంపవలెను. ౭3 వ సూత్రమును బట్టిచూడ 'ఋగయ' నాదులపైఁగూడ వ్యాఖ్యానము లున్నట్టు కానవచ్చుచున్నది. 'ఋగ యన' గణములో ౧ ఋగయన, ౨ పదవ్యాఖ్యాన, 3 ఛన్దోమాన, ౪ ఛన్దోభాషా, ౫ ఛందోవిచితి, ౬ న్యాయ, ౭ పునరుక్త, ౮ నిరుక్త, ౯ వ్యాకరణ, ౧౦ నిగమ, ౧౧ వాస్తువిద్యా, ౧౨ క్షాత్రవిద్యా, ౧3 అంగవిద్యా, ౧౪ విద్యా, ౧౫ ఉత్పాత, ౧౬ ఉత్పాద, ౧౭ ఉద్యావ, ౧౮ సంవత్సర, ౧౯ ముహూర్త, ౨౦ ఉపనిషద్, ౨౧ నిమిత్త, ౨౨ శిక్షా, ౨3 భిక్షా, ౨౪ ఛన్దోవిజినీ, ౨౫ వ్యాయములు చెప్పఁబడినవి. ఈ శబ్దములన్నియు నీగణమునందుఁ బాణినికాలమున నుండె నో లేదో చెప్పఁజాలము. మొదటి ౧౫ వఱకైనను ఉండె ననుకొనినయెడల వానిలో న్యాయ, నిరుక్త, వాస్తువిద్య, క్షాత్రవిద్య, అంగవిద్య అనునవి విశేష ములు. కాని గణపాఠమును గుఱించి నిశ్చయము లేదు. కావున నేదియు నిదమిత్థ మని చెప్పఁజాలము.

పాణిని కాలమందు 'మహాభారత' ముండెను. అందలి 'హా'కార మప్పు డుదాత్తము.1 అప్పటి భారత మిప్పటిదానికంటె మిక్కిలి చిన్నదై యుండనోపు. వాసుదేవ, అర్జున [౪. 3. ౯౮], అంధక, వృష్ణి,కురు, [౪. ౧. ౧౧౪] ద్రోణ [౪. ౧. ౧౦3] కుంతి [౪. ౧. ౧౭౬] శబ్దములు పాణీయమునం దుండుటచే నప్పటికి భారతకథలు వ్యాపించి యుండె ననుట స్పష్టము.

పాణిని గ్రంథములన్నింటిని నాల్గువిధముల విభ జించినట్లు కానవచ్చుచున్నది. దృష్టములు (చూడఁ బడినవి), [౪. ౨. ౭], ఉపజ్ఞాతములు (ఒకరు చెప్పక తెలిసికొనఁ బడినవి) [౪. 3. ౧౧౫]. ప్రోక్తములు (ఎక్కువగాఁ బ్రచురింపఁబడినవి) [౪. 3. ౧౦౧], కృతములు (రచింపఁబడినవి) [౪. 3. ౧౧౬]. మొదటివి వేదములు. వానిని రచించినవారు మంత్రద్రష్ట లనఁ బడుదురు. వేదము లపౌరుషేయము లన్న నమ్మకము పాణిని కాలమునఁ గలదు. ఉపజ్ఞాత గ్రంథములకు "పాణినీయమ్", ఆపిశలమ్, కాశకృత్స్నమ్ అను నుదా హరణములను ఇచ్చెదరు. కాని, పాణిని,తనను గుఱిం చియే సూత్రము చెప్పుకొనును అని తోఁపదు. కావున ఆపిశలమ్ మొదలయిన వ్యాకరణకర్తలకు విశేషమైన యాశ్వరానుగ్రహము కలదనియు నదుచే వారితరుల వద్ద నేర్వకయే వీనిని రచించిరనియుఁ బాణినిమతమై యుండిన నుండవచ్చును. ప్రోక్తమునకుఁ గూడ పాణి నీయమ్, ఆపిశలం, కాశకృత్స్నమ్ అనువాని ఉదా

1. ౪. ౨. ౬౫. 2. ౪. 3. ౧౧౦-౧౧౧.

1. ౪. 3. ౬౮-౭౨.

1. ౬. ౨. 3౮. ఈసూత్రమందలి 'భారత' శబ్దము మొదటినుండి యుండెనా? ప్రక్షిప్తమా? యన్న విషయము చర్చ్యము.

హరణముగ నిత్తురు కాని యిది సరిగాదని తోఁచెడిని. 'అన్యేనకృతా మాధురేణప్రోక్తా మాధురీవృత్తిః.' అని చెప్పఁబడినది. కావున నితరులచే రచింపఁబడినను ఎవరిచే వ్యాపింపఁజేయఁబడునో వారి పేరిట నా గ్రంథము చెప్పఁబడుచుండె ననుట స్పష్టము. ప్రోక్తమనగా ప్రచురింపఁబడినది (Publish d) అని అర్థము చేయవలెను. కృతము లనగాఁ క్రొత్తగా నిర్మింపఁబడినవి. వీని కర్తృత్వము తత్తద్గ్రంథకర్తలదియే. ఆ కాలమందు శిశుక్రందీయః, యమసభీయః, శ్యేనకపోతీయః, ఇంద్రజననీయమ్, అను గ్రంథము లుండెను. ఇవి పద్యకావ్యములో, గద్యగ్రంథములో తెలియదు.

అప్పటికి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లన్న భేదము బాగుగ నేర్పడినది. ఒక ధాతువునుండియే బ్రాహ్మణునకై 'ఆర్య' శబ్దము, వైశ్యులకై 'అర్య' శబ్దము పుట్టును.[1] పై ముగ్గురు జాతులవారిని ఆశీర్వదింపవలసిన పద్ధతి వేఱు, శూద్రుని నాశీర్వదింపవలసిన పద్ధతి వేఱు.[2] బ్రాహ్మణాదులను ప్రత్యభివాదము చేయునపుడు వారి పేళ్లలో నున్న చివర యచ్చు ప్లుతముగను, ఉదాత్తముగను ఉచ్చరింపవలయును. 'భో ఆయుష్మాన్ ఏధి దేవదత్తా ౩' అని పలుకవలెను. శూద్రుని అభివాదనము చేయు నెడ హ్రస్వముగను స్వరితముగను పలుకవలెను. 'భో ఆయుష్మాన్ ఏధి తుషజక' అనవలెను! శూద్రులలో 'నిరవసిత' 'అనిరవసిత' శూద్రు లని రెండు భేదములు కలిగెను. నిరవసితు లనగా గ్రామములో నుండువారు, వడ్రకమ్మరవారు. అనిరవసితు లనగా గ్రామమునకు వెలుపల నుండువారు. మాలమాదిగలు. ద్వంద్వసమాసము చేయునప్పుడు వీరి పేళ్లతో నొకవిధముగఁ జేయవలెను, వారి పేళ్లతో నొకవిధముగఁ జేయవలెను.

**పాణినికాలపు సంఘస్థితి**

పాణినికాలమందు ఆయుధజీవుల సంఘంబులు పెక్కు లున్నట్టు కానవచ్చుచున్నది. ఆయుధజీవులనగా ఆయుధములవలననే శిపాయిగిరిచేసి బ్రతుకువారు. జీతము తీసికొని యజమానికై పోరాడువారు. వీరిని కూలిబంటు లనవచ్చును. పర్వతప్రాంతములందలి వారును [౪. ౩. ౯౧], క్షత్రియులును, బ్రాహ్మణులును [౫. ౩. ౧౧౪] ఇతరులును ఇట్టిపని చేయుచుండిరి. వీరు పర్వతదేశములందును, వాహీకదేశమందును చాల ఉండినట్లు కానవచ్చుచున్నది. వృకు లనువారును, [1]దామన్యాదులును త్రిగర్తదేశమందలి ఆఱు సంఘములవారును ఆయుధజీవులలోఁ జేరొందినవారుగఁ గానవచ్చుచున్నారు. [౫. ౩. ౧౧౬]. "బ్రాహ్మణకోష్ణికే సంజ్ఞాయాం" [౫. ౨. ౭౧] అను సూత్రమునకు "ఆయుధజీవినో బ్రాహ్మణా యస్మిన్ దేశే స బ్రాహ్మకః" అని యుదాహరణ మిచ్చెదరు. [సి. కౌ.] ఈ "బ్రాహ్మణక" దేశ మెద్దియో కనుఁగొనవలెను.

అష్టాధ్యాయినాఁటి హిందూ కుటుంబపద్ధతియు, మూలపురుషునిఁబట్టి వాని సంతతివారికి వచ్చు పేళ్లును గోత్రపద్ధతియుఁ గొంతవఱకు ౪ వ అధ్యాయమందలి ౧ వ పాదములోని కొన్ని సూత్రములవలనఁ దెలియుచున్నది. కుమారుని అపత్యమందురు. మనుమని మొదలు తాతగారి గోత్ర మందురు. అనగా మనుమఁడు ముని మనుమఁడు మొదలైన వారందఱును మూలపురుషుని

1. ౪. ౩. ౭౭.

1. ౩. ౧. ౧౦౩, 2. ౭. ౨. ౮౩. ౩. ౨. ౪. ౧౦.

1. సూత్రములో 'దామన్యాది' అని యున్నది. తరువాతివా రీగణమునందు నీక్రింది ౨౪ పేళ్లిచ్చియున్నారు:— దామని, ఔలపి, బైజవాపి, ఔదకి (ఔళకి, ఓకకి), ఔదంగి, అచ్యుతంతి, అచ్యుతదంతి, కాకుంతకి, ఆకిదంతి, ఔడవి, కాకదంతకి, శాత్రుంతపి, సార్వసేని, బిందు, బైందవి, తులభ, మౌంజాయన, కాకంది, సావిత్రీపుత్ర, కాకరంతి, దేవవాపి, అపచ్యుతకా, కర్కీ, పిండ. ఇందులోఁ గొందఱు పాణిని కాలమందును, కొందఱు తరువాతి కాలమందును ఆయుధజీవు లని పేరొందియుందురు. 2. త్రిగర్తషష్ఠ మని పాణినిచేఁ జెప్పఁబడిన ఆయుధజీవి సంఘములు, కౌండోపరథ, దాండకి, క్రోష్టికి, జాలమాని, బ్రహ్మగుప్త, జానకి నామములు కలవి యని, యిటీవలి వ్యాఖ్యాతలు చెప్పియున్నారు.

గోత్రము వారు. [౧౬౨.] కాని వంశమునందుఁ బైతరము వారెవరైనను బ్రతికియున్నయెడల మనుమని సంతతి వారు 'యువ'కు లనఁబడుదురు; గోత్ర మనఁబడరు. [౧౬౩] మూలపురుషుఁడు గర్గుఁడనుకొందము. వాని కుమారుఁడు 'గార్గి;' వాని కుమారుఁడనగా మూల పురుషుని మనుమఁడు గోత్ర మగును. కావున వానికి గోత్రసంబంధమైన ప్రత్యయము తగిలి వాఁడు 'గార్గ్యుఁ' డగును. 'గార్గి' గాని, 'గార్గ్యుఁడు' గాని బ్రతికియున్న యెడల గార్గ్యుని కుమారుఁడు 'యువ' యగును, గోత్రము కాఁడు. వానికి యువసంబంధమైన ప్రత్యయము వచ్చి వాఁడు 'గార్గ్యాయణుఁ' డగును. పైవారు బ్రతికి యుండనియెడల వీఁడె మూలపురుషుని గోత్రమువాఁడై 'గార్గ్యుఁ' డనిపించుకొనును. అన్న బ్రతికి యున్న యెడలఁ దమ్ముఁడు 'యువ' యగును. ఈక్రింది వృక్షము వలన నిది బోధపడఁగలదు:—




గోత్రప్రత్యయము గల రూపము గౌరవసూచకము గను, 'యువ' శబ్దము నిందాసూచకముగను ఎంఁచబడుచుండెను [౧౬౬–౧౬౭]. పై నియమములను బట్టి చూడ సమిష్టి కుటుంబ పద్ధతి బాగుగ నుండె ననియు, పై తరమువారు బ్రతికియుండగాఁ గ్రింది తరమువారు పిల్లలవలెఁ జూడఁబడుచుండిరనియు, కుటుంబసంబంధమైన వ్యవహారము లన్నియుఁ బెద్దవారే చూచుచుండిరనియు కుటుంబసంబంధమై మర్యాదలన్నియు వారికే జరుగుచుండెననియుఁ దోచుచున్నది. వంశజులు తమ మూలపురుషుని పేరిటనే తమ్ము తెల్పుకొనుచుండిరి. గోత్ర ప్రవరపద్ధతికి మూలము ఈసూత్రములలోఁ గలదని చెప్పవచ్చును.

కుమారుఁడు మనుమఁడు తమపూర్వుని పేరిట వ్యవహరించినట్లు విద్యార్థులు గూడఁ దమతమ గురువుల పేరిటఁ బిలువఁబడుచుండిరి. [౬. ౨. ౩౬]. విద్యార్థులు ఆపిశలులనియు, కాఢీయు లనియు, కాశకృత్స్ను లనియు తమతమ గురువుల నామములతో గుర్తింపఁబడుచుండిరి. ఇయ్యది యిప్పటి బీ. ఏ. లు 'మేము ఆక్సుఫోర్డు యునివర్సిటీ గ్రాజుయేట్లము, మేము కేంబ్రిజ్ గ్రాజుయేట్లము' అని చెప్పుకొనినట్లు.'

ఆకాలమందు స్త్రీలు శ్రమణలు (సన్యాసినులు) అగుటయే గాక చిన్నపిల్లలును, అవివాహితస్త్రీలును శ్రమణలగుచుండిరి. కావున బౌద్ధకాలమునకుఁ బూర్వమె స్త్రీసన్యాసినుల పద్ధతి మనదేశమునం దుండుటయే గాక వివాహము స్త్రీలకు నైచ్ఛికముగ నుండెననియుఁ గొందఱు పురుషులు బ్రహ్మచర్యమునుండియే సన్యాసులైనట్టు కొందఱు స్త్రీలు బ్రహ్మచర్యమునుండియే సన్యాసినులు ఆకాలమం దగుచుండి రనియు నొప్పుకొనవలయును. లేదా, పాణిని బుద్ధుని తరువాతఁ బుట్టినాఁడనియును, బౌద్ధసన్యాసినుల విషయమే యీ సూత్రమందుఁ జెప్పఁబడెనని యైనను ఒప్పుకొనవలయును.

పాణిని సూత్రములపై కాత్యాయనుఁడు (క్రీ. పూ. ౪౦౦) వార్త్తికముల వ్రాసెను. సూత్రములలో లేని విషయములను చెప్పుట, అష్టాధ్యాయిమీది యు, సూత్రములలోఁ భాష్యాదికములు బొరపాటుగఁ జెప్పిన విషయములనుదిద్దుటయు వార్త్తికము ల పని. కాత్యాయనునికిఁ బూర్వమును, తరువాతను పెక్కు ఆచార్యులు అష్టాధ్యాయికి వార్త్తికములు వ్రాసిరి. కాని వారి విషయమై మనకు బాగుగఁ దెలియదు. సూత్రములకును వార్త్తికములకును పతంజలి (క్రీ. పూ. ౧౫౦) భాష్యము వ్రాసెను. దీనినే వ్యాకరణ మహాభాష్య మందురు. [చూడు 'కాత్యాయన,' 'పతంజలి' శబ్దములు] జయాదిత్యవామను లన్నవారు (క్రీ. శ. ౬౬౦) పాణినీయమునకు 'కాశికా' యను

1. ౨. ౧. ౭౦. 'కుమారః శ్రమణాదిభిః' అను సూత్రమును, కుమారీశ్రమణా—కుమారశ్రమణా అను నుదాహరణములును, ఈ శ్రమణాది గణములో ప్రవ్రజితా, తాపసీ శబ్దములను ముఖ్యముగ నాలోచింపఁ దగినవి.

వ్యాఖ్యానము వ్రాసిరి. కాశికపై జినేంద్రబుద్ధి (క్రి. శ. ౭౫౦) న్యాసము రచించె; హరదత్తుఁడు (క్రి. శ. ౧౧౪౦) పదమంజరిఁ జేసె. కైయ్యటుఁడు (క్రి.౧౧౦౦) మహాభాష్యముపై ప్రదీపమను టీకాగ్రంథమును రచించె. ఇయ్యది మిగుల ప్రఖ్యాతి గల వ్యాకరణశాస్త్ర సంబంధమైన యుద్గ్రంథము. దీనిపై నాగోజీభట్టు (క్రి.శ.౧౭౦౦) ప్రతీపోద్యోత మను టీక వ్రాసెను. అన్నంభట్టు(౧౫ శ.) మితాక్షర యను పేరిట అష్టాధ్యాయిపై టీక వ్రాసెను. ఇవన్నియు అష్టాధ్యాయి క్రమమును అనుసరించి వ్రాయఁబడిన గ్రంథములు.

అష్టాధ్యాయిలోని సూత్రక్రమమును తప్పించి, వానిని మఱియొక విధముగ సమర్చి, సిద్ధముచేయఁబడిన వ్యాకరణములు ౧౪ వ శతాబ్దమునుండి పుట్టఁదొడఁగెను. ఇట్టివానిలో మొదటిది రూపమాల యనునది. కర్త విమల సరస్వతి. ఈతఁడు క్రి. శ. ౧౩౫౦ ప్రాంతమువాఁడై యుండనోపు. తరువాత రామచంద్రుఁడు (౧౫ వ శతాబ్దము) ప్రక్రియాకౌముదియు, భట్టోజి దీక్షితుఁడు (౧౭ వ శ.) సిద్ధాంతకౌముదియు వ్రాసిరి. పాణినీయ సంప్రదాయమును అనుసరించి వ్రాయఁబడిన సంస్కృత వ్యాకరణము లింకను పెక్కులు గలవు. వానిఁ జెప్పుట అనావశ్యకము.

పాణిని యొక్క యితర గ్రంథములను గుఱించి 'పాణిని' శబ్దముక్రింద వ్రాయఁబడును.

### గ్రంథసంగ్రహము

అష్టాధ్యాయిని తెనిఁగింపవలె నని 'ఆంధ్రపాణినీయము' అను పేరిట శ్రీయుత అక్కిరాజు ఉమాకాంతముగారు ప్రారంభించిరి. ౧ వ అధ్యాయమందలి మొదటి 3 పాదములు మాత్రము ప్రకటించియున్నారు. లఘుకౌముదికి శ్రీ కొంతి భద్రాద్రిశాస్త్రిగారు తెనుఁగర్థము వ్రాసి ప్రకటించినారు.

[కొ. ల.

**అష్టావక్రగీత.** సంస్కృత వేదాంత గ్రంథము. అద్వైతపరము. దీనిని తెనుఁగున కుమార రంగ మహీపతి పుత్రుఁడైన కవిసూరయ రచించెను; హిందూస్థానిభాషయందు సుందరకవి రచించెను.

**అష్టావక్రుఁడు.** ఒకమహర్షి. కహోడునకును సుజాతకును పుత్రుఁడు. ఉద్దాలకఋషి యీతనికి మాతామహుఁడు. శ్వేతకేతువు మేనమామ. ఈతఁడు కడుపులో నున్నపుడె వేదవేదాంగసంపన్నుఁడై తండ్రిని ఆక్షేపింప నాతఁడు ఎనిమిదివంకరలు కలవాఁడ వగుమని శాపంబిచ్చెను. వరుణపుత్రుఁ డైన బంది యనువాఁ డీతనితండ్రిని వాదములో నోడించి సముద్రములో ముంచినందున ఈతఁడును, తల్లియు ఉద్దాలకుని యింటనుండిరి. ఇతఁడు తాతనే తండ్రియని తలంచుచుండి కొన్ని దినములకు నిజము తెలిసికొని, బంది యనువానిని వాదమునందుఁ దానోడించి తండ్రిని సముద్రములో నుండి విడిపించుకొని వచ్చెను. త్రోవలో సమంగ యను నదిలో స్నానముచేయ నతని వంకరలు పోయెను. [మహా. వన. అ. ౧౩౨-౧౩౪; ఆంధ్రమహా. ఆరణ్య. 3 వ ఆశ్వా. ౨౩౪-౨౫౧] ఈతఁడు వివాహము చేసికొనఁదలఁచి వదాన్యుఁ డను ఋషికూఁతురైన సుప్రభ యనుదానిని తన కిమ్మని ఆతని నడిగెను. ఆతఁ డష్టావక్రుని నుత్తరదిక్కునకుఁ బంపి, యాతని బ్రహ్మచర్యదీక్షను స్త్రీరూపము ధరించిన యుత్తరదిక్కుచేఁ బరీక్షింపఁజేసి, మెచ్చి తనకూతు నిచ్చెను. [మహా. అను. ౧౯-౨౦; ఆంధ్ర. మహా. అను. ౨ ఆశ్వా. ౨-౨౫]

**అష్టాదశసంఖ్యలు.** అష్టాదశసంఖ్యలనకారాదిగ నీక్రింద వివరించుచున్నాము:—

ఉపపురాణములు:—చూఁడు 'ఉపపురాణ' శబ్దము.

గణములు:—అమరులు, సిద్ధులు, సాధ్యులు, గరుడులు, కిన్నరులు, కింపురుషులు, గంధర్వులు, యక్షులు, విద్యాధరులు, భూతములు, పిశాచములు, రుద్రులు, ఉరగులు, మునులు, తుషితులు, రాక్షసులు, భాస్వరులు, గుహ్యకులు.

గుణములు:—ఆకలి, దప్పి, భయము, కోపము, సంతోషము, కోరిక, నిద్ర, ముసలితనము, మరణము, జననము, మదము, స్వేదము, దుఃఖము, జాగ్రత, స్వప్నము, బాల్యము, కౌమారము, యౌవనము.

జాతులు:—బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు ౪; కంసాలె, సాలెలు ౨; గోపకులాలాంబష్ఠులు 3; ఎరుక ఏనాదిచెంచులు 3; కిరాత కంకటిక బోయలు ౪; మాల మాదిగెలు ౨.

ధాన్యములు:—యవలు, గోధుమలు, వడ్లు, తిలలు (నువ్వులు) కంగువులు (కొఱ్ఱలు,) కుసుస్థములు, (ఉలవలు) మాష (మినుములు), ముద్గలు (పెసలు) మసూరములు (చిరుశెనగలు) నిష్పావములు (అనుములు) సర్షపములు (ఆవాలు) గవేధుకములు (అడవిగోదుమలు) నీవారములు (నివ్వరి), ఆఢక్యములు (కందులు), సతీనగములు, చణకములు (శెనగలు), చీనగములు.

పురాణములు:— చూడుఁడు 'అష్టాదశ పురాణములు.'

ప్రబంధ వర్ణనములు:— పుర, గిరి, వన, నదీ, సముద్ర, ద్యూత, వివాహ, విరహ, యుద్ధ, షడృతు, ప్రాతఃకాల సంధ్యాకాల, సూర్యచంద్రోదయ, మధుపాన, రాయబార, స్త్రీ, బ్రాహ్మణాది, చతురంగ, వేదాంతవిచార వర్ణనములు.

విద్యలు:— శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, ౪ వేదములు, మీమాంస, న్యాయము, ధర్మశాస్త్రము, పురాణము, ఆయుర్వేదము ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము.

వివాదపదములు:— వ్యవహారములో వ్యాజ్యములకు విషయములగునవి వివాదపదములు (స్థానములు) అనఁబడును. [మను. ౮. 3—౭]. ౧. ఋణాదానము. ౨. నిక్షేపము. 3. అస్వామి విక్రయము. ౪. సంభూయ సముత్థానము. (జాయింటుస్టాకుకంపెనీ) ౫. దత్తాప్రదానికము (దానముచేసినది తిరిగి పుచ్చుకొనుట) ౬. వేతనాదానము (జీతము) ౭. సంవిద్వ్యతిక్రమము. (కరారుభంగము) ౮. క్రయవిక్రయానుశయము (అమ్మకము) ౯. స్వామిపాలనము. ౧౦. సీమావివాదము. ౧౧. వాక్పారుష్య దండపారుష్యములు ౧౨. స్తేయము (దొంగతనము) ౧3. సాహసము. ౧౪. స్త్రీసంగ్రహణము. ౧౫. స్త్రీపుంసధర్మము. ౧౬. విభాగము. ౧౭. ద్యూతము ౧౮. ఆహ్వయము.

శక్తిపీఠములు:— లంకలో శాంకరీ, కంచిలో కామాక్షి, మధురలో మీనాక్షి, కాళహస్తిలో జ్ఞానప్రసూనాంబ, ప్రద్యుమ్నమందు శృంఖలా, క్రౌంచపట్టణమందు చాముండి, అలంపురియందు జోగులాంబ, శ్రీశైలమందు భ్రమరాంబ, ఉడ్యాణమందు గిరిజాదేవి, పిఠాపురమందు పురుహూతిక, మాణిక్యపట్టణమందు చిత్రకోటిక, హయక్షేత్రమందు కామరూపిణీ, ప్రయాగయందు మాధవీ, కొల్లాపురమందు మహాలక్ష్మి, జ్వాలాపట్టణమందు జ్వాలాముఖి, వాసరాపట్టణమందు సరస్వతీ, కాశియందు అన్నపూర్ణ.

స్మృతులు:— మను, దక్ష, యమ, బృహస్పతి, శంఖలిఖిత, పరాశర, యాజ్ఞవల్క్య, విష్ణు, అత్రి, అంగిరస, సంవర్త, శాతాతప, ప్రచేతస, హారిత, ఆపస్తంబ, గౌతమ, ఉశన, ఆశ్వలాయన. ఇందుఁ గొన్ని పేళ్లు లేకుండగను మఱికొన్ని పేళ్లు ఉండునట్లును, ఈజాబితా పెక్కుస్మృతులలో పెక్కు విధముల నీయఁబడినది.

**అసంగుఁడు.** ౪వ శతాబ్దమునందలి బౌద్ధాచార్యుఁడు. విఖ్యాతబౌద్ధ గ్రంథకర్తయు, గుప్తరాజ వంశగురువును అగు వసుబంధుని యన్న. ఇతఁడార్యావర్త మందలి పురుషపురమునందు కౌశికవంశమునఁ బుట్టెను. వీరిద్దఱును గుప్తరాజ వంశమునకు మూలపురుషుఁడగు మొదటి చంద్రగుప్తుని (3౨౦-3౨౬) కాలమునందును, అతని కుమారుఁడగు సముద్రగుప్తుని (౬3 - ౨3౭౫) కాలమునందును ఉండిరి. అసంగుఁడు మొట్టమొదట 'మహీశశాఖ'కుఁ జేరిన బౌద్ధభిక్షు వయ్యెను, తత్త్వవిచారమునందు కొన్ని ఏండ్లు గడపిన తరువాత 'యోగాచార్యుఁ' డయ్యెను. ఈతఁడు మాధ్యమికుల సర్వశూన్యత్వమును ఒప్పుకొనక బాహ్యశూన్యత్వమును మాత్ర మంగీకరించెను. అసంగుఁడనేక ఉద్గ్రంథములను రచించెనని తెలియుచున్నది. ఈ గ్రంథము లిప్పుడు హిందూదేశమునందుఁ గానరావు గాని వీనిలోఁ గొన్నిటి భాషాంతరములు చీనాదేశమం దిప్పటికిని గలవు. వానిలో యోగాచార్య భూమిశాస్త్రము, మహాయాన సంపరిగ్రహ శాస్త్రము, మహాయాన సూత్రోపదేశములు అను మూఁడుగ్రంథములు ముఖ్యములైనవి.

**అసంది.** మైసూరు రాజ్యమందలి కదూరు తాలూకాలోని యొకపల్లె. ప్రస్తుత మిది యొక గ్రామ మైనను పూర్వ మిది గాంగహొయ్సలుల ముఖ్యపట్టణము. ౧౨-వ శతాబ్దమున నీ పట్టణము శ్రీపురుషుని కొడుకైన విజయాధిత్యునిచేఁ బాలింపఁబడెను.

**అసంధిమిత్ర.** అశోకుని మొదటిభార్య యని చెప్పెదరు.

**అసంప్షన్.** దక్షిణఅమెరికాలోని పెరగ్వే ప్రజాప్రభుత్వమునకు రాజధానీ నగరము.

**అసకి (జార్జి).** (౧౭౮౮-౧౮౬౯) రుమేనియను గ్రంథకర్త, కవి, చరిత్రకారుఁడు. ఇతఁడు స్వదేశోద్ధరణము నందుఁ బాటుపడిన నాయకులలో నొకఁడు. జాస్సీ యను పట్టణమున జన్మించెను. రుమేనియా దేశము నందీతఁడు మొట్టమొదటి ముద్రణ యంత్రమును స్థాపించి మాతృభాషయం దనేకగ్రంథముల నచ్చువేసి రుమేనియాభాషకు మహోపకార మొనరించెను. రుమేనియా భాషయందు 'అల్ బినా' యను మొదటివార్తా పత్రికను ప్రచురించి తానే సంపాదకత్వము వహించుచు ౩౦ యేండ్లవఱకు నిర్వహించెను. ఇతఁ డనేకపద్యకావ్యములను వ్రాసియు, విద్యార్థులకొఱకుఁ బెక్కు గ్రంథములను రచించియు, జర్మను, ఫ్రెంచిభాషలనుండి నాటకములను భాషాంతరీకరించియు, కొన్ని మాసపత్రికలను నిర్వహించియు మాతృభాషాభిమానమును జూపెను. కావుననే ఈతనికి ఆధునికరుమేనియా వాఙ్మయమునకు జనకుఁ డన్న కీర్తి వచ్చెను.

**అసజ్నా.** ఐస్లాండులోని యొక అగ్నిపర్వతము. దీని అగ్నిగుండముయొక్క చుట్టుకొలత ౧౨ మైళ్లు. ఇంత వెడల్పైన గుండము మఱియొకచోటఁ గానరాదు.

**అసక్రతుఁడు.** భృగుమహర్షికి పులోమ యందుఁ బుట్టిన పుత్రులలో నొకఁడు.

**అసన్ సోల్ సబ్ డివిజన్.** బంగాళా దేశమందలి బర్ద్వాను జిల్లాయొక్క వాయవ్యఖండము. విస్తీర్ణము ౪౧౩ చదరపు మైళ్లు. ౧౯౦౬ వఱకును దీనిని రాణీగంజ్ ఖండమనియే పిలుచుచుండిరి. ఇందు అసన్ సోల్, రాణీగంజ్ అను ౨ పట్టణములును ౪౧౧ గ్రామములును ఉన్నవి. జనసంఖ్య ౩౭౯౮౪౪. జన సమ్మర్ద మెక్కువ. చదరపు మైలునకు ౬౦౦ మంది గలరు. ఈ ఖండమునందు ఇనుము, బొగ్గుగనులు కలవు. ఈ గనుల మూలముననే ఈ ఖండము జాల యభివృద్ధికి రాఁగలిగెను.

**అసన్ సోల్ పట్టణము.** అసన్ సోల్ ఖండముయొక్క ముఖ్య పట్టణము. ఈస్టిండియన్ రైలు పట్టణముమీఁదుగ బోవుచుండును. జనసంఖ్య ౧౪౯౦౬. ఇది కూడలిస్థాన మగుటచేతను, బొగ్గు పరిశ్రమకు ముఖ్యస్థాన మగుటవలనను, మిక్కిలి యభివృద్ధిఁ జెందుచున్నది. ఇచ్చటఁ గొంత సైన్యము వాసము జేయుచుండును. మెథడిస్టు ఎపిస్కోపల్ మిషను వా రచ్చట నొక కుష్ఠు ఆస్పత్రియు, అనాథ శరణాలయమును, బాలికా పాఠశాలయును స్థాపించియున్నారు.

**అసఫ్ ఉద్ దౌలా.** ఇతఁడు అయోధ్యారాజ్యమును క్రీ. శ. ౧౭౭౫-౧౭౯౭ వఱకు పాలించిన నవాబు, ఇతఁడు షుజా ఉద్ దౌలాయొక్క పెద్ద కొడుకు. వారన్ హేస్టింగుచేఁ బీడింపఁబడిన అయోధ్యా బేగము లితని తల్లులే. వారన్ హేస్టింగ్సు తనకావలసియవలసిన అప్పు నీయుమని నవాబును బలవంత పెట్టెను. నవాబు తల్లులకు కొంతజాగీరిచ్చి సొమ్మును పుచ్చుకొని ఇంగ్లీషువారి యప్పును దీర్చెను. తరువాత కాశీరాజగు జయసింగు కలహమునందీ బేగములు కలసియున్నారని ఇంగ్లీషువారా జాగీర్లను లాగుకొనిరి. ఈ విషయమై వారన్ హేస్టింగ్సుమీఁద తరువాత నొక కేసు తేఁబడినవి. ఈనవాబు లక్నో పట్టణమును తన, రాజధానిగ మార్చెను.

**అసమంజసుఁడు.** (సూ. వం) ౧. ఇక్ష్వాకువంశజుఁడగు సగరరాజునకు కేశిని యను భార్యయందుఁ బుట్టిన పుత్రుఁడు. ఇతఁడు యోగభ్రష్టఋషియగుటచే నింట నుండనొల్లక బుద్ధిపూర్వకముగఁ బిచ్చివానివలె నటించి, అయోధ్యలోని బాలురను పట్టుకొని పోయి సరయూనదిలో ముంచుచుండెను. ఇందును గుఱించి నాగరకులు రాజుతో మొఱ్ఱవెట్ట నాతఁ డసమంజసుని రాజ్యమునుండి వెడలఁగొట్టెను. అంత నాతఁడు తనకోర్కె సిద్ధించెనని సంతసించి వెడలి పోవుచు తాను నదిలోముంచిన పిల్లవాండ్ర నందఱిని బ్రతికించి పట్టణమునకుఁ బంపి అరణ్యమునకుఁబోయెను. అంశుమంతుఁ డీతని పుత్రుఁడు.

౨. (చం. వం.) యదుపుత్రుఁడగు క్రోష్టుయొక్క వంశమునందు జన్మించిన అంధకునకుఁ బౌత్రుఁడు, కంబల బర్హిషునకుఁ బుత్రుఁడు. ఇతనికి తమోజసుఁడను పుత్రుఁడు కలఁడు.

**అసరోరు.** పంజాబు దేశములోని గుజ్రాన్‌వాలా జిల్లాయందలి ఖాంగాడోగ్రాన్ తహసీల్‌లోని యొకగ్రామము. హూయానుత్సాంగు ౬౩౦ వ సంవత్సరమునందు హిందూదేశమును జూడవచ్చినపుడిది టాకి యను నొక గొప్పపురమై యుండెనని కన్నింగుహాము వ్రాసినాఁడు. అప్పుడిది యొక ముఖ్యపట్టణమనియు, మూఁడుమైళ్ల చుట్టుకొలత కలిగియుండెను. ఇప్పటికిని ఈ మూఁడు మైళ్ల చుట్టుకొలత మేరలో గొన్ని పూర్వావశేషములలో సిథియనుల నాణెములనేకములు దొరుకుచుండును. కాఁబట్టి ఈ పట్టణము ౨౦౦౦ యేండ్లకుఁ బూర్వమే ప్రసిద్ధిఁ జెందియుండెనని యూహింపఁబడుచున్నది.

**అసామాన్య.** ౧౮ వ శతాబ్దము నాటి వంగదేశ శ్రీ: ముర్షిదాబాదులోని మహేష్పుండ్ జగత్సేటను మహాధనసంపన్నుని కూఁతురు. మిక్కిలి రూపవతి. బంగాళానవాబు సురాజుద్దౌలా ఈమె పాతివ్రత్యమును భంగపఱుపవలెనని యొకసారి యత్నించి భగ్నమనోరథుఁడై ఈమెభర్తచే పాదరక్షాప్రహారమును తినెను. ఆకోపముచేత నతఁడు అసామాన్యభర్తను చంపించి నాతని శిరస్సు నామె యొద్దకుఁ బంపెను. అప్పటినుండి ఆమెకు మతిభ్రమ కలిగి తరువాత నింగ్లీషువారిచేనోడింపఁబడి మీర్జాఫరు కుమారునిచేఁ జంపబడిన సురాజుద్దౌలా శిరమునుచూచిన తరువాత నామె స్వస్థచిత్తయయ్యె. కాని సురాజుద్దౌలాభార్య గొప్ప సంకటములో నున్నదని విని శత్రులచేతఁ బడకుండ నామెను రక్షించుటకు యత్నించి తన యౌదార్యభావమును చూపెను.

**అసి.** ఒకనది. ఇది కాశీక్షేత్రమువద్ద గంగతోఁ గలియును.

**అసిక్ని.** ౧. ప్రాచేతస దక్షునిభార్య. ఈమె పంచజన ప్రజాపతికిఁ గన్య. కావున పాంచజని యనఁబడియె. [భాగ. ౬. ౪.]

౨. భారతవర్షీయనది. ఇది పంజాబు దేశములో నున్న సింధునదమున కొక యుపశాఖ. దీనినే ఇప్పుడు 'చీనాబ్' అందురు. గ్రీకుదేశీయులు దీనిని 'అకెసినాస్' (Akesinos.) అనిరి.

**అసిత.** ఒక యప్సర.

**అసితము.** కామ్యక వనమునకుఁ బశ్చిమమున నున్న యొకపర్వతము. ఇచ్చట కతుసేన ఋషియొక్క ఆశ్రమ ముండెను.

**అసితాంగుఁడు.** అష్టభైరవులలో నొకఁడు.

**అసితుఁడు** ౧. మరీచికులోత్పన్నఋషి. ఇతనిభార్య హిమాలయకన్య ఏకపర్ణ.

౨. మాంధాతచేఁ బరాభవింపఁబడిన యొకరాజు. [భార. శాంతి. ౨౯]

3. జనమేజయుని సర్పసత్రమందలి యొక సదస్యుఁడు.

**అసిలి.** కడపజిల్లాలో నివసించుచుండెడి ఈడిగవాండ్ల (కల్లుదీయువారు) పేరు. చూఁడు 'ఈడిగవాండ్లు'.

**అసిపత్రవనము.** ఒకనరకము. ఇందు ఖడ్గధారల వన ముండును. వేదబాహ్యవర్తనము చేయువారిని పాషండులను ఇచ్చట శిక్షింతురు.

**అసిలోమా.** దనుపుత్రుఁడైన దానవుఁడు.

**అసిలోమసుఁడు.** దనుపుత్రుఁడైన దానవుఁడు.

**అసీంద్.** రాజపుత్రస్థానమందలి ఉదయపుర రాజ్యములోని అసీంద్ సంస్థానముయొక్క ముఖ్య పట్టణము. జనసంఖ్య ౨౨౩౭. (ఈసంస్థానము మేవాడ్ క్షత్రియకూరులైన రావతులచే బాలింపఁబడుచున్నది. ఇందు ౭౨ గ్రామములు కలవు. వచ్చు రాబడి రూ ౮౦౦౦౦; పేష్కషు ౧౦౮౦. ఈ రావుత వంశీయులు శిశోదియా రాజవంశీయులైన చోండావతు కుటుంబములోనివారు.

**అసీమకృష్ణుఁడు.** (చం వం) ఇతని నామము పెక్కుపురాణములలో అధిసీమకృష్ణుఁడు' అని ఉన్నది. జనమేజయుని వంశమందలిరాజు. అశ్వమేధకుని పుత్రుఁడు, నిమిచక్రునకుఁ దండ్రి,

**అసీర్‌గడము.** మధ్య పరగణాలలోని నేమాడ్ జిల్లాయందలి బురహాన్‌పూర్ తాలూకాలో నొక పర్వతదుర్గము. ఈకోట ౧౯౦౪ వఱకు నొక చిన్న పటాలముచే సంరక్షింపఁబడుచుండెను. ఇది సాత్పుడా పర్వతావలి మీఁద ౨౨౮౩ అడుఁగుల ఎత్తుననున్నది. పూర్వము హిందూస్థానము నుండి దక్షిణమునకుఁ బోవు రాచబాటకుఁ గాపుగ నుండి ఇది ౬౦ యెకరముల స్థలము నాక్రమించి యున్నది. ౧౨౯౫ లో నీకోట చౌహాన్ రాజపుత్రులవశమున నుండెను. అప్పుడు అల్లా యుద్దీను ఖిల్జీ దక్షిణ దండయాత్ర చేసి తిరిగి వెళ్లుప్పుడీగడమును ముట్టడించి అందుండిన ప్రతివాని దనఖడ్గమున కెరయిచ్చెను. తరువాత దానిని ఖాన్‌దేశపు ఫారూకిరాజుల వద్దనుండి ౧౬౦౦ లో అక్బరు జయించెను. ఇందలి రాజద్వారము జహాంగీరు చక్రవర్తి కాలమునందును, ఇందుండు మసీదు షాజహాన్ కాలమునందును గట్టింపఁబడినవి. ౧౭౦౩ లో నీకోట మహారాష్ట్రుల వశమునందుండెను. అప్పుడు జనరల్ వెలెస్లీయొక్క సైన్యభాగ మొకటి ఈ దుర్గమును ముట్టడించి పట్టుకొనెను. గాని తరువాత మహారాష్ట్రులకును ఇంగ్లీషువారికిని జరిగిన సంధిలో తిరిగియిచ్చివేయఁబడినది. కాని ౧౮౧౯లో మరల నింగ్లీషువారిచే ముట్టడింపఁబడి ౨౦ రోజుల ఘోర సంగ్రామమైన తదుపరి వారికి వశమయ్యె.

**అసీవన్.** సంయుక్త పరగణాల లోని యునవో జిల్లాయందలి మోహన్ తహసీలులోని ఒక గ్రామము. జనసంఖ్య ౬౧౫౩. ఈ పట్టణము ౧౧ వ శతాబ్దమున అస్సు అను నొక చాకలివానిచేఁ గట్టింపఁబడె నని చెప్పెదరు. గాని చరిత్ర కాధారమేమియును లేదు. ఇందనేక దేవాలయములును మసీదులును గలవు. ఇవి గాక ౯ వ శతాబ్దమునాటి కట్టడము గూడ నిందు కలదు. ముతుకవస్త్రముల నేయు పరిశ్రమ మిచ్చట నున్నది. వారమునకు రెండుసారు లిచ్చట సంతె జరుగును.

**అసుర** ప్రాధాకన్య యగు నొకయప్సర.

**అసురథుఁడు.** ఒక యాదవుఁడు.

**అసురుఁడు.** అగ్నివిశేషము [మహాభార. ఉద్యోగ. ౯౯.]

**అసురులు.** ౧ దేవతలకు శత్రువులు, సవతితమ్ములు. 'అసుర,' 'దైత్య,' 'దైతేయ,' 'దనుజ,' 'దానవ,' 'దితిసుత' అనుపదములు సమానార్థకము లని అమరకోశాదికములందుఁ జెప్పఁబడినను వీరిలో దైత్య దానవాదులు వేఱువేఱుగాఁ గానవచ్చుచున్నారు. మరీచి కుమారుఁడైన కశ్యపునకు అదితి, దితి, దను, దనాయు, సింహిక, మొదలైన పెక్కుభార్య లుండిరి. వీరందఱును దక్షునికూఁతులు. అదితిసంతానము ఆదిత్యులు. వీరలే దేవత లనియు, సుర లనియు చెప్పఁబడుదురు. వీరికి రాజు ఇంద్రుఁడు. దితికుమారులు దైత్యులు. దనుకుమారులు దానవులు. ఇట్లే ఇతర భార్యలకును వేఱువేఱు పుత్రులు పుట్టిరి. వారివివరమంతయు మహాభారతము, ఆదిపర్వము ౬౬ వ అధ్యాయము నందును

శాంతి, ౨౩౪ వ అధ్యాయమందును, భాగవతము షష్ఠ స్కంధము ౧౯ వ అధ్యాయమునందును చూడనగు. దేవతలకు శత్రువులుగా నున్న దైత్యులు, దానవులు మొదలైన వారందఱును 'అసురు'లను సామాన్య నామముతో వివరింపఁబడు చుండిరి. దేవతలకు సుర లనియు, దైత్యులకు అసురులనియు పేళ్లు వచ్చుటకు వాల్మీకి రామాయణమునందుఁ జిత్రమైన కారణము చెప్పఁబడి యున్నది. సముద్ర మథన కాలమునందు సముద్రములో నుండి సుర (కల్లు) వెలువడెనఁట. దానిని తమకు అక్కఱలేదని దైత్యులు తీసికొనక పోయిరి. దేవతలు దాని నంగీకరించిరి. అందుచే దేవతలకు సుర లనియు దైత్యులకు అసురులనియు పేళ్లు వచ్చెను. [బాల. ౪౫. స. ౨౩-౨౫].

ఋగ్వేదమునందు అసుర శబ్దము పెక్కు పర్యాయములు ఉపయోగింపఁబడినది. అది పెక్కుపర్యాయములు దేవశత్రువులు అన్న అర్థముసందే గానవచ్చును. కాని కొన్నిస్థలములలో దేవతాపరముగఁ గూడఁ గానవచ్చుచున్నది.* ఈ అసురశబ్దమే పారసీక భాషలో అహురశబ్దముగా మాఱినది. దానికి ఆ భాషలో దేవుఁడని యర్థము. అస్సీరియా దేశమువారి ముఖ్యదేవుని నామము అసురుఁడు. అచ్చటి జనులను గూడ అసురులందురు. అసురులకు పూర్వదేవత లనియు నామము గలదు. దీనిని బట్టి చూడ మిక్కిలి పూర్వకాలమునందు ఆర్యులందఱొక్కచోట నున్నప్పుడు అసుర శబ్దము దేవతాపరముగ నుండెననియు హిందూదేశపు టార్యుల దేవతలకును అసురులకును భేదము కలిగినతరువాత వీరు సుర లని పేరు పెట్టుకొని యుందురనియు అసురశబ్దమునకు దానవు లని పేరువచ్చి యుండుననియు కొందఱు పండితుల యభిప్రాయము.

౨. బిహార్ దేశమందలి చోటా నాగపూర్ ప్రాంతములో నివసించు అనార్యజాతి. వీరు కోయజాతిలో నంతర్భాగముగ నెంచఁబడు చున్నారు. వీరిసంఖ్య ౪౮౬౪. వీరు గాక వీరిలోని తెగలగు బ్రిజియా, అగారియా లనఁబడు జాతులవారు ౪౬౧౬ మంది కలరు. బ్రిజియావారిది వ్యవసాయవృత్తి. అగారియాలు కోతు లాడించి భిక్షాటనము చేయుదురు. వీరిలో నింకను పెక్కుతెగలు గలవు.

వేదపురాణాదులలో వర్ణింపఁబడిన అసురులే వీరనియు ఆర్యులచే గంగయొడ్డున నుండి తూర్పునకు తఱుమఁబడి రనియు కొందఱు చరిత్రకారుల యభిప్రాయము.

అసురులు తమభాషను "దుక్మ" యందురు. ఇది కోయభాషాకుటుంబము లోనిది. ఇందు ద్రావిడభాషా పదము లనేకములు చేరినవి. ఇది "ముండా" జాతి భాష నెక్కువగ ననుకరించును. వీరిలో బాల్యవివాహములు లేవు. వీరు చిల్లరదేవతలను భూతపిశాచములను పూజింపరు. సృష్టికర్త యొకఁడు కలఁడని నమ్మినను ఆతనికి వేరె పూజ అక్కఱలేదనియు, పితృదేవతలను పూజించిన చాలుననియు నమ్ముదురు. స్వాభావికముగ మరణించినవారు మంచి పితృదేవతలు. ఆకస్మికముగ పోయినవారు చెడ్డ పితృదేవతలు. రోగములు వచ్చుటకును, కష్టములు ప్రాప్తించుటకును, దురదృష్టము

* ఋగ్వేదమునందు ౧. ౬౪. ౨ లో మరుద్దేవతలను, ౧. ౧౭౪. ౧ లో నింద్రుని, ౨. ౧. ౬ లోను ౫. ౪౨. ౧౧ లోను రుద్రుని, 3. 3. ౪ లోను ౭. ౬. ౧ లోను అగ్నిని, ౫. ౮3. ౬ లో పర్జన్యుని 'అసుర' శబ్దముచే సంబోధింపఁబడియు, స్తుతింపఁబడియునున్నది. ఇందువలన నొకప్పుడు 'అసుర' శబ్దమునకు దేవతలన్న మంచియర్థ ముండెననుటకు సందేహములేదు. సాయణాచార్యులవా రిట్టి తావుల 'అసుర' శబ్దమునకు 'శత్రూణాం నిరసితా' (శత్రువులను నిరసించువాఁడు) [౨. ౧. ౬], 'ప్రకృష్టా సుబలవంతః' (ఎక్కువ బలముకలవాఁడు) [౫. ౪౨. ౧౧] అని యర్థము చేసియున్నారు. ఋగ్వేదమునం దిట్లు 'అసుర' శబ్దము దేవతార్థమునందును, దానవార్థమునందును పెక్కు తావులఁ గానవచ్చినను 'సుర' శబ్దముమాత్రము కానరాదు! ఇయ్యది ఉపనిమత్తాలమునందుఁ గానవచ్చుచున్నది. కావున 'అసుర' శబ్దము మొదట నుండెననియు, నది క్రమముగ దానవులపాలు కాఁగా, దాని మూలార్థము మఱచి, 'అసురు'లైన వారి శత్రువులగు దేవతలు 'సురలు' కావలయునని 'సుర' శబ్దమొకటి పుట్టెననియుఁ బండితుల యభిప్రాయము.

పట్టుటకును చెడ్డ పితృదేవతలే కారణభూతు లని వీరి యభిప్రాయము. కావుననే ఈ చెడ్డ పితృదేవతలకు కోళ్లను బలి ఈయుదురు.

**అసూర్తరజసుఁడు.** మూర్తయ రాజునకు నామాంతరము.

**అసెన్షన్‌దీవి.** అట్లాంటిక్ మహా సముద్రమునందలి యొకదీవి. ఇది ఆఫ్రికాఖండమునకుఁ బశ్చిమమునను, సెయింట్ హెలీనాదీవికి వాయవ్యము గను ఉన్నది. వైశాల్యము ౩౮ చదరపు మైళ్లు; జన సంఖ్య ౩౦౦. ఈ ప్రదేశ మారోగ్యవంతముగ నుండును. ౧౫౦౧ వ సంవత్సరమునందు జాన్‌డినోవా యను పోర్చుగీసువానిచే నీ దీవి మొదట కనుఁగొనఁబడెను. దీనిని బ్రిటిషువారు ౧౮౧౫ లో నాక్రమించుకొనిరి. ఇది బ్రిటిషు తూర్పు నౌకాదళాధిపతి క్రింద నున్నది.

**అసెల్లియోగాస్పారో** (౧౫౮౧-౧౬౨౬) ప్రఖ్యాతిఁ జెందిన ఇటలీదేశపు వైద్యుఁడు. పేడూవా, పేవియా విశ్వవిద్యాలయములలో శారీర శాస్త్రమునకు ఆచార్యుఁడుగ నుండెను. శరీరావయవములను బాగుగఁ దెలిసికొనుటకై బ్రతికియున్న జంతువులను శస్త్రములతోఁ గోసి పరీక్షింపవలయు నని తొలుత ప్రతిపాదించెను. ఇతఁడు మానవశరీరమునందలి క్షీరవాహికలను (Lacteal vessels) మొట్టమొదటఁ గనిపెట్టెను.

**అస్కారి (మీర్జా).** మొదటిమొగలు చక్రవర్తి యగు బాబరు మూఁడవకొడుకు. హుమాయూను తమ్ముఁడు. తండ్రియాజ్ఞ ననుసరించి హుమాయూ నితనికి సంభల్ సర్కారిచ్చినను కృతఘ్నుఁడగుటచే నీతఁడన్నపై తిరుగఁబడి అతని కష్టకాలములందు బాధపెట్టెను. కాని దయాంతఃకరణుఁడగు హుమాయూను తమ్ముని క్షమించెను. అంతట నితఁడు మక్కాయాత్రకుఁ బోవుచు మార్గమధ్యమున అరేబియా ఎడారులలో మరణించెను. (౧౫౫౮).

**అస్ట్రరా.** రషియన్‌ట్రాన్సుకాకేషియా దేశమందలి యొకరేవు. ఇది కాస్పియన్ సముద్రతీరమున బాకు గవర్నమెంటు పాలనక్రింద నున్నది. రష్యాదేశమునుండి వచ్చు సరకు లిచ్చటఁ దిగుమతి యగును.

**అస్తి.** ౧. ఇటలీదేశములోని అలెస్సాండ్రియా రాష్ట్రమునందలి పీడ్‌మాంట్ సీమలో నొకపట్టణము. ఇది పీడ్‌మాంట్ సీమయొక్క ఓపపు ఉండు స్థలము. జనసంఖ్య ౬౦౮౩౪. ఇచ్చట పురాతనకాలపు కట్టడము లనేకములున్నవి. ౧౪ వ శతాబ్దమునాటి చక్కని గాథిక్ కతీడ్రల్ (దేవాలయము) ఇప్పటికిని చెక్కు చెదరకుండ నున్నది. ౬ వ శతాబ్దమునాటి దేవాలయములు గూడ కలవు. ఇది సుప్రసిద్ధకవి యగు విట్టోరియా ఆల్ఫీరి (Alfieri) యను వాని జన్మస్థానము. పూర్వకాలమునందు అనఁగా క్రీ. పూ ౪ వ శతాబ్దమునం దిచ్చట అందమైన పింగాణీపాత్రలు తయారు చేయఁబడుచుండెడివి. ఇప్పు డీపట్టణము మొదటిరకపు ద్రాక్షసారాయికి ప్రసిద్ధి.

౨. జరాసంధరాజు నిద్దఱుకన్యలలోఁ బెద్దది, కంసునిభార్య. కంసునివధానంతర మీమె తండ్రి యింట నుండెను. [భాగ. ౧౦. ౫౦.]

**అస్థిపంజరము.** అస్థిపంజరము అనగా ఎముకలతో కట్టబడిన గూడు. పంజరము అని చెప్పుటచే నిది సంరక్షణార్థ మేర్పడిన యిల్లువంటిదని స్ఫురింప వచ్చును. కాని అస్థి అను శబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థము చూడగా అస్=ఉండుట అను అర్థము నిచ్చు సంస్కృతధాతువు నుండి పుట్టినట్లు కనబడుచున్నది. అనగా శరీరమును స్థిరముగ నిలువబెట్టునది అస్థి. కాబట్టి అస్థిపంజరము అను పేరునందే శరీరమునకు సంరక్షణకలుగ జేయునట్టియు, శరీరమును స్థిరముగ నిలువబెట్టునట్టియు యంత్రము (వస్తువు) అని గోచర మగుచున్నది. ఆంగ్లేయాది భాషలలోని Osteology) ఆస్టియాలజీ - అస్థిశాస్త్రము) మొదలగు పదములకుగూడ అస్ ధాతువే మూలముగా కనబడుచున్నది.




వృక్షముయొక్క అస్థిపంజరము.

**అస్థిపంజరముయొక్క ఉపయోగములు**

పైని చెప్పిన స్థిరత్వము, సంరక్షణము గాక భారవహత్వము, చలన గ్రహణ సౌకర్యములు మొదలగు ఇతరోపయోగములు కూడ అస్థిపంజరమునకు గలవు.

చెట్లయొక్కగాని జంతువులయొక్కగాని నిర్మాణములో, కొంత భాగము గట్టిపదార్థమును, మరి కొంతభాగము మెత్తని పదార్థమును చేరియుండును. చెట్టంతయు మెత్తని పదార్థముతోనే చేయబడియున్న యెడల చిన్న చిన్న మొక్క లుండును గాని సృష్టిలో పెద్దచెట్లే యుండవు. 1-వ పటము, చెట్టుయొక్క అస్థిపంజరము చూడుడు.

ఇట్లే మన శరీరము గూడ అందలి రక్తము, మజ్జ, మాంసము మొదలగు మెత్తని పదార్థములతోనే నిర్మింపబడియున్న యెడల అది యొక ముద్దయగును గాని కాళ్లు చేతులు మొదలగు అవయవములు గలిగి నిలువబడజాలదు.

ఇది గాక మనము ఒకచోటినుండి మరియొక చోటికి నడచుటకును, ఏ వస్తువునైనను మోయుటకును చేతితోపట్టుకొనుటకును, చీల్చుటకును సహాయకరములగు కాళ్లుచేతులు మొదలగు అవయవములు సులభముగ తమతమపనులు చేయుటకై వానియందలి యెముక లెంతయో ఆ యవయవములకు సహాయపడుచున్నవి. మనశరీరములో ఎముకలే లేనియెడల మనము జలగవలె ప్రాకవలసియుండును. ఒక యెముకయందు పుట్టి వేఱొక యెముకయందు ప్రవేశించి ఈ రెంటిని అవసరమును బట్టి దగ్గరకు చేర్చునట్టియు, దూరము చేయునట్టియు మాంసపు ఖండములకు కండ *లని పేరు. ఇవి రబ్బరు త్రాళ్లవంటివి. వీని సహాయముచేత మన మేవస్తువునైనను చేతితో పట్టుకొనుటయు, నోటితో తినుటయు, చీల్చుటయు మొదలగు పనులను చేయగలిగి యున్నాము. ఇవియే మనము నవ్వుటకును, కోపపడుటకును ఉపయోగించు సాధనములు. ఇట్టి కండలకు ఆధారభూతముగా నుండుట యెముకలయొక్క యుపయోగములలో నొకటి. ఎముకలు, దూలములు వాసములు గుజ్జులు స్తంభములు మొదలగువాని వంటివి. ఇవి లేనిచో మనశరీరమను ఇల్లు కూలిపడును.

ఇట్టి యిల్లు అనేకజంతువుల కనేకవిధములుగా నిర్మింపబడియుండును. ఆయా నిర్మాణములు వాని ఆహారసంపాదనాదిసౌకర్యములను బట్టి వేర్వేరుగ నేర్పడియుండును. కొంగ మెడ పొడుగుగానుండును. చేప మెడ యట్లుండుటవలన దానికి ప్రయోజనము లేదు. కావున చేపమెడ పొట్టిగానుండును. కొన్ని జంతువుల అస్థిపంజరముల ఆకారము 2 వ పటమున చూపియున్నాము.

* కండశబ్దమునకు సంస్కృతరూపము కండరము. మనము కండ యని వాడుదానికి సంస్కృతగ్రంథములలో కండరము, పేశిఅని వాడబడియున్నది. ఈరెండింటిలో దేశభాషలోని కండశబ్దమునే మేము సర్వత్ర ఉపయోగపరచితిమి. కండలయంచులయందుండు తెల్లని త్రాళ్లవంటి భాగములు మాత్రమే కండరములని కొందరు వాడియున్నారు. కాని మేము కండరశబ్దమును కండశబ్దమును ఒకటే అర్థమునందు వాడి కండరాగ్రము అను పదము కండలయంచులందలి త్రాళ్లకు ఉపయోగించుచున్నాము. కాబట్టి కండరము, కండ లేక పేశి=Muscle; కండరాగ్రము=Tendon. మరియు సంధులు మొదలగు వానిలోని వేర్వేరుభాగములను బంధించు త్రాళ్లకు స్నాయువులు (Ligaments) అని ఉపయోగించినారము.

## 2 వ పటము— వేరువేరు ప్రాణుల అస్థిపంజరములు.

































1 ఏలుగుపాము, 2 నత్త, 3 చేప, 4 పాము, 5 కొంగ, 6 గబ్బిలము, 7 కప్ప, 8 గుర్రము, 9 మానవుడు, 10 తోకలేనికోతి.

ఏలుగుపాముయొక్క శరీరములో అస్థిపంజరము లేదు. కాని దాని శరీరముమీద పొడుగునను ఉంగరములవలె నేర్పడియున్న గట్లను చూచిన యెడల దానిశరీరము అనేకవిభాగములుగా నేర్పడి యున్నట్లు తెలియగలదు. దీని చర్మపుపైపొర గట్టిగ నుండి అదియే దానికి పంజరముగా నేర్పడును గాని దానికి అస్థిపంజరము లేదు. హెచ్చుతరగతి జంతువుల వెన్నెముకయం దెట్టి విభాగములు కలవో అట్టి విభాగములు దీని శరీరమునందును కనబడుచుండుటచేత నీయేలుగుపాము అస్థిపంజరావస్థకు పూర్వరూపమును సూచించుచున్నదని చెప్పవచ్చును. ఈ యేలుగుపాము శరీరమునందలి ఖండములలో నొక్కొక్కఖండమునందు ఎముక యను గట్టిపదార్థ మేర్పడి యున్నయెడల అదియే వెన్నెముకగా నగును. 2-వ పటములోని పాముయొక్క వెన్నెముక యిట్లు ఏర్పడియున్నదని తలపవచ్చును. పాముయొక్క అస్థిపంజరములో నిరుప్రక్కల యందును చిన్నచిన్న ప్రక్కయెముకలు గలవు. ఈ ఎముకలన్నియు ఏప్రక్కకు కావలసియున్న ఆప్రక్కకు గిరగిర తిరుగుటకు తగిన సంధులు గలవు. అందుచే నిది యతివేగముగ మెలికలు తిరుగుచు ప్రాకగలదు. పామునకు చేతులుగాని కాళ్లుగాని వేరుగాలేవు. చేపయొక్క అస్థి పంజరములో కాళ్లుచేతులయొక్క (2-వ పటము) ప్రారంభావస్థ తెలియగలదు. పక్షిరెక్కలను గబ్బిలపు రెక్కలను చూచినయెడల చేతియెముకలు క్రమక్రమముగ నెట్లు ఏర్పడియున్నవో గ్రహింపనగును. కప్పయొక్క అస్థిపంజరములో ముందరివైపున చేతులును వెనుకవైపున కాళ్లును వేలువేలుగ స్పష్టముగ తెలియుచున్నవి. గుఱ్ఱముయొక్క ముందరికాళ్లే దానిచేతులకు ప్రత్యామ్నాయముగా నున్నవి. దాని చేతులయందలి వేళ్లన్నియు దాని స్వభావచేష్టలచే కాలక్రమముగ నశించి ఒక్కటే గిట్టగల పాద మేర్పడియున్నది. భూగర్భశాస్త్రజ్ఞులు భూమిలో లోతుత్రవ్వి చూచి గుఱ్ఱమునకు ఒకానొక కాలమందు 5 గోళ్లు ఉండియుండినట్లు కనిపెట్టియున్నారు. ఈ కాలపు గుఱ్ఱములకవి నశించినవి. ఇట్లే ప్రతిజంతువునకును ప్రతిఅంగమునందును మార్పులు వానివాని వ్యాపారములను బట్టి అనగా అవి చేయుపనులను బట్టి కలుగుచున్నవి. చెట్లకొమ్మలనుండి వ్రేలాడు స్వభావము గల కొన్ని కోతులకు పెద్దతోక గలదు. కాని 2-వ పటములోని కోతికి తోక హ్రస్వమైపోయినది. మానవులకును ఈ కోతికిని విస్తారము భేదము కానరాదు. కాబట్టి ఈకోతులు మానవులకు సమీపబంధువు లని చెప్పవచ్చును. కాని కోతులకు తలపుఱ్ఱె చిన్నది. మానవులకు అది పెద్దది. అనగా మానవులకు మెదడు పెద్దదిగా నుండుటచే వారలకు కోతులకంటె బుద్ధిబలము హెచ్చుగ నుండును.

మనచేతి బొటనవ్రేలు మిక్కిలి స్వేచ్ఛగ అన్ని ప్రక్కలకు తిరుగుచు చిటికెనవ్రేలు మొదలుకొని అన్ని వ్రేళ్లను సమీపింపగలదు. కాళ్ల బొటనవ్రేళ్లు అట్లు తక్కినవేళ్ళను సమీపింపజాలవు. అందుచేతనే మనము చేతులలో నేవస్తువునైనను పట్టుకొనినట్లు కాలివ్రేళ్లతో పట్టుకొనలేము. కాలివ్రేళ్లతో కలము పట్టి వ్రాయలేము. ఇట్లే తక్కినజంతువుల చేతులకంటె మానవుల చేతులకు హెచ్చు చతురత గలిగినది. ఇట్టిచతురత కొంతవరకుకోతులకును గలదు. కాని పిల్లులకును, కుక్కలకును లేదు. వ్యాపారభేదమునుబట్టి అవయవనిర్మాణభేద మేర్పడుట కిది యొక యుదాహరణము.

పైని చెప్పినట్లు మన శరీరమును నిలువ బెట్టుటకును, ఆయాయంగములకు తగుకీలిని గ్రహణచలనములకు అనుకూల మగుటకుమాత్రము గాక అస్థులు మరి రెండు విధముల ఉపయోగకరముగా నున్నవి.

2-వ పటములో నత్తయొక్క పటము చూచిన యెడల దాని అస్థిపంజరము శరీరమధ్యమున గాక దాని శరీరమునకు వెలుపలిభాగమున నొకగూడుగా నున్నట్లు తెలియగలదు. అవసరమైనప్పుడు సంరక్షణార్థమై నత్త తనశరీరము నంతను ఈగూటిలో దాచుకొనుచున్నది. కోమలమును ప్రాణాధారము నయిన మన మెదడు పుఱ్ఱె యనుగూటిలో నీప్రకారమే సంరక్షణార్థమై దాగికొని యున్నది. 2-వపటములో చూడుము. ఇట్లే వెన్నెముక పొడుగునను సుషుమ్న అను ముఖ్యమైన నాడిఎముకలగూటిలో దాగియుండి దానిచే సంరక్షింపబడుచున్నది. ఈ సుషుమ్న (Spinal cord) కేదియైన అపాయము కలిగిన యెడల కాళ్లు చేతులు పడిపోవును.

3 వ పటము




మస్తిష్కము, సుషుమ్న.

పైని చెప్పినది గాక అస్థియొక్క ఉపయోగములలో ముఖ్యమైనది మరియొకటి గలదు. కాళ్లు చేతులు మొదలగుభాగములలో నుండు పొడుగాటి ఎముకల నడుమభాగమున పొడుగునను గొట్ట మొకటి గలదు. ఆ గొట్టములో మజ్జయను క్రొవ్వుపదార్థము గలదు. అది మనరక్తమునందలి యెఱ్ఱకణములకు పుట్టినిల్లు. ఏకారణముచేతనైనను రక్తక్షీణత కలిగినప్పుడు ఈ యెముకగొట్టములో నుండి క్రొత్త యెఱ్ఱకణములు లెక్కలేకుండ పుట్టి రక్తములో చేరుచుండును.

**మానవశరీరమునందు ఎముక లెన్ని గలవు ?**

మానవుల అస్థిపంజరము జూడ నందు సహజములైన విభాగములు మూడు గానవచ్చును. ౧ తల (శిరస్సు) ౨ మొండెము, (మధ్యకాయము) 3 కాళ్లుచేతులు (శాఖలు) ఈ మూడుభాగములలో చేరి మొత్తమువీద మానవశరీరమునందు ౨౦౬ ఎముకలు కలవు. నాలుగవ పటము చూడు.

ఇందు ౧. తలయందు ౨౭
౨. మొండెమునందు ౫౨
3. (అ) కాళ్లు ౬౨ } (ఆ) చేతులు ౬౪ } ౧౨౬

మొత్తము ౨౦౬

ఇవిగాక సుశ్రుతాదులు పండ్లు గోళ్లు తరుణాస్థులు మొదలగువానిని గూడ ఎముకలుగా లెక్కించి మొత్తము 300 అని కొందఱును 3౬౦ అని కొందఱును చెప్పియున్నారు. *

**ఎముకయొక్క అంతర్నిర్మాణము**

ఎముక లన్నియు ఒక్కటే విధముగ గట్టిపదార్థముతో చేయబడియున్నయెడల మిక్కిలి బరువగును. కాబట్టి ౫-వ పటములో చూపబడిన ప్రకారము పెద్ద పెద్ద ఎముకలన్నియు గొట్టములుగా నేర్పడి యున్నవి. ఈ గొట్టముయొక్క చుట్టుగోడ మిక్కిలి కఠినపదార్థముచే నేర్పడియున్నది. కొనలయందుండు ఎముకయొక్క లోపలిభాగము గుల్లగను, పైభాగ

*సూ. త్రీణి సషష్ఠాన్యస్థిశతాని వేదవాదినోభాషన్తే. శల్యతన్త్రే తు త్రీణ్యేవాస్థిశతాని. తేషాం అష్టాదశోత్తరం శతం శాఖాసు, పంచాధికం శతం శ్రోణిపార్శ్వ పృష్ఠోరఃకంఠనాడీషు, గ్రీవాం ప్రత్యూర్ధ్వం సప్తసప్తతిః. ఏవ మస్థ్నాంత్రీణి శతాని పూర్యన్తే.

సూ. ఏకైకస్యాం తు పాదాఙ్గుళ్యాం త్రీణి త్రీణి, అంగుష్ఠే ద్వే, తానిచతుర్దశ. తలకూర్చ గుల్ఫ సంశ్రితాన్యేకాదశ, పార్ష్ణ్యా మేకమ్, జఙ్ఘాయాం ద్వే, జాను న్యేకమ్, ఏక మూరావితి, త్రింశదేవ మేకస్మి న్సక్థ్ని భవన్తి. ద్వితీయే ప్యేవం. ఏతే నైవచ జానువర్జేన బాహూ చ వ్యాఖ్యాతౌ. శ్రోణ్యాం పఞ్చ. తేషాం గుదభగ నితమ్బేషు చత్వారి, త్రికసంశ్రిత మేకమ్, పార్శ్వయో రష్టచత్వారింశత్. పృష్ఠే చతుర్వింశతి, ద్వేఅంసపీఠే, ఉరసిత్రీణి, అక్షకసంజ్ఞే ద్వే, పుప్పుసనిబద్ధాయాం కంఠసంసక్తాయాం నాడ్యా మేకవింశతిః. [సుశ్రుతశారీరస్థానము. ౫-వ అ. ఆంధ్రాక్షరముల ప్రతి. నాగరప్రతిలో కొన్ని భేదములు కలవు.]

4 వ పటము

అస్థిపంజరము. (కంకాళము)



మున ఒక్కపొర మాత్రము గట్టిగను ఉండును. ఇట్లు ఒకోకచో గుల్లగను వేఱొకచో కఠినముగను ఉండుటచే ఎముకకు కావలసిన దార్ఢ్యమును చులకదనమును రెండును చేకూరుచున్నవి. ప్రరిలో నుండు ఎముకలు చిప్పలవలె నుండును. ఇందు లోపలివైపునను, వెలుపలివైపునను కఠినపదార్థముచే నేర్పడిన డిప్పలును, ఈ రెండు డిప్పలమధ్య కొంత గుల్లపదార్థమును ఉండును. గుండ్రముగ నుండు చిన్న ఎముకలలో సామాన్యముగా గుల్లపదార్థము హెచ్చుగానుండును. ఇట్టి నిర్మాణ భేదములచే ఎముకలను నాలుగువిధములుగా విభజించియున్నారు.

**ఎముకల భేదములు, వాని వివరము**

1. పొడుగు ఎముకలు (నలక). 2. పొట్టి ఎముకలు (వలయ). 3. చదును ఎముకలు (కపాల). 4. చిల్లర ఎముకలు (విషమ) అని అస్థులు నాల్గువిధములు.*

**నలకాస్థులు (పొడుగు ఎముకలు)**

ఇవి సామాన్యముగా శాఖలయందు (కాళ్లుచేతు లందు) ఉండును. వీని రెండు కొనలయందు కొంచెము లావుగా నుండు తలలును, మధ్యభాగమున గొట్టమువలె నుండు నాళమును, ఉండును. తలభాగములందు గుల్లగను నడుమ గట్టిగను ఉండును. భుజమునందలి ప్రగండాస్థి (Humerus) ముంజేతియందలి ప్రకోష్ఠాస్థులు (Radius & Ulna), తొడయందలి ఊర్వస్థి (Femur), పిక్కలందలి జంఘాస్థులు (Tebia & Fibula), వ్రేళ్ల యెముకలు (అంగుల్యస్థులు) వీని కధిష్ఠానములగు శలాకాస్థులు (Metatarsal & Metacarpal bones) అనునవి ఈ తరగతిలోనివి. ఇవిగాక అక్షకాస్థి (Clavicle)ని కూడ నిందు చేర్చెదరు.

*సూ. సుశ్రుతమతమున ఐదు విధములు. "ఏతాని పఞ్చవిధాని భవన్తి. తద్యథా : కపాలరుచకతరుణవలయ నలకసంజ్ఞాని. తేషాం జానునితమ్బాంసగణ్డతాలుశఙ్ఖశిరస్సు కపాలాని. దశనాస్తు రుచకాని. ఘ్రాణకర్ణగ్రీవాక్షికోశ కంఠనాడీషు తరుణాని. పాణిపాద పార్శ్వపృష్ఠోరస్సు వలయాని. శేషాణి నలకసంజ్ఞాని."

[సుశ్రుత శారీరస్థానము. ౫-వ అ.

**వలయాస్థులు (పొట్టి ఎముకలు)**

మణికట్టునందును, శీలమండయందును ఉండు సంధులలో అమర్చబడి యుండు చిన్నచిన్న యెముక లిట్టివి. ఇవి లోన గుల్లగ నుండును. పైన మాత్ర మొక గట్టి యెముక పొర యేర్పడి యుండును.

**కపాలాస్థులు (చదును ఎముకలు)**

ఇవి తలయందును ఆక్షఫలకము(గూడ) నందును కలవు. ఈ యెముకలు రెండువైపులను గట్టిపలకలచే నేర్పడి యుండును. ఆ రెండు పలకలమధ్య కొంత గుల్లగనుండు ఎముకభాగ ముండును. పశ్చాత్ కపాలము (Occipital), పార్శ్వకపాలము (Parietal), పురఃకపాలము (Frontal), నాసాస్థులు (Nasal), అశ్రుపీఠాస్థులు (Lacrimal), సీరికాస్థి (Vomer), అంసఫలకాస్థులు (Scapula), శ్రోణిఫలకాస్థులు(Os Inoninatum), ఉరఃఫలకాస్థి (Sternum), పర్శుకాస్థులు (పక్కయెముకలు Ribs), జాన్వస్థి (Patella) ఈ తరగతిలో చేరును.

**విషమాస్థులు (చిల్లర యెముకలు).** ఈ పై మూడువిధములలో ఆకారమును బట్టి చేరని మిగిలిన యెముక లన్నియు ఈ జాతిలో జేరును. ఇట్టి యెముకలలో మధ్యభాగమున గుల్లపదార్థమును చుట్టు నొక పొర గట్టిపదార్థమును ఉండును. కశేరుకాస్థులు(వెన్నుపూసలు; Vertebrae) త్రికాస్థి (Sacrum) అనుత్రికాస్థి (Coccyx) శంఖాస్థి (Temporal) జతూకాస్థి (Sphenoidal) ఝర్ఝరాస్థి (Ethmoidal) గండాస్థి (Malar) ఊర్ధ్వహన్వస్థి (Superior maxillary) అధోహన్వస్థి (Inferior maxillary) తాల్వస్థి (Palatine) నాసాభ్యంతర శుక్తికాస్థి (Inferior turbinated) కంఠికాస్థి (Hyoid) ఇవి విషమాస్థులు.

**సూక్ష్మ నిర్మాణము**

ప్రతి ఎముకయందును సున్నము సంబంధమైన గట్టిపదార్థ మొకటియు, లేతకలువకాడవలె ఇటు నటు వంచుటకు వీలుగ నున్న మెత్తని పదార్థ మొకటియు, ఈ రెండును చేరియున్నవి. ఒక గట్టియెముకను హైడ్రోక్లోరికాసిడ్డు (H Cl.) మొదలగు ద్రావకములలో కొన్నిదినము లూర

5-వ పటము



తొడఎముక పైభాగముయొక్క నిలువు చీలిక. లోపలయందు గుల్లపదార్థము. కాండమునందు గట్టిపదార్థము.

6-వ పటము



ఖనిజ పదార్థములు తీసి వేసిన ఎముకలోని పలయల్లిక వంటి అల్లిక. ఇది జంతు సంబంధమైన పదార్థముచే నేర్పడినది.

7-వ పటము



ఎముకను తయారు చేయు కణములు.

8-వ పటము




ఎముకయొక్క నిలువు చీలిక.

9-వ పటము



ఎముకయొక్క అడ్డపు చీలిక.

నిచ్చిన యెడల అందుండు సున్నపు సంబంధమైన గట్టి పదార్థ మంతయు ద్రావకములో లీనమైపోయి మెత్తని కలువకాడవంటి ఎముక మిగులును. అట్టి యెముక నొక దానిని నిలువుగ అనేక చీలికలక్రింద చీల్చి అందొక పలుచని చీలికను సూక్ష్మదర్శనితో పరీక్షించిన యెడల అందు వలయల్లికలవలె అల్లికలు కానబడును 6-వ పటము చూడుము. ఈ వలయల్లికల కండ్లలో ఎముకను పుట్టించు కణము లుండును. ఈ ఎముకను పుట్టించు కర్మకారు లనదగు కణముల కెంటిని 7-వ పటములో చూపియున్నాము. ఇవి అనేకతోకలు గలిగి ఒక కణముయొక్క తోకలు మరియొక కణముయొక్క తోకలవరకు వ్యాపించి ఒకదానితో మరియొకటి మిళిత మగుచుండును. ఈ కణములుండు స్థలములే చిన్న చిన్న తుమ్మెదలవలెనుండు నల్లనిరంధ్రములుగా ఎముకయొక్క పటములలో తెలియుచున్నవి. 6,9 పటములు చూడు. ఎముకపొడుగునను మధ్యనుండు కాలువలలో నెత్తురు ప్రవహించుచు ఎముకయొక్క భాగముల కన్నిటికిని పోషణ కలుగజేయును. ఈ ఎముక నే అనేక అడ్డచీలికలుగా చేసి అందొక సూక్ష్మమైన అడ్డచీలికను సూక్ష్మదర్శనితో పరీక్షించిన యెడల 9-వ పటములో చూపినట్లు కానబడును. ఇందు ఎముకకణములు కాలువల చుట్టును చక్రాకారమైన వరుసలు వరుసలుగా నమరియున్నట్లు తెలియగలదు. రక్తకాలువలనుండి ఈ కణములకు వాని సన్నని తోకలగుండా ఆహారము వచ్చి చేరుచుండును.

పైని చెప్పిన అస్థికణములును రక్తనాళములును గాక వాని మధ్యనుండు స్థలమంతయు సున్నపు పదార్థముచే నిండియుండును. ఈ పదార్థమే ఎముకకు గట్టి నిచ్చును. ఎముక నొకదానిని నిప్పులో వేసి తెల్లగ కాలువఱకు కాల్చినయెడల దానియందలి జంతుసంబంధమైన పదార్థ మంతయు కాలిపోయి సున్నపుపదార్థము మాత్రము మిగులును. ఇది మిక్కిలి పెళుసుగ నుండి తాకినంతనే పొడిపొడి యగును. ఈ ఖనిజ పదార్థము హెచ్చుగ నున్న కొలదిని ఎముకకు బలమును పెలుసుతన మును హెచ్చుగ నుండును. చంటిబిడ్డల ఎముకలలో నీ సున్నపు పదార్థము తక్కువగ నుండును. కావున వారల ఎముకలకు దెబ్బలు తగిలినపుడు అవి వంగును గాని విఱుగవు. ముసలివారల ఎముకలలో జంతుజపదార్థము తక్కువగానుండుటచే జిగి తక్కువయు సున్న మెక్కువగ నుండుటచేత పెళుసుదన మెక్కువగ నుండును. కాబట్టి ఎంత చిన్న దెబ్బకైనను ఎముక సులభముగ విరిగిపోవును.

ప్రతి ఎముకచుట్టును అస్థికవచము (Periostium) అను నొక జిగిరైన పొర గలదు. ఈ పొరనుండి కూడ ఎముక వెలుపలివైపున పెరుగుచుండును.

మానవుల అస్థిపంజరమును మూడుభాగములుగ విభజింపవచ్చునని పైని చెప్పియుంటిమి: ౧ మధ్యకాయము. ౨ శిరస్సు. 3 శాఖలు. ఇందు మధ్యకాయమును గూర్చి మొదట వివరించెదము.

**మధ్యకాయ వర్ణనము**

**మధ్యకాయము.** ఇది శాఖలను శిరస్సును ధరించు భాగము. దీని వెనుకభాగమున వెన్నెముక యను అస్థిసముదాయమును, ముందుభాగమున ఉరఃఫలక మను ఎదురురొమ్ము ఎముకయు, ఇరుప్రక్కల ఈ రెంటిని చేర్చు నట్టి, 12 ప్రక్క యెముకలును గలవు. అందు వెన్నెముక అను దానికే పృష్ఠవంశము లేక వంశాస్థి అని పేర్లు. మధ్యకాయము నంటి పైపైపున అంసచక్రమును, క్రింది వైపున శ్రోణిచక్రమును గలవు. అంసచక్రము నంటి చేతులును శ్రోణిచక్రము నంటి కాళ్లును వ్రేలాడును. మధ్యకాయము యొక్క ఊర్ధ్వప్రదేశము శిరస్సును సంధించును.

**పృష్ఠవంశము.** వంశాస్థి, వెన్నెముక (Vertebral Column or Spine). ఇది శరీరమునకు నడుమనున్న ఆధారము. దీనిని ఆశ్రయించియె శిరస్సును నాలుగుశాఖలును ఉండును. ఇది కశేరుక (వెన్నుపూస) లనబడు ఇరువదినాల్గు గుండ్రనియెముకల కూర్పుచే నేర్పడినది. ఈ కశేరుకలు ఒకదానిమీద నొకటి యమర్పబడియుండును. వానిమధ్య నమర్పబడియున్న సంధులమూలమున నవి కొంచెె మిటునటు నలుప్రక్కలకును కదలును. ఈ పృష్ఠవంశము వెదురుబొంగువలె లోపల బోలుగనుండును. కశేరుకలు క్రిందికి పోయిన కొలదిని పెద్దవిగను, పైకిపోయిన కొలదిని చిన్నవిగను ఉండును.




10-వ పటము
పృష్ఠవంశము

ఇది పైభాగమున శిరస్సుతోను క్రిందిభాగమున త్రికాస్థితోను సంధించును. ఎదుటనుండి చూచినయెడల పృష్ఠవంశము మూడుచోట్ల ధనుర్వక్రాకారముగ (విల్లువంపువలె) వంకరలు తిరిగినట్లు కానవచ్చును. మెడలోను నడుములోను (అనగా పైనను క్రిందను) తాబేలువీపువలె వైకిఉబ్బుగను, నడుమ ఖాతోదరముగను అనగా లోపలికి వంగి గుంటగను ఉండును.

పృష్ఠవంశముయొక్క కశేరుకలు మెడలో ౭, వీపులో ౧౨, నడుములో ౫, మొత్తము కశేరుకలు ౨౪. వీనిక్రింద వీనికితగిలి త్రికాస్థి, అనుత్రికాస్థి అనురెండెముక లుండును. ఈరెంటిని వేఱొకచో వర్ణించెదము.

కశేరుకలు (Vertebræ). పృష్ఠవంశమును నిర్మించెడు అస్థివలయములు (గుండ్రనియెముకలు). ప్రతికశేరుకమునందును ప్రధానభూతములయినభాగములు మూడు-కశేరుపిండము, కశేరుచక్రము, ప్రవర్ధనకములు. 11-16 పటములు చూడు.

కశేరుపిండము. (Body of a Vertebra). పిండాకారముగల కశేరు పురోభాగము. కొంచెము గుల్లగనుండును.

కశేరుచక్రము. (Arch) వెనుకనున్న కశేరుకాభాగము. ఇందు సుషుమ్నరంధ్ర ముండును. ఈ కశేరుచక్రము కశేరుపిండముతో రెండు వైపుల చక్రమూలముల ద్వార (Pedicles or Roots of the Vertebral Arches) కలియును. ఈ చక్రము రెండు పత్రకములచే (Laminæ) నిర్మింపబడును. ప్రతిచక్రమూలమునకు పైనను క్రిందను ఒక్క-ఛిద్రార్ధము (సగము చిల్లి) ఉండును. అట్లే ప్రతి కశేరుచక్రమునకును నాలుగు ఛిద్రార్ధము లుండును. అవి వానిమీదను, క్రిందను వానితో కలిసియున్న కశేరుకల ఛిద్రార్ధములతో చేరి పూర్ణచ్ఛిద్రములై సుషుమ్నకు సంబంధించిన నాడులుపోవుట కుపయోగించును. ఈ కశేరు చక్రమునకు ఏడుప్రవర్ధనకము లంటియుండును. వానివివరము:—

పృష్ఠకంటకము. (Spinous process.) ఇది వెనుకభాగమందలి ప్రవర్ధనకము. తడిమిచూచిన మన చేతికి వీపుమీద తగులును.

కశేరుబాహువులు. (Transverse Processes) ఇవి రెండుప్రక్కల నుండు ప్రవర్ధనకములు.

సంధి ప్రవర్ధనకములు. (Articular Processes) ఇవి నాలుగు. పైనుండి రెంటికిని, క్రిందినుండి రెంటికిని సంధి గుర్తులు కలవు. అవి క్రమముగ పై క్రింది కశేరుకములతో సంధించును.

పైని వివరించినవి అన్నికశేరుకల సామాన్యలక్షణములు.

గ్రీవాకశేరుకలు. (Cervical Vertebræ)

మెడలో నుండు కశేరుకలు ౭. వానిలక్షణములు:—

(౧) కశేరుపిండములుచిన్నవి. ప్రక్కలు పెద్దవి. పైనుండి క్రిందికి అదిమినట్లు పరువుగా నుండును. వానికి రెండు ఓష్ఠములు (పెదవులు) ఉండును.

(౨) పత్రకములు (Laminae) వెడల్పు తక్కువ. క్రిందకంటె పైని పలుచగ నుండును. సుషుమ్నరంధ్రము త్రిభుజప్రాయముగ నుండును.

(౩) పృష్ఠకంటకముల కొన రెండుగా చీలి యుండును.

(౪) బాహుప్రవర్ధనకములు హ్రస్వములు, రెండు చీలికలుగలవి. మధ్యరంధ్రమొకటుండును. ఈరంధ్రములు మస్తిష్కమాతృక (Vertebral Arteries) లన బడు రెండు ధమనులు ప్రవేశించుటకు ఉపయోగపడును. క్రిందిదియు మీదిదియు కూడి ఇరుప్రక్కలను స్తంభాకారములై యుండును. ఇవి చక్రమూలముయొక్కయు పత్రముయొక్కయు సంధిలో పుట్టి ప్రక్కలకుపోవును.

౫. సంధిప్రవర్ధనకములు మిక్కిలి చిన్నవి గాని నిలువుగనుండును.

ఏడు గ్రీవాకశేరుకలలో మొదటిది, రెండవది, ఏడవదియు ఇతరకశేరుకలకంటె భిన్నముగ నుండుటచే వానిని గుర్తించి వేఱుగ చెప్పవలెను.

ప్రథమ గ్రీవాకశేరుక-చూడావలయము (Atlas) శిరస్సు దీనిమీదనే నిలిచియుండును గనుక దీనికి కంధరభూస యను నామముకూడ కలదు. పృష్ఠకంటకపు జుట్టుమీద వలయాకారముగ నున్నందున దీనికి చూడావలయమను పేరు పెట్టబడియె. ఇది పైని పశ్చిమ కపాలముతోను, క్రింద దంతచూడ మను ద్వితీయ గ్రీవాకశేరుకతోను కలియును. ఇందలి విశేషములు:

(౧) కశేరుపిండము హ్రస్వమై పోయినది. రెండు ప్రక్కల నున్న చక్రమూలములు ముందువైపున కలిసి కశేరు చక్రముయొక్క ముందుభాగ మేర్పడును. దీని నిజమైనపిండము, ద్వితీయగ్రీవాకశేరుకతో మిళితమై దంతప్రవర్ధనకముగా ఏర్పడియున్నది. ఈ దంతప్రవర్ధనకము చుట్టును గ్రంధిలో తలుపుతిరుగునట్లు కంధరము తిరుగును. పిండముయొక్క ముందుభాగమున నొక ప్రవర్ధనకము గలదు. ఇచ్చట కొన్నికండలు ప్రవేశించును. వెనుకభాగమున నున్న అండాకారమైన సంధిగుర్తునందు క్రింది కశేరుకయొక్క దంతప్రవర్ధనకము సంధించును.

(౨) చక్రమూలముల పైభాగమున అండాకారమైన గుర్తులు రెండుగలవు ఇవి కొంచెము గుంటలుగా నుండును. శిరఃకపాలముయొక్క క్రింది భాగమున కొంచె మెత్తుగనుండు మొనలతో ఈ గుంటలు సంధించును. ఈ సంధిమూలమున మనతల ఉతకలో తలుపు తిరుగుచున్నట్లు ఇటునటు తిరుగుచుండును. దీనిక్రింద లోపలివైపున ఇరుప్రక్కలను రెండుప్రవర్ధనకములు గలవు. మధ్యబంధకమను స్నాయువుయొక్క రెండుచివరలును ఈ ప్రవర్ధనముల కంటియుండును. ఈ స్నాయువు వలన నీకశేరుక మధ్యరంధ్రము రెండు అసమభాగములుగా విభాగింపబడియున్నది. అందు ముందరి చిన్నభాగమునందు రెండవ కశేరుకయొక్క దంతప్రవర్ధనకము ఇమిడియుండును. వెనుకవైపున నుండు పెద్దభాగముగుండ సుషుమ్నానాడి పోవుచుండును. ఈ రెండుభాగముల మధ్య నుండు స్నాయువు దంతప్రవర్ధనకము నుండియేయపాయమును సుషుమ్నకు కలుగకుండ కాపాడును. బాహుప్రవర్ధనకములు మిక్కిలి బలమైనవి. వీనియందు మెడనుత్రిప్పుట కుపయోగించు కండ లంటియుండును. వీనియందుండు ఛిద్రముగుండ మస్తిష్కమాతృక అనుధమని పోవును.

(౩) పృష్ఠకంటకము. చిన్న గుటికాకారమగు ప్రవర్ధనకముగా మారియున్నది.

11-వ పటము




మాదిరి గ్రీవకశేరుకము (3-వది మొదలు 6-వది వరకు ఇట్లుండును.)

12-వ పటము

కశేరుచక్రము
పూర్వప్రవర్ధనకము
దంతప్రవర్ధనకముయొక్క స్థానము
మధ్యబంధకస్నాయువు
మధ్యప్రవర్ధనకము
బాహుప్రవర్ధనకము
మస్తిష్క-మాతృకారంధ్రము
మస్తిష్క-మాతృకామార్గము
పశ్చాత్కపాలపు సంధిగుర్తి
పృష్ఠకంటకము గుటికాకారము
కశేరుచక్రము వెనుకభాగము

ప్రథమ గ్రీవాకశేరుక - చూడావలయము

13-వ పటము దంతప్రవర్ధనకము




రెండవగ్రీవాకశేరుక (దంతచూడ)

14-వ పటము




7-వ గ్రీవాకశేరుక

**ద్వితీయగ్రీవాకశేరుక:** దీనికి దంతచూడ. (Axis) మేరువని పేర్లు. దీని పైభాగమున తిరగటి గుజ్జువలె నుండు ప్రవర్ధనక మొకటియెత్తుగ నుండును. చూడావలయముయొక్క మధ్యరంధ్రము నందు ముందుభాగమున ఈ దంతప్రవర్ధనకము ప్రవేశించును. దీనికి ముందును వెనుకను రెండు ఖాతోదరములగు (గుంటలవంటి) సంధిగుర్తులు కలవు. వానిలో ముందుండునది చూడావలయముయొక్క కశేరు పిండపు వెనుకభాగమున నుండు నొక సంధి గుర్తుతో సంధించును. వెనుక దానిని ఆశ్రయించి మధ్యబంధ నమను స్నాయువు ఉండును. దంతప్రవర్ధనము యొక్క రెండుప్రక్కలను స్నాయు సూత్రములచే కప్పబడి యుండును. శిఖరమందును స్నాయుసూత్రము కలదు. దాని మూలమున పశ్చాత్కపాలముతో ఈ యెముక సంధించును. ఈ దంతప్రవర్ధకమును నడిమి సీలగా చేసికొని చూడావలయ మను ప్రథమకశేరుకతో గూడ మన తల పృష్ఠవంశముమీద తిరుగుచుండును.

**సప్తమగ్రీవాకశేరుక:** మహాకంటకి. (Vertebra Prominens) ఇది మిక్కిలి పొడవైన పృష్ఠకంటకము కలది గనుక ఈపేరు. ఇచ్చటి ఈమహాకంటకముతో గ్రీవాధర (Ligamertum Nuchæ) అను స్నాయుసూత్రము అంటియుండును. ఇతరగ్రీవాకశేరుకములందు నున్నట్లు దీని మహాకంటకము ద్విధాభిన్నముకాదు. (రెండుగాచీలలేదు). అయినను అన్నిగ్రీ

వాకశేరులకు సాధారణములైన మసిమ్క మాతృకా చ్ఛిద్రాదిలక్షణములిందు గానవచ్చుచున్నందున దీనిని గ్రీవాకశేరుకముగ గుర్తించుట సులభము.

పృష్ఠకశేరుకలు అనగా వీపులోని వెన్ను ఎముక పూసలు. ఇవి ౧౨. వానిలో విశేషము లేవి యనఁగా,

(౧) కశేరుపిండములు మధ్యాకృతులు (అంత పెద్ద ఆకారము కలవి కావు. అంత చిన్న ఆకారముకలవి కావు. మధ్యమరకము) కొంచెముగుండ్రముగ నుండును. ప్రతికశేరుపిండము ప్రక్కను రెండు సంధిగుర్తులు కలవు. ఇచ్చట పర్శుకశిరస్సులు సంధించును:

(౨) బాహుప్రవర్ధనకములు సాధారణముగ వస్తు లాగ్రములు. అగ్రముయొక్క ముందుభాగమున చిన్న గుంటగా నుండు సంధిగుర్తు గలదు. ఇవి పర్శుకార్బుద ములతో సంధించును. ప్రాచీనులు బాహుప్రవర్ధనకము లనే స్థాలకము లనిరి.

(3) పృష్ఠకంటకములు. ఇవి బాకుల వలె పొడుగుగ నుండును గాని చివర ముద్దగ నుండును. ఇందు పైది క్రింది దానినికప్పుచుండును. ఈ పృష్ఠ కశేరుకములలో మొదటిది. తొమ్మిదవది, పదవది, పద కొండవది, పండ్రెండవది విశేషముగ తెలిసికొనదగినవి.

ప్రథమపృష్ఠకశేరుక. దీని కశేరుక పిండము ప్రక్కను రెండువైపులను రెండేసిగుంటలు గలవు. అందు పైది పూర్ణచంద్రాకార మైనది. ఇది ప్రథమ పర్శుకయొక్క శిరస్సు (Head) తో సంధించును. క్రిందిభాగమందు చక్రార్ధాకారమగు రెండవ గుంట కలదు. ఇది రెండవ పర్శుకయొక్క తలలోని పై యర్ధ భాగముతో సంధించును.

ద్వితీయపృష్ఠకశేరుక మొదలు ౮-వ పృష్ఠ కశేరుక వఱకును ప్రతికశేరుకపార్శ్వమందు(ప్రక్కను) మూడు సంధిగుర్తు లుండును. వానిలో నొక్కటి పూర్ణచక్రాకారము గలది బాహు ప్రవర్ధనకమందుం డును. అర్ధచక్రాకారము గలవి రెండు కశేరు పిండ పార్శ్వమునందు పైని ఒకటిక్రింద నొకటియు నుండును.

15-వ పటము




పృష్ఠకశేరుకము

నవమపృష్ఠకశేరుకయందు అర్ధచక్రాకారమైన సంధిగుర్తు ఒక్కొక్కదానిలో నొక్కొక్కటియె యుండవచ్చును.

దశమపృష్ఠకశేరుక యందు కశేరు పిండము యొక్క రెండువైపులను పూర్ణచక్రాకారమైన సంధి గుర్తు ఒక్కొక్కటియె కలదు.

ఏకాదశ, ద్వాదశ పృష్ఠకశేరుపిండము లందు ఒక్కొక్క పార్శ్వమునందు పూర్ణచక్రాకారమైన సంధిగుర్తు ఒక్కటియేఉండును. బాహుప్రవర్ధనకమందు సంధిగుర్తు ఉండనే యుండదు. పండ్రెండవది కటికశేరుకవంటిది, దీని బాహుప్రవర్ధనకము మిక్కిలి పొట్టిదిగను మూడు అర్బుదములు గలదిగను నుండును.

కటికశేరుకలు. వీని విశేషము లేవి యన:

(౧) కశేరుపిండములు మిక్కిలి పెద్దవి; ప్రక్కలలో వెడల్పుగ నుండును.

(౨) కశేరుపత్రములు పొట్టివి కాని వెడల్పయినవి. బలమైనవి.

(౩) బాహుప్రవర్ధనకములు సంధిప్రవర్ధనములకు వెనుకభాగమున గాక ముందుభాగమున నుండును. అందుచే నివి పర్శుకల బోలియుండును. ఊర్ధ్వసంధి ప్రవర్ధనకముయొక్క వెనుకభాగమునుండి యొక ఊర్ధ్వ శృంగమును బాహుప్రవర్ధన పీఠముయొక్క వెనుక భాగమునుండి యొక అధశ్శృంగమును పుట్టును

(౪) పృష్ఠకంటకములు స్థూలములు. లావుగను, వెడల్పుగ నుండును. కొంచెము చతురస్రాకారముగ నుండును. కొన వక్రముగ నుండును.

(౫) గ్రీవకశేరుకలలో నుండు మస్తిష్కమాతృకాఛిద్రము గాని, పృష్ఠకశేరుకలలో నుండు పర్శుక సంధి గుర్తులు గాని లేకపోవుటచే వీనిని గుర్తింప వచ్చును.

వీటిలో ౫-వ కటికశేరుకకు విశేషములు కలవు. దీని కశేరుకపిండము వెనుకభాగమునందు కంటె ముందుభాగమున మిక్కిలి పెద్దదిగ నుండును. క్రింది భాగమునందుండు సంధిగుర్తులమధ్య ఎడము హెచ్చుగ నుండును. ఈ గుర్తులు త్రికాస్థితో నిది సంధించు భాగములను తెలియఁజేయును. ఊర్ధ్వముఖము లగు బాహుప్రవర్ధనకములు రెండును దళమైనవి, పెద్దవి, పృష్ఠకంటకము మిక్కిలి చిన్నది.

ఉరఃపంజరము. (Thorax) ఇది ఉరోగుహను ధరించునట్టి అస్థులచే నేర్పడిన పంజరము. ఇది వెనుక పృష్ఠవంశముతోను, ప్రక్కలందు పర్శుకలతోను, ముందు ఉరఃఫలక ఉపపర్శుకలతోను అమరియున్నది. ఈపంజరమునకు పైవైపున ఏమియు మూతలేదు. క్రింద మహాప్రాచీర అను కండచే మూయఁబడియున్నది. ఈ పంజరముపైనుండి క్రమముగ క్రిందికి పెద్దది యగును. ఇట్లు చుట్టుకొనబడిన ఉరఃపంజరమునందు ఫుప్పుసద్వయమును, హృదయమును, మహాసిరాధమన్యాదులును, అన్నమార్గమును ఇమిడియున్నవి.

16-వ పటము



**ఉరఃఫలకము. (Sternum)** ఇది యెదురురొమ్ము ఎముక. ఇది పలకవలె చదరముగా నుండును. ఎదురు రొమ్మునకు ముందుభాగము నను నడుమను ఉండును. దీనిని మూడుభాగములుగ విభజించెదరు. అందు మొదటిది పైది షట్కోణము. రెండవది నడిమిది నలుచదరముగా నుండును. మూడవది క్రిందిది, త్రిభుజ. చిన్నతనమున తరుణాస్థిగ నుండును. ఈప్రకారము మూడు భాగములు గల యీ యస్థికి రెండు వైపులను పర్శుకములతో కలుపునట్టి తరుణాస్థులు కలవు. వాటిని ఉపపర్శుక లందురు.




**ప్రథమభాగము - గ్రైవేయకము (Manubrium)** ఇది కంఠమునకు క్రిందిభాగమున నుండును. పైభాగమున వెడల్పుగను క్రింద సన్నముగ నుండును. అందు ఆఱు సంధిగుర్తులుకలవు. వానిలో రెండు అక్షకాస్థులతోను రెండు మొదటి ఉపపర్శుకలతోను రెండు రెండవ ఉపపర్శుకయొక్క శిరస్సులయొక్క సగభాగములతోను సంధించును. దీని నెత్తిమీద కంఠకూపము అను కందకము కలదు.

ఇది క్రిందివైపున ద్వితీయభాగముతో కలిసికొనును. ఇందు ముందు ఉరఃకర్ణమూలికా (Sterno-mastoideus) ఉరఃప్రచ్ఛదాగుర్వీ (Pectoralis-major) అను కండలును వెనకవైపునఉరోజిహ్వామూలికా(S: rnohyoideus) యను కండయు అంటియుండును.

**రెండవభాగము : మధ్యఫలకము (Gladiolus)** ఇది పైని గ్రైవేయకముతో కలిసియుండును. ఇది నాలుగు ఖండములు కలిసి అయినది. ఈ నాలుగును చిన్నతనములో విడివిడిగ నుండును.

ఒక్కొకవైపు ఆఱు గుంటలు ఉపపర్శుకలతో కలుపునవి కలవు. ముందువైపున గ్రైవేయక మధ్యఫలకలలో నుండి ఉరఃప్రచ్ఛదాగుర్వీ అను కండ (కుడివైపున కుడిది యెడమవైపున నెడమది) పుట్టును.

**మూడవ భాగము : అగ్రపత్రము (Xiphiod)** ఇందు క్రిందిభాగము తరుచుగ తరుణాస్థి సమేతము. పైని మధ్యఫలకముతో కలిసియుండును. ఇచ్చట ముందువైపునఉదరచ్ఛదాసమా (Transversalis Abdominis) యను కండయొక్క అగ్రమును, వెనుకనుండి మహాప్రాచీర (Diaphragm) అను కండయొక్క అగ్రభాగమును పుట్టును. ముసలితనమందు ఈ భాగమంతయు గట్టిపడును. ఈ మూడవభాగము కానొకప్పుడు వెడల్పుగను, ఒకప్పుడు సన్నముగను మరియొకప్పుడు వంకరగను ఉండును.

1౪-వ పటము

కుడిప్రక్క నున్న పెద్ద పటము సామాన్యపర్శుకము. అందు 1. తల 2. మెడ 3. కశేరుబాహు ప్రవర్ధనకము సంధించు గుర్తు 4. అర్బుదము 5. కోణము 6. వెలుపలిప్రక్క 7. లోపలిప్రక్క 9. పర్శుకాగ్రము.




పర్శుకాస్థులు.

I, II, X, XI, XII, పర్శుకలు.... 1. తల 2. అర్బుదము 8. కోణము 10, 11. అతఃకాంతరిక, శిరా ధమనుల మార్గములు 12. పర్శుకాకర్షణి పురోగా 13. పర్శుకాకర్షణి మధ్యమ.

పర్శుకాస్థులు

పర్శుకలు (Ribs) ఉరః పంజరమునకు ఇవి చుట్టుననుండు బద్దలవంటివి. ఇవి ధనుర్వక్రములుగ బండి గూడుకై వంచబడిన వెదురుబద్దలవలె వంగి యుండును. వీనికి స్థితిస్థాపకత్వము అనగా సాగునట్టి శక్తి గలదు. ఒక్కొక్క వైపున ౧౨ వంతున ౨౪ ఉండును. ఇవి యన్నియు వెనుకవైపున పృష్ఠకశేరుకా పిండములతోను, ముందుభాగమున ఉపపర్శుక లనఁబడు తరుణాస్థులతోను కలిసియుండును. వీనిలో పైనిఉండు ౭ పర్శుకలలో క్రమముగ పైదానికంటె క్రిందిది పొడుగుగ నుండును. ముందు భాగమున తమ తమ ఉపపర్శుకలచే ఉరఃఫలకముతో కలుపబడును. ఇవియే ముఖ్యపర్శుకలు (True Ribs). ముఖ్యముగ వీనిచేతనే ఉరఃపంజరము నిర్మింపఁబడును. క్రింది ౫ పర్శుకలు, క్రిందికిపోను ఒకదానికంటె నొకటి పొట్టిదిగ నుండును. అవి ఉరఃఫలకముతో కలియవు. వీనికి గౌణపర్శుకలు (False Ribs) అని పేరు. వీనిలో మూడు (౮-వ, ౯-వ, ౧౦ పర్శుకలు) తమ తమ ఉపపర్శుకాగ్రములద్వారా ఏడవ ఉపపర్శుకతో కూడును. ౧౧-వ ౧౨-వ పర్శుకములు పూర్తిగ విముక్తాగ్రములు అనఁగా వాని చివరలు వేనికిని అంటుకొనియుండలేదు.

ప్రతిపర్శుకయందు ఈ క్రింది ఆఱువిషయములు ఉండును. కావున నవి పర్శుకలయొక్క సామాన్యలక్షణములు.

౧. శిరస్సు (Head) పర్శుకకు వెనుకనుండు గుండ్రనిభాగము. అచ్చట రెండు గుంటలుండును. అవి రెండు పృష్ఠకశేరుకల పిండములలోని చక్రార్థాకారములగు రెండుగుంటలతో సంధించుటకు ఉపయోగపడును. 18-వ పటములో 1 చూడుము.

౨. అర్బుదము. (Tuberocity) శిరస్సునకు సమీపముగనున్న పిండము, అందొక సంధిగుర్తుండును. అది కశేరుబాహువునందలి సంధిగుర్తుతో సంధించును.

3. గ్రీవము (మెడ) (Neck) శిరస్సునకును అర్బుదమునకును నడిమిభాగము.

౪. కోణము (Angle) అర్బుదమునకు ముందుండు కోణాకారప్రదేశము. అచ్చట పర్శుకాకాండము ముందువైపునకు విరిగినట్టుగా వంగును. (పటములో ౫.)

౫. కాండము (Shaft) పర్శుకా మధ్యభాగము, ధనుర్వక్రము. దానికి పైయంచు క్రిందియంచుఅని రెండు అంచులుకలవు. క్రింది అంచులో పర్శుకానుగ అను అగడ్త కలదు (7). ఇందు ఈ పేరుగల శిరాధమను లుండును. దీని రెండుతటములందును పర్శుకాంతరికలు (Intercostal Muscles) అను రెండుకండలు అంటియున్నవి.

౬. అగ్రము. ఇది పర్శుకయొక్క ముందువైపు మొన (9). ముందుభాగమున ఉపపర్శుకాసంయోగమునకై ఎత్తు పల్లములు గల అగడ్త యొకటి కలదు.

పైని చెప్పఁబడిన లక్షణములు 3 వది మొదలు ౯ వ దానివఱకు అన్నిటికి చెల్లును. ౧ వ, ౨ వ, ౧౦ వ, ౧౧ వ, ౧౨ వ, పర్శుకలకు కొన్నివిశేషములు కలవు. అవి యేవి యనిన:—

౧ వ పర్శుకము మిక్కిలి చిన్నది. కొడవలివంటి యాకారముకలది (I) దీనిశిరస్సు మిక్కిలిచిన్నది. ఒక్క సంధిగుర్తు కలది. కాండము వెడల్పయినది. దీనికి పైప్రక్క క్రిందిప్రక్క యని రెండుప్రక్కలు కలవి. కోణము లేనేలేదు. పైప్రక్కను రెండు అగడ్తలు గలవు. అవి అక్షకాధరికలు (Subclavian Vein and artery) అనబడు శిరాధమనులను ధరించును. ఇందు క్రమముగ అరిత్ర (Serratus Magnus) పర్శుకాకర్షణీపురోగా, మధ్యమా (Scalenus Anticus & Medius) అను మూడుకండలు ఉండును.

౨ వ పర్శుకము మొదటిదానికంటె ఎక్కువ పొడుపైనది. (II) కాండము ధనురాకారముగ నుండును గాని మెలి తిరిగియుండదు. దీని పైప్రక్కను రెండుకండలు, పర్శుకాకర్షణీపృష్ఠగ (Scalenus Posticus) అరిత్రా అనునవి ఉండును.

౧౦ వ పర్శుక చిన్నది దీని శిరస్సునందు ఒక్క సంధిగుర్తే కలదు. కోణము కాండమధ్యమునందుండును. (X చూడు).

౧౧ వ పర్శుక. గ్రీవముగాని అర్బుదముగాని లేవు. మొన సూచిగా నుండును. (XI చూడు).

౧౨ వ పర్శుక. ౧౧ వ దానికంటె చిన్నది. దీనికి కోణముకూడ లేదు. (XII చూడు).

ఉపపర్శుకములు. (Costal cartilages) ఇవియు పర్శుకలవలెనె సంఖ్యకు ౨౪. పర్శుకాగ్రములతో సంబంధము కల తరుణాస్థులు. వీనిని ప్రాచీనులు ఉరస్సు సంబంధమైన అస్థులుగా లెక్కవేసిరి.

**త్రికాస్థి (Sacrum)**

ఇది పృష్ఠవంశమునకు అంటి, రెండు శ్రోణిఫలకముల నడుమ నుండును. ఇది త్రిభుజాకారముగను వెనుకవైపు గూనుగనుఁడు పలకవంటి అనగా చదును ఎముక. ఇది సూక్ష్మదృష్టితో జూచిన అయిదు కశేరుకముల సమూహ మని తెలియును. (1,2,3,4,5) ఈ అయిదు కశేరుకములును కలిసి యున్నట్లు సూచించు నాలుగు రేఖలు కూడ ముందు భాగమున గానవచ్చును.

ఈ క్రిందివిశేషములు గమనింపదగినవి.ముందు భాగము పైనుండి క్రిందికి చూచునప్పుడు మధ్య హెచ్చు పల్లముగాను ఒక ప్రక్కనుండి మరియొక ప్రక్కకు చూచునప్పుడు కూడ మధ్య కొంచెము పల్లము గాను తెలియును. ముందుభాగమందు పైని చెప్పిన నాలుగు రేఖల ననుసరించి రెండు వైపుల రెండు నాలుగులు చొప్పున 8 చిల్లులు గలవు.త్రికాస్థియొక్క ముందు భాగమందుగల నాడులు ఈ చిల్లులలో నుండి బయలు వెడలును.

(౨) వెనుకభాగమందు ఎనిమిది చిల్లులు (ఒక్కొకవైపు నాలుగు చొప్పున) కలవు.

19-వ పటము




త్రికాస్థి ముందున్న వైపు.—1, 2, 3, 4, 5 త్రికకశేరుకలు, 6. త్రికపక్షము, 7. త్రికపీఠము ౮. త్రికరంధ్రముఖము, 9. త్రికశృంగములు, 10. త్రికాగ్రము, 11. ముందరివైపు ద్వారములలో నొకటి. 12. వెలుపలి అంచునందలి కర్ణాకృతిగల సంధిగుర్తు, 13. బాహుప్రవర్ధనకముల సంయోగముచే నేర్పడిన గట్టు, 13. కుండిక.

20-వ పటము




త్రికాస్థి వెనుకవైపు.—మధ్యనున్న 1.2 3.4,5, ఇవి త్రికకశేరుకల స్థానమును తెలుపును. ప్రక్కనున్న 2,3,4,5,7, ఇవి త్రికాస్థి వెనుకభాగము నున్న రంధ్రములు 7 ఉన్నచో 5-వ రంధ్రములో అర్ధభాగమే కలదు. ప్రక్కనున్న 1 బాహుప్రవర్ధనక పరిణామము, 6. కడపటి కటికశేరుకతో సంధించు భాగము, 8. త్రికాగ్రము, 9. పృష్ఠవంశధరా, అనుకండ, 10. నితంబపిండికాగుర్వీ, 11,12. కర్ణాకృతికల సంధిగుర్తులు, 13. కటిత్రిక సంబంధ స్నాయువులు, సంధించు భాగము, 14. త్రికరంధ్రముఖము.

వీనిలోనుండి త్రికాస్థి వెనుకనుండు నాడులు నిర్గమించును.

త్రికాస్థి వెనుకభాగమంతయు గట్లు, మిట్టలు, పల్లములుగా నుండును. ఇందు మధ్యగట్టు 1,2,3,4,5) త్రికకశేరుకల పృష్ఠకంటకముల యొక్కయు, ప్రక్కగట్లు సంధిప్రవర్ధనముల యొక్కయు, బాహుప్రవర్ధనకముల యొక్కయు కూడికచే నేర్పడియున్నవి. అయిదవ త్రికకశేరుకయొక్క క్రింది సంధిప్రవర్ధనకములు క్రిందివైపునకు పెరిగి త్రికశృంగము లనబడును. ఇవి అనుత్రికీక యొక్క శృంగద్వయముతో సంధించును.

(3) దీని నెత్తిమీద ముందుండు భాగమునకు త్రికపీఠమని పేరు (19 లో 7,7,) పీఠ మధ్యభాగమున అండాకృతిగల సంధిగుర్తు అయిదవ కటికకశేరుకయొక్కపిండముతో సంధించుభాగము. ఈగుర్తునకు వెనుకవైపున త్రికగుహయను రంధ్రముయొక్క ముఖముగలదు. ఈ రంధ్రముయొక్క వెనుకభాగము త్రికాస్థిలో నిమిడియున్న త్రిక కశేరుకలయొక్క పత్రముల యొక్కయు పృష్ఠకంటకములయొక్కయు చేరికచే నేర్పడియున్నది. పీఠమునకు రెండువైపులను త్రికపత్రముతను త్రిభుజాకారమైన ప్రక్కలు గలవు (19 లో 6,6). వెనుకనున్న రెండు సంధిప్రవర్ధనకములును పై కశేరుకతో సంధించుట కుపయోగపడును.

(౪) త్రికాస్థియొక్క వెలుపలిఅంచులు పైభాగమున లావుగను క్రింద సన్నముగను ఉండును. వెడల్పునుండు పైభాగమున కర్ణాకృతిగల రెండు సంధిగుర్తులు కలవు ( 0 లో 12). ఇవి ప్రక్కననున్న రెండు శ్రోణిఫలకములతో కలుపుట కుపయోగపడును.

(౫) త్రికాస్థియొక్క క్రిందిభాగమున అగ్రాగ్రము గలదు. దానితో అనుత్రికాస్థి సంధించును. దీని లోపలిభాగమున అనుత్రికీక (Coccygius) గుదోన్నమని (Lovator Ani) అను కండలు పుట్టును.

(౬) త్రికాస్థిలోపలిది త్రికరంధ్రము. దానికి త్రోవ వెనుకనుండి కలదు. అది సుషుమ్నా చామరమును (Cauda Equina) ధరించును. నాలుగైదు త్రికకశేరుకలకశేరుపత్రములు మధ్యవైపునచేరుకొనక పోవుటచేత నీరంధ్రమునకు క్రిందిభాగమున వెనుక గోడలేక తెరచుకొని యున్నది.

త్రికాస్థికి ఎనిమిది జంటలు కండలు అంటియున్నవి. అందు ముందు మూడును వెనుక నైదును ఉండును.

21-వ పటము




అనుత్రికాస్థి

1, 2, 3, 4 ఇవి కశేరుకల గుర్తులు

అనుత్రికాస్థి (Coccyx). ఇది త్రికాస్థి క్రింది భాగమున కాకిముక్కువలె వంకరగా నంటియుండు అస్థి. ఇది త్రిభుజాకారమైనది. ఇది నాలుగు చిన్న చిన్న కశేరుకలచే నేర్పడియున్నట్లు చక్కగ పరీక్షించిన తెలియగలదు. దీని ఊర్ధ్వభాగమునందుండు రెండు కొమ్ములవంటి భాగమును వాని మధ్యనుండు పీఠమును త్రికాస్థితో సంయోగమున కుపయోగపడును. దీని ముందుప్రక్కను గుదోన్నమని (Levator Ani) అను కండయు కొన్ని స్నాయువులును గలవు. దీని ప్రక్కలను రెండువైపులను అనుత్రికీక (Coccygius) అను కండయు, నితంబపిండికాగుర్వి (Glutius Maximus) అను కండయు అంటియుండును. దీని క్రిందిభాగము అగ్రాకారముగా నుండును. ఈ అగ్రముయొక్క అంచున గుదసంకోచనీబహిః (External analSphincture) అను కండయొక్క అగ్రమంటియుండును.

ఈ అనుత్రికాస్థియే గుండ్రనివూసలవలెనుండు అనేక యెముకల సంయోగముచే నేర్పడి పశువులలోకయందలి అస్థిసముదాయముగా పరిణామము చెందుచున్నది.

శాఖాస్థులు. చేతులు రెండు, కాళ్లు రెండు. ఈ నాలుగు శాఖలనబడును. చేతులే పక్షులకు రెక్కలుగను, పశువులకు ముందరి కాళ్లగను ఏర్పడి వానిజీవితమునకు అనుకూలముగ సహాయపడుచున్నవి. తక్కిన జంతువులచేతులకంటె మానవుల చేతులకు మిక్కిలి విరివిగ నలుప్రక్కలకు తిరుగుశక్తి గలదు.

(శాఖలు నాలుగు)



అంసచక్ర మను నొకవలయమును అంటి చేతులును శ్రోణిచక్ర మను మరియొకవలయనంటి కాళ్లును మధ్యకాయముతో సంబంధము గలిగియున్నవి. అందు అంసచక్ర వలయము వెనుకభాగమున పృష్ఠవంశమువద్ద పూర్తిగా లేదు. అంసచక్రమునకు ముందరివైపున అక్షుకాస్థియు వెనుకవైపున అక్షుఫలకమును గలవు. అక్షుఫలకమునందలి అంసపీఠముయొక్క గుంటలో ఉతకలో తలుపువలె భుజాస్థిశిరస్సు గిరగిర తిరుగుచుండును. భుజాస్థులను ప్రక్కలకు విరివిగ త్రిప్పుకొనుటకు అక్షుకాస్థులు సహాయపడును. పశువులు మొదలగు చతుష్పాత్తులలో వా

జేతులు (ముందరికాళ్లు) నడచుటకు మాత్రము ముఖ్యముగా నుపయోగించును. అట్టి జంతువుల అక్షకాస్థులు చక్కగ వృద్ధినొంది యుండవు. ముందరికాళ్లకు కోరలుగలిగి చీరుటకును పట్టుకొనుటకును ఉపయోగపడవలసిన చోట్ల చతుష్పాత్తులకుకూడ అక్షకాస్థుల వృద్ధియు ఉపయోగమును హెచ్చుగ నుండును. కొన్ని జంతువుల చేతుల ఆకారములు 22-వ పటములో చూపబడినవి.।

మానవుల ఊర్వస్థులకంటె భుజాస్థులు హెచ్చు స్వేచ్ఛగ తిరుగుటకు కారణములు (1) భుజాస్థియొక్క తల తిరిగెడు అంసపీఠపు గుంటవంక్షణ ఉలూఖములకంటె మెరకగ నుండుట (2) అంసచక్రమునందలి యస్థులు పూర్తిగ నిర్బంధింపబడక యుండుట, ఇవి ముఖ్యము.

## అక్షఫలకము (గూడయెముక)

ఇది భుజముయొక్క వెనుకభాగమున రెక్కవలె నుండు త్రిభుజాకారమైన ఎముక. ఇది పలకవలె చదునుగా నుండును. ఇది యెదురు రొమ్ముయొక్క వెనుకభాగమును ౧-వ పర్శుకాస్థి (ప్రక్కయెముక) నుండి ౮ పర్శుకాస్థి వఱకు కప్పును. దీని లోపలియంచు వెన్నెముక నుండి,ఒక అంగుళము దూరమున స్వేచ్ఛగ (ఒదులుగ) నుండును. దీనిని బాగుగ పరీక్షించిన యెడల దీనికి ౨ ప్రక్కలును (తలములు) 3అంచులును (భారలును) 3 కోణములు ఉన్నట్లు కనబడును.

ప్రక్కలు. ౧ ముందు ప్రక్క:—కొంచెము పల్లముగ నుండును. ఆపల్లములో నక్కడక్కడ చిన్న చిన్న మిట్టప్రదేశము లుండును. ఈ ప్రక్కనుండి అంసాంతరిక (Sub-Scapulares) అను కండ పుట్టును(23-వ పటములో 2). దీని లోపలి అంచు సమీపమున పొడుగునను అరిత్ర(S: rratus magnus) అను కండ అంటియుండును. ౨ వెనుక ప్రక్క:—ఇది అంసప్రాచీర కంబను (Spine) మిట్టప్రదేశముచే రెండువిభాగము లగుచున్నది. అందు పైభాగమున అంసపృష్టికా ఉత్తరా అను కండయును (24-వ పటము 16), క్రిందిభాగమున అంసపృష్టికా అధరా యను కండయును (24 లో 11) పుట్టును. ఈ ప్రక్కను వెలుపలియంచు సమీపమున అంసాధరిక లఘు, బృహత్, (Teres Minor and Major) అను రెండుకండలు పుట్టును. (24 లో 8, 7).

23-వ పటము




అంసఫలకము ముందుప్రక్క

1 అరిత్రా, 2 అంసాంతరికా, 3 త్రిశిరస్క, 4 అంసపీఠము, 5 అంసతుండము, 6 ఉరఃప్రచ్ఛదా లఘు, 7 అంసకూటము, 8 అక్షకాస్థి సంయోగస్థానము.

అంసప్రాచీరము. (Spine) ఇయ్యది అంసఫలకముయొక్క వెనుకభాగమున నొక గోడవలె పెరిగి లోపలిభాగమున నుండి వెలుపలిభాగమునకు క్రమముగా ఎత్తగును. (24లో 13-13). ఈ గోడ త్రిభుజాకారముగ నుండును. దీని పైభాగమున పృష్టప్రచ్ఛద (Trapezius) అను కండయును, (14-14), క్రింది భాగమున అంసచ్ఛద (Deltoid) అను కండయును (12.12) అంటియుండును.

అంసకూటము. (Acromion process) అంసప్రాచీరము యొక్క వెలుపలికొన నంటి పాముపడగవలె గానవచ్చు భాగము (23.) ఇందుండికూడ అసంచ్ఛద (Deltoid) పృష్ఠప్రచ్ఛద (Trapezius) అను కండలయొక్క కొంతభాగము పుట్టును. దీని శిఖరమున అంసతుండ సంయోజనీ అను స్నాయువు (Coraco acromial Ligament) అంటియుండును.

మూడంచులు. పైఅంచు, పై కోణము నుండి వెలుపలికోణము సమీపమున నున్న అంసతుండము (Coracoid proce s) అను కాకి ముక్కువంటి భాగము వఱకు వ్యాపించియుండును. దీని వెలుపలిభాగమున అంసశిరః కోటరంబను (Suprascapular Notch) పల్లపు ప్రదేశము కలదు. దీనిగుండ అంసారోహిణీ నాడీ (Suprascapular Nerve) పోవును.

వెలుపలియంచు. చంక సమీపమునందుండునది. ఇది అంసపీఠమును (Glenoid cavity) ప్రదేశమునుండి క్రిందికోణము వరకు వ్యాపించును. ఇందు అంసపీఠము యొక్క క్రిందిభాగమున త్రిశిరస్క (Triceps) అను కండ పుట్టును. దానిక్రింద అంసాధరికా లఘు, బృహత్ (Teres major & minor) అను కండలు పుట్టును. లోపలియంచు ధను

24-వ పటము




అంసఫలకము వెనుకప్రక్క

1 లోపలి అంచు, 2 వెలుపలి అంచు, 3 పై అంచు, 4 అంసాపకర్షణీ గురు, 5 అంసోన్నమనీ, 6 అంసాపకర్షణీ లఘు, 7 అంసాధరికా బృహత్, 8 అంసాధరికా లఘు, 9 సిరాధమనులకు మార్గము, 10 అంసఫలకము మెడ, 11 అంస పృష్ఠికా అధరా 12-12 అంసచ్ఛదా, 13-13 అంసప్రాచీర మధ్యభాగము, 14-14 పృష్ఠప్రచ్ఛదా, 5 అంసప్రాచీర భాగము, 16 అంసపృష్ఠికా ఉత్తరా, 17 అంస శిరఃకోటరము, 18 ద్విశిరస్క దీర్ఘమూలము, 19 చతురశ్రికాస్నాయు సంయోగస్థానము, 20, 21 ద్విశిరస్కా, కాకోష్ఠికా సంయుక్తమూలము, 22 అంస తుండము, 23 అంసకూటము, 24 అంస కంఠికా.

ర్వక్రాకారముగ నుండును. వెన్నెముకకు సమీపమునను, కొంతవరకు సమాంతరముగను ఉండును. ఇందుండి ముందుభాగమున అరిత్ర (Serratus Magnus), వెనుక భాగమున అంసోన్నమనీ (Levator Angulæ Scapulæ), అంసాపకర్షణి-లఘు, గురు- (Rhomboideus Minor & Major) అను కండలు పుట్టును.

మూడుకోణములు. పైకోణము (Superior angle)నుండికూడ అంసోన్నమని(Levator Angulæ Scapulae)అను కండయొక్క కొంతభాగము పుట్టును. క్రిందికోణము (Inferior angle) వెలుపలిభాగము నుండి అంసాధరికా బృహతీ (Teres major) అను కండయొక్క కొంతభాగము పుట్టును. వెలుపలి కోణము: ఇది యీ యెముకలో మిక్కిలి లావైన భాగము. దీనికి అంశఫలకశిరస్సని (Head) పేరు. ఈ శిరస్సుమీద అంసపీఠ మను (Glenoid cavity) దొప్పయొకటి కలదు. ఈ దొప్పలో భుజముయొక్క ప్రగండాస్థి (Humarus) తిరుగుచుండును. ఈదొప్ప పైభాగమున ద్విశిరస్క మను కండయొక్క దీర్ఘమూలము (Long head of Biceps) అంటి యుండును. దాని క్రిందిభాగమున త్రిశిరస్క మను కండయొక్క ఒకమూల అంటియుండును. అంసఫలక శిరస్సు (Head)యొక్క క్రిందిభాగమున నుండు మెడనుండి పైతట్టున కాకిముక్కువలె వెలుపలివైపునకు అంసతుండము (Coracoid process) అను ఒక కొమ్ము కలదు. దీని కొననుండి ద్విశిరస్క (Biceps) యొక్క హ్రస్వమూలమును (చిన్నతల) కాకోస్థికా (Coraco-brachialis) యను కండయుచేరి పుట్టును. దీని ముందరిఅంచున ఉరఃప్రచ్ఛద (లఘు) (Pectorales minor)అనుకండ పుట్టును. దీని వెనుకయంచున తుండాంసకూటకసంయోజనీ స్నాయువు (Coraco-acromial Ligament)అంటియుండును. ఆసంతుండముయొక్క మూలమునందు లోపలిభాగమున త్రికోణికాస్నాయువు (Conoid ligament) పుట్టును. దీని పై భాగమున చతురస్రికాస్నాయువు (Trepezoid ligament) అంటియుండును.

అక్షకాస్థులు—రెండు. వీనికి మెడ కొంకులని పేరు. అం దొక్కొక్కటియు లోపలివైపున ఉరఃఫలకముతో అనగా ఎదురురొమ్ము ఎముకతోను వెలుపలి వైపున అంసఫలకములోని అంసకూటముతోడను స్నాయువుల ద్వారా సంబంధము కలిగియున్నవి. రెండుప్రక్కలనుండు అంసఫలకములును అక్షకాస్థులును చేరి అంసచక్ర మగును.

అక్షకాస్థికి ఇతరనళకాస్థులకు వలెనె రెండు కొన భాగములును నడుమ గొట్టమువంటి భాగమును మూడు భాగములు గలవు. శ్రోణిచక్రమున సంధించు ఊర్వస్థులవలెగాక భుజాస్థులు మిక్కిలి స్వేచ్ఛగ నలుప్రక్కలకు తిరుగుటకు ఏర్పడియున్నవి. భుజాస్థియొక్క తల తిరిగెడు గుంట మెరకగ నుండుటయు, అంసచక్రమునందలి యెముకలు పూర్తిగా నిర్బంధింపబడియుండక కొంత స్వేచ్ఛగ చలనానుకూలము గలిగియుండుటయు నిందులకు కారణములు.

అక్షకాస్థి—మన శరీరమున నడ్డముగా నమర్చబడి యున్నందున దీని లోపలికొనకు అంతఃప్రాంతమనియు వెలుపలికొనకు బహిఃప్రాంత మనియు పేర్లు.

అంతఃప్రాంతము—లోపలికొన. ఇందు రెండు సంధిగుర్తులు గలవు. వానిలో పైది ఉరఃఫలకముయొక్క శీర్ష భాగమున ప్రక్కనుండు సంధిగుర్తుతోను, క్రిందిది ప్రథమ ఉపపర్శుకశీర్ష భాగముతోను సంధించును. దీని క్రింది వైపున మిట్టపల్లపుప్రదేశముగలదు. ఇందు పర్శుకాక్షకసంయోజనస్నాయువు సంయోగము జెందును.

బహిఃప్రాంతము—వెలుపలికొన. ఇచ్చట ఒక సంధిగుర్తు గలదు. ఇది అంసకూటములో సంధించును. ఇచ్చటనే అంసాక్షకసంయోజనీస్నాయువు సంధించును.

మధ్యప్రాంతము—నడిమిభాగము. ఇది పల్లకికొమ్మువలె ధనుర్వక్రాకారముగ రెండువంకరలు తిరిగి యుండును. ముందునుండి చూచినప్పుడు లోపలిసగమునందుండు వంపు ముందువైపునకు ఉబ్బుగను, వెలుపలిసగమునందుండు వంపు వెనుకవైపున కుబ్బుగను ఉండును. ఈ ప్రాంతమును మూడుభాగములుగ విభజించిన

౨౯-వ పటము.




అక్షుకాస్థి (ఎడమ ప్రక్క-ది).

పై పటము:—పై ప్రక్క- 1. ఉరఃకర్ణమాలికా, 4. ఉరఃప్రచ్ఛదాగుర్వి, 5. అంసచ్ఛదా, 6. పృష్ఠప్రచ్ఛదా.

క్రింది పటము:—క్రింది ప్రక్క- 1. ఉరఃప్రచ్ఛదాగుర్వి, 2. సంధిలాంఛనము, ప్రథమ ఉపపర్శుకాసంయోగార్థము, 3. ఉరోజిహ్వామాలికా, 4. స్నాయుసంయోగార్థము, అసమప్రదేశము, 5. అక్షాంశికకండ, 6. అర్బుదము; త్రికోణికాస్నాయుసంయోగార్థము, 7. రేఖ, చతురస్రికాస్నాయుసంయోగార్థము, 8. అంసకూటసంయోగార్థము, 9. అంసచ్ఛద.

యెడల వెలుపలి యొకభాగము చదునుగను లోపలి రెండుభాగములు గుండ్రముగను ఉండును. వెలుపలి మూడవభాగము నడిమిభాగముతో కలియుచోట నొక అర్బుదము అనగా ఎత్తుప్రదేశము గలదు. ఇచ్చట త్రికోణికాస్నాయువు సంయోగము నొందును. ఈ అర్బుదము నుండి వంకరగా ముందువైపునకు ఒకరేఖ పోవును. ఈ రేఖ చతురస్రికాస్నాయువు (Tapezoid Ligament) యొక్క సంయోగమున కుపయోగించును.

వెలుపలిభాగము యొక్క పైప్రక్కను అంసచ్ఛద (Deltoid) పృష్ఠప్రచ్ఛద (Trapezius) అను కండలును క్రిందివైపున అక్షుకాధరా (Subclavius) అను కండయు అంటియుండును.

లోపలిభాగముయొక్క, పైతట్టున ఉరఃకర్ణమాలిక (Sternomastoid) ఉరఃప్రచ్ఛదాగుర్వి (Pectoralis major) అను కండలు అంటియుండును. క్రిందితట్టున అక్షుకాధరా (Subclavius) అను కండయు, ఈ కండకు లోపలివైపున పర్శుకాక్షుక స్నాయువు గలియుచోటును గలవు. వెనుకవైపున (మెడవైపున) లోపలిభాగమున ఉరోజిహ్వామాలికా (Sternohyod) అను కండ అంటియుండును.

ఊర్ధ్వశాఖలు—అనగా చేతులు. ఒక్కొక చేతియందు ఒక ప్రగండాస్థి, రెండు ప్రకోష్ఠాస్థులు, ఎనిమిది కూర్చాస్థులు, ౫ అంగులీమూలశలాకలు 14 అంగుళ్యస్థులు గలవు. వీనినిగూర్చి ప్రత్యేకముగ క్రింద వివరించెదము:

ప్రగండాస్థి—(Humerus) ఇది భుజమునందలియెముక. చేతియెముకలలో పెద్దది. అన్నినలకాస్థులవలె దీనినికూడ ఊర్ధ్వప్రాంతము (పైభాగము) అధఃప్రాంతము (క్రిందిభాగము) కాండము (మధ్యభాగము) అని మూడుభాగములుగ విభజించి విచారింపనగును.

ఊర్ధ్వప్రాంతము—పైభాగము. ఈ యెముక లోని ఊర్ధ్వప్రాంతము విశాలమైన ప్రదేశము. అర్ధవర్తులాకారమును అంతర్ముఖమును అగు తల యీభాగమునందు గలదు.

ప్రగండాస్థి.

ఈతల అంసపీఠము (Glenoid cavity) నందలి గుంటయందు దిమిడియుండును. ఈ తలచుట్టును అంససంధి బంధనస్నాయుకోశము చుట్టబడియుండును. తలయందు వెలుపలివైపున మహాపిండకమనియు (Greater Tuberosity) ముందరివైపున లఘుపిండకమనియు (Lessor Tuberosity) రెండు ఎత్తుప్రదేశములు కలవు. అంసపృష్ఠికా ఉత్తరా, అంసపృష్ఠికా అధరా, అంసాధరికా లఘ్వీ అను మూడు కండలు వరుసగ మహాపిండకశిఖరముమీద ముందుండి వెనుకకు అంటియుండును. లఘుపిండకము మహాపిండకమునకంటె చిన్నదై ననుఎత్తయినది. దీనిశిఖరముమీద అంసాంతరిక అను కండ అంటియుండును. ఈ రెండు పిండములమధ్య అగడ్తలో ద్విశిరస్క (Biceps) అను కండయొక్క గుండ్రని పొడుగాటిమూలము పోవుచుండును. ఈ అగడ్తయొక్క వెలుపలిభాగమున ఉరఃప్రచ్ఛదాగుర్వీయు దీని లోపలిభాగమున కటిపార్శ్వప్రచ్ఛద (Latissimus Dorsi)యు దాని క్రిందిభాగమునే అంసాధరిక బృహతియు కండ లుండును.

మధ్యభాగము—కాండము. ఇది నడిమి పొడుగుభాగము. ఇది పైభాగమున దండాకారముగ గుండ్రముగ నుండును. క్రిందిభాగమున మూడు అంచులును మూడుతలములును కలిగి త్రిభుజాకారముగ నుండును. అందు మధ్యభాగమున వెలుపలివైపున కొంచె మెత్తుగనుండు ప్రదేశమునందు అంసచ్ఛద(పిండిక) అనుకండ అంటియుండును. దానికి క్రింద వెనుకభాగమున ఎక్కువలోతులేని కాలువ గలదు. అందు గభీరధమనియు నొక ముఖ్యమైన నాడియు పోవును. ఈ కాలువ కిరుప్రక్కలను త్రిశిరస్కయొక్క రెండుతల లుండును. శాఖోత్థికా (Coraco-Brachialis) అనుకండ క్రింది సగభాగమున లోపలి వైపున ఉండును. కాండము యొక్క ముందుప్రదేశమున నుండి కూర్పరద్వారికా (Brachialis Anticus) కండ పుట్టును. కాండమునకు క్రిందిభాగమునకు రెండు అంచులు గలవు. అందు వెలుపలియంచునందు కరోత్తానినీ దీర్ఘా (Supinator Longus) అనుకండ యుత్పత్తిస్థానము గలదు. ఈ లోపలి వెలుపలి అంచులు క్రమముగ లోపలి వెలుపలి అర్బుదములతో క్రింద కలియును.

అధఃప్రాంతము—క్రిందిభాగము. ఈ యెముక యొక్క క్రిందివైపున నున్న యీ భాగమునందు చూడదగినవి:— రెండు అర్బుదములు (వెలుపలిది, లోపలిది), ఒక కందము, ఒక డమరుకము, కూర్పరఖాతము, పురఃఖాతద్వయము అనునవి.

వెలుపలిఅర్బుదము—వెలుపలి యెత్తుభాగము. ఇది రెండు అర్బుదములలో పెద్దది. వెలుపలి వైపున నున్న కూర్పరసంధిబంధనస్నాయువు ఇచ్చట అంటియుండును. కరప్రసారిణీ అను పేరుగల నాలుగు కండల మూలములు కలిసి యేర్పడిన యేకమూలమునకును (Common Extensor tendor) కరోత్తానినీ దీర్ఘా (Supinator Longus) కండకును ఇది జన్మస్థానము. దీని వెనుకనుండి కూర్పరపృష్ఠికా (Anconius) కండ పుట్టును.

లోపలి అర్బుదము.— వెలుపలి అర్బుదము కంటె ఇది స్ఫుటముగ నుండును. త్రిభుజాకారముగ ఉండును. కూర్పరసంధియొక్క లోపలి స్నాయువు యొక్క త్రాళ్లు ఇచ్చట కట్టబడును. ఇచ్చట పైభాగము నుండి కరవివర్తినీదీర్ఘ (Pronator Radii Teres) కండయు, క్రింది భాగము నుండి పాణిసంకోచనీ (Flexor) అను రెండు కండలును, అంగుళీసంకోచనీ మధ్యపర్వికా (Flexor Sublimus Degitorum) కరతలప్రసారిణీ (Palmaris Longus) అను కండలును పుట్టును.

బహిఃప్రకోష్ఠకందము. వెలుపలి అర్బుదమునకు ఎదుటనుండు గుండ్రగ నుబ్బిన భాగము. ఇది నున్నగ నుండి వెలుపలి ప్రకోష్ఠాస్థియొక్క శిరస్సునందుండు గుంటను ఆశ్రయించి తిరుగుచుండును.

డమరుకము. ఇది డమరుకమువలె అనగా బుడబుడుక్కులవాని ఢక్కివలె రెండుప్రక్కల లావుగను నడుమ సన్నముగ నుండును. ఇది ముందుండి వెనుకకు

చూచిన యెడల నడుమ ఎత్తుగ నుండును. ఒకప్రక్కనుండి మరియొకప్రక్కకు చూచినయెడల నడుమ సన్నముగ నుండును. అంతఃప్రకోష్ఠాస్థి పైభాగమునం దున్న రెండు ప్రవర్ధనకముల మధ్య నుండు డమరుకఖాత మను గుంటలో నీ డమరుకము సంధింపియుండును.

పురఃఖాతద్వయము. ముందువైపున సంధి గుర్తు ఉన్న భాగమునకు పైని స్పష్టమైన అగడ్తలు రెండు కలవు. చేయి ముడిచినప్పుడు ఈ అగడ్తలయందు అంతఃప్రకోష్ఠాస్థియొక్క పైభాగమున నుండు చంచుప్రవర్ధనమును, బహిఃప్రకోష్ఠాస్థియొక్క తలయందలి అంచును ఇమిడి యిటు నటు ఆడుచుండును.

కూర్పరఖాతము. ప్రగండాస్థియొక్క అధఃప్రాంతమున వెనుకవైపున నున్న పెద్దఅగడ్త. ఇదు అంతఃప్రకోష్ఠాస్థియందలి కూర్పరప్రవర్ధనకము యొక్క శిఖరము చేయి చాచినప్పుడు చేరును.

ప్రకోష్ఠాస్థులు—ఇవి ముంజేతియందలి యెముకలు. ఇవి రెండు. వెలుపలిదానికి అనగా బొటిమనవ్రేలు వైపున నున్నదానికి బహిఃప్రకోష్ఠాస్థి (Radius) అనియు లోపలిదానికి అనగా చిటికెనవ్రేలువైపు దానికి అంతఃప్రకోష్ఠాస్థి (Ulna )అనియు పేళ్లు. ఈరెండును పై భాగముననగా మోచేతివద్ద ప్రగండాస్థి (Humarus) తో సంధిమూలమున నంటియున్నవి. అరచేయి పైవైపున నున్నప్పుడు ఇవి రెండును ఒకదానిప్రక్క నొకటి సమాంతరముగ నుండును. కాని మనము అరచేతిని బోర్లగిల త్రిప్పినప్పుడు బహిఃప్రకోష్ఠాస్థి వంకరగా అంతఃప్రకోష్ఠాస్థి పైననుండును. వీనిలో బహిఃప్రకోష్ఠాస్థి క్రింది భాగమున మణిబంధసంధిలో ముఖ్యమైన పాలుగొనును. అంతఃప్రకోష్ఠాస్థి కూర్పరసంధి (మోచేతి సంధి)లో చాల భాగము పాలు గొనును.

బహిఃప్రకోష్ఠాస్థి (Radius). ఇది పొడుగు ఎముక. కొంచెము వెలుపలి వైపునకు వంగియుండును.

ఊర్ధ్వప్రాంతము—పైకొన. దీని పైభాగమున చక్రాకారమగు శిరస్సు (Head) కలదు. ఈతలయందు

బహిఃప్రకోష్ఠాస్థి

గుంటయొకటి గలదు. ప్రగండాస్థియొక్క అధఃప్రాంతమున వెలుపలి వైపుననుండు కందము ఈగుంటయందే తిరుగుచుండును. తలయొక్క లోపలివైపున అర్ధచంద్రాకారమగు సంధిగుర్తు ఒకటి కలదు. అది అంతఃప్రకోష్ఠాస్థియొక్క వెలుపలివైపున నున్న చక్రనేమిఖాత మను గుంటలో అమర్చబడియుండి కూర్పరసంధి మధ్యమునందు తిరుగు చుండును. ఈ తల క్రిందది మెడ (Neck). మెడక్రింద మొటిమవంటి అర్బుద మొకటి గలదు. ద్విశిరస్కమను కండయొక్క అగ్రిమా యర్బుదమునందు సంయోగము నొందును.

అధఃప్రాంతము—మణిబంధసంధిలో చేరు త్రిభుజాకారముగల సంధిగుర్తుచే దీనిని గుర్తింపవచ్చును. ఈగుర్తువద్ద క్రిందినుండి అర్ధచంద్ర, నౌనిభములను కూర్చాస్థులు రెండును సంధించును. ఈగుర్తునకు లోపలివైపున ఇంకొక సంధిగుర్తు కలదు. ఇది అంతఃప్రకోష్ఠాస్థి సంధియగుచోటును తెలుపును. అధఃప్రాంతముయొక్క వెలుపలివైపున త్రిభుజాకారమైన మిట్టప్రదేశము గలదు. దానికి బహిర్మణికశృంగ మను బలమైనకొమ్ము ఒకటంటియుండును.

మధ్యభాగము. మూడంచులు గలవు. లోపలి అంచు వాడియైనది. అందు ప్రకోష్ఠాంతరాళకళ అంటియుండును. మధ్యభాగము నంటియున్న యనేక కండల గూర్చి పటము చూడుము.

అంతఃప్రకోష్ఠాస్థి (Ulna). ఇదియు పొడుగు ఎముక.

ఊర్ధ్వప్రాంతము—పైకొన. దీని యెదుటిభాగముననుండి కొమ్ములవలె రెండు ప్రవర్ధనకములు పెరిగియున్నవి. అందు పైభాగముననున్న ప్రవర్ధనకమునకు కూర్పరప్రవర్ధనకమని పేరు.

అంతఃప్రకోష్ఠాస్థి.

ఇది సర్పఫణాకారము కలది. క్రిందిప్రవర్ధనకము కాకిముక్కువలె నుండుటచే దానికి చంచుప్రవర్ధనకమని పేరు. ఈ రెండుప్రవర్ధనకములమధ్య నొకగొయ్యి కలదు. ఈగొయ్యి అర్ధచంద్రాకారముగ నుండి మధ్యభాగమున నిలువున కొంచెమెత్తుగ నుండును. ఈగోతిలో ప్రగండాస్థియొక్క డమరుకము తిరుగుచుండును. ఈగోతికి డమరుకఖాత మని పేరు.

26-వ పటము.




ఎడమవైపు ప్రగండాస్థి

ముందువైపు.

1. శిరస్సు, 2. గ్రీవము (మెడ) 3. అంసపృష్టికా ఉత్తరా, 4. మహాపిండకము, 5.

6. 7. కటిపార్శ్వ ప్రచ్ఛదా, 8. ఉరః ప్రచ్ఛదా గరిస్థా, 9. అంసపిండికా, 10. కాకోష్ఠికా, 11. కూర్పరద్వారికా, 12. కరోత్తానినీదీర్ఘా, 13. కర ప్రసారిణీదీర్ఘాబహిస్థా; 14. చక్రనేమిఖాతం, 15. కర ప్రసారిణీహ్రాస్వాబహిస్థా, కరాంగుళిప్రసారిణీ, కనిష్టిక ప్రసారిణీ, కరప్రసారిణీఅంతస్థా, కరోత్తానినీ హ్రాస్వా, అను కండలయొక్క సంయుక్తమూలము, 16. బాహ్యా ర్బుదం, 17. బహిఃప్రకోష్టకందము, 18. డమరుకము, 19. అంతరర్బుదము, 20. పాణిసంకోచనీ బహిస్థా, పాణిసంకోచనీ అంతస్థా, కరతలప్రసారిణీ, అంగుళీ సంకోచనీమధ్యపర్వికా, అను కండయొక్క సంయాక్త మూలము. 21. కరవివర్తనీదీర్ఘా, 22. ఖాతము (చంచు ప్రతర్థనకము కొరకు) 23. అంసాధరికా, 24. బృహతీ. ప్రగండాస్థి వెనకప్రక్కను 1. అంసపృష్ఠికాధరా, 2. అంసాధరికాలఘ్వీ, 3. త్రిశిరస్కయొక్క బాహ్య శిరస్సు, 5. త్రిశిరస్కయొక్క అంతశ్శిరస్సు, 4. ఈ రెంటిమధ్య నుండు గభీరధమనీమార్గము, 6. కూర్పర ఖాతము, 7. పాణిసంకోచనీ అంతస్థా, 8. డమరుకము, 9. కూర్పరపృష్ఠికానునవి గలవు.

27-వ పటము.




1. ప్రగండాస్థితో సంధి, 2. శిరస్సు, 3. గ్రీవము, 4. ద్విశిరస్క, 5. కరోత్తానినీహ్రస్వా, 6. అంగులిసంకోచనీ మధ్యపర్వికా, 7. కరాంగుష్ఠసంకోచనీదీర్ఘా, 8. కరోత్తానినీదీర్ఘా, 9. బహిర్మణికా, 10. అర్ధచంద్ర నౌనిభములతో సంధి, 11. బహిఃప్రకోష్ఠాస్థితో సంధి, 12. అంతర్మణికా, 13. కరవివర్తనచతురస్ర(ఉత్తరా), 14. అంగులీసంకోచనీ అగ్రపర్వికా, 15. కరాంగుష్ఠ సంకోచనీ దీర్ఘా, 16. కరవివర్తనీదీర్ఘా, 17. కూర్పరద్వారికా, 18. అంగులీసంకోచనీ మధ్యపర్వికా, 19. కూర్పరకూటము, 20. చంచుప్రవర్ధకము, 21. చక్రనేమిభాగము, 22. కరోత్తానినీహ్రస్వా.

28-వ పటము.




1. అంతఃప్రకోష్ఠాస్థి, 2. బహిఃప్రకోష్ఠాస్థి, 3. త్రిశిరస్క, 4. చర్మము క్రిందచేతికితగులు భాగము, 5. అంగులీసంకోచనీమధ్యపర్వికా, 6. అంగులిసంకోచనీఅగ్రపర్వికా, 7. అంగుష్ఠప్రసారిణీ అగ్రపర్వికా, 8, 9. కరప్రసారిణీఅంతస్థా, 10. కనిష్ఠికప్రసారిణీ, 11, 12. తర్జనీప్రసారిణీ, కరాంగులిప్రసారిణీ, 13. అంగుష్ఠప్రసారిణీ అగ్రపర్వికా, 14. కరప్రసారిణీ హ్రస్వా బహిస్థా, 15. కరప్రసారిణీ దీర్ఘా బహిస్థా, 16. అంగుష్ఠప్రసారిణీ ప్రథమపర్వికా, 17. అంగుష్ఠమూలశలాకప్రసారిణీ, 18. కరోత్తానినీ హ్రస్వా, 19. కూర్పరపృష్ఠికా.

కూర్పర ప్రవర్ధనకము. దీని శిఖరము ప్రగండాస్థియొక్క క్రిందిభాగమందు వెనుకవైపున నుండు అగడ్తలో సరిగా నమరియుండును. కూర్పరప్రవర్ధనకము యొక్క వెనుకభాగము త్రిభుజాకారముగను, నున్నగనుండి తడవినప్పుడు చర్మముక్రింద చేతికి తగులుచుండును. పడగయొక్క నెత్తిమీద వెనుకవైపున త్రిశిరస్కయను కండయొక్క అగ్రమును, ముందువైపున కూర్పరసంధియొక్క స్నాయువులోని కొంతభాగమును అంటియుండును.

చంచు ప్రవర్ధనకము. ఇది త్రిభుజాకారముగ నుండును. కాకిముక్కువలె సూచిగ నుండుటచే దీనికి చంచుప్రవర్ధనక మని పేరు. దీని పైభాగమున నుండు సంధిగుర్త ఊర్ధ్వప్రాంతము నెదుట నుండు అర్ధచంద్రాకార మగు డమరుకఖాతములోని క్రిందిభాగములో చేరినది. ప్రగండాస్థికి క్రిందభాగమున నున్న డమరుకాకారము గల సంధిగుర్తుయొక్క ముందరిభాగమును ఇది యాశ్రయించి తిరుగుచుండును. ఈ చంచుప్రవర్ధనకముయొక్క అగ్రము చేయి ముడిచినప్పుడు ఆ డమరుకము యొక్క ముందుభాగమున నుండు అగడ్తలో నుండును. దీని క్రిందిభాగమున విషమప్రదేశ ముగలదు. అచ్చట కూర్పగద్వారిక యను కండ ప్రవేశించును. చంచుప్రవర్ధనకము కాండములో జేరుచోట నొక యర్బుదము గలదు. ఈ అర్బుదమునందు వక్రస్నాయువు సంయోగము నొందును. దీని వెలుపలిభాగమునందు అండాకృతి గల గుంట యొకటి కలదు. దాని నాధారముగ జేసికొని బహిఃప్రకోష్ఠాస్థియొక్క శిరస్సు చుట్టునుండు చక్రముయొక్క లోపలి అంచున నుండుసంధిగుర్త గల భాగము తిరుగుచుండును. కావున నీ గుంటకు చక్రనేమిఖాతమని పేరు. చక్రనేమిఖాతముయొక్క అంచునందు చక్రనేమిస్నాయువు(Orbicular Ligament) సంధించును. చంచుప్రవర్ధనకముయొక్క లోపలి వైపునున్న అంచునందు కూర్పరసంధియొక్క లోపలి వైపునకు సంబంధించి యుండు స్నాయువులు ప్రవేశించును. ఈ అంచు క్రింది భాగమందు ఎదుట నొక మిట్టప్రదేశము గలగు. ఇందు అంగుళీసంకోచనీ మధ్యపర్వికా అను కండ పుట్టును. ఈ మిట్టకు వెనుకవైపున నున్న గోతిలో అంగుళసంకోచనీ అగ్రపర్వికా అను కండ యొక్క కొంతభాగము పుట్టును. మిట్టనుండి క్రిందికి దిగువ నొక గట్టునందు కరవివర్తనీదీర్ఘా అను కండ కొంతభాగము పుట్టును.

మధ్యభాగము—నడిమి గొట్టము. మూడు అంచులు గలవు. లోపలి అంచు లోపలి వైపున నుండును. పదనుగ నుండు వెలుపలి అంచునందు ప్రకోష్ఠాంతరాళకళ అంటియుండును. ప్రకోష్ఠకండ లనేకములు ఈ కాండభాగమున అంటియుండును. పటము చూడు.

అధఃప్రాంతము—క్రింది చివర. ఇది పై చివర కంటె చాలచిన్నది. ఇది మణికట్టుసంధియందు ఏమాత్రమును చేరక ప్రత్యేకముగ నుండును. దీని లోపలితట్టున మణికట్టుశిరస్సను గుండ్రనిభాగము కలదు. దానిక్రిందిభాగమున లోపలివైపున అంతర్మణిక మను శృంగము కలదు. అచ్చట మణిబంధసంధికి లోపలివైపుననుండు స్నాయువులు కట్టబడియుండును. దానివెనుక నుండు కాలువలలో కరప్రసారిణీ కండల (Extensor tendors) యొక్క అగ్రములు పోవును. బహిఃప్రకోష్ఠాస్థియొక్క క్రిందిభాగముతో కలుపుటకై అధఃప్రాంతముయొక్క వెలుపలివైపున నొక సంధిలాంఛనము కలదు. క్రింది భాగమందు సంధిగుర్త గల భాగము మణిబంధసంబంధమైన త్రిభుజాకారమైన తరుణాస్థిమీద తిరుగుచుండును.

కరకూర్చాస్థులు—ఇవి మణిబంధాస్థులు. చేతి మణికట్టున కివి యాధారములు. ఇవి ఎనిమిది. చిన్నవి. విషమజాతివి. ఇవి రెండు వరుసలుగానుండును. పైవరుసలో నాలుగు. వెలుపలివైపునుండి క్రమముగా, నౌనిభ (Scaphoid) అర్ధచంద్రము (Semilunar) ఉపలకము (Cuniform) వర్తులము (Pisiform) అను నవియు క్రింద వరుసయందు నాలుగు, అనేక కోణకగుర్వి (Trapezium) అనేక కోణకలఘ్వి (Trapezoid) మధ్యకూటకము, (Os Magnum) ఫణధరము, (Unciform) అనునవి కలవు. పైవరుసలోనున్న నాలుగింటిలో మొదటి మూడును మణిబంధసంధులలో సంధించును. నాలవది ఉపలకముతో సంధించును. వర్తులము తప్ప తక్కిన ఏడు ఎముకలకును ఆరేసిప్రక్కలు గలవు.

౧. నౌనిభము—నావవలె నుండును. ఈ పేరు గల పాదకూర్చాస్థితో సదృశము. దీని వెలుపల క్షుద్రార్బుదము కలదు. పై భాగమున సంధిగుర్తు ఒకటి కలదు. అది బహిఃప్రకోష్ఠాస్థియొక్క క్రిందిభాగముతో సంధించును. దీని లోపలి ప్రక్కన రెండు సంధిగుర్తులు కలవు. అందు పైది అర్ధచంద్రముతోను క్రిందిది మధ్యకూటముతోను సంధించును. క్రిందిభాగమున రెండు సంధిగుర్తులు గలవు. అందులో లోపలిది అనేక కోణక లఘ్వితోను వెలుపలిది అనేకకోణకగుర్వితోను సంధించును. వెనుకభాగమునందు ఎత్తు పల్లములుగను గరుకుగ నుండు చాళ్లు కలవు. అవి పొడుగునను మణిబంధ స్నాయువులతో సంధించును.

౨. అర్ధచంద్రము.—దీని వెలుపలి భాగమున నున్న సంధిగుర్తుచే నౌనిభముతోను, శిరస్సుమీది సంధిగుర్తుచే బహిఃప్రకోష్ఠాస్థి క్రిందిభాగముతోను సంధించును. ఈ అస్థియందు నింక సంధిగుర్తులు గలవు. అవి ఉపలక ఫణధర మధ్యకూటము లను కూర్చాస్థులతో నీ ఎముకకు సంధిని కలుగజేయును.

3. ఉపలకము—నిబ్బప్పత్తము అనగా గూని వాని వీపువలె నుండును. దీని పై భాగమున సంధిగుర్తు గలదు. అది మణిబంధసంధిలోపల నున్న త్రిభుజాకార తరుణాస్థితో సంధించును. ఈ అస్థిలో క్రమముగా అర్ధచంద్ర ఫణధర వర్తులములను కూర్చాస్థులతో సంధి కలుగజేయునట్టి మరిమూడు సంధిగుర్తులు కలవు.

౪. వర్తులము—ఇది గుండ్రనిది. మిక్కిలి చిన్నది. దీని వెనుక భాగమున ఉపలకముతో సంధించు అండాకృతిగల సంధిగుర్తు కలదు.

౫. బహుకోణకగుర్వి—దీని క్రిందిభాగమందు జీనువలె నొక సంధిగుర్తు కలదు. అది అంగుష్ఠమూల శలాకమూలముతో సంధించును. ఇంకను మూడు సంధిగుర్తులు కలవు. అవి క్రమముగ, నౌనిభ బహుకోణక లఘ్వి, తర్జనీమూలశలాకలతో సంధించును. దీని యెదుటి వైపున పైభాగమున కాలువ యొకటి గలదు. అందు వెలుపలివైపుననున్నట్టి పాణిసంకోచనీ కండయొక్క కండరము పోవును.

౬. బహుకోణకలఘ్వి—ఇది చిన్నది. ఇందు నాలుగు సంధిగుర్తులు గలవు. అందు పైది నౌనిభముతోను, వెలుపలిది బహిఃకోణకగుర్వితోను, లోపలిది మధ్యకూటముతోను, క్రిందిది తర్జనీమూలశలాకామూలముతోను సంధించును.

౭. మధ్యకూటము— ఇది కూర్చాస్థులలో మిక్కిలి పెద్దది. దీని పై భాగమున తలకలదు. ఆ తల మీద సంధిగుర్తు ఒకటి కలదు. అది దీనిని అర్ధచంద్ర కూర్చాస్థితో కలుపును. వెలుపలివైపు రెండుభాగములుగ విభక్తము. ఈ వైపున రెండు సంధిలాంఛనములు కలవు. అందు క్రిందికి అనేక కోణకలఘ్వితోను పైది నౌనిభముతో సంధించును.

౮. ఫణధరము—ఇందు ముందువైపున సర్పఫణాకార మైన ప్రవర్ధనకముండును. ఇది త్రిభుజప్రాయ మైన కోణాకారముగ నుండును. మధ్యకూటక ఉపలకములతో నిది సంధించును. ప్రక్కలకూడ వానితోనే సంధించును. క్రింది భాగమందు గల సంధిగుర్తు రెండు విభాగములుగా నుండి అనామిక కనిష్ఠ మూలశలాక మూలములతో సంధించును. దీని ఫణాకారప్రవర్ధనము మీదుగా అంగుళీసంకోచనీ కండలయొక్క అగ్రములు పోవును.

కరాంగుళి మూలశలాకములు—చేతివ్రేళ్లలో వైకణుపులకు తగిలియుండు అయిదు ఎముకలు. వీనిని మనము అరచేతియెముకలనవచ్చును. ఇవి అరచేతికి ఆధారములు. అవి పైపైపున కూర్చాస్థులతోను క్రిందివైపున మొదటికణపు వ్రేళ్ల ఎముకలతోను సంధించును.

వీనివివరము: మొదటిది—అంగుష్ఠ మూలశలాక (First Metacarpal). మూలశలాకలలో నిది పొట్టిది, లావుది. దీని మూలమున (పైభాగమున) సంధిగుర్తు గలదు. అది బహుకోణకగుర్వి అను కూర్చాస్థిలో సంధించును.

రెండవది—తర్జనీమూలశలాక. దీని పైభాగమున నాలుగు సంధిగుర్తులు కలవు. అందు మూడు బహుకోణకగుర్వి బహుకోణకలఘ్వి మధ్యకూటము అను కరకూర్చాస్థులతోను నాలుగవది మధ్యమమూల శలాకతోను సంధించును.

29-వ పటము.




ఎడమచెయ్యి పాణితలము (ముందువైపు)

1. నౌనిభము, 2. అర్ధచంద్రము, ౩. ఉపలము, 4. వర్తుల(క)ము, 5. అనేకకోణకాగుర్వీ, 6. అనేకకోణ కాలఘ్వీ, 7. మధ్యకూటము, 8. ఫణధరము, 9. పాణిసంకోచనీబహిస్థా, 10. పార్శ్వ సంకోచనీ అంతస్థా, 11. కనిష్ఠికాసంకోచనీ. 12. కనిష్ఠికామూలశలాకాసంకోచనీ, 18. అంగుష్ఠసంకోచనీ హ్రస్వా, 14. అంగుష్ఠమూలశలాకాసంకోచనీ, 15. కనిష్ఠికామూలశలాకాసంకోచనీ, 16. కరాంగుష్ఠాన్తర్వివర్తినీ 17. 18. కనిష్ఠికాసంకోచనీహ్రస్వా, కనిష్ఠికాబహిర్వివర్తినీ, 19. కరాంగుష్ఠ సంకోచనీదీర్ఘా, 20. అంగుళీసంకోచనీ మధ్యపర్వికా, 21. అంగుళీసంకోచనీ అగ్రపర్వికా, 22. 28. కరాంగుష్ఠబహిర్వివర్తినీ, 24. 25. చణకాస్థులు,
2, 3, 4, 5, ఈ సంఖ్యగల కరాంగుళిమూలశలాకలమధ్యణితలాపాస్థ్యంతరములను మూడు కండలు గలవు.

30-వ పటము.




1. నౌనిభము, 2. అర్ధచంద్రము, ఈరెండును బహిఃప్రకోష్ఠాస్థితో సంధించును, 3. ఉపలకము, 4. వర్తులము, 5. అనేకకోణకాగుర్వీ, 6 అనేక కోణకాలఘ్వీ, 7. మధ్యకూటము. 8. ఫణధరము, 9. కరప్రసారిణీ అంతస్థా, 10. కరప్రసారిణీ బహిస్థాదీర్ఘా, 11. కరప్రసారిణీబహిస్థాహ్రస్వా, 12. కరాంగుళి ప్రసారిణీ, 13. అనామికప్రసారిణీ, 14. కనిష్ఠికప్రసారిణీ, 15. కరాంగుష్ఠప్రథమపర్వికప్రసారిణీ, 16. కరాంగుష్ఠాగ్రపర్వికప్రసారిణీ, I, II, III, IIII, V. కరాంగుళి మూలశలాకలు, వీనిమధ్య వెనుకవైపున పాణిపృష్ఠాస్థ్యంతరములని నాలుగుకండలు కలవు. 1, 2, 3, కరాంగుళ్యస్థులు.

31-వ పటము.




శ్రోణిఫలకము కుడిప్రక్కది.

1. జఘనధార, 2. ఉదరచ్ఛదాఅంతరాతిరశ్చీనా, 3. ఉదరచ్ఛదాబాహ్యతిరశ్చీనా, 4. ఊర్వంతఃకలోత్తంసనీ, 5. పూర్వోత్తర శృంగము, 6. దీర్ఘయామా, 7. పూర్వాధర శృంగము ఊరుపిండికా, 8. నితంబపిండికాగుర్వీ, 9. నితంబపిండికామధ్యమా, 10. నితంబపిండికాలఘ్వీ, 11. కటిప్రచ్ఛదా, 12. పశ్చిమోత్తర శృంగము, 13. పశ్చిమాధరశృంగము, 14. గృధ్రసీద్వారము, 15. గమలస్ ఉత్తరా, 16. కుకుందరకంటకము, 17. కుకుందరద్వారము, 18. గమలస్ అధరా, 19. కుకుందరపిండము, 60. శ్రోణిగవాక్షిణిబహిస్థా, 21. ఊరుచతురస్ర, 22. కలాకల్పా, 23. కండరాకల్పా ద్విశిరస్కా, 24. ఊరుసంవ్యూహినీగరిష్ఠా, 25. శ్రోణిపక్షిణీ బహిస్థా, 26. శ్రోణిగవాక్షము, 27. కుకుందరశృంగము, 28. భగాస్థి అధరశృంగము, 29. ఊర్వంతఃపార్శ్వికా, 30. ఊరుసంవ్యూహనీకనిష్ఠా, 31. ఊరుసంవ్యూహనీదీర్ఘా, 32. ఉదరదండికా 33. భగాస్థికంటకము, 34. భగాస్థికూటము, 35. వస్తికంఠికా, 36. [illegible], 37. భగాస్థిమండము, 38. [illegible] ఫలము.

మూడవది—మధ్యమమూలశలాక. దీని పైభాగమునందు మూడు సంధిగుర్తులు గలవు. అందొకటి మధ్యకూటమను కూర్చాస్థితోను రెండు పై పుల రెండును తర్జనీ అనామికల మూలశలాకల ప్రక్కలతోను సంధించును.

నాలుగవది—అనామికామూలశలాక. ఇందు సంధిగుర్తులు నాలుగు. అందు నడుమనున్న రెండు మధ్యకూట ఫణధరములను కూర్చాస్థులతో సంధించును. ఇటుఅటునున్న సంధిగుర్తులు మధ్యమ, కనిష్ఠామూలశలాకల పార్శ్వములతో సంధించును.

అయిదవది—కనిష్ఠామూలశలాక. ఇందు రెండు సంధిగుర్తులు కలవు. అందొకటి ఫణధరముతోను రెండవది అనామికామూలశలాకపార్శ్వముతోను సంధించును.

అంగుష్ఠమూలశలాకల కై దింటికిని క్రిందికొనలందు అంగుళ్యస్థులతో సంధించు సంధిగుర్తులు గలవు.

కరాంగుళ్యస్థులు—(Phalanges) బొటనవ్రేలికి రెండును మిగిలిన నాలుగువ్రేళ్లకు ఒక్కొకదానికి మూడువంతున పన్నెండును మొత్తము పదునాలుగు వ్రేళ్లయెముకలు గలవు. అందుపై యెముకలు అయిదు. నడిమియెముకలు నాలుగు. క్రిందియెముకలు అయిదు. బొటనవ్రేలియందు నడిమియెముక లేదు. వీని లోక్రింది యెముకలు అయిదింటినుండి గోళ్లు పుట్టును. వీని నంటియుండు కండలవిషయమై పటముచూడుము.

శ్రోణిచక్రము. ఇది మధ్యకాయమునకును అధఃశాఖలకును సంబంధము కలిగించు అస్థిచక్రము. ఇందు శ్రోణిఫలకములు రెండును, త్రికాస్థి, అను త్రికాస్థియు చేరియున్నవి. త్రికాస్థి, అను త్రికాస్థులగూర్చి పైన వర్ణించియున్నాము. ఇక శ్రోణిఫలకములగూర్చి వివరించెదము.

శ్రోణిఫలకము (Hip-bone) ఇది పిరుదయెముక.

**శ్రోణిఫలకము** పెద్ద అస్థిఫలకము. కపాలాస్థి. వంకర టింకరగా నుండును. నడుము సన్నము. పైన క్రిందవెడల్పు. ఈ ఎముక రెండుపై పులనుండును. ఒక్కొకటి యొక్కొక పై పున వంకరగా కటిపార్శ్వమునుండి తొడయెముక శిరస్సువఱకు వ్యాపించియుండును. ఈ రెండును ముందుపై పున కలసికొనును. వెనుకపై పున వీనికి నడుమ త్రికాస్థియుండును. ఇట్లు వెనుకముందు కలసికొనియేర్పడిన చట్టమునకు శ్రోణిచక్ర (Pelvic girdle) మని పేరు. దానిలోనుండు గుటస్థలమునకు వస్తిగుహ (Pelvic carty) అని పేరు. ఈవస్తిగుహ పురుషులకు లోతుగను చిన్నదిగను ఉండును. స్త్రీలకు వెడల్పుగను పెద్దదిగను ఉండును. స్త్రీపురుషుల శ్రోణిఫలకముల నిర్మాణమందు భేదముండుటవలన వారివారి వస్తిగుహలలోగూడ నిట్టిభేదములు కానవచ్చుచున్నవి. శ్రోణిఫలక నిర్మాణమునందు చిన్నతనమున వేఱువేఱుగ మూడు అస్థులున్నట్లును వయస్సువచ్చినతరువాత ఈ మూడునుకలసి యొకటియైయున్నట్లును కానవచ్చును. వంక్షణోలూఖలమందు గల రేఖలచే ఈ మూడు అస్థులు కలసిన తావులు సూచింపబడును. ఆ మూడు అస్థు లేవియన (I) జఘనకపాలము (Ilium). ఇది శ్రోణిఫలకముయొక్క పై భాగము. విప్పబడిన రెక్కవలె నుండును. (II) కుకుందురాస్థి (Ischium). ఇది క్రిందిభాగమున కుకుందరపిండముతో కూడియున్నది. (III) భగాస్థి (Os Pubis). ముందుండు భాగము.

ఈ మూడుభాగములను మానవుడు ప్రౌఢవయస్కుడయినప్పుడు కలుసుకొని ఒక ఎముకయగును. వాని సంధిరేఖలు మూడునుగూడ లోపించును. అయినను వర్ణనసౌకర్యముకొరకు ఈమూడుభాగములను విడివిడిగా వర్ణించెదము. కాని సమగ్రమైన అనగా పై మూడును కలసి ఏకమైన శ్రోణిఫలకమునందు ఈక్రింది రెండు విశేషములను గమనింప నగును.

౧. వంక్షణోలూఖలము (Acetabular-cavity).

౨ శ్రోణిగవాక్షము (Obturator Foramen).

౧. వంక్షణోలూఖలము :—ఇది శ్రోణిఫలకముయొక్క వెలుపలిభాగమునందు నడుమనుండునట్టి లోతగుగుంట. ఉలూఖలాకారము అనగా రోలులోని గుంటవంటి ఆకారముగలది. అందునడుమ స్నాయుబంధనములతోగూడిన ఊర్వస్థి శిరస్సు సంధించును. గుంట అంచున తత్సంధిబంధన స్నాయుకోశము చుట్టును అంటియుండును. బాల్యదశయందు ఈగుంటమధ్యమున

పైనజెప్పబడిన రేఖాత్రయము, అనగా ఈ ఎముక మూడు భాగముల కూడికయయినట్లు సూచించు రేఖలు కానవచ్చును.

౨. శ్రోణిగవాక్షము:— భగాస్థికుకుంద రాస్థులచే అండాకృతిగల గవాక్షముగ నేర్పడిన తొఱ్ఱ. మానవుడు బ్రతికియున్నప్పుడు నీతొఱ్ఱపై పలుచని పొర యొకటి కప్పియుండును. ఇది పురుషులకంటె స్త్రీలకు చిన్నది. మఱియు త్రికోణాకారముగనుండును.

ఇక మూడుభాగములను వివరించెదము :

I. జఘనకపాలము:—ఇది శ్రోణిఫలకమునందు రమారమి సగముభాగ ముండును. ఇందు రెండుభాగములు కలవు. 1. జఘనపక్షము. 2. ఉలూఖలాంశము.

జఘనపక్షము:— ఇది పై భాగమున నుండు విశాలమైన భాగము. జఘనకపాలముయొక్క ముఖ్యమైన భాగము. దీనికి రెండు ప్రక్కలు కలవు. వెలుపలి ప్రక్కకు జఘనపృష్ఠమని పేరు. అందు నితంబపిండికలు (Glutial muscles), అను మూడు కండలు పుట్టును. అచ్చట నామూడుకండలు పుట్టు స్థానములను మూడురేఖలు విభజించి చూపును. లోపలి ప్రక్క జఘనోదరము (Iliac cavity). దీని మధ్య కొంచము గొయ్యిగ నుండును. అచ్చట కోష్ఠభూమికా (శ్రోణిపక్షిణి) అను కండ (Iliacus) పుట్టును. లోపలిప్రక్క క్రిందిభాగమున వస్తికుహరమునకు పైహద్దగు స్థూలోన్నతమైన రేఖయొకటి కలదు. దానికివస్తికంఠము అని పేరు.

జఘనపక్షమునకు చుట్టునుండు అంచునకు జఘనధార అని పేరు. దీనిని మూడుభాగములుగ విభజింపవచ్చును. ౧ పురోధార, ౨ జఘనశిరము, 3 పశ్చిమధార

౧. పురోధార:— ముందంచు. ఈ అంచునందు రెండుకంటకములుగలవు. ఒకటిపైది. పురోర్ధ్వకంటకము. దీని క్రిందిభాగమున దీర్ఘయామా (Sartorius) అను కండపుట్టును. రెండవది క్రిందిది. పురోధరకంటకము. దీని వెలుపలిభాగమున ఊరుపిండికా(Rectus Femoris) కండ పుట్టును.

౨. జఘనశిరము:—ఇది జఘనపక్షముయొక్క అంచునందు పైభాగము. దీనికి రెండు పెదవులును, మధ్యరేఖయు కలవు. లోపలి పెదవికి కోష్ఠప్రదేశకళయు, ఉదరచ్ఛదా, పృష్ఠవంశధర, కటిచతురస్ర, శ్రోణిపక్షిణి (కోష్ఠభూమికా) అను కండ లంటియున్నవి. వెలుపలి పెదవికి ఊర్వంతరకళోత్తంసినీ, ఉదరచ్ఛదాబాహ్యతిరశ్చీనా, కటిప్రచ్ఛదా అను కండలును అంటియున్నవి. మధ్యరేఖకు ఉదరచ్ఛదా అంతరాతిరశ్చీనా అను కండ అంటి యున్నది.

3. పశ్చిమధార:—వెనుకంచు. దీనియందు గూడ రెండు అగ్రములుగలవు. పశ్చిమ ఊర్ధ్వకంటకము, పశ్చిమఅధరకంటకము. అధరకంటకమునకును కుకుందరకంటకమునకును మధ్యను తోరణమువలె నొకస్నాయువు అంటియుండుటచే అక్కడ నొకరంధ్రము ఏర్పడుచున్నది. ఈరంధ్రమునకు గృధ్రసీద్వారము Great Sacro-sciatic Notch) ని పేరు. అందుండి గృధ్రసీనాడియు దానివెంట వచ్చు సిరాధమన్యాదులును, కుండికా అను కండయు నిర్గమించును.

2. వంక్షణోలూఖలాంశము:— జఘనకపాలమునకు పీఠమువంటిది, వంక్షణోలూఖలము లోని భాగము (పైన చూడుము)

II. కుకుందరాస్థి (Ischium):—శ్రోణిఫలకముయొక్క క్రిందిభాగము. శ్రోణిగవాక్షముయొక్క క్రింది సగముఅంచును ఆక్రమించును. ఇందు మూడుభాగములుగలవు. ౧ వంక్షణఉలూఖలాంశము, ౨ కుకుందరపిండము. 3 కుకుందరశృంగము.

౧. వంక్షణ ఉలూఖలాంశము:—ఉలూఖలములో రమారమిసగముభాగము ఈభాగముయొక్క వెలుపలిప్రక్కచే నేర్పడియుండును. దీనిలోపలిప్రక్క వస్తిగుహయొక్క గోడలో చేరియుండును. దీని వెనుకభాగమునుండి ఒక త్రికోణాకారమైన కంటకము పెరిగియున్నది. దీనికి కుకుందరకంటకము అని పేరు. ఈకంటకము పై భాగమున గృధ్రసీద్వారము అను పెద్ద మొఱి గలదు. పైనచూడు. ఈ కంటకము క్రిందిభాగ

మననున్న చిన్న మొట్టికి కుకుందరద్వారము (Lessor Sacro-Sciatic Notch) అని పేరు. ఈ ద్వారముగుండ శ్రోణిగవాక్షిణీ అంతస్థా అనుకండయు దానివెంటవచ్చు సిరాధమనీ నాడులును వెలువడును. కంటకముయొక్క వెలుపలివైపున గమలసుఊర్ధ్వ అనుకండయు లోపలి వైపు అనుత్రికిక అను కండయుపుట్టును.




శ్రోణిఫలకము (కుడిప్రక్కది) లోపలివైపు.

1. పృష్ఠవంశధరా, 2. కటిచతురస్రా, 3. ఉదరచ్ఛదాసమా 4. జఘనపక్షము, జనభపక్షిణీకోరకు, 5. ఊరుపిండికా, 6. కటి లంబినిదీర్ఘా, 7. వస్తికంఠికా, 8. శ్రోణిగవాక్షిణీ ధమనీనాడులు, 9. రెండవవైపు భగాస్థితో సంధించుభాగము, 10. గుదోన్నమని, 11. మూత్రనాళసంకోచనీ, 12. శిశ్నమూలము, 13. శిశ్నవార్షిణి 14. 15. భగధమనీనాడీమార్గము, 16. గుదోన్నమనీ, 17. అనుత్రికికా, 18. శ్రోణిగవాక్షిణీ అంతస్థా, 19. త్రికాక్షిసంధిగుర్తు, 20. జఘనత్రికస్నాయుబంధనస్థానము.

౨. కుకుందరశృంగము:— ఇది కుకుందరపిండమునకు ముందువైపున పెరిగి యున్న కొమ్ము. భగాస్థియొక్క అధరశృంగముతో కలియును. ఇది శ్రోణిగవాక్షము యొక్క క్రింది అంచులోని భాగము. దీనివెలుపలిప్రదేశమునందు శ్రోణిగవాక్షిణీబహిస్థా ఊరుసంవ్యూహనీ గరిష్ఠా అను కండలు పుట్టును. దీనిలోపలిభాగము వస్తిగుహయొక్క ముందు గోడలోనిభాగముగా నేర్పడును.

3. కుకుందరపిండము:— ఇది ఉలూఖలాంశమునకు క్రిందిభాగము. కూర్చొనియుండునప్పుడు శరీరభారమును మోయుభాగము. దీనివెలుపలివైపుననుండు నొకఅగడ్త (గాడి) మీదుగా శ్రోణిగవాక్షిణీబహిస్థా అను కండయొక్క అగ్రము పోవును. ఈ వైపున ఊరు చతురస్ర, ఊరు సంవ్యూహనీ గరిష్ఠా అను కండలు పుట్టును. లోపలివైపు వస్తిగుహగోడలోచేరును. వెనుకవైపున పిండముయొక్క క్రిందిభాగముననుండి ఊరు సంవ్యూహనీగరిష్ఠయును, మిగిలిన భాగమున నుండి పైనుండి క్రిందికి వరుసగా కశాకల్పా, కండరాకల్పా, ద్విశిరస్క అనుకండలును పుట్టును.

III. భగాస్థి (Os Pubis) ఇది భగాదులకు ఆధారము. శ్రోణిఫలకముయొక్క ముందటిభాగము. దీనియందు మూడువిభాగములు గలవు. ౧. ముండము (శిరస్సు) ౨, ౩. రెండుకొమ్ములు: ఉత్తరశృంగము, అధరశృంగము.

౧. భగాస్థిముండము:— ఇది భగాస్థిమధ్యభాగము. దీనికి భగపీఠమనియు లింగపీఠమనియు పేర్లుగలవు. దీనిలోపలివైపున, రెండవవైపుననున్న భగాస్థితో సంధించుటకు ఏర్పడిన, ఎత్తుపల్లములుగల సంధిగుర్తుగలదు. ముండముయొక్క ముందువైపుననుండి అనేకకండలు పుట్టును. అందు ఊరుసంవ్యూహనిగుర్వీ, ఊర్వంతః పార్శ్వికా,

ఊరు సంవ్యూహనిలక్ష్వీ, శ్రోణిగవాక్షిణి బహిస్థా అను కండలభాగములు గలవు. ముండము యొక్క వెనుకవైపున గుదోన్నమని, శ్రోణిగవాక్షిణీ అంతస్థా అను కండలుగలవు. ఇచ్చటనే వస్తిసంబంధమైన కండరభాగములు కొంతఅంటియుండును. ముండము యొక్కపై అంచునందు భగాస్థి కంటకము (Spine) గలదు. ఈకంటకమునందు కొన్నిముఖ్యమైన స్నాయువులంటి యుండును. దీనిలోపలవైపుననే అంత్రవృద్ధి సాధారణముగా నేర్పడు రంధ్రముండును. ఈకంటకము వెలుపలివైపున నుండి వ్రైమొకయొత్తైనరేఖపోవును. ఈరేఖ వస్తి కంఠికలో చేరును. కంటకమునకు లోపలివైపున కూడ నొకగట్టు (Crest) గలదు. ఈగట్టునందు ఉదరచ్ఛదాసమా, అంతరతిరశ్చీన అను కండల అగ్రములు ఏకమై ప్రవేశించును. దీనివెనుకఅంచున ఉదరదండికా అను కండపుట్టును.

౨. ఉత్తరశృంగము. ముండమునకు వెనుకనుండి వచ్చి వంక్షణోలూఖలములో చేరుభాగము. ఇదియే శ్రోణిగవాక్షమునకు పై అంచుగా నేర్పడును. దీని పై భాగము వస్తిగుహాయొక్క ఊర్ధ్వప్రదేశముననున్న వస్తికంఠమను రేఖతో కలసి వస్తిగుహాయొక్క పై అంచులోని భాగముగా నేర్పడును.

3. అధరశృంగము :—భగాస్థిముండమునకు క్రిందివైపుననుండి వెలుపలివైపుగా వచ్చి కుకుందరాస్థి యొక్క అధరశృంగముతో కలసిపోవును. ఈరెండును చేరి శ్రోణిగవాక్షముయొక్క ముందుగోడ ఏర్పడును. దీని వెలుపలి ప్రక్కను ఊరు సంవ్యూహనులు (గరిష్ఠా లఘ్వీ)అనుకండలును శ్రోణిగవాక్షిణీ బహిస్థా అను కండయు పుట్టును. లోపలిప్రక్కను శ్రోణిగవాక్షిణీ అంతస్థా అను కండ పుట్టును. దీనిముందు అంచునందు శిశ్నహార్షిణీ అను కండయు శిశ్నమూలాదులను అంటియుండును.

అధశ్శాఖలు: రెండు - ఒక్కొక అధశ్శాఖయందు ఒక ఊర్వస్థి, ఒక జాన్వస్థి, రెండు జంఘాస్థులు ఏడు పాదకూర్చాస్థులు, అయిదు పాద మూలశలాకాస్థులు, పదునాలుగు పాదాంగుళ్యస్థులు మొత్తము ముప్పది ఎముకలు గ్రలవు.

ఊర్ధ్వస్థి (Femer). ఇది తొడలోని యెముక.

ఊర్వస్థి. ఇది శరీరమందలి యన్ని అస్థులలోను పొడుగైనది. గట్టిది. ఎక్కువభారమును సహించగలిగినది. ఇది సాధారణముగ గుండ్రముగను దండాకారముగను కొంచెము వంకరగను ఉండును. ఇది శ్రోణిపార్శ్వమునుండి కొంచెము వంకరగ మధ్యవైపునకువచ్చి జానుసంధిలో ప్రవేశించును. ఇందు ఊర్ధ్వప్రాంతము అధఃప్రాంతము కాండము అను మూడుభాగములు గలవు. ఊర్ధ్వప్రాంతము:దీని పైభాగమున గుండ్రటితల యొకటియు దానిక్రింద మెడ యొకటియు దానిక్రింద వెనుకభాగమున శిఖరాకారములగు రెండు ప్రవర్ధనకములును (మహాశిఖరకము లఘుశిఖరకము అనునవి) గలవు. వానిలో తల. ఇందువర్తులార్ధవ్యాపియగు సంధిగుర్తు యొకటి కలదు. ఇది వంక్షణసంధియందున్న ఉలూఖలమునం దిమిడియుండును. ఈ తలకు నడుమ నొక అగడ్తగలదు. అందు వంక్షణసంధిలోని స్నాయుబంధనములు ప్రవేశించును. మెడ. ఇది వంకరగానుండును. గుంట లోపలి భాగములను వెలుపలిభాగమును కలుపును. దీనికిని ఊర్ధ్వస్థికినిగల కోణము అనగా వంపు బాల్యమున ఎక్కువగనుండును. వయస్సు ముదిరినకొలది తగ్గును.

మహాశిఖరకము. ఇది ఎముకయొక్క కాండమునకు శిఖరమువంటిది. నాలుగుకోణములు గలది. దీని వెలుపలివైపు మిట్టపల్లములతో కూడినదై యుండును. ఇందుండి నితంబపిండికా మహతీ, నితంబపిండికా మధ్యమా అనుకండలు మధ్యభాగమునను కుండికా, గమలను, శ్రోణిగవాక్షిణీ అంతస్థా అనుకండలు పైభాగమునను నితంబపిండికాలఘ్వీ ఎదుటిభాగమునను, ఊరుచతురస్రికా వెనుకభాగమునను,ఊరుప్రసారిణి బహిస్థా క్రింది భాగమునను, శ్రోణిగవాక్షిణి బహిస్థా లోపలిభాగమునను అంటియుండును. నితంబపిండికలకును విషమాస్థి ప్రదేశమునకును మధ్య శ్లేష్మధరకలా పుటకము ఒకటి కలదు.

లఘుశిఖరకము:—మెడకు క్రింది ప్రదేశమున వెనుకభాగమున నున్న చిన్నప్రవర్ధనకము. ఇందు

కటిలంబినీ దీర్ఘా అను కండ ప్రవేశించును. దీనిక్రింద శ్రోణి పక్షిణీకండ ప్రవేశించును. ఈ రెండు శిఖరములకు నడుమ ముందువైపున శిఖరాంతరాలరేఖయు వెనుకవైపున శిఖరాంతరాళ కుద్యమును గలవు. వానియందు వంక్షణసంధిని కప్పియుండు స్నాయుకోశముయొక్క పూర్వపశ్చిమభాగము లంటియుండును. వెనుకవైపు కుడ్యమునుండి ఊరు చతురస్ర అను కండ పుట్టును. ముందు రేఖ పైభాగము మహాశిఖరముతో కలియుచోట ఒక మిట్టప్రదేశము కలదు. దీనికి ఊర్వర్బుదము అనిపేరు.

కాండము:—ఇది గుండ్రని గొట్టమువలె నుండును. పైభాగము మధ్యభాగమునకంటె కొంచెము వెడల్పుగను క్రిందిభాగము అంతకంటెను వెడల్పుగను కొంచెము చదునుగను ఉండును. కాండము మధ్యభాగమున కొంచెము ముందువైపునకు వంగియుండును. దీనికి మూడంచులును మూడుప్రక్కలును గలవు. ముందుప్రక్కనుండి ఊరుప్రసారణీ మధ్యస్థా అను కండ యుద్భవించును. వెనుకప్రక్కను మధ్యభాగమున ప్రాకారిక యను నొకగట్టు కలదు. ఈగట్టే వెనుకయంచు. మిగిలిన రెండంచులును క్రమముగ లోపలప్రక్కను వెలుపలిప్రక్కను గలవు.

ప్రాకారిక:—ఇది ఊర్వస్థియొక్క వెనుకభాగమున మధ్యప్రదేశమున పొడుగునను వ్యాపించియుండు గట్టు. ఈగట్టునకు లోపలివైపున నొకటియు వెలుపలివైపున నొకటియు రెండు పెదవులును, ఈ పెదవుల మధ్యభాగమున గరుకుగనుండు ప్రదేశమును గలవు. ప్రాకారికనుండి మూడురేఖలు ఈ వైపునకు వెడలును. అందు వెలుపలిది మహాశిఖరము వైపునకు పోవును. ఈరేఖలో నితంబ పిండికా గుర్వీ అను కండ ప్రవేశించును. మధ్యరేఖ శిఖరాంతరాళరేఖలో చేరును. దీనియందు పెక్టినియస్ అను కండ ప్రవేశించును. ప్రాకారిక ఊర్వస్థి క్రిందివైపునకుపోయి అచ్చట రెండు రేఖలగా విడిపోవును. అందులోపలిరేఖయొక్క కొనయందు ఒక స్ఫుటమైన అర్బుదము కలదు. అందు ఊరుసంవ్యూహనీగరిష్ఠా అను కండ ప్రవేశించును. లోపలి పెదవియందు ఊరు ప్రసారణీ అంతస్థయు వెలుపలి పెదవియందు ఊరుప్రసారణీబహిస్థయు, రెండు పెదవుల మధ్య




1. శిరస్సు, 2. మెడ, 3. శ్రోణిగవాక్షిణీ బహిస్థా. 4. మహాశిఖరకము, 5. నితంబపిండికా మధ్యమా, 6 ఊరుచతురస్ర, 7. కటిలంబినీదీర్ఘా, 8. పెక్టినియస్ 9. క్షోణిభూమికా రేఖ శ్రోణిపక్షిణి, 10. నితంబ పిండికా గుర్వీ, 11. ఊరుసంవ్యూహనీకనిష్ఠా, 12 ఊరుసంవ్యూహనీగరిష్ఠా, 13. ఊరుప్రసారిణి మధ్యస్థా, 14. ఊరుప్రసారిణిబహిస్థా, 15. ఊరుసంవ్యూహనీదీర్ఘా, 16. ఊరుప్రసారిణి అంతస్థా, 17. ద్విశిరస్కహ్రస్వమూలము, 18. జంఘపిండికాలఘ్వీ, 19. జంఘాపిండికాగుర్వీ, 20. వెలుపలి మహార్బుదము, 21. జానుపృష్ఠికా, 22. లోపలి మహార్బుదము, 23. వెలుపలి ఉపార్బుదము, 24 లోపలి ఉపార్బుదము, 25. అర్బుదాంతరాలఖాతము.

34-వ పటము.




1. శిరస్సు, 2. మెడ, 3. మహాశిఖరకము, 4, 5. శ్రోణిగవాక్షిణీ అంతస్థా, గఘలముకుండికా, 6. నితంబ పిండి కాగుర్వీ, 7. ఊరుప్రసారిణీబహిస్థా, 8. లఘు శిఖరకము, 9. కటిలంబినీదీర్ఘా, 10. ఉలూఖలాంతర స్నాయువు, 11. ఊరుప్రసారిణి, 12. లోపలిమహార్బుదము, 13. లోపలి ఉపార్బుదము, 14. వెలుపలి ఉపార్బుదము, 15. వెలుపలి మహార్బుదము, 16. జాను. సంధిగుర్తల, 17. ఊరుప్రసారిణి మధ్యమా.

రేఖయందు ఊరు సంవ్యూహానిగరిష్ఠయు ప్రవేశించును ఊరుప్రసారణీబహిస్థకును, ఊరు సంవ్యూహానీగరిష్ఠకు మధ్య పైభాగమున నితంబపిండికయు క్రిందిభాగమువ ద్విశిరక్కయు, ప్రవేశించును. ఊరు ప్రసారణీ అంత స్థకును ఊరు సంవ్యూహానీగరిష్ఠకును మధ్య పైనుండి క్రింది కి శ్రోణిపక్షిణీ, పెక్టినియెస్, ఊరు సంవ్యూహానీక నిష్ఠా, ఊరు సంవ్యూహానీ దీర్ఘా అను కండలు గలవు.

మూడుఅంచులు:— వెనుకప్రక్క వర్ణింప బడియుండు గట్టు. వెనుకఅంచు, వెలుపలియంచు మహాశిఖరముముందఅనుంను క్రిందికోణమునుండి వెలుపలి మహార్బుదముయొక్క ముందుకొనవరకును వ్యాపించును. లోపలియంచు లఘు శిఖరకమువద్ద శిఖరాంత రాళ రేఖనుండి పుట్టి లోపలి మహార్బుదముయొక్క ముందంచువరకును వ్యాపించును.

మూడు ప్రక్కలు: ముందు ప్రక్క. ఈ ప్రక్కను పై ముప్పాతికభాగమందు ఊరుప్రసారణీ మధ్యస్థా అంటియుండును. వెలుపలి ప్రక్క. ఈ ప్రక్కను గూడ పై ముప్పాతిక భాగమున ఊరుప్రసారణీ మధ్యస్థా అను కండయే యుండును. లోపలి ప్రక్క ఈ ప్రక్కను ఊరుప్రసారణీ అంతస్థా అను కండ కప్పియుండును.

అధఃప్రాంతము. క్రిందిభాగము. ఇందు రెండు మహార్బుదములును, ఒక అర్బుదాంతరాళఖాతమును, రెండు ఉపార్బుదములును గమనింపనగును.

మహార్బుదములు. ఇందు ఒకటిలోపలిది. రెండవది వెలుపలిది. ఈ రెండును జానుసంధిలో చేరును. ఈ రెండిటికి మధ్య వెనుకవైపున పెద్దకనుమ గలదు. మహార్బుదముల వెనుక భాగముననే జంఘా పిండికా అను కండయొక్క రెండుకొనలును పుట్టును. బాహ్యార్బుదముయొక్క వెనుకప్రక్కను, జానుపృష్ఠికా అను కండగూడ పుట్టును. రెండు మహార్బుదముల నడుమ ముందుభాగమున త్రిభుజప్రాయమైన సంధిగుర్తు ఒకటి కలదు. జాన్వస్థియొక్క వెనుకప్రక్క ఇచ్చట సంధించును.

ఉపార్బుదములు. మహార్బుదముల నంటి రెండు వైపులను ఒక్కొక ఉపార్బుదము కలదు. వీనికి జాను

సంధి సంబంధమైన స్నాయువులు కట్టబడి యుండును.

జాన్వస్థి (Patella) దీనినే మోకాలుచిప్ప యందురు. ఇది మోకాలికి ఎదుట గుండ్రముగ నుండును. కపాలాస్థి అనగా పలకవంటి యెముక. ఇది ఊరుప్రసారిణీ కండలు కలసి యేర్పడిన కండరాగ్రమునందుండు పెద్ద చణకాస్థి (Sesamoid bone) యని కొందటిమతము. జాన్వస్థి ముందుభాగము కొంచెము మిట్టపల్లముగ నుండును. ఊరుప్రసారిణీ కండయొక్క అగ్రము ఇచ్చటనే ప్రవేశము గనును. వెనుకభాగమున నడుమ నెత్తుగ నుండును. ఇందు సంధిగుర్తు ఒకటి కలదు. ఈ సంధిగుర్తు నందు పై సగము ఊర్వస్థియొక్క క్రిందిభాగమునందు ముందువైపుననుండు త్రికోణాకారమైన సంధిగుర్తుతో సంధించును. క్రిందిసగము జంఘాస్థియొక్క పైభాగమున ముందటివైపుతో సంధించును. ఈ జానుకపాలము చుట్టును జానుసంధిని ముందువైపు కప్పునట్టి పురోచ్ఛాదకము అను స్నాయుసంబంధమైన పైకప్పు చుట్టుకొని యుండును.

జంఘాస్థులు. (Leg Bones) ఇవి పిక్కయెముకలు. ఇవి రెండు: జంఘాస్థి (Tibia), అను జంఘాస్థి (Fibula).

జంఘాస్థి, శరీరమందలి యన్ని అస్థులలోను, తొడయెముక తరువాత నిదియే పొడుగైనది. ఇది నలకాస్థి. పిక్క ఎముకలలో లోపలివైపుది.

ఊర్ధ్వప్రాంతము. పైభాగము నడిమిభాగము కన్నను క్రిందిభాగమునకన్నను, వెడల్పుగ నుండును. దానికి రెండుప్రక్కలను రెండు ఉత్సేకములు (లావులు) కలవు. వీనికి బహిఃకందము (Lateral condyle) అంతఃకందము (Medial condyle) అని పేళ్లు. వీని పై భాగమున నున్న సంధిప్రదేశమున రెండు స్ఫుటములైన సంధిగుర్తులు కలవు. అవి ఊర్వస్థియొక్క క్రిందిభాగమున నున్న మహాగ్బుదములతో సంధించును. ఈ రెండు సంధిచిహ్నములకు నడుమ ద్విముఖమను కంటకము గలదు. దీని ముందు వెనుకల నుండు గుంటలలో జానుసంధిలో నున్న అర్ధచంద్రాకారము లగు రెండు తరుణాస్థులు అంటియుండును. వెనుకవైపు అంచులో పిక్క వెనుకనుండు కండలు ప్రవేశించును.

కాండము. మధ్యనళికము. ఇందు మూడు అంచులు గలవు. లోపలిఅంచు చర్మముక్రింద చేతికి తగులుచుండును. వెలుపలిఅంచునందు జంఘాంతరాళా అను కళ అంటియుండును. ఈ అంచు రెండు ఎముకల మధ్య నుండును. వెనుక అంచునందు పిక్కయొక్క వెనుక వైపుననుండు కండ లంటియుండును.

అధఃప్రాంతము. క్రిందిభాగము. పైభాగము కంటె వెడల్పు తక్కువ. దీని వెనుకభాగమున వెలుపలి వైపున లోతులేనికాలువ యొకటి కలదు. ఇందు అంగుష్ఠసంకోచనీదీర్ఘా (Flexor Longus Hellucis)అను కండయొక్క అగ్రము ఇమిడియుండును. ఈభాగమున వెలుపలివైపున త్రిభుజాకారమగు సంధిగుర్తు కలదు. అది అనుజంఘాస్థియొక్క క్రిందిభాగముతో సంధించును. అధఃప్రాంతమున క్రిందివైపున ఖాతోదరమైన (గొయ్యివలెనుండు) సంధిగుర్తు ఒకటి కలదు. ఇందు కూర్చశిరస్సు సంధినొందును. క్రిందిభాగమున లోపలి వైపున ఒక ప్రవర్ధనకము కలదు. దీనికి అంతర్గుల్ఫ అని పేరు. దాని వెలుపలివైపున నొక సంధిగుర్తు గలదు. అది కూర్చశిరస్సుయొక్క లోపలిభాగముతో సంధించును. ఈప్రవర్ధనకముయొక్క వెనుకభాగమున వెడల్పుగ నున్న కాలువ యొకటి కానవచ్చును. అందు జంఘానుగ (Tibialis Posticus) పాదాంగుళీ సంకోచనీదీర్ఘా (Flexor Digitorum Longus) అను కండలయొక్క అగ్రములు ఉండును. ఈ ప్రవర్ధనమునకే గుల్ఫసంధి బంధనస్నాయువు లంటియుండును.

అనుజంఘాస్థి. (Fibula) జంఘాస్థికి మీదను క్రిందను అంటి పొడుగగుకఱ్ఱవలె నుండును. దీని పొడవును బట్టి చూడ నిది అన్నియెముకలకంటె సన్నది. నలకాస్థి.

ఊర్ధ్వప్రాంతము. పై భాగము. జంఘాస్థియొక్క పైభాగముతో దాని వెలుపలివైపున వెనుకభాగమున సంధించును. దీనికి వెలుపలివైపున నొక ప్రవర్ధనకము కలదు. దానియందు జానుసంధిబంధనీదీర్ఘస్నా

35-వ పటము.

జంఘాస్థి (ముందుప్రక్క).




1. ఊర్ధ్వప్రాంతము, 2. కాండము, 3. అధఃప్రాంతము, ఊర్ధ్వప్రాంతమున, 4. అంతఃకందము, 5. బహిఃకందము, 6. ద్విముఖమనుకంటకము, 7. జానుస్నాయువుసంధించు ప్రవర్ధనకము, 8. కండరాకల్పా ఊర్వ్యంతః పార్శ్వకా, 9. దీర్ఘయామా, 10. జంఘా పురోగా, 11. 12. అనుజంఘాస్థి శిరస్సు, 13. శృంగము, 14. జానుసంధి బంధనస్నాయువు, 15. ద్విశిరస్క, 16. పాదవివర్తినీదీర్ఘా, 17. పాదాంగుళిప్రసారిణీదీర్ఘా, 18. పాదాంగుష్ఠప్రసారిణిదీర్ఘా, 19. పాదవివర్తినీ హ్రస్వా, 20. పాదవివర్తనీకనిష్ఠా, 21. అనుజంఘాస్థియొక్క అధఃప్రాంతము, బహిర్గుల్ఫ 22-4 అంతర్గుల్ఫ.

36-వ పటము.

ఊర్వస్థితో సంధి.




కూర్చశిరస్సుతో సంధి.

జంఘాస్థి. వెనుకప్రక్క.

1. కలాకల్ప,
2. జంఘాపిండికామధ్యమా
3. జానుపృష్ఠికా
4. జంఘానుగా
5. పాదాంగుష్ఠసంకోచని
6. పాదవివర్తినీదీర్ఘా, హ్రస్వావీనిమార్గము
7. పాదాంగుళీసంకోచనీదీర్ఘా
8. పాదాంగుష్ఠసంకోచనీమార్గము
9. పాదాంగుళిసంకోచనీదీర్ఘా, జంఘానుగా వీని మార్గము.

యువు సంయోగమగును. ఈప్రవర్ధనకముయొక్క వెనుక భాగమునుండి యొక శృంగముపై పైపునకు పెరుగును. ఇది ద్విశిరస్క (Biceps) అను కండరమును జానుసంధి బంధనీహ్రస్వస్నాయువునకును సంయోగస్థానము.

కాండము. నడిమిభాగము. దీనికి నాలుగు ప్రక్కలును నాలుగు అంచులును కలవు. దీని లోపలి భాగమందు కత్తి అంచువంటి రేఖ యొకటి కలదు. దీనియందు జంఘాంతరాళా అను కళ సంయోగము నొందును. పిక్క కండలు ఎనిమిది ఈ కాండమునకు సంబంధించి యున్నవి.

అధఃప్రాంతము. క్రిందిభాగము. ఇందు బహిర్గుల్ఫ అనగా వెలుపలి చీలమండ గలదు. ఇది అంతర్గుల్ఫకంటె క్రిందుగా నుండును. దీని లోపలిప్రక్కను ముందుభాగమున త్రిభుజాకారమైన సంధిగుర్తు కలదు. అది కూర్చశిరస్సుతో కలియును. ఇచ్చటనే వెనుక వైపుగా నింకొక సంధిగుర్తు కలదు. అది జంఘాస్థియొక్క క్రిందిభాగమందు వెలుపలివైపుతో కలియును. దీని వెనుక గాడివంటికాలువ కలదు. అందు పాదవివర్తినీ (Peroneus Longus) కండయొక్క అగ్రముపోవును. ఈ భాగముచుట్టును వెలుపలి చీలమండ సంబంధమైన స్నాయువు చుట్టుకొనును.

పాదకూర్చాస్థులు (Tarsal bones). ఇవి

పాదకూర్చాస్థులు

పాదముయొక్క వెనుకభాగమునకు ఆధారముగానైన యస్థులు. ఇవి స్థూలములు (లావువి), హ్రస్వములు (పొట్టివి), విషమములు (ఎత్తుపల్లములు గలవి). ఒక్కొకపాదమునందు ఏడు ఉండును. వీనికే పాదమూలశలాకాధిష్ఠానాస్థులని పేరు. ఈయేడింటికిని ఏడు పేళ్లు కలవు. కూర్చశిరస్సు (Astrogalus), పార్ష్ణి (Calcaneus), నౌనిభ (Navicular), ఘన (Cuboid), అంతఃకోణక (Internal cuniform), మధ్యకోణక (Middle cuniform) బహిఃకోణక (External cuniform).

కూర్చశిరస్సు. అన్ని కూర్చాస్థులకును మీదనుండు గుండ్రని యెముక. జంఘాస్థులను పాదమును కలుపును. దీనికి తల, మెడ, మధ్య అను మూడు భాగములు కలవు. దీనితల గుండ్రముగను స్వచ్ఛప్పృష్ఠముగను ఉండును. పైని సంధిలాంఛనము కలదు. అది జంఘాస్థి క్రిందిభాగమున సంధించును. దీని క్రిందిభాగమున లోతగు కాలువ కలదు. అందు సంధిస్నాయువులు పోవును. దీని క్రిందిప్రక్కను మడియొక సంధిగుర్తు కలదు. అది పార్ష్ణి శిరస్సుతో సంధి కలుగజేయును. లోపలి వెలుపలి భాగములందు రెండు సంధిగుర్తులు కలవు. ఇవి గుల్ఫలసంధానమునకు అనగా చీలమండలను కలుపుట కుపయోగపడును. దీని ముందుభాగమందును ఒక సంధిగుర్తుకలదు. అది నౌనిభ మను కూర్చాస్థితో సంధానమునొందును.

పార్ష్ణి. మడిమయెముక. పాదకూర్చాస్థులలోనిది మిక్కిలి పెద్దది. ఇది పాదమునకు క్రిందివైపునను వెనుక భాగమునను ఉండును. శరీరభారమునంతయు వహించి శరీరమును భూమిపై నిలుపును. దీనిపై భాగమందు రెండు సంధిగుర్తులు కలవు. అవి కూర్చశిరస్సుతో సంధించును. ఈరెంటినడుమ లోతగు అగడ్త కలదు. అందు సంధిస్నాయువులు ప్రవేశించును. ఈయెముక ముందుభాగము విషమము, హ్రస్వము. వెనుకభాగముకూడ కొంచెము విషమము, దీర్ఘము. దీని లోపలిభాగమందు వెదవివంటి ప్రవర్ధనకము ఒకటికలదు. దీనికి పార్ష్ణోష్ఠము అని పేరు. దీనిపైనున్న యొక సంధిగుర్తు కూర్చశిరస్సుతో కలియును. ఈప్రవర్ధనమునకు క్రింద లోతుగల అగడ్త కలదు. పాదతలమునందలి శిరాధమనీనాడీకండరాదులిందుండును. ఈ అస్థినంటి ఎనిమిదికండలుగలవు. ఏడు క్రిందిభాగమందును ఒకటి వెనుకభాగమందునుకలవు.

నౌనిభము. పాదముయొక్క లోపలిభాగమున నుండును. ఇది నావవలె నుండును. దీని వెనుకభాగము గుంటగానుండును. అందు కూర్చశిరస్సుయొక్క ముందుభాగము సంధించును. దీని ముందుభాగము ముందువైపున కొంచె ముబ్బుగానుండును. అందు మూడు సంధిగుర్తులు కలవు. క్రమమున నివి కోణకము లనబడు మూడు కూర్చాస్థులతో సంధించును. దీని లోపలిభాగమున నుండు నొక అర్బుదమునందు జంఘానుగకండయొక్క అగ్రములో కొంతభాగము ప్రవేశించును.

37-వ పటము.



కుడిపాదము. (పైవైపు).

1. కూర్చశిరస్సు, 2. పార్ష్ణి, 3. నౌనిభము, 4. అంతఃకోణకము, ౕ. మధ్యకోణకము, ౦. బహిఃకోణకము, 7. ఘనము, 8. పాదాంగుళిప్రసారిణీహ్రస్వా, 9. పాదవివర్తనీ హ్రస్వా, 10. పాదవివర్తనీ కనిష్ఠా, 11, 12, 1౩, 14, 15, పాదాంగుళి మూలశలాకలు. 16, 17, 18. పాదాంగుళ్యస్థులు, 19. పాదాంగుళి ప్రసారిణీహ్రస్వా, 20. పాదాంగుష్ఠ ప్రసారిణీదీర్ఘా, 21. పాదాంగుళిప్రసారిణీహ్రస్వా దీర్ఘా, 22. పాదపృష్ఠాస్థ్యంతరములు, ఈపటములో 7, 8, నెంబర్లు దిద్దవలెను.



38-వ పటము. కుడిపాదము (క్రిందివైపు)

1. కూర్చశిరస్సు, 2. పార్ష్ణి, 3. నౌనిభము, 4. అంతఃకోణకము, 5. మధ్యకోణకము, 6. బహిఃకోణకము, 7. ఘనము, 8. పాదాంగుళిమూలశలాకలు, 9, 10, 11. పాదాంగుళ్యస్థులు, 12. జంఘానుగా, 13. పాదాంగుష్ఠసంకోచనీ హ్రస్వా, 14. పాదవివర్తనీ దీర్ఘాయుండుకాలువ, 15. జంఘాపురోగా, 16. పాదాంగుష్ఠాంతరీవర్తనీ, 17. పాదతలాస్థ్యంతరములను కండలు, 18-19, పాదాంగుష్ఠసంకోచనీహ్రస్వా, పాదాంగుష్ఠాంతవివర్తనీ వీనిసంయుక్తాగ్రములు. ఇచ్చట రెండు చణకాస్థులుగలవు. 20 కనిష్ఠికాసంకోచనీహ్రస్వా కనిష్ఠికా బహిర్వివర్తనీవీటిసంయుక్తమూలము, 21. పాదాంగుళిసంకోచనీహ్రస్వా 22 పాదాంగుళిసంకోచనీ దీర్ఘా, 23. పాదాంగుష్ఠసంకోచనీదీర్ఘా.

అంతఃకోణకము. ఇది త్రిభుజాకారము. అంగుష్ఠమూలశలాకకు ఆధారము. దీని లోపలివైపున పైన తోలుమాత్ర ముండును. ముందరివైపు లోపలి కోణమువద్ద జంఘాపురోగ అను కండయొక్క అగ్రములో కొంతభాగము ప్రవేశించును. వెలుపలివైపున రెండు సంధిగుర్తులు కలవు. అవి తర్జనీమూల శలాకామూలముతోను మధ్యకోణక పార్శ్వముతోను సంధించును. ఈవైపున పాదవివర్తనీకండయొక్క అగ్రములోని కొంతభాగమును కొన్ని స్నాయువులును అంటియుండును. దీని ముందువైపున పెద్దదియు జీడిమామిడిగింజ ఆకారము గలదియు నగు సంధిగుర్తు కలదు. అది అంగుష్ఠమూలశలాకామూలముతో సంధించును. దీని క్రిందివైపున నొక అర్బుదము కలదు. అందు జంఘాపురోగ (Tibialis Anticus) జంఘానుగ (Tibialis Posticus) అను కండల అగ్రములు ప్రవేశించును.

మధ్యకోణకము. తర్జనీమూలశలాకమూలమునకు దగిలియుండును. పాదకూర్చాస్థులలో మిక్కిలి చిన్నది. త్రిభుజాకారము. దీని ముందువైపున నున్న సంధిగుర్తు తర్జనీమూలశలాకతో సంధించును. ప్రక్కననున్న రెండు సంధిగుర్తులు క్రమముగ అంతఃకోణ బహిఃకోణ కూర్చాస్థులతో సంధించును. వెనుకవైపున చిన్న సంధిగుర్తు కలదు. అది నౌనిభముతో కలియును. క్రింది ప్రక్కను గఱుకుగనుండును. అందు కొన్ని స్నాయువులును, జంఘానుగకండయొక్క అగ్రమునందు కొంత భాగమును అంటియుండును.

బహిర్గకోణకము. మధ్యమమూల శలాకామూలమునకు ఆధారము. త్రిభుజాకారము. అది ముందువైపున మధ్యమమూలశలాకామూలముతో సంధించును. వెనుకవైపున కొంతభాగము నౌనిభముతో సంధించును. లోపలివైపున వెనుకభాగమున మధ్యకోణకముతోను ముందుభాగమున తర్జనీమూలశలాకతోను సంధించును. వెలుపలివైపున వెనుకభాగమున ఘనాస్థిభాగముతోను, ముందువైపున అనామికమూల శలాకమూలముతోను సంధించును. క్రిందివైపున జంఘానుగ కండయొక్క అగ్రమునందలి కొంతభాగమును, పాదాంగుష్ఠసంకోచనీకండలో కొంతభాగమును ప్రవేశించును.

ఘనము. ఇది ఘనాకారముగ నుండును. పాదమునకు వెలుపలివైపున నుండును. కనిష్ఠికా, అనామికా మూలశలాకలకు అధిష్ఠానభూతము. దీనికి ముందువైపున ద్విభాగవిభక్త మగు సంధిలాంఛన మొకటి కలదు అది కనిష్ఠికా అనామికా మూలశలాకల మూలములతో సంధించును. ఇది వెనుకవైపున పార్ష్ణిముఖముతో సంధించును. అందునకై ఇచ్చట స్ఫుటమైన సంధిగుర్తు కలదు. బహిఃకోణక మను కూర్చాస్థితో సంధించు నిమిత్తము ఈ యెముక లోపలివైపున సంధిగుర్తు కలదు. ఈ వైపుననే సాధారణముగ వెనుకభాగమున నొక సంధిగుర్తు కానవచ్చును. అది నౌనిభముతో సంధించును. క్రిందివైపున స్ఫుటమైన అగడ్త కలదు. అది పాదవివర్తనీదీర్ఘా అను కండయొక్క అగ్రమును ధరించును. ఈఅగడ్తయొక్క వెనుకభాగమున నుండు గట్టునందు పార్ష్ణిఘనసంబంధస్నాయువు లంటియుండును. ఈగట్టు వెలుపలియంచున నొక అర్బుదము గలదు. ఆయర్బుదము నందుండు సంధిగుర్తు పాదవివర్తనీ కండరాగ్రమునం దుండు చణకాస్థితో సంధించును. ఈవైపుననే వెనుకభాగమునందు అంగుష్ఠసంకోచనీ హ్రస్వాకండయొక్కయు పాదవివర్తనీ కండయొక్కయు అగ్రములలో కొంతభాగము ప్రవేశించును. పైవైపున గఱుకుగ నుండి అనేక స్నాయువులంటియుండును. వెలుపలివైపున పాదవివర్తన కండరాగ్రముపోవు అగడ్తయొక్క ప్రారంభము కానవగును.

పాదాంగుళీమూల శలాకలు. Metatarsal bones. కాలివ్రేళ్ల యెముకలకు వెనుకభాగమున దగిలి, వానికి ఆధారములై యుండు ౫ ఎముకలు. ఇవి తమ వెనుకభాగమున కూర్చాస్థులతో కలసియుండును. ఇవి ప్రపదమునకు అనగా పాదముయొక్క ముందుభాగమునకు ఆధారములు. వీనికి బొటనవ్రేలివైపునుండి ఒకటవ రెండవ మొదలైన నామములు కలవు. వానివివరము.

పాదాంగుళీ మూలశలాకాస్థులు

మొదటిది అంగుష్ఠమూలశలాక. ఈశలాకలలో నిది మిక్కిలి స్థూలమైనది. మిక్కిలి పొట్టిది. దీనిచే ప్రపదముయొక్క అంతస్సీమ నిర్మింపబడును. ఇది వెనుకవైపున అంతఃకోణకముతో సంధించును. దీనిశిరస్సు, నడుమ రెండుఅగ్గడ్తలు కలవు. వీనిలో పాదాంగుష్ఠ సంకోచనీకండ యొక్క కండరములోని చణకాస్థులు రెండు ఉండును. శిరస్సు అంగుష్ఠము యొక్క మొదటికణుపు ఎముకతో సంధించును.

రెండవది తర్జనీ మూలశలాక. ఇది ఈ కూర్చాస్థులలో మిక్కిలి పొడుగైనది. దీనితల రెండవ వ్రేలి మొదటికణుపు ఎముకయొక్క మూలముతో సంధించును. దీనిమూలమున మూడు సంధిగుర్తులు గలవు. ఈ మూడును కోణకములను మూడు పాదకూర్చాస్థితోను వరుసగ సంధించును.

మూడవది మధ్యమమూలశలాక. దీనితల మధ్యమాంగుళియొక్క మొదటికణుపు ఎముకయొక్క మూలముతో సంధించును. దీనిమూలమునందు నాలుగు సంధిచిహ్నములు కలవు. అందు లోపలి భాగమందలి రెండు సంధిగుర్తులు తర్జనీమూలశలాక ప్రక్కలతోను, వెలుపలిది యొకటి అనామికామూలశలాక ప్రక్కతోను, నడిమిది యొకటి బాహ్యకోణక మనుకూర్చాస్థితోను సంధించును.

నాల్గవది అనామికామూలశలాక. ఇది మూలమునందు ఘనము, బాహ్యకోణకమను కూర్చాస్థులతోను, ప్రక్కలందు కనిష్ఠాతర్జనీ మూలశలాకల పార్శ్వములతోను సంధించును.

అయిదవది కనిష్ఠామూలశలాక. మూలమునందు వెలుపలిభాగమున దీనికి స్థూలార్బుదము కలదు. దీనిమూలమున రెండు సంధిగుర్తులు ఉండును. ఒకటి త్రిభుజాకారము గలది ఘన మను కూర్చాస్థితోను, రెండవది అనామికామూలశలాకా పార్శ్వముతోను సంధించును.

పాదాంగుల్యస్థులు. (Phalanges) అనగా కాలివ్రేళ్ల ఎముకలు. ఇవి యొక్కొకకాలికి 14 పదునాలుగు ఉండును. బొటనవ్రేలికి రెండు, మిగిలిన నాలుగువ్రేళ్లకు ఒక్కొకదానికి మూడు చొప్పున నుండును. వీనిని మూడువరుసలుగ విభజింపవచ్చును. అందు, మొదటివరుసలో 5, నడిమివరుసలో 4, మూడవవరుసలో 5 ను ఉండును. మూడవ వరుసలోని యెముకల నంటి గోళ్లుండును, అంగుష్ఠమున మూడు ఎముకలు లేవు. సామాన్యముగా పాదాంగుళ్యస్థులు కరాంగుళ్యస్థులను పోలియుండును. కాని పొట్టిగా నుండును. కాలి బొటనవ్రేలికి మాత్రము చేతిబొటనవ్రేలి కున్నంత స్వేచ్ఛాచలనము లేదు. ఈ భేదము వాని నంటియుండు కండల చేష్టలను బట్టి యుండును. కండల స్థానముల నిమిత్తమై పటము చూడుము.

పాదాంగుళ్యస్థులు

ఇంతవరకు మధ్యకాయము శాఖలనుగూర్చి వర్ణించియున్నాము. శిరస్సునుగూర్చి "శిరస్సు" అను శీర్షిక క్రింద చూడు.

---:o:---

## విశేషపదసూచిక

అంగుళ్యస్థి, అంగులీనలకము=Phalanges.
అంతఃకోణకము=Internal Cuniform.
అంతఃప్రకోష్ఠాస్థి=Ulna.
అంతర్మణికా=Styloid Process.
అంగులీసంకోచనీ అగ్రపర్వికా=Flexor profundus digitorum
అంగులీసంకోచనీ మధ్యపర్వికా=Flexor Sublimus-digitorum.
అంగుష్ఠప్రసారిణీ అగ్రపర్వికా=Extensor secundi internodii Pollicis.
అంగుష్ఠప్రసారిణీ ప్రథమపర్వికా=Extensor Primi Internodii Pollicis.
అంగుష్ఠమూలశలాక ప్రసారిణీ = Extensor Ossis Metacarpi Pollicis.
అంచు (ధార)=Border.
అంసకంఠికా=Omo Hyoid.

అంసకపాలికా=Scapula.
అంసకూటము=Acromian Process.
అంసచక్రము=Shoulder girdle.
అంసచ్ఛద (అంసపిండికా)=Deltoid.
అంసతుండము=Coracoid Process.
అంసతుండసంయోజినీ స్నాయువు = Coraco-acromial Ligament.
అంసఫలకము=Scapula.
అంసప్రాచీరకము=Spine of Scapula.
అంసపిండికా (అంసచ్ఛదా)=Deltoid.
అంసపీఠము=Glenoid Cavity.
అంసపృష్ఠము (ఉత్తర, అధర)=Supraspinous and Infraspinous fossae.
అంసపృష్ఠికా అధరా=Infraspinatus.
అంసపృష్ఠికా ఉత్తరా=Supraspinatus.
అంసశిరఃకోటరము=Suprascapular Notch.
అంసాంతరికా=Subscapularis
అంసాధరికా బృహతీ=Teres Major.
అంసాధరికా లఘ్వీ=Teres Minor.
అంసాపకర్షణిలఘు=Rhomboideus Minor.
అంసాపకర్షిణి బృహతి=Rhomboideus Major.
అంసారోహిణి నాడి=Suprascapular Nerve.
అంసాతుక సంయోజినీ స్నాయువు = Acromio-clavicular Ligament.
అంసోన్నమని=Levator Angulae Scapulae.
అగ్రపత్రం=Xiphoid or Ensiform.
అధః=Inferior.
అధరశృంగము=Inferior Ramus.
అధోహన్వస్థి=Inferior Maxillary bone.
అనామికప్రసారిణి=Extensor Minimi Digiti.
అనుత్రికాస్థి=Coccyx.
అనుత్రికిక=Coccygeus.
అనేకకోణకగుర్వీ=Trapezium.
అనేకకోణకలఘ్వీ=Trapezoid.
అరిత్రా=Serratus Magnus.
అర్బుదము=Tuberosity or Tubercle.
అర్ధచంద్రము=Semilunar Bone

అశ్రుపీఠము=Lacrymal Bone.
అస్థి=Bone.
అస్థికవచము=Periostium.
అస్థిధమనీద్వారము=Nutrient artery of bone
అక్షకాధరా=Subclavius.
అక్షకాస్థి=Clavicle.
అక్షాధరికా=Subclavian Artery.
ఉత్తరశృంగము=Superior Ramus.
ఉదరదండికా=Rectus Abdominis.
ఉదరచ్ఛదా అంతరాతిరశ్చీనా=Obliquus Internus Abdominis.
ఉదరచ్ఛదా బాహ్యాతిరశ్చీనా=Obliquus Externus Abdominis.
ఉదరచ్ఛదాసమా= Transversalis Abdominis.
ఉపపర్శుక=Costal Cartilege.
ఉపలకము=Cuniform.
ఉపార్బుదము=Small Tuberosity.
ఉరోజిహ్వామూలికా=Sterno Hyoid.
ఉరఃకర్ణమూలికా=Sterno Mastoid.
ఉరఃపంజరము=Thorax.
ఉరఃప్రచ్ఛదాగరిష్ఠా=Pectoralis Major.
ఉరఃప్రచ్ఛదాలఘ్వీ=Pectoralis Minor.
ఉరఃఫలకము=Sternum.
ఊర్వస్థి=Femur.
ఊర్వన్తఃపార్శ్వికా=Gracilis.
ఊర్ధ్వహను=Superior Maxillary.
ఊరుచతురస్రా=Quadratus Femoris
ఊరుపిండికా=Rectus Femoris.
ఊరుప్రసారిణీ=Crureus or Vastus Intermedialis.
ఊరుసంవ్యూహనీకనిష్ఠా=Adductor Brevis.
ఊరుసంవ్యూహనీగరిష్ఠా=Adductor Magnus.
ఊరుసంవ్యూహనీదీర్ఘా=Adductor Longus.
ఎముక=Bone.
కంటకము=Spine.
కంఠికాస్థి=Hyoid.
కండ=Msucle.

కండరచణకాస్థి=Sesamoid Bone.
కండరము=Muscle, Tendon.
కండరమూలము=Origin of Muscle.
కండరాగ్రము=Tendon.
కటిచతురస్రా=Quadratus Lumborum.
కటిపార్శ్వప్రచ్ఛదా (కటిప్రచ్ఛదా)=Latissimus Dorsi.
కటిలంబినీ (దీర్ఘా)=Psoas Magnus.
కణము=Cell.
కందము=Condyle.
కంధరము=Atlas.
కనిష్ఠికప్రసారిణీ=Extensor Minimi Digiti.
కనిష్ఠికాబహిర్వివర్తనీ=Abductor Minimi Digiti.
కనిష్ఠికామూలశలాకా సంకోచనీ=Flexor Ossis Metacarpi Minimi Digiti.
కనిష్ఠికాసంకోచనీహ్రస్వా=Flexor Brevis Minimi Digiti.
కపాలాస్థి=Flat bone.
కరకూర్చాస్థి=Carpal bone.
కరతలప్రసారణీ=Palmaris Longus.
కరప్రసారిణి అంతస్థా=Extensor Carpi Ulraris.
కరప్రసారణీదీర్ఘాబహిస్థా=Extensor Carpi Radialis Longer.
కరప్రసారిణీహ్రస్వాబహిస్థా=Extensor Carpi Radialis Breviour.
కరవివర్తినీ ఉత్తరా=Pronator Radii Teres.
కరవివర్తినీ చతురస్రా=Pronator Quadratus.
కరాంగుళిప్రసారిణీ=Extensor Communis Digitorum.
కరాంగుళిమూలశలాక=Metatarsal bone.
కరాంగుష్ఠప్రథమపర్వైక ప్రసారిణీ=Extensor Primi Internodii Pollicis.
కరాంగుష్ఠబహిర్వివర్తినీ=Abductor Pollicis.
కరాంగుష్ఠసంకోచనీ దీర్ఘా=Flexor Longus Pollicis.
కరాంగుష్ఠసంకోచనీహ్రస్వా=Flexor Brevis Pollicis.
కరాంగుష్ఠాంతరవివర్తినీ=Addı ctoı Pollicis.
కరాంగుష్ఠాగ్రపర్వైకప్రసారిణీ=Extensor Secundi Internodii Pollicis.
కరోత్తానినీదీర్ఘా=Supinator Longus.
కరోత్తానినీహ్రస్వా=Supinator Brevis.
కలా(శా)=Membrane.
కలాకల్ప=Semimembranosis.
కశేరుక=Vertebra.
కశేరుచక్రము=Vertebral Arch.
కశేరుపిండము=Body of Vertebra.
కశేరుబాహుప్రవర్ధనకము = Transverse Process.
కక్షానుగా=Auxillary Border.
కాండము=Shaft.
కాకోష్ఠికా=Coraco-Brachialis.
కుకుందరకంటకము=Ischial Spine.
కుకుందరకూటము=Ascending Ramus of Ischium.
కుకుందర ద్వారము = Lessor Sacro-Sciatic Notch.
కుకుందర పిండము=Body of Ischium.
కుకుందరాస్థి=Ischium.
కూటము=Process or Elevation.
కూర్చశిరస్సు=Astragalus.
కూర్చాస్థి=Carpal or Tarsal bone.
కూర్పరద్వారికా=Brachialis Anticus.
కూర్పరపృష్ఠికా=Anconius.
కోణకము=Cuniform.
కోణము=Angle.
కోష్ఠభూమికా (శ్రోణిఫలకిణి)=Iliacus.
ఖాతోదరమైన=Concave.
గండాస్థి=Malar Bone.
గంభీరధమనీ=Profunda Artery.
గుంట=Facet or Depression.
గమలస్=Gemellus.

గుదోన్నమని=Lavator Ani.
గుల్ఫ=Malleolus.
గూడరెమ్మక=Scapula.
గూను=Convex.
గృధ్రసీద్వారము=Great Sacro-Sciatic Notch.
గృధ్రసీనాడీ=Sciatic Nerve.
గౌణపర్శుకము=False Rib
గ్రీవము=Neck.
గ్రీవాకశేరుక=Cervical Vertebra.
గ్రైవేయకము=Manubrium.
ఘనము=Cuboid.
చణకాస్థి=Sesamoid Bone.
చక్రమూలములు=Pedicles of Vertibra.
చతురస్రికస్నాయువు=Trapezoid Ligament.
చూడావలయము=Atlas.
ఛిద్రము=Foramen or Hole.
జంఘపిండికాగుర్వి=Gastrocnemius.
జంఘపిండికామధ్యమ=Solius.
జంఘపిండికాలఘ్వి=Plantaris.
జంఘాంతరాలాకలా=Interosseus Membrane of Leg.
జంఘానుగా=Tibialis Posticus.
జంఘాపురోగా=Tibialis Anticus. .
జంఘాస్థి=Tibia.
జఘనకపాలము=Ilium.
జఘనధార=Iliac crest.
జతూకాస్థి=Sphenoid bone.
జానుపృష్ఠికా=Popliteus.
జాన్వస్థి=Patella.
ఝర్ఝరాస్థి=Ethmoid bone.
తలము (ప్రక్క)=Surface.
తరుణాస్థి=Cartilage.
తర్జనీప్రసారిణీ=Extensor Indicis.
తాల్వస్థి=Palatal bone.
త్రికాస్థి=Sacrum.
త్రికోణికాస్నాయువు=Conoid Ligament.
త్రిశిరస్క=Triceps.
తుండాంసక సంయోజినీ స్నాయువు = Coroco Acromial Ligament.
తుండాత్రుక సంయోజినీస్నాయువు= Coroco Clavicular Ligament.
దంతచూడ=Axis.
ద్విశిరస్క=Biceps.
దీర్ఘమూలము=Long Head.
దీర్ఘయామా=Sartorius.
ధార=Border.
ధమని=Artery.
నాడి=Nerve.
నాసాభ్యంతరశుక్తి=Turbinated Bone.
నాసాస్థి=Nasal Bone.
నితంబపిండికా, గుర్వి, మధ్యమా, లఘ్వి = Gluteus Maximus, Medius, Minimus.
న్యుబ్జపృష్ఠము=Convexity.
నౌనిభము=Navicular or Scaphoid.
పత్రకము=Lamilla.
పర్యాణకము=Trapezium.
పర్శుక=Rib.
పర్శుకాంతరిక=Intercostal Muscle.
పర్శుకాకర్షణీపురోగా, మధ్యగా, పృష్ఠగా= Scalenus Anticus, Medius, Posticus.
పర్శుకానుగా=Intercostal Vessels.
పశ్చాత్కపాలము=Occipital bone.
పర్శుకాత్రుక సంయోజనీ స్నాయువు = Costoclavicular Ligament.
పాణికూర్చాస్థి=Carpal bone.
పాణితలము=Palm.
పాణితలాస్థ్యంతరములు=Palmar Intercsscous
పాణిపృష్ఠము=Dorsum of Hand.
పాణిపృష్ఠాస్థ్యంతరములు=Dorsal Interosseous
పాణి (కర) సంకోచనీ-అంతస్థా, బహిస్థా = Flexor Carpi Ulnaris, Radialis.
పాదకూర్చాస్థి=Tarsal bone.
పాదతలాస్థ్యంతరములు=Plantar Interrossious.
పాదపృష్ఠాస్థ్యంతరములు=Dorsal Interossions
పాదవివర్తనీదీర్ఘా, హ్రస్వా, కనిష్ఠా = Peroneus

Longus, Brevis, Tertius.
పాదాంగుళి ప్రసారణీదీర్ఘాహ్రస్వా = Extensor Longus Digitorum. Brevis Digitorum.
పాదాంగుళిమూలశలాక=Metatarsal bone.
పాదాంగుళీసంకోచనీదీర్ఘా=Flex r Digitorum Longus.
పాదాంగుష్ఠసంకోచనీహ్రస్వా=Flexor Hallucis Brevis.
పాదాంగుష్ఠ ప్రసారణీ దీర్ఘా=Extensor Hallucis Longus.
పాదాంగుష్ఠాంతరవివర్తని=Adductor Hellusis.
పార్శ్వకపాలము=Pa riebot neal
పార్ష్ణి=Os Calsis.
పురఃకపాలము=Frontal bone.
పుప్ఫుసము=Lung.
పూర్వోత్తరశృంగము=Anterior Superior Spine.
పృష్ఠకంటకము=Vertebral Spine.
పృష్ఠవంశధరా=Erector Spinae.
పృష్ఠవంశము=Vertebral column.
పెక్టినియస్=Pectineus.
పేశి=Muscle.
ప్రకోష్ఠాస్థి=Bone of fore-arm.
ప్రగండాస్థి=Humerus.
ప్రవర్ధనకము=Process or Elevation.
ప్రాకారికా=Linea Aspera.
ఫణధరము=Unciform bone.
బహిఃకోణకము=External Cueniform.
బహిఃప్రకోష్ఠాస్థి=Radius.
భగాస్థి=Os Pubis.
మధ్యకాయము=Trunk.
మధ్యకూటము=Os Magnum.
మధ్యకోణకము=Middle Cueniform.
మధ్యఫలకము=Gladiolus.
మస్తిష్కమాతృకాధమనీ=Vertebral Artery.
మస్తిష్కము=Cerebrum.
మహాకంటకిని=Vertebra Prominens.
మహాప్రాచీర=Diaphragm.
మహార్బుదము=Condyle.
మహాశిఖరకము=Great Trochanter.
ముండము=Head.
ముఖ్యపర్శుకము=True Rib.
రంధ్రము=Foramen or Hole.
లఘుశిఖరకము=Lesser Trochanter.
వంశానుగ=Vertebral border.
వంక్షణోలూఖలము=Acetabular cavity.
వర్తులకము=Pisiform.
వస్తి=Bladder.
వస్తిగుహ=Pelvic cavity.
వస్తికంఠము=Ilio Pectinial Line.
వెన్నెముక=Vertibral Column.
శంఖాస్థి=Temporal bone.
శాఖలు=Extremities.
శిరస్సు=Head.
శిశ్నహర్షిణీ=Erector Penis.
శుండికా=Pyriformis.
శృంగము=Ramus or cornua.
శ్లేష్మధరకలాపుటకవ్యవధానము = Synovial Bursa
శ్రోణిగవాక్షము=Obturator Foramen.
శ్రోణిగవాక్షిణి అంతస్థ, బహిస్థ=Obturator Internus, Externus.
శ్రోణిచక్రము=Pelvic Girdle.
శ్రోణిపక్షిణి (కోష్ఠభూమిక)=Iliacus.
శ్రోణిఫలకము=Os Innominatu m.
సంధి=Joint.
సంయుక్త=Conjoined.
సంధిప్రవర్ధనకము=Vatucre Pilrcrsos.
సిరా=Aein.
సీరికా=Vomer.
సుషుమ్నా=Spinal cord.
సుషుమ్నచామరము=Cauda Equina.
స్నాయువు=Ligament.
హృదయము=Heart.

**అస్నీరిస్.** ఫ్రాన్సు దేశములోని సైన్ ప్రాంతమునందలి యొక పట్టణము. రాజధాని యగు ప్యారిసు నగరముయొక్క బయటిపేట. ఇది ప్యారిసు కోటలకు ౨ మైళ్ల దూరమున నున్నది. జనసంఖ్య ౩౬౫౦౦. ఈ పట్టణ మిటీవల పెరిగినది. ఇది ప్యారిసు నగరవాసులు నౌకావిహార మొనరించు స్థానము. పడవలను కట్టుట, రంగులు సువాసనద్రవ్యములు తయారు చేయుట యిచ్చటి ముఖ్యపరిశ్రమలు.

**అస్పిన్‌వాల్** అమెరికాలోని పెనామా ప్రజాప్రభుత్వమునందలి యొక పట్టణము. ఇది అట్లాంటిక్ తీరమున నున్నది. దీనికి కోలన్ అని మఱియొక పేరు. దీని చుట్టును బాడవప్రదేశము లుండుటచేత, ఇది చాల అనారోగ్యమైన స్థలము. ఇందు అమెరికా దేశముఁ గని పెట్టిన కొలంబసుయొక్క చలువ రాతి విగ్రహము కలదు. ఈ పట్టణము ౧౮౫౦ నుండి మాత్రమే ప్రసిద్ధికి వచ్చినది.

**అస్పేసియా.** క్రీ. పూ. ౫వ శతాబ్దమున ఏథెల్సునందు వసించిన మిక్కిలి విజ్ఞానవతియగు వేశ్య. ఈయువతి మిలెటస్ అను పట్టణమునజన్మించి ఏథెన్సునఁ దన నివాస మేర్పఱచుకొనెను. ఈమె తన నిరుపమాన సౌందర్యము చేతను, అప్రతిమ ప్రతిభవలనను, బహు జనసుతిపాత్ర యగుటయే గాక, ఆ దేశపునాయకుఁడగు పెరిక్లిసుహృదయము నాకర్షించెను. పెరిక్లిసు తనభార్యను విడిచి పెట్టిన తరువాత (క్రీ. పూ. ౪౪౫) ఈమెను స్వీకరించెను. తనయిద్దఱు ఔరసపుత్రులు మరణించిన పిదప పెరిక్లిసొక క్రొత్తచట్టమును పుట్టించి అస్పేసియాపుత్రుని ఔరసునిగ గావించెను. ఈమె తన కాలపు విజ్ఞానమునంతయు నార్జించెననుట అతిశయోక్తి కాదు. అప్పటి మేధాసంపన్నులగు సోక్రటీసు మొదలగు వారీమెగృహమునఁ గలిసికొనుచు వాగ్వివాదవినోదములఁ దేలుచుండిరఁట! పెరిక్లిసు తన యుంపుడుకత్తెయైన అస్పేసియా సహాయమువలననే రాజ్యాంగతంత్రమును నిర్వహించుచుండెనట. ఈమె షుర్తాంగము మూలమున, సేమియన్, పెలుపొనీషియన్ యుద్ధములు సంభవించెనని చెప్పుదురు. ఆకాలపు గ్రంథకర్త లీమెయొక్క విజ్ఞానము నెంతయో కొనియాడి యున్నారు. 'ఇస్కైనిస్' అనువానిచే రచింపఁబడిన 'అస్పేసియా' యను గ్రంథమునం దీమె తనకాలపు స్త్రీల యాచార వ్యవహారములను ఖండించినట్లు చెప్పఁబడినది. ప్లేటో విరచిత మనఁబడు 'మెనిగ్సిసను' నందు ఈమె అలంకారశాస్త్రమును బోధించిన ట్లున్నది.

**అస్మాన్‌జా.** (బహదర్, నవాబ్, సర్.) (౧౮౩౯-౧౮౯౮) హైదరాబాదు సంస్థానమును పాలించిన రెండవ నైజాముయొక్క మునిమనుమఁడు. ఇతఁడు ౧౮౬౯ లో అనఁగా ౩౦ యేండ్ల వయస్సున న్యాయమంత్రి యయ్యెను. సర్ సాలార్‌జంగ్ ఐరోపా ఖండయాత్ర వెళ్లినపుడు ముఖ్యమంత్రి పనిఁ జూచుచు రాజప్రతినిధిఁగఁ గూడ నుండెను. సర్ సాలార్ జంగ్ మరణానంతరము, అనఁగా ౧౮౮౩ లో రీజెన్సీ కౌన్సిలునందు సభ్యుఁడుగ నుండెను. ౧౮౮౭ లో జరిగిన విక్టోరియారాణి జ్యూబిలీ మహోత్సవమునకు నైజాము తరఫున ప్రతినిధిగా వెళ్లెను. ౧౮౮౭ నుండి ౧౮౯౪ వఱకు అనఁగా ౭ ఏండ్లు మంత్రిపదవి నలంకరించెను ౧౮౮౭ బ్రిటిషు ప్రభుత్వమువారు 'నైట్ కమాండర్ ఆఫ్ ది ఇండియన్ ఎంపయర్' (K. C. I. E.) అను బిరుదము నొసంగిరి.

**అస్వహార్యుఁడు.** ఒకబ్రహ్మర్షి. చూఁడు. "౩ అంగిరసశబ్దము."

**అస్వామివిక్రయము.** తనదికాని వస్తువును అమ్ముట. ఒకనివస్తువు మఱియొకఁ డమ్మిన నది 'యస్వామివిక్రయ' మనఁబడును. హిందూ ధర్మశాస్త్ర ప్రకార మిది అష్టాదశ వివాద పదములలో నొకటి. రాముఁడు సోముని గడియారమును దొంగిలించియో యెరువు తెచ్చియో భీమునకు నమ్మినయెడల నది యస్వామి విక్రయ మనిపించుకొనును. ఇయ్యది యాజ్ఞవల్క్య స్మృతియందును, దానిపై వ్యాఖ్యానమైన మితాక్షరలోను, వ్యవహారాధ్యాయమందు ౧౧ వ ప్రకరణమున

వివరింపఁబడినది. ఇట్టి వస్తువు యజమానునకుఁ (ఖామందుకు) చేరవలసినది. అమ్మకము సంగతి దాచినయెడల కొన్నవానిది తప్పు. ఆవస్తువును బీదవానివలనను, చాటుగను, తక్కువ వెలకును, రాత్రి మొదలయిన అకాలములందును కొన్న యెడలఁ గొనినవాఁడు కూడ దొంగయగును. [శ్లో: ౧౬౮] పోయినవస్తువును కనుఁగొని హరించినవానిని అధికారులచేఁ బట్టింపవలెను. వారు లేనియెడలఁ దానే పట్టుకొని యధికారులకు నప్పగింపవలెను. [౧౬౯] అమ్మినవానిని తెచ్చి యప్పఁజెప్పినయెడలఁ గొన్నవాని దోషము పోవును. అమ్మినవానియొద్దనుండి, అమ్మినవస్తువు యజమానునకును, రాజునకు దండధనమును, కొన్నవానికి దాని వెలయు వచ్చును. [౧౭౦]. ఇట్లు యాజ్ఞవల్క్యుని మతంబున నమ్మినవాఁడు కానరాకున్నఁ గొన్నవాఁడే నష్టమును భరించి, వస్తువును తిరిగి యజమానునకు నిచ్చివేయవలయును. కొన్నవాఁడు సదుద్దేశముతోఁ గొన్నను, అనగా నమ్మినవాఁడే యావస్తువునకు యజమానుఁడని నమ్మి, అది పరుని సొత్తనిగాని దొంగసొత్తనిగాని సంశయము లేక కొన్నను, ఆవస్తువు యజమానునకుఁ బోవలసినదే. నష్టము కొన్నవాఁడు భరింపవలెను.

ఇందునుగురించి యిప్పటి ధర్మశాస్త్రము (లా) యేమి చెప్పుచున్నదని విచారింతము.

ఇప్పటి 'లా'

అస్వామివిక్రయమును గురించి యిప్పటి చట్టములు గూడఁ బై నియమమునే పాటించును. ఒకానొకవస్తువును అమ్మువానికి నావస్తువునం దెంతహక్కు (స్వత్వము) కలదో, కొన్నవానికి దానియందు నంతకంటె నెక్కుడు హక్కు (స్వత్వము) కలుగనేరదని యిప్పటి ధర్మశాస్త్రముయొక్క సామాన్య సిద్ధాంతము. కాంట్రాక్టు ఆక్టుయొక్క ౧౦౮-వ సెక్షన్. ఈ సంగతినే చెప్పుచున్నది. అమ్మువానికి నమ్మినవస్తువునందు స్వత్వము (హక్కు) లేనియెడలఁ గొనువాఁ డెంత సద్బుద్ధితోఁ గొన్నను వానికి స్వత్వము కలుగనేరదు. రాముఁడు సోముని ఆవును దొంగిలించి భీమునకు నమ్మెను. ఇది దొంగయావు అని తెలిసి గాని, ప్రతిఫలమీయక కాని భీముఁ డాయావును కొన్నయెడల వానికి దానిపై హక్కు కలుగదనుట స్పష్టము. ఇంతియకాదు. భీముఁడు సదుద్దేశముతో నసఁగ దొంగసొత్తని యెఱుంగక సంతలో నాయావును పూర్తియైన వెలయిచ్చి కొనినను దానిపై అతనికి హక్కు కలుగదు. ఒకరియొద్దనుండి మఱియొకరు దానిని ఎంతమంది ఎన్నిసారులు కొన్నను వారిలో నెవ్వరికిని దానిపైహక్కు కల్గనేరదు. అసలు యజమానుఁడైన సోమునికే హక్కు కల్గియుండును. ఇది సామాన్యనియమము. దీనికిఁ గొన్ని యపవాదములు (exceptions) కలవు. అనఁగా నవి సామాన్యనియమమునకు మినహాయింపులు.

౧. యజమానుఁడు (ఖామందు) తనవస్తువును ఇష్టపూర్వకముగ మఱియొకని స్వాధీనమునందు నుంచఁగా, వాఁ డావస్తువును యజమానునకు వ్యతిరేకముగ మూడవవానికి నమ్మ, ఆ కొన్నవాఁ డమ్మువానికి నమ్ముట కధికారము లేదన్న సంశయము లేనివాఁడై ప్రతిఫలమిచ్చి యావస్తువును కొన్నయెడల, వానికి నావస్తువుపై పూర్ణమైన హక్కును స్వత్వమును కల్గును. [కాంట్రాక్టు ఆక్టు సె. ౧౦౮. మినహాయింపు ౧]. యజమానుఁడు తన వస్తువును మఱియొకని స్వాధీనమునందే యుంచనక్కఱలేదు. ఆవస్తువుపై హక్కును స్వత్వమును తెల్పునట్టి బిల్ ఆఫ్ లేడింగ్, డాక్ వారంటు, వేయర్ హౌస్ కీపర్స్ సర్టిఫికెటు మొదలయిన పత్రములను యజమానుఁడు ఆరెండవవాని స్వాధీనమునం దుంచగా. వానిని వాఁడు విక్రయించినయెడల సద్భావముతోఁ గొనువానికి ఆ వస్తువులపై హక్కును స్వత్వమును కలదు.

ఉదాహరణము. ఒక వర్తకుఁడైన ఏ అనువాఁడు కొన్ని సరకులతో చేరిన ఎగుమతి పట్టీని (బిల్ ఆఫ్ లేడింగు) తన గుమాస్తా అయిన బీ అనువాని పరము చేసి, సదరహీ సరకులను ఇంత. ఖరీదుకంటె తక్కువకు అమ్మవద్దనియు, బి అనువానికి పైకము పుచ్చుకొనకుండ ఇయ్యవద్దనియు, ఉత్తరువు చేసెను. అందుకు వ్యతిరేకముగ బి అనువాడు ఆ ఖరీదుకంటె తక్కువ ఖరీదుకు డీ అనువానికి సరకులను అమ్ముటయే గాక వాటిని అతనికి మూడు నెలల వాయిదాకు ఇచ్చెను. ఆ సరకులయొక్క స్వత్వము డీ అనువానికి చెందియున్నది.

౨. పెక్కుజనులకు హక్కు గల యొకానొక వస్తువు ఇతర భాగస్థుల యనుమతిమీద ఒకభాగస్థుని స్వాధీనమం దుండగా నాతఁడు దానిని అమ్మివేసిన యెడల, కొనువాఁడు సద్భావముతోను, స్వాధీనదారు నకు నమ్ముటకు హక్కులేదన్న సంశయము కలుగుటకు వీలు లేని పరిస్థితియందుఁ గొన్నయెడల, నావస్తువు యొక్క స్వత్వము కొన్నవానికే సంక్రమించును. [౨వ మినహాయింపు]

ఉదా. ఏ, బీ, సీ, అను ముగ్గురు అవిభక్త హిందూ సహోదరులకు కొన్ని పశువులు సమష్టిగా నున్నవి. వాటిలో, ఏ, బీ, అనువారి సమ్మతిప్రకారము సీ అనువాని స్వాధీనమునందు ఒక ఆవు ఉన్నది. దానిని వాఁడు డీ అనువానికి నమ్మెను. డీ అనువాఁడు సద్భావముతో దానిని కొనెను. ఆవుయొక్క స్వత్వము డీ అనువానికిఁ బరివర్తన మగుచున్నది.

3. ఒక కరారు (కాంట్రాక్టు) ననుసరించి యొక వస్తువు ఒక కక్షుదారుని (పార్టి) స్వాధీనమైన దనుకొనండి. ఆకరారు రెండవ కక్షుదారుని యిష్టానుసారము రద్దు అగుటకు వీలయినది యనుకొనుఁడు. కాన వస్తువును స్వాధీనమం దుంచుకొన్నవానికి దానియందుఁ బూర్ణాధికారము కలుగలేదని భావము. ఇట్లుండ, రెండవకక్షు దారునివలన ఆ ఖరారు రద్దుచేయఁబడుటకుఁ బూర్వము, వస్తువు స్వాధీనమునందున్న వానివద్దనుండి మూడవ వాఁడు సద్భావముతో ఆవస్తువును కొన్నయెడల వానికి దానియందు స్వత్వము కల్గును. వస్తువు స్వాధీనము నం దున్నవాఁడు చేసిన నేరమువలన పైని చెప్పఁబడిన కరారు రద్దుపర్చు హక్కు రెండవ కక్షుదారునకుఁ గల్గుడనెడల మాత్రము కొన్నవానికి స్వత్వము రాదు.

ఈ అమ్మకమువలన, కరారును రద్దుపఱుచు నధికారము గల మొదటివానికి నేమైన నష్టము కల్గినేని వాఁ డది అమ్మినవానివద్దనుండి రాఁబట్టుకొనవచ్చును.

ఉదా. ౧ ఏ అను వాఁడు దగా కానేరని తప్పు సమాచారముద్వారా తనకు ఒక గుఱ్ఱమునుఅమ్మి ఒప్పగించే లాగున బీ అను వానిని ప్రేరేపించును. బీ అను వాఁడు ఖరారును రద్దుచేయకమునుపు ఏ అను వాఁడు ఆ గుఱ్ఱమును సీ అనువానికి అమ్మెను. ఆ గుఱ్ఱముయొక్క స్వత్వము ఏ అను వానికి చెందుచున్నది. ఖరారు రద్దు పఱచఁబడకుండ ఆటంకపెట్టబడ్డందువల్ల బీ అను వానికి కలిగిన ఏదైననష్టమునకు సీ అనువానివల్ల పరిహారము పొందుటకు బీ అనువానికి హక్కు కలదు.

ఉదా. ౨ ఏ అనువాడు బీ అనువానిని అక్రమముగా జడిపించి బలవంతపెట్టిగాని, దగామూలముగానైన సరే తప్పుస్పష్టీమూలముగానైన సరే ప్రేరేపించిగాని, అతనిని తనకు ఒక గుఱ్ఱమును అమ్మేలాగున చేసెను. ఖరారును బీ అనువాఁడు రద్దుచేయుటకు ముందు ఆ గుఱ్ఱమును సీ అనువానికి అమ్మివేసెను. సదరిహి. ఆస్తి సీ అనువానికి పరివర్తన గాదు.

అస్వామివిక్రయమునందుఁ గూడఁ గొన్నవానికిఁ గొన్నవస్తువుపై స్వత్వ మెట్టిపరిస్థితిలోఁ గల్గునో కాంట్రాక్టు ఆక్టు ననుసరించి పైని చెప్పఁబడినది. ఇది గాక మఱి కొన్ని సమయములందును హక్కు కల్గును. అందు నొక్కటి "ఆస్తిపరివర్తన చట్టము" (ట్రాన్సుఫర్ ఆఫ్ ప్రాపర్టీ ఆక్టు) యొక్క ౪౧వ సెక్షనులోఁ జెప్పఁబడినది.

**౪౧వ సెక్షన్, ఆస్తి పరివర్తన ఆక్టు: బహిరంగమైన యజమానుని వలన పరివర్తనము**

స్థిరాస్తిపైన హక్కుగల మనుష్యులవలన స్పష్టముగాని సూచనగాగాని అంగీకారమును పొంది ఒక మనుష్యుఁడు సదరు ఆస్తిపైన పేరునకుమాత్రము యజమానుఁడుగా నుండి ప్రతిఫలముకొఱకు సదరు ఆస్తిని పరివర్తనచేయు పక్షమందు, పరివర్తనకర్త అట్లు పరివర్తనము చేయుటకు అధికారమును పొందియుండలేదను కారణమున, సదరు పరివర్తన రద్దుపఱుపఁబడదు. అయినను పరివర్తనకై కొనువాఁడు అట్లు పరివర్తనచేయుటకు పరివర్తనకర్త అధికారము కలవాఁడు అని తగినంత జాగ్రత్తతో విచారించిన తరువాత న్యాయతాత్పర్యముతో వర్తింపవలెను.

దీనికి దాత్పర్యమేమనఁగా, ఒకానొకఁడు అప్పు తప్పించుకొనవలయు ననియో . మఱి యేకారణము వల

సనో తనయిల్లు మతియొకనిపేరఁ బెట్టి, ఆ యిల్లు తనది కానట్టును వానిదే యైనట్టును నటింపగా, నామాటయే నిజమనుకొని మూఁడవ వాఁడాయిల్లు బహిరంగయజమానునియొద్దనుండి కొన్నయెడల నాయింటి యందలి స్వత్వము కొన్నవానిదే యగును. ఇంటియొక్క యసలు ఖామందు వచ్చి, వాఁడు యజమానుఁడుకాఁడు, నేనే యజమానుఁడను అని యనుటకు వీలులేదు. బినామి వ్యవహారములనన్నిఁటిని గుఱించియు నిట్లే తెలిసికొనవలెను.

అమ్మినవానికి లేనిహక్కు కొన్నవానికిఁ గలుగ నేరదన్న నియమము నగదు, నోట్లు, హుండీ మొదలయిన మారకపుఁ బత్రములను (Negotiable Instruments.) గుఱించి చెల్లదు. సద్భావముతోను ప్రతిఫలమిచ్చియు వీటిని నెవఁడు దొంగవద్దనుండి (వాఁడు దొంగ అన్న సంశయములేక) తీసికొనునో వానికి వానియందుఁ బూర్ణమైన స్వత్వము గల్గును. అసలు యజమానుఁడు వానిని ఆతనియొద్దనుండి తీసికొనఁజాలఁడు. యజమానుఁడే నష్టపడవలెను. ఇందుకుఁ గారణము స్పష్టము. ఇట్లుగాని యెడల లోకవ్యవహారములే సాగుట కష్టమగును. రూపాయలుగాని, నోట్లుగాని హుండీలుగాని తెచ్చిన వానికి! సక్రమముగ వచ్చిన వన్న సంశయము కల్గుటకుఁ గారణము లేకున్నఁజాలును. ప్రతిఫల మిచ్చి తీసికొంటిమేని అవి మనవే.

[కో. ల.

**అస్సాంపర్వతములు.** బ్రహ్మపుత్ర, సుర్మాలోయల గుండ తూర్పు పడమటి దిక్కుల విస్తరించిన పర్వతసమూహము. ఇందు గారో, ఖాసి, జైంటియా, ఉత్తరకాచార్, నాగాకొండలు ముఖ్యములైనవి. వీని తూర్పుభాగపు చివరలు ఉత్తరదిక్కు వ్యాపించి హిమాలయపర్వతము, మణిపురగుట్టల వైపు గా[illegible]జరిగి యోమాపర్వతములను అంటుకొనును. ఈ కొండల యెత్తు సగటున 3000 మొదలు ౬000 అడుగులవఱకు మాత్రమే నుండును. కాని నాగా కొండలలోని జాప్వో శిఖరము ౧0000 అడుగుల యెత్తువఱ కున్నది. ఖాసీకొండలలో షిల్లాంగు శిఖరము (౬౪౫౦ అడుగులు) మిక్కిలి యెత్తుగలది. ఈ కొండలన్నిటియందును దట్టమైన అడవులున్నవి. కాని ఖాసీ కొండల మధ్యభాగమున మాత్రము పచ్చిక బయళ్లు మాత్రమే కలవు. గారో, ఖాసీ కొండలలో రాక్షస బొగ్గు దొరకును.

**అస్సాంలోయ.** అస్సాము రాష్ట్రములోని యొక ఖండమునకుఁ బేరు. ఇది ఉత్తరమున నున్న హిమాలయపర్వతమునకును, దక్షిణమున నున్న అస్సాం పర్వతములకును నడుమ నున్నది. వైశాల్యము ౨౪౬౦౯ చదరపుమైళ్లు. జనసంఖ్య ౨౬౧౫౦౭౭. ఈ ఖండమునందు గొయాల్‌పార, కామరూపము, డర్రాంగ్, నౌగాంగ్, శివసాగరము, లక్ష్మీపురము అను ౬ జిల్లాలు కలవు. ఇందు ౧౦ పట్టణములును, ౮౮౦౧ గ్రామములును ఉన్నవి. వీనిలో గౌహాటి (౧౧౬౬౧), దిబ్రూగర్ (౧౧౨౨౭) అనునవి పెద్దపట్టణములు. అస్సాము దేశీయులకు వర్తకవ్యాపారమునందు నేర్పు లేకపోవుట వల్లను, తేయాకుపంట ముఖ్యమైన పరిశ్రమ యగుట వల్లను, ఇందు కూడలిస్థానము లేవియు లేవు. కామరూపములోని కామాఖ్య, హాజో అను స్థలములును, బ్రహ్మఖండమునందలి సరస్సును హిందువులకుఁ బుణ్యక్షేత్రములు. తేజపురమునందుఁ బురాతన కట్టడశేషములు గలవు. శివసాగరము, నాజిరా అనునవి అహోమ్ రాజ్యముయొక్క పూర్వపు రాజధానులు.

**అస్సాము.** హిందూదేశమునందు ఈశాన్య దిక్కున నున్న ఒక రాష్ట్రము. దీనిని ౧౯౦౫నందు తూర్పుబంగాళముతోఁ గలిపి ఒక రాష్ట్రముగఁ జేయఁబడెను; గాని ౧౯౧౨ లో తూర్పు బంగాళమును బంగాళా రాష్ట్రములోఁ గలిపినపుడు దీని నొక ప్రత్యేకరాష్ట్రముగ మఱల నిర్మించిరి.

ఎల్లలు వైశాల్యము

ఈ రాష్ట్రము హిందూదేశపు తూర్పు సరిహద్దులలో బర్మారాష్ట్రము నానుకొనియున్నది. దీనికుత్తరమున హిమాలయపర్వతమును, దక్షిణమున టిప్పెరా సంస్థానమును చిట్టగాంగు (చిట్టిగ్రామ) కొండలును, తూర్పున బర్మారాష్ట్రమును, పశ్చిమమున బంగాళా రాష్ట్రమును కలవు. ఈరాష్ట్రము నాలుగు వైపులను

పర్వతశ్రేణులు చుట్టియుండుటచే, దీనిచుట్టును, అకాలు, దాఫ్లాలు, మీరులు, అబోరులు, మిషిమీయులు, ఖాంటీలు, సింగ్ ఫోలు, నాగులు మొదలైన పర్వతజాతులవారు నివసించుచుందురు. దీనియొక్క వైశాల్యము మణిపుర సంస్థానముతోఁ గలిసి ౬౧౬౮౧ చదరపు మైళ్లు. ఇందలి జనసంఖ్య ౭౦౫౯౮౫౭. ముఖ్యపట్టణము షిలాంగు. డౌలు ౧౯౧౯—౨౦ సంవత్సరమున రు ౧౭౮౬౩౩౩౧ లు; ఖర్చు రు. ౧౫౬౬౩౮౧ లు.

**నైసర్గిక స్వరూపము**

ఈ రాష్ట్రము నైసర్గికముగా సుర్మాలోయ, బ్రహ్మపుత్రలోయ, వీని మధ్యనున్న పీఠభూమి అను మూడు భాగములుగ విభాగింపఁబడుచున్నది. బ్రహ్మపుత్రలోయ ౪౫౦ మైళ్ల పొడవును ౫౦ మైళ్ల వెడల్పును గల్గి మిక్కిలి సారవంతమైన ప్రదేశము. మధ్యనున్న అస్సాము పీఠభూమి తూర్పుదిశ నున్న కొండలవరుస పశ్చిమముగ బ్రాకినందున నేర్పడిన ప్రదేశము. ఇందు గారో, ఖాసి, జైంటియా కచార్, నాగాకొండలు ముఖ్యములైనవి. ఈ కొండలవరుస తూర్పుదిక్కున పాట్కాయికొండలతోఁ గలిసి హిమాలయపర్వతముల నంటుచున్నది. ఈ పీఠభూమియందు నాగాకొండలలోని జాప్వొశిఖరమును (౧౦౦౦౦ అడుగులు) ఖాసీ-జైంటియాకొండలలోని షిల్లాంగు (౬౪౫౦) శిఖరమును ఎత్తైనవి. ఈపీఠభూమికి దక్షిణమున సుర్మాలోయ గలదు. ఇది బ్రహ్మపుత్రలోయకన్న చిన్నదైనందున నందు మూడవవంతు (౭౫౦౬ చదరపు మైళ్లు) వైశాల్యము మాత్రము కలిగియున్నది. బ్రహ్మపుత్రానది హిమాలయపర్వతము చుట్టుదిరిగి అస్సాము మధ్యనుండి ప్రవహించుచున్నది. దిబాంగ్, దిహాంగ్, సుబన్‌సిరీ, భరెలి, ధన్‌సిరి, బర్నదీ, మనాస్, చాంపావతి, సరళభాంగ, శుందిల మొదలుగా గల ఉపనదులు ఉత్తరమునుండి వచ్చి ఈమహానదిలోఁ గలియును. దక్షిణముననుండి, నోయ, బురిదిహింగ్, దిసాంగ్, దిఖో, ఝాంజీ, ధన్‌సిరి, కలంగ్ అను ఉపనదులు వచ్చి కలియును. ఇంకను క్రిందిభాగమున కుల్సీ, జింజిరామ్ అను శాఖలీనదిలో గలియును. వానకాలమునం దీనది యనేకమైళ్ల వెడల్పు ప్రవహించుటఁజేసి, ఇందనేకగొప్పలంక లేర్పడినవి. వీనిలో మజూలీయనులంక ౫౫౦ చదరపుమైళ్ల విస్తీర్ణము కలిగియున్నది. ఈ బ్రహ్మపుత్రానది ప్రవహించినంతవఱకును దేశము సస్యవంతమై బహుజనాకీర్ణమై విలసిల్లుచున్నది. ఈ దేశమందలి భూమి చాలఫలవంతమైన నల్లరేగడ. బ్రహ్మపుత్రాదినదులవలన ఒండుమట్టి విశేషముగ లభించుటవలన నిచ్చటిభూమి లెప్పుడును సారవంతములుగ నుండును.

**దేశకాలస్థితులు**

ఈదేశమున నెండలు చాలతక్కువ. అన్ని ఋతువులందును చల్లగనుండును. ఇచ్చట చలి వానకాలములు రెండుమాత్రమే గలవు. మహోన్నతపర్వతము లీ రాష్ట్రముచుట్టు నుండుటచేతను, ఇందు గొప్పయడవు లనేకములుండుటచేతను ఇచ్చట వర్షమధికముగ గురియును. సగటున నీ దేశమందు వర్షాపాతము ౯౩-౧౨౪ అంగుళములవఱకు నుండును. అందును ఖాసీకొండలలోని చీరపంజివద్ద ౪౫౮ అంగుళముల వర్షము గురియును! ప్రపంచమునం దెచ్చటను ఇంతవర్షము గురియదు. ఈచీరపంజివద్దనే ౧౮౬౧ లో ౯౦౫ అంగుళముల వర్షముగురిసెను! ఇచ్చట ఎండవేడిమి జనేవరిలో ౫౯° ను, జులైలో ౮౪° ను ఉండును. ఈరాష్ట్రమునందు భూకంపము లెప్పుడును కలుగుచుండును. కొన్ని సమయములందీభూకంపములవలనఁజాల నష్టము కలుగుచుండును. ఇంతవఱ కిచ్చట కలిగిన భూకంపములలో ౧౮౯౭ లో జరిగిన దానివలనఁ గొన్ని జిల్లాలలోని యిండ్లన్నియు నాశనమగుటయే గాక ౧౫౦౦ కంటె నెక్కుడు జననష్టము కలిగెను.

**జనులు, భాష, విద్య**

ఈరాష్ట్రమునందలి జనసంఖ్య డెబ్బదిన్నరలక్షలు. వీరిలో మహమ్మదీయులు ౧౫ లక్షలు, హిందువులు ౩౫ లక్షలు, ఆరణ్యకజాతులు ౧౩ లక్షలు. ఇందు నూటికి ౪౬ వంతున బంగాళీభాషయు, ౨౨ వంతున అస్సామీభాషయు, ౬ వంతున హిందీభాషయు, మాట్లాడఁబడును. ఆరణ్యకజాతు లనేకభాషలను మాట్లాడెదరు. ఈ రాష్ట్రమునందు పర్వతప్రాంతనదీపరిసరభూము లెక్కువగ నుండుటవలన నిందు చదరపుమైలునకు ౧౧౫ వంతున మాత్ర

ము జనసంఖ్యగలదు. వీరుగాక యిచ్చటి తేయాకుతోటలలోఁ బనిచేయ వలస వచ్చిన కూలీలసంఖ్య ౭ లక్షలవఱకున్నది. అస్సామీయులు బంగాళీలకన్న గౌరవర్ణమునందు నొకచాయ ఎక్కువగ నున్నను రూపరేఖావిలాసములందు చీనాదేశీయులను బోలియుండుటవలన నంత యందముగనుండరు. కాని స్త్రీలుమాత్ర మతిరూపవతులుగనున్నారు. అస్సామీయు లిదివఱకు యుద్ధప్రియులైనను ప్రస్తుతము తదితర రాష్ట్రవాసులవలెనే సుఖజీవనమున కలవాటుపడియున్నారు. వీ రిటీవల ౩,౪ శతాబ్దములక్రిందట హిందూమతము నవలంబించిరి. వీరు కష్టజీవులును, సౌహృదయులు నగుటయే గాక ఆత్మగౌరవమునకు భంగమువచ్చునట్లు చరింపరు. అస్సామీభాష యించుమించుగ బంగాళీభాషను బోలియుండును. ఈ రెండుభాషలకు నింత సామీప్యసంబంధ ముండుటచేతనే ప్రభుత్వమువారు మొదట నీరాష్ట్రమునకు బంగాళీభాషనే కోర్టుభాషగ నుపయోగించుచువచ్చిరి. కాని అస్సాముప్రజలు తమ రాష్ట్రమునం దస్సామీభాషనే యుపయోగింపవలసినదని అనేక సంవత్సరములు మొఱపెట్టగా ౧౮౭౩ లో ప్రభుత్వమువా రందుల కొప్పుకొనిరి. ఈరాష్ట్రపు సరిహద్దులలో నున్న ఆరణ్యకజాతులుఁ దఱచుగా నెల్లప్పుడు కలహించుచుందురు వీరివలన రాష్ట్రవాసులకేమియు నుపద్రవములు రాకుండ మిలిటరీస్థానము లచ్చటచ్చట నుంచఁబడినవి. ఈరాష్ట్రమునందు విద్యావ్యాపకము తక్కువ. ఇచ్చట ౪౧౧౮ విద్యాలయములు గలవు. ఇందు ౧౬౭౨౫౦ బాలురు చదువుచున్నారు. వీనిలో ౨ కళాశాలలున్నవి. ఈరాష్ట్రమున మొత్తముమీద చదువుకొన్న వారి సంఖ్య ౩౩౩౬౭౨. బ్రహ్మపుత్రలోయయందు వలస వచ్చిన కూలీలును ఆరణ్యకజాతులు నెక్కువగ నుండుటచే చదువవచ్చినవారిసంఖ్య నగుటున తగ్గుచున్నది. కాని అస్సాము పీఠభూమియందు ఆరణ్యకజాతులైన ఖాసీలలో విద్య బహుత్వరితముగ వ్యాపించుచుండుట శుభసూచకము. ఈక్రింద జిల్లాలవారిగ నందుండు పట్టణములును, పల్లెలును, జనము నిచ్చుచున్నాము:—

| | జిల్లాలు | విస్తీర్ణము చ. మై. | పట్టణములు. | గ్రామములు. | జనసంఖ్య. | చదరపుమైలునకు జనము |
|---|---|---|---|---|---|---|
| | బ్రహ్మపుత్రలోయ | | | | | |
| 1 | గోయల్పార | ౩౯౬౧ | ౨ | ౧౪౬౧ | ౪౬౨౦౫౨ | ౧౧౪ |
| 2 | కామరూపము | ౩౮౫౮ | ౨ | ౧౭౧౬ | ౫౮౯౧౮౭ | ౧౪౭ |
| 8 | డర్రాంగ్ | ౩౪౧౮ | ౧ | ౧౨౭౫ | ౩౩౭౩౧౩ | ౯౭ |
| 4 | నౌగాంగ్ | ౩౮౪౩ | ౧ | ౧౧౧౭ | ౨౬౧౧౬౦ | ౬౭ |
| 5 | శివసాగరము | ౪౯౯౬ | ౩ | ౨౧౦౯ | ౫౯౭౯౬౯ | ౧౧౮ |
| 6 | లక్ష్మీపురము | ౪౫౨౯ | ౧ | ౧౧౨౩ | ౩౭౧౩౯౬ | ౮౪ |
| | కొండజిల్లాలు | | | | | |
| 7 | లూషాయికొండలు | ౭౨౨౭ | ... | ౨౩౯ | ౮౨౪౩౪ | ౧౧ |
| 8 | నాగాకొండలు | ౩౦౭౦ | ౧ | ౨౯౨ | ౧౦౨౪౦౨ | ౩౨ |
| 9 | ఖాసీ, జైంటియాలు | ౬౧౨౭ | ౧ | ౧౮౩౯ | ౨౦౨౨౫౦ | ౩౨ |
| 10 | గారోకొండలు | ౩౧౪౦ | ... | ౧౦౨౬ | ౧౩౮౨౭౪ | ౪౪ |
| | సుర్మాలోయ | | | | | |
| 11 | సిల్హెట్ | ౫౩౮౮ | ౫ | ౮౩౩౦ | ౨౨౪౧౮౪౮ | ౧౯ |
| 12 | కాచార్ | ౩౭౬౯ | ౧ | ౧౩౩౨ | ౪౫౫౫౯౩ | ౪౧౦ |
| 18 | మణిపురసంస్థానము | ౮౪౫౬ | ౧ | ౪౬౭ | ౨౮౪౪౬౫ | ౩౪ |

ఈ రాష్ట్రమునందు వ్యవసాయమున కనుకూలముగ సారవంతమైన భూమియు, మంచి శీతోష్ణస్థితియు, ఎక్కువ వర్షాపాతమును, బ్రహ్మపుత్రాది నదులుండుటచే నిచ్చట నుండు జనులలోఁ జాలమంది వ్యవసాయ వృత్తివలన జీవించుచుందురు. ఇచ్చట ముఖ్యముగఁ బండింపఁబడునది వరిధాన్యము. సుమారు ౪ లక్షల యెకరములలో ఈపంట పండుచున్నది. ఇచ్చటఁ గాలువలు త్రవ్వఁ బనిలేకయే బ్రహ్మపుత్రానదియొక్క అసంఖ్యాకములైన శాఖ లుపయోగపడుచున్నవి. జనపనార ౪౦ వేల యెకరములలో, తేయాకు ౩౭౬౦౦౦యెకరములలో, చెఱుకు ౨లక్షల యెకరములలో పండింపఁబడుచున్నవి. ఇవిగాక గోధుమలు, పొగాకు, ప్రత్తి ఇచ్చటి ముఖ్యములైన పంటలు. ఈ తేయాకును, జనపనారయు విస్తారముగాఁబరదేశముల కెగుమతియగును. ఈ రాష్ట్రమునందు ౩౭౭౮ చదరపుమైళ్ల రిజర్వు అడవులును, ౧౭౫౦౯ మైళ్ల ఇతర అడవులును గలవు. ఈ యడవులలో ఏనుఁగులు పెద్దపులులు ఎలుగుగొడ్లు చిఱుతపులులు మొదలగు క్రూరమృగములు గలవు. ఇందు ముఖ్యముగ అడవియేనుఁగులను వశముచేసికొనుటకై ప్రభుత్వమువారు ఒక డిపార్టుమెంటు నేర్పఱిచియున్నారు. ఏడాదికి సుమారు ౨౦౦ ఏనుఁగులు పట్టఁబడును. ఈ రాష్ట్రమునందుఁ జాలవఱకు భూములన్నియు రైతువారీ పద్ధతిమీఁదనే అమరకము చేయఁబడుచున్నవి. అయినను గొయాల్‌పార, సిల్లెట్ జిల్లాలలో పర్మనెంట్ సెటిల్మెంట్ పద్ధతి అవలంబింపఁబడుచున్నది. ఇందు చిన్న జమీందారీలు కూడ అనేకములు గలవు.

ఈ రాష్ట్రమునందు రాతిసిబొగ్గు, సున్నపురాయి, పెట్రోలియమ్‌నూనె విస్తారముగ గలవు. ఇందు ఏడాదికి ౨౩౯౦౦౦ టన్నుల రాతిసిబొగ్గు నాగా కొండలలోను, ౯౬౦౦౦ టన్నుల సున్నపురాయి ఖాసీ జైంటియా కొండలలోను, ౩౩ లక్షల గాలన్లు పెట్రోలియమ్ నూనె లఖిమ్పురమునందును దొరకుచున్నది. పెట్రోలియమునుండి తీయఁబడిన నూనె ఇచ్చటనే ఖర్చుపడును గాని మైనము మాత్రము ఇంగ్లాండునకు ఎగుమతి చేయఁబడుచున్నది. ఇచ్చటఁ గల నేత పరిశ్రమలలో పట్టు నేత ముఖ్యమైనది. ఈ దేశమునందు స్త్రీలే వస్త్రములను నేయు ఆచారము గలదు. భాగ్యవంతుఁడైనను బీదవాఁడైనను, బ్రాహ్మణుఁడైనను శూద్రుఁడైనను ప్రతివాని గృహమునందు నొకమగ్గ ముండితీరును. భాగ్యవంతుల గృహములందు వారిస్థితికిఁ దగిన వస్త్రములను నేసి స్వంతమున కుపయోగించుకొందురు. బీద లదేవృత్తి నవలంబించి తాము నేసిన వస్త్రముల నితరుల కమ్ముదురు. ఇవిగాక పడవలను కట్టుట, ఇత్తడి, కంచు, ఇనుప పనిముట్లు, పాత్రలను తయారుచేయుట, మొదలగు పరిశ్రమ లిచ్చట విరివిగ జరుగుచుండును.

అస్సాము దేశమందలి విశేషము తేయాకుతోటలు. ఇవి పూర్వమునుండి వచ్చినవి కావు. ఇంగ్లీషు ప్రభుత్వము వచ్చినతరువాతఁ బ్రభుత్వమువారి ప్రోత్సాహమువలన నింగ్లీషుకంపెనీలచే నేర్పఱుపఁబడినవి. ఈదేశ మింగ్లీషు వారిక్రిందికి వచ్చినతోడనే ప్రభుత్వమువారు స్వంతకర్చుతో తేయాకు వ్యవసాయము చేయించి తోటలు వేయించి యావృత్తి మిక్కిలి లాభప్రదము లని తెలిసికొని, యింగ్లీషు కంపెనీలకు నిచ్చివేసిరి. అచ్చటఁ దేయాకు పంటలు క్రమముగా నభివృద్ధియై యిప్పుడు యూరోపియన్ వర్తకులకు నపరిమితమైనలాభము వచ్చుచున్నది. ౧౯౧౫-౧౬ వ సంవత్సరపులెక్కలు ప్రభుత్వమువారు ప్రకటించియున్నారు. వానినిబట్టిచూడ నాయేట ౩౭౬౦౦౦ ఎకరములలో తేయాకుపండింపఁబడెను; ౨౪౫౩౭౯౨౦ పౌనుల తేయాకు పండెను. ౧ పౌను వెల సరాసరిమీద ౦-౮-౦ (అర్ధ రూపాయి) కట్టినను ఈ తేయాకువలన నాదాయము రు ౧౨౨౬౯౨౯౬౦ లు (పండ్రెండు కోట్ల యిరువదియాఱు లక్షల తొంబది రెండు వేల తొమ్మిదివందల అఱువది రూపాయిలు.) ఈ తోటలకుఁ బెట్టిన పెట్టుబడిమీఁద వడ్డీ సంవత్సరమునకు నూటికి ౨౨-౮-౦ మొదలు ౨౬-౯-౦ ల వఱకు గిట్టును! మొదట రు ౧౦౦-౦-౦ వెల గల కంపెని భాగముల వెల యిప్పుడు రు ౨౩౨-౦-౦ అయినది! ఈ

తేయాకు భూములలో ౪౦౯౪౭౬ ఎకరములు యూరోపియనుల క్రిందను, ౧౬౭౪౯ ఎకరములు మాత్రము హైందవుల క్రిందను ఉన్నవి!

అస్సాము దేశమందలి తేయాకు పాటు మిక్కిలి కష్ట మగుటచే నా పనికై యా దేశమున కూలీలు దొరకుట యసంభవము. కావున నితర దేశముల నుండి కూలీలను తీసికొని పోవుదురు. ఇతర దేశమువారును సాధారణముగ రారు. అందుపై, కూలీల యిష్టము, తేయాకుతోటవాండ్ర యిష్టము అని యూరకుండక, ప్రభుత్వమువారు అసాము కూలీలను గురించి పెక్కు చట్టములను చేసి తోటవాండ్రకుఁ గూలీలు దొరకు నట్లుగఁ జేసిరి. కూలివాండ్రకును తోటల తెల్లవారిచే బాధలు కలుగకుండ నా చట్టములలోఁ గొన్ని నిబంధనల నేర్పఱిచిరి. కాని మొత్తముమీద నీ నిబంధనలన్నియు నొక విధమైన బానిసతనమునకు సహకారులని పెక్కు ధర్మశాస్త్రజ్ఞుల యభిప్రాయములు.

౧౯౧౬వ సంవత్సరము నందు ఈ తోటలలో ౪౬౧౩౦౯ శాశ్వతపుఁ గూలివాండ్రును, అనఁగా, దమకు నిష్టము వచ్చినపుడు వెడలిపోలేని వారును, ౪౯౭౯ స్వల్పకాలపుఁ గూలివాండ్రును పనిచేయుచుండిరి. మొత్తముమీదఁ జూడఁగ వీరిలో మగవాండ్రకు నెలకు రు ౬-౧-౦ కూలియు, ఆఁడువాండ్రకు రు ౯-౩-౨ కూలియు, పిల్లలకు రు ౩-౦-౭ కూలియు నీయఁబడినది.

**దేశచరిత్ర**

అస్సాముదేశము హిందూదేశపు తూర్పు సరిహద్దులలో నుండుటచేతను, పర్వతారణ్యమయ మగుటవలనను అన్యజాతీయుల దండయాత్రలకు నంతగా పాలుగాలేదు. పూర్వకాల మీదేశమందలి చాలభాగమును "కామరూప" మనుచుండిరి. ఇం దిప్పుడు కామరూపమను జిల్లాయును కలదు. (చూఁడు కామరూపము.) పాండవుల కాలమున దీనికిఁ బ్రాగ్జోతిష పురము (గౌహటీ) రాజధానిగను, భగదత్తుఁడు రాజుగను ఉండెను. భగదత్తుఁడు నరకుని కుమారుఁడు. నరకుని కృష్ణుఁడును సత్యభామయుఁ జంపిరి. తరువాత క్రీ. శ. ౩౬౦ లోనో ౩౭౦ లోనో వేయఁబడిన సముద్రగుప్తుని శాసనమునందు కామరూపము పేరు గానవచ్చుచున్నది. అది యాతనిరాజ్యమున కొలయెల్లగా నుండెను. క్రీ. శ. ౬౪౦ లో హుఎన్ త్స్యాంగు ఈ దేశమునకు రాజు పిలిపింపగఁ బోయెను. అప్పు డచ్చటిరాజుపేరు కుమారభాస్కరవర్మ. అచ్చటి జనులు పొట్టివారు,నలుపు పసుపువర్ణము గలవారు,చూచుటకు భయంకరులు, న్యాయప్రవర్తనము గలవారు, అధ్యయనప్రియులు అని ఆతఁడు వ్రాసెను. తరువాత ౧౨వ శతాబ్దమున బంగాళములోని పాల్ రాజులు కొంతకాలము రాజ్యము చేసినట్లున్నది. కామరూపమునందుఁ బెక్కు చిన్నచిన్న రాజ్యము లుండెను. ఒకప్పుడు వారిలోనే యొకఁడు మిగిలినవారిని లోఁబఱుచుకొని సార్వభౌముఁ డగుచుండెను. ఇట్లుండ ౧౩వ శతాబ్దమునందు బర్మాదేశమునుండి అహోములను జాతివారు వచ్చి ఆసామును ఆక్రమించుకొనిరి. వీరు షాన్ జాతివారు. వీరు బౌద్ధులయినను క్రమముగ హిందువులుగ మాఱిపోయిరి. ౧౬౯౯ లో చుచెంగ్ఫా అను రాజు పూర్తిగ హిందూమత మవలంబించెను. మిగిలినవారును క్రమముగ నామతమునే అవలంబించిరి. ఆసామీలు బ్రహ్మపుత్రానదిమీదఁ జిన్నచిన్న పడవలలో బయలుదేఱి, బంగాళారాజ్యమందలి పల్లపుదేశములను దోచుకొని తిరిగి తమ పర్వతప్రాంతములకుఁ బోవుచుండిరి. అందుచే బంగాళాదేశపు మహమ్మదీయ ప్రభువులు పెక్కుసారులు వీరిమీదికిఁ దమసైన్యములఁ బంపిరి. కాని పర్వతప్రాంతములలోని వారి గెలుచుట మిక్కిలి దుస్సాధ్యమగుటవలన తురుష్కసైన్యము లచ్చటి వర్షాదులకుఁ దాళలేక, చీకాకు పొందుచుండెను. బంగాళాదేశమును గెల్చిన బఖ్త్యార్ యొక్క కుమారుఁడు మహమ్మద్ అనువాఁడు ౧౨౦౪ లో ఆసాముమీదికి దాడిపోయి, వారిని జయింపలేకపోఁగా వాఁడు తిరిగి వచ్చునప్పుడు కామరూపులు కరటోయానదిమీఁద నున్న వంతెనను పగులఁగొట్టగాఁ దనసైన్యమునంతను ఆనదిలోఁ గోలుపోయెను. శాహజహాన్ కాలమందును, ఔరంగజేబు కాలమందును (౧౬౬౦-౨) తురుష్క సైన్యములు ఆసామును జయించుటకు వెళ్లెను. గాని మిక్కిలి దైన్యతఁ బొందెను. అన్నాహారములు లేకయు, వర్షములవలనను ఔరంగజేబు సైన్యము పూర్తిగ నశించె

నని చెప్పినను చెప్పవచ్చును. ౧౮వ శతాబ్దమునందు నిచ్చటి రాజవంశమునందు నంతఃకలహములు ముదిరెను. గౌరీనాథ్ అనువాఁ డింగ్లీషువారి సాయమును కోరగా లార్డు కార్నవాలిస్ ౧౭౯౨ లోఁ గొంత సైన్యముఁ బంపి యచ్చటనున్న రెండవపక్షమువారిని నోడింపించి గౌరీనాథును రాజ్యముపైఁ గూర్చుండఁబెట్టెను. తరువాత చంద్రకాంతుఁడను రాజుకాలమున, ౧౮౧౬ లో బర్మారాజు సైన్యమును బంపి యచ్చటరాజులను తమకు నంకితులను చేసికొనిరి. తరువాత మణిపుర రాజులకును అహోంరాజులకును పోరాటమువచ్చి, వా రింగ్లీషువారి సాయమును కోరిరి. వారు వచ్చి బర్మావారితోఁ బోరాడి వారిని నోడించి ౧౮౨౬ వ సంవత్సరపు సంధి ప్రకారము అస్సామును బ్రిటిషు రాజ్యములోఁ గలుపుకొనిరి.

కాని లక్ష్మీపురజిల్లాలో దక్షిణమందున్న మొమేరియులు రాజ్యమువారి నాయకుఁడైన బోర్ సేనాపతిక్రిందనే యుండెను. సదియారాజు కూడఁ గంపెనివారి సామంతుఁడుగ నుంచఁబడెను. ౧౮౩౩ లో లక్ష్మీపుర జిల్లాలోని మిగిలిన భాగమును, శిబ్ పురమును పురందర సింహున కీయఁబడెను. కాని యీరాజ్యములు పెక్కు దినములు దక్కలేదు. ౧౮౩౮ లో పురందరసింహుఁడు "నేను రాజ్యముచేయలేను"[1] అని మనవి చేసికొనఁగా నింగ్లీషువా రాతనిరాజ్యమును తీసికొనిరి. ౧౮౩౯ లో సదియరాజును తీసివేసిరి. కాని చిన్నచిన్న సరదారులను ఉండనిచ్చిరి. వారు ౧౮౩౫ లో కర్నల్ వైటును చంపినందున వారందఱు పదచ్యుతులైరి. ౧౮౩౫ లో కాచార్ ప్రదేశపురాజు చనిపోఁగా వారసులు లేనందున కంపెనివారే వారసులైరి. ౧౮౫౦ లో తులారాం చావగా నాతని కుమారులకు రాజ్య మేలుట చేత గానందున వారి రాజ్యము కంపెనివారు వశపఱుచుకొనిరి. ౧౮౩౫ లో జంటియా రాజు బ్రిటిషు ప్రజలఁ బట్టుకొని కాళికాదేవికి బలియిచ్చుచుండుటచే నాతనికి మైదాన ప్రదేశమందు గల రాజ్యము కంపెనివారు తీసికొనిరి.

అతఁడు తరువాతఁ దనకుఁ బర్వతములలోనున్న రాజ్యము కూడ నక్కఱలేదు. అని అన్నందువలన నదియుఁ గంపెనికి వచ్చెను. ౧౮౩౩ లో ఖాసిపర్వతములు స్వాధీన పఱుచుకొనఁబడెను. నాగా పర్వతములను క్రమముగ వశపఱుచుకొనిరి.

ఆసాములోని ముఖ్య స్వదేశసంస్థానము "మణిపురము" ఇందునగుఱించి ఆశబ్దముక్రిందఁ జూడనగును.

౧౮౭౪ వఱకు ఆసాము బంగాళా రాజధానిలోని యొకభాగముగ నుండెను. తరువాత దానిని విడఁదీసి యొక చీఫ్ కమిష్నరీగా నేర్పఱిచిరి. లార్డు కర్జను బంగాళమును చీల్చినప్పుడు ౧౯౦౫ లో తూర్పు బంగాళములోఁ జేర్పఁబడెను. మరల ౧౯౧౨ నుండి వేఱు ప్రాంతముగ నేర్పఱుపఁబడెను. ఇందుపై చీఫ్ కమిష్నర్ అను అధికారి యుండును.

[కా. వీ.

**అస్సియాగుట్టలు.** బంగాళా దేశమందలి కటకజిల్లా జాజ్ పూర్ ఖండములోని పర్వతావళి. ఈ పర్వతములమీఁద నిప్పటికిని బౌద్ధ, మహమ్మదీయ, హిందూకట్టడ శేషములు గాన్పించును. ఇందు అలంగీర్, ఉదయగిరి, బరదిహి, నల్తిగిరి, అమరావతి, యనునవి ముఖ్యములైన గుట్టలు.

**అస్సీరియా.** అతిపురాతనకాలమునఁ (క్రీ. పూ. ౧౫౦౦-౬౦౬) ప్రసిద్ధివహించినట్టి సామ్రాజ్యము. ఇది యాకాలమున గొప్ప నాగరికత కలిగి పశ్చిమ ఆశియాఖండమునం దంతట విస్తరిం చెను. ఇట్టి ఘనసామ్రాజ్యము నూతన సామ్రాజ్యముల ముందర నిలువలేక

ఎల్లలు

శిథిలమై ఇసుకదిబ్బలలో ననేకశతాబ్దములవఱకు మఱుగుపడి యుండఁగా, పాశ్చాత్యులు, ౧౯వ శతాబ్దమధ్యమున ననేకమైళ్లవఱకు వ్యాపించియున్న ఇసుకదిబ్బలను త్రవ్విరి. అప్పుడందుండి అద్భుతములైన గొప్పకట్టడములు, శిల్పనైపుణ్యముఁ జూపు చెక్కడములు, అప్పటి నాగరికతఁ దెల్పు గ్రంథభాండారములు బయల్పడి అస్సీరియా సామ్రాజ్యవైభవమును ప్రపంచమునకు వెల్ల

1. "..declared himself unable to carry on the administration" Imperial Gazetteer of India vol VI p 33.

డిచేసెను. ప్రస్తుతము మెసపొటేమియా యనఁబడు దేశమునందలి ఉత్తరభాగమున నీరాజ్యముండెను. దీని కుత్తరమున ఆర్మీనియాలోని నిఫేటీస్ పర్వతములును, దక్షిణమున సూసియానా, బాబిలోనియా రాజ్యములును, తూర్పున మీడియాదేశమును, (ఇప్పటి ఖుర్డిస్థాను) పశ్చిమమున టైగ్రిస్ నదియు నుండెను. దీనివిస్తీర్ణము ౪౫౦౦౦ చదరపు మైళ్లు.

అసీరియనులు సెమిటిక్ జాతికిఁ జేరినవారు. కావున సిరియనులు, ఫొనీషియనులు, జ్యూవారు, ఇప్పటి అరబ్బీవారు గూడ నీకుటుంబములోని వారే.

ఇచ్చటి జనులు ఈ దేశమందలి శాసనములలో 'అస్సుర్' అనియును, పారసీకశాసనములలో 'అథుర' లనియును, మీడియా దేశపు శాసనములలో 'అస్సుర' లనియు పేర్కొనఁబడిరి.

వీరి మతము 'అస్సుర' మత మని చెప్పవచ్చును. వీరిముఖ్యదేవుఁడు 'అస్సురుఁడు.' ఈతనివలననే అసీరియావారందఱును పుట్టిరని వారితాత్పర్యము. ఇతఁడు గాక వీరికిఁగొందఱు భూదేవతలును, ఆకాశదేవతలును ఉండిరి. అసీరియనుల మతగ్రంథముల నుండియే పెక్కువిషయములు క్రైస్తవుల ప్రాతటెస్టెమెంటులోనికిఁ దీసికొనఁబడినవి.

క్రీ. పూ. ౨౫౦౦ ప్రాంతములందు బాబిలోనియా రాజ్యమునుండి కొందఱు అస్సీరియా రాజ్యమునకు వలసవచ్చి అచ్చటనే స్థిరనివాసము లేర్పఱచుకొనిరి. కొన్ని శతాబ్దములకు బాబిలోనియనులు అస్సీరియనులతోఁ గలసిపోయి, తమ భాషయు, మతమును, నాగరికతను వారికి నేర్పిరి. తరువాత క్రీ. పూ. ౨ వ శతాబ్దమునందు, బాబిలోనియా సామ్రాజ్యములో అస్సీరియా ఒక రాష్ట్రముగనుండెను. ఈ రాష్ట్రపాలన కొఱకు బాబిలోనియా రాజులు 'ఇస్సకు'లను రాజప్రతినిధులను నియమించుచుండిరి. ఈ రాజప్రతినిధులలో నొకఁడగు సాంసి అద్దు (౧౮౨౫) రాజధానియగు అస్సుర్‌లో 'అను' అను దేవతకు గొప్ప ఆలయము కట్టించెను. క్రీ. పూ. ౧౭, ౧౬ శతాబ్దములందు అస్సీరియనులు బలవంతులై తిరుగఁబాటు చేయఁదొడఁగిరి. బాబిలోను రాజులు తమ ప్రభుత్వమునందు నిలుపుట కెన్నియో ప్రయత్నములు చేసిరి. కాని క్రీస్తుకుఁ బూర్వము ౧౫ వ శతాబ్దమునందు అస్సీరియా రాజులు బాబిలోని యనులను లక్ష్యపెట్టక పూర్తిగా స్వతంత్రులైరి. అప్పటి నుండియు క్రీ. పూ. ౯ వ శతాబ్దము వఱకు నీ సామ్రాజ్యము, బాబిలోనియా, సిరియా, ఐగుప్తు రాజ్యములను జయించి, మహోన్నత వైభవము ననుభవించి, గొప్ప నాగరికతను పొంది క్రీ. పూ. ౬౦౦ ప్రాంతమున నస్తమించెను. ఈ ౯ శతాబ్దముల చరిత్రను 3 యుగములుగఁ జరిత్రకారులు విభజించిరి. ౧. సామ్రాజ్య సంస్థాపనము. (క్రీ. పూ. ౧౫౦౦-౧౨౫౦) ౨. సామ్రాజ్య వైభవము. (౧౨౫౦-౭౪౫). 3. సామ్రాజ్య నాశనము (౭౪౫-౬౦౬). ఇందు మొదటి యుగమును గూర్చిన శాసనములు విస్తారము దొరుకనందున, నా యుగపు రాజులను గూర్చి అంతగ తెలియదు. క్రీ. పూ. ౧౪౭౦ లో బెల్ కప్కపి అను వాఁడీ సామ్రాజ్యమునకుఁ బునాది వేసెను. ఇతఁడు టైగ్రిస్ నదీతీర భూమినంతయుఁ గ్రమక్రమమున నాక్రమించి బలవంతుఁ డయ్యెను. ఇతని రాజధాని అస్సుర్ నగరము. ఇతని తరువాత వచ్చినరాజు లితర రాజ్యముల గెలుచుచు సామ్రాజ్యము నభివృద్ధికిఁ దెచ్చిరి. షిమ్మన్ నిరారి (క్రీ. పూ. ౧౩౨౦)

**దేశచరిత్రము**

**౧ వ యుగము** అను రాజు బాబిలోనియా రాజ్యములోఁ గొంతభాగమును జయించెను. ఇతని పుత్రుఁడగు మల్మనిసర్ 'కాలా' యను నగరమును కట్టెను. మల్మనిసర్ కొడుకగు టిగ్లత్ ఆదర్ అను నతఁడు క్రీ. పూ. ౧౨౫౦ లో బాబిలోనియా రాజ్యముపైకి దండెత్తి దానిని సామంతరాజ్యముగఁ జేసికొనెను. టిగ్లత్ పైలేసర్ (౧౧౪౦) అను వాని ప్రభుత్వకాలమున అస్సీరియా సామ్రాజ్యము మహోన్నతదశకు వచ్చెను.

**౨ వ యుగము** ఇతఁడు మహాశూరుఁడైనందున సిలీసియా, ఆర్మీనియా, ఫొనీషియా మొదలగు పరరాష్ట్రములను జయించి పడమట మధ్యధరా సముద్రము వఱకును, దక్షిణమున పర్షియన్ జలసంధివఱకును రాజ్యపు సరిహద్దుల జరిపి పశ్చిమ ఆసియా ఖండమునంతయు

నేకచ్ఛత్రాధిపత్యముగ నేలెను. కాని యితని పుత్రుఁడగు అస్సుర్ బెల్ కల యనువాఁడు దుర్బలుఁడగుటచే తండ్రి కష్టపడి సంపాదించిన పరరాష్ట్రములను బోఁగొట్టుకొనుటయేగాక, తాను ఆర్మీనియా రాజున కొక సామంతుఁడయ్యెను! ఈదుస్స్థితినుండి అస్సీరియా ౧౫౦ఏండ్ల వఱకును కోలుకొనలేదు. ఈ వంశములోని కడపటివానిఁ జంపి అస్సుర్ దాను (క్రీ. పూ. ౯౩౦) అనువాఁడు రాజై అస్సీరియా రాజ్య స్వాతంత్ర్యమును నిలువఁబెట్టెను. ఇతని తఱువాతవచ్చిన రిమ్మన్నిరారి (౮౯౦) అస్సుర్ నత్సిగుపాల్ అను రాజులు బలవంతులై పరరాష్ట్రములపై దాడివెడలి, ఇదివఱకుఁ గోలుపోయిన రాజ్యమును జయించుటయేగాక, ఆర్మీనియా, కుర్దిస్థాన్ మొదలగు దేశముల నాక్రమించిరి. ఇందు అస్సుర్ నత్సిరుపల్ ( క్రీ. పూ. ౮౮౫-౮౬౦) అనువాఁడు, మహాశూరుఁడయ్యును, అతిక్రూర స్వభావము గలవాఁ డగుటచే తా నడుగుపెట్టిన ప్రదేశమంతయు నిర్ధూమధామముఁ జేసెను. ఇతఁడు తండ్రినిజంపి రాజ్యమునకు వచ్చెను. ఇతఁ డనేక దేశములను జయించినట్లు శాసనములఁ జెక్కించెను. ఇతని తఱువాతవచ్చిన రాజులందఱును విఖ్యాత శూరాగ్రేసరులై ఓటమి యన్నమాట నెఱుంగక, తూర్పుననున్న మీడియాదక్షిణముననున్న బాబిలోనియా, ఉత్తరముననున్న ఆర్మీనియా మొదలగు రాజ్యములపైకి దండెత్తి వానినుండి కప్పముల గ్రహించి పశ్చిమ ఆసియా ఖండమునంతయు శాసింపఁగలిగిరి. మూఁడవ అస్సుర్ దాన్ అనువాని రాజ్యకాలమందు సామంతరాజులు తిరుగఁబడిరి; దేశమునందు కాటకము పుట్టెను. క్రీ. పూ. ౭౬౩ లో సూర్యగ్రహణము కలిగెను. ఇతనితో నీవంశము అంతరించెను.

3 వ యుగము

ఇఁక 3 వ యుగ ప్రారంభము. ఈ యుగమునందే అస్సీరియా సామ్రాజ్యము మహావైభవదశ ననుభవించి ఒక్కమారుగ జుట్టుముట్టిన విపత్పరంపరల వలన తుత్తునియలయ్యెను. క్రీ. పూ. ౭౪౫ లో రెండవ టిగ్లాత్ పైలెసర్ అను నతఁడు (౭౪౫-౭౨౭) రాజ్యము నాక్రమించి తిరుగఁబడిన సామంతరాజ్యముల గర్వమడచి పాలస్తీనాను కూడ జయించెను. ఇతని తఱువాత వచ్చిన నాలవ షాల్మనీసర్ (క్రీ. పూ. ౭౨౭-౭౨౨) అను నతఁడనేక దేశములను జయింపఁ దలపెట్టి అకాలమరణ మొందినందున నతని భృత్యుఁడగు సార్గాన్ (క్రీ. పూ. ౭౨౨-౭౦౫) ఆదేశముల నన్నిఁటిని గెల్చుటయేగాక క్రీ. పూ. ౭౦౯ లో బాబిలోను రాజ్యమును బూర్తిగ జయించి తన రాజ్యములోఁ గలుపుకొనెను. ఇతనికి మెసెప్, కమజెని, సైప్రస్, ఆర్మీనియా, మొదలగు పెక్కుదేశముల రాజులు వశులై కప్పములఁ గట్టఁదొడంగిరి. ఈతఁడు దూర్ సర్గినా యనుచోట ఖ్యాతిచెందిన రాజమందిరము కట్టించెను. ఆ గ్రామము నిప్పుడు ఖొరాసాబాద్ అందురు. ఈతఁడు క్రీ. పూ. ౭౦౫ లోఁ జంపఁబడె. ఈతని పెద్దకుమారుఁడైన సెన్నాచెరిబ్ రాజయ్యె.

ఈతఁడు బాబిలోనియా, ఎలం, రాజులతో యుద్ధము చేసి వారిని నోడించెను. జుడ్డారాజయిన హెసెకియాతోఁ బోరాడి జరుసలేమును ముట్టడించెను. ఈతఁడీతని కుమారులచేఁ జంపఁబడియె. (క్రీ. పూ. ౬౮౧) ఈతని చిన్నకుమారుఁడు ఎసర్ హడ్డాన్ అనువాఁడు రాజయ్యె.

ఈతఁడు మిక్కిలి పరాక్రమము చూపుటయేగాక శాంతుఁడని పేరువడసెను. సిడోన్, స్మ్యాండు అరి రాజుల నోడించి వారితలలు నినేవాకు దెచ్చెను. ఈజిప్టును జయించి, అసీరియాకులోఁ బడునట్లు చేసెను. క్రీ. పూ. ౬౬౮ లో నీజిప్టుకు మూఁడవతడవఁ బోవుచుండగ మృతుఁడయ్యె. అసుర్-బాని-అప్లీ అనువాఁడు రాజయ్యె.

ఈతనికాలమందు అసీరియన్ సామ్రాజ్యవైభవము పరమావధిఁ జేరె. పెరుగుట విరుగుట కొఱకె యన్నట్లు ఈతనిరాజ్యమందే దాని పతనకారణములును ప్రారంభమయ్యె. ఈజిప్టువారు తిరుగఁబడగ నీతఁడు వారిని నోడించెను. అప్లీ ఎలామియా రాజును చంపెను. ఆ రాజ్యము రెండు విభాగములుచేసి తనకు నిష్టమువచ్చిన వారిని రాజులుగ నియమించెను. బాబిలోనియాలో నీతని తమ్ముఁడె తిరుగఁబడ నచ్చటికిఁ దన సైన్యములఁ బంపి వానిని ఓడించెను. (చూఁడు బాబిలోనియా) అరేబియా, అరారాటులకుఁ దనపౌరుషముఁ జూపె.

అసీరియాకుఁ జివర రాజు సిన్‌సరా ఇన్‌కుస్. ఈతనికాలములో సామంతరాజులు తిరుగఁబడిరి. అంత నాతఁడు రెండుసైన్యముల సిద్ధపఱచి ఒకదానిని నెబొపొలస్సార్ అను సేనాధిపతికిచ్చి బేబిలోనియామీదికిఁ బంపెను. కాని యా సేనాధిపతి తిరుగఁబడి శత్రువులలోఁ జేరి నినెవామీదికి దండెత్తివచ్చెను. ఒకవైపు టైగ్రిస్‌నదియు నుప్పొంగి గోడ పగుల పట్టణముమీదఁ బడ, మఱియొకవైపు శత్రువులురాగా రాజు నాశము నిశ్చయమనియెంచి తన రాజభవనమునకు నిప్పుముట్టించి యందు హతుఁడయ్యెను (క్రీ. పూ. ౬౦౯). ఇట్లసీరియన్ సామ్రాజ్య మస్తమించెను!

తరువాత (క్రీ. పూ. ౬౦౦) అసిరియా మీడ్సు వారి స్వాధీనమయ్యె. అటుతరువాత నది పారశీకుల వశమున నుండెను. క్రీ. పూ. 3౩౧ లో అలెగ్జాండరు ది గ్రేటు అసీరియాలో డేరియస్ అను పారసీక రాజు నోడించి వశపఱుచుకొనెను. తదుపరి సెల్యూసిడి వారి క్రిందను, పార్థియనుల క్రిందను, రోమనుల క్రిందను ఉండెను. మహమ్మదు తరువాతివారు శాసనైదు రాజుల పరిభవించి అసిరియాను తీసికొనిరి. ఇట్లు బగ్దాదు ఖలీఫుల క్రిందికివచ్చెను. ౧౬3౮ నుండి యిది తుర్కీవారి క్రిందనే యున్నది.

పూర్వకాలము మిక్కిలి యున్నతదశను అనుభవించి యస్తమించిన మహాసామ్రాజ్యములలో నియ్యది యొకటి. యుద్ధవిద్యయే గాక, కృషి, శిల్పకవిత్వాది కళలును, శాస్త్రములును ఈదేశమునందు మిక్కిలి యభివృద్ధిఁ జెందియుండెను.

నాగరకతాభివృద్ధి:

యుద్ధవిద్యలో వీరు మిక్కిలి నిపుణులై యుండిరి. ఒకచోటినుండి మఱియొకచోటికిఁ బోవుటలో వీరి చాపల్యము కడు శ్లాఘనీయము. వీరు బండ్లమీఁదఁ దీసికొనిపోవుటకు వీలయిన యెత్తుగోపురములను నిర్మించి, వానికొఱకు సన్నబాటలుచేసి వానిని లాగుకొనిపోయి శత్రుకోటలను సాధించునప్పుడు వీనిని ఉపయోగించుచుండిరి. వారి కవచములును యుద్ధమునందు వీరిని రక్షించుటకు నధికముగ నుపయోగపడుచుండెను. శిల్పవిద్యయందుఁ గూడ వీరతిప్రవీణులైరి. పెద్దపెద్ద మందిరములకు నుపయోగముగ కమానుల (arches) నిర్మించుట, పట్టముఁజూపు యంత్రముల నుపయోగించుట, అనకట్టలఁ గట్టుట, నీటికాలువల నిర్మించుట మొదలయిన విద్యలన్నియు వారు చక్కఁగ నెఱిఁగియుండిరి. లోహసంబంధమైన పనులు వారికి బాగుగఁ దెలిసియుండెనని వారి నగళే చెప్పుచున్నవి. చెక్కడపుఁ బనితనముకూడ వీరత్యద్భుతముగఁ జేయుచుండిరి. అట్టి చెక్కడములు కొన్ని బ్రిటిషు మ్యూజియమునం దున్నవి. వానిఁజూచి తజ్ఞులెంతయు నాశ్చర్యమును నొందుచున్నారు.

అసిరియాకు రాజధానియైన నినెవలోని, అసూర్ ఖనిపాల రాజుయొక్క రాజమందిరము దిబ్బ త్రవ్వి చూడగా నందు బ్రహ్మాండమైన గ్రంథసంగ్రహాలయము దొరికెను. అది యంతయుఁ గాల్చిన యిటుకల మీద వ్రాయఁబడియున్నది. వాని నన్నిటిని కష్టపడి తజ్ఞులు చదివిరి. అందు అసీరియా చరిత్రమును బాబిలోని యా చరిత్రమును, గణితశాస్త్రములును, వర్గమూల ఘనమూల పట్టికలును, వనస్పతి మృగముల వర్ణనములును, పెక్కు కావ్యములును కలవు. [శా. వి.

**అస్సుర్.** ౧. అస్సీరియా సామ్రాజ్యమునకు మొదటి రాజధాని. ఇప్పుడిది కాలేషర్‌ఘాట్ దిబ్బలలో నణగియున్నది.

౨. అస్సీరియనుల ముఖ్యదైవము. ఇతఁడు హిందూ మతమునందలి విష్ణుమూర్తినిఁ బోలును.

3. బైబిలు గ్రంథమునందు అస్సీరియా సామ్రాజ్యమునకుఁ బెట్టిన పేరు.

**అస్సేయి** హైదరాబాదు సంస్థానమందలి ఔరంగాబాదు జిల్లాలోని భోకర్దన్ తాలూకాలో నొకగ్రామము. జనసంఖ్య 3౦౨. ఇచ్చట ౨3 సెప్టెంబరు ౧౮౦3 లో మహారాష్ట్రులకును, ఇంగ్లీషువారికిని ఒకగొప్ప యుద్ధము జరిగెను. మహారాష్ట్రు లోడిరి.

**అహంయాతి.** (చం. వం.) పురుకులోత్పన్న సంయాతి రాజునకుఁ బుత్రుఁడు. రౌద్రాశ్వ పుత్రుఁ డనియు...

**అహమద్.** ౧. (౧౫౮౯-౧౬౧౭) తుర్కీ (Turkey) దేశమునకు సుల్తాను. 3 వ మహమ్మదు కుమారుఁడు. ౧౬౦3 లో రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు మిక్కిలి బలశాలి, దయఁ గలవాఁడు. తన తమ్ముఁడగు ముస్తఫాను చంపవలసిన దన్న సలహాను వినలేదు. మిక్కిలి విషయాసక్తుఁడు. ఇతనికి 3000 ఉంపుడుకత్తె లుండిరి! హంగెరీ, పారసీక దేశములలో నీతని సైన్యమునకుఁ బరాభవము కలిఁగెను. ౧౬౦౬ లో జరిగిన సంధివలన ఆస్ట్రియావా రదివఱకు తుర్కీ సుల్తానుకు కట్టుచున్న కప్పము నాపివేసిరి. ఈతని చరమ దశయందు రాజ్యమునందలి యధికారులందఱును అనీతిపరులై పైయధికారుల మాటఁ బాటింపరైరి.

౨. (౧౬౪3-౧౬౯౫) తుర్కీ సుల్తాను. సుల్తాను ఇబ్రాహీమ్ కుమారుఁడు. తన అన్నయైన ౨ వ సులేమాన్ తరువాత ౧౬౯౧ లో రాజ్యమునకు వచ్చెను. ఇతని రాజ్యకాలమునందు ఆస్ట్రియా దేశీయులు తుర్కీవారి నోడించి హంగేరీనుండి వెడలఁగొట్టిరి.

3. (౧౬3౭-౧౭3౬) తుర్కీ సుల్తాను. ౪ వ మహమ్మదు కుమారుఁడు. ఇతని యన్నయైన ౨ వ ముస్తఫా రాజ్యము వదలుకొనఁగా ౧౭౦3 లో సుల్తానయ్యెను. రుష్యావారి భయమున ఇంగ్లండుతో స్నేహముఁ జేసెను. స్వీడన్ రాజైన ౧౨ వ చార్లెసు తనదేశము నుండి పారిరాఁగా నాతని కాశ్రయమిచ్చి మిగుల గౌరవించెను. రుష్యాతో యుద్ధముచేసి ౧౭౧౧ లో దానిని బూర్తిగ నోడించెను. ఆస్ట్రియావారితోఁ బోరాడి యోడిపోయెను. పారసీకులతో యుద్ధముచేసి పరాభవము చెందినందున ప్రజలు తిరుగఁబడి ఈతనిని ౧౭3౦ లో రాజ్యభ్రష్టుని గావించిరి. చెఱలోనే ఇతఁడు మరణించెను.

౪. (౧౭౭౪-౧౭౮౯). తుర్కీసుల్తాను. 3వ అహమ్మదుకుమారుఁడు. తన యన్నయగు 3 వ ముస్తాఫా తరువాత రాజ్యమునకు వచ్చెను.

**అహమదనగర** (జిల్లా). బొంబాయి రాజధాని, మధ్యభాగమందు నున్న యొక జిల్లా. దీనికి నీశాన్యమున నైజాము రాజ్యము కలదు. ఈశాన్యమున నిక్కడ ... ఈ రెంటికి గోదావరినదియే హద్దు. వైశాల్యము ౬౫౮౬ చ. మైళ్లు. జనసంఖ్య ౮3౭౬౯౫. డాలురు ౨౭౦౯౦౦౦ లు. ఇందు ౧౧ తాలూకాలు గలవు. ఇచ్చటి భాష మహారాష్ట్రము.

ఈజిల్లాకుఁ బడమర సరిహద్దుమీఁదఁ బడమటి కనుమలలోని పర్వతము కలదు. వాయవ్యమునందు కల్సుబాయి అనుగుట్ట ౫౪౨౭ అడుగుల యెత్తున్నది. ఇచ్చట పట్టా, హరిశ్చంద్రగడము లను దుర్గములు కలవు. ఈ జిల్లాలో నింకను పెక్కుకోట లున్నవి. ఈ జిల్లాలోని ముఖ్యనది గోదావరి. ఇది ౪౦ మైళ్లు పొడవున నీ జిల్లాను ఉత్తరమునను, ఈశాన్యమునను అంటియున్నది. దీని ఉపనదులు పెక్కులు గలవు. దక్షిణమున 3౫ మైళ్లు భీమానది సరిహద్దుగ నున్నది. ఈ జిల్లాలోఁ బెద్ద పెద్ద బండలతోఁ గట్టఁబడిన హేమాడపంథి దేవాలయములు పెక్కులు గలవు. ఇవి ౧౨ వ శతాబ్దమునాటివి అని యందురు.

ఇందలి ముఖ్యగ్రామములు అహమద నగరము, సంగమ్నేర్, పాథరడి, వాంబోరి, ఖర్డా.

ఇందలిజనులలో మరాతా, కున్బీ, జాలివా రెక్కువ. లంబాడి, కైకాడి, కొల్హాటీ లను మోటుజాతులవారును కలరు.

జిల్లాయంతయు రైతువారి అమరకము. నూటికి ౧౫ వంతున ఈనాములు కలవు. ౮౫౦ చ. మైళ్ల అరణ్యము కలదు. నాపబండలు ఇండ్లకు నక్కఱవచ్చు వేఱురాళ్లు దొరకును. ఇచ్చటి చీరెలు పేరొందినవి. పూర్వమిందు కాగితము, తివాచీలు చేయుచుండిరి. ఇప్పు డీవృత్తులు చచ్చినవి. ఇచ్చటఁ గొన్ని ఫ్యాక్టొరీలు కలవు. ఈ జిల్లాలో జి. ఐ. పి. రైలు ౧౨౨ మైళ్లు వ్యాపించియున్నది. ౭౫౮ మైళ్ల రోడ్లు గలవు.

ఈజిల్లా క్రీ.శ ౫౫౦ మొదలు ౭౫౭ వఱకు పశ్చిమ చాళుక్యుల స్వాధీనమం దుండెను. తరువాత రాష్ట్రకూటుల చేతులలో ౯౭3 వఱకుండెను. అటుపిమ్మట కళ్యాణచాళుక్యులు ౧౧౫౬ వఱకును, కాలచుర్యులు ౧౧౫౭ వఱకును దేవగిరియాదవులు ౧3౧౮ వఱకును ఏలిరి. ౧3౪౬ లో బహామనీ తురుష్కులు రాజులైరి. ౧౪౯౦ లో నచ్చటి పాలకుఁడు తిరుగఁబడి స్వతం

త్రుఁడై "నిజాంశాహి" వంశమును స్థాపించెను. తాను గెలిచినచోట 'అహమదనగర' పట్టణమును కట్టెను. ౧౬౩౫ లో మొగలులు 'నిజాంశాహి'ని గెల్చిరి. ౧౬౩౫ లో శాహజహాన్ దీనిని మొగ్లాయి రాజ్యములోఁ గల్పెను. ౧౭౫౯ లో మరాటావారికి వశమయ్యెను. ౧౭౯౭ లో పేష్వా దీనిని శింధియాకిచ్చెను. ౧౮౦౩ లో నింగ్లీషువారి స్వాధీన మయ్యెను. కాని మరల నీయఁబడి, ౧౮౧౭ లో మరలఁ దీసికొనఁబడె. ౧౮౬౧ లో సింధియా ౧౨౦ గ్రామములను, ౧౮౮౨ లో నైజాము ౧౦౭ గ్రామములను ఇయ్యగా నవియు నీ జిల్లాలోఁ జేర్పఁబడెను. ఇచ్చట మంచికోట యున్నది. అందు ౧౯౦౧ లో బోయెర్ యుద్ధ సమయమున ౫౦౦ మంది బోయెర్ ఖైదీలను ఉంచిరి.

ఈ ప్రదేశము కఱవులవలన మిక్కిలి బాధపడుచుండును. ౧౮౭౭, ౧౮౯౭, ౧౮౯౯ ఈసంవత్సరముల లోని కఱవులవలన నిచ్చటి ప్రజలకును పశువులకును చాల ఆపత్తు వాటిల్లెను.

**అహమదనగర** (గ్రామము) బొంబాయి రాజధానిలోని మహికాంత యేజన్సీలోఁ జేరిన ఈడర్ సంస్థానమునకు ముఖ్యస్థలము. జనసంఖ్య ౩౨౦౦. దీనిచుట్టు రాతికోట కలదు. అది ౧౪౨౬ లో ౧ వ సుల్తాన్ అహమద్ (౧౪౧౧-౪౩) అను వానిచేఁ గట్టింపఁబడె నందురు. ఇప్పుడు రాజ్యముచేయుచున్న రాజపుత్రులు ఈడరును, ఈ గ్రామమును, ౧౭౨౮ లో స్వాధీనపఱుచుకొనిరి. ఇచ్చటఁ బూర్వ మందిరముల యవశేషములు కలవు. ఇప్పటి మహారాజుచేఁ గట్టింపఁబడిన రాజమందిరము గలదు.

**అహమదనగర** (తాలూకా). అహమ్మదనగర జిల్లాలోని తాలూకా వైశాల్యము ౬౨౪ చ. మై. జనసంఖ్య ౧౨౮౦౯౪. డౌలు రు ౧౭౦౦౦౦ లు. ఇందు ౧౧౭ గ్రామములు కలవు.

**అహమదనగర** (పట్టణము). అహమదనగర జిల్లాకు ముఖ్యపట్టణము. పుణేఁ (పూనా) బట్టణమునకు ౭౫ మైళ్లమీద నుండును. జనసంఖ్య ౪౨౦౩౨. ఈ పట్టణము చుట్టు ౧౨ అడుగుల ఎత్తు మట్టిగోడ గలదు. దానికి నచ్చటచ్చట బురుజులును ద్వారములును గలవు. ఇప్పు డివన్నియు శిథిలము లయినవి. ఈ గోడ ౧౫౬౨ లో హుస్సేను నిజాముషా కట్టించెనఁట. ఇది నిజాముషాహి రాజులకు రాజధానిగ నుండెను. ౧౪౯౪ లో అహమ్మదుషా దీనిని కట్టించెను. ౧౫౯౬ లో అక్బరు కుమారుఁడైన మురాదు ఈ పట్టణమును ముట్టడించినపుడు చాన్ద్ బీబీ అను నామె మిక్కిలి పౌరుషముతో దీనిని కాపాడెను. మిగిలిన చరిత్రము అహమ్మదు నగరజిల్లాక్రిందఁ జూడనగు. పట్టణమునకు అరమైలు దూరమున తూర్పుభాగమందు గుండ్రటి రాతిగోడ గల దుర్గ మొకటి కలదు. దాని చుట్టుకొలత ౧½ మైళ్లు. దీని చుట్టు విశాలమైన అగడ్త గలదు. ౧౫౫౯ లో దీనిని హుస్సేను నిజాముషా కట్టించెను. ఈ పట్టణమునందును చుట్టుపట్టులను మహమ్మదీయ శిల్పనైపుణిని జూపునట్టి పెక్కు మసీదులును దుర్గములునుగలవు. చక్రవర్తియైన ఔరంగజేబు ఇచ్చటనే మరణము నొందెను. అతని గోరీ ఆలంగీరు దర్గా అను పేరిట గలదు. ఇచ్చట మూడు హైస్కూళ్లు గలవు. సైన్యశిబిరము గలదు.

**అహమదుపుర.** (తాలూకా) పంజాబులోని భావలపుర సంస్థానమందలి యొక తాలూకాయు, నిజామత్తును. సత్ లజ్ నదికి దక్షిణమునను పశ్చిమమునను ఉండును. వైశాల్యము ౨౧౦౭ చ. మై. జనసంఖ్య ౧౧౧౨౨౫. డౌలు రు ౨౨౦౦౦౦ లు.

నిజాముషాహి చరిత్రమును, ఈ పట్టణచరిత్రమును అధికముగ తెలిసికొనఁ గోరువారు విజ్ఞాన చంద్రికా గ్రంథమాలలోని మహమ్మదీయమహాయుగము ౪ వ ప్రకరణము, అహమ్మదునగరపు నిజాముషాహి, చూడనగు.

**అహమదాబాదు** (జిల్లా) బొంబాయి రాజధానిలోని యొక జిల్లా. బడోదారును, కాఠేవాడ్ కును నడుమ కాంబేజలసంధికి పై భాగమున నున్నది. విస్తీర్ణము ౩౮౧౬ చదరపుమైళ్లు. జనసంఖ్య ౭౯౫౯౬౭. డౌలు రు ౬౨౩౪౦౦౦ లు భాష గుజరాతి ఈ ప్రదేశముపై నొకప్పుడు సముద్ర ముండె ననుటకు దృష్టాంతములు గలవు. ఇందలి ముఖ్యనది సాబరమతి.

దీనికి ౪ ఉపనదులు గలవు. వీని కాలువల క్రింద 3000 ఎకరములు సాగగును. ఈ జిల్లాలోఁ గొన్ని పెద్ద చెఱువులు కూడ కలవు. ఇం దరణ్యప్రదేశ మంతగా లేదు. ఇచ్చట వేడిమి ఒకప్పుడు ౪౭° ను, ఒకప్పుడు ౧౧౫° ను ఉండును. వర్షాపాతము ౨౯ అంగుళములు. సాబరమతి వఱద లప్పుడప్పుడు వచ్చి ప్రజలకు మిక్కిలి నష్టము కలుగఁజేయును. ౧౭౧౪, ౧౭౩౯, ౧౮౬౪, ౧౮౭౫ సంవత్సరములలో నిట్టి వఱదలు వచ్చెను. ఇందలి భూమిలో సగము తాలూకదారీ యమరకము క్రిందను, 3 వ వంతు రైతువారీ యమరకము క్రిందను, నూటిలో ఆఱవవంతు ఈనాముల క్రిందను ఉన్నది. ఇందు మంచిప్రత్తియు, మంచి బియ్యమును సజ్జలు, జొన్నలును పండును. ఇది ౬ తాలూకాలుగ విభజింపఁబడినది. ఈ జిల్లా కళాకౌశల్యములను గుఱించి చిరకాలమునుండి పేరొందినది. అందు పెక్కు అహమదాబాదు నగరమునందే కలవు. ఖారాఘోడా అనుచోట ఉప్పు తయారుచేయఁబడి గుజరాతు దేశమునకుఁ బంపఁబడును. భూమికి ౧౮-30 అడుగుల క్రింద నున్న ఉప్పునీళ్లలోనుండి యుప్పు తీసెదరు. ఈ యుప్పునీరు సముద్రపునీటికంటె బరువైనదిగను, ౬ రెట్లధికము ఉప్పుకలదిగను ఉండును. ఇచ్చట సురేకారము గూడ తయారు చేయుదురు. బట్టలు, పట్టువస్త్రములు, వెండి బంగారు పనితనము, ఇనుము, రాగి ఇత్తడిపాత్రలు, కుమ్మరిపని, కఱ్ఱపని, పాదరక్షలు గొంగళ్లు ఇందు చేయఁబడును. ఈజిల్లా అతివృష్టి అనావృష్టులవలన పెక్కుపర్యాయములు మిక్కిలి పీడింపఁబడినది.

ఇది ౭ మొదలు ౧౩ వ శతాబ్దమువఱకు అన్హిల్‌వాడా రాజులక్రింద నుండెను. తరువాత మహమ్మదీయులకు వశమైనను కొంతవఱకు స్వతంత్రులైన భిల్ల నాయకులక్రింద ఈ జిల్లాలోని చాల భాగ ముండెను. ౧౭౭౨ లో వీరందఱును అక్బరు చక్రవర్తికి సామంతులైరి. ౧౭౫౩ లో మహారాష్ట్రుల స్వాధీన మయ్యెను. ౧౮౦౩ లో ఇంగ్లీషువారివశమయ్యెను. ౧౮౧౮ లో పేష్వా యోడింపఁబడిన తరువాత మఱి కొంతభాగ మింగ్లీషువారిక్రిందికి రాగా ఆసంవత్సరముననే ఇప్పటి అహమదాబాద్ జిల్లా స్వతంత్రముగ నేర్పడెను.

# అహమదాబాదు పట్టణము.

అహమ్మదాబాద్ జిల్లాకు ముఖ్యపట్టణము. సాబరమతీ నదీ తీరమున నున్నది. పశ్చిమ హిందూదేశమునందలి పట్టణములలో మిక్కిలి చక్కనిదియు, అభివృద్ధిఁ జెందుచున్నదియు నని పూర్వము విఖ్యాతి కెక్కియుండెను. ఇప్పటికిని చక్కఁదనమునందును, కట్టడముల పనితనమునందును ఆగ్రా, ఢిల్లీల తరువాత దీనినే చెప్పవలసియుండును. జనసంఖ్య ౨౧౫౮౩౫. ఇది ౧౪౧౧ లో అహమ్మదుషాహచే నిర్మింపఁబడియె. ఆతఁ డెంతయో దూరమునుండి చలువరాతిశిలలను దెప్పించి పెక్కు దివ్యమందిరములను గట్టించెను. ౧౬౧౫ లో ఇంగ్లీషు రాయబారి యగు సర్ థామస్‌రో అను నతఁడు దీనిఁజూచి 'ఈ చక్కని నగరము లండను నగరమంత వైశాల్యము గలది'యని వ్రాసెను. ౧౪౧౧-౧౫౧౧ వఱకు నిది ఆకారమునందును వైభవమునందును హెచ్చెను. ౧౫౧౨-౧౫౭౦ వఱకు దీని వైభవము తగ్గెను. ౧౫౭౨-౧౭౦౯ వఱకు మొగల్ చక్రవర్తుల కాలమున దీని ఘనత మఱల హెచ్చెను. ౧౭౦౯-౧౮౦౯ వఱకు తగ్గెను. ౧౮౧౮ తరువాత నేటివఱకు క్రమముగ నభివృద్ధిఁ జెందుచున్నది. ఈ పట్టణము చుట్టును గొప్ప ప్రాకారము ౧౫-౨౦ అడుగులయెత్తు కలదు. ఇందు ౧౪ ద్వారములును, ౫౦ గజములకొక్కొక్క బురుజును గలవు. ఈనగరమునందు దర్శనీయములైన పెక్కుకట్టడములుగలవు. ఇవి హిందువుల యొక్కయు, జైనుల యొక్కయు, మహమ్మదీయుల యొక్కయు శిల్పనైపుణ్యమును వేయినోళ్లఁ గొనియాడుచున్నవి. తురకల మసీదులును గోరీలును ఎన్నియో చూచువారికి గనుల పండువుగ నుండును. హాత్తీసింగ్ అను జైనదేవాలయమునందలి శిల్పనైపుణ్య మత్యద్భుతము. అట్లే సిద్దీ సయ్యద్ మసీదులోని ౨ కిటికీల చెక్కడపుఁబని ఆగ్రా డిల్లీలోఁ గానవచ్చెడు పనితనమును మించియున్నది. ఇచ్చట బట్టలు నేయు యంత్రశాలలు 3౪ కలవు. ఈ విషయమునందు ఇంగ్లీషు వారితోఁ బోటికి తూగినది బొంబయి తరువాత ఈ పట్టణమే యని చెప్పవలెను. ఈ పట్టణమందును, జిల్లాయందును వేఱువేఱుపనిపాటలవారికి వేఱువేఱు పంచాయతులు గలవు. ఆయా సరకులు చేయుటను గూర్చి

యు, అమ్మకటను గూర్చియు ఈపంచాయతీవారు నియమము లేర్పఱచుకొందురు. ఆ ప్రకార మందఱు నడచుకొందురు. పట్టణమునకు ఉత్తరమున 3 మైళ్ల దూరమున సైన్య శిబిరమును, మందుగుండు కొట్లును కలవు. సాబరమతి నది యొడ్డున గొప్ప కారాగృహము గలదు. అందిప్పుడు జర్మను ఖైదీల నుంచుచున్నారు.

## అహమ్మద్ ఖాన్.

(బంగష్) ఫరుక్కాబాదు నబాబు. ఈతని అన్నమరణానంతరము వజీర్ సఫ్దరు జంగ్ అనువాఁడు ఈతని రాజ్యమును జప్తు చేయగా నీతఁడు అఫ్ గాన్ సైన్యమును పోగుఁజేసికొని ౧౭౫౦ లో తనరాజ్యమును వశపఱుచుకొనెను. ౧౭౭౧ వఱకు రాజ్యముచేసి మరణము నొందెను.

## అహమ్మద్ ఖాన్.

(మేవాటి) ఒక చిన్న నాయకుఁడు. డిల్లీలో సయ్యదు వంశమువారు రాజ్యము చేయునపుడు వారు బలహీనులగుటచే నీతఁడు డిల్లీసామ్రాజ్యమందలి పెక్కుభాగముల నాక్రమించుకొనెను. ఇతని రాజధాని మేవాట్. బహలూల్ లోది ఇతనిని వశపఱుచుకొనెను.

## అహమ్మద్ ఖాను.

(సర్ సయ్యదు) చూడు సయ్యద్ అహమ్మద్ ఖాన్.

## అహమ్మద్ నిజాంషాబహారి.

(౧౪౮౯-౧౫౦౮) దక్షిణమున అహమ్మదు నగరములో నిజాంషాహి వంశమును స్థాపించిన మూలపురుషుఁడు. బహమనీ సుల్తానైన మహమ్మూద్ షాహాకు (౧౪౮౨-౧౫౧౮) నీతఁడు ముఖ్యమంత్రిగనుండె. తరువాత స్వతంత్రుఁడై ౧౪౯౦ నుండి తనపేరిటనే రాజ్యము చేయఁదొడఁగెను. వీనితండ్రి మొదట బ్రాహ్మణుఁడుగనుండి బలవంతముగ మహమ్మదీయునిగ జేయఁబడెనఁట. ఈతఁడు తనప్రజలకు సెట్టి భయము లేకుండ రాజ్యము చేసెను. అందుచే ప్రజ లొకచోటినుండి మఱియొకచోటికి బంగారు నెగురవేసికొనుచు పోవుచుండిరఁట. ఈతఁడు ౧౪౯౪ లో అహమ్మద్ నగరము కట్టించి దానిని తాను రాజధానిగ చేసికొనెను. ఈతని సద్గుణములను వర్ణించుటకు నేనసమర్థుఁడ నని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు. ఈతఁ డేకపత్నీవ్రతమును పాలించెను. ఈతని ప్రభుత్వకాలములో లోకులు కుస్తీపట్లు పట్టుట, సాముగరడీలు చేయుట మొదలైన పౌరుష సూచకములగు వ్యాయామముల విశేషముగ నేర్చిరి.

## అహమద్ శాహ అబ్దాలి.

(౧౭౨౨-౧౭౭౨) ఇతఁడు అఫ్ గానిస్థాన్ దేశము నేలిన యొకరాజు. ఇతఁడు 'దుర్ ఇదురాన్' (ఈ యుగమునకు ముత్యము) అను బిరుదమును రాజ్యారూఢుఁడగు కాలమునఁదు ధరించెను. ఇతఁడు అబ్దాలీ జాతి యొక్క నాయకుని పుత్రుఁడు. ఈ అబ్దాలీజాతి హిరాత్ పట్టణసమీపమున నున్నది. ఇతఁడు బహుచిన్న వయసుననే పారసీకదేశపు రాజగు నాదిర్ శాహావలన పట్టుఁబడి అతనివద్ద వేత్రహస్తుఁడుగ నియమింపఁబడెను. క్రమక్రమమున నీతఁడు తన తెలివితేటలచే రాజుయొక్క మెప్పును పొంది కొంతసైన్యమున కధిపతి యయ్యెను. నాదర్ షాహ మరణానంతర మీతఁడు కందహారు వశపఱుచుకొని (౧౭౪౭) నూతన రాజవంశమునకుఁ గర్త యయ్యె. కాబూల్, పెషావర్, లాహోర్ పట్టణములఁ బట్టుకొనెను. ౧౭౪౮ లో డిల్లీమీదికి నెత్తివచ్చెను. కాని సర్ హింద్ వద్దనే డిల్లీశ్వరుని సేన లెదురైనందున గొంత వారితోఁబోరి పెక్కుధనము దోచుకొనివెళ్లెను. ౧౭౫౭ లో ఆగ్రా డిల్లీలవఱకు నెత్తి వచ్చి, మథురా పట్టణముల దోచుకొనివెళ్లెను. ఇతని స్వాధీనమందున్న లాహోరును మరాటాలు పట్టుకున్నందున, ఈతఁడు, ఔథ్ నవాబు, నజీబు ఉద్దేలా రోహిలా మొదలయినవారు కలిసి ౧౭౬౧ లో ప్రఖ్యాతికెక్కిన పానిపట్ యుద్ధమునందు మరాటావారిని ఓడించిరి. ఈతఁడు, ౧౭౭౨ లో మరణమునొందెను. అప్పటి కతని వయస్సు ౫౦. ఇతని కుమారుఁడై టైమూర్ షాహ రాజయ్యె.

## అహమదుషాహ

(గుజరాత్) ౧. (౧౪౧౦-౧౪౪౩). గుజరాత్ దేశమునకు రెండవ నవాబు. ఇతనితాతయైన ముజఫర్ షాహ బ్రతికియుండ

గనే! ఈతనిని రాజ్యముమీఁద గూర్చుండబెట్టెను. ఈతఁడు అహమ్మదాబాదు పట్టణమును కట్టించెను.

౨. (౧౫౫౪-౧౫౬౧) గుజరాత్ దేశపు నవాబు. ఒక సరదారుని కుమారుఁడు. మూఁడవ మహమ్మూద్‌షాహ చనిపోయిన తరువాత రాజ్యమునకు వారసు లెవ్వరు లేనందున ముఖ్యమంత్రి యీతనిని రాజ్యముమీఁదఁ గూర్చుండఁబెట్టెను. ఈతఁడు చివరకుఁ జంపఁబడెను.

**అహమ్మదుషాహ.** (మౌలవి) ఒకమహమ్మదీయ ఫకీరు. పంజాబులోని షహాజహాన్ పుర ప్రాంతమున ౧౮౫౭ లో నీతనిప్రభ సాగుచుండెను. ఈతనికి దేవతాదులు ప్రత్యక్షమని లోకులు తలంచుచుండిరి. ఏదో అద్భుతమైన కార్యమునం దీతఁడు ఉత్తరదేశమున తిరుగుచుండెను. ఆగ్రాలో పెక్కుదినములుండి అధికారులకు కూడ కలవరము కలిగించెను. ఇంగ్లీషువారికి వ్యతిరేకముగ నీతఁ డెంతయో ప్రయత్నము చేసినట్లు గానవచ్చుచున్నది. ౧౮౫౮ లో పమాన్ అను చోట నీతఁడు చంపఁబడెను.

**అహమ్మదుషాహ** (మొగల్). (౧౭౪౮-౧౭౫౪) ఢిల్లీచక్రవర్తి. మహమ్మదుషాహ కుమారుఁడు. ౧౭౨౫ లో పుట్టెను. ఆఱుసంవత్సరములు రాజ్యముచేసిన తరువాత గాజీ ఉద్దీను అను మంత్రిచే రాజ్యభ్రష్టుఁడును గ్రుడ్డివాఁడును నయ్యె. తరువాత నితఁడు ౨౧ సంవత్సరములు బ్రతికి ౧౭౭౫లో చచ్చె.

**అహమ్మద్‌షా.** (వల్లీ బహమనీ ౧౪౨౨-౧౪౩౫) బహమనీ సుల్తాను. ఇతఁడు అహమ్మదాబాద్, బీదర్ అనుపట్టణములను కట్టించెను.

**అహమ్మద్ అల్లీఖాన్.** కరణాలనవాబు. ఈతఁ డింగ్లీషువారికి ౧౮౫౭ లో మిక్కిలి సాయము చేసినందున నీతఁ డీయవలసిన కప్పమునుండి వారు సంవత్సరమునకు ౫౦౦౦ రూపాయలు తగ్గించిరి.

**అహారుఁడు.** దనుపుత్రుఁ డగు దానవుఁడు.

**అహర్గణము.** అహర్గణము అనగా దినముల సంఖ్య. ఒకానొకదినము మొదలుకొని ఇష్టదినమువఱకును ఎన్ని దినములు గడచెనో యాసంఖ్యను జ్యోతిషశాస్త్రగణిత స్కంధమునందు అహర్గణమందురు. కలియుగము పుట్టిననాఁటినుండి నేఁటిదినమువఱ కెన్ని దినములు జరిగెనో, లేక శాలివాహనశకము ప్రారంభమయిన నాఁటినుండి శా. శ. ౧౭౮౪ వ సంవత్సరము ఆషాఢశుద్ధ సప్తమివఱకు నెన్ని అహోరాత్రములు గడచెనో లేదా ఒకానొక జ్యోతిర్విదుఁడు లెక్కకై తాను గుర్తుపెట్టుకొనిన ఒకానొకదినము మొదలు ఇష్టదినమువఱకు నెన్ని దినంబులు గడచెనో లెక్కవేసి చెప్పినయెడల ఆ వచ్చెడి సంఖ్యను అహర్గణ మందురు.

సౌరమానప్రకార మహర్గణములను గనుఁగొనుట సులభము. క్రీ. శ. ౧౮౬౪ వ సంవత్సరము అక్టోబరు ౨౪-వ తేదీ నుండి ౧౯౧౭-వ సంవత్సరము జూన్ 3-వ తేదీవఱకు ఎన్ని దినములు గడచెనని యడిగిన లెక్కవేయుట సులభము. సంవత్సరమునకు ౩౬౫ దినముల ప్రకారము లెక్కవేసి అధిక (Leap) సంవత్సరములకు ఒక్కొక్కదినము అధికము కల్పినయెడల అహర్గణము తేలును.

చాంద్రమానప్రకార మహర్గణములఁ గనుఁగొనుట ఇంతసులభము కాదు. వచ్చినసంవత్సరములను ౧౨ తో హెచ్చవేసి మొదట సౌరమాసములను కనుఁగొనవలెను. తరువాత నిన్ని సౌరమాసములకు నెన్ని యధికచాంద్రమాసములు వచ్చునో లెక్కవేసి సౌరమాసములలో నా సంఖ్య కలిపినయెడల చాంద్రమాసముల లెక్క తేలును. ౨౨౮ సౌరమాసములతో ౨౩౫ చాంద్రమాసములు సమానము. ఈ లెక్క ననుసరించి అధికమాసముల సంఖ్య కనుఁగొనవచ్చును. చాంద్రమాసములను ౩౦ తో హెచ్చవేయఁగా వచ్చినసంఖ్య తిథు లగును. కాని అందుండి క్షయతిథులను మినహాయింపవలెను. ౬౪ తిథులకు ఒక క్షయతిథివచ్చును. ఇట్లు క్షయతిథులు మినహాయింపఁగా వచ్చిన సంఖ్యయే అహర్గణము. సూ

ర్యసిద్ధాంతాది ప్రాచీన గ్రంథములలో కల్పారంభము నుండి ఇష్టదినమువఱకు అహర్గణము సాధించుమార్గములు చెప్పఁబడినవి. అందువలన ౧౨, ౧౩ అంకెలుగల సంఖ్యలతో లెక్కచేయవలసి యుండును. అట్టి ఇబ్బందిని తప్పించుటకై గ్రహలాఘువాది గ్రంథకర్తలు ౧౧ సంవత్సరములకు అనగా ౪౦౧౬ దినముల కొక చక్రమును కల్పించుకొనిరి. అందుచే వారి యహర్గణ సంఖ్య ౪౦౧౬ కంటె ఎక్కుడు ఎప్పుడును రాదు.

## అహల్య.

౧ పంచ కన్యలలో మొదటిది. బ్రహ్మమానసపుత్రి. గౌతమఋషిపత్ని. బ్రహ్మదేవుఁడీమెను మిక్కిలి చక్కనిస్త్రీగ నిర్మించి ఇంద్రునకీయఁదలఁచెను. గాని గౌతమఋషి తపస్సును జూచి యాతనికిచ్చెను. ఇంద్రుఁడీమెను కామించి గౌతమాశ్రమమునకుఁ బోయి వేకువజాము గాక పూర్వమే కోడి కూసినట్లు కూసెను. అంతఁ దెల్లవారినదని తలంచి గౌతముఁడు స్నానమునకై నదికిఁ బోయెను. ఇంద్రుఁడు గౌతమవేషము వేసికొని అహల్యతో రమించెను. గౌతముఁ డింటికివచ్చి, ఇంద్రుని మోసముఁ దెలిసికొని అతనిని శపించెను. అహల్యను శిలయై పడియుండు మని శపించెను. ఎన్నియో యుగముల తరువాత దాశరథిరాముఁడా మార్గమునఁ బోవుచుండ నాతని పాదస్పర్శచే నీమెకు నిజరూపము వచ్చెను. గౌతముఁడు ఆమెను స్వీకరించెను. [వా. రా. బాల. ౪౮-౪౯ ఉత్తర. ౩౦]

ఇంద్రుని జారత్వసంబంధమైన ఈకథ నిజమైనది కాదనియు, ఇంద్రుఁడనఁగా సూర్యుఁడు, అహల్య యనఁగా రాత్రి, దానిని హరించువాఁడన్న రూపక మీ కథవల్ల సూచితమనియు కుమారిలభట్టుయొక్క యభిప్రాయము. [తంత్రవార్తికము, ౧. ౩. ౭-వ సూత్రముపై. Bombay Sanskrit Series పేజి ౧౩౪.]

౨. ముద్గలునిపుత్రుఁడైన వృధాశ్వునకు మేనకవలన కలిగిన కూఁతురు. దివోదాసుని తోడఁబుట్టువు. వీరు కవలు. ఈమె శరద్వంతునిభార్య. శతానందుఁడీమె కుమారుఁడు. [విష్ణుపు. ౪. ౧౯. ౧౫]

విష్ణుపురాణటీకాకారుఁడైన శ్రీధరస్వామి శరద్వంతుఁడనఁగా గౌతముఁడే యని వ్రాసియున్నాఁడు. అట్లైన ఈ అహల్యయు, ౧వ అహల్యయు ఏకవ్యక్తియే యగు.

౩. ఇంద్రద్యుమ్న రాజుపత్ని. పూర్వపు అహల్య ఇంద్రునితో వ్యభిచరించెనని విని తాను ను ఇంద్రుఁడను నొకపురుషునితో సంబంధము కలుగఁ జేసికొనెను. [యోగవాసిష్ఠము]

## అహల్యాబాయి హోళ్కర్.

(౧౭౬౬-౧౭౯౫) ఇందూరు సంస్థానముపై రాజ్యముచేసిన రాణి. మల్హార్ రావు హోల్కరు కోడలు. ఖండేరావుభార్య. ఈమె మహాసాధ్వి యని పేరొందెను. ఈమె అహమ్మదునగర జిల్లాలోని పాథరటీ యనెడు పల్లెయందుండిన ఆనందరావు సిందే యను మరాటావాని కూఁతురు. ౧౭౩౫ లో జన్మించెను. పేష్వా రఘునాథరావుయొక్క సిఫారసువలన మల్హారరావు హోల్కరు ఈమెను తన కుమారుడైన ఖండేరావుకు పెండ్లిచేసెను. ఈమెభర్తయైన ఖండేరావు తండ్రి బ్రతికియుండగనే ౧౭౫౪ లో యుద్ధమున వీరశయనము నొందెను. అప్పటికి నామెకు మాలీరావు అను కొడుకును మంచాబాయి అను కూఁతురును కలిగిరి. మల్హారరావు అహల్యాబాయి భరణమునకై ౧౫ లక్షల జాగీరు నామెకు సనొంగి ౧౭౬౬ లో కీర్తిశేషుఁడయ్యెను. ఈమె కుమారుడు మాలేరావు ౮ మాసములు మాత్రము రాజ్యమునుచేసి మరణము నొందెను. అంతట రాజ్యభార మంతయు నీమెపైఁ బడెను.

ఈమె ౩౦ సంవత్సరములు రాజ్యము చేసెను. ఈ కాలమందామె శాశ్వతముగ నుండు కీర్తిని సంపాదించెను. తుకోజీరావు అను వానిని తన మంత్రిగా నేర్పఱిచెను. యుద్ధాదికముల మాత్రము ఆయన చూచుచుండెను. రాజ్యములోని మిగిలిన సంగతులన్నియు నీమెయే స్వయముగ చూచుచుండె. ఈమె స్వయముగ రాజసభకుంబోయి వసూలు మొదలైన పనులను జూచి ప్రజల కలహములను తీర్చుచుండెను. ఈమె దానధర్మములచే ఆసేతు హిమాలయము తన కీర్తిని వ్యాపింపజేసెను. ఈమె చిహ్నము లొక్కటియైనను లేని దివ్యక్షేత్రమేదియు హిందూదేశమందు లేదు. కాశీ, అయోధ్యా, ద్వారకా, జగన్నాథము, రామేశ్వరము మొదలైనస్థలములందు క్రొత్త దేవాలయములం గట్టించుట.

జీర్ణదేవాలయముల నుద్ధరించుట, అన్నసత్రముల వేయించుట, దేవతలకు శాశ్వత గంగాభిషేకము జరుగునట్లు నేర్పాటుచేయుట, మొదలైన ధర్మకృత్యము లీమె యనేకములు చేసెను. ఇప్పుడు శ్రీకాశీక్షేత్రమునందున్న విశ్వేశ్వరుని దేవాలయ మీమెచేతనే కట్టింపఁబడెను. ఈమె యన్నసత్రమిప్పటికిని కాశిలో నహల్యాబాయి సత్రమను పేరిట జరుగుచున్నది. పశువులకు, పక్షులకును ఆహారము పెట్టించుచుండెను. ఆమె శాసనము మిక్కిలి యుగ్రముగ నుండె. పేష్వా రఘునాథరావువంటివాఁడు దన మీదికి నెత్తి వచ్చుచున్నాఁడని వినియు నామె చెలింపలేదు. 'నిజముగ నహల్యాబాయి అద్వితీయస్త్రీ' అని మాల్కం అను చరిత్రకారుఁడు చెప్పియుచున్నాఁడు.

**అహల్యాసంక్రందనము** ఇది మూఁడాశ్వాసముల తెలుఁగు ప్రబంధము. దీనిని సముఖ వేంకటకృష్ణప్పనాయకుఁడను శూద్రకులజుఁడు రచించెను. ఈకవి మధురనాయకుఁడగు విజయరంగచొక్కనాథుని(౧౭౦౪-౧౭౩౧)కాలములో నుండెను.

**అహల్యాసంక్రందన విలాసము.** ౫ ఆశ్వాసముల తెలుఁగు ప్రబంధము.దీనిని వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుఁడను శైవుఁడు రచించి వాసిరెడ్డి వెంకటాద్రి నాయని సోదరపుత్రుఁడైన చంద్రమౌళికి అంకిత మిచ్చెను. ఇందలి కవిత్వము ప్రౌఢముగ నున్నను వ్యాకరణదుష్టములైన ప్రయోగము లనేకము లిందుఁ గానవచ్చు చున్నవి.

**అహల్యాహ్రదము.** గౌతమ వనమందలి భారతవర్షీయ తీర్థము.

**అహార్** (ఉదయపురము). రాజపుత్ర సంస్థానములోని ఉదయపుర రాజ్యమునందలి యొక గ్రామము. ఇది ఉదయపుర నగరమునకు తూర్పున ౨ మైళ్లమీఁద అహార్ నదీతీరమున నున్నది. చిత్తూరు వదలిపెట్టిన తరువాత మేవాడ్ రాజ్యాధీశు లిచ్చటనే కాలధర్మము నొందిరి. అందుచే నిచ్చట వారి స్మరణచిహ్నములగు కట్టడము లనేకములు గలవు. అందు రెండవ రాణా అమార్ సింహుని కట్టడ మతిశోభాయమానముగ నున్నది. ఈగ్రామమునకు తూర్పున శిథిలావశిష్టములైన కోటగోడలు, దేవాలయములు, కట్టడములు పూర్వ మచ్చట నొక గొప్పపట్టణ ముండె నని చెప్పక చెప్పుచున్నవి. ప్రస్తుత మాప్రదేశమును ధూళికోట యని పిలుచుచున్నారు. ఇచ్చట ౧౦-వ శతాబ్దమునకుఁ జెందిన ౪ శాసనములును, అనేకములు నాణెములును దొరకినవి. ఇప్పటికిని కొన్ని జైన, హిందూదేవాలయముల శిథిలభాగములు కనఁబడుచున్నవి.

**అహార్.** (బులంద్‌షహార్) సంయుక్త రాష్ట్రమందలి బులంద్‌షహార్ జిల్లాలోని అనూప్‌షహార్ తాలూకాలో నొక గ్రామము. ఇది బులంద్‌షహార్ పట్టణమునకుఁ దూర్పున ౨౧ మైళ్ల మీఁద నున్నది. జనసంఖ్య ౩౬౭౩. జనమేజయుఁ డిచ్చటనే సర్పయాగము చేసెననియు, అందు మూలముననే అహి (సర్పము) హార్ (యాగము), 'అహార్' అని పేరు వచ్చెననియు చెప్పుదురు. ఇంతియగాక హస్తినాపురము వఱదవలనఁ గొట్టుకొనిపోయిన తరువాత నిదియే చంద్రవంశజుల రాజధాని యయ్యెనని కూడ చెప్పుదురు. ఇవిగాక కృష్ణునిభార్యయైన రుక్మిణి జన్మస్థాన మిదియే యని మఱియొకకథ కూడ గలదు. రుక్మిణిని కృష్ణుఁ డెత్తుకొని పోయిన దేవాలయ మిదియే యని ఇప్పటికిని అందలిజనులు చూపుచుందురు. ఈకథలు నిజమైనను గాకున్నను, ఈగ్రామము చాల పురాతన కాలమున ప్రసిద్ధమైన దనుట సత్యము. ఇచ్చట పురాతనములైన రాతిచెక్కడము లనేకములుదొరకినవి. అక్బరుకాలమున నీగ్రామ మొక పరగణాకు రాజధానిగ నుండెను. ఈ గ్రామము గంగానదియొడ్డున నున్నది. ఇం దనేక హిందూదేవాలయములు కలవు.

**అహిక్షత్రనగరము.** భారతవర్షీయ నగరము. దీనిని కర్ణుఁడు జయించెను.

[మహా. వన. అ ౨౫౪

**అహిచ్ఛత్ర.** ద్రుపద రాజు యొక్క పూర్వ రాజధాని. పూర్వ మిది సంయుక్తరాష్ట్రము లందలి బొరల్లీ జిల్లాలోని రామనగర గ్రామసమీప మున నుండెనని తెలియుచున్నది. దీనిని ద్రోణాచార్యుడు ద్రుపదునివద్దనుండి గెల్చెను. [ఆది.౧౩౭.]

**అహిపత్యచూర్ణము.** ఉసిరిక పప్పు వాయువిడంగములు, ఏలకులు, లవంగపట్ట, ఆకుపత్రి, తుంగముస్తలు, త్రికటుకములు కరక్కాయలు, వీని చూర్ణము, దినుసు కొక్కొకభాగము, తెగడచూర్ణము మూడుభాగములు, ఈ మొత్తమునకు సమముగ పంచ దారకలసి యుష్ణోదకముతో సేవించిన విరేచనంబై శూల, అగ్ని మాంద్యము, మూలరోగము, కుష్ఠువు, ప్రమేహము, క్రిములు. గర్భశూల, వాతపిత్తకఫ పాండువులు హృద్రోగము వీనిని హరింపజేయును. [బసవరాజీయము, వంధ్యారోగ. ౧౫ ప్రకరణము.]

**అహిర్బుధ్న్యసంహిత.** పాంచ రాత్రాగమములలో నొకటి. ఇటీవల చెన్నపట్టణమున దివ్యజ్ఞాన సమాజమువారిచే ప్రకటింపబడినది.

**అహిర్బుధ్న్యుడు.** ౧ ఏకాదశ రుద్రులలో నొకడు.

౨. యజ్ఞమున దర్పింపబడు అగ్నివిశేషము.

**అహీర్** ఉత్తర హిందూస్థానమునందుండు ఒక గొల్లజాతి. వీరు బహు కొద్దిమంది మాత్రమేగలరు.

**అహీనుడు.** (చం వం.) ఆయుకు లోత్పన్న క్షత్రవృద్ధుడను రాజుయొక్క వంశములోని వాడు. సహదేవునకు బుత్రుడు. జయసేనునికి దండ్రి.

**అహీనగుడు.** అనీహునకు నామాంతరము.

**అహీనరుడు.** అనీహునకు నామాంతరము.

**అహీనుడు.** ప్రతిక్షత్రవంశ మందలి సహదేవుని పుత్రుడు. ఈతని కుమారుడు జగత్సేనుడు

**అహురమస్ద.** పారశీకుల మహాదేవత. దేవతలకందఱకి రాజు. ఇందలి అహురశబ్దము మన 'అసుర' శబ్దమే.

**అహోబలపండితీయము.** అహోబల పతియను పండితునిచే నాంధ్రశబ్ద చింతామణిపై సంస్కృతమునందు వ్రాయబడిన వ్యాఖ్యానము. సంస్కృతమునకుగు నష్టాధ్యాయికిని మహాభాష్యమునకును ఎట్టి సంబంధము కలదో ఆంధ్రము నందు ఆంధ్రశబ్ద చింతామణికిని అహోబల పండితీయ మునకును అట్టి సంబంధమే కలదు అని యాంధ్రపండితుల యభిప్రాయము. ఈ గ్రంథమునకు గ్రంథకర్తచే బెట్టబడిన పేరు 'కవిశిరోభూషణము.' కాని వ్యవహారము నందు గ్రంథకర్తపేరు ననుసరించి సాధారణముగా దీనిని 'అహోబలపండితీయ' మనియే వ్యవహరింతురు.

ఈ గ్రంథమునకు అహోబలపతి (శేక పండితుడు) కర్తయని గ్రంథమువలన గానవచ్చును. ఈతని వంశము

గ్రంథకర్త — పేరు 'వాతూలాన్వయ' మని యుపోద్ఘాతమునందును, 'ప్రభంజర వంశ' మని పరిచ్ఛేదాంత గద్యమునందును చెప్పబడి యున్నది. ఈ అహోబలుడను పేరును, ఇంటిపేరును ప్రౌఢశక్తి కల్పింపబడినవి యనియు, గ్రంథకర్త మూలనామము నరసయ్యయనియు, ఆతని గృహనామము 'గాలి' వారనియు జెప్పెదరు. 'గాలి నరసయ్య' యన్న పేరు హేలవముగ నుండునని తలంచి అవి ఘనముగ నుండవలయునని యిట్లీతడు సంస్కృత రూపములను ఉపయోగించి యుండునని కొందఱూహించెదరు. ఉపోద్ఘాతోపసంహారములను పరచ్ఛేదాంతగద్యమును పట్టి చూడ పోలూరి మాధవయజ్వ యీతని మేనమామయై నట్టును ఆతని యింటనే పెరిగి యాతడాతనివలన జన్మని పాండిత్యము సంపాదించినట్టును తెలియవచ్చు

చున్నది * నియోగులయిన గాలివారును పోలూరివారును గుంటూరు మండలమునందున్న వారట.1

అహోబల పండితుఁడు మొదట పైదవోలులో నుండగా, గుండ్లకమ్మ వరదవచ్చి కొంపలు పంటలు పాడుకాఁగా, నాతఁడు నర్సారావుపేట జమీందారు లయిన వల్లాజువారిని ఆశ్రయించి అగ్రహారము వడసెనట.2

అహోబల పండితునకు స్వాతిశయము చాల ఉన్నట్టు కానవచ్చుచున్నది. ఈ సందర్భమున ఈ క్రింది శ్లోకములును పద్యములును చూడనగును.

శ్లో॥ కామాసంతు పరశ్శతా స్సుకవయో
గంభీర వాగ్గుంభనా
రంభోజ్జృంభిత వైభవా మదుచితం
వాక్యంతునుధ్వంపరం
విద్వాంసః కఇగోప్యహోబలపతేః
కోవాంధ్ర భాషామణేః
విజ్ఞానే సదృశో విలక్షణమనా
స్సర్వావనీ మండలే. 3

శ్లో॥ యన్మూర్త్యా కవితామూలకంద వాగనుశాసనా।
జాగ్రత్యహోబలపతీ రాజతే సవిలక్షణః॥ 4

[ఉపోద్ఘాతము.

* క. పోషించి మాధవార్యుమ। నీషినఁ నుక్ సంస్కృతాది నిర్మలభాషా। భాషినొనర్చి త్రిలింగజ। భాషాసామ్రాజ్య పట్టభద్రునిఁ జేసెక్ [ఉపసంహారము]

1. వే. ప్రభాకర శాస్త్రిగారి 'చాటుపద్య మంజరి'

2. గుంటూరుమండల, వినుకొండ తాలూకాలో, ఉమ్మడివరమను గ్రామమున 'గాలి' వారు నియోగులున్నారనియు, వారు తాము అహోబలపండితుని వంశజులమని చెప్పుకొందురనియు, వారు తమకు బంధువులనియు శ్రీకనుపర్తి మార్కండేయ శర్మగారు నాకుఁ జెప్పినారు. ఆ గ్రామమునందు నృసింహస్వామి దేవాలయముఁగూడఁ గలదట.

3. లోకములో గంభీరవచన రచనావైభవ ధురీణు లగువారు వందలకుఁబైగా నుందురుగాక. ఓ విద్వాంసులారా! ఓ కవీశ్వరులారా! నాపలుకు వినుఁడు

క. గట్టిగ నభినవ నన్నయ
భట్టాచార్యాభిధాన పటుబిరుదాంకం
బిట్టట్టనక వహించిన
దిట్టను నను బోలఁగల సుధీమణు లేరీ?

[ఉపసంహారము.

ఈతనికి సంస్కృతమునం దధికప్రవేశమును తెనఁగునందుఁ దక్కువ ప్రవేశమును,అప్పకవికిఁ దెనుఁగునందు హెక్కుడు ప్రవేశమును సంస్కృతమునందుఁ దక్కువ ప్రవేశమును ఉన్నట్టును, వీరుభయులును తమ తమ యాధిక్యతనుగుతించి యితరులను ఆక్షేపించుచున్నట్టును, తనకుఁ దెనుఁగునందుఁ గూడఁ బ్రజ్ఞకలదని చూపుటకు అహోబలపతియు, సంస్కృతమునందుఁ గూడఁ బ్రావీణ్యము తనకున్నదని చూపుటకు నప్పకవియుఁ బ్రయత్నించుచున్నట్టు వారి వారి పుస్తకములవలనఁ గానవచ్చుచున్నది.5

అహోబలుని యీ క్రింది పద్యము చూడగా నాతని యాంధ్రజ్ఞానమును ఆక్షేపించు వారికి జవాబుగనున్నది.

ఉ. ఆదిమభామనన్ను ముదమందఁగఁజేసి మదీయ మైత్రి సంపాదనఁజేసి మత్కృపకుఁ బాత్రతదాసి జను లెల్లంగఁగా। రాదె త్రిలింగభాష కథగాఁగమదీయ దయానిరీక్షణా। సాదనదక్షు లందఱు విచారణ సన్ముల లేరు గా కిలన్. [ఉపసం.]

ఈ యాంధ్రభాషాజ్ఞానమునందు అహోబలపతికిఁ దుల్యుఁడై విలక్షణమనస్కుఁడగు వాఁడీయెల్ల భూమండలమునందు నెవఁడు గలఁడు? 4. కవిత్వమునకు మొదటి దుంపయగు వాల్మీకియు నన్నయభట్టు నెవని రూపముచే నొప్పుచున్నారో యట్టి విలక్షణరూపము గల యహోబలపతి శోభించుచున్నాఁడు.

5. అంతయు సంస్కృతమున వ్రాయఁబడిన 'అహోబల పండితీయము' నందుఁ జివర ౧౮ తెలుఁగు పద్యములు వ్రాయుట తనకుఁ దెనుఁగు కవిత్వము గూడఁ జేత నగునని చెప్పుటకుఁ గాక మఱియెందుకు? అట్లే అంతయుఁ దెనుఁగున వ్రాయఁబడిన అప్పకవీయమందలి ౫వ ఆశ్వాసాంతమున "అథేదానీం కాకునా ర్యప్పకవివర్యః పంచాశదవధ్రి పద్యగర్భితాష్ట సమాసాక్ ప్రహరణ కలికవృత్తేన సంగృహ్ణాతి" అని చెప్పి సంస్కృతమున పెద్దటీక యొకటి అప్పకవి వ్రాసెను. తెనుఁగు గ్రంథమందు నీ సంస్కృతాడంబర మెందుకు?

ఆంధ్రశబ్ద చింతామణి బాలసరస్వతికి కీలకనామ సంవత్సరమున దొరికెనని అప్పకవియు అహోబలపతియు వ్రాసియున్నారు. అప్పకవి 'మొన్నటి కీలక' సంవత్సరమున దొరికె

**గ్రంథరచనాకాలము**

ననియు స్పష్టముగాఁ జెప్పినాఁడు. అందుచే బాలసరస్వతికి గ్రంథము దొరికిన కీలకసంవత్సరము తరువాత మరల కీలకసంవత్సరము వచ్చులోపల అప్పకవీయమును, అహోబలపండితీయమును వ్రాయఁబడెననుట స్పష్టము. అట్లుగాక మఱియొక కీలకసంవత్సరము దాటినతరువాత ఈ గ్రంథములు వ్రాయఁబడెనని తలంచితిమేని కీలకసంవత్సరము పేరు జెప్పుట వ్యర్థమగును. బాల సరస్వతికి గ్రంథము దొఁకిన కీలకసంవత్సరము క్రీ. శ. ౧౬౦౮ యని మనము అప్పకవీయముయొక్క కాలమునుబట్టి నిర్ణయింపవచ్చును. మరల కీలకసంవత్సరము ౧౬౬౮ లో వచ్చును. కావున అహోబల పండితీయమునకు చివర మితి ౧౬౬౮. అహోబలపతి తన గ్రంథమునందు అప్పకవిని పేర్కొనుటయు, అప్పకవీయమునందలి పద్యముల నుదాహరించుటయుఁజూడ, అప్పకవీయము తరువాత కవిశిరోభూషణము వ్రాయఁబడిన దనుట స్పష్టము. అప్పకవీయము ౧౬౫౬ లో వ్రాయుటకు ప్రారంభింపఁబడినది ఆ గ్రంథము పూర్తియగుటకును దేశమునందు వ్యాపించుటకును రెండు సం॥లు పట్టిన వనుకొన్న యెడల క్రీ. శ. ౧౬౫౮ మొదలు ౧౬౬౮ వ సంవత్సర కాలములోపల అహోబల పండితీయము వ్రాయఁబడియెనని మనము నిశ్చయింపవచ్చును. అప్పకవియు అహోబలపతియు సమకాలీనులనియు సమీప గ్రామములందుండు వారనియు పరస్పరేర్ష్యా ప్రేరితులనియు పూర్వమునుండి వదంతికలదు. అదియు ఈ కాలనిర్ణయమునకు సహకారియే.

అహోబలుఁడు బాల సరస్వతియొక్క యాంధ్రశబ్దచింతామణి ప్రతినే ఉపయోగించెను. బాలసరస్వతి తనచేతితో స్వయముగ వ్రాసిన ఆంధ్రశబ్ద చింతామణియొక్క ప్రతి అహోబలుఁడు సంపాదించినట్లు కానవచ్చుచున్నది. * బాలసరస్వతీ ప్రతికంటె అప్పకవి ప్రతిలో ఆఱుశ్లోకములు తక్కువగను కొన్నిశ్లోకములు ఎక్కువగను పెక్కు పాఠాంతరములును ఉండెను. అహోబలపతి ఈవ్యాఖ్యానమును వ్రాయుటకు పూర్వము ఆంధ్రశబ్దచింతామణికి తెనుఁగునందు బాలసరస్వతీ రచితమగు ప్రతిపదార్థ టీకయు అప్పకవి ప్రణీతమగు అప్పకవీయంబును మాత్రముండెను. ఈ రెండును తెలుఁగులో వ్రాయఁబడినవి. బాలసరస్వతి టీక మిక్కిలి స్వల్ప మనియు అప్పకవీయము మూలసూత్రములకు ఇమడనట్టిదియు నగుటచే దాను ఈవ్యాఖ్యానమును వ్రాయుచున్నానని ఈతఁడు చెప్పుకొనెను.

ఈ వ్యాఖ్యానమునందు అప్పకవికి దొరకనివియు తనకు దొరికినవియు నని చెప్పి 'అథర్వణ కారికలు' అని పెక్కుశ్లోకములను ఉదాహరించి యున్నాఁడు. పతంజలి మహాభాష్యములోఁ గొన్ని వ్యాకరణ సంబంధమైన శ్లోకము లీయఁబడినవి. వానికి సమానముగ నిక్కడ నథర్వణ కారిక లను శ్లోకములు అహోబలునిచేఁ జేర్చఁబడినవి. అథర్వణ గ్రంథములోని సార మంతయు నిందే చెప్పితిని గాన దానిని వేఱుగఁ జూడనక్కరలేదని గూడఁ జెప్పెను. అథర్వణ కారికలని వేఱుగ్రంథము లేదు. అహోబలపండితీయమందలి శ్లోకములను సంగ్రహించి దానికి అథర్వణకారికలని పేరు పెట్టఁబడినది. ఈ కారిక లన్నియు నిజముగ నథర్వణుఁడే చేసెనో లేక స్వపక్షమండనార్థమై యహోబలుఁడే నిర్మించెనో సందేహముగ నున్నది. ఇందుల గుఱించి "అథర్వణాచార్యుఁడు" అను శబ్దముక్రిందఁ గొంత చర్చించినారము. చూడనగు.

**గ్రంథవర్ణనము**

దీనికి మొదట ఉపోద్ఘాతముగ ౮౮ శ్లోకములు గలవు. *చివర ౫ సంస్కృతశ్లోకములును, ౧౪ తెనుగు పద్యములును ఉన్నవి. మిగిలిన గ్రంథమంతయు సంస్కృత గద్యము.

అహోబలపండితీయము గ్రంథకర్తయొక్క సంస్కృతాంధ్ర పాండిత్యముం దెలుపు వ్యాకరణ సంబంధమైన యుద్గ్రంథమనియే చెప్పవలసియున్నది. లక్షణము సంస్కృతమునందును లక్ష్యములు తెనుంగునందును చెప్పఁబడుటచే నిది చదువుటకు నొక వింత గ్రంథముగ నుండును. కాని సంస్కృతమునందు వ్రాయఁబడిన ప్రాకృత వ్యాకరణములంజూచిన వారికి

---

* మంజువాణి వారిచేఁ బ్రకటింపఁబడిన అహోబల పండితీయమునందు ౨౬ శ్లోకములు మాత్రమున్నవి. కాని చెన్నపురి, మ్యానుస్క్రిప్టు లైబ్రరీలోనున్న ౨ ప్రతులలో ౮౮ శ్లోకములు కలవు.

* "క్వచిత్ పుస్తకే సరస్వతీ కవికర లిఖిత ఏవ శబ్దానుశాసన ప్రణీతత్వేన కద్యంస్థితం." అహోబల పండితీయము మంజువాణి ప్రతి ౧౯౯ పుట.

నిది యంత విపరీతముగ నుండదు. పాతంజల మహాభాష్య ఫక్కిక ననుసరింప వలయునని గ్రంథకర్త ఎక్కువగ ప్రయత్నించెను. పతంజలి ఉపోద్ఘాతమునందు సంస్కృత వ్యాకరణాధ్యయనముయొక్కయావశ్యకతను గుఱించి పస్పశాహ్నికమందు హేతుపూర్వకముగఁ జర్చించినట్లితఁడును ఆంధ్ర వ్యాకరణముయొక్క ఆవశ్యకతను గుఱించి యుక్తిపూర్వకముగ నాంధ్రభాషాభిమాన ప్రేరితుఁడై చర్చించెను. సంస్కృత భాషయందు మాత్రమే కావ్యములు చెప్పవలెను, తదితర భాషలన్నియు నపభ్రంశములు, వాని నుచ్చరించుట పాపము, దేశభాషలలోని పురాణములు విన్నందున పాపక్షయములేదు, ఆంధ్రవ్యాకరణము ఋషిప్రోక్తము కానందునఁ బ్రమాణముగాదు, అనిన పూర్వపక్షములను ఖండించి ఏ దేశమువారికి నాదేశము భాష సంస్కృతమువలెఁ బవిత్రమే యనియు, దేశభాషాపదముల నభ్యసింపనిది నిత్యవ్యవహారమునకు భంగము గలుగుననియు, సంస్కృతము తప్ప అపశబ్దములు మాట్లాడఁగూడదని మహాభాష్యాదికములందుఁ జెప్పఁబడినది యజ్ఞకాలమునకే చెల్లునుగాని ఇతర కాలమునకును వ్యవహారమునకును చెల్లదనియు, స్త్రీశూద్రులకు వేదాధికారము లేకపోయినను జ్ఞానాధికారము తన్మూలమున మోక్షాధికారమును కలదనియు, కావున సంస్కృతజ్ఞానము చాలనివారందఱును పురాణములను వేదాంతాదివిషయములను ఆంధ్రభాషామూలముననే తెలిసికొనవలయుననియు, [1]"నా ఋషిః కురుతే కావ్యం" అనగా ఋషి కానివాఁడు కావ్యముచేయఁడు అని యున్నది గావున నన్నయను ఋషిగ నెంచవలయుననియు నాతని వ్యాకరణము ప్రమాణమే యనియు వ్రాసియున్నాఁడు.

పాణిని సూత్రములలోని యర్థమును కాత్యాయనుఁడు తన వార్తికములచే ఉదాహరణము. నెట్లు సవరించెనో అట్లే అథర్వణుఁడు తన కారికలచే నన్నయభట్టీయమును సవరించె ననియు, నా కారికల నెఱుంగమిచే నప్పకవి పొరపాటు చేసెననియుఁ జూపుటయె అహోబలుని ముఖ్యోద్దేశముగాఁ గనఁబడుచున్నది. అహోబల పండితీయము యొక్క శైలియు, వ్యాఖ్యాన పద్ధతియు, అప్పకవిమీఁదఁ దెబ్బలు తీయుటయుఁ దెలియుటకై అందుండి యొక చిన్న భాగ మిందిచ్చుచున్నాను.

## సంధి పరిచ్ఛేదము.

సూత్రం. నిత్య మనుత్తమ పురుష క్రియాస్వితః.

వ్యాఖ్యానం. నిత్యగ్రహణం వానువృత్తిని వృత్త్యర్థం. ఉత్తమ పురుష వ్యతిరిక్త క్రియాగ తేస్యేకారస్య అచాసహ నిత్యం సంధిస్యాత్." రాముని వినుతించి రమ రులు; చేసితి వచ్చుటివూజ; కంటి వతని రూపము" ఇత్యాద్యుదాహరణం. ఉత్తమ పురుషేతు ప్రాయస్తు స్యాత్కిమాది కస్యేతః ఇతి వక్ష్యమాణ సూత్రేణ ప్రాయస్సంధిః. "చేసితి నమ్యతార్చనము, చేసి తచ్యుతార్చనము" ఇత్యాది. వికృతినివేక కారస్తు "ప్రథమే చోత్తమేచైవ క్రియేతో వా భవేద్యుతిః । నిత్యో మన్య స్వరిక్తాతో క్త్వార్థే నోన భవేత్సదా॥" ఇతి ప్రథమపురుషేపి సంధేర్వికల్పమాహ. అత ఏవ "బలభిద్వాహి పరేత రాజవరుణుల్ పర్యుత్సుకత్వంబు సంధిలఁ గూర్చుండిరి యొండొరుల గదిసి" "సిద్ధిం గాంచిరి యవిముక్త సీమయందు" ఇత్యాదయః శ్రీనాథాది ప్రయోగాస్సంగచ్ఛంతే. కాకునూర్యప్పకవిస్తు ఏ తద్గ్రంథసంపాదనై దుర్యేణ శ్రీనాథస్య భ్రాంతత్వ మాహ.

## అర్థము.

సూ. మధ్యమ ప్రథమ పురుష క్రియల 'ఇ' కారమునకు నచ్చు పరంబగునపుడు సంధి నిత్యము.

వ్యాఖ్యానము. ఇచ్చట "నిత్యం" అనుట పూర్వ సూత్రమందలి "వా" (వైకల్పికము) అను పద

---

1. తస్మాచ్ఛూద్రస్య బ్రహ్మవిద్యయా మధికారోఽస్త్యేవేతి సంస్కృతపురాణ పఠనాక్షమాణాం తత్ శ్రవణేప్యలాలసానాం ముముక్షూణాం శూద్రాదీనాం ప్రాధాన్యేన జ్ఞానోపయోగిన్యాంధ్రపురాణాని భవంత్యేవేతి తదీయ శబ్దానుశాసనపరం వ్యాకరణ మపి సప్రయోజన మేవ. పుట ౧౦౦-౧౦౧.

మిచ్చుట ననువర్తింప దని చెప్పుటకు. ఉత్తమపురుష క్రియ తప్ప యితర పురుషముల క్రియలకు సంబంధించిన 'ఇ' కారమునకు నిత్య మచ్చులతో సంధి కలుగును. "రాముని వినుతించి రమరులు" మొదలయినవి యుదాహరణములు. చెప్పఁబోవు సూత్రమువలన ఉత్తమ పురుషమునకు సంధి తరుచుగ నగు."చేసితి నచ్యుతార్చనము" "చేసి తచ్యుతార్చనము" మొదలగునవి యిందు కు నుదాహరణములు. వికృతివివేక కారుఁడైతే "ప్రథమోత్తమపురుషక్రియల "ఇ" కారమునకు సంధి వైకల్పికము. మధ్య పురుషక్రియల 'ఇ' కారమునకు నిత్యము. క్త్వార్థ 'ఇ' కారమునకు సంధి యెన్నఁడు లేదు" అని చెప్పెను. ఇట్లు ప్రథమమునకుఁ గూడ సంధి వికల్పమనెను. కావుననే "బలభిద్వహ్ని" ఇత్యాది శ్రీనాథాదుల ప్రయోగములు సాధువులే యగును. ఈ గ్రంథమును సంపాదింపలేక అప్పకవి శ్రీనాథుఁడు పొరఁబడెనని చెప్పెను.

**అహోబలము.** కర్నూలు జిల్లా, శిర్వేల్ తాలూకాలోని యొక గొప్ప వైష్ణవక్షేత్రము. ఇది నల్లమలపర్వతమునం దున్నది. ఇచ్చట చిన్న పల్లెయుం గలదు. జనసంఖ్య ౧౪౧౧. ఇది నరసింహక్షేత్రము. ఇందు దిగువ అహోబలము ఎగువ అహోబలము అని రెండు పల్లెలు కలవు. దిగువ అహోబలము కొండక్రింద నున్నది. ఎగువ అహోబలము దిగువ దానికి నాలుగుమైళ్ల దూరమున ఎత్తుమీద నున్నది. అంతకంటె నెత్తుగా నున్న పర్వతశిఖరముమీద మఱియొక నరసింహ దేవాలయము గలదు. ఈకొండమీద నే యింకను ఆఱు నరసింహ దేవాలయములు కలవు. వీనినన్నిటిని కలిపి నవనరసింహము లని యెదరు. దిగువ అహోబల దేవాలయమునందు రాతిగోడలమీదను, మండపములమీదను మంచి చెక్కడపుఁ బని గలదు. ఈదేవాలయము మొదట ఓరుగంటిద్వితీయ ప్రతాపరుద్రునిచేఁ గట్టింపబడియె నని యందురు. కొండవీటిరెడ్లు ఇచ్చట ౧౪ వ శతాబ్దమున చక్కని కళ్యాణ మండపమును గట్టించిరి. ఇందు ౬౪ స్తంభములు గలవు. అందొక్కొక్కటి ౭ అడుగుల పరిధి కలిగియున్నది. ఇందలి పనితనమును ఫర్గూసన్ కొనియాడి యున్నాఁడు.* ఈదేవాలయపు గోడలమీద రామాయణమందలి కథలు తెలుపు బొమ్మలు చెక్కఁబడినవి.

అహోబల మనియు, అహోబిల మనియు రెండు రూపములు గలవు. అహో అనునది ఆశ్చర్య సూచకమైన అవ్యయము. బలము అనగా నృసింహస్వామి బలము అని యర్థము. బిలము అనగా ఆ కొండలోని ఏ బిలములో స్వామి యుండునో యది యని యర్థము. క్రీ. శ. ౧౫౭౮ సుమారున గోల్కొండ నవాబైన ఇబ్రాహీము కుతుబ్ షాయును, అనంతపురము నాయకులైన హండేవారును కలిసి ఈ దేవాలయమును దోచుకొని ౧౮ సంవత్సరములు తమ స్వాధీనమం దుంచుకొనిరి. హండేవారు వీరశైవులవలె కానవచ్చుచున్నారు. తరువాత పెనుగొండలో నున్న రెండవ రంగరాజు తన సేన నంపి హండేవారి నోడించి ఈ దేవాలయమును ౧౫౮౪ లో శఠగోప జీయంగారి స్వాధీనము చేసెను.[2] ఇచ్చటఁ బెక్కు శిలాశాసనములు కలవు. వానిని బట్టి చూడగా నీ దేవాలయములకు రెడ్డిరాజులును, విజయనగరము రాజులును పెక్కు దానము లిచ్చినట్లు కానవచ్చుచున్నది. చెంగల్పట్టుజిల్లా తిరువళ్లూరులోనున్న వైష్ణవ జీయంగార్లు దీనికి ధర్మకర్తలు.

**అహోవీర్యుఁడు.** ఒకఋషి.

**'అహ్రిమన్'** పారశీకుల అవస్థ మతప్రకారము వారి దైత్యులకందఱికిని రాజు. ఇతనిని మన వృత్రాసురునితోఁ బోల్పవచ్చును. వారి దేవేంద్రుఁడైన అహురమజ్దుఁడు వీనిని చంపును.

*Whoever might have buit, it is a fine bold specimen of architecture, and if the history of the art in the south of India is ever seriously taken up, it will worthily take a place in the series as one of the best specimens of its age, wanting the delicacy and elegance of the earlier examples, but full of character and merit. ["Hindu European Architecture.]

2. Epigraphical Report, Southern Circle, 1914-15 p 95. Karnool Manual p 28.

